# కావ్యాలంకారసంగ్రహము

( నర[illegible]పాలీయము )








వివరణకర్త:

శిరోమణి-సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

ఆం.రా.అం.సా. పరిషత్ప్రచురణము ౨.　　పండితసాహిత్యశాఖాప్రచురణము ౧.

# కావ్యాలంకారసంగ్రహము

## (నరసభూపాలీయము)





గ్రంథకర్త :

**రామరాజభూషణుఁడు**



వివరణకర్త :

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

# తొలిపలుకు

వైయాకరణాలంకారికశిరోమణి యగు శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిలవారు సుప్రసిద్ధ కవిశిరోమణియుఁ బండితాలంకారమునని యాంధ్రభాషాలోకమున నెల్ల నెల్లడియయిన విషయమే గాని వేఱుగాదు. అనేక కవిపుంగవులచే నాస్వాదింపఁబడి, వారి శిరఃకంపమునకు హేతువయిన వీరి కవితాస్రవంతి వివిధ ఘట్టములలో వివిధసదస్సులలో వినుతి కెక్కినది. ఆంధ్రభాషాపండితుల కసులభమును, సంస్కృత వైయాకరణులచేతను సాధ్యమని తలంపఁబడనిదియునునగు కౌముదీస్థ సంస్కృతభాషాపద్ధతినంతను, తత్సమచంద్రికారూపమున వెలయించి యాంధ్రభాషకుఁ గొప్ప కొఱంతను దీర్చి యాంధ్రదేశమున శ్రీ శాస్త్రిలవారు శాశ్వతమగు కీర్తిని గడించిరి. ఇట్టి వీరినిఁ గవిపండిత శిరోమణిగానే దేశ మెఱుంగును గాని, యాలంకారికరత్నమని యెఱుంగదు. నేటి శ్రీ శాస్త్రిలవారి యుద్యమమున నయ్యదియు సిద్ధమయ్యెను.

శ్రీ శాస్త్రిలవారు తమ యసాధారణ పరిశ్రమకును, అపూర్వ వివరణశక్తికిని విహారరంగముగా గ్రహించిన యాధారము కావ్యాలంకార సంగ్రహము. ఇది యాంధ్రలోకమునఁ బ్రబంధ శిరోమణి యగు వసుచరిత్రము రచించి కీర్తిఁ గాంచిన రామరాజభూషణునితో నభిన్నుఁడనఁబడిన బట్టుమూర్తిచే వ్రాయఁబడి పఠన పాఠనముల నపార ప్రచారము నందినది. వివరణకర్త యగు శ్రీ శాస్త్రిలవారు సుప్రసిద్ధులగు పండితకవులని ముందే తెలిపితిని. ఇట్టి వీరి వివరణమునకు నా తొలిపలుకు గాని పరిచయవాక్యము గాని యెట్టిదనఁగా స్వతఃప్రకాశకునకు దివ్వెవంటిది. అయినను మిత్రకార్యమని యెంచి, నేను వ్రాయఁబోవునది యెల్లరకు గతార్థమే యైనను సార్థకము కాక తప్పదని భావించి, యీకార్యమున కంగీకరించితిని.

ప్రకృత విషయమయిన శ్రీ శాస్త్రిలవారి వివరణమునకును, దన్మూలమయిన కావ్యాలంకార సంగ్రహమునకును దెనుఁగున నెట్టి ప్రసక్తిగలదో ముందు వివరించి, యా పనిని వాని సంబంధమును, సార్థకతను గూర్చి విశదపఱచెదను. తెనుఁగునఁ బదునొకండవ శతాబ్దమువఱకును, నుత్తమగ్రంథ రచనయే లేదు. అంతకుఁ బూర్వ మొక వేయేండ్లు, ఆర్య నాగరకతాప్రవాహము సంస్కృత విజ్ఞానామృతరూపమునఁ దెనుఁగునాటఁ బ్రవహించి, తెనుఁగు నేలలో నింకి యాంధ్ర సారస్వతరూపమున నన్నయనోట వెలువడినది. భారతము తెనుంగునఁ రచింపఁబడిననాఁటినుండియుఁ గవులకు విమర్శకులకు, శాస్త్రజ్ఞులకు సంస్కృతభాషా ఖనినిఁ ద్రవ్వి రత్నములను దెచ్చి తెనుఁగువారి కర్పించుటయే కార్యమయినది. అట్టి రత్నజాతులలో నొక జాతిని వెదకి తెచ్చుటలోఁ బరిశ్రమచేసి పేరెన్నికఁగన్నవాఁడు బట్టుమూర్తి. సంస్కృతము నందలి యలంకారశాస్త్రము విశేష విమర్శయు, అపార విచారణయుఁ గలది. అం దనేక ప్రతిభావంతులనంతమయిన తమ శక్తి నుపయోగించి మార్గముల నేర్పఱచిరి. అందు ముఖ్యముగాఁ బ్రతాపరుద్రీయకారుఁడయిన విద్యానాథునిఁ జాలవఱకును బట్టుమూర్తి యనుసరించినట్లు స్పష్టము. భామహ, దండి, వామనాదుల స్వతంత్ర ప్రయత్నములచేఁ గ్రమక్రమ వికాసమును బొందిన యలంకార విమర్శ వృక్షమును స్వప్రతిభా దోహదముచే ఫలింపఁజేసినవాఁడు ఆనందవర్ధనుఁడు. అభినవగుప్తుని 'లోచన' సాహాయ్యంబున సహృదయుల యాలోచనకు సుగమంబయిన యా మార్గమునసే రసగంగాధరకారుఁడయిన పండితరాయలు తన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములచే నిరంతరాయముగ విపశ్చిద్వర్యు లాశ్చర్యంబుగనునట్లనల్పకల్పనలఁ జూపించి మెప్పువడసెను. ఈ ప్రయత్నములనుఁ దెనుఁగునఁ దేటపఱచు పరిశ్రమమే యల్పముగా నున్నది.

ఇది యిట్లుండ, సుమారొక శతాబ్దమునుండి, యఖిలభారతావనిని బాశ్చాత్య విజ్ఞాన ప్రవాహము వెల్లివిరిసి ప్రవహించుచున్నది. గంగా యమునా ప్రవాహములవలె నేఁ డేకీభూతములయిన సంస్కృతాంగ్లవిజ్ఞానముల కలయికవలన బయలుదేరిన, పి. వి. కాణె, ఎస్. కె. డే. మొదలయిన సంస్కృతాలంకారిక సిద్ధాంత విమర్శనాధుర్యుల గ్రంథరాజములును దద్జ్ఞులకుఁ బరిచితము లయియున్నవి. ఇందలి విశేషములను దెలుఁగునకు సూచముట్టుగాఁ దెచ్చినవారు లేరు.

ఇట్టి సందర్భమున శ్రీ శాస్త్రిలవారు పయి రెండు విజ్ఞాన ప్రవాహములను దమలో నేకీభవింపఁజేసికొని, జహ్నుమహర్షివలె నీ వివరణ గంగాప్రవాహమును వెడలించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులయిరి. ఇది యాలంకారిక విజ్ఞాన పిపాసువుల కమృతము. విమర్శ మార్గపరామర్శులకు జీవనము. పాఠకపాంథులకు నిరాఘాటమయిన సిద్ధాంతయాన శృంగాటకము. ఇట్టి సర్వాంకషమయిన గ్రంథ మాంధ్రమున నింతకుమున్ను వెలువడియుండలేదు.

మూలగ్రంథము పద్యబంధమగుటఁ గొన్ని కొఱఁతలకు హేతువైనది. అవసరములేని పదములు, గణ యతి ప్రాసాది నిర్బంధమున రాక తప్పదు. అది శాస్త్రగ్రంథములకు నిగళమే గాని యలంకారము గాదు. ఆపయిని లక్షణములు అతివ్యాప్తి, యవ్యాప్తి మొదలగుదోషముల కాకరము లగుటకు హేతు వొకటి కలదు. తనకుముందున్న యాలంకారికుల సిద్ధాంతములన్నియును, తరువాతివారి విచారణలును దత్కర్తకు గతార్థము కాకుండుటయే యయ్యది. తన తరువాతివారి రచనలను దాను చూచుట యసంభవము. తన పూర్వుల రచనలు తాను బరిశీలించుట సాధ్యమేయయ్యును, నాఁటికిఁ బఠన పాఠనాదిక [illegible] రాహి

త్యమున, నతనివలన జరిగినట్లుతోఁపదు. మొత్తముమీఁద గ్రంథము నందుమాత్ర మీ రెండును సంభవములు కాలేవని స్పష్టపడక తప్పదు. అట్టి లోపములను బూరించుటకు శ్రీ శాస్త్రిలవారి రచన యుపకరించునని నా విశ్వాసము. అనేక స్థలములయందు మూలము లోని దోషమును శ్రీ శాస్త్రిలవారు నిరూపించియున్నారు. అంత మాత్రమున మూలమున వివరణకారునకు నిరాదరణ మని పాఠకులు తలంపరాదు. ఆ గ్రంథమునకు వివరణము వ్రాయఁబూనుటయే యిందలి శాస్త్రిలవారి యాదరణమును నిరూపించుచున్నది.

రసవిచారమునను, శబ్దశక్తివిషయమునను, ధ్వనిస్థాపనము నను, నాయకస్వరూప నిరూపణమునను, నొకటేల ? యెల్ల ప్రకర ణములను శాస్త్రిగారి వివరణము సర్వవిషయ సంభరితము, సంపూ ర్ణము. ఇట్టి వివరణమును వ్రాసి ప్రచురించినందుల కాంధ్రలోకము శ్రీ శాస్త్రిలవారిపట్ల నెంతయు ఋణపడినదనుట విశేషోక్తి కాదు.

ఇట్లు,

గుంటూరు, 6-10-45 } విద్వాన్ గంటి జోగిసోమయాజి, ఎమ్.ఏ., ఎల్.టి.,
సంస్కృతాంధ్రభాషాధ్యాపకుఁడు (రీడరు)
ఆంధ్ర విశ్వకళాపరిషత్ కళాశాల.

# మలిపలుకు

శ్లో॥ వ్యాసతు స తు గౌతమతు వ్యాళేంద్ర తు యస్యనాస్తి సాహిత్యం
తం ప్రతి సంప్రతి కం ప్రతి శిరో మమ తు తిరశ్చన పురశ్చన.

(జగన్నాథుఁడు)

ఈ గ్రంథమునకు గ్రంథకర్త సేసిన నామకరణము 'కావ్యాలంకారసంగ్రహము' అని. నరసభూపాలున కంకితమగుటచే నరసభూపాలీయమనియు లోకవ్యవహారము.

కావ్యమునందలి నాయికానాయకాదులు, రసభావాదులు, అలంకారాదులు, మొదలగు విషయములను జర్చించుశాస్త్రమునకు 'అలంకారశాస్త్రము'అని సామాన్యవ్యవహారము. "శబ్దార్థయోర్యథావత్సహభావేన విద్యా సాహిత్యవిద్యా"అని రాజశేఖరుఁడు. పెక్కండ్రు పండితులు తమ గ్రంథమును 'సాహిత్యపదాంకితముగానే వ్యవహరించిరి. (సాహిత్యదర్పణము, సాహిత్యరత్నాకరము, సాహిత్యచింతామణి, సాహిత్యసారము మొ.) కొందఱలంకార శబ్దమునే యుపయోగించిరి. (భామహాలంకారము, రుద్రటాలంకారము, వాగ్భటాలంకారము మొ.) మఱికొందఱు 'కావ్య' శబ్దమునే వాడిరి. (కావ్యప్రకాశము, కావ్యాదర్శము, కావ్యమీమాంస, కావ్యానుశాసనము, కావ్యాలోకము మొ.)

భాషకు ముఖ్యాంగములు రెండు. ముఖ్యాంగములనుటకన్న ముఖ్యప్రాణములనుటయే లెస్స. ఒకటి బహిఃప్రాణము; రెండవది యంతఃప్రాణము. అవి యేవన ౧. వ్యాకరణము, ౨. సాహిత్యశాస్త్రము. మొదటిది శబ్దశుద్ధిని, రెండవది శబ్దార్థరామణీయకమును బోధించును. మన కిచ్చట రెండవదగు సాహిత్యశాస్త్రమును గుఱించియే ప్రసంగము.

సంస్కృతమున నీ సాహిత్యశాస్త్రమునను ముద్రితాముద్రిత గ్రంథముల సంఖ్య ౧౭౨, అని 'కాణే' పండితుఁడు తన History of Sanskrit Poetics అను గ్రంథమునఁ దెలిపెను. ఇన్ని గ్రంథములు ప్రపంచములో నేభాషయందును సాహిత్యశాస్త్రమునఁ గానరావనుట సత్యదూరముగాదు.

మిగిలిన శాస్త్రములవలెనే సంస్కృతమున నీసాహిత్యశాస్త్రము గూడఁ దర్కయుక్తిపరిష్కృతమై తదుపబృంహితమై యున్నది. యదార్థమునకు హేతుబద్ధముగాని సిద్ధాంత మేదియు సికతాకూపము వలె నిలుపదుగదా! కావునఁ బూర్వాచార్యులు తమ సిద్ధాంతస్థాపనమునకుఁ దర్కశాస్త్రసాహాయ్య మపేక్షించిరి. కావుననే మన భారతీయశాస్త్రము లన్నియుఁ దర్కన్యాయములను నినుపపునాదుల మీఁద నిర్మింపఁబడిన వజ్రపుకోటలు. ప్రత్యల్పవిషయముగూడ హేతువాదబద్ధమై సామాన్యబుద్ధులకు గహనమై దుర్భేదమైయుండును. దేనికేని లక్షణము సెప్పవలెనన్నచో నవ్యాప్తి, అతివ్యాప్తి, అసంభవాదిదోషరహితముగా నుండవలెను. అట్టినిర్వచనము తార్కికునకే సాధ్యమగును. తర్కవాసన గిట్టనివారికిని, నది లేనివారికిని నీశాస్త్రము తలదిమ్ము గలిగించును. కావుననే డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారీ యలంకారశాస్త్రపఠనమువలనఁ 'జమురునష్టియే కాని కవితకుఁ బుష్టిలే'దని కవిత్వతత్త్వవిచారమునఁ బరిహాసించిరి. ఏదానినైన నామూలాగ్రముగా నభ్యసింపక యుపహసించుట హాస్యాస్పదముగాదా! అలంకారశాస్త్రమును నవహసింపఁగల పాండిత్యము వారికున్నదేమో! నాకుఁ దెలియదు.

ఈ సాహిత్యశాస్త్రమునకుఁ బ్రమేయమేమి? ప్రమేయమనఁ జర్చనీయమగువిషయము. [The subject which is to be discussed] విద్యానాథుఁడు స్థూలముగా నీక్రిందముగా దెలిపియున్నాఁడు,

శ్లో. రసప్రధానా శ్శబ్దార్థాః గుణాలంకారవృత్తయః
రీతయశ్చేయతీ శాస్త్రప్రమేయం కావ్యపద్ధతిః.

రామరాజభూషణుఁ డీ శ్లోకము నీ క్రిందివిధమున ననువదించి యున్నాఁడు.

గీ. అసదృశ రసప్రధాన శబ్దార్థములును,
రీతులును, వృత్తులును, నలంకృతులు, గుణము,
లాదియగు లక్షణంబుల నలరుఁ గావ్య
సరణి యందు రలంకారసారవిదులు.

(కావ్యాలంకార సంగ్రహము-ప్ర. ఆ. ౨౦ పద్యము.)

రసము, శబ్దార్థములు, రీతులు, వృత్తులు, అలంకారములు, గుణములు, అనునవి యీ సాహిత్యశాస్త్ర ప్రమేయము, అనఁగా నీ శాస్త్రమునఁ జర్చనీయములగు విషయము లివ్వి.

సూక్ష్మముగా విచారింప నిందలి యొక్కొక్క విషయము గూడ సముద్రమువలె నగాధమైనది. ఎట్లన, రసమన నేమి? తదాశ్రయ మేమి? సామాజికులు దాని నెట్లాస్వాదింతురు? కావ్యమున నది యెట్లు వ్యక్తమగును? రసము లెన్ని? అవి యెట్లు పుట్టుచుండును? శాంతము రసమా? భక్తి రసమా? భావమా? రస భావములకు భేదమేమి? వత్సలరస మనునది కలదు; శృంగార మొక్కటే రసము; శాంతమే రసము; కరుణమే రసము; రసాలంబనములగు నాయికా నాయక భేదప్రభేదములు!

శబ్దము లెన్నివిధములు? వాని శక్తులగు అభిధా, లక్షణా, వ్యంజనా ప్రస్తావము; వ్యంజన యంగీకార్యమా? కాదా? అర్థభేదము లెన్ని? రీతి యన నేమి? ఈ రీతులకును రసములకును గల సంబంధ బాంధవ్యములేమి? అవి యెన్ని? వృత్తి యన నేమి? అవి యెన్ని?

అలంకారమన నేమి ? అవి యెన్ని ? వీని కన్నింటికిని బరస్పర భేదమేమి ?

కావ్యమన నేమి? దానిలోఁ బైనుదాహృతవిషయములలో దేనికిఁ బ్రాధాన్య ముండవలెను ? కావ్యశరీర మేమి ? కావ్యాత్మ యేది? కావ్యభేదము లెవ్వి ? కావ్యప్రయోజనము లెవ్వి ? కావ్య శాస్త్రములకుఁ గల వైలక్షణ్య మేమి? కవి యన నెవఁడు ? అతని సామగ్రి యేమి ? కావ్య సౌందర్యము చేనివలనఁ గలుగును? కావ్య రసాస్వాద మెట్లు గలుగును ? ఎట్టి కావ్య ముత్తమము ?

ఈ విషయములును వీనికి సంబంధించి బయలువెడలుచున్న యితర కావ్య సమస్యలను గూలంకషముగా హేతుబద్ధముగాఁ బూర్వపక్ష సిద్ధాంతపూర్వకముగా జల్లెడవట్టినట్లు సాహిత్యశాస్త్రము చర్చించును. అనఁగా నుత్తమకావ్యత్వసిద్ధికి వలసిన విషయము నెల్ల మథించును. డాక్టరు రెడ్డిగారు దలంచిన ట్లీ శాస్త్ర మున్మత్తప్రలాపమువంటిది గాదు.

అయితే యొక ప్రశ్న యుత్థితమగుచున్నది. ఈవిషయములను జర్చించుట కిన్నిగ్రంథము లేలకావలయును? అని. నిజమే. లోకమున నే శాస్త్రము గాని యొక్కనాఁడే పెరిగి పెద్దదిగాదు. ఒకరొక సిద్ధాంతమును లేవదీయఁగా నది లోకమునఁ గొంతకాలము నలుగును. దాని నవగాహనము సేసికొనుటకుఁ గొంతకాలము పట్టును. అప్పుడు దాని కనుకూలముగానో ప్రతికూలముగానో వాదములు చెలరేఁగును. ఈవిధముగాఁ గ్రమక్రమముగా శాస్త్రము పెరుగును. ఈక్రమమున మన సాహిత్యగ్రంథములలోఁ గొన్ని కొన్ని క్రొత్త సిద్ధాంతములను స్థాపించినవి గలవు. భరతుని నాట్యశాస్త్రము, భామహాలంకారము, కావ్యాదర్శము, వామనకావ్యాలంకారసంగ్రహము, ధ్వన్యాలోకము (దీనివ్యాఖ్య-లోచనము,) వక్రోక్తిజీవితము,

వ్యక్తివివేకము, ఔచిత్యవిచారచర్చ, అనునవి నూతనసిద్ధాంతస్థాపక గ్రంథములు. అనఁగా నివి వాదగ్రంథములు. మిగిలినవానిలోఁ బెక్కు గ్రంథము లీవాదగ్రంథబృందముయొక్క సంగ్రహములే [Text books] వీనికి మరలఁ బెక్కు వ్యాఖ్యానములు. (ఒక కావ్యప్రకాశమునకే ౭౦ వ్యాఖ్యలు గలవు). కొన్ని రూపకములఁగుఱించియుఁ గొన్ని రసముల గుఱించియుఁ, గొన్ని శబ్దవృత్తులను గూర్చియుఁ, కొన్ని నాయికానాయకాదులను గూర్చియుఁ గొన్ని యలంకారముల గూర్చియుఁ జర్చించెను. మొత్తముమీఁద సంగ్రహగ్రంథములే పెక్కుగలవు, అటనటఁ బూర్వసిద్ధాంతఖండనరూప ములు కొంత క్రొత్తఁదనము సిద్ధాంతములలో, విషయవిభాగాదులలోఁ గానవచ్చుచున్నను నన్నియుఁ గ్రోడీకరణములే. ఒకదానికొకటి ప్రతిబింబములే. పిష్టపేషణప్రాయములే !

ఈ పరంపరలోఁ బ్రథమ శతాబ్దినుండి తొమ్మిదవ శతాబ్ది వఱకు ననఁగా భరతుఁడు దొట్టి యానందవర్ధనునిదాఁక బయలువెడలిన రస, అలంకార, గుణ, రీతి, ధ్వనిసిద్ధాంతములను గ్రోడీకరించి ప్రకరణ విభాగముసేసి తొలుదొల్త సంగ్రహరూపమున రచించినవాఁడు మమ్మటుఁడు, (క్రీ. శ. ౧౧౦౦) అదియే కావ్యప్రకాశము. రమారమి యాతని సమకాలికుఁడగు హేమచంద్రుఁడు (క్రీ. శ. ౧౦౮౮-౧౧౭౨)కూడ నదేపద్ధతిగఁ గావ్యానుశాసనమును మరొక సంగ్రహగ్రంథమును విరచించెను. తరువాత నంతకన్న విపులముగా మరికొన్ని కావ్యవిషయములను గూడఁ జేర్చి విశ్వనాథపంచాననుఁడు (౧౪ శతాబ్ది) సాహిత్యదర్పణమును రచించెను. దృశ్య శ్రవ్య కావ్య విషయములను నా కాలమునకుఁ జాల సమగ్రముగానే యాతఁడు సంగ్రహించెను. ఈతని సమకాలికుఁడే యనఁదగిన విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమును విరచించెను. ప్రతాపరుద్రీయము సంగ్రహము

లలో సంగ్రహము. ఈ కావ్యాలంకార సంగ్రహము * ప్రతాప రుద్రీయమునకు సంగ్రహరూపమగు ననువాదమని చెప్పవచ్చును. ఏలన, నందలి నాటకప్రకరణ మిందు లేదు. శృంగారేతర రసప్రసంగము లేదు. మిగిలిన ప్రకరణములందుఁగూడఁ గొంత కొంత విషయమును గ్రంథకర్త వదలివేసెను.

ఈ సంగ్రహ గ్రంథములలో వాగ్భట కావ్యానుశాసనము, (౧౩వ శతాబ్ది) హేమచంద్ర కావ్యానుశాసన వ్యాఖ్య, కేశవ మిశ్రుని (౧౬వ శతాబ్ది) అలంకార శేఖరము మొదలగు గ్రంథములలో సాహిత్యదర్పణమునఁ జేరని, చేర్పఁదగిన, చేర్చినచో సమగ్రతను గలిగించు కావ్యవిషయములు కొన్ని సేకరింపఁబడియున్నవి. సాహిత్య దర్పణమునకుఁ బిమ్మట వెలువడిన యే యితర సంగ్రహగ్రంథము నను నవి సంగ్రహింపఁబడలేదు. కావున సంస్కృతమునఁగూడ సాహిత్యదర్పణముకన్న సర్వకావ్యవిషయ సంపూర్ణమగు సంగ్రహ గ్రంథము లేదనియే చెప్పవచ్చును.

---

* కొందఱిది ప్రతాపరుద్రీయమునకుఁ బ్రతిబింబము గాదనియు, స్వతంత్ర గ్రంథమే యనియును జెప్పుదురు. దీనికిఁ గారణము వారుచెప్పునదేమనఁగా బట్టుమూర్తి కంఠోక్తిలో నావిధముగాఁ దెలుపలేదని. ఇది పెద్దకారణము గాదుగదా! నాచేఁ దనగ్రంథము నామూలాగ్రముగా దిద్దించుకొన్న యొకపండితుఁ డాగ్రంథ పీఠికలో నా పేరెత్తడవలేదు. అంతమాత్రమున నాతఁడు నాసాయ మపేక్షింపలే దనియా యర్థము? ఇఁక సంస్కృతమున సుప్తు కృష్ణయజ్వ రచితమగు నరసభూపాలీయము గలదని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 1939 ఫిబ్రవరి భారతిలో వ్రాసిరి. అందు వారు సంస్కృతాంధ్ర నరసభూపాలీయములు రెండును బ్రతాపరుద్రీయమునకుఁ బ్రతిబింబములే యని తెలిపిరి. సంస్కృత నరసభూపాలీయమున శ్లోకోల్లాసములు గలవఁట. అందాఁక లభించెనఁట. ఆంధ్ర నరసభూపాలీయముకన్న సంస్కృత నరసభూపాలీయము ముందు రచింపఁబడెనని శ్రీకవిగారు లిఖించిరి. అయిన నాంధ్ర నరసభూపాలీయము దాని కనువాదముగాక రెండును ప్రతాపరుద్రీయమునకుఁ బ్రతిబింబములే యనియు వ్రాసిరి.

ఉన్నవానిలో సాహిత్యదర్పణమే మేలైనది. ప్రతాపరుద్రీయము నాంధ్రుఁడు రచించినాఁడనియు, ఆంధ్రప్రభువున కంకితమనియు, నాతని సంస్కృతకవిత్వము రసవంతమైనదనియు వార్ణింపవలసినదే కాని విషయపుష్టిలేక నిదాఘనదీపూరముపలె సన్నగిల్లియున్నది. అది సంగ్రహములలో సంగ్రహమని తెలిపితినిగదా! అందు నాయికా భేదములగు ధీరా, అధీరాది భేదములును, రసదోషములును, అర్థనిర్ణాయక సామగ్రియుఁ, గవిసమయములును, ముఖ్యములయిన కావ్యభేదములును సంగ్రహింపఁబడవయ్యెను. ఈవిధముగా నిది యపసమగ్రతమముగు గ్రంథము.

సంస్కృతముననే యిట్లుండ నాంధ్రాలంకార గ్రంథములను గూర్చి వ్రాయనేల? ఆంధ్రమునఁ గల యలంకార గ్రంథములు ప్రాచీనార్వాచీనములు * ౨౭. ఇందొక్కదానియందును విషయ

(శ్రీమాన్ ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు ఎం. ఏ. గారాంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణ పీఠికలో ౪౯, ౫౦, ౫౧ పుటలలో నీక్రిందిజాబితా నొసఁగిరి)

౧. అలంకార మంజరి (కొట్టులూరి వేంకటరాఘవయ్యంగారు.)
౨. ఔచిత్యవిచార చర్చ (వేంకట రామకృష్ణ కవులు.)
౩. కవికల్పలత (కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులుగారు.)
౪. కవి కంఠాభరణము (వేంకట రామకృష్ణ కవులు.)
౫. కావ్య ప్రకాశము (కాండూరి నరసింహాచార్య శిరోమణి.)
౬. కావ్యమీమాంస (పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు.)
౭. కావ్యాదర్శము (అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.)
౮. కావ్యాలంకార చూడామణి (విన్నకోట పెద్దన.)
౯. కావ్యాలంకార సూత్రవృత్తి (పేరాల తిరువేంగళాచార్యులుగారు.)
౧౦. కువలయానంద ప్రకాశిక (కటికనేని రామకవి.)
౧౧. కువలయానందసారము (బులుసు వేంకటరమణయ్యగారు.)
౧౨. చంద్రాలోకము (అడిదము సూరకవి.)
౧౩. ,, (తాడూరి లక్ష్మీనరసింహరావుగారు.)

సామగ్రి లేదు. సరిగదా! మిక్కిలి కొన్ని ప్రాచీన గ్రంథములు దోషభూయిష్ఠములు. లక్ష్యములకును లక్షణములకును బొత్తు లేదు. లక్షణము లన్నియు నవ్యాప్త్యాది దోషజుష్టములే. వీనికిఁ దోడుగా నవపాఠములు. ఈ యున్న గ్రంథములలోఁ గావ్యాలంకార చూడామణి, నరసభూపాలీయములు విశ్వవిద్యాలయ పరీక్షలకుఁ బాఠ్యములు. ఈ గ్రంథకర్తల కలంకారశాస్త్రమునఁ గూలంకషమగు ప్రజ్ఞ లేదన్నట్లు వారి గ్రంథములే సాక్ష్యమిచ్చుచున్నవి. అట్టి గ్రంథములవలన విద్యార్థుల కెంతి యలంకారశాస్త్ర విజ్ఞానము లభించును?

కావున నాంధ్రభాషలోఁ దుదకి సాహిత్యదర్పణమువంటి నిర్దుష్టమగు సాహిత్యశాస్త్రగ్రంథమని చెప్పఁదగిన దేదియు లేదు. అట్టి గ్రంథ మొకటి యవశ్యమైయున్నది. కీ॥ శే॥ వేదము వేంకట రాయశాస్త్రిగారి యాంధ్ర సాహిత్యదర్పణమునకన్న సంస్కృత సాహిత్యదర్పణమే విద్యార్థులకు సుబోధమని నా తలంపు. దీనిని

---

౧౪. చంద్రాలోకము (అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు.)
౧౫. గంధవహము (మంచెళ్ళ వాసుదేవకవి.)
౧౬. దశరూపకము (మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.)
౧౭. ధ్వని (అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.)
౧౮. ధ్వన్యాలోకము (పేదాల తిరువేంగళాచార్యులవారు.)
౧౯. నందరాజ యశోభూషణము (కవి పేరు దెలియదు.)
౨౦. నరసభూపాలీయము (బట్టుమూర్తి.)
౨౧. ప్రతాపరుద్రీయము (గణపవరపు వేంకటకవి)
౨౨. రసగంగాధరము (జమ్ములమడక మాధవరామశర్మగారు.)
౨౩. రసమంజరి (గణపవరపు వేంకటకవి.)
౨౪. ,, (గుడిపాటి కోదండకవి.)
౨౫. ,, (తాడూరి లక్ష్మీనరసింహరావుగారు.)
౨౬. ,, (వేదము వేంకటరాయశాస్త్రిగారు.)
౨౭. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము (చలమచర్ల రంగాచార్యులుగారు.)

ఎం. ఏ. పరీక్షకుఁ జదువుచున్న నా కుమారునికిఁ బాఠము సెప్పఁ జాలక సంస్కృత సాహిత్యదర్పణమునే చెప్పివైచితిని. నాకును నాతనికిని నదియే సుఖమనిపించెను. ఆంధ్రీకృతగ్రంథములు స్వతంత్ర గ్రంథములవలె కడుంగడు సులభములై యుండవలెను. లోకమున సంస్కృతగ్రంథములను బాఠముసెప్పు పండితులును, వానిని గురు ముఖమునఁ జదువుకొను విద్యార్థులును నుందురు. గురుముఖమున సర్వసంశయములు నివారింపఁబడుచుండును. ఈ యాంధ్రీకృత గ్రంథ ములను జెప్పువారును వారికడఁ జదువుకొనువారును నుండరు. కాన విద్యార్థులకు గుర్వపేక్ష లేకయే తెలిసికొనఁదగినవిధమున సంస్కృత శాస్త్రగ్రంథముల ననువదింపవలెను. అంతేకాని యవి వివరణాంత రాపేక్షములై యుండరాదు. అట్లేని నవి "Kuppuswami Ayyer made difficult" (కన్యాశుల్కము) అన్నట్లుండును. మొన్న మొన్న ప్రతాప రుద్రీయ మాంధ్రీకృతమైనది. దీని యనుగ్రతను మొదటనే తెలిపి యుంటిని. ఇట్టియసంపూర్ణగ్రంథముల యాంధ్రీకరణములవలన గ్రంథ కర్తలకులాభముండునేమో? కాని విద్యార్థిలోకమునకు లాభ మావం తయును నుండదనుట నిర్వివాదము. మరియు నా ప్రతాపరుద్రీయాను వాదము సరిగాలేదు. ఒకశ్లోకమేనియును సరిగా ననూదితముగాలేదు. వివరణము వివరణాంతరాపేక్షమై యున్నది. మూలములోని ముద్రా దోషములను గూడ సరియైన యాంధ్రీకరణ మనిపించుకొనవలెనని కాఁబోలు సంస్కరించుకొనక యట్లే యనువదించినారు. కవిత్వము కాకరకాయపాకమునఁ బడినది. నవరసగంగాధరము (ముద్రితము) ఆంధ్రధ్వన్యాలోకము (అముద్రితము) అనునవి గొప్ప శాస్త్రవాద గ్రంథములు, వాని నాంధ్రీకరించినవారును సుప్రసిద్ధులగు పండితులు, కాని యవి ప్రారంభకుల కుద్దిష్టములుగావు. వానిని మొదలనే చదువఁ బూనినచో వ్యాకరణశాస్త్రమున సిద్ధాంతకౌముదిఁ జదువక మహా భాష్యము నారంభించినట్లుండును.

ఈవిధముగా నే గ్రంథముగూడ సుబోధముగాఁగానీ సంపూర్ణముగాఁగానీ లేదు. కావున నిర్దుష్టములయిన లక్ష్యలక్షణములతో సాహిత్యదర్పణముకన్నను విషయసమృద్ధితో సర్వ సాహిత్యవిషయములను గ్రోడీకరించి యాంగ్ల సిద్ధాంతములను గూడ జతపఱచి విద్యార్థులు స్వతంత్రముగాఁ దెలిసికొనఁదగినంత సులభముగా నొక సంగ్రహగ్రంథమును వ్రాసినచో భాషకుఁ జాల మేలబ్బును. అట్టిది మిక్కిలి యవశ్యమై యున్నది.

కాని యీపనిని గావించువారెవరు? కావించినను హర్షించువారెవరు? దానిని లోక మెంత యుపయోగించుకొనును? శ్రమించి యట్టి గ్రంథమును వ్రాసి యెట్లో కష్టించి ముద్రించుకొని "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం" అనుకొని తమ కృషికి హర్షింతురని తపాలా వ్యయమును భరించి యభిప్రాయార్థముంపఁగాఁ గొందఱు దాము మహనీయులయినట్లును బంపినవా రల్పులయినట్లును భావించుకొని యందినకైనను దమ గౌరవమునకు భంగమునచ్చునని కాఁబోలు వ్రాయరు. తపాలాబిళ్ళలుకట్టి జాబులు వ్రాసినను వానిని గ్రింగుదురు కాని ప్రత్యుత్తరింపరు. పదవీ, వేతనాదులవలన లభించిన పండితమ్మన్యత్వమును, నిర్లక్ష్యభావమును వారిలో వేఱు దన్నియున్నవి. పండితులు గ్రంథములనుబంపి తమ్ము గౌరవించినందులకుఁ బ్రత్యుత్తరపూర్వకముగా వారిని గౌరవింపవలయునని తలంపరు. చిలుక తన ముద్దునే కోరును; కాని యెదుటివాని ముద్దును గోరదఁట. వారు సభల కగ్రాసనాధిపత్యమును వహించి బల్లగుద్దుచు శాస్త్ర గ్రంథములు మన భాషకుఁ గావలెనని ఘోషింతురు. తామువ్రాయరు. సోదరవిద్వాంసులు వ్రాసిన వానినిఁ జూడరు. వారిని గౌరవింపరు. ఈ విషయమంతయును నా యనుభవము!

నూతనముగా లక్ష్యలక్షణములను సృష్టించి వ్రాయుటకన్న దోషభూయిష్ఠమేమైయున్నను 'గావ్యాలంకార సంగ్రహము' నకు

నిందలి దోషములు సూపుచు, సంస్కృతగ్రంథములనుండి నిర్దుష్టము లయిన లక్ష్యలక్షణముల నుదాహరించుచు, సంస్కృత సాహిత్య గ్రంథములలో నున్న సర్వవిషయములను సంగ్రహముగా నా యా స్థలములందుఁ జేర్చుచు 'వివరణము'ను వ్రాసినచో లెస్స యని తోఁచినది. దీనివలన నిందలి దోషములును, నిర్దుష్ట లక్ష్యలక్షణము లును, గ్రాహ్యవిషయములును దెలియును. కేవలము నూతనగ్రంథ మే యగుచో నరసభూపాలీయ దోషము లట్లే మిగిలియుండును. లోక మున కవి తెలియకయే యుండును. మరొకరైనను దానికి వివరణమో టీకయో వ్రాయవలసియేయున్నది. ఉదాహరణ ప్రత్యుదాహరణము లచే సూత్రార్థము సుస్పష్టమగువిధమున నీ గ్రంథదోషముల నెఱిఁగి సాధువులయిన లక్ష్యలక్షణములను దెలిసికొన్నచో విద్యార్థులకెంతేని మేలగునుగదా! మరియు మన భారతీయ సిద్ధాంతములతో పాటు పాశ్చాత్య సాహిత్యసిద్ధాంతములను గూడఁ జేర్చినచో సముచిత మనియెంచి నా కుపలబ్ధములయినవాని నిందుఁ జేర్చుకొంటిని.

నేనును నిందు నాటక ప్రకరణమును వ్రాయలేదు. ఏలన, సాహిత్యదర్పణ, ప్రతాపరుద్రీయములందలి నాటక ప్రకరణములు చిన్నవి. ఇప్పుడు పాశ్చాత్యనాటకములుగూడ వచ్చినవి. కావునఁ బాశ్చాత్య భారతీయ నాటకలక్షణములను జర్చించుచుఁ బ్రత్యేక ముగా 'రూపక మీమాంస' అను పేర నొక గ్రంథమును వ్రాయవలె నని యభిలాష గలదు. కాని యారోగ్యము సరిగాలేదు. అనారోగ్య స్థితిలోనుండియే దీని నెట్లో ముగించితిని. భగవంతుఁడు నా కాయు వును, ఆరోగ్యమును బ్రసాదించినచో దానినిఁ గూడ రచించి వాగ్దేవి నారాధింతును.

పాశ్చాత్య సాహిత్యకారు లెవ్వరును మన సాహిత్యకా రులవలె సాహిత్యదర్పణాదులవంటి యా యా విషయవిభాగములు

గల సంగ్రహగ్రంథములను వ్రాయలేదు. కొందఱేకవి కావ్యమును గుఱించియో విమర్శించుచు నడుమ నడుమ శైలినిఁగూర్చియో నాయకునిఁగూర్చియో లేక రసమును గుఱించియో యులఁతిగాఁ దడవుచుఁ బోవుదురు. అంతేకాని యింత కూలంకషముగా హేతు వాదపురస్సరముగా శాస్త్రీయపద్ధతితోఁ (Scientific treatment) ప్రతి విషయమును జర్చించుచు నెల్ల విషయములను సంగ్రహముగా నొకచో విద్యార్థుల కందుబాటుగా నుండు సాహిత్యగ్రంథములను విర చింపరైరి. కావునఁ బాశ్చాత్త్యుల సిద్ధాంతము లన్నియు మనము సంగ్రహముగా నొక్కచోఁ దెలిసికొనఁజాలము. నేను బెద్దలవలన విన్నదానిఁబట్టి పాశ్చాత్త్యసాహిత్యగ్రంథములలో శబ్దశక్తివిచా రము, నాయికా నాయక చర్చలు, రసభావాదివిచారము, గుణదోష వివేకము మొదలగునవి కానరావు. వారి సాహిత్యవిమర్శనము నూతనమేయగుఁగే.

"సర్వజ్ఞత్వము సాంబమూర్తిది ; మనుష్యప్రజ్ఞ యుల్పంబు" అన్నట్లెవ్వరును సర్వజ్ఞులు గారుగదా! ఒకరిసాయ మొకరి కపేక్ష ణీయము. అట్టియెడ వారు పరులవలన గ్రహించిన యుల్పసాహాయ్య మునకేనియుఁ గృతజ్ఞతఁజూపుట ధర్మము. ఒకరియొద్దనుండి సంత కము సేయుటకై కలమునుగొని మరల నిచ్చునపుడు 'వందనము' (thank you) అని చెప్పు కాలమిది. అట్టిచో నమూల్యమైన విజ్ఞాన విషయములలో సందేహములను బాపియు సూచనలను గావించియు నుపకరించినవారికిఁ గృతజ్ఞతను దెలుపుట ప్రథమవిధి. అట్లు సేయుమి కృతఘ్నత.

ఈగ్రంథమును వ్రాయుపట్ల నాకుఁగలిగిన పెక్కుసంశయము లను దీర్చి సాటిఁ దీర్పరాని సాహాయ్యమొనర్చిన, నా సాహిత్య శాస్త్ర గురువులగు శ్రీమాన్ శిరోమణి వేదాల తిరువేంగళా

చార్యులవారికిని, (గుంటూరు ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీ సంస్కృత పండితులు) దాము సేకరించిన గేయవాఙ్మయమునందలి కావ్యభేదములను దయతో నాకొసఁగిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికిని, ఉదాహరణకావ్యమునుగుఱించి వ్రాయుపట్ల నాకు సంగీతశాస్త్రవిషయమును దెలిపిన శ్రీ పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని, నీగ్రంథముయొక్క వ్రాఁతప్రతిని నావాలాగ్రముగాఁ జూచి యామోదమును వెల్లడించి నాకుఁ బ్రోత్సాహమొసంగిన మిత్రులగు శ్రీ బిదురు వేంకటశేషయ్యగారికిని నా కృతజ్ఞతాపూర్వకవందనములు. మరియుఁ బెక్కు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లగ్రంథములను నే నీగ్రంథ రచన కుపయోగించుకొంటిని. ఆగ్రంథకర్తలకును గృతజ్ఞుఁడను.

## వివరణ పద్ధతి

ఇందుఁ బ్రతిపదార్థమును వ్రాయఁదలంపలేదు. పద్యములకుఁ దాత్పర్యమును వ్రాసితిని. ప్రతిపదార్థము వ్రాసినచో నింక నిన్నుడియో మున్మడియో గ్రంథము పెరిగెడిది. నాందీ ప్రభృతి వంశచరిత్రాంతము గల పద్యములకును, ఆశ్వాసాంత పద్యములకును, బంధ, గర్భ పద్యములకును దాత్పర్యములుగూడ వ్రాయలేదు. ఏలన వాని యుపయోగ మల్పము. కాని యచట వలసిన సమన్వయరూపమగు వివరణమును వ్రాసితిని.

ఈ కావ్యాలంకార సంగ్రహమునకు మూఁడు మాతృకలు గలవు. అవి కాకినాడలో 'ఆంధ్రసాహిత్యపరిష'త్కార్యాలయమునఁ గలవు. అందలి పాఠాంతరములను దెప్పించుకొని తదనుసారముగా మాతృకను సంస్కరించుకొంటిని.

దీనియందలి నాయక రస ప్రకరణములకు మాత్రమే కీ. శే. వెల్లాల సదాశివశాస్త్రిగారు (జటప్రోలుసంస్థాన పండితులు–నిజాం

రాష్ట్రము) పూర్వ మొక వ్యాఖ్యను రచించిరి. వారు గ్రంథకర్త చేసిన దోషములనే విశేషించి చూపిరి. అందుఁ జేర్పఁదగిన విషయములు చేర్పలేదు. వింజమూరి కృష్ణమాచార్యులవారును, శబ్దరత్నాకరకర్త బహుజనపల్లి సీతారామాచార్యులవారును గలిసి ప్రచురించిన యొక టుప్పీక గలదు. ఇవి రెండును నాకు విశేషించి యుపయోగపడలేదు. పాఠభేదములను సవరించుకొనుటకుమాత్రమే యుపకరిగాఁ దోడ్పడినవి. వారికినిఁ గృతజ్ఞుఁడను.

ఇటీవల నామిత్రులగు విద్యాప్రవీణ శ్రీ బులుసు వేంకటరమణయ్యగారును (మదరాసు) శిరోమణి శ్రీ తూములూరి శివరామకృష్ణశాస్త్రి B. O. L. గారును (మదనపల్లి కాలేజీ పండితులు) ఈ గ్రంథమునకు వివరణములు వ్రాసిరని తెలిసినది. అవి యింకను ముద్రితములుగామి వానినిఁజూచు భాగ్యము గలుగలేదు. అవి ముద్రితములయ్యోనేని నా గ్రంథమునఁగల కొఱంతలు వానివలనఁ దీఱుననియు విద్యార్థులకు మరింత మేలబ్బుననియును వానినిఁగూడఁ ద్వరితముగానే వారు ముద్రింతురుగాత మనియు నభిలషించుచున్నాను.

'దృష్టం కిమపి లోకేఽస్మిన్ న నిర్దోషం న నిర్గుణం' అని కదా యభియుక్తోక్తి, కావున నుదారహృదయులగు విద్వాంసులు దీనియందలి దోషములను సుహృద్భావముతోఁ దెలిపినచో సంస్కరించుకొందునని సప్రశ్రయముగా మనవి సేయుచున్నాను.

## గ్రంథకర్తృ చరిత్రము

ఈగ్రంథకర్తయగు బట్టుమూర్తి బాలకవిగానుండియే శ్రీకృష్ణదేవరాయలవారి యష్టదిగ్గజములలో నొకఁడై క్రమక్రమముగా నతని యల్లుఁడగు అళియరామరాజునకు మేనల్లుఁడగు * నరసరాజు

* సంస్కృత నరసభూపాలీయ కృతిపతి గొబ్బూరి నరసరాజు. ఇతఁడు అయ్యలరాజు రామభద్రునిచే రామాభ్యుదయముఁ గూడ నాంధ్రమున నంకితము గొనెను. ఆంధ్ర నరసభూపాలీయ కృతిపతి యగు నరసరాజును, గొబ్బూరి నరసరాజును పినతండ్రి పెదతండ్రి కుమారులని చెప్పుదురు.

నాశ్రయించి యాతని కీ కావ్యాలంకార సంగ్రహమును గృతి
యిచ్చి యాతని యాశ్రయమువలననే రామరాజు సభకెక్కె రామ
రాజభూషణ బిరుదమునొంది తల్లికోట యుద్ధములో రామరాజు
కీర్తిశేషుఁడుకాఁగా నాతని తమ్ముఁడగు తిరుమలదేవరాయుల నాశ్ర
యించి వసుచరిత్ర మాతనికిఁ గృతియిచ్చి పిమ్మట శ్రీరామచంద్రుని
కంకితముగా హరిశ్చంద్ర నలోపాఖ్యానమునుగూడ రచించెననియు
క్రీ. శ. ౧౫౧౦ మొదలు ౧౫౮౦ వఱకాతఁడు జీవించెననియు నీతఁ
డల్లసాని పెద్దనకు శిష్యుఁడనియును సంగీతశాస్త్ర పండితుఁడును,
అవధానతంత్రాది చతుర్విధ కవితాధురంధరుఁడనియు, బట్టుమూర్తి యు
రామరాజభూషణుఁడును భిన్నులా? ఒక్కరా? అను వాదమును
ఖండించి యొక్కరేయనియును నీమొదలగు విషయములను శ్రీవజ్ఝల
చినసీతారామశాస్త్రిగారు వసుచరిత్ర విమర్శనము, హరిశ్చంద్ర
నలోపాఖ్యాన పీఠికలలోను, తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారు
వసుచరిత్ర పీఠికలోను, రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము
పంతులుగారు ఆంధ్రకవుల చరిత్రలోను లిఖించిరి. అంతకన్న విస్త
రించి యిట వ్రాయ నక్కఱపట్టదు.

## కృతిపతి చరిత్రము

ఈ నరసరాజు కౌశికగోత్రసంభవుఁడు. (గీ. వసుధఁ గౌశిక
గోత్ర పావనుఁడవైన । నీక తగుఁగాక. ౪ ఆ. ౬౫ ప.) ఇంటిపేరు
తొరగంటివారు. (తొరగంటి నరసభూప!) ఇతని వంశపురుషుఁడు
పోచిరాజు. (పోచిరాజు నరేంద్రుఁడు.) విష్ణుభక్తుఁడు (నారాయణ
చరణార్చన). తండ్రి ఓబుళుఁడు; తల్లి లక్కాంబ.

సామాన్యముగాఁ గృతికర్తలు కృతిభర్తల శౌర్య, ధైర్య,
సాహసౌదార్యములను [illegible] అట్లే యాతఁ

డును వర్ణించెను. కాని యీతని చరిత్రలో రెండంశములు విచిత్రము లయినవి గలవు. అవి యివి:-

౧. నరసభూపాలుఁడు మత్స్యయంత్రమును గొట్టినాఁడు.

గీ. నరసభూభర్త మత్స్యయంత్రంబు నేయు. (ద్వి. ఆ. ౧౧౬ వ.)

మ. నలిలచ్ఛాయఁగుఱించి యంత్రకృత మత్స్యం బీ నృసింహక్షమా
తలనాథాగ్రణియేయు... (ద్వి. ఆ. ౧౨౩ ప.)

గీ. యంత్రమీనంబుఁ దునుమాడినట్లుదునుము. (ద్వి. ఆ ౧౨౮ వ.)

సీ. శరవేగములు లేవె? చలయంత్రిపాఠీన
శాసనప్రౌఢికిఁ జనవుగాక. (౪ ఆ. ౬౪ ప.)

౨. నదీప్రవాహమును ద్రిప్పినాఁడు.

సీ. పన్నకెక్కిన దేవవాహిని సాటిగా
నిలమెల్ల యేఱుల నిరవుకొల్పి.

సీ. అల యనాది ప్రవాహములైన యేర్లవం
కలుదిద్దుచే వివేకంబు కలిమి!

సీ. సామర్థ్యములులేవె? సరిదన్యపథయాన
శాసనప్రౌఢికిఁ జనవుగాక.

ఈతనికి ధీరోత్తమగండ, గండరగండ, ఉభయరగండ, గండభేరుండ బిరుదములు గలవు. ఆ. ౫ - ౧౬౭ ప.)

ఈతఁడు దురుష్కుల నోడించి హిందూరాజ్యము నిలిపెను.

సీ. అభిభూతఖానమల్కావిష్కృతాయత్తో
ధ్వాతసంతతి కాత్మ సంతసిల్లి. (౨ ఆ. ౨౦ వ.)

చ. అదెయిదె వచ్చెవచ్చె నరసాధిపు దాడి యటంచుఁ బాళెముల్
వెదరి బరీదుఁడేగునెడ... (౨ ఆ. ౧౨ ప.)

శా. మజ్ఞా మండువ పండువా భయదదోర్మాహాత్మ్య!
(౫ ఆ. ౨౮౩ ప.)

శా. ...హిందూరాజ్య సంస్థాపనా! (౯ ఆ. ౨౮౩ ప.)

మరియు కటక దేశాధిపతి యగు అశ్వపతి కితఁడన్న భయము.

---

కం. కటకాధిరాజహయపతిసేనా । భీకర! (౪ ఆ. ౧ ప.)

ఇతనికి భారవికవిత్వమునఁ బ్రీతి గలదు.

---

భారవి కవిప్రౌఢోక్తిసంచార! (౨ ఆ. ౧౭౪ ప.)

మొదటినుండియు నాంధ్రభాష కత్యవశ్యములును, బూర్వ విద్వాంసులు స్పృశింపనివియు నగు గ్రంథములను వ్రాసి భాషలోని కొఱఁతను యథాశక్తిఁ దీర్పవలెనని నా యభిలాష. "ఆఁకలి ఆకాశమంత; నోరు సూదిబెజ్జమంత" అన్నట్లు నాకా? యాశ పెద్దది, పాండిత్యము, అవకాశము దక్కువ. పైఁగా ననారోగ్యము. ఇచ్చటి సారస్వత వాతావరణమా? ప్రతికూలము.*ఏలన నిచ్చటి పత్రికలేమి? పండితులేమి?నవగ్రహములును నాయెడవక్రించియున్నవి. ఇచ్చటి నా సారస్వత జీవిత మేటి కెదురీఁదుచున్నది. అట్లయ్యు సంస్కృతవ్యాకరణ శృంఖలలనుండి యాంధ్రభారతినిఁ దప్పింప నుడుతభక్తితోఁ దత్సమచంద్రికను వ్రాసి యాంధ్రవాణి కూడిగము సేసితిని. మరియు జాతకకథాగుచ్ఛము(౨ భాగములు)కీరసందేశము, ద్వంద్వయుద్ధము, ఖడ్గతిక్కన, గోవర్ధనాచార్య సప్తశతీసారము,' వాసవదత్త, రేణుక విజయము, అమృతకణములు, కావ్యాలంకారసంగ్రహ వివరణము మొదలగువానిని రచించి యా దేవి కర్పించితిని. ఈ గ్రంథమునకు బీజము నా హృదయమున ౨౦ ఏండ్లక్రిందనే పడెను. దీనిని సాధింపఁ గల మహావిద్వాంసు లెందఱో యుండ నేను సాహసించుట తగదని మిన్నకుంటిని. కాని పెద్దలెవ్వరును దీనికిఁ బూనకుంటచే వ్రాయఁ గడఁగితిని. వ్రాసిన పిమ్మట ఇతరులు వ్రాసిరని తెలిసియు, వ్రాసిన దానినిఁ బ్రకటింప కేల యూరకుందు? రని నా మిత్రులు ప్రోత్సహింప ముద్రింపఁగడంగితిని.

---

* ఈ వాక్యములకు వ్రాయవలసిన వ్యాఖ్య పెద్దది గలదు. కాగితపు కరవు వలన దానిని విరమింతును.

గ్రంథమును వ్రాయుట యొకయెత్తు, ముద్రణముగుట యొక యెత్తుగదా! అందును గాగితముల కాటకపుదినములలో మరింతకష్టమని చెప్పఁబనిలేదు. దీనిని ముద్రింపఁదలఁచి సికిందారాబాదా వణిక్పుంగవులలోఁ జిన్నయయ్యును గుణములచేఁ బెద్దయు దేవబ్రాహ్మణ భక్తిసంపన్నుఁడును, బండితాభిమానియు, నాకు మిత్రుఁడును నగు మ రా. శ్రీ మరిపల్లి శంకరయ్యశ్రేష్ఠిగారితోఁ బ్రసంగింపఁగాఁ బ్రప్రథమమున ౫౦ రూ॥ చందా వేసి మార్గముఁజూపిరి. వారు చందా వేసిన మహూర్తబలమే యీ గ్రంథ ముద్రణమును నిర్విఘ్నముగాఁ గొనసాఁగించినది. పిమ్మట నీ విషయమును నివేదింపఁగా దీని భారమును దమమీఁదికిఁ ద్రోసికొని స్వహస్తముచేతను బరహస్తముచేతను దోడ్పాటుగావించిన పరోపకారపారీణులగు శ్రీ బెల్దె జగదీశ్వరయ్యశ్రేష్ఠిగారికిని, నా యీ గ్రంథమునుగుఱించి విని దీని నచ్చైన నుద్ధరింపఁ బ్రతిజ్ఞనుబూని బళ్ళారిజిల్లా, ఆదవాని పట్టణమునఁ బౌరవతిమున సభాముఖమున ౧౨౫౧ రూ॥ సమర్పించి సమ్మానించిన భాషాభిమాని, సరళస్వభావుఁడును, పరోపకార ధురంధరుఁడును నగు శ్రీ లోకనంది శంకరనారాయణరావు, ఎం. ఏ., యల్. యల్. బి., గారికిని నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ముఖ్యముగా వీరి యీ పెద్ద సాహాయ్యము లేనిచో నీ గ్రంథము వెలుఁగు చూచెడిది గాదు. వీరికి నే నెంతయును ఋణపడియున్నాను. వీరికిని, నితర దాతలకును నా కృతజ్ఞతను జూపుచు వీరి కాయురారోగ్యైశ్వర్యములను బ్రసాదించి భగవంతుఁడు మనుచుఁగాతమని కోరుచున్నాను.

మరియు దయతో నీగ్రంథమునకు "తొలిపలుకు" వ్రాసిన శ్రీ గంటి జోగిసోమయాజులు, ఎం. ఏ., యల్. టి., విద్వాన్, ( Telugu Reader, Andhra University ) వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

సికిందారాబాదా
26-11-45

బుధవిధేయుఁడు,
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

# మేలిపలుకు

శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు సమకూర్చి రచించిన 'కావ్యాలంకార సంగ్రహ వివరణము' ను 'నిజాం రాష్ట్ర - ఆంధ్ర సారస్వత పరిషత్తు' పక్షమునఁ బండిత సారస్వతశాఖక్రింద-ప్రకటించి, సాహిత్యరసికులగు నాంధ్రుల కందఁ జేయఁగల్గినందులకు మే మెంతయు గర్వించుచున్నాము. శ్రీ శాస్త్రి గారు కవులు; సంస్కృతాంధ్రములయందుఁ బండితులు. కవులై 'జాతక కథాగుచ్ఛము' మొ॥ కావ్యములచేతను, పండితులై *'తత్సమచంద్రిక, 'కావ్యాలంకార సంగ్రహ వివరణము' అను సద్గ్రంథములచేతను నింతవరకు నాంధ్ర సరస్వతిని నారాధించియున్నారు. వారి యితర గ్రంథము లిదివఱకే యాంధ్రలోకమునకు సమర్పితము లయియుండుటచే, శాస్త్రిగారినిఁగూర్చి పరిచయవాక్యములు వ్రాయుట దినకరుని దివ్వెలో చూపించుటవంటిదే యగును.

ఈ గ్రంథమును బ్రకటించిన సంస్థ నిజామురాష్ట్ర - ఆంధ్ర సారస్వత పరిషత్తు. ఇది నెలకొల్పఁబడి యిప్పటికి మూఁడు సంవత్సరములైనది. మొట్టమొదట గ్రంథాలయోద్యమములోఁ బ్రారంభించి కొంత కాలము సారస్వతసేవఁ గావించిన 'ఆంధ్రమహాసభ' క్రమక్రమముగాఁ బూర్తిగా రాజకీయసంస్థగా మాఱిపోవుటచేతను, రాష్ట్రమునఁ గల గ్రంథాలయములు, సారస్వతసంస్థలును పఠనమందిరములుగనో, ప్రకటనసంస్థలుగనో యుండుటవల్లను, రాష్ట్రీయులలో మాతృభాషాభిమానమును, ఆంధ్ర సంస్కృతియం దభినివేశమును గల్గించుటకై రాజకీయములతోఁ బ్రత్యక్షముగఁగాని పరోక్షముగఁగాని యెట్టి సంబంధ

---

* సంస్కృత వ్యాకరణమునుండి యాంధ్రభాషకుఁ గావలసినంతవఱకు విషయ ముద్ధరింపఁబడి వ్రాయఁబడిన మహాగ్రంథము. ఈ గ్రంథాంతమున దీనిని గుఱించిన ప్రకటన గలదు.

తును బెట్టుకొనక తీవ్రకృషి సాగించు మహా సారస్వత సంస్థ యొకటి యవసరమని యిది స్థాపింపఁబడినది. ఈ పరిషత్తు ప్రచార-పరీక్షా-ప్రకటన-సంగ్రహ శాఖలక్రిందఁ జురుకుగాఁ బనిసేయుచున్నది. ప్రచారశాఖాకృషికి ఫలితముగా నిప్పుడు రాష్ట్రమున ౨౬ శాఖాసంఘములు జిల్లా గ్రామములలో నేర్పడి పరిషత్కార్యక్రమమును నిర్వహించుచున్నవి. పరీక్షాశాఖ యిప్పటికి ప్రాథమిక - ప్రవేశ పరీక్షలు జరిపి, రాష్ట్రీయులచే నిర్బంధముగాఁ గొన్ని గ్రంథములు చదివించియు, ఉత్తీర్ణులకు విజయపత్రముల నొసఁగియు, బహుమతుల నిచ్చియు, భాషాభిరుచినిఁ బెంపొందించుచున్నది. ఈయేఁడు 'ప్రారంభ పరీక్ష' (Literacy Examination)ను, తర్వాత 'ఆంధ్ర సారస్వత విశారద' మొ॥ పరీక్షలను యథావసరముగా జరుపు నుద్దేశము కలదు.

ప్రకటనశాఖ బాలసారస్వతము, ప్రజాసారస్వతము, పండిత సారస్వతము' అని సారస్వతమును ముత్తెఱఁగులుగా గ్రహించి ప్రకటింపఁదలఁచినది. తారణ వత్సరమున ప్రజాసారస్వత పక్షమున 'ఆంధ్రుల చరిత్ర'ను ప్రకటించినది; ఈ సంవత్సరము యువజన శిక్ష, నక్షత్రమండలము, మొ॥ పుస్తకములను-౧౦౦ పుటలకు మించనివి-ప్రకటింపఁబోవుచున్నది. శ్రీ శాస్త్రిగారి 'కావ్యాలంకారసంగ్రహ వివరణము' పండిత సారస్వతమునందలి ప్రథమపుష్పముగా నిప్పు డాంధ్రులకందఁ జేయఁబడుచున్నది. బాలసారస్వతపక్షమునఁ గొన్ని పుస్తకములు సిద్ధమగుచున్నవి.

ఈ కావ్యాలంకారసంగ్రహవివరణము పేరికి వివరణగ్రంథమైనను, ఒకవిధముగా దీనిని 'సాహిత్య సర్వస్వ'మనవచ్చును. ఆంధ్ర దేశమున నిప్పటికిఁ బెక్కలంకారగ్రంథములు పుట్టకపోలేదు; కాని యవి యన్నియు నే యనువాదగ్రంథములో యై, సాహిత్యవిమయ

ముల నా మూలాగ్రముగఁ దెలిసికొనుట కవకాశ మిచ్చునట్టివి కావు. శ్రీ శాస్త్రిగారు సంస్కృతసాహిత్యశాస్త్రమునందలి సర్వవిషయములను సంగ్రహించి, కావ్యాలంకారసంగ్రహమునఁ బొందించి, యిటు సాధారణముగాఁ గొఱుకుడువడని కావ్యాలంకారసంగ్రహము యొక్క యుపయోగమును వృద్ధిచేయుటయేగాక, అట్టి సర్వసాహిత్య సామగ్రినిఁగూడ నొసఁగి, తత్పాఠకుఁడు స్వయంపఠనముచేత నే పండితుఁ డగుటకు వీలు కల్పించినారు. ఈనాఁ డిట్టి ఘనకార్యము మఱొకరెవ్వరు చేయకుండుటచేఁ, దత్ప్రథమగౌరవము శాస్త్రిగారికే లభించినదనవచ్చును. ఇది సాహిత్యశాస్త్రముమీఁద విమర్శగ్రంథము గాకపోయినను, విషయము తెలిసినఁగాని విమర్శకుఁ దావు లభింపదు గావున, నిట్టి విషయ సమగ్రమైన గ్రంథము ని. రా. ఆంధ్ర సారస్వత పరిషత్తువారు మొట్టమొదటఁ బ్రకటించి, సాహిత్య జిజ్ఞాసువుల కెంతయో యుపకృతి చేసినారనఁదగును. ఇట్లే, తర్వాత - ఒక సాహిత్యశాస్త్ర విమర్శగ్రంథమును గూడ - కావ్య కళాతత్త్వము - అనుదానినిఁ బ్రకటించి, రెండవ లోపమును బూరించుటకుఁ బూనియున్నారు. శ్రీ శాస్త్రిగారి వివరణపద్ధతు లటు ప్రాచీనులకును, నిటు ఆధునికులకును దృప్తినిఁ గల్పింపఁజాలినవై యున్నవి.

శ్రీ శాస్త్రిగా రీ గ్రంథమును బ్రారంభించి ముగించిన పిదపఁ, బరిషత్తునకుఁ బూర్వాధ్యక్షులును, గౌరవ సభ్యులును నగు శ్రీ లోకనంది శంకరనారాయణరావుగారు తత్ప్రశస్త్యమును గుర్తించి యట్టి గ్రంథము పరిషత్తుపక్షమునఁ బ్రకటింపవలయునని, యందుల కంగీకరింపవలసినదిగా శ్రీ శాస్త్రిగారినిఁ బ్రార్థింపఁగా, వారును దయతో సమ్మతించి, పరిషత్తు స్థాపకులలో నొకరైన తమ కీ సంస్థపైఁ గల యభిమానమును బ్రకటించుటయేకాక, పరిషత్తునకుఁ గొన్ని ప్రతులుగూడ దానముచేసి తమ యౌదార్యమును

గనఁబఱచిరి. ఈ సందర్భమున గ్రంథ ముద్రణమునకై కొందఱు దారు
లను ప్రోత్సహించి సాయపడి యట్టి పూనికవల్లఁ బండిత సారస్వత
శాఖ నీ యుద్గ్రంథముచే భూషింపఁజేసిన శ్రీ శంకరనారాయణరావు
గారికిని, సాయపడిన ధనదాతలకును మఱొకమాఱు పరిషత్పక్షమున
ధన్యవాదము లర్పించుట నా విధి.

ఈ గ్రంథమును-నల్లగొండలో జరుగుచున్న పరిషత్తు తృతీయ
వార్షికోత్సవ సందర్భమున సమ్మానపూర్వకముగా బహిరంగపఱచు
గౌరవము పరిషత్తున కొదవుట యెంతయుఁ బ్రశంసనీయము. ఇఁక
ముందీయుద్గ్రంథము విశ్వవిద్యాలయములలోఁగూడఁ బాఠ్యగ్రంథమై
ప్రభుత్వ విద్యా విధానమునందును దన కర్హస్థానమును గల్పించు
కొని పరిషత్తున కలంకారప్రాయము కాఁగలదనియు, నీగ్రంథమును
లోఁతుగాఁ బరిశీలించినవారు మా యభిప్రాయముతో నేకీభవింపఁ
గలరనియు, నమ్ముచున్నాను.

హైద్రాబాదు,
౧౪-౧౨-౪౯

విధేయుఁడు,
బిదురు వేంకటశేషయ్య,
గౌరవ కార్యదర్శి,
నిజాంరాష్ట్ర-ఆంధ్ర సారస్వత పరిషత్తు.

# విషయ సంగ్రహము

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

# ఏతద్గ్రంథ ముద్రణమునకు సహాయపడిన దాతల పట్టిక

~~~

### సికింద్రాబాదా – హైద్రాబాదాలవారు.

శ్రీ రాజా రామచంద్రారెడ్డి బహాదుర్ వారు ... రు. ౧౫౦
(పాపన్నపేట సంస్థానము.)

శ్రీ రాజా సోమేశ్వరరావు బహాదుర్ వారు ... ౧౧౬
(దోమకొండ సంస్థానము.)

శ్రీ రాజా రామదేవరావు బహాదుర్ వారు ... ౧౦౦
(వనపర్తి సంస్థానము – శ్రీ గడ్డంపల్లి రామకృష్ణారెడ్డి దేశముఖ్ గారి ద్వారా నొసఁగిరి.)

శ్రీ ముస్త్యాల హనుమంతరావుగారు ... ౧౫౦
(కీ. శే. వేంకట కృష్ణయ్యగారి పుత్రుఁడు.)

శ్రీ బెల్దె జగదీశ్వరయ్య శ్రేష్ఠిగారు ... ౧౦౦

శ్రీ సిద్దంసెట్టి రాజేశ్వరరావు శ్రేష్ఠిగారు ... ౧౦౦

శ్రీ మరిపల్లి శంకరయ్య శ్రేష్ఠిగారు ... ౫౦

శ్రీ జూలూరి జగదీశ్వరయ్య శ్రేష్ఠిగారు ... ౫౦

శ్రీ శిర్నాం సత్యనారాయణ శ్రేష్ఠిగారు ... ౫౦

శ్రీ గందె నరసిములు శ్రేష్ఠిగారు ... ౨౫

శ్రీ మాసెట్టి హనుమయ్య గుప్తగారు ... ౨౫

### ఆదోని

శ్రీ తుంబళంగుత్తి లక్ష్మయ్య, యమ్. గోపాలరావుగారలు ౫౦౩

శ్రీ అర్థగిరి వీరారెడ్డిగారు ... ౨౫౦

శ్రీ అర్థగిరి తిమ్మారెడ్డిగారు ... ౨౫౦

శ్రీ కొత్తింటి శివరామరెడ్డిగారు ... ౨౧౦

(ఈ నలుగురును శ్రీ లోకనంది శంకరనారాయణరావు, యం. ఏ., యల్. యల్. బి. గారిద్వారా [illegible] నొసఁగిరి.)
~~~

శ్రీరస్తు

# కావ్యాలంకారసంగ్రహము

## నాంది

శ్రీలీలావతి దా నురోమణిసభా సింహాసనత్కౌస్తుభా
వేలాభాప్రతిబింబితాంగి యయిన న్వే యొక్కతె దాల్చినాఁ
డౌ లే యంచుఁ దలంచునో యని యనుం దానందుఁ డై లక్ష్మి నే
వేళం గౌఁగిటఁ జేర్చు శౌరి నరసోర్వీనాథునిం బ్రోవుతన్. ౧

సీ. ఏ లేమ కడలిరాచూలి యనా బెడఁగించుఁ
గలితవళీతరంగముల రంగు
ఏమానినీరత్న మిందుసోదరి యనాఁ
బ్రకటించు మొగముపోలిక తెఱంగు
ఏతన్వి కందర్పమాత యనా బెడఁగించుఁ
గరగృహీతాంభోజ కాండకలన
ఏసాధ్వి దనుజారియిల్లా లనఁ దెల్పు
నళిననీలాబ్జభిన్నయనగరిమ
తే. యట్టి శ్రీదేవి సుకవివాగమృత రసము
నఖిలభువనోన్నతము నైనయాటవేంద్ర
నరసవిభుమందిరం బాత్మశరణమనుచు,
నుండి యేకాలమును బాయకుండుఁగాత. ౨

చ. పలుకులకొమ్మ నెమ్మొగముఁ బార్వణచంద్రునిఁ గాఁ దలంచి యు
జ్జ్వలనిజభద్రపీఠజలజంబు నిమీలిత మౌనో యంచు నే
ర్పలవడ భారతీవనిత నాత్మముఖంబులలోనె తాల్చుచుం
జెలఁగువిధాత యోబయనృసింహున కిచ్చుఁ జిరాయురున్నతుల్.

సీ. ఒకటి యతుకరవిలాసోల్లాసమున మించ
నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల
నొక్కటి నారికేళోన్నతిఁ దాల్ప నొ
క్కటి గోస్తనీగుచ్ఛకలనఁ దవర

నొకటి సువృత్తభావోన్మేష మొదవ నొ
క్కటి వల్లకీతుంబికలనఁ జెలఁగ
నొకటి భావవిశేషయుక్తిఁ బెంపొంద నొ
క్కటి గిరీశమతానుసారి గాఁగ
తే. నసమసాహిత్య సంగీతరసము లనెడు
గుబ్బపాలిండ్లు గల్గువల్కుల వెలంది
సరసగుణహారు నోబయనరసధీరు
నవ్యకృతినాయకునిఁ గా నొనర్చెఁ గాత. ౪

శా. "గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గైకోక కావించి త
ర్ధాంగీకా"రమనం "బురంధ్రి! నిను వామాంగంబునం దాల్పనే
శృంగారోన్నతిఁ జూడు" మంచు గిరిజన్ శిరాపగాబింబిత
స్వాంగానందితఁ జేయుశంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్. ౫

చ. అరుదుగ వామభాగలలనాకలనాచలనాత్ముఁడైన యా
హరు గురుఁ గాంచి తానును దదాకృతి యాగతి నేకదంతుఁడై
కరికరిణీగుణంబులు ముగంబునఁ దాల్చి జగంబు లేలు నా
తరకరుణాసనాథు గణనాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్. ౬

సీ. తన యాస్యగహ్వరంబునకు ఖద్యోతజృం
భణము ఖద్యోతజృంభణము గాఁగఁ
దనకరాంభోజాతమునకలగంధమా
దన మొకగంధమాదనము గాఁగఁ
దనశౌర్యహర్యక్షమునకు మైరావణ
స్ఫురణ మైరావణస్ఫురణ గాఁగఁ
దనవాలదంభోళి కెనయుకర్బురగోత్ర
గరిమ కర్బురగోత్రగరిమ గాఁగఁ
తే. వఱలు రామానుజన్మ జీవప్రదాన
ధుర్యపర్యాయధాత మేదురవిరోధి
బలపయోధివిలంఘన వజలశక్తి
నోబయనృసింహభూభర్త కొసఁగుఁ గాత. ౭

## సుకవి ప్రశంస

సీ. ఎవ్వాఁడు మొదలఁ దాఁ గలుగు భారతి డించెఁ
దగ భగీరథుఁ డభ్రతటినిఁ బోలె
భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు
వాగ్దేవి దాసె యై వన్నె కెక్కెఁ
బరవృత్తములు మాని వాణి యెవ్వానికై
వలచి నానాశ్లేషములకుఁ జిక్కె
నెవ్వానివాఙ్మంత్ర మినుని ధాత్రికిఁ దెచ్చి
పేర్మితోఁ గరము లర్పించుకొనియె

తే. నట్టిమహిమాధికులఁ గొల్చి యఖిలమునివ
చోఽనుపమశక్తిభృతపురాణార్థవితతు
లనుఁగుఁ దెనుఁగనుభవ్యదివ్యాంజనముసఁ
గనుఁగొనఁగఁ జేయునంధ్రసత్కవులఁ దలఁతు. ౧

## కుకవినింద

సీ. ఏమహాత్ములు గల్గ భూమిశసభలలోఁ
గవులకు నధికవిఖ్యాతి గల్గె
నేకృతార్థులు గల్గ నెల్లపామరులకు
గణన మీరు ప్రబంధకములు గల్గె
నేవాజ్నిధులు గల్గ నిరవొందురసికుల
కమితలీలావినోదములు గల్గె
నేప్రవీణులు గల్గ నిల నలంకృతికృతో
ద్యములకు దోషలక్ష్యములు గల్గె

తే. నేదయాళులు బుధవచోహేతిచకిత
విసరదపశబ్దభరణలాలసముఖాబ్జు
లట్టినిఖిలోపకారధీరాత్ములయిన
సకలకవిధూర్తప్రవరులకు నంజలి యొనర్తు. ౨

## కృత్యవతరణిక

వ. ఇవ్విధంబునఁ బ్రారిప్సితగ్రంథనిర్విఘ్న పరిసమాప్తిసంప్రదాయా
విచ్ఛేదలక్షణనిబంధనంబుగా నిఖిలాభీష్టదేవతా నమస్కరణం
బును, సుకవిబహూకరణంబును, కుకవినిరాకరణంబును గావించి,
యుదంచితవిరించిసంచితప్రపంచచరదభంగ బుధపుంగవహృదయం
గమంబును, గంభీరరససముజ్జృంభితకవితాంభోధితరణకరణ ప్ర
గుణోపకరణపరిణతతరణిప్రకాండంబు, నశేషగుణదోషవిశేష
దుర్వారనీరక్షీరవివేచనోచితప్రశంసితహంసాయమాన ప్రతిభాను
బంధంబు నగునొక్క ప్రబంధంబు నిర్వర్తింపఁ బూనియున్నసమ
యంబున. ౧౦

సీ. లలితాకలంకకలాకలాపంబున
నేగాజు రేరాజు నేవగించు
భూభారభరణలీలాభిముఖ్యంబున
నేమేటి తామేటి నెగ్గులాడుఁ
చతురభాషామనీషావిశేషావాప్తి
నేభోగి యాభోగి నీసడించు
శరణాగతగణాతిభరణాధికగుణాప్తి
నేశౌరి యాశౌరి నేపు సూపు

తే. నతఁడు రిపుకాడఖర్వగర్వాంధకార,
గంధనిర్గంధనాంభోజబంధుబంధు
బంధురావార్యశౌర్యధురంధరుండు
సరసగుణహారుఁ డోబయనరసగుణుఁడు. ౧౧

వ. వెండియుం బ్రచండభుజాదండతాండవితమండలాగ్ర ఖండితారాతి
మండలుండును, నఖండనవఖండ పృథ్వీమండల ధురాభరణపరా
భూతఖండపరశుకుండలుండును, నజాండకరండచండిలయశఃపూర
కర్పూరహారుండును, సరస్వతీమనోభండార చౌర్యకారుండును,
సమరసమయసముజ్జృంభితజంభారిదోస్స్తంభసముత్తంభితదంభోళి
ధారా [illegible] లీలాహాళి

హాళికాసమారంభ సుభగంభావుకగంభీరవిజయభేరీ భయంకర భాంకారసంకరసముట్టంకితదిగ్విటంకుండును, నత్యుద్ధతరసురక్షోభ కరమదోన్మత్తదక్షోన్నతరక్షోవక్షోఽనక్షోదవిచక్షణాక్షీణ నృహర్యక్షరూక్షవీక్షణోద్భవదాశుశుక్షణిక్షణసముత్క్షిప్త కీలాకరాళావిచ్ఛిన్నాచ్ఛచ్ఛాయాచ్ఛటాపటిమఘటన పటు ప్రతాపవైభవుండును, నుభయరగండ, గండభేరుండాది బిరుదామందసందీపిత ప్రాభవుండును, నసాధారణ మేథావధీరిత వేధో మేధోవబోధ నిర్నిరోధమధురమధురసావధీరణ సమగ్ర వాగ్గ్రథన సుధీజన గృహద్వార నిర్నిద్రభద్రవారణ ఘటావికటకటకటాహతట పతద నూనదానాంభోఝురీపరిమళ పరిలుబ్ధలబ్ధామోద మేదుర భృంగీ తరంగితభంగీ ప్రసంగత ప్రసంగాంగీకృత నిరంతర దిగంతర విశ్రాంతవిశ్రాణనజయానకుండును, గుశికసుతకులజలధి జైవాతృకుండును, నానావిధఘానాధిక సేనాంబునిధానానుపమానావావమానానుపమితామోఘునై ఖరీ పరీతబరీదసపాద సప్తాంగహారణుండును భోజరాజవంశసంభవుండును, లక్ష్మాంబాగర్భపావనుండును, బరమ భాగవతసంభావనుండును, నోబభూపాలపుత్త్రివరుండును, గడి దుర్గస్థాపనాచార్యుండును, సత్యభాషాహరిశ్చంద్రుండును, నగు నృసింహక్షితీంద్రుం డొక్కనాఁడు రుచిరరుచిశుచితా విశేష దూషితోమర్భుధులు బుధులు,సరస్వతీప్రవాహసంతతవిహారమహా కవులు కవు, లజిహ్మజిహ్వారంగనృత్యదుత్తుంగగైర్వాణ వాణీ ప్రాకృతశౌర్యసేన్యపభ్రంశ పైశాచికామాగధులు మాగధులు, నటనజితమహానటులునటులు,వరయౌవన సౌందర్యవసతులు సతులు, నయవినయ సౌజన్యులు రాజన్యులు, అవధీరిత సురరాజమంత్రులు మంత్రులు, ప్రబలబలోద్భటులు భటులు, పురోహితులు, హితులు పౌరాణికులు, వైణికులు, గాయకులు, గణకులు నాదిగాఁ గల నిఖిల నియోగిజనంబులు బలసి కొలువ మణిమయాస్థానమధ్య భద్రాసనంబున సుధర్మాసీనుండగు శునాసీరుచందంబున నందంబు

  

సీ. శతలేఖనీపద్యసంధానధారేయు
ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యని
రోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య
సాధిత వ్యస్తాక్షరీధురీణు
నేకసంధోదితశ్లోకభాషాకృత్యు
చతురునోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
తే. నమితయమకాశునిధిఁ బ్రబంధాంకసింగ
రాజసుతతిమ్మరాజపుత్త్రి ప్రసిద్ధ
సరసవేంకటరాయభూషణసుపుత్త్రు
నను బుధవిధేయు శుభమూర్తినామధేయు. ౧౩

క. కనుఁగొని దయామరందము
కనుదమ్ములవెడల నుచితగౌరవలీలా
ఘనతరగభీరభావల
ననిమెన్న రసింహుఁ డభినవానందముతోఁ. ౧౪

సీ. బాణువేగంబును, భవభూతిసుకుమార
తయు, మాఘుశైత్యంబు, దండిసమత,
యలమయూరుసువర్ణకలన, చోరునియర్థ
సంగ్రహమ్ము, మురారిశయ్యనేర్పు,
సోముప్రసాదంబు, సోమయాజుల నియ
మంబు, భాస్కరునిసన్మార్గఘటన,
శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధి,
యమరేశ్వరునిసహస్రముఖదృష్టి,
తే. నీకకల దటుగాన ననేకపదన
సదనసంచారఖేదంబు గడలుపఱిచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె
మూర్తికవిచంద్ర విఖ్యాతకీర్తిసాంద్ర! ౧౫

ఉ. కావున నీయుదగ్రమతి గౌరవయోగ్యనిరూపణంబుగా
నీ వొనరింపఁబూనిన యనేకమహాకవివాఙ్మయోపకా
రావహమైనకావ్యము మదంకితమై వెలయంగఁ జేయు ము
ర్వీవలయప్రసిద్ధబుధవిస్మయదానధురంధరుం బుధా. ౧౬

వ. అని సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలజాంబూనదాంబరా
భరణచ్ఛత్రచామరాందోళికాచతురంతయానాగ్రహారాది ప్రదా
నంబుల బహూకరించుటయు నేను నానందకందళితతరంగితాంత
రంగుండనై. ౧౭

గ్రంథప్రస్తావిక

సీ. నిజరూపమునకు వన్నియఁ దెచ్చు వేళ్యాక్క
బెళుకొందు ధ్వని హీరకళిక లమర
ఛాయాంతరాలక్ష్యసహజతేజములైన
లక్షణావై దూర్యలక్ష్మ లలర
రతులతోఁ దులఁదూఁగు రసవిశేషములనఁ
దనరిన గారుత్మతములు బెడయ
గుణసువర్ణగుణైకగుంభితస్థితిఁ దాల్చు
నాయకనాయకోన్నతులు సెలఁగ

తే. నిల నలంకారనికరంబు లిరవుకొలిపి
కమలభవగేహినీపరిష్కరణకరణ
యోగ్యములుగా నొనర్చినభాగ్యనిధుల
భామహాదుల ననిశంబు ప్రస్తుతించి. ౧౮

క. వారిప్రసాదమున నలం,
కారము, ధ్వని, లక్షణాధికారరసాలం
కారము నొనర్తు నాంధ్రిప,
చోరచనఁజమత్క్రియాభిశోభితమతినై. ౧౯

అలంకారశాస్త్రప్రమేయము

తే. అసదృశరసప్రధానశబ్దార్థములును,
రీతులును, వృత్తులును, సల్కృతులు...

లాది యగులక్షణంబుల నలరుఁ గావ్య
సరణి యందు రలంకారసారవిదులు. ౨౦

క. ఈకావ్యలక్షణంబు ల
నేకులు దొల్లింటిపెద్ద లేర్పఱిచిన సు
శ్లోకనృపచరితనుతి దీ
ప్తాకలనయు నభినవాంధ్రకవితయు నరుదౌ. ౨౧

వ. ఏతత్ప్రబంధబంధురావ్యాజకావ్యాలాప లక్షణ కృతక్షణ ప్రసంగ సంగ్రహణ నిర్వహణకృత్యంబుగ నిత్యంబు నత్యంతకృతావ సరుండ నై. ౨౨

క. బంధురతరప్రబంధుల
బంధముల కనంతకీర్తిభాగ్యప్రదధౌ
రంధర్యగ్రంథిలము ప
సుంధర ననవద్యరమణసుగుణస్తవముల్. ౨౩

సీ. రామాయణాదిగ్రంథంబు లనవద్య
నేతృవర్ణనల వన్నియకు నెక్కె
వైశేషికాదినానాశాస్త్రములు శివ
ప్రతిపాదనమున సన్నుతి వహించె
సంధ్యాదిమంత్రము ల్సర్వేశ్వరనామ
జపసాధనతననశ్వరము లయ్యెఁ
బలుకు లొండొంటికిఁ బ్రమియ్యఁ లును బర
బ్రహ్మగోచరములై ప్రణుతిఁ గాంచె

తే. ననినఁ గావ్యం బమేయనాయకవికస్వ
రస్వరూపనిరూపణభాజి యగుట
వేఱ వివరింప నేల బంగారమునకుఁ
జటులసౌరభ్యలహరి యబ్బుట యె కాదె! ౨౪

శా. వేదంబుల్ నృపశాసనంబులు; సుహృద్విజ్ఞాపనంబు లురా
ణాదిగ్రంథము; లంగనాజనవిలాసాలాపలీలాసమ

ప్రాదుర్భావము లౌర! కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాద ప్రక్రియ నెన్నఁ; గావ్యమహిమ ల్వర్ణింపఁగాశక్యమే? ౧౫

మ. పరమజ్ఞానలతాలవాలము; జగత్ప్రఖ్యాతివిఖ్యాతసా
గరచంద్రోదయ; మిష్టసంఘటనరేఖా దివ్యధేనూత్తమం;
బురుకార్పణ్యదశానిశాదినముఖం; బుద్వేలనిర్వాణభ
వ్యరసాస్వాదరసాయనం; బనినఁ గావ్యం బెన్న సామాన్యమే? ౧౬

క. కావున నేవంవిధసుగు
ణావాసం బైన కావ్య మలరును నవర
త్నావేలహారవల్లిక
కై వడి ననవద్యనాయకభ్రాజితమై. ౧౭

మ. అని యూహించి మదీయసంఘటిత కావ్యాలంక్రియాసంగ్రహం
బనఘం బై వెలుఁగొందకున్నె రవివంశాధీశ్వరుం డౌ నృసిం
హనృపాలాగ్రణికీర్తివర్ణనముచే; నాకాంతవిశ్రాంతపా
వనమౌఁ గావున నందు నాయకమహావంశంబు వర్ణించెదన్. ౧౮

## కృతిపతి వంశావతారిక

సీ. శ్రీమించు పద్మినీభామామణి కినుండు
నిరతసంసారవార్నిధికిఁ దరణి
త్రిజగతీసజ్జనశ్రేణికి మిత్త్రుండు
బహుళతమోవనికి విభావసుండు
సమదమం దేహ దేహములకుఁ దపనుండు
చతురాగమార్గసంతతికి సవిత
సకలచోరపరంపరకు సహస్రకరుండు
వినతలోకవితానమునకు ద్యుమణి

తే. హరిహరవిరించి ముఖదేవతానుభావ
ఘనతరస్వర్ణరాసు లొక్కటియ కాఁగఁ
గరఁగికూర్చినయపరంజికడ్డి యనఁగ
సూర్యుఁడిరవొందుఁ దేజోనివార్యుఁడగుచు. ౧౯

క. అతనికి వైవస్వతమను
వతనికి నిక్ష్వాకునృపతి యతనికిఁ గుక్షి
క్షితిపతి యతఁడు వికుక్షిం
బ్రతాపఖనిఁ గనియె నతఁడు బాణునిఁ గనియెన్. ౩౦

సీ. అనరణ్యుఁడతని కాయనఘుఁడు పృథుఁగాంచెఁ
బృథుఁడు త్రిశంకుధాత్రీంద్రుఁగనియె
నతనికి దుంధుమారాభిఖ్యుఁ డతనికి
మాంధాత యతఁడు సుసంధిఁ గాంచె
నతనికి ధ్రువసంధి యతనికి భరతుఁ
డాధన్యున కసితుఁ డాతనికి సగరుఁ
డతనికి నసమంజుఁ డతఁ డంశుమంతునిఁ
గనియె దిలీపుఁ డాతనిసుపుత్త్రిఁ

తే. డతఁడు గాంచె భగీరథు నాత్మవంశ
పావనుని నాతనికిఁ గకుత్థ్సావనీశుఁ
డతఁడు రఘుఁగాంచెఁ గనియె నాక్షితితలైక
పతిసునాభాగు నతఁడు నాభాగుఁగాంచె. ౩౧

చ. అతనికి నంబరీషుఁ డయుతాయువు తత్సుతుఁ డవ్వసుంధరా
పతి గనియె న్మహాత్ము ఋతుపర్ణు నతండును సత్యకాము నా
తత బలుఁగాంచె నాతఁడు సుదాసునిఁ గాంచెఁ దదీయుఁ డస్త్రికుం
డతనికి మూలకుం డతని కాశతసంఖ్యరథుండు వెండియున్. ౩౨

క. ఘనుఁ డతఁ డైలబిలేంద్రునిఁ
గనియెం బృథుధర్మవిభునిఁ గనియె నతఁ డతం
డును విశ్వమహునిఁ గనియెం
గనియె న్ఖట్వాంగు నతఁడు గాంభీర్యనిధిన్. ౩౩

సీ. భవ్యుఁ డాతఁడు దీర్ఘబాహునిఁ గనియె నా
తఁడుగాంచె రఘువు నాతనికిఁ గలిగెఁ
బురుషాదుఁ డతనికిఁ బొడమెఁ గల్మాషపా
దుఁడు తత్సుతుఁడు శంఖనుఁడు సుదర్శ

నుఁడు దత్తనూజుఁ డాతఁడు గాంచె నగ్నివ
ర్ణమహీశు నతఁడు శీఘ్రుగునిఁ బడసె
నతనికి మరుఁడు దదాత్మజుఁడు శుకుఁ డా
తని కంబరీషుఁ డాతనికి నహుషుఁ
తే. డతనికి యయాతి నాభాగుఁ డతనికతని
కజుఁడు దశరథుఁ డతనికి నతనికొడవె
రామభద్రుఁడు దద్వంశరత్నమయ్యె
సారిది గలివేళఁ గరికాలచోళవిభుఁడు. ౩౪

సీ. ఏరాజువివిధపుష్పారాధనమున గం
గాధరు తలమీఁది కొంచు మాసె
నేరాజు దివ్యాన్నసారార్పణంబున
శితికంఠుమెడ నున్న చేఁదు మాసె
నేరాజురత్నోపహారానుభవభూతి
రుద్రు నెమ్ములదండరోఁత మాసె
నేరాజుకాంచనాగారారచనకేళి
భవునకు గిరు లెక్కపాటు మాసె
తే. జలధిదేవేరిఁ గావేరి జనులు సూడ
కుండ నాచ్ఛాదన మొనర్చునొఱపు మెఱయ
నుభయతటములఁ దరుపఙ్క్తులునిచె నేనృ
పాలుఁ డతఁడొప్పుఁ గరికాలచోళవిభుఁడు. ౩౫

చ. అతఁడు మహాదిగంతవిజయం బొనరించి సురాద్రి యవ్వలం
దతనిజమీనలాంఛన మొనర్చుటకై గిరిరాజుఁ ద్రిప్ప న
ప్రతిమతదీయదోర్యుగభరభ్రమితాచలశృంగసంగతా
మితజవరూఢి నేఁడును భ్రమించుఁ దదగ్రగతగ్రహావళుల్.
తే. శ్రీలఁ జెలువొందు నాకరికాలచోళ
కుంభినీనాథుకులమున సంభవించె
ఘనఖనిక్షోణి రత్నంబు గలుగురీతి
భోగసౌభాగ్యసురరాజు సోచిరాజు. ౩౬

సీ. తనకీర్తికజరవాహిని యీడుగామికి
                    నమ్మహానదితోడియమున సాక్షి
తనప్రతాపస్ఫూర్తికిను వేఁడి సరిగామి
                    కతనిబింబము దూఱునరులు సాక్షి
తనధైర్యమహిమకుఁ గనకాద్రి ప్రతిగామి
                    కచటఁ గాపున్నగోత్రారి సాక్షి
తనకాంతికి మృగాంకుఁ డెనగామి కతనిలో
                    సరిపొత్తు మనుకర్మసాక్షి సాక్షి
తే. గాఁగ విలసిల్లుననుపమక్షాత్త్రధర్మ
పరత నృపపఙ్క్తి కితఁ డొజ్జబంతి యనఁగ
రాజమృగరాజు వైభవరాజరాజు
భూరిసౌందర్యరతిరాజు పోచిరాజు. ౩౮

క. ఆపోచిరాజవంశసు
ధాపారావారమునకుఁ దారాపతి యై
యే పొందుఁ దిరుమలక్ష్మో
ణీపాలుఁ డనంతకీర్తినిత్యోజ్జ్వలుఁ డై. ౩౯

సీ. రక్షించినాఁడు హిరణ్యధారావృష్టిఁ
                    జతురార్థిసంఘాతచాతకముల
శిక్షించినాఁ డుగ్రకౌక్షేయపవిధారఁ
                    బ్రతిపక్షగిరిలక్షపక్షగరిమ
వీక్షించినాఁడు సద్విభవావహవివాహ
                    సదనంబుఁ గదనంబు సరియ కాఁగఁ
బ్రోక్షించినాఁడు సంపూర్ణదయాధార
                    వితతాపదాతపావృతులమీఁద
తే. నతఁడు రాజన్యమాత్రుఁడె యవధిశిఖరి
చరమగహ్వరబంహిష్ఠజరఠతిమిర
పటలపాటనపటుమహోభాస్వరుండు
రాజకులహేళి తిరుమలరాయమౌళి. ౪౦

క. ఆరాజశిఖామణికిఁ
ధీరాత్ములు తనయులైరి తిప్పవిభుఁడు గం
భీరరణాంభోరాశి య
పారకృపామూర్తి వల్లభక్షితిపతియున్. ౪౧

వ. అం దగ్రజుండు. ౪౨

సీ. తనజయధ్వజమారుతములు వైరికిరీట
ఖచితమణీదీపకళల నలువఁ
దనశిలీముఖము లుద్ధతవిరోధిశిరోధి
జలజశోణితరసాసవము లానఁ
దన తేజము లరాతిధరణీశ మదవతీ
శబరికానిబిడాంధకార మడఁప
దన వాహినీప్రౌఢి దర్పితప్రతికూల
భూమిభృన్మదభేదమునఁ దలిర్ప
తే. రాజ మాంధాత యనఁ బొల్చు రసికలోక
సతతసంరక్షణాస్తోకజాగరూక
నవనవానందహృల్లగ్న నందగోప
బాలకుం డైనతిప్పభూపాలకుండు. ౪౩

తే. అతఁడు రామప్రభుని బానెమాంబయందు
నాబళేంద్రుని లక్కాంబయందుఁ గనియె
జలజనయనుండు రుక్మిణీజాంబవతుల
యందుఁ బ్రద్యుమ్నసాంబుల నందినట్లు. ౪౪

క. వారలలోన ధురంధరుఁ
డై రామనృపాలుఁ డమరు నమరపురంధ్రీ
చారుకరగ్రహలీలా
కారణధారాగ్ర కుటిలకౌక్షేయకుఁడై. ౪౫

చ. హరిభజనప్రవీణుఁ డగునాధరణీంద్రుఁడు వైచమాంబికం
బరిణయమై తనూభవులఁ బ్రాజ్ఞులఁ దిమ్మనృపాలు నోబభూ

వరు వరదేంద్రుఁ దిప్పమహీవల్లభుఁ బానమరాజు వేంకటే
శ్వరు నిలఁ జక్రివర్తి సదృశప్రథితాత్ములఁ గాంచె నార్యురన్.

చ. అరయఁగ నమ్మహీవరుల కగ్రజుఁ డైతగు తిమ్మరాజు ని
ర్భరతరధాటికాతురగపాటనమూర్ఛిత యా ధరాతలో
దరికి నిరామయౌషధవిధానము నిర్జరవైద్యు వేఁడఁగా
నరిగెడులీల నద్భుతసమగ్రరజోవ్రజ మేఁగు నింగికిన్. ౫౭

క. ధర నతఁడు రామనృపసో
దరి యగుకొండాంబయందుఁ దనయునిఁ గాంచెన్
నరనుతు నెఱవేంకటవిభు
హరిసిరియండతనుఁ గన్నయాకృతి దోఁపన్. ౫౮

క. ఆ వేంకట భూపాలు మ
హావితరణమెన్నఁ జిత్రమర్థులకు నతం
డే వేళ నొసఁగ నేర్చియు
నావలయాచకుల లేమియాపాదించెన్. ౫౯

సీ. మిత్త్రిగేహములనమిత్త్రిగేహమ్ములఁ
గనకసంఘాత మేఘనుఁడు నిల్పె
ధర్మాగమమున సద్ధర్మాగమమున సి
ర్భరగుణారోప మేరాజొనర్చె
విగ్రహంబున భీమవిగ్రహంబున మహా
విషమాంబకత్వ మేవిభుఁడు దాల్చెఁ
గృతులయందును బలాకృతులయందును రాగ
భరితవీక్షణ మేనృపాలుఁ డునిచె

తే. జగతి నేరాజు కువలయోత్సవ మొనర్చు
రాజుగావున; నదసీయరక్షచేతఁ
గోరి యన్వర్థ మగుఁజంద్రిగుప్తదుర్గ;
మతఁడు విలసిల్లు వేంకటక్షితివరుండు. ౬౦

తే. అతఁడు తిమ్మాంబయందుఁ దిమ్మావనీశుఁ
జిన్నతిమ్మప్రభునిఁ గాంచె సీతయందు

రవికులోద్ధారకుం డైన రాఘవుండు
గరిమఁ గుశలవవీరులఁ గన్నకరణి. ౫౧

క. ఈసంతతిఁ దగు తిమ్మ
క్ష్మాసుతాగ్రిమునకుఁ గూర్మి సహజన్ముఁ డనన్
భాసిల్లు నోబనృపతి శు
నాసీరమహీజవితరణగుణాస్పదుఁ డై. ౫౨

చ. సరసనఖప్రసూనభుజశాఖలఁ జెంది వచోమరందమా
ధురిఁ జెలు వొంది కీర్తి యనుతోరపువాసనఁ బొంది సొంపునం
బరఁగుదళంబులం బ్రబలి పండితకీరపరంపరాఫల
స్ఫురణ మొసంగు నోబనృపపుంగవుఁ డాశ్రితపారిజాత మై. ౫౩

ఉ. భూనుతశౌర్యుఁ డోబనృపపుంగవుఁ డుగ్రరణోర్వి భీమబా
హానిశితాసిధార ననతాహితకోటియుదస్తహస్తము
ల్పూని వారింపఁ దద్గళితభూరిసముద్గతఖడ్గము ల్వర
స్నానము చేసిన ట్లమరు సారెకు వారికి నూర్ధ్వయాత్రకున్. ౫౪

క. అతఁ డోబలాంబయం ద
ప్రతిముని నోబళనృపాలు రామమహీశున్
క్షితిఁ గాంచె విద్యయం ద
ద్భుతధీనిధి వినయబోధములఁ గాంచుగతిన్. ౫౫

క, తదనుజుఁడు వరదభూపతి
సుదతీమకరాంకుఁ డమరు సురపురవనితా
విదితవరదానచాతురి
గదిసినయాత్మీయనామకము సార్థముగన్. ౫౬

వ. తత్క్రమంబున,

సీ. అవనీనభోంతరం బాస్యరంధ్రము గాఁగ
ఘనపంక్తి మోము పైకప్పు గాఁగ
హిమశైలవింధ్యశైలములు కొమ్ములుగాఁగఁ
[illegible] గాఁగ

శరధులు నాలుగు గొరిజెపట్టులు గాఁగ
నైలింపనది గంగడోలు గాఁగ
వాసుకి యాభీలవాలదండము గాఁగఁ
దారకల్ కింకిణీతతులు గాఁగ
తే. గరిమఁ జెన్నొందు బసవశంకరమహోక్ష
మాజి నేరాజశేఖరుం డావహించె
నతఁడు నిలువెల్లమగఁటిమి యనఁగ బరఁగు
రామవిభుతిప్పశౌరి నిర్వారితారి. ౫౭

సీ. బలధూతధూళిచేఁ బందిళ్ళు సమకట్టి
యహితరక్తము కలయంపి చల్లి
నవయశోరుచివితానవితానములు గట్టి
వివిధవాద్యధ్వను ల్వేలయఁ జేసి
విమతాస్థిపటలచూర్ణముల ముగ్గులు పెట్టి
ద్విజపరంపరలకు విం దొనర్చి
దళితారికుంభిముక్తాఫలంబుల సేస
చల్లి ప్రతాపాగ్నిసాక్షి గాఁగ
తే. మెఱయు నేరాజు విజయలక్ష్మీవివాహ
విదితసన్నాహుఁడై యతఁ డదురుచుండె
పిఱికికండయు లేని గభీరఘోర
రాజమోత్సాహి పానెమరామవిభుఁడు. ౫౮

చ. అతనిసహోదరుండు చతురంబుధివేష్టితభూధురంధరుం
డతులితశౌర్యభీకరభుజాగుళిఁడు వేంకటరాజు వొల్చు నా
క్షితిపతి దానవాసనల ఖేచరశాఖిఁ దిరస్కరింపఁగా
వితతతదీయదుర్యశము విస్ఫుట మూ నలిమండలాకృతిన్. ౫౯

క. ఈవంశకర్త యగుతి
ప్పావనిపాలునకుఁ గూర్మియనుజన్ముఁడు దా
నై వెలయు న్వల్లభధా
త్రీవల్లభుఁ [illegible] ౬౦

సీ. కమలాప్త కమలాప్తసన్నిభుం
డేవిభుండు రుచి ప్రభావ దయల
గోరాజ గోరాజ గోరాజసంకాశుఁ
డేరాజు మతి భోగ గౌరవముల
హరిపుత్రి హరిపుత్రి హరిపుత్రి సదృశుఁడే
ధన్యుండు జయరూప దానవిధుల
నాగారి నాగారి నాగారికల్పుఁ డే
మేటి ప్రాభవ వేగ పాటవముల

తే. నతఁడుసువిచారుఁడవికారుఁడనఘుఁడలఘుఁ
డప్రమేయుఁడజయ్యుఁడతిప్రతాపుఁ
డప్రతీపుఁ డనేకలోకాభినంద్య
చరితుఁ డింపొందు వల్లభక్ష్మావరుండు. ౬౧

ఉ. వల్లభరాజశౌర్యగుణవైభవ మెన్న విచిత్రమమ్మహీ
వల్లభువైరిరాజి వనవాటికనుండి నిజాంబుజాస్య త
న్వల్లభ! యంచుఁ బిల్వఁగ నవార్యతదుజ్జ్వలనామసంస్మృతిం
బెల్లువడంకుఁ గాంతపయిఁ బ్రేమము గొంత నెపంబుసేయుచున్. ౬౨

క. అతులప్రతాపుఁ డా భూ
పతిసోమల్దేవియందుఁ బ్రబలుని దిమ్మ
క్షితిపాలునిఁ గాంచెం బశు
పతి పార్వతియందు గుహునిఁ బడసినభంగిన్. ౬౩

సీ. భోగి మట్టినవానిఁ భోగిఁజుట్టినవాని
భోగిఁ బట్టినవానిఁ బోలనేర్చుఁ
దమ్మిఁ దాల్చినవానిఁదమ్మి దొల్చినవానిఁ
దమ్మి మొల్చినవానిఁ దారసించు
మృగమునుంచినవాని మృగముఁ ద్రుంచినవాని
మృగముఁబొంచినవానిమీఁజజాలుఁ
గొండ నెక్కినవానిఁ గొండఁ జెక్కినవానిఁ
గొండఁద్రొక్కినవానిఁ గొనసేయు

తే. భరణభూతిజవప్రభాబాహుశక్తి
మతికళాశౌర్యసత్యశుంభత్ప్రభావ
భోగగాంభీర్యగుణములం బుడమి నేన్ప
పాలకులు సాటి యాతిమ్మపార్థివునకు? ౬౪

తే. అతఁడు గంగాంబయందాబళావనీంద్రు
మూర్తిఘను సింగవిభుఁగాంచెఁ గీర్తినిధుల
నత్రి యనసూయయందు మున్నబ్జగర్భ
కమలనాభశివర్గులఁ గన్నయట్లు. ౬౫

ఉ. వారలలో గభీరగుణవారిధి వారిధిపంక్తిలో సుధా
వారిధి వోలె భూమిధరవర్గములోఁ గనకాద్రి వోలె దో
స్సారము ధీరముం దెగువ సత్యము శౌచము సద్విచార మా
చారము గల్గి పొల్చె బుధసన్నుతుఁ డౌబళరాజు ధన్యుఁ డై. ౬౬

సీ. అప్పుపాలైనశుభ్రాబ్జంబు రుచి యెంత?
మాటమోచినయంచ తేట యెంత?
నీళ్ళు మోచినభవానీభర్తకలి మెంత?
బిలము దూఱిన శేషుబలిమి యెంత?
తమ్ములతోఁ బోరు తారేశుకళ యెంత?
తృణ మైనశరపుంజదీప్తి యెంత?
పండ్లిగిలించుకల్పకశాఖదళ మెంత?
విరిసినమల్లెలవీఁక యెంత?

తే. యనుచుఁ దనకీర్తిధవళాబ్జహంసమదన
మథనవరభోగివిధుశరామర్త్యవిటపి
వికచవిచికిలమాలికావితతిఁ దెగడ
వసుధఁ బాలించు నోబభూవల్లభుండు. ౬౭

సీ. ఇతని వైరులు వనప్రతతిలోఁ గాఁపుండ
నన్వర్థ మై ధాత్రి యవని యయ్యె
నితఁ డంతరీపంబు లేల ముద్రాసము
న్ముద్ర మై జలధి సముద్ర మయ్యె

నితనియాలము నూచి యెల్లవేల్పులు నిమే
షము మాన ననిమేష సంజ్ఞఁ గనిరి
యితనిసేనాధూళి హిమసేతువులు గప్ప
గౌరీశుఁ డపుడంధకారి యయ్యె

తే. నితనికరుణాంబురాశిసంభృతతరంగ
సంగతంబైనమనమున సంచరించు
శౌరి నారాయణుం డయ్యె జగతి ననుచు
సుకవులు నుతింతు రాబళక్షోణివిభుని. ౬౨

వ. తత్క్రమంబున. ౬౩

సీ. చతురాననాధికశ్రుతిహితశీలుఁ డై
విబుధాన్నదాన ప్రవీణుఁ డగుచు
వసుమతీభారధూర్వహుఁ డై నృసింహతా
భ్రాజి యై బలిశిరోరత్న మగుచు
నర్జునకరగర్వహరణసత్కీర్తి యై
యతనుశాత్రవధర్మహారి యగుచుఁ
గామపాలాఖ్యుఁ డై గరిమసర్వజ్ఞుఁ డై
నరవరోచిత మైననడత యెఱిఁగి

తే. శౌరి బహురూపవితరణశ్రమముఁ జెంద
లేక యన్నిగుణంబులు నేకమూర్తి
యందు నిరవొందఁ జేసినయట్లు వొల్చు
మూర్తినిర్జితరతిరాజు మూర్తిరాజు. ౭౦

చ. చిరతరకీర్తిమూర్తినృపశేఖరుఁ డాహవదుర్మదారిభూ
వరులఁ గరాగ్రలోలకరవాలముఖమ్మున గ్రుచ్చి యుత్తుఁ ద
ద్వరవరణాభిలాషయుతవాసవలోకవిలాసినీపరం
పరలకు వీరు వల్లభులు పట్టుఁ డటంచు నొసంగుకై వడిన్. ౭౧

సీ. గురువనీపకుల కాదర మొప్పఁ గొండసి
యొసఁగియుఁ గొండని యొసఁగకుండు
నమితలావణ్యలీలావాప్తి వేమారుఁ
గినిసియు వేమారు గినియకుండు
వరకీర్తిచే సుధాకర దేవసరసుల
నాడియు సరసుల నాడకుండు
నరులపై నిశితసాయకపంక్తి చేపట్టి
విడిచియుఁ జేపట్టి విడువకుండు
తే. ఫణిపతికి నైన భారతీపతికి నైనఁ
బశుపతికి నైన నలబృహస్పతికి నైన
నవని నవలీలఁ బొగడంగ నలవిగాని
చరితములఁ బొల్చు నాసింగజనవిభుండు. ౨౨

చ. చకచకమించుసింగనృపచంద్రుని శాతకృపాణవల్లిలోఁ
బ్రకటవిరోధియోధరథభద్రగజాశ్వవరూథినీకదం
బకములు గాన వచ్చు సులభప్రతిబింబితమూర్తులై మహా
జకలితసాధ్వసోదయముచే నసిగర్భముఁ జొచ్చెనో యనన్. ౨౩

తే. ఇట్లు సుగుణాభిరాములై యెనయుమూర్తి
ఘనుఁడు సింగక్షితీంద్రుఁడుఁ దను భజింప
నెలమి భీమార్జునులఁ గొల్వ నింపుమీఱు
ధర్మసుతుమాడ్కిఁ దగునోబధరణివిభుఁడు. ౨౪

సీ. ఘనభుజాశౌర్యరాఘవుఁడు రాఘవతిప్ప
ధరణీశుఁ డేరాజు తాతతాత
నరనుతుఁ డైనపిన్నమరాజు సౌజన్య
ధన్యుఁ డేరాజున్కు తాతతండ్రి
యమితవైభవుఁ డైనయార్వీటిబుక్కభూ
తలనాథుఁ డేరాజుతండ్రితండ్రి
యసమానదానవిద్యాధురంధరుఁ డగు
రామరాజేంద్రుఁ డేరాజుతండ్రి

తే. యట్టిసోమాన్వయాబ్ధిశీతాంశుఁ డనఁగ
నమరు శ్రీరంగవిభుపుత్త్రియై చెలంగు
లక్కమాంబను వరియించె లలితశీల
నమ్మహాసాధ్విసోదరు లధికయశులు. ౭౫

క. కోనక్షితిపతి, తిమ్మమ
హీనాథుఁడు, రామనృపతి, యెఱతిమ్మధరా
జానియును, వేంకటేంద్రుఁడు,
భూనాయకతిలకు లగుచుఁ బొల్తురు ఘనులై. ౭౬

వ. అం దగ్రజుండు. ౭౭

సీ. లాటీకుచాభోగపాటీరపంకంబు
భోటీముఖాబ్జకర్పూరకలన
గౌళీనవీనాంకపాళీదుకూలంబు
చోళీకుచాళీప్రసూనరాజి
యంగీముఖాభంగసంగీతవాణి క
ళింగీవిలాసకేళీమరాళి
భోజీకరస్వచ్ఛరాజీవకాంతి కాం
భోజీ మహాహీరముకురరేఖ

తే. కుంతలీకర్ణమౌక్తికకుండలప్ర
కాశ మెవ్వానియభినవాకాశదేశ
చంద్రికాయితసత్కీర్తిజాల మతఁడు
ప్రబలు శ్రీరంగవిభుకోనపార్థివుండు. ౭౮

వ. తదనుజుండు. ౭౯

శా. శ్రీరంగప్రభుతిమ్మశౌరి భుజకౌక్షేయంబుచే నాజుల
న్వీరారాతులఁ ద్రుంప నాక్షితిపతు ల్వేవేగ మార్తాండునిం
దూఱందూఱఁ దదీయమండలసముద్భూతవ్రణశ్రేణికిన్
నీరంధ్రాభ్రపథచూర్ణభాతిఁ దగు నెంతేఁ దచ్ఛమూరేణువుల్.

వ. తత్క్రమంబున. ౮౧

సీ. ఖలు నరి ద్రోహి సల్కయతిమ్మని హరించి
సకలకర్నాటదేశంబు నిలిపె
నతుని వర్ధితునిఁ దత్సుతునిఁ బట్టముఁ గట్టి
కుతుపనమల్కన క్షోణి నిలిపెఁ
బదిలుఁ డై రాచూరుముదిగల్లుగవ్వంబు
సేయఁ గాంచి సపాదసీమ నిలపె
శరణన్నమల్కనిజాముని కభయం బొ
సంగి తదీయరాజ్యంబు నిలిపె
తే. నవని యంతయు రామరాజ్యంబు సేసెఁ
దనగుణంబులు కవికల్పితములు గాఁగ
నలవియె రచింప సత్కావ్యములను వెలయ
భూమి నొకరాజమాత్రుఁడే రామవిభుఁడు. ౮౨

సీ. ఖరదూషణాఖర్వగర్వనిర్వాపణం
బాజి నెవ్వానిసాయకనికాయ
మధికతారావరావహంకారవారణో
ద్వేల మెవ్వనియశోవిమలశోభ
వివిధారికామినీవిఘటనాటోప మే
యవనీశురోషారుణాక్షి రేఖ
పౌలస్త్యసిరసనపౌత్రిఘూఘాకితం
బే రాజుచారిత్రిచారుభూతి
తే. యతఁడు కలియుగనవ్యరామావతార
చారుతాసార్థనామప్రచారుఁ డగుచు
వెలయు బ్రహ్మాండపేటికావితతకీర్తి
ధనుఁడు శ్రీరంగవిభునామధరణిధవుఁడు. ౮౩

సీ. తనభుజాదండకోదండ మఖండమై
యను వేలశరవృష్టి నాచరింపఁ
దన హేతిశతకోటిఘనధాళధళ్యమై
ప్రతిపక్షగిరిభిదాపటిమఁ నెఱపఁ

దనవిగ్రహంబు సజ్జనమనోహారియై
మంజుఘోషాశ్లేషమహిమఁ జెలఁగఁ
దనవైభవంబు సంతానసమగ్రమై
సురభిసంభృతగుణస్ఫురణఁ జెంద
తే. రాజదేవేంద్రుఁ డితఁ డనఁ దేజరిల్లు
ననఘచాళుక్యనారాయణాంకవివిధ
బిరుదమన్నవిభాళాదిబిరుదశాలి
ప్రాభవోపేంద్రుఁ డెఱతిమ్మపార్థివుండు. ౧౪

సీ. అసురారిరాణి నే నధివసించుట యెట్లు
బహువిధానురవంశభవులయందు
సురలోకధేనుసోదరి నేను నిలుచుటె
ట్లకట గోఘాతపాతకులయందుఁ
ద్రైలోక్యమాత నేఁ దగిలియుండుట యెట్లు
త్రైలోక్యకంటకోద్ధతులయందు
దేవతారాధ్య నేఁ దిరముగాఁ దగు టెట్లు
కడుదేవతాద్రోహకరులయందు
తే. ననుచు యవనులఁ దెగడి తన్నాశ్రయింప
వచ్చుసామ్రాజ్యలక్ష్మి నెవ్వాఁడుగొనియె
నాహవోగ్రబరీదసప్తాంగహరణుఁ
డతఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రివిభుఁడు. ౧౫

మ. ప్రతికూలావనిభృద్విభేదనకళాపారీణమై సంగర
క్షితిలో వేంకటరాజశేఖరునికౌక్షేయంబు కృష్ణాధిక
ద్యుతిఁ జెన్నొందఁ దదీయధారఁ బడి కా! దోషాకరు ల్యావన
క్షితిపు ల్గాంచిరి నాకలోకవనితాశృంగారసాంగత్యముల్. ౧౬

మ. బలధుర్యుం డగు వేంకటేంద్రునిమహాబాహాబలాటోప వి
హ్వలుఁడై మున్నతిధావనక్రియ నపాదాభిఖ్యుఁడై నట్టియే
దులఖానుం డిదె నేఁడు గ్రిమ్మఱ సపాదుం డయ్యెనా నర్మిలిం
తలఁ దత్పాదముఁ దాల్చె భీమనదిపొంతం గాన విల్లోన్నతిన్.

మ. స్థిరసంగ్రామజయాభిరాముఁ డగునా శ్రీ వేంకటస్వామివరుం
డరయన్ రాజశిఖావతంసుఁ డగుఁ దథ్యం బుర్విఁ ; గా కున్న నీ
ధరణీపాలుర లెల్ల మెచ్చఁగ సపాదక్ష్మాణిభృత్ప్రాప్తథా
సురదుర్గాధిపతిత్వవైభవభవస్ఫూర్తి న్విజృంభించునే? ౮౮

క. ఈ రాజమనుజులసోదరి
యై రాజిలు లక్కమాంబ యమృతాశనధా
త్రీరుహముల కై దింటికి
నారయఁ దోఁబుట్టు వగు రమాంగనపగిదిన్. ౮౯

సీ. ప్రతివచ్చునన్నపూర్ణాదేవి భైక్షాన్న
మిడక సంయమి నలయింప కున్నఁ
బాటి సేయఁగ వచ్చు భాగీరథి నభంబు
ముట్టి పెన్ఱాఁగయై మొరయ కున్న
సరి వచ్చు భూకాంత సకలప్రజాధార
పూర్ణానమహత్వంబుఁ బూన కున్న
రూపింపవచ్చు నరుంధతి నేప్రొద్దుఁ
దనయల్పభావంబుఁ దాల్ప కున్న
తే. నిమ్మహాసాధ్వి కని జను లెల్లఁ బొగడ
నలరు నోబక్షితీశు నర్ధాంగలక్ష్మి
బాంధవావనధుర్యవైభవకదంబ
లలితసద్గుణనికురంబ లక్కమాంబ. ౯౦

క. పౌలోమికి నిందునకు మ
హాలలితాకృతి జయంతుఁ డాత్మజుఁ డైన
ట్లాలక్కమాంబ కోబన్ప
పాలునకు నృసింహధరణిపతి జనియించెన్. ౯౧

సీ. కాశ్యపి తానొటఁ గశ్యపోద్భవుఁ డైన
కాకోదరస్వామిఁ గలయు నెట్టు
ధాత్రి యా తనపయోధారచేఁ బెరిగిన
కమఠకులాదీశుఁ గవయు నెట్టు

తగఁ ధేను వగఁ పేళఁ దర్శకం బగుధరా
ధరశిరోమణిఁ గూడఁ దలఁచు బెట్టు
తనక యావిర్భవించినవంచనామహా
క్రోడంబుతోఁగూడి యీడు బెట్టు
తే. తగవుగా దంచు ఫణికూర్మకరణిధరవ
రాదిభూదారముల మాని యవనికాంత
తనభుజాదండమున నుండఁ దనరుచుండు
సరసగుణహారి యోబయనరసశౌరి. ౯౨

క. అతఁ డిల రామయతిమ్మ
క్షితిపతిసత్పుత్త్రిఁ డగుచుఁ జెలు వొందుగుణా
న్వితుఁ డగుతిరుమలధాత్రీ
పతితనయం దిరుమలాంబఁ బరిణయ మయ్యెన్. ౯౩

సీ. పోలు పను నేసాధ్వీభుజవల్లి రుక్మిణి;
సత్య యేగరితవాచావిశుద్ధి;
జనకనందన యేవిశాలాక్షిమతి రేఖ;
భద్ర యేమగువ శోభనవినీతి;
యనసూయ యేకుటుంబిని దృష్టి; సర్వమం
గళ యేశుభాంగనలలితరీతి
ధృతి సుదక్షిణ యేపతివ్రత; కరుణ సం
పత్కాంత యేయింతి భవ్యమూర్తి
తే. యట్టిగుణధన్యయై తనయాత్మయెల్ల
నిఖిలపతిదేవతా సంగ్రహం బనంగ
నలరు నరవీరవల్లి తిమ్మావనీంద్ర
శరధిమందారవల్లియై తిరుమలాంబ. ౯౪

తే. ఆమగువయందు నరసింహభూమివిభుఁడు
లసిత సారంగ రాజు శ్రీరంగ రాజుఁ
గనియె ననఘుని దేవకీకాంతియందు
ఘనుఁడు  ౯౫

క. అతఁ డుభయవంశపావనుఁ
డితఁ డన బాలార్కవిజయహేవాకవిభా
వితతియు నమందమంద
స్మితచంద్రాతపముఁ దాల్చు శ్రీరంజితుఁ డై. ౯౬

సీ. ఘనతఁ జేసాఁప నేర్చిన నాఁటనుండియు
శత్రులమీఁద జేఁ జాఁప నేర్చె
ననయంబు నడుగు వెట్టిననాఁటనుండియు
నరిశిరంబులమీఁదఁ నడుగు వెట్టె
నవనీతము గ్రసించునాఁటనుండియు వైరి
కులయశోనవనీతములు గ్రసించె
నవపాంసుగతిఁ జెందునాఁటనుండియు ఖలా
భీలధాటీపాంసుకేళిఁ జెందె
తే. నిలువ నేర్చిననాఁటనుండియు విరోధి
నృపతిసేనాపతుల గెల్చి నిలువ నేర్చె
నరసవిభునిసిరంగభూనాథవిభుఁడు
ప్రబలెఁ బ్రబలుచునున్నాఁడు ప్రబలఁగలఁడు. ౯౭

వ. ఈకుమారనారాయణుం గాంచిన రాజన్యపుంగవునకు. ౯౮

క. ఏతాదృశగుణమణికి, ధ
రాతలపరిపూర్ణకీర్తిరమణికి, జలధి
వ్రాతవృతధరణిభరణస
మాతతనిజభుజభుజంగమగ్రామణికిన్. ౯౯

క. ధన్యునకుఁ, దరణికులమూ
ర్ధన్యునకు, నిజప్రధానిరస్తవదాన్య
మ్మన్యున, శరాతినృపప
ర్జన్యనిబంధనవిశేషశతమన్యునకున్ ౧౦౦

క. అజరగజరజతరజనికృ
దజతను జమ్మూ[illegible]జపురజిదభుజగగజబు

ద్విజవిజయినిజయశ్లోమయ
సుజననుతధ్వజున, కధికశ్లోభానిధికిన్; ౧౦౧

క. గండరగండని, కభినవ
మండలికాఖండమన్నమార్తాండునకున్,
జండప్రతాపపిహితా,
ఖండునకున్ లోభిమన్నియరగండనికిన్; ౧౦౨

క. లక్ష్మాంబానందనునకు,
దిక్కాంతాచికురసికరదీపితకుసుమ
స్రక్కాంతదంతురయశ్లో
ధక్కాసిధి. కహితకరిఘటాభీతునకున్; ౧౦౩

క. గాధేయగోత్రసవనఘు
రాధేయున, కఖిలసుకవిరాజకళాధా
రాధేయదానవిద్యా
రాధేయునకును, ధరామరవిధేయునకున్. ౧౦౪

క. గర్వితబరీదసేనా
సర్వస్వహరానివార్యశౌర్యునకు, సమి
ద్దూర్వహసపాదభయదా
ఖర్వమహావిజయభేరికాఘాంకృతికిన్; ౧౦౫

క. పీననమల్కాస్థాపన
మానితకరుణాప్రసంగమాంగల్యునకున్,
ధీనిధికి, నృహరిచరణ
ధ్యానవిధానావధానధౌరేయునకున్; ౧౦౬

క. తొరగంటి దుర్గరాజ్య
స్థిరసింహాసననివాస దీక్షానిధికిన్
వరయంత్రమత్స్యభేదన
బిరుదోద్దండునకు గండభేరండునకున్. ౧౦౭

క. ప్రతిదినకనకవసంతా
ర్జితకృతికాంతునకుఁ, దురగరేవంతునకున్,

గ్రితుపురనారాయణగృహ
వితతప్రాకారఘటనవిఖ్యాతునకున్, ౧౦౮

క. అరుణాకర కరుణారస
పరిణామసమగ్రనయనపద్మాభునకున్,
శరణాగత భరణాపర
నరసింహున, కోబశౌరినరసింహునకున్ ; ౧౦౯

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన యిమ్మహా
లంకారప్రబంధంబునకు నాదికారణం బగు నాయకగుణవ్రాతం
బభివర్ణించెద. ౧౧౦

# ప్రథమాశ్వాసము

## నాయకగుణములు

క. కులము, మహాభాగ్యము, సు
జ్జ్వలత, యుదారత, మహావిశాలత, ధర్మా
కలనయు, వైదగ్ధియు. నన
నిలనాయకగుణములగురు; నివియేర్పడఁదుర్క. ౧౧౧

ప్రతాపరుద్రీయ కర్తయగు విద్యానాథునివలెనే రామరాజభూషణుఁడును
మొట్టమొదట నాయకగుణములను గూర్చి వచించెను. విద్యానాథుఁడు "పూర్వాల
యలంకారగ్రంథములు పెక్కున్నను దా నాగ్రంథమును వ్రాయుటకుఁ గారణ
మిట్లు తెలిపెను. "పూర్వాలంకారగ్రంథములందు దేనియందును నాయకాలాగ్ర
ముగా నొకే నాయకుఁడు వర్ణింపఁబడలేదు. కావ్యమహత్త్వము నాయకునిఁబట్టి
యుండును. కావున లోకోత్తరనాయకుఁ డగు ప్రతాపరుద్రుని నాయకునిగా పరి
యించి యీగ్రంథమును వ్రాయుచున్నాను." రామరాజభూషణుఁడును నిందలిఆరె,
ఆరు పద్యములచే నీ యాశయమునే తెలిపెను. వానిని మరల నిటనుదాహరింతును.

"కం. బంధురతరప్రబంధుల । బంధములకనంతకీర్తి భాగ్యప్రద థా
రంధర్యగ్రంథిలము వసుంధర, ననవద్యరమణ సుగుణస్తవముల్.

అనవద్యుఁడగు రమణుని (నాయకుని) సద్గుణస్తవము (వర్ణనము) బంధురతర మైన
ప్రబంధుల మైన (మిక్కిలి సుందరము లైన) బంధములకు (కావ్యబంధములకు) గీర్తి
భాగ్యము నిచ్చుటయందు సమర్థము. అనఁగా నాయకునిఁబట్టి కావ్యబంధములకుఁ
గీర్తివచ్చును.

సీ. రామాయణాదిక గ్రంథంబులనవద్య, నేతృవర్ణనల వన్నియకునెక్కె;
వైశేషికాదినానాశాస్త్రములు శివ, ప్రతిపాదనమున సన్నుతివహించె;
సంధ్యాదిమంత్రముల్ శశ్వదీశ్వరనామ, జపసాధనతననశ్వరములయ్యెఁ;
బలుకులొండొంటికిఁ బ్రామిన్కులును బర,బ్రహ్మగోచరములై ప్రణుతిఁగాంచె;
గీ. ననినఁ గావ్యంబమేయనాయకవికస్వ,రస్వరూపనిరూపణ భ్రాజియగుట
వేఱవివరింపనేల? బంగారమునకుఁ, జటులసౌరభ్యలహరి యబ్బుటయ కాదె?"

రామాయణాది గ్రంథములు నాయకునిఁబట్టియే ప్రసిద్ధి వహించినవి. వైశేషికాది శాస్త్రములు శివప్రతిపాదన మూలముననే వన్నెవహించెను. సంధ్యాది మంత్రములుగూడ నీశ్వరనామజపమునకు సాధనము లగుటచేతనే సువిఖ్యాతము లయ్యెను. వేదములుంగూడఁ బరబ్రహ్మ వర్ణనాత్మకము లగుటచేతనే నిత్యములైనవి. ఈ విధమున వేదశాస్త్రాదులకును మహాపురుషవర్ణనముననే గణ్యతసంభవించుచున్నది. ఇఁకఁ గావ్యమునుగూర్చి చెప్పనేల? కావ్యమున కుత్తమనాయకుఁడు దొరకుట బంగారమునకుఁ బరిమళమబ్బుటకదా!

మరియుఁ గావ్యమహిమ నీ క్రింది విధమునఁ దెలిపి యున్నాఁడు.

"శా. వేదంబుల్ నృపశాసనంబులు; సుహృద్విజ్ఞాపనంబుల్ పురా
ణాదిగ్రంథము; లంగనాజన విలాసాలాప లీలా సమ
ప్రాదుర్భావము లౌర! కావ్యములు; క-ర్తవ్యోపదేశక్రియా
వాదప్రక్రియ నెన్నఁ; గావ్యమహిమల్ వర్ణింపఁగా శక్యమే?

లోకమునకుఁ గర్తవ్యోపదేశమున వేదములు ప్రభుసమ్మితములు; పురాణములు సుహృత్సమ్మితములు; కావ్యములు కాంతాసమ్మితములు; కావునఁ గావ్యమహిమ వర్ణింపసాధ్యము గాదు. మరియు,

మ. పరమజ్ఞానలతాలవాలము; జగత్ప్రఖ్యాతి విఖ్యాత సా
గరచంద్రోదయ; మిష్టసంఘటనరేఖాదివ్యధేనూ-త్తమం;
బురుకార్పణ్య దశాదిశాదినముఖం; బుద్వేలనిర్వాణ భో
వ్యరసాస్వాదరసాయనం; బనినఁ గావ్యంబెన్న సామాన్యమే?

శ్లో. కావ్యం యశసేఽర్థకృతే। వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే। కాంతాసమ్మితతయోపదేశయుజే."

అను శ్లోకమున కిది యనువాదరూపము. కావ్యము జ్ఞానలతల కాలవాలము. (వ్యవహారవిదే) ప్రఖ్యాతి యను సాగరమునకుఁ జంద్రోదయము. (యశసే) ఇష్ట

సంఘటనమునఁ గామధేనువు. (అర్థకృతే) కార్పణ్య దశాదిశాదినముఖము (శివేత రక్షతయే) ఉద్వేలనిర్వాణ భవ్యరసాస్వాదరసాయనము. (సద్యఃపరనిర్వృతయే) కానఁ గావ్యమహిమ యసామాన్యము.

కం. కావునఁ నేవంవిధగుగు, ణావాసంబైన కావ్యములరును నవర
త్నావేలహారవల్లిక, కైవడి ననపద్యనాయకభ్రాజితమై

ఇట్టి సుగుణముల కావాసమైన కావ్యము మహనీయుఁడగు నాయకునిఁబట్టి నాయకమణిచే విరాజిల్లు నవరత్నహారమువలె జగజ్జేగీయ్యమానమై వెలయును.

మ. అని యూహించి మదీయసంఘటిత కావ్యాలంక్రియా సంగ్రహం
బనఘంబై వెలుఁగొందకున్నె రఘువంశాధీశ్వరుండౌ నృసిం
హనృపాలాగ్రణికీర్తివర్ణనముచే? నాకాంతవిక్రాంత పా
వనమూఁ గావున నందునాయక మహావంశంబు వర్ణించెదన్.

కావున నాకావ్యాలంకార సంగ్రహము సూర్యవంశ్యుఁడగు నరసభూపాలుని కీర్తివర్ణనముచే వెలుగొందకుండునే? కానఁ బవిత్రమగు నాతని వంశమును వర్ణించెద."

ఈ గ్రంథమునకుఁ గావ్యాలంకార సంగ్రహమని పేరు. ఇది ప్రతాపరుద్రీయమున కనువాదముగాదు కాని ప్రతిబింబరూపము. అందుఁ బ్రతాపరుద్రుఁడు నాయకుఁడు. ఇందు నరసభూపాలుఁడు నాయకుఁడు. రామరాజభూషణుఁడు ప్రతాపరుద్రీయమనే యొజ్జబంతిగా నిడుకొని కావ్యాలంకార సంగ్రహమును విరచించెను. ఇందలి లక్షణములు ప్రతాపరుద్రీయము నుండియే గ్రహింపఁబడినవి. లక్ష్యములు మాత్రము స్వతంత్రములు. కొన్ని యనువాదరూపములే కలవు.

కావ్యలక్షణములను గూర్చి తెలుపు శాస్త్రమున కలంకారశాస్త్రమనియు, సాహిత్యశాస్త్రమనియు సంస్కృతమున నామములుగలవు. ప్రాచీనులగు భామహాది పండితులు కావ్యమున కలంకారములే ప్రధానమనితలఁచి తమ గ్రంథములలో నధికభాగ మలంకారములను గూర్చియే చర్చించుటంబట్టియు భామహాలంకారము, రుద్రటాలంకారము, కావ్యాలంకారసంగ్రహము (వామనకర్తృకము) అని పేళ్లు పెట్టుకొనియుండుటంబట్టియు నీశాస్త్రమున కలంకారశాస్త్ర మని పేరు వచ్చినది. లెస్సగా విచారింప సాహిత్యశాస్త్ర మను పేరే తగినది. ఏలన సాహిత్యమన "శబ్దార్థయోర్యథావత్సహ భావేనవిద్యాసాహిత్యవిద్యా" (శబ్దార్థములను అన్యూనాతిరిక్తముగా సహభావముతోఁ (బవరిల్లఁజేయు విద్య) యని రాజశేఖరుఁడు.

భామహాదులు "శబ్దార్థౌసహితౌ కావ్యం" (సహితములగు శబ్దార్థములు కావ్యము) అని చెప్పిరి. వ్యక్తివివేక టీకాకారుఁడు "సాహిత్యం తుల్యకక్షత్వేన అన్యూనానతిరిక్తత్వం". (సాహిత్యమన శబ్దార్థములకు సమానమగు హక్కుగలిగి యొకటి హెచ్చుగాఁ గాని యొకటి తక్కువగాఁగాని లేకుండుట) అని *వ్యాఖ్యానించెను. కాన సాహిత్యవిద్య యన శబ్దార్థరూపమగు కావ్యవిద్య యని తేలినది. ప్రాచీన గ్రంథములలో సాహిత్యవిద్య యనియే పెక్కండ్రు వ్యవహరించిరి. ఈ సాహిత్య విమర్శకులకు నాలంకారికులనియే వ్యవహారము.

ఈ సాహిత్యశాస్త్రమను పదమలంకార శాస్త్రపర్యాయముగా క్రీ. శ. ౯౦౦ సంవత్సరములకుఁ బూర్వమే స్థిరపడియున్నట్లు కనఁబడుచున్నది. మిగిలిన శాస్త్రముల కన్న సాహిత్యశాస్త్ర మవశ్యపఠనీయమనియు దానినిఁ జదువని వాఁ డెట్టి దిగ్దంతివంటి పండితుఁడైనను వానినిఁ దాను గౌరవింపననియుఁ బండితరాయల వారీ క్రింది శ్లోకమును రచించిరి.

> వ్యాసతు సతు గౌతమతు వ్యాళేంద్రతు యస్యనాస్తి సాహిత్యం
> తంప్రతి సంప్రతి కంప్రతి శిరోమమ తిరశ్చన పురశ్చన

తా. వ్యాసుఁడు గానిమ్ము; గౌతముఁడు గానిమ్ము; పతంజలి గానిమ్ము; సాహిత్యశాస్త్రము రాని వాఁడెవ్వఁడయినను సరియే, వానికి నాశిరస్సు తిరస్కరింపదు. పురస్కరింపదు. అనఁగా వానికిఁదగిన గౌరవమీయదు.

మరియు నీ సాహిత్యశాస్త్రము వ్యాకరణ శాస్త్రమునకుఁ బరిశిష్టమనియుఁ బుచ్ఛభూతమనియుఁ గొందఱనిరి. ఏలన వైయాకరణులయొక్కయు నాలంకారికుల యొక్కయు సిద్ధాంతము లొక్కటే. ఈ విషయము విపులముగా వామనాచార్య ఝల్కర్ పండితుఁడు కావ్యప్రకాశ ప్రస్తావనలో వ్రాసెను. అట్టి సాహిత్య శాస్త్రము నాంధ్రభాషలో రచించిన రామరాజభూషణుఁ డభినందనీయుఁడు గదా!

మొదటి 'కులము, మహాభాగ్యము' అను పద్యమున నాయకగుణము లేఁడు నిరూపింపఁబడినవి. నాయకుఁడన 'నయతివృత్తం ఫలం ప్రాప్నోతిచ' (ఇతివృత్తము నాశ్రయించుచు లేక నడిపించుచు ఫలమునుబొందువాఁడు) అను వ్యుత్పత్త్యర్థముచేఁ బ్రబంధవ్యాపి యగు ఫలమునుబొందువాఁడు. ప్రతాపరుద్రీయమునఁగూడ నీయేఁడు గుణములే చెప్పఁబడినవి. కానీతుదిని "ధార్మికత్వాదయోగుణాః" అని చెప్పఁబడు

---

*"సహితంరససంయుక్తంతదేవసాహిత్యం" (రసయుక్తమైనదే సాహిత్యము) "హితేన నిరతిశయప్రేమాస్పదేన రసేనసహితం తదేవసాహిత్యం" (నిరతిశయప్రేమాస్పదమైన రసముతోఁగూడినదే సాహిత్యము) అనియును నాథులవులు వ్యుత్పత్తినిఁ జెప్పుదురు.

టచే నాదిపదముచే మహామహిమత్వము, పాండిత్యము, మొదలగు గుణములుగూడ నీ జాబితాలోఁ జేర్పఁబడుచున్నవి. భట్టుమూర్తి 'ఆది' పదమును బ్రయోగింపమి నీ యేడే గుణములు చెప్పినట్లయినది. సాహిత్యదర్పణమున

త్యాగీ, కృతీః కులీనః సుశ్రీకో రూపయౌవనోత్సాహీ
దక్షోఽనురక్తలోకస్తేజో వైదగ్ధ్య శీలవాన్నేతా.

తా. "త్యాగము, కృతజ్ఞత, కులీనత్వము, సుశ్రీకత్వము (మహాభాగ్యము) రూపవత్త్వము, యౌవనము, ఉత్సాహము, (కార్యనిర్వహణ సామర్థ్యము) సర్వ జనానురాగము, తేజము, వైదగ్ధ్యము, శీలము, అను గుణములు గలవాఁడు నాయకుఁడు" అని చెప్పఁబడియున్నది. ఇందుఁ బండ్రెండుగుణము లున్నవి.

దశరూపకమున నాయకలక్షణ మిట్లు చెప్పఁబడియున్నది.

నేతా వినీతో మధురస్త్యాగీ దక్షః ప్రియంవదః
రక్తలోకశ్శుచిర్వాగ్మీ రూఢవంశః స్థిరోయువా
బుద్ధ్యుత్సాహస్మృతిప్రజ్ఞా కళామానసమన్వితః
శూరోదృఢశ్చ తేజస్వీ శాస్త్రచక్షుశ్చ ధార్మికః.

వినీతత్వము, మధురత్వము, (ప్రియదర్శనత్వము) త్యాగము, దక్షత, ప్రియంవదత్వము, జనానురాగము, శుచిత్వము, వాక్కౌశలము, ప్రసిద్ధవంశ్యత్వము, (కులీనత్వము) స్థిరత్వము, (వీరత్వము) యౌవనము, బుద్ధిమత్త్వము, ఉత్సాహము, స్మృతిమత్త్వము, ప్రజ్ఞావత్త్వము, కలావత్త్వము, మానము, శౌర్యము, దృఢత్వము (పట్టుదల) తేజము, శాస్త్రచక్షుష్ట్వము, ధార్మికత్వము అను గుణములుగలవాఁడు నాయకుఁడు.

కావ్య ముపదేశాత్మకముగా నుండవలయును. కానఁ గావ్యనాయకుఁ డుత్తమ ప్రకృతికుఁడై యుండవలయును. కాన నుపరినిరూపితగుణములు నాయకుని కుండ వలయునని పెద్దలు నుడివిరి. ఇన్నిగుణములు సరిగా నొక్కచో సంఘటిల్లవు. కొన్ని తక్కువగానున్నను నాయకునియందు దోషారోపణము సేయరాదు.

క. వీనికిలక్ష్యము లెల్లను
శ్రీనరసింహేంద్రు పేరఁ జెప్పెద నెలమిన్
నానావిభక్తిసూచిత
నానావిధపద్యగుంభన సమగ్రముగాన్. ౧౧౨

ఈ గ్రంథకర్త నరసభూపాలునిఁ గృతినాయకునిగా వరించి యాతని నామాంకి తముగా లక్ష్యము

## ౧. కులీనత

లక్షణపద్యమున (౧౧౧) 'కులము' అని కలదు. కులీనత యనఁగా సత్కులమునఁ బుట్టుట యని యర్థము. "మహాకులీనతా నామ కులే మహతి సంభవః" (గొప్పకులమున జన్మించుట మహాకులీనత) అని ప్రతాపరుద్రీయ లక్షణము. అనఁగాఁ బ్రబంధనాయకుఁ డుత్తమకులజాతుఁడై యుండవలెను. కావ్య ముపదేశాత్మకముగా నుండవలెనని యాలంకారికుల యభిప్రాయ మగుటచే నుత్తమ నాయకచరిత్రమే యుపదేశార్హము. కావున నిటఁ గులీనత నాయకుని ప్రథమగుణముగాఁ జెప్పఁబడినది.

సీ. ఏవంశమునఁ బుట్టెఁ బావనశ్రుతిధర్మ
మర్మకర్మఠుఁడైన మనునృపాలుఁ
డేవంశమునఁ బుట్టె నింద్రాదులరుదంద
సత్యమాడిన హరిశ్చంద్రనృపతి
యేవంశమునఁ బుట్టె నిలఁ జతుర్దశలోక
రక్షణక్షముఁడైన రావణారి
యేవంశమునఁ బుట్టె నిహపరాద్భుతపుణ్య
చరితధుర్యుఁడు చోళచక్రవర్తి,

గీ. అట్టి యిందుగ్రహాది సేనాధిపత్య
సత్యయశుఁడైన భానువంశమునఁ బుట్టి
పరగు భూపాలసింహు నోబయనృసింహుఁ
దలఁపఁ గలికాలకలుషంబు దొలఁగు టరుదె? ౧౦౩

(శ్రుతిధర్మ (పాఠాంతరము) స్మృతిధర్మ)

తా. మనువు, హరిశ్చంద్రుఁడు, శ్రీరాముఁడు, చోళుఁడు మొదలగు మహారాజులు జన్మించిన సూర్యవంశమున నరసభూపాలుఁడును జన్మించెను. ఈ పద్యమున నాయకుని 'కులీనత' చెప్పఁబడినది.

## ౨. మహాభాగ్యము

"విశ్వంభరాధిపత్యం యత్తన్మహాభాగ్యముచ్యతే" (భూమండలాధిపత్యమే మహాభాగ్యము) అని ప్రతాపరుద్రీయము.

మ. ప్రకటాఖిల విరోధిసైన్యములఁ ద్రుంపఁజాలు నాకొక్కఁడ నే
నకుఁడే; వారణవాజిశాలలు నమద్వైరిక్షితీంద్రారిలా

ధిక వేదండ హయాన్వితంబులు: భుజాదీప్తాంగదంబుర్వి; భా
గ్యకళా వైభవ మెన్నశక్యమె నృసింహక్ష్మాతలస్వామికిన్‌! ౧౧౮

నవద్వైరి (పా) మహావైరి

తా. ఒక్కొక్క సేవకుఁడే భయంకర శత్రుసైన్యములఁ దరించును. గజాశ్వ శాలలు లొంగిపోయిన శత్రురాజులిచ్చిన గజాశ్వములతో నిండియున్నవి. భూమి భుజమున నంగద ప్రాయముగా నుండెను. నరసభూపాలుని భాగ్యమే భాగ్యము.

## 3. ఉజ్జ్వలత (ఔజ్జ్వల్యము)

" రూపసంపన్నదేహత్వమౌజ్జ్వల్యం పరికీర్త్యతే " (సుందరరూపము గలిగి యుండుట యౌజ్జ్వల్యము) ప్ర॥రు॥ లక్షణము.

మ. స్థిరసోమాన్వయదుగ్ధవార్ధిజనియించెన్‌ వేంకటాద్రీంద్ర భూ
వరచంద్రుండు; తదీయసోదరి రమావామాక్షి లక్కాంబయై
పరగెం; దద్వనితాశిరోమణికి నోబక్షోణిపాలేంద్రు శ్రీ
నరసింహాధిపుఁడై జనించె మరుఁడౌన్నత్యంబు దీపింపఁగన్‌. ౧౧౯

ఓబక్షోణిపాలేంద్రు శ్రీ (పా) ఓబక్షోణిపోపేంద్రుకున్‌.

తా. చంద్రవంశమను పాలసంద్రమున వేంకటాద్రిరాజను చంద్రుడును, లక్కాంబయను లక్ష్మియు నన్నయుఁ జెల్లెలునై జన్మించిరి. ఆ లక్కాంబకును నోబ క్షోణిపాలునకును నరసభూపాలుఁ డను మన్మథుఁడుదయించెను.

ఈ పద్యమున లక్కాంబ యను లక్ష్మియందు నోబక్ష్మాపాలుఁ డను విష్ణు మూర్తివలన నరసభూపాలుఁ డను మరుఁ డుదయించెనని చెప్పుటవలన నరసభూపాలుఁడు మదనమోహనమూర్తి యని సారాంశము. ఇదియే యౌజ్జ్వల్యము.

## ౪. ఔదార్యము (ఉదారత)

"యద్విశ్రాణనశాచ్ఛీల్య మౌదార్యం తన్నిగద్యతే" (దానశీలము గలిగి యుండుటయే యౌదార్యము) అని ప్ర। రు। లక్షణము.

సీ. అల బలీంద్రునిచేత నడుగు పెట్టఁగ నేర్చి
ధారాధరముచేత నీరుపోసి
కాసీనుచేఁ గంచుకముఁ బూనగా నేర్చి
యెలమి దధీచిచే నెముకబలిసి

క్షీరాంబురాశి త్రచ్చిన వెన్ననీఁజేరి
నైలింపగవి చన్నుఁబాలఁ బెరిగి
కల్పపాదప ఫలోత్కరముల చవిఁగాంచి
వనజారి నెమ్మేన ననఁగిపెనఁగి
గీ. ధరణిఁ బ్రోదిపఱిచిన దానకన్య
సకల యాచకబాంధవుల్ సన్నుతింప
నీకరగ్రహణావాప్తి నెఱసె నౌర!
సరసగుణహార! ఓబయనరసధీర! ౧౧౬

త్రచ్చిన (పా) ద్రచ్చిన.

తా. బలిచక్రవర్తివలన జనించి, మేఘుఁడు స్నానమాడింపఁగాఁ గర్ణుఁడు కంచుకముఁ (చొక్కా) దొడుగఁగా, దధీచివలన నెముకబలియఁగా, క్షీరసముద్రుఁ డొసఁగిన యమృతముచే వర్ధిల్లి, కామధేనువు చనుబాలఁ బెరిగి, కల్పవృక్షము పండ్ల రసమును గ్రోలి, చంద్రుని శరీరమున ననఁగి పెనఁగి (చంద్రునిచే నెత్తుకొనఁబడి) లోకమున వర్ధిల్లిన దానకన్య నీపాణిగ్రహణము సేసెను.

ఇందుఁ బెద్దదాతలగు బలి, (వామనునికి మూఁడడుగులు దాన మొనర్చి సర్వస్వమును గోలుపోయినవాఁడు) మేఘుఁడు, (అయాచితముగా వర్షోదకములిచ్చు వాఁడు) కర్ణుఁడు, (సహజ కవచకుండలములను దాన మొనర్చినవాఁడు) దధీచి, (ప్రాణత్యాగముసేసి వెన్నెముకను నింద్రునికి దానముసేసినవాఁడు) సముద్రుఁడు, (తన యమృతమును దేవతల కొసఁగినవాఁడు) కామధేనువు, కల్పవృక్షము, చంద్రుఁడు, (తన కళలను దేవతల కాహారముగా నిచ్చినవాఁడు) అనువారలచే దానకన్య క్రమక్రమాభివృద్ధినిఁ బొంది తుదికి నీకేలువట్టినది. అని చెప్పుటచే నీవు మహోదారుఁడవని స్ఫుటమగుచున్నది.

కాని దానకన్య నీ పాణిగ్రహణము సేసిన దనుటకన్న నరసభూపాలుఁడు సేసిన దానములను గవి వర్ణించినచో లెస్సగా నుండెడిది. ప్రతాపరుద్రీయమున.

"సమంతాదుద్భూతైర్ద్విరదమదగంధైస్సురభయః
క్రియంతే యద్విద్వజ్జన మణిగృహప్రాంగణ భువః"

తా. "ప్రతాపరుద్రమహారాజుచే మొదట విద్వాంసుల గృహములు మణిగృహములుగాఁ జేయఁబడినవి. పిమ్మట వారి ముంగిళ్లు కరిమదముచేఁ బరిమళవంతములుగా నొనర్పఁబడినవి." అని చెప్పఁబడినది. ఇచటఁ బ్రతాపరుద్రుని దాతృత్వము వ్యంగ్యముగా గోచరించునట్లు నరసభూపాలీయ పద్యమున గోచరించుటలేదు.

## ౫. మహోపకారలత (తేజస్విత)

"జగత్ప్రకాశకత్వం యత్తేజస్విత్వం తదుచ్యతే" (జగత్తును ప్రకాశింపఁ జేయుట తేజస్విత్వము) అని ప్ర| రు| లక్షణము.

సీ. బహుతరాశాభ్రాంతి బయలు ప్రాఁకకయున్నఁ
 గువలయద్వేషంబుఁ గోరకున్న
 మీటితమ్ముల విరిపోటు సేయకయున్న
 వారుణీసక్తికిఁ బాఱకున్న
 జగతి నందఱికినిఁ బగలొనర్పకయున్న
 దోషాభిభూతుఁడై తొలఁగకున్న
 ద్విజరాజపరిభవోద్వృత్తి సేకొనకున్న
 సరసుల నింకింపఁజాలకున్న

గీ. సాటియగు విశ్వవినుత శశ్వత్ప్రతాప
 వైభవధ్వస్త దుర్వారవైరివీరుఁ
 డైన రాబయనరసింహు సమితభువన
 భవనభృతతేజమున కబ్జబాంధవుండు, ౧౧౭

విరిపోటు (రూ) విరిపాటు; వారుణీసక్తికి (పా) వారుణాసక్తికి.

తా. సూర్యుఁడు ఆశాభ్రాంతిచే (దిక్సంచారము అను దురాశచే) బయలు ప్రాఁకకున్నచోఁ, గువలయద్వేషము (కలువలతోడిపగ యను భూమండల ద్వేషము) వహింపకున్నచో, విజృంభించి తమ్ములను (పద్మములను సోదరులను) ఖేదింపకున్నచో, వారుణీ (పడమటిదిక్కనుకల్లు) సక్తుఁడై పరుగిడకున్నచో, జగతిలోని యెల్లరికినిఁ దాను బగలొనర్పకున్నచో (పగలు సేయుట యను పగ (వైరము) సేయకున్నచో ననఁగా నెల్లరితో వైరమువహింపనిచో) దోషాభిభూతుఁడై (రాత్రి గోచరింపనివాఁడను దోషయుక్తుఁడై) తొలఁగనిచో, ద్విజరాజునకు (చంద్రునకను బ్రాహ్మణునకు) నధిక పరాభవముఁ గూర్పనిచో, సరసులను (చెఱువులను రసికులను) నింకింపఁజాలనిచో జగత్ప్రసిద్ధమగు స్థిరమైన ప్రతాపవైభవముచే శత్రువీరుల ధ్వంసముఁగావించిన నరసభూపాలుని యమితమైన భువనభవనమున నిండిన తేజమునకు సాటివచ్చును: అనఁగా సూర్యుఁడును నరసభూపాలుని తేజమునకు సాటిరాఁడని సారాంశము. ఏలన సూర్యుఁడు ఆశాభ్రాంతిచే బయలు ప్రాఁకును. నరసభూపాలుని

తేజము దిక్కులకుఁ బ్రాఁకును. అతనికిఁ గువలయద్వేషము గలదు. దీనికిఁ గువలయానురాగము గలదు. అతఁడు తమ్ముల భేదించును. ఇది భేదింపదు. అతఁడు వారుణీసక్తుఁడు. ఇది యట్లుగాదు. అతఁ డెల్లరికినిఁ బగలుసేయును. ఇది హితముసేయును. అతఁడు దోషాభిభూతుఁడు. ఇది గుణభూయిష్ఠము. అతఁడు ద్విజరాజపరాభవము సేయును. ఇది ద్విజరాజహితముసేయును. అతఁడు సరసుల నింకించును. ఇది రంజించును. ఈవిధముగా సూర్యునియందున్న యవగుణములు లేనిదై తేజము వెలుఁగుచున్నది. (ఈ పద్యము వ్యతిరేకాలంకార దృష్టాంతముగాఁ గూడ నీయఁబడినది.)

## ౬. ధర్మాకలనము (ధార్మికత్వము)

"ధర్మైకాయత్తచిత్తత్వం ధార్మికత్వముదీర్యతే" (ధర్మాభినివేశము గలుమనస్సు గలిగియుండుట ధార్మికత్వము) అని ప్ర| రు| లక్షణము.

చ. పలుకుట సత్యవాసన, కపారవిరోధిజయోత్సవంబు, తా
నఘు యశోధనంబుకొఱ, కంబుధివేష్టితభూపరిగ్రహం,
బలరు నగణ్యపుణ్యచరితాచరణంబున; కాత్మజీవనం
బల సుజనావనంబుకొఱ; కౌర! నృసింహనృపాలమౌళికిన్. ౧౫

తా. నరసభూపాలుఁడు సత్యమునకై భాషించును. యశోధనమునకై శత్రుజయము సేయును. బ్రాహ్మణుల కగ్రహారాదులిచ్చి పుణ్యమార్జించుటకై యాసముద్ర పరివేష్టితమగు భూమినిఁ బరిగ్రహించును. సుజనరక్షణార్థమై యాత్మజీవనముల నుపయోగించును. మనోవాక్కాయకర్మల నరసభూపాలుఁడు ధార్మికుఁడని సారాంశము. ఇట్లెల్లపుడు ధర్మము నాచరించువాఁడే ధార్మికుఁ డనఁబడును. కాని 'సకృత్కృతధర్మో నధార్మికః' (ఎప్పుడో యొకప్పుడు ధర్మమాచరించినవాఁడు ధార్మికుఁడుగాఁడు) అను నిర్వచనానుసార మితరులు ధార్మికులుగారు.

ఈపద్యము కాళిదాసమహాకవియొక్క "త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణాం। యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినాం" అనుదానికి ఛాయారూపము.

## ౭. వైదగ్ధ్యము

"కృత్యవస్తుషు చాతుర్యం వైదగ్ధ్యం తన్నిగద్యతే" (చేయవలసిన కార్యములందు నేర్పుఁజూపుట వైదగ్ధ్యము.)

సీ. వనజారి కళలచేఁ దనివినొందించిన
నిలఖేచరుఁడు ప్రాణమిత్తునని
వనదంబు తనదుజీవనమెల్ల నొసఁగిన
నెమ్మేను శిబికోసి కొమ్మటన్న
నీఁగి మ్రానేసొమ్ము లిచ్చిన సురమణి
మిన్నందితలఁపులో మెలఁగుచున్నఁ
శౌరిపాదము బలి శిరసావహించినఁ
బాథోధి తానెంత భంగపడిన

గీ. వారి నెవ్వారిఁగాదని వసుధనౌర!
నిక్కముగఁ గీర్తికామిని నీకె దక్కె
నీదు వైదుగ్ధ్యగుణము వర్ణింపఁదరమె?
నరనుతాటోప!, ఓబయనరసభూప!      ౧౧౩

తా. కీర్తికన్య చంద్రుఁడు తన్నుఁదనకళలచేఁ దృప్తినొందించెదనన్నను, వాయు దేవుఁడు తనప్రాణముచ్చెదనన్నను, (వాయువు జగత్ప్రాణుఁడు) మేఘుఁడు తన జీవనము (జలము) ధారవోయుదు నన్నను, శిబి తన మేను గోసియిచ్చెద నన్నను, కల్ప వృక్షము పలసినసొమ్ము లిచ్చెద నన్నను, చింతామణి తన చింతకనుకూలముగా మెలఁగెద నన్నను, బలి తనపాదమును శిరసావహించెద నన్నను, సముద్రుఁడు దానెంత భంగపడినను (అలలు గలది) వారి నొల్లక నిన్ను వరించెను. నీ వైదగ్ధ్యము వర్ణింప నెవ్వరి తరము ?

ఇట నింతమంది యిన్నివిధములఁ బ్రాధేయపడి ప్రార్థించినను వారినొల్లక కీర్తికన్య నిన్నే వరించినదని చెప్పఁబడుటవలన నామె నిన్ను వరించునట్లు సేసికొన్న నీనేర్పువర్ణనీయ మని భావము. కాని వెనుకటిపద్యమున నౌదార్యమువలెనే యిచ్చటను వైదగ్ధ్యము లెస్సగా గోచరింపకున్నది. ప్రతాపరుద్రీయమునను నీయుదాహరణమును గనుఁడు.

శ్లో॥ చాతుర్యం కిము వర్ణ్యతే గుణనిధేః శ్రీవీరరుద్రప్రభో
ర్యత్తాభ్యో౽న్యవిరుద్ధయోరపి మహద్వాణీ శ్రియోరార్జవం
కించాభ్యాం సదృశోపచారలలితాం తత్తాదృశైర్యత్నవైః
నిష్పత్త్యామిమాం ధ్రువం స నృపతిర్ధత్తే౽ధికాం జిత్వరః

తా. ప్రతాపరుద్రునిచాతుర్య మేమని వర్ణింతును? ఏమనఁ బరస్పర విరుద్ధ స్వభావముగల లక్ష్మీసరస్వతు లాతనియొద్ద సౌహార్దముతోనున్నవి. మరియు వారితో పాటు భూదేవినిఁగూడ సదృశోపచారములచే సుముఖురాలినిఁగా జేసికొని సవతి పోరులు లేకుండ సంసారమును జక్కబెట్టుకొనుచున్నాఁడు.

ఇట నన్యోన్యవిరుద్ధయోః, సదృశోపచారలలితాం, నిసాపత్న్యం, మొదలగు పదములు చాతుర్యమును వ్యక్తము సేయుచున్నవి. పైపద్యమున నిట్లు వ్యక్తము సేయు పదములు లేవు. కావున నీ పద్యము లెస్సగాదు.

ప్రతాపరుద్రీయమున మహామహిమత్వము, పాండిత్యము, అను మరిరెండు గుణములు వచింపఁబడినవి. వాని లక్షణలక్ష్యముల నిటఁజూపుదును.

"తన్మహామహిమత్వం స్యాద్యావున ర్దేవతాత్మతా" (దేవతా స్వరూపము గలిగియుండుటయే) మహామహిమత్వము) అని లక్షణము.

కౌసల్యాసీత్ప్రథమజననీ దేవకీ చద్వితీయా
విష్ణోర్మాతా తదను మహితాముమ్మడాంబా తృతీయా
యస్త్రేతాయాం రఘుపతిరభూత్ ద్వాపరేశౌరిరాసీత్
త్రాతుంక్షోణీం సజయతికలౌ వీరరుద్రావతారః

తా. శ్రీమహావిష్ణువు త్రేతాయుగమునఁ గౌసల్యయందు శ్రీరాముఁడై పుట్టెను. ద్వాపరమున దేవకియందు శౌరియై పుట్టెను. కలియుగమున జగత్పాలన మునకై ముమ్మడాంబయందు వీరరుద్రుఁడై జనించెను.

ఇటఁ బ్రతాపరుద్రునకు దేవతాత్మకత్వము చెప్పఁబడినది.

"సర్వవిద్యాధికత్వం యత్పాండిత్యం తదుదాహృతం" (ఎల్ల విద్యలయం దును నాధిక్యము వహించి యుండుట పాండిత్యము) అని లక్షణము.

గోష్ఠీభిః పరితోషయన్ బుధగణాన్ షడ్దర్శనీసీమభిః
సత్సారస్వతమార్గదర్శన చణైసూక్తైః కవీన్ ప్రీణయన్
సంగీతోపనిషద్రహస్యపిశునైరాతోద్యయోగ్యక్రమై
ర్విన్వన్ సంసది వైణికాన్ విహరతే శ్రీకాకతీంద్రోనృపః

తా. షడ్దర్శనీవేత్తలగు పండితులను శాస్త్రప్రసంగములచే సంతోషపఱచుచు గవులను సత్కావ్యమార్గమును సూచించు సూక్తులచేఁ దనుపుచు (అతని సూక్తులే కావ్యమార్గము ననుసరించుననిభావము) సంగీతోపనిషద్రహస్యమును సూచించు వివిధ వాద్యపరిచయమువలనచే వైణికులను ప్రీణింపఁజేయుచుఁ బ్రతాపరుద్రుఁడు విహరించును.

ఇచటఁ బ్రభువునకు సర్వవిద్యా ప్రపూర్ణత్వము వ్యక్తమగుచున్నది.

క. అనయము నాయక సుగుణము
లనేకములు గలవు; వాని నతివిస్తర భీ
తి నిరూపింపఁగలేఁ; నిఁక
ననుపమ నేతృస్వరూప మభివర్ణింతుఁన్. ౧౨౦

నాయకగుణములు పెక్కులున్నవి. (వానిని దశరూపక సాహిత్య దర్పణ కారులు నిరూపించిరి) అతి విస్తరభీతిచే వానిని నిరూపింపఁజాలను. ఇఁక నాయక స్వరూపము నభివర్ణింతును.

## నాయకస్వరూపము

కం. కీర్తిప్రతాపసుభగుం
డార్తావనుఁ, డఖిలగుణగణాఢ్యుఁడు, బాహా
వర్తితభూభరుఁడై, పరి
కీర్తితుఁడగు భర్త కావ్యగీతప్రియుఁడై. ౧౨౧

సుభగుఁడన శ్లో॥ సపత్నీనఖదంతాది చిహ్నంయస్య నదృశ్యతే
విస్మార్యమాణమానేర్ష్య స్సుభగసోఽభిధీయతే॥

"సవతాలి నఖక్షత దంతక్షతాది చిహ్నములు లేనివాఁడును, ఈర్ష్యామాన మును మరపింపఁజేయఁజాలినవాఁడును నగు నతఁడు సుభగుఁడు" అని భావప్రకాశ మునఁ గలదు. ఇట నా యర్థము సరిపడదు. 'సుందరుఁడు' అను నౌపచారికార్థమును గ్రహింపవలెను. (కీర్తి ప్రతాపములచే సుందరుఁడు) సుభగశబ్దభవమే సౌభాగ్యశబ్దము. లేక భగమనగా నైశ్వర్యము (భగవంతుఁడు) గొప్ప యైశ్వర్యముగలవాఁడు 'సుభగుఁడు' అనియైనను జెప్పుకొనవచ్చును.

తా॥ కీర్తి ప్రతాపరూపమగు మహైశ్వర్యముగలవాఁడు, ఆర్తులను రక్షించు వాఁడు, అఖిలగుణములుగలవాఁడు, బాహువులపై భూభారము వహించువాఁడు, కావ్యగీతప్రియుఁడు నగువాఁడు నాయకుఁడు.

ఇందుఁ దెలుపఁబడిన ప్రతాపము, భూభారవహనము, కావ్యగీతప్రియత్వము మొదలగునవి పూర్వోక్త తేజస్విత్వ, మహాభాగ్య, ధార్మికత్వ, పాండిత్యాది గుణ ములలోనే యంతర్భవించును. మరల నిచట నేలచెప్పెననఁ బ్రబంధనాయకుని కీ గుణము లత్యవశ్యములని తెలుపుటకే.

## కీర్తిప్రతాప సుభగత్వము

మ. అరినిర్భేదనధుర్య! యోబయనృసింహా! సింహాసత్త్వాఢ్య! నీ
వరసత్కీర్తిమరాళబాలిక భవద్వర్ధిష్ణుశౌర్యప్రభా
భరితారుణ్యముఖాగ్రయై పరగుచుం బాల్నీరు నేకంబుగా
ధరఁగావించు సమస్తవిస్మయకళా దానప్రవీణోన్నతిన్. ౧౨౨

తా. ఓ నరసభూపాలా! నీ కీర్తి యను రాజహంసి నీ ప్రతాప మను నెఱ్ఱని ముక్కుగలదై యాశ్చర్యకరముగా నీరక్షీరము లేకము సేయును. లోకములోని హంసలు నీరక్షీరములను వేఱుపఱచును. ఈ రాజహంసి నీరక్షీరము లేకముసేయుట చిత్రము. అనఁగా నీ కీర్తి నల్లనినీళ్ళనుగూడఁ దెల్లని పాలుగా గోచరింపఁజేయుచున్న దని భావము. ఇందుఁ గీర్తిప్రతాపములు రెండును వర్ణితములు.

యథార్థముగా నిందుఁ గీర్తియే వర్ణింపఁబడినది. కాని ప్రతాపవర్ణనములేదు. ఏలనఁ బాల్నీరు నేకముసేయు కార్యము కీర్తిహంసిది కాని ప్రతాపకార్యముగాదుకదా!

## ఆర్తావనత్వము

మ. ఒకప్రహ్లాదునినార్తుఁగాచితి; మదీయోత్సేక మేకావన
ప్రకటంబౌనె? యటంచుఁదా బహుతరార్తత్రాణపారాయణో
త్సుకతన్ శ్రీనరసింహుఁడుర్వి నరసక్ష్మోణీశుఁడై పుట్టెఁగా;
కొకభూపాలునకిట్టి యార్తభరణోద్యోగంబు వాటిల్లునే! ౧౨౩

తా. మున్నార్తుఁ డగు నొక ప్రహ్లాదునిఁ గాచితిని. ఒకయార్తునిఁ గాచుట కేనా నాశక్తి? యని నృసింహమూర్తి పెక్కండ్రార్తులను గాపాడ నరసభూపాలుఁడై యవతరించెను. కాకున్న నొక సామాన్యప్రభువున కింతమందినిఁ గాపాడ నెట్లు శక్యమగును?

ఇందార్తావనత్వము వ్యక్తము. కాని యిందును గార్యరూపమున నార్తావనము వర్ణింపఁబడినచో లెస్సగా నుండును.

## గుణాఢ్యత్వము

చ. అరయుఁబయోధిఁ బాత్రమును, సంజనసౌలముఁ గజ్జలంబుఁ, ద
త్సురతరుశాఖ లేఖిని, వసుంధర పత్రిక, కేసి వేడ్కతోఁ

గరలి విరించి గేహిని లిఖించినఁ బారమునొందదారఁ! మా
నరసనృపాల మౌళి సుజనస్తుతసద్గుణ సంప్రదాయముల్. ౧౬౮

తా. సముద్రము సిరాబుడ్డిగాను, గాటుకకొండ సిరాగాను, కల్పవృక్షశాఖ కలముగాను, భూమినిఁ గాగితముగాను జేసి సరస్వతీదేవియే వ్రాసినను మానరసభూపాలుని గుణములు ముగియవు.

ఇందు గుణాఢ్యత్వము నిరూపింపఁబడినది. ఇందును గార్యరూపమున గుణములు వర్ణింపఁబడినచో లెస్సగా నుండును.

## భూభరణము

చ. విపులఫణాసహస్రమున వీఁక భరింపఁగలేని మేదినిన్
నిపుణత బాహుపీఠమున నిల్పె నృసింహుఁ డటంచుఁ బన్నగా
ధిపతి నిరంతరాద్భుతమతిం దలలూఁచ జరావిపాండురుం
డిపుడు పురాణభోగి యని యెన్నుదురా భుజగేంద్రునందఱున్.

తా. తన వేయి పడగలతో భరింపలేని భూమిని నరసభూపాలుఁడు బాహుపీఠమున భరించెనని యాదిశేషుఁ డాశ్చర్యమునఁ దలలూఁచఁగా లోకు లాశ్చర్యమునఁ దలలూఁచినట్లు గ్రహింపఁజాలక యాతనిమేని తెల్లఁదనమును గాంచి ముదుసలితనమునఁ దాలిపోయినట్లు గ్రహించి యాతఁడు పురాతనుఁడైన భోగి యగుటను ముసలితనమునఁ దలలూఁచినట్లు గ్రహింతురు.

ఇం దాదిశేషుఁడు మోయలేని భూభారమును నరసభూపాలుఁడు వహించెనని చెప్పుటచే భూభరణము పేర్కొనఁబడినది.

## కావ్యగీత ప్రియత్వము

మ. నరసింహుం డతిధీరవీరరససన్నాహంబు వాటించియుం
గరుణాకోమలుఁడై రమావిమల శృంగారార్ద్రుఁడై పొల్చుచా
తురి సాహిత్యజమర్మకర్మ కలనోద్యోగాత్మకుండయ్యు నీ
నరసింహేంద్రుఁడనూనగాన రససంధాన ప్రియుండెంతయున్.

తా. నరసింహమూర్తి మిక్కిలి వీరరసము గలవాఁడయ్యుఁ గృపాళువును, లక్ష్మీదేవితోడి శృంగారరసమున మునింగి తేలువాఁడును నయినట్టి నరసభూపాలుఁడు

కావ్యసాహిత్యరహస్యములను దెలిసికొను కఠినకార్యమున వ్యాపృతుఁడయ్యును గీతరసకుతూహలుఁడై శోభిల్లును.

ఇందుఁ గావ్యప్రియత్వమును గీతప్రియత్వమును జేర్కొనఁబడినది.

ఇటఁగూడ నీగుణములు కార్యరూపమున వర్ణింపఁబడినచో లెస్సగా నుండెడిది.

నరసభూపాలీయ, సాహిత్యదర్పణ, దశరూపకాది గ్రంథములందలి నాయక లక్షణములను బరిశీలింపఁగా మహారాజే నాయకుఁడుగా నుండవలెనన్న నియమము కానరాదు. సామాన్యుఁడైన మానవుఁడుగూడ నాయాగుణములు గలిగి ప్రబంధ నాయకుఁడు గావచ్చును. మొత్తముమీఁద నాయకచరితముపదేశాత్మకముగా నుండవలెను. కానఁ దత్తద్గుణములు గలిగి యుండవలెను.

## ఆశ్వాసాంతము

మ, అమరక్ష్మాధరధీర! ధీరచితకార్యారంభ! రంభాసమ
ప్రమదాభవ్యమనోనురాగఘటనాపాంచాల! పాంచాల గో
శమఖోర్వీనుతశౌర్య! శౌర్యవనలీలాలోల! లోలాభవ
ద్రమణీయాగమధర్మ! ధర్మతనయ ప్రఖ్యాత సత్యవ్రతా! ౧౨౭

పాంచాలుఁడు = కామశాస్త్రమునందలి దత్త, భద్ర, కూచిమార, పాంచాల నాయకులలో నొకఁడు. లోల+అభవత్ = లోలముగాని యనఁగా చంచలము గాని లేక స్థిరమైన

లోలాభవత్ అనురూపము దుష్టము. 'లోల' శబ్దమునకు చ్విప్రత్యయమును జేర్పఁగా 'లోలీభవత్' అగును. లోలముగాని యనునర్థమున 'అలోలీభవత్' అని రూపముండును. ఇది ముక్తపదగ్రస్తమగుటచేఁ గవి "లోలాభవత్" అనియే ప్రయోగించెను.

కం. కుటిలారిభయదధాటీ
పటుపటహాథమన్నినాద పరిపాటిలది
క్తటవటల! చటులమేధా
పటిమపరాభూతభూతపతిమణిహారా! ౧౨౮

మాలిని. అలఘునయవిహారా! హారనీహారతారా
హాలధరరుచిధారాహార కీర్తిప్రచారా!

జలధివరగభీరా! జైత్రకీర్తిప్రయుధారా!
లలితగుణవిహారా! లక్కమాంబాకుమారా! ౧౨౯

## గద్యము

ఇది శ్రీ హనుమత్ప్రసాదలబ్ధ కవితాసార, సారస్వతాలంకార, నిరంకుశ
ప్రతిభాబంధుర, ప్రబంధపఠన రచనాధురంధర, ప్రబంధాంక వేంకట
రాజభూషణసుపుత్త్రి, తిమ్మరాజపౌత్త్ర, సకల భాషావిశేష
నిరుపమావధాన శారదా మూర్తి మూర్తి ప్రణీతంబైన కావ్యా
లంకార సంగ్రహం బను మహా ప్రబంధంబునందు
సుహోద్ఘాతప్రకరణంబును, నాయకగుణవర్ణనంబును,
నాయక స్వరూప కథనంబు నన్నది
ప్రథమాశ్వాసము.

---

# కావ్యాలంకార సంగ్రహము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరాజితసదన! కళా
ధార! నిరంతరార్థి దారిద్ర్యహరా!
నారాయణ చరణార్చన!
నారీజనతారతీశ! నరసాధీశా! ౧

సీ. అవధరింపుము లక్ష్మలక్ష్యములనెల్ల
ననఘ! భవదీయ నామధేయాంకితముగ
బహువిధ వృత్తుల నొనరింతుఁ బద్యవితతి
నిచట నాయకభేదంబు లెట్టులనిన. ౨

క. ధీరోదాత్తప్రముఖులు
ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలితు లీ
ధారుణి నలువురునాయకు;
లారయఁ దల్లక్షణంబు లభివర్ణింతుర్, ౩

తా. ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరశాంతుఁడు, ధీరలలితుఁడు, అని
నాయకులు నలుగురు నుందురు. వారి లక్షణములు ముందు తెలియును.

శా. ధీరాత్ముం, డవికత్థనుండు, కరుణోద్వేలుండు, సత్త్వాఢ్యుఁ డా
ధీరోదాత్తుఁడు; శౌర్యదర్పకుహనాధీనుండు ధీరోద్ధతుం;
డారూఢిన్ సమధీప్రసన్నుఁడు ద్విజుండౌ ధీరశాంతుండు; వృ
త్రారింభోలిసభోగి ధీరలలితుండై పొల్చు నిశ్చింతతన్. ౮

శౌర్య (పా) క్రౌర్య; సమధీ (పా) శమధీ.

## ధీరోదాత్త లక్షణము

ధీరశ్చఅసౌ ఉదాత్తః ధీరోదాత్తః అని విగ్రహము. ధీరత్వమును, నుదాత్తత్వమును గలవాఁడు ధీరోదాత్తుఁడు. ధీరుఁ డనఁ గ్లేశమును సహించువాఁడు. ఉదాత్తుఁ డన నాత్మశ్లాఘ లేనివాఁడు. కృపాళువు. హర్షశోకాదులచే నభిభూతుఁడు కానివాఁడును.

సాహిత్యదర్పణము నందలి లక్షణ మింతకన్న సమగ్రముగా నున్నది.

శ్లో. అవికత్థనః క్షమావా నతిగంభీరో మహాసత్త్వః
స్థేయాన్నిగూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః కథితః.

తా. ఆత్మశ్లాఘ లేనివాఁడు (అవికత్థనుఁడు) సహనముగలవాఁడు, (క్లేశసహిష్ణువు) గంభీరుఁడు, మహాసత్త్వుఁడు, గూఢమానము (కోపము) గలవాఁడు, దృఢవ్రతుఁడు నగువాఁడు ధీరోదాత్తుఁడు.

ధీరోదాత్తుఁడు శృంగారవీరరసములందు నాయకుఁడు.

## ధీరోద్ధత లక్షణము

ధీరశ్చ అసౌ ఉద్ధతః అని విగ్రహము. ధీరత్వమును నుద్ధతత్వమునుగలవాఁడు. ఉద్ధతుఁడనఁ గ్రౌర్య, దర్పములును, మాయలమారితనమును గలవాఁడు.

సాహిత్యదర్పణ లక్షణమును గనుఁడు.

మాయాపరః ప్రచండశ్చపలోఽహంకార దర్పభూయిష్ఠః
ఆత్మశ్లాఘానిరతో ధీరైర్ధీరోద్ధతః కథితః.

తా. మాయలమారితనము, ప్రచండత, చాపల్యము, అహంకారము, దర్పము ఆత్మశ్లాఘయును గలవాఁడు ధీరోద్ధతుఁడు.

ఇతఁడు వీరరౌద్ర రసములందు నాయకుఁడు.

## ధీరశాంత (ధీరప్రశాంత) లక్షణము

ధీరశ్చ అసౌ శాంతః అని విగ్రహము. సమధీప్రసన్నుఁ డగు ద్విజుఁడు ధీరశాంతుఁడు– సమధీప్రసన్నుఁ డను పదమునకు నిష్కృష్టార్థము గోచరింపకున్నది. బహుశః ధీరత్వమును శాంతత్వమును సమానముగాఁగలవాఁ డని కవి యభిప్రేతార్థమైయుండును. లేక 'శమధీప్రసన్నుఁడు' అనుపాఠమైయుండును. అట్లైన శమములో లేక శాంతగుణములోఁ గూడిన బుద్ధిచేఁ బ్రసన్నుఁ డయినవాఁడు. అనఁగాఁ ధీరత్వమును శాంతగుణముచేఁ గలిగిన మనఃప్రసన్నతయుఁ గలవాఁడని యర్థమగును. ఇదియే యుక్తమగు పాఠము.

సాహిత్యదర్పణ లక్షణమును గనుఁడు.

"సామాన్యగుణైర్భూయాన్ ద్విజాదికో ధీరప్రశాంతః స్యాత్‌" 

నాయకసామాన్యగుణములు గల (కులము, మహాభాగ్యము, మొ॥) ద్విజుఁడు: (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో నొకఁడు) ధీరశాంతుఁడు. దశరూపకమున 'ద్విజాదికః' ఇతి విప్రవణిక్సచివాదీనాం ప్రకరణనేతౄణా ముపలక్షణం' ద్విజాదిక మనఁగాఁ బ్రకరణనాయకులగు విప్రవణిక్సచివులు అని వ్యాఖ్యానము చేయఁబడినది. "అమాత్య, విప్ర, వణిజామేకం కుర్యాచ్చనాయకం" (అమాత్య, విప్ర, వణిజులలో నొకరిని నాయకునిఁ జేయవలెను.) అని భరతనాట్యశాస్త్రమునను గలదు. ఈ రెండు గ్రంథములందును 'ద్విజ' శబ్దమునకు వ్యాఖ్యలో క్షత్రియశబ్దముగాక అమాత్య, సచివ శబ్దములే వాడఁబడియున్నవి. అనఁగా మంత్రియైన క్షత్రియుఁడే నాయకుఁడై యుండవలెనని తెలుచున్నది. అంతేకాని రాజైన క్షత్రియుఁడు నాయకుఁడుగా నుండరాదు.

మృచ్ఛకటిక మను ప్రకరణమున బ్రాహ్మణుఁడును, మాలతీమాధవ ప్రకరణమున మంత్రిపుత్త్రుఁడును, పుష్పభూషిత ప్రకరణమున వణిజుఁడును నాయకుఁడుగా గ్రహింపఁబడిరి. వీరు ధీరశాంతులు. లక్షణవాక్యమున అమాత్య, సచివ, పదములే యున్నను లక్ష్యమగు మాలతీమాధవాదులలో మంత్రిపుత్త్రుఁడే నాయకుఁడుగా నున్నాఁడు.

## ధీరలలిత లక్షణము

ధీరశ్చ అసౌ లలితః అని విగ్రహము. నిశ్చింతుఁడును, ఇంద్రునిఁ బోలిన భోగశాలియు నగువాఁడు ధీరలలితుఁడు.

సాహిత్యదర్పణ లక్షణమును గనుఁడు.

నిశ్చింతో మృదురనిశం కలాపరో ధీరలలితః స్యాత్.

నిశ్చింతుఁడన శత్రువులను జయించి రాజ్యభారమును సమర్థులగు మంత్రుల మీఁద నుంచుటచే నెట్టివిచారమును లేనివాఁడు. కళలనఁగా లలితకళలు, నృత్యము, గానము, చిత్రకళ, ద్యూతము, మొదలగునవి. వీనియందు నిరతుఁడును మృదుస్వభావము గలవాఁడును నగువాఁడు ధీరలలితుఁడు. ధీరస్వభావమును లలితస్వభావమును గలవాఁడు ధీరలలితుఁడు. అనఁగాఁ బౌరుషమువిడిచి స్త్రీలోలుఁడై యుండువాఁడు కాఁడని భావము. ప్రతాపశాలియు భోగపరాయణుఁడును నగువాఁడే ధీరలలితుఁడు. వత్సరాజాదు లట్టివారు.

ఈ పద్యమునందలి లక్షణ మేదియు సమగ్రముగాలేదు. నాలుగు లక్షణముల నొకే పద్యములో బిగించుటచే నీ యనర్థము వచ్చినది. సాహిత్యదర్పణ లక్షణములు సమగ్రములు.

## ధీరోదాత్తుఁడు

సీ. చలిచీమ నేనియుఁ జాఁద్రొక్కఁగాఁజాలఁ
డేరీతి గెల్చెనో వైరివరులఁ ?
గలనైన నిజవర్ణనలు సేయ వినఁజాలఁ
డెట్లందుకొనియెనో కృతిచయంబుఁ!
జెలువొందు సాకార చేష్టలెయ్యెడఁగానఁ
డెట్లు నవ్వునో యాత్మహితులతోడఁ !
బరుషాక్షరంబులు పలుకఁ డెక్కాలంబు
నెట్లు భర్జించెనో హీనమతులఁ ?
గీ. బరులఁ జేపట్టఁ; డెలమిఁ జేపట్టివిడువఁ
డలయఁ; డేమఱఁ; డరినైన నవగుణంబు
లెన్నఁ; డోలయనరస ధాత్రీశతిలక
మరయ నరలోక భాగధేయంబుగాదె ! 26

చాఁద్రొక్కఁగాఁజాలఁడు (పా) చావఁద్రొక్కఁగఁజాలఁడు;
చెలువొందు (పా) చెలువొంద; నవ్వునో (పా) నవ్వెనో.

ఇందలి మొదటిపాదముచే నరసభూపాలుఁడు కరుణాళువనియు, ద్వితీయ పాదముచే నవికత్థనుఁడనియు (ఆత్మశ్లాఘ చేయనివాఁడనియు) తృతీయముచే గాంభీర్య

ముగలవాఁడనియుఁ జతుర్థముచే సత్త్వగుణసంపన్నుఁడనియు వ్యక్తమగుచున్నది. కాఁబట్టి నరసభూపాలుఁడు ధీరోదాత్తుఁడు.

## ధీరోద్ధతుఁడు

మ. బలవద్వైరిభిదామదాభిరతమై, భవ్యప్రతాపోజ్జ్వల
జ్వలనజ్వాలజటాలమై, రణభయవ్యాసక్తతత్తన్మనో
జలజాంధంకరణప్రగల్భకుహనా సంపాదియై పొల్చుఁ దా
నిల ధీరోద్ధతవృత్తిమై నరసధాత్రీశోగ్రఖడ్గంబనిన్. ౬

ఇట నరసభూపాలుని ఖడ్గము ధీరోద్ధతము. అది శత్రుబలములను భేదించు మదము గలిగి ప్రతాపాగ్నికి జ్వాలారూపమై, యుద్ధభీతులగు వారి మానసములకుఁ జీఁకట్లు గ్రమ్మించు మాయలమారితనము గలిగి వర్తించును.

ఇట ఖడ్గమునకు శౌర్యము, దర్పము, మాయలమారితనమును జెప్పఁబడినవి. అచేతనమగు ఖడ్గము ధీరోద్ధతమనుటకన్న నరసభూపాలుని భటులు ధీరోద్ధతులుగా వర్ణింపఁబడినచో యుక్తముగా నుండెడిది. ఏలన శౌర్యాదులగు గుణములు చేతన ధర్మములుగదా! ఇఁక నిట నచేతనమగు ఖడ్గమునఁ జేతనత్వమారోపింపవలెను. అనఁగా ఖడ్గమునందు శౌర్యాదిగుణములు స్వభావసిద్ధములు గాక కల్పితములగును. ప్రతాపరుద్రీయోదాహరణమును గనుఁడు.

శ్లో. రే! రే! ఘూర్జర! జర్జరోఽసి సమరే; లంపాక! కిం కంపసే?
వంగ! త్వంగసి; కిం ముధా బలరజః కాణోఽసి కిం కోంకణ!
హూణ! ప్రాణపరాయణో భవ! మహారాష్ట్రాధిపరాష్ట్రే ఽస్యమీ
యోద్ధారో వయమిత్యరీ నభిభవంత్యాంధ్రక్ష్మాభృద్భటాః

తా. ఓరీఘూర్జరా! నీవు యుద్ధమున నలిగితివి; లంపాకుఁడా! వణఁకుచుంటి వేమి? వంగదేశీయుఁడా! పరుగిడుచుంటివి; కోంకణా! సైన్యధూళిచే గ్రుడ్డివాఁడైతివి. హూణా! నీప్రాణములు గాపాడుకొమ్ము. మహారాష్ట్ర! నీరాష్ట్ర మాఁడినది లెమ్ము! మేమాంధ్రభూపతియొక్క యుద్ధభటులము.

ఈపద్యమునఁ బ్రతాపరుద్రుని భటులు ధీరోద్ధతులుగా వర్ణింపఁబడిరి. వీరియం దాత్మశ్లాఘా, దర్పములు గనఁబడుచున్నవి. ఇవి యారోపితములుగాక స్వభావసిద్ధములు. కాన [illegible]

## ధీరశాంతుఁడు

చ. ఇనకులధుర్యుఁడైన నరసేంద్రునిచేతఁ బ్రతిష్ఠితంబు లౌ
నన ఘ మహాగ్రహారములయందలి భూసురకోటి మేటియై
ఘనతర శాఖలం జెలఁగి కాంతశుకక్రమమై చెలంగు న
య్యనిమిషభూజవాటిక్రియ నాత్తశుచిప్రసవాభిరామమై. ౭

నరసేంద్రునిచేత (పా) నరసేంద్రునిచెంత; కాంతశుక (పా) కాంతిశుక;

చెలఁగి (పా) చెలంగు; క్రియనాత్తశుచి (పా) క్రియనాప్తశుచి.

తా. నరసభూపాలునిచేతఁ బ్రతిష్ఠింపఁబడిన యగ్రహారములందలి బ్రాహ్మణకోటి కల్పవృక్షవాటివలె గొప్ప గొప్ప శాఖలు గలిగి (ఋగ్యజుశ్శాఖాదులు) శుక సంచారముగలిగి (శుకమహర్షిప్రోక్తమగు భాగవతకథాపరాయణత గలిగి) శుచిప్రసవముతో నభిరామమై (శుద్ధసంతానము గలిగి) యొప్పుచున్నది. కల్పవృక్షపరముగా నర్థము సుగమము.

ఇందుఁ బ్రశాంతు లగు బ్రాహ్మణులు వర్ణింపఁబడిరి. బ్రాహ్మణులు ధీరశాంత నాయకులు.

మృచ్ఛకటికమునందు బ్రాహ్మణుఁ డగు చారుదత్తుఁడు ధీరశాంతుఁడు. ఒక పద్యమున ధీరశాంత లక్షణమును జూపుట కష్టము. బ్రాహ్మణులు వర్ణింపఁబడిన మాత్రమున ధీరశాంతులని భ్రమింపరాదు. వారిలో ధీరత్వ శాంతత్వములు రెండును గనఁబడవలెను. చారుదత్తాదులందు ధీరత్వ శాంతత్వములు గలవు. కావునఁ బ్రబంధములం దా యా ప్రకరణానుసారముగా ధీరత్వ శాంతత్వములను బ్రదర్శించు బ్రాహ్మణాదులు ధీరశాంతులు. ఈ పద్యమున శాంతత్వమే కాని ధీరత్వము మృగ్యము.

## ధీరలలితుఁడు

ఉ. కుంతలగౌళచోళ కురుఘూర్జర హూణశకాది మేదినీ
కాంతులు సంతతంబు నిజగాఢ బలశ్రుతిమాత్రభీతులై
యింతుల, రత్నహారముల, నెల్లధనంబుల నిచ్చి కొల్వ ని
శ్చింతతఁ దాల్చు నోబయనృసింహుఁడు భోగకళాప్రవీణుఁడై. ౮

తా. కుంతలాదినానాదేశరాజులు తనబలప్రతాపాదులు విని భీతులై కొలువఁగా నరసభూపాలుఁడు భో[illegible] నిశ్చింతతో సుఖించెను,

ఇందు ధీరత్వమున్నది. కాని లలితత్వము వ్యక్తముగాకున్నది. ఈ క్రింది పద్యమును గనుఁడు.

సీ. ఒకసారి పీయూష మోఁకిలింపఁగఁజేయు, గానంబు గావించు వీణమట్టి
యొకతేపఁ గనువిందులకు విందులొనరించుఁ, జిత్తరువులకుఁబోసి జీవకళలు
ఒకతేప నొజ్జలకొజ్జయై వర్తిల్లు, ద్యూతప్రసంగ వైదుష్యమందు
ఒకసారి మదపుటేనికల గొబ్బెలఁకట్లు, వెంటఁ ద్రిప్పుచునుండు వేఁటలందు

గీ. ఒక్కపరి నృత్యకళయందు; నొక్కతడవ, సరసపల్లాపములయందుఁ జదురునూపు
మోపి యౌగంధరాయణు మూపురమున, రాజ్యభారంబునావత్సరాజవరుఁడు.

ఈ పద్యమునఁ గళాపరత్వము మాత్రమే కలదు. ఒక్కపద్యమున ధీరత్వ లలితత్వములు ప్రదర్శించుట సులభముగాదు. కావున వత్సరాజాదులనే యుదాహరింపవలెను. వారికిఁ దత్తన్నాటకములందుఁ దత్తత్ప్రదేశములలో ధీరత్వ లలితత్వాదులు గోచరించును. నా వ్రాసిన వాసవదత్తలో వత్సరాజుయొక్క ధీరత్వ లలితత్వములు లెస్సగాఁ బుష్టములై యున్నవి.

ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలిత పదముల నాల్గింటను 'ధీర' పదమున్నది. ఈ నల్వురికిని ధీరత్వము సాధారణగుణము. ఉదాత్తత్వాదు లసాధారణగుణములు. ధీరత్వమన ధైర్యము. ఇది వీరుని ధర్మము. కాఁబట్టి యుదాత్తాదులు నలువురును వీరులుగాఁగూడ నుండవలయును. హేమచంద్రుఁడు కావ్యానుశాసనమున నీ యభిప్రాయమునే తెలిపెను. ఏమన ధర్మ, యుద్ధ, వీరప్రధానః ధీరోదాత్తః; వీరరౌద్రప్రధానః ధీరోద్ధతః; వీరశృంగార ప్రధానః ధీరలలితః; దానధర్మ వీర ప్రధానః ధీరశాంతః" అని యెల్లరకును వీరత్వము సాధారణముగాఁ దెలిపినాఁడు. కొందఱు ధీరుఁడన సామాన్యమైన నాయకగుణములు (కులము, మహాభాగ్యము మొ॥) గలవాఁడని యర్థముచెప్పుదురు. ఆ పక్షమున నాయక సామాన్యగుణములుదాత్తాదు లందఱకును ముఖ్యముగా నుండవలయును. వానితోపాటు విశేష గుణములగు నుదాత్తత్వాదు లుండవలయుననియు నందురు. కానీ దీనికన్నఁ బైయర్థమే లెస్స.

భారతాది పురాణ గ్రంథములందు సుప్రసిద్ధముగా ధీరోదాత్తాదులుగానున్న వారిని ధీరలలితాదులుగా మార్పరాదు. అనఁగా వీరరస నాయకులగు శ్రీరామ యుధిష్ఠిరాదులను ధీరోద్ధతులుగానో ధీరలలితులుగానో చేయరాదు. శృంగార రసాశ్రయులుగాఁ బ్రసిద్ధులగు ధీరలలితులు వత్సరాజాదులను వీరరసాశ్రయులగు ధీరోదాత్తులుగాఁ జేయరాదు. ఇట్టివానిని రసభంగమందురు.

అవస్థాభేదమును బట్టి వత్స, వృషభ, మహోక్షాది భేదము లేర్పడినట్లే ధీరోదాత్తాది భేదములును నొక్క నాయకునికే చెప్పవచ్చును. అంతేకాని ధీరోదాత్తాది భేదములు జాతిగతభేదములు గావు. అనఁగా జాతిచే బ్రాహ్మణత్వాది ధర్మములు నియతములయినట్లు ధీరోదాత్తత్వాదులును నవస్థాభేదములు గాని నియత ధర్మములు గావు. ఒకే నాయకుఁ డొకప్పుడు ధీరోదాత్తుఁడుగా నొకప్పుడు ధీరోద్ధతుఁడుగా మరొకప్పుడు ధీరశాంతుఁడుగాఁగూడ నుండవచ్చును. కాని యీయవస్థాభేదమును ప్రబంధమున నంగినాయకునిలోఁ జూపరాదు. అంగనాయకునిలోఁ జూపవచ్చును. ఎట్లన మహావీర చరిత్రమున నంగినాయకుఁడు శ్రీరాముఁడు. అతఁడు ధీరోదాత్తుఁడు. గ్రంథ సమాప్తి పర్యంత మాతఁడు ధీరోదాత్తుఁడుగానేయున్నాఁడు. అంగనాయకుఁడగు పరశురాముఁ డవస్థాభేదములో వర్ణింపఁబడియున్నాఁడు. ఎట్లన మహావీరచరిత్రమునఁ నతఁడు రావణునిఁ గూర్చి

శ్లో॥ బ్రాహ్మణాతిక్రమత్యాగో భవతామేవభూతయే
జామదగ్న్యశ్చవోమిత్ర మన్యథా దుర్మనాయతే.

(బ్రాహ్మణులయెడ నపచారమును వదలివేయుట మీకే మంచిది. అట్లయిన యెడలఁ బరశురాముఁడు మీకు మిత్త్రుఁడుగా నుండఁగలఁడు) అని సందేశ మంపి నపుడు ధీరోదాత్తుఁడుగా

శివధనుర్భంగమును గూర్చి విని రోషించి దృప్తుఁడై రామునిఁగూర్చి వెదకుచు వచ్చి

శ్లో॥ కైలాసోద్ధారసారత్రిభువనవిజయార్జిత్యనిష్ణాతదోష్ణః
పౌలస్త్యస్యాపి హేలాపహృతరణమదో దుర్దమః కార్తవీర్యః
యస్యక్రోధాత్కుఠారప్రవిఘటితమహాస్కంధబంధస్థవీరో
దోశ్శాఖాదండషండస్తరురివరహితః కుల్యకంధైఃపురాఽభూత్

(కైలాసపర్వతమును పెల్లగించిన బలముచే ముల్లోకములను జయించిన రావణుని మద మలవోక నణఁచిన కార్తవీర్యార్జునుఁ డెవని కోపముచే గొడ్డట నఱకఁబడిన బహుశాఖలుగల వృక్షమువలె నయ్యెనో)

సోఽయంత్రిస్సప్తవారా నవికలవిహితక్షత్త్రితంత్రప్రమారో
వీరఃక్రౌంచస్యభేదాత్ కృతధరణితలాపూర్వహంసావతారః
జేతా హేరంబభృంగిప్రముఖగణచమూ చక్రిణస్తారకారేః
స్త్వాంపృచ్ఛతి జామదగ్న్యస్స్వగురుహరధనుర్భంగరోషాదుపైతి.

(ఈ జామదగ్న్యుఁ డిఱువదొక్కమారు సకలక్షత్రియ మారణహోమమును చేసినవాఁడు, క్రౌంచపర్వతమును భేదించి మానససరస్సునుండి భూమండలమునకు వచ్చుటకు హంసలకొక క్రొత్తమార్గమును రచించినవాఁడు, హేరంబభృంగిప్రముఖులగు గణసైన్యములతోఁగూడిన కుమారస్వామిని జయించినవాఁడు, తన గురుఁడైన శివుని ధనుస్సును విఱిచితివని విని రోషించి నిన్ను వెదకుచు వచ్చుచున్నాఁడు) అని పలుకునపుడు ధీరోద్ధతుఁడుగా

శ్రీరామునితో యుద్ధముసేసి విజితుఁడై ప్రశాంతదర్పుఁడై

శ్లో॥ పుణ్యా బ్రాహ్మణజాతి రన్వయగుణ శ్లాఘ్యం చరిత్రంచ మే
యేనైకేన హృతాన్యమూని హరతా చైతన్యమాత్రామపి
ఏకస్సన్నపి భూరిదోషగహనః సోऽయం త్వయా ప్రేయసా
వత్స! బ్రాహ్మణవత్సలేన శమితః క్షేమాయ దర్పామయః

(నాసమ్యగ్జ్ఞానలేశమును, పుణ్యవంతమగు నా బ్రాహ్మణవంశమును, నావంశమర్యాదను, శ్లాఘ్యమగు చరిత్రమును, నిర్మూలించిన బహుదోషయుక్తమగు నాదర్పరూపమగు రోగమును బ్రాహ్మణ వత్సలుఁడవును నా ప్రియుఁడవును నగు నీవు శమింపఁజేసితివి)అని వచించినపుడు ధీరశాంతుఁడుగాను వర్ణింపఁబడెను. అంగిభూత నాయకుని కిట్టి యవస్థాభేదముఁ జూపరాదు. ఏలన దానిచేఁ బ్రధానరసమునకు భంగము గలుగును.

గీ. మఱియు శృంగారలీలాసమగ్రయోగ్య
తానిశవిచక్షణులు దక్షిణానుకూల
ధృష్టశఠులనఁగాఁతు లభీష్టమతులు
గలరు తల్లక్షణంబులు దెలివిపఱతు. ౯

దక్షిణుఁడు, అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు, అను పేరుల శృంగారనాయకులు నలుతెఱఁగులుగానుందురు.

## దక్షిణాదుల లక్షణములు

చ. చెలఁగు బహుప్రియాసదృశశీలుఁడు దక్షిణుఁ; డొక్క కాంత నే
వలచి గుణాభిరాముఁడగు వాఁడనుకూలుఁడు; సాపరాధుఁడై
యలుగనివాఁడు ధృష్టుఁడు; ప్రియాశయమాత్రనివేద్యవిప్రియుం
డలశఠుఁ డంద్రు; వీరలకుదాహరణంబులు నిర్ణయించెదన్. ౧౦

తా. పెక్కండ్రు నాయికలయందు సమానప్రీతిగలవాఁడు దక్షిణుఁడు. ఒకతె యందే ప్రీతిగలవాఁడనుకూలుఁడు. అపరాధమైనర్చియుఁ గోపింపనివాఁడు ధృష్టుఁడు. ప్రియురాలికిమాత్రము దెలియఁదగిన యప్రియమునేయువాఁడు శఠుఁడు. అనఁగా శఠుఁడు సేయునప్రియము ప్రియురాలికే కానిపరులకుఁ దెలియదు. పరులకాతఁడను రక్తుఁడుగానే గోచరించును.

ఈపై లక్షణములలో ధృష్టనాయక లక్షణమసమగ్రముగా నున్నది. "వ్యక్తాగా గతభీః ధృష్టః (స్పష్టముగా గోచరించిన యపరాధముగలవాఁడును నిర్భయుఁడు నగు వాఁడు ధృష్టుఁడు) అని ప్ర. రు. లక్షణము. నరసభూపాలీయ లక్షణ వాక్యమున 'అలుంగనివాఁడు' అని కలదు. అలుంగనివాఁ డనఁగాఁ గోపింపనివాఁ డని యర్థము. 'గతభీః' 'అలుంగనివాఁడు' అనుపదములు సమానార్థకములుగావు. 'అళుకని' వాఁడనుటయుక్తము. అళుకనఁగాభయము. కానీ 'అళుకు' పదము విశేష్యముగానే కానీ ధాతువుగాఁ బ్రయుక్తముగాదు. సాహిత్యదర్పణ లక్షణ మింతకన్న మేలైనది.

కృతాఽగా అపి నిశ్శంకస్తర్జితోఽపినలజ్జితః
దృష్టదోషోఽపి మిథ్యావాక్కథితో ధృష్టనాయకః

తా. అపరాధియయ్యు జంకుగొంకులు లేనివాఁడు. తర్జింపఁబడినను లజ్జింపని వాఁడు. దోష మగపడుచున్నను గల్లలాడువాఁడు. అట్టివాఁడు ధృష్టుఁడు.

## దక్షిణుఁడు

ఉ. సాగరమేఖలాసతికిఁ జారుభుజాపరిరంభమిచ్చె; వా
ణీ గగనావలగ్నకును నేర్పుమెయిన్ మొగమిచ్చె; వీరల
క్ష్మీమృగరాజగామిని కమేయభుజాంతరమిచ్చె; సంతత
త్యాగి నృసింహభూవిభుఁడె దక్షిణనాయకుఁ డెన్నిభంగులన్, ౧౧

పా. నాయకుఁ డెంచిచూడగన్.

తా. భూదేవిని, సరస్వతిని, వీరలక్ష్మిని నరసభూపాలుఁడు సమానముగా గౌరవించెనని చెప్పుటచేఁ బెక్కండ్రు నాయికలందు సమానముగా వర్తిల్లెను. కావున దక్షిణ నాయకుఁడు.

## అనుకూలుఁడు

చ. కనకమూ, లంబరంబులును, గ్రామము, లుజ్జ్వలదివ్యరత్న మం
డనములు, వాజివారణఘటల్, ఘనసార సుగంధసారముల్

దనివి దలిర్ప వేఁడిన కొలంది నొసంగుచు నోబభూవసం
దనుఁడగు నారసింహుఁడిల దానరమాప్రియుఁడయ్యె నెంతయున్.

తా. నరసభూపాలుఁ డడిగిన వెల్లఁ దెచ్చియిచ్చుచు దానలక్ష్మీప్రియుఁ డయ్యెననుటచే నతఁడు దానలక్ష్మి కనుకూలుఁడని వ్యక్తమగుచున్నది.

## ధృష్టుఁడు

చ. ఉరముననున్న కుంకుమ మదుజ్జ్వలరోషకషాయవీక్షణ
స్ఫురదరుణాంశుపుంజమని బొంకితి; కన్గవకెంపు భాగ్యబం
ధురసహజాగుణత్వమని నూల్కొనినాడితి; వెట్లుదాఁచె దీ
పరిమళవాసనాలహరి పర్వెడుమేను; నృసింహభూవరా! ౧౩

దాఁచెదు (పా) బొంకెదు.

తా. ఓ నరసభూపాలా! పరస్త్రీసంభోగమున నంటిన నీ యురమునఁ గల కుంకుమమేమని యడుగఁగా నాకోపారుణ నేత్రకాంతులని బొంకితివి. నిద్రలేమిచే నేర్పడిన నీ కంటికెంపేమని యడుగఁగా భాగ్యరేఖలని కల్లలాడితివి; కాని పరిమళించు నీ శరీరము నెట్లు దాఁచెదవు?

ఇట నరసభూపాలుఁడు సేసిన యన్యాంగనాభోగరూపమగు నపరాధము గోచరించుచున్నది. అపరాధము గప్పిపుచ్చుట కాతఁడు గల్లలాడినాఁడు. ఇతఁడు ధృష్టుఁడు. ఈ లక్ష్యమునఁ బ్రతాపరుద్రీయ లక్షణముగానీ నరసభూపాలీయ లక్షణముగానీ పట్టదు. సాహిత్యదర్పణ లక్షణము "దృష్టదోషోఽపి మిథ్యావాక్" అనునది సరిపోవుచున్నది.

## శఠుఁడు

చ. కనుఁగవఁ బాఱఁజూచెదవు కాని మనంబునఁజూడ; వుక్తులం
దనిపెద కానిభావమునఁ దన్పవొకప్పుడు; నీప్రవీణతల్
పనుపడవింక; నీనటలు బచ్చెనచేఁతలుఁ జాలుఁజాలు; నన్
జెనకకు; కీర్తికాంతయె నృసింహ! ప్రియాంగన నీ; కెఱుంగుదున్.

తా. ఓనరసభూపాలా! నీవు నన్నుఁ గన్నులతోఁ జూతువు. కాని మనస్సుతోఁ జూడవు. మాటలతోఁ దృప్తిపఱతువు కాని క్రియలతోఁగాదు. నీమాయలును గపటములును జాలును. నీకుఁ గీర్తికాంతయే ప్రియురాలు.

ఇట నరసభూపాలుఁడు శఠనాయకుఁడు. అతఁడు కనుగవచేఁ బొఱఁజూచుటచే, నవ్వులచేఁ దనుపుటచే, లోకు లతఁడీమెను బ్రేమించియున్నాఁ డనియే తలంతురు. కాని యీరహస్య మామెకే తెలియును. కావునఁ బ్రియురాలికి మాత్రమే తెలియు నప్రియము సేయువాఁ డను లక్షణము పట్టినది.

రత్నావళ్యాదులందు వత్సరాజాదులే శృంగారనాయకులు? మొదట వత్సరాజాదులు పరకాంతానురక్తులు గానంతవఱకు ననుకూలనాయకులు. పరకాంతానురాగము గలిగినపిమ్మట దక్షిణనాయకులు. కానీ యచ్చటచ్చట గూఢవిప్రియత్వము, సాపరాధత్వము మొదలగునవి కానవచ్చుటచే ధృష్టత్వ శఠత్వములుగూడ గోచరించుచున్నవని కదా! ప్రశ్న. నిజమే. అటనట నట్లు కానఁబడినను దత్త్రూపకసమాప్తివఱకు జ్యేష్ఠురాలియం దనురాగమే వారు జూపుచుంటచే దక్షిణనాయకులే యగుదురు. కాన దక్షిణునియందుఁ గొలఁదిగా గూఢవిప్రియకారిత్వాదులు గానవచ్చుచున్నను బ్రధానముగా దాక్షిణ్యమే కానఁబడును. శఠాదులం దది ముఖ్యమే.

వెనుకటి ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలితు లొక్కొక్కరును దక్షిణానుకూల ధృష్ట శఠభేదములచే నలుదెఱఁగులై మొత్తము పదునాఱుతెఱఁగు లగుదురు. ఎట్లన దక్షిణధీరోదాత్తుఁడు, దక్షిణధీరోద్ధతుఁడు, దక్షిణధీరశాంతుఁడు, దక్షిణధీరలలితుఁడు, అనుకూలధీరోదాత్తుఁడు, అనుకూలధీరోద్ధతుఁడు, అనుకూలధీరశాంతుఁడు, అనుకూలధీరలలితుఁడు; ధృష్టధీరోదాత్తుఁడు, ధృష్టధీరోద్ధతుఁడు, ధృష్టధీరశాంతుఁడు, ధృష్టధీరలలితుఁడు; శఠధీరోదాత్తుఁడు, శఠధీరోద్ధతుఁడు, శఠధీరశాంతుఁడు, శఠధీరలలితుఁడు" అని. మఱియు నీపదునాఱుగురగు నాయకులును నుత్తమ మధ్యమాధమ భేదములచే నలువదియెనిమిది విధములనాయకు లగుదురు. మఱియుఁ గామశాస్త్రమున నీక్రిందివిధమునఁ జెప్పఁబడినది.

శ్లో॥ పుంసశ్చతుర్ధా కధితః కామశాస్త్రేషు జాతితః
దత్తో భద్రః కూచిమారః పాంచాల ఇతి సూరిభిః
పద్మినీవల్లభో దత్తో భద్రఃస్యాచ్చిత్రిణీ ప్రియః
పాంచాలకూచిమారౌతు హస్తినీ శంఖినీ ప్రియౌ ॥

వెనుక నవస్థాభేదమునుబట్టి ధీరోదాత్తాది భేదములును దక్షిణాదిభేదములును వచింపఁబడినవి. ఇఁక జాతిభేదముఁబట్టియుఁ గొన్ని భేదములు గలవు. దత్తుఁడు, భద్రుఁడు, కూచిమారుఁడు, పాంచాలుఁడు, అని కామశాస్త్రమున నాలుగుజాతుల నాయకులు గలరు. దత్తుఁడు పద్మినీజాతి స్త్రీప్రియుఁడు; భద్రుఁడు చిత్రిణీప్రియుఁడు; పాంచాలుఁడు హస్తినీప్రియుఁడు; కూచిమారుఁడు శంఖినీ ప్రియుఁడు.

మఱియు దివ్యులు, అదివ్యులు, దివ్యాదివ్యులు, అనియు జాతినిఁబట్టి నాయకులు గలరు. శంకరాదులు దివ్యులు; అర్జునాదులు అదివ్యులు; శ్రీకృష్ణాదులు దివ్యాదివ్యులు.

కావ్యములందు రాజైనయీనాయకు నెట్లువర్ణింపవలెనో తెలుపుదుము.

గాత్రము — అత్యంతపీనత్వము, ఉచ్చత, దీర్ఘబాహుత్వముగలదిగా నుండవలెను.
బాహువులు — యుగ, అర్గళ, సర్ప, దండ, స్తంభ, గజకరములలో నుపమింపఁబడవలెను.
వక్షము — కవాట, శిలాపట్టములలో నుపమింపఁబడవలెను
అంసము — విపులముగా నున్నట్లు వర్ణింపవలెను
మధ్యము — కర్కశముగా ,,
హృదయము — స్వచ్ఛముగా ,,
ప్రతాపము — అర్క, అగ్ని వజ్రములతో నుపమింపఁదగును
కీర్తి — చంద్రాది శుభ్రపదార్థములతో ,,
కరము — పద్మ, ఊర్ధ్వరేఖాదులు గలదిగా వర్ణింపవలెను
పదములు — ఛత్ర, చామరాదిరేఖలు ,, ,,
గమనము — హస్తి సింహముల గమనముతో నుపమింపవలెను
కార్కశ్యము — భుజాదులలో నున్నట్లు వర్ణింపవలెను

కం. ప్రకటీకృతులగు నీ నా
యకులకు విటపీఠమర్దునఁజేటవిదూ
షకులనఁగలరు ప్రియాకే
ళి కళా సంఘటనపటిమలీలాచార్యుల్. ౧౭

తా. పైనుదాహృతులగు నాయకులకుఁ బ్రియురాలితోడి పొత్తుఁగూర్చ నేర్పరులు విట, పీఠమర్ద, చేట, విదూషకులు, అను నలువురు సహాయులు గలరు. విటాదుల కిది సామాన్యలక్షణము. విశేషలక్షణములు క్రిందఁ జెప్పఁబడుచున్నవి.

## విటాదుల లక్షణములు

చ. వసుమతి నేకవిద్యగలవాఁడు విటుండనఁబొల్చు; నాయకో
ల్లసనముకన్న [illegible] గుణయుతుఁడు పీఠమర్దుఁడుం;

డసదృశ బాలికా సుఘటనాది రహస్యవిదుండు చేటకుం;
డెసఁగు నజస్రహాస్యరస హేతువువాఁడు విదూషకుండనన్. ౧౬

తా. విటుఁ డన నేక విద్యగలవాఁడు. "ఏకవిద్యో విటః స్మృతః" అను ప్రా ర్వు లక్షణమున కిది యనువాదము. ఏకవిద్య యనఁగా నేమో యస్పష్టముగా నున్నది. "వేశ్యానాగరకయోః పరస్పరం సందేశం విటతికథయతీతి విటః విటశబ్దే ఇతి యశోధరః (వేశ్యానాగరకులకుఁ బరస్పరమును సందేశమును జెప్పువాఁడు) అని నిర్వచనము గలదు. సాహిత్యదర్పణమున విటలక్షణ మిట్లు గలదు.

"సంభోగహీన సంపద్విటస్తు ధూర్తః కలైకదేశజ్ఞః
వేశోపచారకుశలో వాగ్మీ మధురో బహుమతో గోష్ఠ్యాం"

సంభోగమునకుఁ జాలని సంపదగలవాఁడు. అనఁగా వట్టి యసమర్థుఁడును, బీదరియు, నృత్యాది కళలలో నేకదేశ మెఱిగినవాఁడును, వేశకరణమున (వేశ్యా నాగరకుల సమకూర్చు కార్యమున) నిపుణుఁడును, మాటకారియు, గోష్ఠియందు (వయస్యసమాజమందు) బహుమానితుఁడునునగువాఁడు విటుఁడు. ఈ కాలమున నిట్టి వానినిఁ దార్పుకాఁడందురు.

పీఠమర్దుఁడు:— స్వార్థమున వికల్పముగా 'క' ప్రత్యయము వచ్చినచోఁ బీఠమర్దకుఁడు అను రూపమునునుండును. ఇతఁడు నాయకుని కన్నఁ గొన్ని గుణ ములం దక్కువగలవాఁడై యుండును. సాహిత్యదర్పణమున నీలక్షణమిట్లుగలదు.

"దూరానువర్తిని స్యాత్తస్య ప్రాసంగి కేతివృత్తేతు
కించిత్తద్గుణహీనః సహాయ ఏవాస్యపీఠమర్దాఖ్యః"

ఆధికారికేతివృత్తమునందలి ప్రాసంగికేతివృత్తమునకు నాయకుఁడును, ప్రధాననాయకుని కన్నఁగొంచెము తక్కువవాఁడునునగువాఁడు పీఠమర్దుఁడు. ప్రతాప రుద్రీయమునందు వలెనే నరసభూపాలీయమునఁ బీఠమర్దునికి మిగిలిన మువ్వురితో సమానముగాఁ బ్రియాసంఘటకత్వము చెప్పఁబడినది. ఇది దోషము. సాహిత్య దర్పణమున పీఠమర్దలక్షణము "దూరానువర్తిని" ఇత్యాదికముగాఁ బ్రత్యేకముగా నిర్వచించి 'అథశృంగార సహాయాః'

శృంగారేఽస్యసహాయావిటచేట విదూషకాద్యాఃస్యుః
భక్తానర్మసునిపుణాః కుపితవధూమానభంజనాశ్శుద్ధాః

అని శృంగారరససహాయులుగా విట, చేట, విదూషకాదులనే గ్రంథకర్త పేర్కొనెను. మరియు 'శృంగారామృతలహరి'లో నిట్లుగలదు.

"యద్యప్యేతేన పీఠమర్దశ్శృంగారే సచివః కుపితవధూ ప్రసాధకశ్చేత్యుక్తం కైశ్చిత్ । తత్పరాస్తం" (పీఠమర్దుఁడు శృంగారసచివుఁడనియుఁ గుపితవధూమాన భంజకుఁడనియుఁ గొందఱు నుడివిరి. అది తప్పు)

రామాయణమునందలి సుగ్రీవుఁడు పీఠమర్దుఁడు. ఇతఁడు వీరరసనాయకుఁ డగు శ్రీరామునికి సహాయుఁడు. ప్రియాసంఘటకుఁడుగాఁడు. ఇట్టి వానిని విటా దులలోఁ జేర్పరాదు. ప్రధాననాయకుని కన్నఁగొంచెము తక్కువ గుణములుగల వాఁడని చెప్పఁబడుటచే నితఁడును గొంతవఱకు వీరరసాశ్రయుఁడేయగును. మరియు నితఁడు ప్రాసంగికేతివృత్తమునకు నాయకుఁడగుటచే నితనికిఁ బ్రత్యేకప్రయోజనము గూడఁగలదు. సుగ్రీవునికి భార్యారాజ్యప్రాప్తులు ప్రయోజనము. మాలతీమాధవ మున మకరందుఁడు పీఠమర్దుఁడు. అతనికి మదయంతీలాభముగలదు. మిగిలిన విటాదుల కిట్టి ప్రయోజనములు గానరావు. ఒకానొకచో శృంగారరసమునఁ బీఠ మర్దుఁడు విదూషకాదులతోపాటు నాయకానుకూలమున సహాయుఁడుగా వచ్చును. వీరరసమున నట్లుగాదు. కానఁ బీఠమర్దలక్షణముఁ బ్రత్యేకముగానే చెప్పవలెను.

చేటుఁడు:— కామినీకాముకులను సమకూర్చురహస్య మెఱిఁగినవాఁడు.

విదూషకుఁడు:— ఇతఁడు హాస్యగాఁడు. ఇతఁడు గలహాసక్తుఁడుగాఁగూడ వర్ణింపఁబడును. ఇతఁడు సంస్కృత నాటకములలో స్వనామముతోడనే (మైత్రే యుఁడు-వసంతకుఁడు) వ్యవహరింపఁబడుటయుఁ గలదు. కొన్నియెడలఁ గేవల విదూషకపదముచేతనే వ్యవహరింపఁబడును. ఇతఁడు సామాన్యముగా వేషభాషలచే హాస్యముఁ బుట్టించుచున్నను రూపకములలోఁ దిండిపోతుగా జగడాలమారిగా వ్యవహరింపఁబడును.

సాహిత్యదర్పణమునందలి 'శృంగారేఽస్యసహాయాః' అను లక్షణ శ్లోకమున 'భక్తానర్మనిపుణాః కుపితవధూమానభంజనాశ్శుద్ధాః' అని కలదు. ఇందు వీరు మువ్వురును శుద్ధులని చెప్పఁబడినది. శుద్ధులనఁ బరదారసాంగత్యము లేనివారని యర్థము. వీరు నాయికలను నాయకులకుఁ గూర్చువారే కాని యానాయికా సాం గత్యము లేనివారని యర్థము. కావుననే వీరిని నాయకులు విశ్వసింతురు.

సంస్కృత నాటకములలోఁ బీఠమర్దునకును విటునకును బ్రాయికముగా సంస్కృతభాష యుపయోగింపఁబడుటయుఁ (నాగానందమునఁ విటుఁడు ప్రాకృతము

మాటలాడును. భావప్రకాశమునఁ బ్రాకృతభాషియనిఁ జెప్పఁబడినది.) చేటవిదూష కులకుఁ బ్రాకృత ముపయోగింపఁబడుటయుఁ జూడఁ బీఠమర్ద విటు లుత్తమపాత్రు లనియుఁ జేటవిదూషకులు నీచపాత్రలనియును దెలియుచున్నది. చేటవిదూషకులలో విదూషకుఁడు బ్రాహ్మణుఁడును రాజావలంబముగలవాఁడును నగుటచేఁ గొంచెము మిన్న. చేటుఁ డధముఁడు. సాహిత్యదర్పణమున

> ఉత్తమాః పీఠమర్దాద్యాః (ఆద్యశబ్దాత్ మంత్రి పురోహితాదయః) మధ్యే విటవిదూషకౌ। తథా శకారచేటాద్యా అధమాః పరికీర్తితాః (ఆద్య శబ్దాత్ తాంబూలిక గాంధికాదయః.)

తా. పీఠమర్ద, మంత్రి పురోహితాదు లుత్తములు; విటవిదూషకులు మధ్య ములు; శకార, చేట, తాంబూలిక, గాంధికాదు లధములు. దీనినిఁబట్టియుఁ బీఠ మర్దునిఁ దక్కినవారితోఁ గలుపుట యయుక్తము. వీరుగాక మాలాకార, రజక, తాంబూలిక, గాంధిక ప్రభృతులును నటనట శృంగార సహాయులుగా నుందురు. మరియు నంతఃపురమునఁ బరిచారకులు వామన, షండ, కిరాత, మ్లేచ్ఛ, ఆభీర, శకార, కుబ్జాదులును గలరు. వామనాదులు రత్నావళిలో గానవత్తురు. శకారుఁ డున్మత్తుఁడును మూర్ఖుఁడునుగా నుండును. ఇతఁడు లేని యంపుడుకత్తె తమ్ముఁడు. కాన రాజు బావమఱఁది. ఇతఁడు మృచ్ఛకటికమునఁ జక్కఁగాఁ బ్రదర్శింపఁబడి యున్నాఁడు.

మఱియు రాజగు నాయకునకు నర్థ (కార్య) చింతనమున మంత్రియు, దండమున (దుష్టనిగ్రహ కార్యము) సుహృత్, కుమార, ఆటవిక, సామంత సైని కాదులును, ధర్మకార్యాచరణమున ఋత్విక్కులు, పురోహితులు, బ్రహ్మవేత్తలు, తాపసులును సహాయులు.

మరియు రాజు స్వాయత్తసిద్ధి, సచివాయత్తసిద్ధి, ఉభయాయత్తసిద్ధియు నని ముత్తెఱఁగులుగా నుండును. స్వాయత్తసిద్ధి యనఁ దన యాయత్తమైన కార్యసిద్ధిగల వాఁడు. అనఁగాఁ గార్యసిద్ధిపట్లఁ బరసాహాయ్య మపేక్షింపక తానే వ్యవహరించు వాఁడు. శ్రీరాముఁడు మొదలగువారు స్వాయత్తసిద్ధులు. సచివాయత్తసిద్ధి యనఁ గార్యభార మంతయు మంత్రులపై మోఁపియుంచినవాఁడు. ఇతఁడు నిశ్చింతుఁడు. చంద్రగుప్త (ముద్రారాక్షసమున) వత్సరాజాదులు సచివాయత్తసిద్ధులు. ఉభయా యత్తసిద్ధి యనఁగా రాజమంత్రు లిరువురిమీఁదను గార్యసిద్ధి యాధారపడి యుండును. యుధిష్ఠిరాదులు ఉభయాయత్తసిద్ధులు.

## స్వీయాదుల లక్షణములు

క. ఈమతమున స్వీయాన్యా
సామాన్యలనంగఁగలరుసతుల్; లందుఁ ద్రపా
సామగ్రీ, శీలార్జవ
కోమలకమనీయ, స్వీయ, గుణములఁజెలఁగున్. ౧౭

తా. లజ్జాసామగ్రియు, ఋజుశీలము అనఁగాఁ బాతివ్రత్యమును గలిగి కోమలత్వముఁ గమనీయత్వమును గలది 'స్వీయా' నాయిక. అగ్నిసాక్షిగా వివాహమాడిన యుత్తమురాలగు భార్య స్వీయ.

క౦. అన్యయనఁగ నవోఢయుఁ
గన్యయు; సామాన్యయనఁగ గణికామణి; యీ
మాన్యల కుదాహరణముల
నన్యాదృశవిశదఫణితి నాపాదింతున్. ౧౮

తా. కన్యయు, నవోఢయు, నని యన్యస్త్రీ లేక పరకీయ యిఱుదెఱఁగులు. కన్యయన వివాహముగాని పడుచు. అనోఢయనఁ బరుని వివాహమాడిన స్త్రీ. సామాన్యయనఁగా వేశ్య. ఇది సర్వసాధారణస్త్రీ. వీరి కుదాహరణములందెలుపుదును.

### స్వీయ

చ. అమృతమువంటిసద్గుణము, నంచితచంద్రకళావిలాసభా
వము, శివగోత్రభూతియు నవారణఁదాల్చి యశఃపురంధ్రి తాఁ
గమలవనీహితాన్వయశిఖామణియైన నృసింహమేదినీ
రమణున కేకపత్నియన రంజిలు లోకములెల్ల మెచ్చఁగన్. ౧౯

తా. అమృతమువలెఁ బరిశుద్ధమగు గుణమును, చంద్రకళవలె స్వచ్ఛమైనభావమును, (ఈరెంటివలన సాభ్యంతరమగు శుద్ధి గోచరించును) శివగోత్రభూతియును (కైలాసముయొక్క యైశ్వర్యమువంటి యైశ్వర్యము అనఁగాఁ దెల్లఁదనమును- శుభవంశక్రమమును, (దీనివలన బాహ్యశుద్ధి గోచరించును) వహించిన కీర్తికాంత సూర్యవంశశ్రేష్ఠుఁడగు నరసింహభూపాలున కేకపత్నియయి రాజిలుచున్నది.

ఇటఁ గీర్తికాంత బాహ్యాభ్యంతరములయందు మిక్కిలి పరిశుద్ధురాలైయుంట వలన స్వీయ.

## అన్యోఢ (పరకీయ)

సీ. పారసీక క్షమాపతుల చొప్పడఁగించి
నేర్పుమీఱఁగ మోహనిద్ర పుచ్చి
యవనసేనాధినాయకుల దోః స్తంభసం
భరితప్రతాపదీపంబు లడఁచి
యభిభూతమానమల్కానిష్కృతాయశో
ధ్వాంతసంతతి కాత్మసంతసిల్లి
సమదముష్కర తురుష్క ప్రాప్త సీమల
నడుగు మోపఁగనీక యరుగుదెంచి

గీ. ప్రాజ్యసామ్రాజ్య యగు వారి రాజ్యలక్ష్మి
కదనసంకేతమున జారకాంత యగుచు
సంచితస్ఫూర్తి నిన్ను వరించె నౌర!
వైరి గజసింహ! ఓబయ నారసింహ! ౨౦

తా. పారసీక రాజుల రాజ్యలక్ష్మి యా ప్రభులను నిద్రవుచ్చి, వారి సేనానాయకుల ప్రతాపదీపము లార్పి, వారి సైన్యములోని ఖానులయొక్క యపయశస్సను జీఁకటినిఁ గాంచి సంతసించి వారి సైనికులయిన తురుష్కులు వసించు ప్రదేశమున నడుగుమోపక వచ్చి యుద్ధరంగ మను సంకేతస్థలమున నిన్ను వరించుచున్నది. ఇటఁ బారసీక రాజ్యలక్ష్మి యన్యోఢ.

సాహిత్యదర్పణమున "యాత్రాది నిరతాన్యోఢా కులటా గళితత్రపా" అని యన్యోఢకు లక్షణము వచింపఁబడినది. యాత్ర యనఁగా నేదో నెపముతో నటు నిటు తిరుగుట; ఆదిశబ్దముచేఁ దలవాఁకిట నిలుచుట, కిటికీలోనుండి తొంగిచూచుట మొదలగు పనులు; వీని యందాసక్తురాలును సిగ్గును వదలినదియు నగు అంకుటాలు.

మ. మగఁడా! ఊర్చినఁ బ్రేవులెంచు; సవతుల్ మచ్చిత్తముందివ్వి చూ;
త్తగు నాయత్త గయాళి; పట్టుఁబసి; యేరాండ్రా? దృగంతంబులం
దగ భేదింతురు; నిష్ఫలంబు శ్రమ; కన్సన్నల్ వృధ! పొమ్మిక
వగలాఁడా! యిదె దొలనుండియె నమోవాకంబు నర్పించెదన్.

ఇట నతఁడు నా మగఁడనియుఁ నీవు నా వగలాఁడవనియుఁ దెలుపుటచే నీవు నా ప్రియుఁడవని వ్యంగ్యము. దీనివలన నీ యువతికిఁ బరనాయక విషయకమగు రతి గోచరించుచున్నది.

## కన్య

శా. ఆజానేయము నెక్కి యోబయనృసింహస్వామి వాహ్యాళి రా
నోజంగాంచన సౌధవీథిక దదీయోల్లాసముం జూచి యా
తేజోవిభ్రమ ధన్యకన్య మదనార్తిం జెంది ప్రాసాదపా
ళీజాగ్రన్మణిపుత్త్రికా నిచయుతిం దాల్చెం దదగ్రత స్వాంతయై. ౨౧

తా. నరసభూపాలుఁడు గుఱ్ఱమెక్కి స్వారిరాఁగా బంగారు మిద్దెపైనిఁ గూర్చుండి యతని యందముఁ గాంచి యొక కన్య మదనపరవశయై ప్రాసాదము నందున్న మణిపుత్త్రిక వలెనే నిశ్చేష్టురాలై నిలిచెను.

ఇట నొక కన్య నరసభూపాలుని మోహించినది. ఇట్లు పరకీయ ద్వివిధ. కానీ యీ పద్యమునఁ గన్యాలక్షణము లెవ్వియుఁ గాన వచ్చుటలేదు. సాహిత్య దర్పణమున "కన్యాత్వజాతో పయమా సలజ్జాంవయౌవనా" (వివాహము కానట్టియు లజ్జాయౌవనములు గలిగినదియునగు నది కన్య) అని లక్షణము చెప్పఁబడినది. ఈపె తండ్రి మొదలగు వారి స్వాధీనమున నుంటచేఁ బరకీయ లేక అన్య.

## సామాన్య

కం. ఏరీతి వారు బొందిన
నారీతిఁ దదీయరాగ మందెడు నౌరా!
వారాంగన; యది సాక్షా
త్కారపుఁ బటికంపు బొమ్మ కాఁబోలుఁ జుమీ! ౨౨

తా. ఈవారాంగన సాక్షాత్కరించిన స్ఫటికపు బొమ్మయై యుండును. స్ఫటికము తన సమీపమున నున్న వస్తువులను దనలోఁ బ్రతిబింబించుకొనఁజేయును. అనఁగా వానిని లోఁగొనును. అట్లే తన్నుఁడాసిన వారి నెల్లరను దాను లోఁగొనును. సాహిత్యదర్పణమున సామాన్యలక్షణ మట్లున్నది.

'ధీరా కళాప్రగల్భా వేశ్యా సామాన్యనాయికా'.

తా. ధీరురాలనఁ జతురురాలు. కళలనఁ బరప్రతారణము సేయుటకై నేర్చిన నృత్యగీతాదులు. వీనియందు నేర్పుగలది. వేశ్యయనఁ జక్కని వేషమును ధరించునది. మరియు

"నిర్గుణానపి నద్వేష్టి నరజ్యతిగుణిష్వపి
విత్తమాత్రం సమాలోక్య సా రాగం దర్శయేద్బహిః

"కామమంగీకృతమపి పరిక్షీణధనం నరం
మాత్రానిష్కాసయేదేషా పునస్సంధాన కాంక్షయా
తస్కరాఃపండకామూర్ఖాః సుఖప్రాప్తధనాస్తథా
లింగినశ్ఛన్నకామాద్యా అస్యాః ప్రాయేణవల్లభాః
ఏషాపిమదనాయత్తా క్వాపి సత్యానురాగిణీ
రక్తాయాంవావిరక్తాయాం రతమస్యాం సుదుర్లభం"

తా. గుణహీనులను ద్వేషింపదు. గుణవంతులను ప్రేమింపదు. కేవలము ధనమునుజూచి పైకనురాగముఁ జూపును. అట్లు ప్రేమతోఁ జూచియును నతఁడు ధనహీనుఁడు కాఁగానే తనమీఁది ప్రేమతో నెచ్చటదేనిఁ దిరిగి మరల ధనమును గొనివచ్చునని తన మాతచే, నిల్లువెడలించును. దొంగలు, పండకులు, (వాయ్వగ్ని దోషమువలన నెవని వృషణములు నశించునో వాఁడు పండకుఁడు) మూర్ఖులు, సుఖ ప్రాప్తధనులు, బ్రహ్మచారులు, భగ్నకాములు (రహస్యముగాఁ గామించువారు) ను నీసామాన్యకుఁ బ్రియులు. ఈవేశ్యయు మదనాయత్తురాలై యొకానొకచో సత్యాను రాగమును బ్రకటించును. ఈమె రక్తురాలైనను, అపరక్తురాలైనను దీనిరతము సుదుర్లభము. (ఏలనఁ బహుపురుషగామిని యగుటచే రోగాలపుట్టయైయుండు నీమె సురతము ప్రతిబంధక భూయిష్ఠము)

మరియు "రక్తైవత్వప్రహసనే నైషా దివ్యనృపాశ్రియే" (ప్రహసనవర్జితమైన ప్రకరణాదులలో నీవేశ్య యనురక్తురాలుగానే యుండును. ప్రహసనమున నపరక్త గానే యుండును. అపరక్తగానున్ననే హాస్యహేతువగును. దివ్యనృపాశ్రియ మగు నాటకమున దీనిని నాయికగాఁ జేయరాదు.

మృచ్ఛకటికమున వసంతసేన యను సామాన్యనాయిక అనురక్తురాలు. లటక మేళకప్రహసనమున మదనమంజరి యపరక్తురాలు.

ఈ స్వీయా, పరకీయా, సామాన్యనాయిక లొక్కొక్కతెయు, అన్యసంభోగ దుఃఖిత, వక్రోక్తి గర్వితా, మానవతి యని మువ్విధము లగును. ఏతల్లక్షణ లక్ష్యము లను రసమంజరినిఁ జూడుఁడు. గ్రంథవిస్తరభీతిచే నిందుదాహరింపఁబడలేదు.

కం. ఈమగువల కాద్యయు, ము
గ్ధా, మధ్యా, ప్రౌఢలనఁగఁ దగునవ్యవయో
వ్యామిశ్రిత యోగ్యములగు
నామములు; తదీయలక్షణము లేర్పఱతున్. ౨౩

తా. పైనుదాహృతలగు మువ్వురిలో స్వీయ, ముగ్ధా, మధ్యా, ప్రౌఢా భేదములఁ బరగును. వీని నామములు నూతనవయస్సంబంధమువలన నేర్పడినవి. ప్రౌఢకుఁ బ్రగల్భయనియు నామాంతరము.

చ. నవనవ కామయౌవనసనాథయు, నల్పరతంబు గల్గు న
య్యువతియె ముగ్ధ; మధ్య సదృశోదిత యౌవనకామయై రతాం
తవివశయౌ లతాంగి; సతతప్రథితోల్బణ కామయౌవనో
త్సవ, సురతాదిమోహమునుదాల్చు తిలోదరి ప్రౌఢ తానగున్.

పా. ప్రౌఢయైతగున్.

తా. నూతనమగు కామమును (సంభోగేచ్ఛ) యౌవనమును గలదియు, నల్ప రతము గలిగినదియు నగునది ముగ్ధ. యౌవనమును, గామమును, సమానముగాఁ గల దియు రతాంతమున వివశురాలును నగునది మధ్య. మిక్కిలి కామమును యౌవన మును గలిగి రతియొక్క యారంభమందే మోహముగలది ప్రౌఢ. ఇందలి లక్షణ మెయ్యదియు నిస్సందిగ్ధముగా లేదు. ప్రతాపరుద్రీయమునందలి

ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా
లజ్జామన్మథమధ్యస్థా మధ్యమోదితయౌవనా
స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా

(ఉదయించుచున్న యౌవనముగలదియు, మదనాభిలాషను (సంభోగేచ్ఛను) జయించిన సిగ్గుగలదియు నగు స్త్రీ ముగ్ధ; ఉదయించిన యౌవనముగలదియు, లజ్జ యును మదనాభిలాషమును సమానముగాఁగల స్త్రీ మధ్య; సంపూర్ణముగా వికసించిన యౌవనముగలదియు, లజ్జను బోఁద్రోలిన మదనాభిలాషము గలదియు నగు స్త్రీ ప్రౌఢ.) అను లక్షణము నరసభూపాలీయ లక్షణముకన్నఁ గొంత బాగుగానే యున్నది. ఏలన నీ లక్షణములలో ఉదయద్యౌవనా, ఉదితయౌవనా, సంపూర్ణ యౌవనా, పదములు సార్థకములు. చాల ముఖ్యములయినవి. న| భూ| లక్షణము లలో నిట్టియర్థములు స్పష్టముగాలేవు. కానీ సా|ద| లక్షణము సమగ్రముగానున్నది.

ప్రథమావతీర్ణయౌవన మదనవికారా రతౌ వామా
కథితామృదుశ్చమానే సమధికలజ్జావతీ ముగ్ధా ॥

తా. క్రొత్తగా దిగిన యనఁగా నంకురించిన యౌవనమును, మదనవికారమును గలదియు, రతియందుఁ గొంచెము ప్రతికూలతఁ జూపునదియు, మృదువైన ప్రణయ

కోపముగలదియు, మిక్కిలి లజ్జగలదియు నగు స్త్రీ ముగ్ధ. ఇందు 'రతౌ వామా' 'మృదుశ్చమానే' అను లక్షణవిశేషము ప్ర। రు। లక్షణమున లేదు.

## ముగ్ధ

శా. ఆలాపంబున కుత్తరంబొసఁగ దాయాసంబునంగాఁ; దా
నాలోకింపదు; పాటలాధరమరందాస్వాద సమ్మర్దముం
దాళంజాలదు; కౌఁగిలీయదు తనూతాపంబు చల్లాఱఁగా
నేలజ్జావతి; తద్రతంబు దయితాభీష్టంబు గాకుండునే? ౭౫

తనూతాపంబు (పా) మనస్తాపంబు.

నరసభూపాలీయ లక్షణ మగు 'నవనవ కామయౌవన సనాథయు' ననునది యీ లక్ష్యమున సమన్వయింపదు. 'అల్పరతంబుగలది' యనుటకన్న 'రతౌవామా' (రతియందుఁ బ్రతికూలతఁజూపునది) అనుటయే మంచి లక్షణము. 'రతౌవామా' అను లక్షణమున కీ పద్యము లక్ష్యము గాఁగలదు. సాహిత్యదర్పణమున "౧. ప్రథమావతీర్ణ యౌవనముగలది, ౨. ప్రథమావతీర్ణ మదనవికారముగలది. 3. రతివామ, ౪. మానమృదువు, ౫. లజ్జావతి యనువాని కన్నింటికినిఁ బ్రత్యేకోదాహరణము లీయఁబడినవి. ఎట్లన

౧. ప్రథమావతీర్ణ యౌవనముగల స్త్రీ

చ. నెలఁతనితంబముల్ నడిమి నిండుతనంబు హరించె; అొమ్ములం
గల క్రశిమంబులాఁగుకొనెఁ గాను; గ్రహించెను రోమవల్లి క
న్నుల బుజావర్తనంబును; మనోజుఁడు గద్దెపురాఁగఁ గొత్తగా
బలిమిని దోఁచుకొన్నటులుంవర్తిలె నొండొరులం దదంగముల్.

౨. ప్రథమావతీర్ణ మదనవికారముగల స్త్రీ

చ. అడుగిడు మెల్లమెల్లభువి; నంతిపురంబును వీడిరాదెటుల్;
దుడుకున నవ్వఁబోదు; మదిలో నిముసంబునఁగొన్న సిగ్గునం
గడబిడఁబొందుఁ; బల్కునొకకాస్తగభీరిమ, కొద్ది వక్రిమం
బడర; నిజప్రియుంగుతిచి యాడుచెలింగను సెత్త్రిభూపటిక్.

3. రతివామ యగు స్త్రీ

శా. ఆలాపంబున కుత్తరంబొసఁగదు. (వైపద్యము)

౪. మానమృదు వగు స్త్రీ

సాపత్యుః ప్రథమాపరాధసమయే సఖ్యోపదేశం వినా
నో జానాతి సవిభ్రమాంగవలనా వక్రోక్తి సంసూచనం
స్వచ్ఛైరచ్ఛకపోలమూలగళితైః పర్యస్త నేత్రోత్పలా
బాలా కేవలమేవ రోదితి లుఠల్లోలాలకైరశ్రుభిః.

తొలిసారి ప్రియుఁ డపరాధ మొనర్చినను సఖియొక్క యుపదేశము లేక యంగమాలను ముడుచుకొని వెనుదిరిగి పరుండుట, వక్రోక్తులు పలుకుట, మొదలగు పను లెఱుఁగదు. కేవలము బాష్పములు విడుచుచు విలపించును.

౫. సమధిక లజ్జావతి యగు స్త్రీ

చ. అడుగిడు మెల్లమెల్లభువి (పై పద్యము)

సమధిక లజ్జావతి యనుటచేతనే రతియందుఁ బ్రతికూలురాలని చెప్పఁబడియే యున్నది. మరల రతివామత్వ మేల చెప్పవలసివచ్చెనని శంకించుకొని విచ్ఛిత్తి విశేషమునకై (సౌందర్య విశేషము) చెప్పితిమని సమాధానించెను.

ఈ ముగ్ధ అజ్ఞాతయౌవన, జ్ఞాతయౌవన, నవోఢ, విస్రబ్ధనవోఢ, అని యు భేదములు గలది. (చూ. రసమంజరి).

## మధ్య

ఉ. మానితవైఖరిన్ మణితమంత్రములం, గబరీవినిర్గళ
త్సూనములం బ్రసూనశరశూరునిఁ బూజలొనర్చి తా రతిన్
మానిని యొప్పె నప్పు డసమాన మనోఽంబుజపీఠి నాతనిన్
ధ్యానము సేయుకైవడి రతాంత నితాంత నిమీలితాక్షియై. ౨౬

తా. మణిత మంత్రములచేతను, గబరినుండి జాఱుచున్న పూలతోడను నాయువతి మన్మథపూజసేసి వివశురాలై యాతనిని ధ్యానము సేయుచున్నగతినుండెను.

ఇందు రతాంత వివశురాలగు మధ్య వర్ణింపఁబడినది.

సాహిత్య దర్పణమున మధ్యాలక్షణ మిట్లుగలదు.

మధ్యా విచిత్రసురతా ప్రరూఢస్మరయౌవనా
ఈషత్ప్రగల్భవచనా మధ్యమవ్రీడితా మతా

తా. విచిత్రమగు సురతము గలదియుఁ, బ్రరూఢమైన మదనవికారమును, ప్రరూఢమైన యౌవనమును గలదియుఁ, గొంచెముగాఁ బ్రగల్భమగు (ప్రౌఢమగు)

వాక్కులు గలదియు, మధ్యమలజ్జయనఁగా నన్యూనానధికమగు లజ్జగలదియు నగు స్త్రీ మధ్య.

'విచిత్రసురత' యనుట కీ క్రింది దుదాహరణము

ఆ.వె. చియ్యఁబట్టియుంటఁ దొయ్యలి ప్రియుతోడ।రతులఁజూపె వింత చతురిమంబు
శిష్యవృత్తిసంతఁ జెప్పించుకొన్నట్లు। పావురాలు మణితఫణితిఁ గఱచె.

లక్షణమున 'మధ్యమవ్రీడితా' (లజ్జా సన్మథమధ్యస్థా)అను పదముముఖ్యము. నరసభూపాలీయ లక్షణమున నిది స్ఫుటముగాలేదు. రతాంతవివశత్వమనులక్షణము దశరూపకమున మాత్రమే (మోహాంతసురతక్షమా) కనఁబడుచున్నది. ప్రౌఢ రతాది యందే వివశత్వముగొనును. మధ్య రతాంతమున వివశత్వముగొనును. ముగ్ధ రతియందుఁ బ్రాతికూల్యము వహించునదికాన రతియందు వివశత్వముగొనదు.

## ప్రౌఢ

మ. నటదుత్తుంగపయోధరంబు, జితమందాక్షక్రియోదార, మ
స్ఫుటవాగంకుర, మక్షికోణనివసత్పుష్పేషుదర్పంబు, సం
ఘటితాలింగన వామనీకృతకుచాగ్ర ప్రౌఢ రోమాంచమై
విటుఁ జొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనా వీ రాయితంబెంతయున్. ౭౨

తా. నాట్యమాడుచున్న యెత్తైనకుచములుగలదియు, సిగ్గును జయించినదియు, నస్ఫుటమగు వాక్కులు గలదియు, నక్షికోణమున వసించుచున్న మదనదర్పము గల దియు, నాలింగనముచే నొత్తఁబడిన కుచములపైని రోమాంచముగలదియు నగు నా తరుణి పురుషాయితమున విటునిఁ జొక్కించెను.

ఇందు 'విటుఁజొక్కించె' ననుట దోషము. ఏలన ముగ్ధా, మధ్యా, ప్రౌఢా భేదములు స్వీయకుఁగదా। స్వీయ శీలార్జవకోమలయని పేర్కొనఁబడినది. అనఁగాఁ బతివ్రతయని భావముగదా। అట్టి పతివ్రత విటుఁజొక్కించె ననుట దోషముగదా। ఇఁక నీపద్యమున స్మరాంధురాలయి లజ్జఁబోఁద్రోలి పురుషాయిత మొనర్చుచున్న స్త్రీ వర్ణింపఁబడినది. రతాదిమోహమునుదాల్చు తలోదరి ప్రౌఢ' అను నరసభూపా లీయ లక్షణమున కిది లక్ష్యముగాలేదు.

సాహిత్య దర్పణము లక్షణ ముత్తమమయినది.

"స్మరాంధా గాఢతారుణ్యా సమస్త రతికోవిదా
భావోన్నతా దర[వ్రీడా ప్రగల్భా] క్రాంతనాయకా."

స్మరాంధురాలును, సంపూర్ణ యౌవనముగలదియు, నెల్ల యనులోమవిలోమాది సురతబంధ భేదములయందును బ్రవీణురాలును, ఉన్నతములయిన శృంగార చేష్టలు గలదియు, నల్ప లజ్జగలదియు, నాయకుని వశీకరింపఁ గొన్నదియు నగు స్త్రీ ప్రగల్భ లేక ప్రౌఢ.

౧. స్మరాంధ యనఁగాఁ గామముచే యుక్తాయుక్త సమయాసమయ వివేకము లేనిది.

కం. సతి యెంతధన్యురాలవె? । రతినడుమం బ్రియునితోడ రమణీయకథా
శతము వచింతువు; నాకో । స్మృతిపోవుఁ బ్రియుండు నీవి స్పృశియింపఁగరాఁ.

ఒక యువతి మఱియొకయువతితోఁ దాను సురతసమయమునందే ప్రియునితో ముచ్చటలాడుచు నుందునని చెప్పినది. అప్పుడా రెండవయువతి "ఓసీ నీ వెంత ధన్యురాలవే! రతి సమయముననే ముచ్చటలాడుదువు. నా ప్రియుఁడు నా నీవి స్పృశియింపఁ రాఁగానే నాకు స్మృతియే పోవును" అన్నది. మొదటిది మధ్యానాయిక. దానికి రతాంతమున వివశత్వముగలుగును. రతి మొదలఁగాని నడుమఁగాని వివశత్వము లేదు. ఇది ప్రౌఢ. రతాదియందే వివశత్వమునుఁగొన్నది. 'ఎంత ధన్యురాలవె?' అనునది పరిహాసోక్తి. నీకు రతియందుమఁగూడ వివశత్వము గలుగలేదు. నాకు రతాదియందే కలిగినది. కావున రతియందు నాకుఁ గలిగినంత యానందము నీకు లేదు. 'నీవధన్యురాలవు. నేనే ధన్యురాలను' అని నిష్కృష్టార్థము. రత్యారంభముననే యంధురాలయినది (వివశురాలు) కాన స్మరాంధ.

౨. సంపూర్ణ యౌవన

అత్యున్నత స్తన మురో, నయనే సుదీర్ఘే
వక్రేభ్రువౌ వతితరాం, వచనం తతోఽపి,
మధ్యేఽధికం తను; రనూనగురుర్నితంబో;
మందాగతిః; కిమపిచాద్భుత యౌవనాయాః.

తా. పూర్ణయౌవనముగల యా యువతిరొమ్మెత్తైన స్తనములుగలది; నేత్రములతివిశాలములు; కనుబొమ్మలు వంకరలు దిరిగియున్నవి; వాక్కులంతకన్నను వంకరలై యున్నవి; నడుము మిక్కిలియు సన్నగిల్లినది; పిఱుఁదులు మఱింత పెద్దవిగానున్నవి; నడక మందగించినది. ఇట్టి యౌవనధర్మములు కానఁబడుచున్నవి.

### 3. సమస్త రతకోవిద

క్వచిత్తాంబూలాక్తః క్వచిదగురుపంకాంక మలినః
క్వచిచ్చూర్ణోద్గారీ క్వచిదపిచ సాలక్తకపదః
వలీభంగాభోగై రలకపతితైః శీర్ణకుసుమైః
స్త్రియాస్సర్వావస్థం కథయతి రతం ప్రచ్ఛదపటః.

పరుపుదుప్పటమొకచోఁ దాంబూలరాగరంజితమై, యొకచోఁ గాలాగరు పంకమలినమై, యొకచోఁ జూర్ణముగలిగినదై, యొకచో లత్తుకతోఁగూడిన పాద ముద్రలుంగలదై, యొకచో వళులచిహ్నములుంగలదై, యొకచో ముంగురులనుండి రాలినపువ్వులుంగలదై తరుణియొక్క నానాసురతావస్థలను జాటుచున్నది; క్రమముగా మార్జారబంధము, ధేనుబంధము, స్వాభావికసురతము, ఉత్తానబంధము, సురతవిశేషము, పురుషాయితము అనుసురతములను బరుపుదుప్పటము తెలుపుచున్నది. ఇందు సమస్తరతకోవిదత్వము నాయికకు స్పష్టము.

### ౪. భావోన్నత

మధురవచనైస్సభ్రూభంగైః కృతాంగుళితర్జనైః
రభసరచితై రంగన్యాసై ర్మహోత్సవబంధుభిః
అసకృదసకృత్స్ఫారస్ఫారైరపాంగవిలోకితై
స్త్రిభువనజయే సా పంచేషోః కరోతి సహాయతాం

మధురాలాపములచే, భ్రూభంగములచే, అంగుళితర్జనములచే, రభసాచరితములును, మహోత్సవము గలిగించునవియు నగు నంగన్యాసములచేఁ, బునఃపునర్విరచిత ములగు కటాక్షములచే నాతరుణి మన్మథునికిఁ ద్రిభువనవిజయమున సాయపడుచున్నది. ఇందు నాయికకు శృంగారచేష్టలయొక్క సమున్నతి స్పష్టము.

### ౫. స్వల్పవ్రీడ

౪౦. సతియెంత ధన్యురాలవె ?

సమధికలజ్జావతి ముగ్ధానాయిక; మధ్యమలజ్జావతి మధ్యానాయిక, అల్పలజ్జావతి ప్రౌఢానాయిక; ఆశ్లేరతాదియందే వివశత్వమునఁగొనునది ప్రౌఢ; రతాంతమున వివశత్వ [illegible] ది ముగ్ధ.

౬. ఆక్రాంతనాయిక

చ. "చెదిరినముంగురుల్ సరిగఁ జేర్పుము చెల్వుఁడ! బొట్టుదిద్దుమీ!
నుదుట విలాసి! కూర్పుము చనుంగవఁ ద్రెస్సిన ముత్తెపుఁజసరుల్
హృదయసఖుఁడ!" యంచు వచియించి రతాంతమునందు వాని తోఁ
కుదలకొడల్ గగుర్పొడువఁ గోమలి క్రమ్మఱఁ బొందె మోహమున్.

ఇట నాయిక రతివివశురాలై తనప్రియుని వశీకరించుకొని వానిచే నాయా
పనులు చేయించుకొనుచున్నది.

అనంతామాత్యుఁడు తనరసాభరణమునఁ బ్రౌఢను రెండువిధములుగా విభజించెను.

౧. ప్రగల్భ. ౨. ప్రౌఢ

౧. ప్రగల్భ యనఁ బూర్ణయౌవనము గలది

మ. పొదుపైవృత్తనితంబ మొప్పఁగఁ, గుచంబుల్ క్రొవ్వి యొండొంటితో
గడియం, గుంకుమపంకరేఖ నొసలం గన్పట్టఁ బ్రద్యుమ్ను ను
న్మదభద్రేభముఁ బోలి బింకమునఁ దన్మందస్మితాలోకనం
బొదవం గృష్ణునిఁ జూచె నిందుముఖి ప్రేమోత్సాహముప్పొంగఁగన్.

౨. ప్రౌఢ యనఁ బురుషాయిత ప్రవీణత గలది.

మ. దరనమ్రస్తనభారమున్, విమలవక్త్రస్ఫూర్తియున్ రంజితా
ధరబింబంబును, భ్రూలతానటన సౌందర్యంబు, నుత్సంగగా
ఢరతాసక్తియు, నూర్ధ్వసంగమ నిరూఢత్వంబునుం గల్గ నం
బురుషోమోదిని చూచెఁ గృష్ణునసితాంభోభృత్సమశ్యామునిన్.

ఈ రెండుదాహరణములలో మొదటిదానిలోఁ బూర్ణయౌవనముగల యువ
తియు, రెండవదానిలోఁ బురుషాయిత మొనర్చునట్టి యువతియుఁ జూపఁబడిరి.
మరియు 'లోల' అను మరియొక నాయికనుగూడ నతఁ డుదాహరించెను. అది
సుందరముగాకున్నను జూపుదును.

కం. ప్రియములు పలికినఁ జాలును, నయమున నొక్కింత చూచినం జాలును; స
న్నయచాలుఁ గరాంబుజముల, రయమున మిన్నందు 'లోల' రతిసౌఖ్యమునన్,

'లోల' యన నొకింతవయస్సు మళ్ళినది. అనఁగా యౌవనము సడలివార్ధ
కమున నడుగిడుచున్న స్త్రీ. అట్టిదానికి రతిక్రీడలందుఁ బూరి[illegible] నభిలాష దొలఁగదు.

పూర్వమునందున్నంతగానుండదు. కాన దానినిఁ బ్రియుఁడు పలుకరించినను గటాక్షవీక్షణముల నలరించినను, చేసన్నఁజేసి పిలిచినను దానికి రత్యానందము గలుగును.

లోలాస్వరూపము

మ. అలఘుశ్రోణియు, లంబమాన పృథుఘోరాకారముఁ, నాభిదే
శలసద్దీర్ఘకుచంబులుఁ, ఘటసదృక్షస్థూలతుందంబునై
పలుమాఱు న్నిడుదీఁగెనవ్వ నగుచుఁ బాహాగ్రముల్ సాఁచి చి
ట్టులువెట్టుఁ విటుమోముపైజరత; కష్టంబిద్దియుఁ వేశ్యయే ?

చ. కనుఁగొని నవ్వునాదరము గల్గినయట్టుల; నంతికస్థలం
బునవసియంప వామకరపుష్కర సంజ్ఞయొనర్చు; మిన్నకై
ననుదలపెట్టుహాస్యవచనంబులు; యాదవరాజు పాలికే
మనిచనులోల? ప్రీతియగునా? కడివోయిన పుష్పమెయ్యెడఁ.

కం. ధీర, యధీరయు, ధీరా
ధీరయునగు నందుమధ్య; ధీరాఽధీరా,
ధీరాధీరాహ్వయముల
ధారుణిఁ బ్రౌఢయుఁ జెలంగుఁ దల్లక్షణముల్. ౨౮

తా. స్వీయా, మధ్యా, ప్రౌఢానాయికలలో మధ్యయుఁ బ్రౌఢయు, ధీర, అధీర, ధీరాధీర, అను భేదములు వహింతురు. స్వీయా భేదములు లేవు. వాని లక్షణము లీ క్రిందఁ జూపఁబడును.

ధీరయనఁగా ధీరత్వముగలది. దేనివిషయమున ధీరత్వమనినచో మాన విషయమున. అనఁగా భర్త సాపరాధుఁడైనపుడు ప్రియురాలాతని పైనిఁ బ్రణయ కోపము వహించును. ఆ ప్రణయకోపమును ధీరురాలొక విధముగను, అధీరురాలొక విధముగను, ధీరాధీరురాలొక విధముగను గనఁబఱచును. "ఈ ప్రణయ కోపము గూడ లఘువు, మధ్యమము, గురువు, అని మువ్విధములు. అన్యస్త్రీదర్శనాదులవలనఁ బుట్టినది లఘుకోపము. గోత్రస్ఖలనాదులవలనఁ గలిగినది మధ్యమ కోపము. అపరస్త్రీసంగమమువలనఁ గలిగినది గురుకోపము. మరియు స్వల్పప్రయత్నముచేఁ దొలఁగింపఁదగినది లఘుకోపము. కష్టప్రయత్నముచేఁ దొలఁగింపఁదగినది మధ్యమకోపము. కష్టతరప్రయత్నముచేఁ దొలఁగింపఁదగినది గురుకోపము. అనఁగాఁ గుతూహలాదులచేఁ [illegible] చేఁ దొలఁగింపఁ

దగినది మధ్యమకోపము, చరణపాతభూషణ సమర్పణాదులచేఁ దొలఁగింపఁదగినది గురుకోపము." అని శృంగారామృతలహరిలోఁ గలదు.

## మధ్యాధీరా-మధ్యా-అధీరా, మధ్యా-ధీరాధీరా లక్షణములు

గీ. తప్పుగల భర్త మోల సోత్ప్రాసఫణితి
గేరడములాడు సతి మధ్యధీర; సాస్రు
పరుషవచన యధీర; బాష్పకుటిల
హాసవచన ధీరాధీర యనఁగఁ జెలఁగు. ౭౫

తా. భర్త యపరాధ మొనరింపఁగా నెత్తిపొడుపుమాటలతోఁ బరిహసించునది మధ్యాధీర; కన్నీటితోఁ బరుషవచనములాడునది మధ్యా-అధీర; కన్నీటితోఁ గుటిల వచనములాడునది మధ్యాధీరాధీర.

ఇందు మధ్యా-అధీర 'సాస్రుపరుషవచన' యనియు, మధ్యాధీరాధీర 'బాష్పకుటిలహాసవచన' యనియు లక్షణము నిర్వచింపఁబడినది. ఈ రెంటికిని నర్థభేదము గానరాదు. కాన నీ లక్షణములు సరిపడవు. సాహిత్యదర్పణమున

శ్లో॥ ప్రియంసోత్ప్రాసవక్రోక్త్యా మధ్యాధీరా దహేద్రుషా
ధీరాధీరా తు రుదితై రధీరా పరుషోక్తిభిః

అని లక్షణముగలదు. మధ్యాధీరాధీర రుదితప్రధానములగు పరుషోక్తులచేతను, మధ్యా-అధీర పరుషోక్తులచేతను భర్తయెడలఁ గోపమును జూపును. అనులక్షణ భేదము యుక్తమైనది. సాహిత్యదర్పణ వ్యాఖ్యానమగు 'రుచిర'యం దీ శ్లోకమున కీ క్రింది వ్యాఖ్య వ్రాయఁబడియున్నది.

"అత్రమధ్యధీరా ఉపహాసేన వక్రోక్త్యావా కోపంవ్యనక్తి। అతఏవ అస్యాః నపరుషోక్తిర్నవారుదితత్వం। అధీరా మధ్యారుష్టా సతీ పరుషోక్త్యా కోపంవ్యనక్తి; అత ఏవ అస్యాః అధీరత్వం। ధీరాధీరాతుమధ్యారుష్టా సతీరుదిత పరిహాసైర్వచోభిః కోపంవ్యనక్తి। అత ఏవ అస్యాః తదుభయాంతరాళావస్థాత్వం" ఇట మధ్యధీర వక్రోక్తిచేఁగానీ పరిహాసముచేఁగానీ కోపమునుజూపును. ఈమెకుఁ బరుషోక్తులుగానీ రుదితములుగానీ యుండవు మధ్యా-అధీర పరుషవచనములచేతఁ గోపముఁజూపును. కావుననే యామె యధీర. మధ్యా-ధీరాధీర రుదితప్రధానములగు వచనములతోఁ గోపమును వెల్లడించును. కావుననే యీమెయుభయాంతరాళావస్థ.

ఇందు మధ్యా-అధీరకుఁ బరుషోక్తియే కానీ రుదితము చెప్పఁబడలేదు. కాన నరసభూపాలీయు 'సాస్రుపరుషవచన' లక్షణము దుష్టము.

'న'శబ్దముతో సమాసముచేసి "నాశ్రుపరుషవచన" అన "అశ్రువులులేని పరుషవచనములు గలది" అని యర్థము చేసికొన్నచో సరిపడవచ్చును. కాని 'సాశ్రు' పాఠము గానరాదు.

గీ. కాంతుఁడపరాధియైన నాకారగుప్తిఁ
బరఁగి రతివేళ నలయించుఁ బ్రౌఢ ధీర;
తాడనోగ్రయధీర; యుదగ్రకుటిల
ఫణితి యుభయాఖ్య; వీరి నేర్పఱతు వరుస. ౩౦

తా. ప్రియుఁడపరాధముసేసినపు డాకారగోపనముసేసి రతివేళ నలయించు నది ప్రౌఢాధీర; ప్రౌఢా-అధీర తన్నులు తన్నును; ప్రౌఢా ధీరాధీర మిక్కిలి వంకర మాటలచే ఖేదపఱచును.

ఇందలి ప్రౌఢాధీరాలక్షణములో 'రతివేళనలయించు' నఁగా రతివేళ భర్తకు నలసట గలిగించునది అని యర్థమగుచున్నది. సాహిత్యదర్పణమున

పరిగల్భా యదిధీరాస్యాత్ । ఛన్నకోపాకృతిస్తదా
ఉదాస్తేసురతే తత్ర దర్శయంత్యాదరాన్బహిః

ప్రౌఢాధీర కోపాకారమును గనఁబఱపక పై కాదరమును జూపుచు సురతమున నుదాసీనురాలై యుండును. అనఁగా రతినొసఁగక యలయించు నని యర్థము. ప్రియుఁడు రతికొఱకుఁ దహతహలాడును. ఆమె రతినొసఁగదు.

మధ్యా, ప్రౌఢానాయికలకు ధీరాదిభేదములునువాని లక్షణములును మాత్రమే చెప్పఁబడినవి. ఇటఁ గ్రమముగా లక్ష్యములు చూపఁబడుచున్నవి:

## మధ్యా - ధీర

ఉ. మోమున ఘర్మశీకరసమూహము గానఁగనయ్యె; నిప్పుడా
రామవిహారకేళిని భరంపడినాఁడవొ? నన్నుఁ బాసి యీ
శ్రీ మదనాస్త్రఘాతముల వేఁగితొ? నీయుర మెల్లఁ దర్పరిం
స్తోమము సోఁకియున్నయది చొప్పడఁగాంత! యెఱుంగఁ జెప్పుమా!

వేఁగితొ (పా) ప్రేఁగితొ?

రాత్రి పరకాంతతో భోగించి వచ్చిన ప్రియునిపైఁ గోపించి మధ్యా-ధీరా నాయిక పలుకుచున్నది. "నీమొగము చెమటలు గ్రమ్ముచున్నది. తోఁటలో విహా

రించి యలసితివో? నన్నుఁబాసి మదనబాణముల శోఁగితివో? ఏమో! నీయురిమం తయు గాయపడియున్నది.

ఇట సోత్ప్రాసఫణితి (ఎత్తిపొడుపుమాటలు) గోచరించుచున్నది.

## మధ్యా - అధీర

శా. చాలుంజాలుఁ బిసాళిచేఁతలు; పదాబ్జాతంబుపై వ్రాటికిన్
వ్రాలంబోకు; భవత్ప్రియానఖవిమిశ్రాంబైన నీవక్షమీ
నీలస్థాపిత కుట్టిమంబొఱసినన్ వేధించు లేలెమ్ము; నీ
బాలాసంగమ సౌఖ్యవైభవము సూపన్ వచ్చితే యిచ్చటన్! 3_౨

బాలాసంగమ (పా) బాలాసంగత.

తా. అన్యకాంతా సంభోగమొనర్చి సాపరాధుఁడైన ప్రియునితో మధ్యా-అధీర యనుచున్నది. "నీవిడంబనలు చాలులెమ్ము! నాయడుగులపై వ్రాలకుము. నీ ప్రియురాలిగోరొత్తులచే గాయపడిన నీ వక్షమీరాలినేలకుఁ దాఁకినచో వేధించును. నీబాలాసంగమ సౌఖ్యము నాకుఁ జూపవచ్చితివా ?

ఇటఁ బరుషవచనములు గానగును. లక్షణమున 'సాశ్రుపరుషవచన' అని నొడివియుఁ గవి సాశ్రుత్వము లక్ష్యమునఁ జూపలేదు. సాశ్రుత్వము దుష్టమనియును జెప్పితిమి.

## మధ్యా-ధీరాధీర

చ. వలుకవటంచు నేమిటికిఁ బాములఁబెట్టెదు ? కాంత! నీవయిం
దెలియఁగఁ దప్పు లేమికినిఁ నిన్ననఁజాలక యూరకుండినన్
బలుమఱు సాపరాధుగతిఁ బల్కెద; నెన్నఁడుఁ దప్పు నీయెడం
గలుగునె? యంచు నించెఁ దెలిగన్నులనీరు లతాంగి యంతటన్.

తా. ఒక యువతి సాపరాధుఁడగు ప్రియునితోఁ బలుకుచున్నది. "నన్ను మాటలాడవేమని తప్పులు వట్టుచున్నావు. నీపయిఁ దప్పులేదని నిన్నేమియు ననఁజాలక యూరకుంటిని. అయినను నీవే సాపరాధునివలెఁ బలుకుచుంటివి. తప్పులు మాయందుండును. కాని నీయెడఁ దప్పుండునే?" అని యాపె తెలిగన్నుల నీరు నించెను. ఇట బాష్పకుటిల వచనములు గలవు.

## ప్రౌఢా-ధీర

చ. హితమతి ధూర్తభర్త కెదురేగడు నేర్పున నేకపీఠ సం
గతి హరియించి, పల్కుటయుఁ గ్రక్కున నెచ్చెలి కూడిగంబులం
జతురత నేర్పుచందమునఁ జాఱఁగఁద్రోచి, యతిప్రగల్భయా
సతి యుపచారగౌరవము సల్పెడునట్లువహించుఁ గోపముల్ 38

తా. సాపరాధుఁడై ధూర్తుఁడైన పతి తన కూర్చుండిన పీఠముననే కూర్చుండును అని తలంచి వాని కెదురేగు నెపమున లేచి దానినిఁ దప్పించెను. అతఁడు పలుక రింపఁగా నెచ్చెలి కూడిగములు గఱపుచున్న చందమున సమాధానము నీయక తప్పించెను. ఈ విధముగాఁ బ్రౌఢాధీర తన కోపమును నిర్వహించెను.

ఇటఁ బ్రియురాలు తన కోపమును గోపనముసేసి రతి నొసఁగక ప్రియుని నలయించుచున్నది.

## ప్రౌఢా-అధీర

చ. వరునిఁ గృతాపరాధుని నవారణ వారణయాన యాసునం
గెరలి భుజాగుణంబున బిగించి వతంసిత సారసంబునన్
గరము దమింపగాఁదొడఁగెఁ; గాంతునిసాంత్వనశీతలోక్తు లాం
తర నిజకోపతప్తఘృత ధారకవారణ వారిధారగాన్. 39

తా. సావరాధుఁడగు ప్రియునిఁ బ్రియురాలీసుచేఁ దనకరపాశముచేబిగించి కట్టి యాతని సాంత్వనశీతలోక్తులం దనకోపాగ్ని కాజ్యధారలు కాఁగాఁ గర్ణావతంస ముగాఁ గొన్న తామరపువ్వుచేఁ గొట్టుచుండెను.

ఇటఁ బ్రియురాలు ప్రియునిఁ దాడనము సేయుచున్నది. కానఁబ్రౌఢా-అధీర.

## ప్రౌఢా ధీరాధీర

చ. బొనుముడిపాటు, జంకెనయుఁబూని పురంధ్రులు సాపరాధులౌ
రమణులు వేఁడుకొన్న ననురాగముదాల్చుదు; రట్లుగాదు మ
త్క్రమ; మపరాధలేశమునుదాల్పని నీవిపు డెంత మ్రొక్కినం
దెమలదు; శాంతిఁబొందదు మదీయమనం బిఁకఁ జాలుఁబ్రార్థనల్,

పా। మర్త్యునును కృపార్ద్రిత మదినిఁ దాల్పని.

తా. సాపరాధుఁడగు ప్రియునిఁ బ్రియురాండ్రు బొమముడిపాటు, ఱంకె నయు, వహించియుఁ దమ్ము వేఁడుకొనఁగా క్షమించి యనురాగము వహింతురు. నాక్రమ మిదిగాదు; నిరపరాధివగు నీ వెంత మ్రొక్కినను నాకు శాంతిగలుగదు. నీ ప్రార్థనలు చాలును!

ఇటఁ బ్రియురాలు కుటిలవచనములచే దూషించుచున్నది.

కం. ధారుణి మధ్యయుఁ బ్రౌఢయు
ధీరాధీరాదిభేద దీపితలై వే
ర్వేరను జ్యేష్ఠ కనిష్ఠయు
నైరంజిలి ద్వాదశాఖ్య లగుదురు వరుసన్. ౩౭

ధీరాధీరాదిభేద (పా) ధీరాధీరాదినామ

తా. మధ్యా, ప్రౌఢలు ధీరా, అధీరా, ధీరాధీరాది భేదములచే నిట్లాఱు విధము లగుదురు. ఆయారువురను జ్యేష్ఠా కనిష్ఠాభేదములచే మొత్తము పండ్రెండు గురగుదురు.

కం. కాపున స్వీయ త్రయోదశ
భావంబువహించు; నన్యవలగు ద్వివిధయై;
యీవారాంగన యేకవి
ధావహ; యట్లెన్నఁగాఁ బదార్వురు సుదతుల్. ౩౮

తా. స్వీయానాయిక యీపైవిధమునఁ బదుమూఁడు విధములనుండును. ఇతర నన్య లేక పరకీయ అనోఢా, కన్యా భేదములచే ద్వివిధ. సామాన్య యేకవిధయే. ఇట్లు పదార్వురు నాయికలు.

ఒక్కొక్కచో నొకేనాయికయందు ధీరత్వ-అధీరత్వాదులకును, ముగ్ధాత్వ ప్రగల్భాత్వాదులకును సాంకర్యము గానవచ్చుచున్నది.

"నఖలువయమముష్య దానయోగ్యాః పిబతిచ పాతిచ యాఽసకౌ రహస్త్వాం
విట! విటపమముం దదస్వతస్యై భవతియత స్సదృశోశ్చిరాయయోగః
తవకితవ! కిమాహితైర్వృథానః క్షితిరుహపల్లవ పుష్పకర్ణపూరైః
ననుజనవిదితైర్భవద్వ్యలీకైశ్చిర పరిపూరిత మేవ కర్ణయుగ్మం

ముహురుపహసితా మివాళినాదైర్వితరసి నః కలికాం కిమర్థమేనాం
వసతిముపగతేన ధామ్నితస్యాః శఠ! కలిరేవ మహాంస్త్వయాఽద్య దత్తః
ఇతి గదితవతీ రుషా జఘాన స్ఫుటితమనోరమ పక్ష్మకేసరేణ
శ్రవణనియమితే కాంతమన్యా సమమసితాంబురుహేణ చక్షుషాచ."

పరనాయికారతుఁడగు నాయకునితోఁ నాయిక యనుచున్నది.

"ఓ విటుఁడా! ఈ విటపము (చిగురాకు)నకు మేము యోగ్యులముగాము. ఎవతె నిన్ను రహస్యముగాఁ ద్రాగుచో రక్షించునో దానికే యిమ్ము. నీవు విటుఁడవు. అది విటప. (విటం పిబతి పాతివా) విటపము విటపకే తగును. దానిచే సదృశవస్తు సంయోగము సిద్ధించును."

"ఓ ధూర్తుఁడా! వృధగా మాకు నీ చెట్లచిగుళ్ళను బువ్వులను గర్ణపూరముగా నేల పెట్టెదవు? జగద్విదితములైన నీ యప్రియ వచనములచే నా చెవులు నిండియే యున్నవి. మరలఁ గర్ణపూరములేల? అళినాదములచే నుపహసించుచున్నట్లున్న యీ కలికను (మొగ్గను) నాకేల యిత్తువు? ఓ శఠుఁడా! దానియింటికి వెళ్ళిన నీవు నాకుఁ బెద్ద కలిని (జగడమును) దెచ్చిపెట్టితివి."

అని పలికి యలుకతోఁ దన చెవియందున్న స్ఫుటిత మనోహర పక్ష్మకేసర మగు నీలోత్పలములతోడను జూపుతోడను గొట్టెను.

ఈ నాయిక వక్రోక్తులనుబట్టి మధ్యాధీరయుఁ, బరుష వచనములనుబట్టి మధ్యా-అధీరయుఁ, గర్ణోత్పల తాడనముచే ప్రౌఢా-అధీరయు నగుచున్నది. ఈవిధమున నటనట సాంకర్యమును గలదు.

గీ. మఱియు శృంగార శంభుసంభావితాష్ట
తనువులన నీమృగాక్షులు వినుతిఁగాంతు
రష్టవిధభేదముల వీరి యాహ్వాయములు
లక్షణములేర్పఱించెద లలితఫణితి. ౩౯

తా. శృంగారరస మగు శంభుని యష్టమూర్తులట్లే నాయిక లవస్థాభేదముచే నెనిమిది భేదములు వహింతురు.

సీ. వరుఁడు కైవసమైన వనిత స్వాధీనభ
ర్తృక; ప్రియాగమవేళ గృహముఁదనువు
నవరించు నింతి వాసకసజ్జ; పతిరాక
తడవుండ నుత్కంఠఁ దాల్చు నింతి

విరహోత్క; సంకేతమరసి నాథుఁడు లేమి
వెస నార్తయౌ కాంత విప్రలబ్ధ
విభుఁ డన్యసతిఁబొంది వేఁకువ రాఁ గుందు
నబల ఖండిత; యల్క నధిపుఁ దెగడి
గీ. అనుశయముఁ జెందుసతి కలహాంతరిత; ని
జేశుఁడు విదేశగతుఁడైనఁ గృశతఁదాల్చు
నతివ ప్రోషితపతిక; కాంతాభిసరణ
శీల యభిసారికాఖ్యయై చెలువుమెఱయు. ౭౦

తా. భర్త తన యధీనుఁడైయున్న యువతి స్వాధీనభర్తృక లేక స్వాధీనపతిక. (స్వాధీనః భర్తా పతిర్వా యస్యాః సా స్వాధీనభర్తృకా పతికా వా) పరస్త్రీలను గాంక్షింపక తనయందే యనురక్తుఁడైన పతి గలది.

భర్తవచ్చు సమయమునకుఁ దన్ను గృహమును నలంకరించుకొని సిద్ధముగా నున్నది వాసకసజ్జ లేక వాసకసజ్జిక. 'వాసకం వాసస్థానం సజ్జయతీతి' 'వాసకసజ్జా' అనియు 'వాసకే సజ్జా ప్రమండనా' అనియు 'స్త్రీణాం వారస్తువారకః' అను నుక్తినిఁ బట్టి వాసకో వాసరః, అద్యమే ప్రియవాసర ఇతి నిశ్చిత్య యానురత సామగ్రీం సజ్జీకరోతి సా వాసకసజ్జా అనియును వ్యుత్పత్త్యర్థములు గలవు.

పతి చెప్పినవేళకు రాక యాలస్యముసేయఁగా మిక్కిలి తహతహపాటు గొనునది విరహోత్కంఠిత లేక విరహోత్క.

సంకేతస్థలమునఁదన ప్రియుఁడు లేకుంటనుగాంచి యార్తి వహించునది విప్రలబ్ధ.

ప్రియుఁడు పరకాంతతో రేయి గడపి యుదయమున కింటికి రాఁగాఁ గుందునది ఖండిత.

కోపగించి భర్తను దూషించి వెడలఁగొట్టి యాతఁడు చన్నపిదపఁ బశ్చాత్తాప పడునది కలహాంతరిత. (కలహేన అంతరితా వ్యవహితా అర్థాత్ ప్రాణనాథతః.)

తన ప్రియుఁడు పరదేశగతుఁడైనపుడు కృశించునది ప్రోషితభర్తృక. లేక ప్రోషితపతిక. (ప్రోషితః భర్తా పతిర్వా). ప్ర+ఉషితుఁడు = ప్రోషితుఁడు = ప్రవాసస్థుఁడు. అట్టివాఁడు పతిగాఁ గలది.

ప్రియునివద్దకుఁ దానే స్వయముగాఁ బోవునదియుఁ బ్రియునిఁ దనయొద్దకు రప్పించుకొనునదియు నగు యువతి యభిసారిక. (అభిసరతి. అభిసారయతీత్యభిసారికా).

కం. ఈరీతిఁ దెలుఁగు నతిశృం
గారకళాకలిత నాయికామణులకు వే
ర్వేర నుదాహరణంబులు
భూరి మధురవచన రచనముల నేర్పఱతున్. ౮౧

## స్వాధీనపతిక

ఉ. శ్రీనిధి యోబభూవరు నృసింహుఁడు కైవసమై చెలంగఁగా
భూసుత వైభవస్ఫురణఁబొల్పు యశోజలజాక్షి సిత్యస
మ్మానితశీలయై ధవునిమన్ననఁ నౌదలయెక్కినట్టి, వై
మానికవాహిని నగు నమందనిజాతియశంబు పేర్మినిన్. ౮౨

తా. యశస్కాంత తనపతియగు నరసభూపాలుఁడు దనకధీనుఁడై వర్తింపఁగా మహావైభవముతో నొప్పుచుఁ దనభర్తృసమ్మాననఁ బొంది యాతని నెత్తికెక్కి కూర్చున్న గంగానదిని నవ్వుచున్నది.

ఇటఁ గీర్తికాంత స్వాధీనపతిక.

## వాసకసజ్జిక

చ. యవనచమూసమూహముల నాజిజయించి యుదగ్రదిగ్జయో
త్సవవిభవాభిరాముఁడయి సారెకు నోబయనారసింహ భూ
ధవుఁ డరుదెంచులగ్నమునఁ దత్పురలక్ష్మి విభూషితోల్లస
ద్భవనవిశేషయై మృగమదద్రవవాసనఁ దాల్చు నిచ్చలున్. ౮౩

అరుదెంచులగ్నమున (పా) అరుదేరమోదమున

తా. నరసభూపాలుఁడు యవనసేనల జయించి రాఁగాఁ బురలక్ష్మి గృహమలంకరించికొని కస్తూరివాసనలు వహించి యుండెను. పురలక్ష్మి వాసకసజ్జిక.

## విరహోత్కంఠిత

ఉ. నెచ్చెలులీనృసింహధరణీవరుఁ డెచ్చెదమంచుఁ బోయి రా
రిచ్చటి; కీవునుం గరుణయించుక లేకలరంప గుంపులం
గ్రుచ్చెద వేల? మత్ప్రియునిఁ గూర్పుము మన్మథ! నీకుమద్విభుం
దెచ్చుటకై [illegible] స్త్రముల్.

తా. నరసభూపాలునిఁ గొనివచ్చెదనని నాచెలికత్తెలరిగి యింకను రారైరి. ఓమన్మథా! నీవును నిర్దయుఁడవై పుష్పబాణములతో నన్ను బాధించుచున్నావు. నాకటాక్షములను జయాస్త్రములు నీకొసఁగుదను. నాప్రియుని జయించికొనివచ్చి నాకుఁ గూర్పుము.

ఈనాయిక విరహోత్కంఠిత.

## విప్రలబ్ధ

చ. ఎనయఁగ నీనివాసమున కేనరుదెంచెదనంచు నాపయిం
గనుఁగొన సిక్కుపుంబ్రియము గల్గినవాఁడునుబోలెఁబల్కి యీ
మనికికి రాకతక్కనను మానదుగాక; మదీయదృష్టికిం
బనుపడి ప్రోలనున్నగతి మాయలుసేయఁగనేల భర్తకున్, రగే

కమఁగొని నిక్కపున్ (పా) ఘనముగ నెంతయున్

కనుపడిప్రోలనున్నగతిమాయలుసేయ (పా) బొనుపడిప్రోలనున్నగతి బూమెలుసేయు

తా. నా ప్రియుఁడగు నరసభూపాలుఁడు "నీ నివాసమునకు (సంకేతమునకు) నేనే వచ్చెదనని నామీఁద నిజమైన ప్రేమయున్నట్లు పలికి రాకమానెను. మానిన మానుఁగాక. ఎదుటనున్నట్లుగా నా దృష్టికగపడుచు మాయలు పన్ననేల ?

ఇట నాయిక సంకేతస్థానమునకు వచ్చి భర్తవరసి లేకుంటచే వంచితరాలైనది.

## ఖండిత

చ. నృపులకు నెల్లవారల భరించుట యోగ్యముగాన నేటి రే
యపరిమితోత్సవంబునఁ బ్రియాసదనంబునకేగి యేఁగి యా
నెపమున మద్గృహంబునకు నీవరుదేరఁ బ్రభాతమయ్యెఁగా;
కిపుడు నృసింహ! నీపయి నొకించుక వంచనలేదెఱుంగుదున్.

నీపయి (పా) నాపయి; కాకిపుడు (పా) నేఁడిపుడు.

. ఓ నరసభూపాలుఁడా! రాజు లందఱిని సమానముగా భరింపవలెను. కాన నేఁటిరాత్రి ప్రియురాండ్ర గృహము లన్నియుఁ జుట్టపెట్టుచుఁ దెల్లవాఱుసరికి నా గృహమునకు వచ్చితివి. అంతియేకానీ నీ పెట్టి వంచనయు నెఱుఁగవు.

ఇటఁ బ్రియుఁ డన్యకాంతతోఁ గ్రీడించిరా గా నది కనిపెట్టి సోత్ప్రాసముగా నాయిక పలుకుచున్నది.

## కలహాంతరిత

ఉ. ఆనఁగరాని కోపమున నప్పుడు కాంతుని ధిక్కరించుచో
మానదురాగ్రహాగ్రహము మానుపలే కపుడెందుఁబోయెనో
యాననవింటిదంట యిపుడేఁపఁ దొడంగె; భవిష్యదర్థముల్
గానని నామనంబునకుఁ గావలె నిట్టి విషాదవేదనల్. ౪౭

తా. పట్టరానికోపమునఁ బ్రియుని ధిక్కరించినపు డా మన్మథుఁ డెందుఁ బోయెనో? ఇప్పుడు వాఁడు నన్ను బాధింపఁదొడఁగెను. భవిష్యదర్థమును గ్రహింపక వర్తించిన నాకిట్టి ప్రాయశ్చిత్తము గావసినదే!

ఇట నాయిక కలహించి ప్రియుని ధిక్కరించి వెడలనడఁచి పశ్చాత్తాపపడుచున్నది. కానఁ గలహాంతరిత.

## ప్రోషితభర్తృక

చ. చిరయశ! ఓబభూవరు నృసింహ! భవద్రిపుభామ కాననాం
తరమున కేగి యుందు నిజనాథునిఁ గానక మన్మథార్తయై
వరుని సరోజపత్త్రిమున వ్రాయు నెడంగరముల్ చెమర్పఁగా
నరయు నిజాంగకంబె పగయయ్యె నటంచుఁ దలంచు దైవమున్.

తా. ఓ నరసభూపాలా! నీ శత్రుని భార్య భర్తతో నడవికిఁబోయి యటఁదట నుండి యా మొకఁ దలంపక పారిపోఁగాఁ దన భర్తను గానక మదనార్తయై ప్రియునిఁ బద్మపత్త్రమున వ్రాయునపుడు చేతులు చెమర్పఁగాఁ దనయవయవములే తనకు శత్రువులయ్యెనని దైవమును దలంచును. ఇట శత్రుకాంత ప్రోషితభర్తృక.

## అభిసారిక

ఉ. నాఁతి! మదింప్రియాభిసరణంబొనరింపఁ దలంచెదీవు; చం
ద్రాతపసాంద్ర దీధితులజాండకటాహమునిండఁ బర్వఁగా
నీతలఁ బెట్లుగూడు; రమణీ! వలె నేనొకవన్నె కాఁగ ము
క్తాతతులుం బ్రసూనములు దాల్చు; మలందుము గంధసారమున్.

నిండఁబర్వఁగా (పా) నిండిపర్వఁగా; వలెనేనొక (పా) వలతేనొక.

ఓరమణీ! వెన్నెల బ్రహ్మాండమంతయును గాయుచుండఁగా నీవు ప్రియుని నభిసరింపఁబోవుచున్నావు. నీతలం పెట్లు సిద్ధించు? నీకోర్కె సిద్ధింపవలెనన్న ముక్తా

హారములు, పూలు, మంచిగంధమును ధరింపుము. వీని ధరించుటవలన నావెన్నెలలో నీవు గనఁబడకుందువని నిష్కృష్టార్థము.

ఇట నాయిక ప్రియునిఁగూర్చి యభిసరించుచున్నది. కాన నభిసారిక.

ఈయభిసారిక జ్యోత్స్నాభిసారిక, తమోఽభిసారిక, దివసాభిసారిక యని ముత్తెఱఁగుల నుండును.

జ్యోత్స్నాభిసారిక తెల్లని దువ్వలువలు, తెల్లనిపువ్వులు, తెల్లనిగంధమును, తెల్లని ముత్యాలహారములును ధరించి యభిసరించును. ఏలనఁ దెల్లని వెన్నెలలో నీ తెల్లని వస్తువుల కాంతులు గలిసిపోయి యీనాయిక పరులకుగోచరింపదు. తమోఽభిసారిక చీఁకటిలోఁ బరులకుఁ దాను గనరాకుంటకై నల్లనిదువ్వలువలు, నల్లని కలువలు మొదలగునవి ధరించి యభిసరించును. దివసాభిసారికయనఁగాఁ బగటిపూట నింటివారెల్లరును గార్యాంతరమగ్నులై యుండేనరుగఁగాఁ గపటముగా నింటనుండి ప్రియునిఁ దనకడకు రప్పించుకొనునది.

జ్యోత్స్నాభిసారిక

గీ. మల్లెదండలు గైసేసి, మలయజంబుఁ । బూసియొడలికిఁ, దొడిపట్టుపుట్టములను
బండువెన్నెల నడిరేలఁ బరువులిడుచుఁ । గానఁబడదయ్యె నభిసారికాజనంబు.

తమోఽభిసారిక లేక తమిస్రాభిసారిక

శ్లో. సాంబుజైర్జనకుము దైరుపమేయం । స్వైరిణీజనవిలోచనయుగ్మం
నోదయే దినకరస్య న చేందోః । కేవలే తమసి తస్య వికాసః

తా. అంకుటాండ్రకనుదోయి తామరరేకులతోఁగాని కలువరేకులతోఁగాని పోల్పరాదు. ఏలన నవి సూర్యోదయముచేఁగాని చంద్రోదయముచేఁగాని వికసింపవు. కేవలము చీఁకటిలోనే వికసించును.

దివసాభిసారిక

పల్లీనామధిపస్య పంకజదృశాం పర్వోత్సవామంత్రితే
జాతే సద్మజనా మిథఃకృత మహోత్సాహం పురః ప్రస్థితాః
సవ్యాజం స్థితయోర్విహస్య గతయోశ్చద్ధాంత మత్రాంతరే
యూనోస్సిన్నక పోలయోర్విజయతే కోఽప్యేవ కంఠగ్రహః

తా. ఒకానొక పల్లెదొరభార్యలు పున్నమపండుగకై యూరివారినెల్లరను బిలిపింపఁగా నింటివారందఱును మహోత్సాహముతో ముందు తరలిరి. ఈలోపల

నేదో మిషపెట్టుకొని నవ్వుచు నాఁగి యంతఃపురమును జొచ్చి చెమర్పు చెక్కిళ్లుగల యౌవనవంతులయొక్క కంఠాలింగనము సర్వోత్కర్షముగ వర్తిల్లుచున్నది.

ఇట నభిసారికానాయిక స్వీయయేని, బరకీయయేని, గావచ్చును. వేశ్య (సామాన్య) యభిసారిక యగుచో నెట్టివేషము ధరించుచునన్నచో నీక్రింది లక్షణము సాహిత్యదర్పణమునఁ గలదు.

> విచిత్రోజ్జ్వలవేషాతు రణన్నూపుర మేఖలా
> ప్రమోదస్మేరవదనా స్యాద్వేశ్యాభిసరేద్యది.

తా. విచిత్రమైన యుజ్జ్వలమైన వేషముగలదియు, ఝుళంఝుళ మ్రోఁగుచున్న యొడ్డాణముగలదియుఁ, బ్రమోదస్మేరవదనయు నయి వేశ్యయభిసరించును.

ఈ సామాన్యనాయిక యభిసారికయైనపు డుజ్జ్వలాభిసారికయనియుఁ జెప్పఁబడును. అనఁగా దీనివేష ముజ్జ్వలము. పరులు చూతురన్న జంకుగొంకు లాయువతి కుండవు. చారుదత్తు నభిసరింపఁబోవు వసంతసేన యుజ్జ్వలాభిసారిక.

> లోలచ్చేలచమత్కృతి, ప్రవిలసత్కాంచీలతాఝుంకృతి,
> న్యంచత్కంచుకబంధబంధురవలద్వక్షోజకుంభోన్నతి,
> స్ఫూర్జద్దీధితి, విస్ఫురద్గతి, చలచ్చామీకరాలంకృతి,
> క్రీడాకుంజగృహం ప్రయాతి కృతినః కస్యాఽపి వారాంగనా.

తా. చీర హొయలుగాఁ గదులుచుండఁగా మొలనూలు ఝుళంఝుళమని ధ్వనించుచుండఁగా, అవికముడిచేతఁగూడనందముగా స్తనముల యున్నతి గోచరించుచుండఁగా, మేనికాంతి వ్యాపించుచుండఁగాఁ జక్కని నడకలతో బంగారునగలు ధరించి యొక వారాంగన యొకానొక ధన్యునియొక్క క్రీడా కుంజమునకుఁ జనుచున్నది.

వెనుకటి స్వీయా, పరకీయాభిసారికాదుల యభిసరణము గుప్తము. ఇది బహిరంగము. కావున నిది యుజ్జ్వలాభిసారిక.

ఈపై నుదాహరింపఁబడిన యష్టవిధనాయికలు గాక 'ప్రవత్స్యత్పతికా' అనుతొమ్మిదవ నాయికయుఁ గలదని రసమంజరీ కర్త తెలుపుచున్నాఁడు. "అగ్రిమక్షణమున భర్త దేశాంతర గమనమునకు సన్నద్ధుఁడై యుండఁగా నా యువతి ప్రవత్స్యత్పతిక" ఈ ప్రవత్స్యత్పతిక ప్రోషితభర్తృకా, విప్రలబ్ధా, విరహోత్కంఠ లందంతర్భావమును వహింపదు. ఏలన నీమె భర్త సన్నిధియందే యున్నాఁడు. వారి భర్త్రుదూరస్థుఁడై యుండుటను, కలహాంతరిత యుండుటను సంభవింపదు. ఈపెనుఁ

ప్రియునితోఁ గలహములేదు. మఱియు నీమె పతి నవమానపఱుపదు. కలహాంతరిత ప్రియునితోఁ గలహించి యిల్లువెడలించును. ఖండితయందుఁగూడ నంతర్భావమును వహింపదు. అన్యస్త్రీసంభోగచిహ్నితుఁడై పతి యీమెకడకు రాఁడు. వాసకసజ్జిక యందుఁగూడ నంతర్భవింపదు. ఈమెకు వారనియమముగానీ సామగ్రీసజ్జీకరణము గాని లేదు. ఈమె స్వాధీనపతికయందును నంతర్భవింపదు. అగ్రిమక్షణముననే యీమెకు విరహము సంభవించుచున్నది. స్వాధీనపతికకు విరహము సంభవింపనే సంభవింపదు. సంభవించినచో నామె స్వాధీనపతిక యెట్లగును? అభిసారికలోఁ జేరదు, ఏలన నభిసరణములేదు. కావునఁ బ్రవత్స్యత్పతిక యను తొమ్మిదవ నాయికను బ్రత్యేకముగా నంగీకరింపవలయును. దీనిలక్షణమిది. "ఎవతె భర్త యగ్రిమక్షణమున దేశాంతరమునకుఁబోవునో యామె ప్రవత్స్యత్పతిక" ఈమె చేష్టలు కాకువచనము, కాతరప్రేక్షణములు (బెదరుచూపులు) గమనవిఘ్నప్రదర్శనము, నిర్వేదము, సంతాపము, సమ్మోహము, నిశ్వాసము, బాష్పము మొదలగునవి.

ప్రస్థానం వలయైఃకృతం,ప్రియసఖైరస్రైరజస్రం గతం
ధృత్యా నక్షణమాసితం, వ్యవసితంచిత్తేన గంతుంపురః
యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వైస్సమం ప్రస్థితం
గంతవ్యేసతి జీవిత! ప్రియసుహృత్సార్థః కిముత్సృజ్యతే?

ప్రియుఁడు ప్రయాణాభిముఖుఁడు కాఁగానే నాకంకణములు పయనమొనర్చినవి. నానెచ్చెలులగు బాష్పములు నిరంతరముగాఁబోయినవి. ధృతినిముసమేనియు నాఁగదాయెను. మనస్సుముందుగాఁ బోవఁదలపెట్టెను. ఇట్లన్నియుఁ బ్రియునితో సమానముగా బయలుదేరినవి. ఓ జీవితమా! నీవును నవశ్యముగా వెడలవలసియుండఁగా నీ సుహృత్సంఘాతమును (వలయాదులను) నేలవదలెదవు? అనఁగా వారిని వెంబడించి నీవును బొమ్ము; వెనుకఁబడకుము.

ఇందలి నాయికయొక్క పతి యగ్రిమక్షణమున దేశాంతరగమనమును జేయుచున్నాఁడు. కాన నాయిక ప్రవత్స్యత్పతిక.

కానీ శృంగారామృతలహరీకారుఁడీమతము నిట్లు విమర్శించెను.

"నను ప్రస్థానం వలయైః కృతం" ఇత్యాది మహాకవి ప్రయోగానుసారేణ "ప్రవత్స్యత్పతికా నవమీనాయికా భవితుమర్హతీతిచేన్నైవం। యోజనశతం యోజనాదికమివ అల్పముత్ప్రేక్షితం। విప్రలంభజనకత్వేన సజాతీయభేదమవగణయ్యాస్య తంత్రేచ్ఛేన మహర్షిణా ఐక్యవివక్షణాత్ । తదుక్తం । "ప్రవత్స్యత్పతికాప్యత్రై వాంతర్భవతి [illegible] విభాగోత్తరదేశ

సంయోగానుకూలం కర్మ । నతూత్తరదేశ సంయోగ ఏవ । మార్గం గచ్ఛతః ఉత్తర దేశ సంయోగాభావేఽపి ప్రవాసత్వానాకల్పనాపత్తేః । తథాచ తాదృశకర్మణః ప్రవత్స్యత్యపిసత్త్వాత్వ్యక్త ఏవ ప్రోషితేఽంతర్భావః." ("ప్రస్థానంవలయైఃకృతం" అను మహాకవి వాక్యము ననుసరించి ప్రవత్స్యత్పతిక యను తొమ్మిదవ నాయిక యున్నదని చెప్పవచ్చునందుమేని నట్లుగాదు. విప్రలంభమున యోజన శతమునకును యోజనమునకును భేదము గానరాదు. అనఁగా విరహావస్థాకాలమున యోజనశత మెంత సంతాపజనకమో యోజనముగూడ నంతే సంతాపజనకము. కాన మహర్షి యీ స్వల్పభేదమును (ప్రోషితుఁడు = ప్రవాసమునకు వెళ్ళినవాఁడు; ప్రవత్స్యత్ = ప్రవాసమునకుఁ బోవుచున్నవాఁడు; ప్రోషిత భర్తృకకును ప్రవత్స్యత్పతికకును విప్రలంభము సమానమే. ప్రవాసము దటస్థించుటయే సంతాపజనకము. అది భూత మైనను భావియైన నొక్కటే) పరిగణింపక ప్రవత్స్యత్పతికయు నిందేఁ (ప్రోషిత భర్తృక) యంతర్భవించునని చెప్పెను. ప్రవాసమన దూరదేశమున నుంటయే కాదు. దూరదేశమునకుఁ బ్రయాణసన్నాహమొనర్చుటయుఁ బ్రవాసమే. ప్రవాసానుకూల మగు వ్యాపారముగూడఁ బ్రవాసమే. కానిచో దూరదేశమును జేరకముందు మార్గ మునఁ బ్రయాణము చేయుచున్న కాలమునఁ బ్రవాసము లేకపోవలసివచ్చునుగదా! కావున దూరదేశమునకుఁ జేయుచున్న ప్రయాణసన్నాహము గూడఁ బ్రవాసమే యగును. కాన నిది ప్రోషితభర్తృకయందే యంతర్భవించును.

కం. ఈ యెనిమిది భేదంబులఁ
 బ్రేతునులు పద్మాదులుం బ్రభిన్నాత్మకలై
 యాయతగతి నిలనూటిరు
 వైయెనిమిది భేదములను వరలుదురుదగన్, ౫౦

కం. ఇల నీసంఖ్యలఁదగు సతు
 లలయుత్తమ మధ్యమాధమాభిఖ్యలఁ జె
 న్నలరఁగ మున్నూటెనుబది
 నలువురు నాయికలటందురి నవరసరసికుల్. ౫౧

మున్నూటెనుబది (పా) మున్నూటెనబది

తా. వెనుక ముప్పదియెనిమిదవ పద్యమున గణింపఁబడిన పదాఱునాయిక లలో నొక్కొక్కతెయు స్వాధీనపతికాద్యష్ట భేదములచే ౧౨౮ మంది నాయిక లగుదురు.

ఎట్లన ముగ్ధాస్వాధీనపతికా, మధ్యాస్వాధీనపతికా (ధీరా, అధీరా, ధీరాధీరా జ్యేష్ఠా, కనిష్ఠా,) ప్రౌఢాస్వాధీనపతికా (ధీరా, అధీరా, ధీరాధీరా, జ్యేష్ఠా, కనిష్ఠా) పరకీయాస్వాధీనపతికా, సామాన్యాస్వాధీనపతికా మొ॥ ఇట్లే ముగ్ధా ప్రోషితభర్తృకా మొదలగు భేదము లూహింపవలెను.

ముగ్ధకుఁ బ్రజ్ఞాసామగ్రి లేమిచే ధీరా, అధీరా, ధీరాధీరాది భేదములు లేని విధమున నష్టవిధత్వముగూడ యుక్తముగాదు. అయినను బ్రాచీనుల లేఖనము ననుసరించి యీ భేదములు చూపఁబడినవి.

ఇటుఁ దెలుపఁబడిన నాయికాభేద మవస్థాభేదమునుబట్టియే కానీ జాతిభేదముచే నేర్పడినది కాదు. జాతిభేదమును గ్రహించినచో నానంత్యము సంభవించును. అందుఁ బద్మినీ, చిత్రిణీ, శంఖినీ, హస్తినీ భేదములు ముఖ్యములు. వీని లక్షణలక్ష్యములు గామశాస్త్రమువలనఁ దెలియవలెను.

పరకీయలగు గన్యకా, అన్యోఢలు ప్రియసంకేతమునకుఁ బూర్వము విరహోత్కంఠిత లగుదురు. పిమ్మట విదూషకాదులచేఁ బ్రియుని నభిసరించుచు నభిసారిక లగుదురు. సంకేతస్థానమును బొంది నాయకుఁడు కానరామిచే విప్రలబ్ధ లగుదురు. కాన విరహోత్కంఠిత, అభిసారిక, విప్రలబ్ధయుఁ బరకీయయొక్క యవస్థాంతరములేయని యొకరనిరి. ఇది పొరపాటు. స్వీయావిరహోత్కంఠిత, స్వీయాభిసారికా స్వీయావిప్రలబ్ధాది భేదములను బ్రాచీను లంగీకరించిరి.

నాయికను దదవయవములను నేయే వస్తువులతోఁ బోల్పఁదగునో యిటుఁ దెలుపుదము.

స్త్రీని—చంద్రికళా, సరోజమాలా, శిరీష, విద్యుత్, తారా, కనకలతా, రత్నశలాకా, దమనకయష్టి (దవనపుకొమ్మ) కాంచనయష్టులతో నుపమింపవచ్చును.

తనుద్యుతిని—గోరోచనా, స్వర్ణ, విద్యుత్, చంపక, కనకేతకీ ప్రభృతులతో.

కచములను—తమస్సు, శైవాలము, మేఘము, బర్హిపింఛము, భ్రమరములు, చామరములు, యమునాతరంగములు, నీలరత్నములు, నీలాబ్జములు, ధూపము, ధూమము మొ॥ వానితో

వేణిని—సర్ప, అసి, భృంగావళి, దండము (వేణీదండము) మొ॥ వానితో

ధమ్మిల్లమును—రాహువు మొ॥ వానితో

సీమంతమును—మార్గము, దండము మొ॥ వానితో

లలాటమును—అర్ధచంద్ర, హేమపట్టికలు మొ॥ వానితో

కనుబొమ్మలను—వల్లి, స్మరచాప, తరంగ, భృంగాళీ, సర్ప, కృపాణిక, పల్లవములు మొ॥ వానితో

కపోలమును—చంద్ర, ఆదర్శములు మొ॥ వానితో

ముఖమును—చంద్ర, పద్మ, దర్పణములతో

నాసికను—తిలప్రసూనము, సంపెంగమొగ్గ, మన్మథమాణీరములు, వంశము (నాసావంశము) పాటలీపుష్పము మొ॥ వానితో

కంఠమును—శంఖము మొ॥ వానితో

నేత్రములను—మృగనేత్ర, పద్మ, కుముద, ఝష, ఖంజన, చకోరనేత్ర, కేలికాళి, మన్మథబాణములు మొ॥ వానితో

అధరమును—ప్రవాళము, బింబము, బంధూకము (మంకెనపువ్వు) జపాపుష్పము, పల్లవము మొ॥ వానితో

దంతములను—ముక్తా, మాణిక్య, నారంగబీజ, దాడిమబీజ, కుందకోరకములు మొ॥ వానితో

వాక్కులను—మధురములైన హంస, శుక, పిక, శారికా, వేణు, వీణానాదములు మొ॥ వానితో

బాహువులను—విద్యుల్లతలు, మృణాళములు, వల్లరులు మొ॥ వానితో

కరములను—పద్మము, పల్లవము, విద్రుమము మొ॥ వానితో

నఖములను—చంద్రికళలు, కుందకోరకములు, తారలు మొ॥ వానితో

స్తనములను—పూగములు (పోకలు) తమ్మిమొగ్గలు, బిల్వఫలములు, తాటికాయలు, పూగుత్తులు, కరికుంభములు, కొండలు, కుండలు, చక్రములు, దబ్బపండ్లు, దానిమ్మపండ్లు మొ॥ వానితో

నాభిని—పాతాళము, ఆవర్తము, హ్రదము, కూపము, నదము మొ॥ వానితో

వళులను—పాశములు, తరంగములు, సోపానములు, నిచ్చెన మొ॥ వానితో

పృష్ఠములను—కాంచనపట్టము మొ॥ వానితో

నడుమును—ముష్టిగ్రాహ్యముగా సూదిమొన, శూన్యము, అణువు, వేది, సింహపు నడుము, మొ॥ వానితో

జఘనమును—పులినము మొ॥ వానితో

నితంబమును—పీఠము, తపనీయశిల, చక్రము, భూమి మొ॥ వానితో

ఊరువును—కరిహస్తము, కదళీకాండము, కరభము (మణికట్టు మొదలుకొని చిటికెన వ్రేలువఱకునుండు చేతి వెనుకటి భాగము) మొ॥ వానితో

చరణమును—పల్లవ, పద్మ, స్థలపద్మ, ప్రవాళములు మొ॥ వానితో
అంగుష్ఠనఖమును—పూర్ణచంద్రుఁడు మొ॥ వానితో
గమనమును—గజగమనము, హంసగమనము మొ॥ వానితో
కటాక్షములను—యమునాతరంగములు, భృంగావళి, విషము, అమృతము మొ॥
వానితో
హాసమును—వెన్నెల, చందురుఁడు, పుష్పము, పీయూషము, ఫేనము, కైరవము
మొ॥ వానితో
శ్వాసమును—పరిమళముతో
నూపురధ్వనిని—హంస, సారస, ధ్వనులతోను నుపమింపవచ్చును.

శరీర తదవయవ గుణవిశేషములను దెలుపుదుము

శరీరమునకు—సౌందర్యము, మార్దవము, అతికోమలత, కాంతి, ఔజ్జ్వల్యము, అబ
లత్వము మొదలగునవి వర్ణ్యములు
కేశములకు—దీర్ఘత్వము, కౌటిల్యము, మృదుత్వము, సాంద్రత్వము, నీలత్వమును
వర్ణ్యములు
కపోలమునకు—స్వచ్ఛత వర్ణ్యము
కంఠమునకు—దీర్ఘత్వము, త్రిరేఖత్వము వర్ణ్యములు
నేత్రములకు—స్నిగ్ధత, విశాలత, లోలత, అపాంగదీర్ఘత, నీలత, ప్రాంతలౌహి
త్యము, శ్వేతత్వము, నిబిడపక్ష్మతయు వర్ణ్యములు
అధరమునకు—అత్యంతమాధుర్యము, ఉచ్ఛూనత్వము, రక్తిమయు వర్ణ్యములు
దంతములకు—తెలుపు; ఎఱుపు; 32 సంఖ్య గలిగియుండుట, అతిదీప్తత వర్ణ్యములు
వాక్కులకు—మాధుర్యము, స్పష్టత, మృదుతయు వర్ణ్యములు
భుజములకు—సమత్వము వర్ణ్యము
కరములకు—అతిమృదుత్వము, శీతత్వము, శోణత్వమును వర్ణ్యములు
స్తనములకు—శ్యామాగ్రత్వము, ఔన్నత్యము, విస్తారము, (బలుపు) దృఢత్వము,
పాండుత్వము వర్ణ్యములు
రోమాళికి—మార్దవము, సౌక్ష్మ్యము, శ్యామత, నాభిప్రవేశము వర్ణ్యములు
జంఘలకు—వృత్తానుపూర్వత్వము, (మెలికలు తిరిగి యుండుట) కాంతి, అనతిదీర్ఘ
తయు వర్ణ్యములు
నిశ్వాసమునకు—[illegible] వర్ణ్యములు

## దూతికలు

దూత్యస్సఖీ నటీ దాసీ, ధాత్రేయీ ప్రతివేశినీ
బాలా ప్రవ్రజితా కారూః శిల్పిన్యాద్యాస్స్వయంతథా

సఖురాలు, నటి, దాసి, దాది, పొరుగునను న్నది, ఇంటిలోని చిన్నపిల్ల, రోగిని, చాకలి మొదలైనది, చిత్రకర్మ సేయునది, వీరు దూతికలుగా నుందురు. ఆదిశబ్దముచేఁ దాంబూలిక స్త్రీ (తాంబూలములమ్ము స్త్రీ) గాంధిక స్త్రీ (పరిమళద్రవ్యములనమ్ము స్త్రీ), పాచక స్త్రీ (వంటకత్తె) గాయక స్త్రీ (గానము నేర్పు స్త్రీ) మొదలగు వారుగూడ దూతికలు. మరియు స్వయముగానే నాయికదూతిగా వ్యవహరించుటయుఁ గలదు. ఎట్లన

గీ. కటికరాలుదక్కఁ గనరావుకంటికీ । పల్లెకొంపలందు బాటసారి!
ఘనపయోధరములు గనుఁగొని నిలువంగఁ । దలఁచితేని నేఁడు నిలిచిపొమ్ము!

ఇట నాయికయే బాటసారితో స్వయముగా దౌత్యము సేయుచున్నది. మిగిలినవాని కుదాహరణము లూహ్యములు.

## కావ్యస్వరూపము

గీ. ఇంకఁ గావ్యస్వరూపంబు నేర్పఱింతు
విగతదోషంబులును, గుణాన్వితము, లధిక
లసదలంకార భావోపలక్షితములు
నైనశబ్దార్థములు కావ్యమనఁజెలంగు. ౫౭

తా. కావ్యస్వరూపమనఁ గావ్యశరీరలక్షణము. దోషరహితములును, గుణసహితములును, అలంకారయుక్తములు నగు శబ్దార్థములు కావ్యశరీరము.

కావ్యలక్షణము చెప్పఁబడినది. ఈ లక్షణవివేచనము విపులముగా ముందు చేయుదుము. ఇటముందు కవియనఁ బెవఁడు? కావ్యమన నేమి? అను విషయము లల్పముగాఁ దడవుదము.

ప్రప్రథమమున "కవిర్మనీషీ పరిభూః స్వయంభూః" అని కవిశబ్దము పరమాత్మపరముగా వైదికమంత్రములందుఁ గానవచ్చుచున్నది. క్రమముగా నాపదము పరమాత్మయొక్క సాక్షాత్కారమును బొందిన 'ఋషి' పరముగా వ్యవహారమునకు వచ్చినది. సాక్షాద్ద్రష్టలయిన వైదికఋషులు కవులు. వారికావ్యము లుపనిషత్తులు, ఆద్యులగు వైదికకవులును, లౌకికులగు వాల్మీకివ్యాసాదులును ఋషులగుటచేతను.

వారు దివ్యదృష్టిలో లోకరహస్య మెఱిఁగిన వారగుటచేతను వారి కావ్యములు లోకోత్తరవర్ణనాత్మకము లగుటచేతను "నానృషిఃకురుతేకావ్యం" (ఋషి గాని వాఁడు కావ్యమును రచింపఁజాలఁడు) కవయఃక్రాంతదర్శినః (కవులు దివ్యదృష్టి గలవారు) అను లోకోక్తులు గలిగినవి. కావుననే యప్పకవి

కం. ఇమ్మహిని మునులచే వెల। సెమ్మను కావ్యములు "నానృషిఃకురుతే కా
వ్య"మ్మనువచనార్థంపుఁ। సమ్మతిఁ; గలివేళ సుకవిజనులే మౌనుల్‌॥

అనివచించెను. కాని కేవలము ఋషి కావ్యమును రచింపఁజాలఁడు. హేమ చంద్రుఁడు భట్టతౌతుని శ్లోకములను మూఁడింటి నీ విషయమున సంగ్రహించెను.

"నానృషిః కవిరిత్యుక్తమృషిశ్చకిల దర్శనాత్
విచిత్రభావధర్మాంశ తత్త్వప్రఖ్యాచదర్శనం
స తత్త్వదర్శనాదేవ శాస్త్రేషు పఠితఃకవి
దర్శనాద్వర్ణనాచ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః
తథాహి దర్శనే స్వచ్ఛేనిత్యేప్యాదికవేర్మునేః
నోదితా కవితా లోకే యావజ్జాతా నవర్ణనా."

ఋషిగానివాఁడు కవిగాఁడని చెప్పుదురు. ఋషియనఁగా ద్రష్ట. దర్శన మన విచిత్రమయిన వస్తువులయొక్క ధర్మాంశములనెఱుఁగుట (దీనికే ప్రతిభయని పేరు) అట్టి తత్త్వదర్శనము గలిగిన వానినే శాస్త్రములు కవియని పేర్కొను చున్నవి. కాన లోకమున దర్శనము, వర్ణనమునను నీ రెంటివలనను గవియని ప్రసిద్ధి వహించును. వాల్మీకి మొదట ద్రష్టయైనను వర్ణనము (రామాయణరచనము) చేయు వఱకుఁ గవిగా గణింపఁబడఁడయ్యెను. దీనివలన ద్రష్టయై వర్ణనానిపుణుఁడు గావల యును; ఈయభిప్రాయమునే భామహుఁడిట్లు తెలిపెను.

ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా
తదనుప్రాణనాజ్జీవేద్వర్ణనానిపుణః కవిః

తా. నవనవోన్మేషశాలిని యగు ప్రజ్ఞ ప్రతిభ యనఁబడును. దాని కాశ్రి తుఁడై వర్ణనముసేయువాఁడు కవి.

ఆనందవర్ధనుఁడు.

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్

సఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవ తత్
భావానచేతనానపి చేతనవచ్చేతనానప్యచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా."

తా. అపారమైన కావ్యప్రపంచమునకుఁ గవియే బ్రహ్మ. అనఁగా సృష్టికర్త. అతఁడు తన యిచ్ఛానుసారముగా లోకమును మార్చును. అతఁడు శృంగారియగుచో, లోకమును శృంగారమయ మొనర్చును. అతఁడు విరాగియగుచో నీరసముఁగావించును. అచేతవస్తువులను జేతనవస్తువులుగాఁ జేతనవస్తువుల నచేతనవస్తువులనుగా స్వతంత్రతతోఁ గవి వ్యవహరించును" అనియును గవినిఁగూర్చి దెలిపెను. భామహానందవర్ధనుల యుక్తుల కేకవాక్యతను గల్పించినచోఁ "ప్రతిభావంతుఁడైన కవి కావ్యప్రపంచమును సృజించు బ్రహ్మ" అని తేలును. ప్రతిభావంతుఁడేకదా లోకమును రసమయముగాఁగానీ నీరసముగాఁగానీ చేయఁగల దిట్ట! కావుననే "కావ్యం తు జాతు జాయేత కస్యచిత్ప్రతిభావతః" (ఒకానొక ప్రతిభావంతునివలననే యట్టి కావ్య ముదయించును" అను వాచోయుక్తియు నేర్పడినది. కావునఁ గవి యనఁ గ్రాంతదర్శియై ప్రతిభావంతుఁడై వర్ణనానిపుణుఁడగువాఁడు.

"కవనీయం కావ్యం" (వర్ణింపఁదగినది) అనిలోచనకారుఁడు; "కవయతీతి కవిః తస్యకర్మ కావ్యం" (వర్ణించువాఁడు కవి. అతని కర్మ కావ్యము) అని విద్యాధరుఁడు. "కాతి శబ్దాయతే విమృశతి రసభావాన్" ఇతి కవిః తస్య కర్మ కావ్యం" (రసభావములను విమర్శించువాఁడు కవి. వాని కర్మ కావ్యము) అని భట్టగోపాలుఁడు. "లోకోత్తరవర్ణనానిపుణకవికర్మ కావ్యం" (లోకోత్తరవర్ణనా నిపుణుఁడగు కవియొక్క కర్మ కావ్యము) అని మమ్మటుఁడు. ఇవన్నియుఁ గవికర్మను దెలుపుచున్నను నిందుఁ గవిలక్షణ మిమిడియే యున్నది. వీనిలోని "లోకోత్తర వర్ణనానిపుణ కవికర్మ కావ్యం" అనుదానినిఁబట్టి లోకోత్తరవర్ణనానిపుణుఁడే కవి యని సారాంశము. మిగిలిన వ్యుత్పత్తులకుఁగూడ నిదియే యభిప్రాయమైనను నింత విస్పష్టముగా లేవు. కావున నట్టి లోకోత్తర వర్ణనానిపుణత్వము ప్రతిభా లభ్యము. ప్రతిభ దేవతానుగ్రహ సంపాద్యము. దేవతానుగ్రహము తపస్సంపాద్యము. తపస్సు ఋషికర్మ. కావుననే "నానృషిః కురుతేకావ్యం" "కవయః క్రాంతదర్శినః" అను లోకోక్తు లేర్పడినవి. అట్టి ఋషికల్పుఁడే మహాకవి. మహాకవి యన నెట్టివాఁడో యింకను ముందు విశేచింతుము. ఇఁక నప్పకవీయమునఁ జెప్పఁబడిన సప్తవిధ కవులను జూపుదుము.

ఆ.వె. వినుతిగాంతురిల వివేకి, వాచక, రాచి। కార్థి, శిల్పి, భూషణార్థు, లనఁగ
మార్దవానుగత సమాహ్వయుఁడునునాఁగఁ।గవులుసప్తనామకములతోడ.

తా. వివేకి, వాచకుఁడు, రాచికుఁడు, ఆర్థికుఁడు, శిల్పి, భూషణార్థి, మార్దవ-కవి అని కవులు సప్తవిధముగా నుందురు.

సీ. గణ వర్ణ శబ్దార్థగుణదోషనికరంబుఁ । బరికించికూర్చుఁ గబ్బము వివేకి
బహుతరానుప్రాస పదబంధనియమంబు । వదలకకృతిసేయు వాచకుండు
మృదుమధురోక్తుల వెదకి కావ్యంబెల్ల । రచియించుఁ బదపడి రాచికుండు
మితశబ్దములలోన నతివిపులార్థంబు । నిమిడించునర్థాఖ్య నెసఁగునతఁడు

గీ. సెప్పుయమకంబుసెప్పట్ల శిల్పకుండు; । పొందుపఱచునలంకృతుల్ భూషణార్థి;
సరళపదవిరళార్థ విస్ఫురణముగను । జూపు రసమెందు మార్దవస్ఫుటకరుండు.

అని వివేకిప్రభృతులకు లక్షణము చెప్పఁబడినది. ఇందు రాచిక, ఆర్థిక, మార్దవకవులు మాత్రమే కవులు. మిగిలినవారు కవిబ్రువులే. పూర్వకవులలో నన్నయ-భట్టు రాచికుఁడు; తిక్కన ఆర్థికుఁడు; ఎఱ్ఱాప్రెగడ మార్దవకవి.

భట్టుమూర్తి నరసభూపాలీయములో సంస్కృతాంధ్ర కవులలోఁ బూర్వుల-కే యే గుణములు ప్రత్యేకించి కలవో వానినిఁ జేర్కొనియున్నాఁడు. చూడుఁడు.

సీ. బాణు వేగంబును భవభూతి సుకుమార,తయు మాఘుశైత్యంబు దండి సమత
అలమయూరు సువర్ణకలన చోరుని యర్థ,సంగ్రహమ్ము మురారి శయ్యనేర్పు
సోము ప్రసాదంబు సోమయాజుల నియ,మంబు భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథునిపద ప్రసిద్ధ ధారాశుద్ధి, యమరేశ్వరుని సహస్రముఖసృష్టి

గీ. నీక కల.దటుగాన ననేకవదన, సదనసంచార ఖేదంబు సడలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె, మూర్తికవిచంద్ర । విఖ్యాత కీర్తిసాంద్ర!

మరియు "ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవం।
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయోగుణాః" అనియుఁ గలదు.

ఇఁకఁ గావ్యమీమాంసలో నీక్రిందివిభాగము చేయఁబడియున్నది.

"శాస్త్రకవి, కావ్యకవి, ఉభయకవి, వారిలో నుత్తరోత్తరుఁడు శ్రేష్ఠుఁడు" ఉభయకవినే విద్వత్కవియందురు. "విద్వత్కవయః కవయః కేవలకవయస్తు కేవలం-కపయః" అను వాచోయుక్తియుఁ గలదు. అనఁగాఁ బ్రతిభావ్యుత్పత్తులు రెండును గలవాఁడే విద్వత్కవి. అట్టివాఁడే లోకోత్తరవర్ణనానిపుణుఁడు. కావుననే

ఆ.వె. గురువులఘువుఁజేసి కుంచించికుంచించి । లఘువు గురువుఁజేసి లాగిలాగి
కవితఁజెప్పఁబట్టి కవిగులాముసుఁబట్టి । ముక్కుఁగోయవలయుఁ దోక్కపట్టి.
ఇట్టివారు కవులుగారు. మరియు
న స శబ్దో న స న్యాయో న సా విద్యా న సా కళా
జాయతేయన్నకావ్యాంగమహో భారో మహాన్కవేః

తా. కావ్యాంగముగాని శబ్దముగాని న్యాయముగాని విద్యగాని కళగాని లేదు. కవిపైఁ జాల భారము గలదు. అనియు నంటవలనఁ గవి సాధింపవలసిన విద్యాసామగ్రి యనఁగా వ్యుత్పత్తి చాలఁ గలదు. కావున విద్వత్కవులే కవులు; మిగిలినవారు కపులే.

"నాకవిత్వ మధర్మాయ మృతయే దండనాయ చ
కుకవిత్వం పునస్సాక్షాన్మృతిమాహుర్మనీషిణః"

కవి కాకపోవుటవలన నెట్టి యధర్మము లేక పాపమును సంభవింపదు. కవి కాకపోవుటవలన మనుష్యుఁడు చచ్చిపోఁడు. రాజాదులవలన దండనము రాదు. కాని కుకవియగుట కేవలము మరణమే." అను వాచోయుక్తివలనను వ్యుత్పన్నుఁడై విద్వత్కవి కావలెనని యూహింపఁబడుచున్నది. అట్టి ప్రతిభావ్యుత్పత్తులు రెండును గలవాఁడే లోకోత్తర వర్ణనానిపుణుఁడు. ఇఁక నా ప్రతిభ కారయిత్రి, భావయిత్రి యని యిబ్బెఱఁగులుగా నుండునని కావ్యమీమాంసా కర్త తెలుపుచున్నాఁడు. కవిచేఁ గావ్యమును వ్రాయించుశక్తి కారయిత్రి. పాఠకునిచేఁ గావ్యార్థమును భావింపఁజేయుశక్తి భావయిత్రి. కాఁబట్టి కవికివలెనే పాఠకునికినిఁ బ్రతిభయుండవలెను. లేకున్నచోఁ గవి భావమును గ్రహింపలేకపోవును. ప్రతిభా తారతమ్యమును బట్టియే కవులలో నప్పకవి తెలిపిన భేదము లేర్పడును.

ఇఁకఁ గావ్యలక్షణమును వివేచింతము. కావ్యలక్షణమును దెలిసికొనుటకు ముందు "సంస్కృతభాషలో నలంకారగ్రంథము లసంఖ్యాకములుగా నున్నవికదా! ఎందుల కిన్ని పుట్టినవి? మతభేదములు గలవా?" ఈ మొదలగు విషయములను జరిత్ర స్వరూపదృష్టితోఁ దెలిసికొనవలయును. అట్లయినయెడలనే క్షుణ్ణముగా నది యవగతము కాఁగలదు.

## భరత మతము

రమారమి రెండువేల సంవత్సరములనాఁడే భరతుఁడను మహర్షి నాట్యశాస్త్రమను గ్రంథమును రచించెను. అదియే సాహిత్యశాస్త్రమునఁ బ్రథమ

గ్రంథము. ఆ గ్రంథము కేవలము రూపకమును గుఱించియుఁ దద్విభేదములను గుఱించియు సమగ్రముగాఁ జర్చించును. భరతుని దృష్టిలోఁ గావ్యమన నాటకాదులే. నాటకములకు రూపకములనియు నామాంతరము, రామాది రూపములను ధరించి నటులు నటింతురు; కాన రూపకములు. "తద్రూపారోపాత్తు రూపకం" అని సాహిత్యదర్పణము. రామాది రూపములను నటులు ధరించి నటింతురు. కాన రూపకములు. భరతుఁడు రూపకమునకు రసము ప్రధానమనెను. కావ్యసౌందర్యము దేనివలనఁ గలుగునో యది కావ్యమునఁ బ్రధానము. భరతుఁడు రూపకమున రసమువలననే యా సౌందర్యము గలుగునని తలంచెను. ఆ రస మెట్లు నిర్వహింపఁబడవలయునో యా గ్రంథము సమగ్రముగాఁ జర్చించెను. భరతుఁడు గూడ రూపకమునందు రసము ప్రధానముగా నుండవలయునన్న సిద్ధాంతమును స్వోపజ్ఞముగాఁ దెలుపలేదు. అతనికిఁ బూర్వుఁడగు నందికేశ్వరుఁ డీ సిద్ధాంతమును లేవఁదీయఁగా భరతుఁడా సిద్ధాంతము ననుసరించి తాను జెప్పినట్లు భరతుఁ డుదాహరించిన రెండుః శ్లోకములఁబట్టి తెలియఁగలదు. కాన భరతుఁడు రసప్రాధాన్యవాది. ఈతని మతమునఁ గావ్యశరీర మితివృత్తమే. "ఇతివృత్తం తు కావ్యస్య శరీరం పరికీర్తితం" కావ్యశరీర మితివృత్తము. దీని సౌందర్యహేతువు రసము.

## భామహ మతము

భరతునికిఁ బిమ్మట నైదవశతాబ్దిలో భామహుఁడను నాలంకారికుఁడు శ్రవ్యకావ్యచర్చను సాఁగించి "శబ్దార్థౌసహితౌకావ్యం" కావ్యమునకు శబ్దార్థములు శరీరమనియు స్త్రీపురుషాదుల శరీరసౌందర్యమును నలంకారములు (నగలు) పెంపొందించు విధమునఁ గావ్యశరీరమునుగూడ వక్రోక్త్యాద్యలంకారములు పెంపొందించునవనియుఁ గావునఁ గావ్యమునకు నలంకారములు ప్రధానమనియు నిర్వచించెను. అనఁగా నలంకారములవలనఁ గావ్యసౌందర్యము గలుగునని నిర్ణయించెను.

ఇతరాలంకారికు లెల్లరును సమ్మతించిన స్వభావోక్తి నీతఁడంగీకరింపలేదు. స్వభావవిరుద్ధముగా ననఁగా వికటముగాఁ బలికినపుడే యానందము గలుగుననియు నావికటోక్తియే వక్రోక్తియనియు నలంకారములెల్ల వక్రోక్తులేయనియు నాతని సిద్ధాంతము. ఈయుద్దేశములోడనే క్రమ, సూక్ష్మ, లేశాద్యలంకారముల నాతఁ డంగీకరింపఁడయ్యె. ఈతఁడు దండివామనులంగీకరించిన రీతినంగీకరింపలేదు. కావ్యసౌందర్యాధాయకమైన వక్రోక్తియున్నచో నేరీతియైన నుపాదేయమేయనియు నదిలేనిచో నేరీతియైన ననుపాదేయమేయనియుఁ గాన వైదర్భీ, గౌడీ, భేదములనవసరమనియు నాతని యభిప్రాయము.

భరతుఁడు దృశ్యకావ్యమునకు రసము ప్రధానమని యంగీకరించుటచే భామహుఁడు శ్రవ్యకావ్యమునకు నలంకారమే ప్రధానమని తలఁచెను. మరియు రసమును గూడ రసవదలంకార మనుపేరితో నలంకారముగానే పరిగణించెను. ఈతఁ డలంకారప్రాధాన్యవాది. ఈతని గ్రంథము భామహాలంకారము.

## దండి మతము

ఆఱవశతాబ్దివాఁడగు దండి కావ్యసిద్ధాంతము నిట్లు ప్రతిపాదించెను. 'శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ' (రమణీయార్థభూషితమగు పదసంఘాతము కావ్యశరీరము.) శరీరముయొక్క బాహ్యసౌందర్యమును బెంచునవి యలంకారములైనను, అంతస్సౌందర్యమును బెంచి ప్రాధాన్యమును వహింపఁజేయునవి శౌర్యాదిగుణములే. స్త్రీ పురుషులకు లోకమునఁ బ్రాధాన్యమును లేక సౌందర్యమును గూర్చునవి గుణములే కదా! కావున నట్లే కావ్యశరీరమునకును గుణములే ప్రధానములు. గుణముల తరువాతి వలంకారములు. (ఈగుణములలోఁ గొన్నింటితో వైదర్భీరీతియుఁ గొన్నింటితో గౌడీరీతియు నేర్పడునని యాతఁడు వచించెను. * కొందఱు దండి భామహమతానుసారియై యలంకారమార్గమునకుఁ జెందినవాఁ డనియుఁ, గొందఱు గుణమార్గస్థాపకుఁ డనియు వచింతురు. గుణమతస్థాపకుఁ డనుటయే యుక్తిసహముగా నున్నది. ఈతఁడు గుణప్రాధాన్యవాది. గుణములవలనఁ గావ్యసౌందర్యము గలుగునని యితఁడు నిరూపించెను. ఈతని గ్రంథము కావ్యాదర్శము.

ఈతఁడును గావ్యమున రసప్రాధాన్యము నంగీకరింపలేదు. ఈతఁడుగూడ రసమును రసవదలంకారముగానే పరిగణించెను. ఈ యిరువు రాలంకారికులును వరు

---

* Dandin's Kavyadarsa is to some extent an exponent of The Riti School of poetics and partly of the Alankara School. P. V. Kane

The next important name after Bhamaha is that of Dandin. He is exponent of the Guna School which holds that the beautiful collocation of words and ideas is the chief feature of the poetry. The ten gunas are the life of the best poetic style called the Vaidarbhi; and the Alankaras which Bhamaha regarded as the soul of the poetry are treated by Dandin as mere embellishments of poetic language.

DR. Sankaran.

If, on the basis of Dandin's formulation of Gunas, one says that he belongs to The Guna School, one can as well say that Dandin belongs to The Riti School. Really Dandin belongs to the Alankara School, much more than Bhamaha. DR. V. Raghavan.

సగాఁ గావ్యశరీరముయొక్క బాహ్యసౌందర్యమును, అంతస్సౌందర్యమునుగుఱించియే చర్చించిరి. కాని శరీరమున కాత్మవలెఁ గావ్యశరీరమున కాత్మ గలదా? యని లోఁతుగా విచారింపరైరి. వారికిఁ గావ్యాత్మను గుఱించి తట్టనేలేదు. భామహుని మతమున శబ్దార్థములు రెండును గలిసియే కావ్యము. దండిమతమున రమణీయార్థ భూషితమగు శబ్దమే కావ్యము.

## వామన మతము

తరువాతఁ దొమ్మిదవ శతాబ్ది వాఁడగు వామనుఁడు గావ్యాత్మను గూర్చి విచారణ సాగించి 'రీతిరాత్మా కావ్యస్య' అను సిద్ధాంతమును వచించెను. శరీరమున కాత్మవలెనే కావ్యశరీరమునకును నాత్మ యుండుననియు నది రీతియనియు నాతని సిద్ధాంతము. రీతి కావ్యాత్మ యని చెప్పి భామహుని యలంకార సిద్ధాంతమును, దండి గుణసిద్ధాంతమును దనరీతిలో సమన్వయించెను. ఎట్లనఁగాఁ 'గావ్యాత్మ రీతి; రీతి గుణములచే నేర్పడును; అలంకారములు కావ్యసౌందర్యమును వృద్ధిసేయును;" ఈతని మతమునఁ గావ్యశరీరమున శబ్దార్థోభయమే. అనఁగా నితఁడు దండిమతమును స్వీకరింపక భామహ మతానుసారముగాఁ గావ్యశరీరమును నిర్ణయించెను. ఈతఁడు రీతిప్రాధాన్యవాది. ఇతఁడు కావ్యసౌందర్యము 'రీతి' వలన సిద్ధించునని నిశ్చయించెను. శరీరమున కాత్మవలెనే కావ్యశరీరమున కాత్మ యున్నఁగాని యలంకారాదులు శోభాహేతువులు కావు. కాన నాత్మ ప్రధానము. అది రీతి. ఈ రీతియే యలంకారాదులకును శోభాహేతువు. కాన రీతియే యాత్మ యని యతని వాదము. ఇతని గ్రంథము కావ్యాలంకార సంగ్రహము.

## ఆనందవర్ధన మతము

వామనుని యనంతరమునఁ గొలఁది కాలములోనే యానందవర్ధనుఁ డను నాలంకారికుఁడు సాహిత్యక్షేత్రమునకు వచ్చెను. ఆయన ధ్వన్యాలోక మను గ్రంథమును రచించెను. ఆయన యొక క్రొత్త సిద్ధాంతమును లేవఁదీసెను. ఆయన సిద్ధాంతమిది. "కావ్యశరీరమున కాత్మ ధ్వని; అది వస్త్వలంకార రసరూపము. అనఁగా వస్తుధ్వని; అలంకారధ్వని; రసధ్వని; అని ముత్త్రివిధములు. ఈమూటిలో వస్త్వలంకార ధ్వనులకన్న రసధ్వని సర్వశ్రేష్ఠము. అయినను వస్త్వలంకారధ్వను లధమములుగావు. కావ్యమున కలంకారములు ముఖ్యాంగము గావు. ఏలన. శరీరమునం దాత్మ యున్నచో నలంకారములు శోభాహేతువులగును. అట్లే కావ్యశరీరమున కాత్మ యగు ధ్వని యున్నచో నలంకారములుగూడ శోభాహేతువు లగును. ఆ ధ్వని

లేకున్నచో నాయలంకారములు శోభాహేతువులు కాఁజాలవు. కాన నట్టియలంకారములే గ్రాహ్యములు. అనఁగా ధ్వన్యుపస్కారకములగు నలంకారములే యలంకారములు. అప్పుడే యలంకారశబ్దము సార్థకమగును. గుణములు రసధర్మములు. అనఁగా గుణములకును రసమునకును నవినాభావసంబంధము గలదు. అలంకారములు లేకున్నను రస ముండవచ్చును. కాని గుణములు లేకున్నచో రస ముండదు. గుణము లాత్మధర్మము లయినట్లే కావ్యమునను గుణము లాత్మభూతమగు రసధర్మములే. అలంకారము లాత్మధర్మములుగాక శరీరధర్మము లగును. కాఁబట్టి యలంకారములవలెనే గుణములును గావ్యాత్మయగు ధ్వని కంగములే. మరియు వామనుఁడు నుడివినట్లు రీతి కావ్యాత్మ గాదు. రీతియన గుణసంకలనరూపమే కదా! ఈ రీతియుఁ దత్తద్రస ధ్వన్యుపస్కారకముగా నసమాస, అల్పసమాస, దీర్ఘసమాసగా నుండును. ఇదియు నంగభూతమే. ధ్వనియే యంగి. ఈవిధముగా నలంకారములు, గుణములు, రీతులును ధ్వన్యుపస్కారకములుగా ననఁగా ధ్వనికిఁ దోడ్పడునవిగానే యుండవలయును. అప్పుడే యీ నామములును సార్థకములగును.

భామహ, దండి, వామన, ఆనందవర్ధనులు క్రమముగా నొకరికన్న నొకరు కావ్యమార్గమును (కావ్యాత్మను) నిర్ణయించుటలో నొక్కొక్కమెట్టు ముందులకు సాఁగిరి. ఆనందవర్ధనుఁడు ముఖ్యముగా రెండు విషయములను దన గ్రంథమున స్పష్టపఱచెను. అతఁడు క్రొత్తగా ధ్వనిసిద్ధాంతమును స్థాపించెను. ప్రాచీనుల, అలంకార, గుణ, రీతి, సిద్ధాంతములను హేతువాద పురస్సరముగాఁ దన ధ్వని సిద్ధాంతమున కంగములుగా సమన్వయించెను. మరియు భరతుని రూపకరససిద్ధాంతమునే గ్రహించి దానినిఁ గావ్యమునఁ బ్రతిష్ఠించెను. దాని నున్నదున్నట్లుగాఁ బ్రతిష్ఠింపక యందలి దోషములను బరిహరించి సముచితవిధమునఁ బ్రతిష్ఠించెను. కావున ధ్వనిసంప్రదాయము రససంప్రదాయముయొక్క పెంపుదలయే. అనఁగా రసములో పాటు వస్త్వలంకారములకుఁ గూడఁ బ్రాధాన్య మిచ్చుచున్నది. కాన దాని పెంపు మాత్రమే యగును.

ఆనందవర్ధనుఁడు గుణరీతివాదులగు దండి వామనులగూర్చి వారికిఁ గావ్యతత్త్వ మస్ఫుటస్ఫురితమై లేక స్ఫురితప్రసుప్తకల్పమై యున్నదనియు, దానిని వ్యాఖ్యానించి నిర్వచింపఁజాలక రీతినిఁ బ్రవర్తిల్లఁజేసిరనియుఁ జెప్పెను.

“అస్ఫుటస్ఫురితం కావ్యతత్త్వమేతద్యథోదితం
అశక్నువద్భిర్వ్యాకర్తుం రీతయస్సంప్రవర్తితాః”

అనఁగాఁ గావ్యతత్త్వము భామహునికి బొత్తుగాఁ దెలియనేలేదు. దండి వామనులకు నస్ఫుటముగా స్ఫురించినది; అనఁగాఁ గొంత తెలిసియుఁ గొంత తెలియకయు నున్నదని యభిప్రాయము.

ఆనందవర్ధనుఁడు ధ్వనిప్రాధాన్యవాది. లోకమున శరీరమునకు జీవితమున్న యెడలనే యలంకారాదులు సౌందర్యహేతువు లగును. కాన నలంకారాదులకన్న జీవితము ప్రధానము. అట్లే కావ్యశరీరమునకుఁ ద్రివిధమగుధ్వనియు జీవితము అనఁగా నాత్మ. అదియే ప్రధానమని యితని మతము. పూర్వాలంకారికులు కావ్య సౌందర్య హేతువులను మాత్రమే నిరూపించిరి. ఇతఁడు మరికొంత లోఁతునకుఁబోయి కావ్య జీవితమును నిరూపించెను. రీతియే కావ్యాత్మ లేక కావ్యజీవిత మను మతము నీతఁడు నిరసించెను. ఈ భేదమును గమనింపవలెను.

ఆనందవర్ధనునిమతమునఁ గావ్యశరీర మేమి? అనుప్రశ్నగలదు. ధ్వన్యాలోక మునఁ గావ్యశరీరమునుగూర్చి యెచ్చటను దెలుపఁబడలేదు. వామనకావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యాత యగు గోపేంద్రతిప్పభూపాలుఁడు తన కామధేను వ్యాఖ్యలో "రీతిధ్వని వాదయోస్తు ఇయాన్ భేదః। తత్ర ప్రథమే రీతిరాత్మా కావ్యస్య।తద్వ్యవ హార ప్రయోజకా గుణాః। చరమేతు ధ్వనిరాత్మా। సఏవ తద్వ్యవహారప్రయోజక ఇత్యుభయత్రాప్యాత్మనిష్ఠా ఏవ గుణాః। శబ్దార్థయుగళం శరీరం। తన్నిష్ఠా అలం కారా ఇతి చ సర్వమవిశిష్టం।" అని వ్రాసిన వ్రాఁతనుబట్టి భామహ వామనుల వలెనే యీతఁడును శబ్దార్థోభయమే కావ్యశరీర మని గ్రహించినట్లు మన మూహింపఁగలము.

కొందఱు ధ్వన్యాలోకకర్త కావ్యలక్షణమును నన్వయముఖమునఁ (సూటిగా) దెలుపలేదనియు వ్యతిరేకముఖమునఁ దెలిపెననియు నీక్రింది పంక్తులను జూపుదురు.

ఎట్లన "తత్రహి చారుత్వాతిశయ విశిష్టార్థప్రకాశనలక్షణే ప్రయోజనే కర్తవ్యే యదిశబ్దస్య అముఖ్యతా తదాతస్యప్రయోగే దుష్టతైవస్యాత్; నచైవం"

దీనినిఁబట్టి యానందవర్ధనుని మతమున శబ్దార్థోభయము కావ్యశరీరముగాక చారుత్వాతిశయ విశిష్టార్థప్రకాశకమగు శబ్దవిశేషమే కావ్యమనియు దీనియభిప్రాయ మునే జగన్నాథుఁడు "రమణీయార్థప్రతిపాదక శబ్దఃకావ్యం" అని తేల్చి ప్రతిపా దించె ననియుఁ జెప్పుదురు. అట్లేని నానందవర్ధన జగన్నాథు లిరువురును దండి మత మునే పునఃప్రతిష్ఠఁజేసిరని యూహింపవచ్చును. ప్రాచీనాలంకారికులలో దండ్యా నందవర్ధన జగన్నాథులు శబ్దవిశేషమే కావ్యశరీర మని నిర్ణయించిరి. మిగిలిన యెల్ల రును శబ్దార్థయుగళము కావ్యశరీరమని నిర్ణయించిరి.

ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమునే తరువాతివా రెల్లరును శిరసావహించి స్వీకరించిరి. భరతుని రససిద్ధాంతమును రూపకమునకుమాత్రమే సమన్వయించి శ్రవ్యకావ్యమునకు దానినిఁ బూర్వాలంకారికులు వెలివెట్టిరి. ఆనందవర్ధనుఁ డారససిద్ధాంతమును దృశ్యశ్రవ్యోభయసాధారణమని నిర్వచించి రూపకమునకువలెనే శ్రవ్యకావ్యమునకును రసమే ప్రధాన మని యుద్ఘోషించెను. మరియు నాభరతుని రససిద్ధాంతమును గొలఁదిగా నీక్రిందివిధమున సవరించెను. "రసము వాచ్యరూపముగాఁగాక వ్యంగ్యరూపముగా నుండవలయును. మరియు రసభంజకములయిన దోషములను విడనాడవలయును. (రసదోషములు ముందు దెలియును) రసవ్యంగ్యమువలెనే వస్త్వలంకారవ్యంగ్యములుగూడ గ్రాహ్యములే, పూర్వాలంకారికు లుదాహరించినట్లు రసమలంకారములోఁ (రసవదలంకారము) జేరదు. రసము కావ్యజీవితము. ఆత్మగా నుండఁదగినదాని నలంకారముగాఁ బరిగణించుట యనుచితము"

ఆనందవర్ధనునికిఁ బ్రాచీనులగు నాలంకారికు లెవ్వరును నింత లెస్సగా విచారింపరైరి. ఇన్నాళ్ళకు మరల భరతుని రససిద్ధాంతము నిర్దుష్టముగా సహేతుకముగా నానందవర్ధనునిచేఁ బునరుద్ధరింపఁబడెను. ఈసిద్ధాంతమునే అభినవగుప్త, మమ్మట, జగన్నాథాదులగు సర్వాలంకారికులును గ్రహించిరి.

## అభినవగుప్త మతము

ఆనందవర్ధనుని పిమ్మట నభినవగుప్తుఁ డను నొకయాలంకారికుఁడు సాహిత్యరంగమునకు వచ్చెను. ఆయన యానందుని ధ్వనిసిద్ధాంతము నంగీకరించి యాతని ధ్వన్యాలోకమునకు 'లోచనము' అను వ్యాఖ్యానమును వ్రాసెను. ఎల్లవిషయముల యందును నభినవగుప్తు డానందవర్ధనుని సిద్ధాంతమును సమ్మతించెను. కాని యొకవిశేషము గలదు. ఆనందవర్ధనుఁడు వస్త్వలంకారరసధ్వనులు మూఁటిని సమానముగానే పరిగణించెను. కొన్నియెడల రసధ్వనిపై నాతఁడును నూఁతము నూపెను. చూపినను వస్త్వలంకార ధ్వనులకుఁగూడఁ బ్రత్యేకత్వము నంగీకరించెను. అభినవగుప్తు డట్లుఁగాక వస్త్వలంకార ధ్వనులమీఁదకన్న రసధ్వనిమీఁదనే యధికాభిమానమును బ్రకటించెను. ఆతని వాక్యము లివి:

"రసేనైవ సర్వంజీవతికావ్యం; నహి రసశూన్యం కావ్యం కించిదస్తి। రస ఏవ వస్తుతః ఆత్మా ; వస్త్వలంకార ధ్వనీ తు సర్వథా రసంప్రతి పర్యవస్యేతే (రసముచేతనే కావ్యము జీవించును. రసశూన్యమగు కావ్యముండదు. (ఉండరాదు)

ము విధములగు ధ్వనులలో రసధ్వనియే కావ్యాత్మ. వస్త్వలంకారధ్వనులు గూడ రసపర్యవసాయులు గావలయును”

ఈ సిద్ధాంతమే విశ్వనాథునిచే “వాక్యం రసాత్మకం కావ్యం” అను కావ్య లక్షణమును లేవదీయించినది. విశ్వనాథుని మతము ముందు వివరింపఁబడును. అభినవగుప్తునివలెనే యాతఁడును రసస్పర్శలేని వస్త్వలంకార ధ్వనులు లేవనియే యభిప్రాయపడెను. ఇతని మతమునఁ గావ్యశరీరము ధ్వనికారగృహీతమగు శబ్దమే.

## మహిమభట్ట మతము

అభినవగుప్తుని పిమ్మట నీ ధ్వనిసిద్ధాంతమును మహిమభట్టను పండితుఁడు ఖండించెను. ఆతఁడు ధ్వన్యాలోకమునకు ఖండనముగా వ్యక్తివివేక మను గ్రంథమును విరచించెను. ఆతఁడు తన ప్రతిజ్ఞ నిట్లు మొదటనే చెప్పికొనెను.

శ్లో. అనుమానేఽన్తర్భావం సర్వస్యాఽపి ధ్వనేః ప్రకాశయితుం
వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య మహిమా పరాం వాచం

తా. ఎల్లవిధములగు ధ్వనులను ననుమానమునందే యంతర్భవింపఁ జేయుటకై మహిమభట్టు వాగ్దేవికి నమస్కరించి వ్యక్తివివేక గ్రంథమును రచించుచున్నాఁడు.

మహిమభట్టు తన గ్రంథమున నానందవర్ధనుని ‘వ్యంజనావృత్తి’ యక్కఱ లేదనియు, నాతని ధ్వనులన్నియు ననుమానములోనే యంతర్భవించుననియు సిద్ధాంత మొనర్చెను. అభిధా, లక్షణా, వృత్తులే తక్క వ్యంజనావృత్తి యక్కఱలేదనియుఁ దక్కల్పన మనవసరమనియు నాతని వాదము. లక్షణావృత్తి నీతఁ డనుమానము లోనే గణించెను. కావున నానందవర్ధనుఁ డిచ్చిన ధ్వన్యుదాహరణముల నన్నింటిని ననుమానములోనే యంతర్భవింపఁజేసెను. ఈ యనుమానము ధూమాగ్న్యనుమానము వంటిది గాదనియు నిది విలక్షణమనియు *దీనినిఁ గావ్యానుమితియందురనియు నిర్వ

* ధ్వన్యాలోకకర్త
“అర్థస్సహృదయః శ్లాఘ్యః కావ్యాత్మా యో వ్యవస్థితః
వాచ్యప్రతీయమానాఖ్యౌ తస్యభేదావుభౌస్మృతౌ”
అని యర్థము వాచ్యము, వ్యంగ్యమునని చెప్పఁగా మహిమభట్టు

“అర్థోఽపిద్వివిధోవాచ్యోఽనుమేయశ్చ। తత్రశబ్దవ్యాపార విషయో వాచ్యః సఏవ ముఖ్య ఉచ్యతే। తత ఏవ తదనుమితాద్వా లింగభూతా ద్యదర్థాంతరమను మీయతే సోఽనుమేయః। సచత్రివిధః। వస్తుమాత్ర మలంకారా రసాదయశ్చేతి। తత్ర ఆద్యావాచ్యావపిసంభవతః।అన్యస్త్వనుమేయ ఏవేతివక్ష్యతే

చించెను. కాని యీతఁడు కావ్యమున రస ప్రాధాన్యము నంగీకరించెను. "కావ్య స్యాత్మని సంజ్ఞిని రసాదిరూపే న కస్యచిద్విమతిః". (కావ్యమున కాత్మ రసాదిరూపము అనుటలో విప్రతిపత్తి లేదు.) అని వచించెను. కేవలము వ్యంజనావృత్తి కల్పన మనవసరమని యీతని వాదము. ఈతని మతమునఁ గావ్యశరీరము శబ్దార్థోభయమే.

కానీ యీతని వాదము నిలువలేదు. మమ్మట, విశ్వనాథ, జగన్నాథాదులగు మహాపండితు లెల్లరును నీవాదమును దుత్తునియలుగా ఖండించి యానందవర్ధనుని సిద్ధాంతమునే యనఁగాఁ బ్రత్యేకముగా వ్యంజనావృత్తి నంగీకరింపవలసియే యున్నదని నిర్ణయించిరి. జగన్నాథుని రసగంగాధరము సూక్ష్మముగా విచారింప ధ్వన్యాలోకమునకు వ్యాఖ్యానరూపమగు గ్రంథమే యనవచ్చును.

## కుంతక మతము

అభినవగుప్తుని కాలమందే కుంతకుఁ డను నొక యాలంకారికుఁ డుండెను. ఆతఁడు ధ్వనిమతమునకుఁ బ్రతికూలముగా నొక క్రొత్తసిద్ధాంతమును బ్రతిష్ఠించెను. ఆతని సిద్ధాంతము లివి:- 'వక్రోక్తిః కావ్యజీవితం' (వక్రోక్తియే కావ్యమునకు జీవితము) ఆనందవర్ధనుఁడు ధ్వని కావ్యాత్మ యనెను. ఇతఁడు వక్రోక్తియే కావ్యజీవిత మనెను. భామహుని వక్రోక్తినే యీతఁడు విశేషముగాఁ బెంచెను. భామహుఁడు స్వభావోక్తికిఁ బ్రతిద్వంద్విగా వక్రోక్తి యను నలంకారమును గ్రహించెను. వక్రోక్తి యనఁగా స్వభావవిరుద్ధమగు లోకోత్తర వైచిత్ర్యముగల యలంకా

---

(అర్థము వాచ్యము, అనుమేయమునని ద్వివిధము. శబ్దవ్యాపారవిషయము వాచ్యము. అదియే ముఖ్యార్థము. దానినుండియే లేక లింగభూతమగు దాని యనుమానమునుండియే కాని యేయర్థాంతర మనుమానింపఁబడునో యది యనుమేయము. ఆయనుమేయము వస్త్వలంకారరసములని మూఁడువిధములు. అందు వస్త్వలంకారములు వాచ్యములు గూడ నగును. రసాదులుమాత్ర మనుమేయమే) అని తెలిపెను.

ఈమతము క్రొత్తది కాదు. ధ్వన్యాలోకకర్త "అస్త్యభిసంధానావసరే వ్యంజకత్వం శబ్దానాం గమకత్వం తచ్చ లింగత్వం, అతశ్చ వ్యంగ్యప్రతీతిర్లింగిప్రతీతిరేవేతి లింగలింగిభావ ఏవ తేషాం వ్యంగ్యవ్యంజకభావో నాపరః కశ్చిత్ "అని యుద్ఘాటించి దానికి "న పునరయం పరమార్థః యత్ వ్యంజకత్వం లింగత్వమేవ। సర్వత్ర వ్యంగ్యప్రతీతిశ్చ లింగిప్రతీతిరేవేతి......తస్మాత్ లింగిప్రతీతిరేవ సర్వత్ర వ్యంగ్యప్రతీతిరితి నశక్యతే వక్తుం" అని సమాధానము చెప్పియేయున్నాఁడు. మహిమభట్టు వాదమునే మిక్కిలియుఁ బెంచి వ్యంజనావృత్తి ననుమానములోనే యంతర్భవింపఁజేసెను.

రము. కుంతకుఁడీ భామహుని వక్రోక్తినే మరికొంత సాగించి "కవివ్యాపార వక్రత"యే వక్రోక్తి యనెను. ఈకవి వ్యాపారవక్రత నాఱు దాటువిధములుగా విభాగించెను. ఆప్రకారము లివి:—

శ్లో॥ కవివ్యాపారవక్రత్వ ప్రకారా స్సంభవంతి షట్
ప్రత్యేకం బహవో భేదాస్తేషాం విచ్ఛిత్తి శోభినః
వర్ణవిన్యాసవక్రత్వం, పదపూర్వార్థవక్రతా,
వక్రతాయాః పరోఽప్యస్తి ప్రకారః ప్రత్యయాశ్రయః,
వాక్యస్య వక్రభావోఽన్యో, భిద్యతే యస్సహస్రధా
యత్రాలంకార వర్గోఽసౌ సర్వోఽప్యంతర్భవిష్యతి
వక్రభావః ప్రకరణే ప్రబంధేఽప్యస్తి యాదృశః
ఉచ్యతే సహజాహార్య సౌకుమార్య మనోహరః"

౧. వర్ణవిన్యాసవక్రతా శబ్దాలంకార విచారము)

౨. పదపూర్వార్థవక్రతా (పదపూర్వార్థమన సుబంతతిఙ్ఙంతరూపక మగు పదముయొక్క పూర్వభాగము. అదియే ప్రాతిపదికముగాని ధాతువుగాని యగును. ఇది బహుభేదములు గలిగియున్నది. రూఢివైచిత్ర్యవక్రతా, పర్యాయవక్రతా, ఉపచారవక్రతా, విశేషణవక్రతా, సంవృతివక్రతా, వృత్తివైచిత్ర్యవక్రతా, (కృత్తద్ధిత సమాసైకశేష సన్నంతవృత్తులు) భావవైచిత్ర్యవక్రతా, లింగవైచిత్ర్యవక్రతా, కర్త్రంతరవిచిత్రతా, క్రియావైచిత్ర్యవక్రతా, కాలవైచిత్ర్యవక్రతా, కారకవైచిత్ర్యవక్రతా, సంఖ్యావైచిత్ర్యవక్రతా, పురుషవైచిత్ర్యవక్రతా, ఉపగ్రహవైచిత్ర్య వక్రతా; అనునవి దీని భేదములు. (వీని వివరణమును వక్రోక్తిజీవితమునందే చూడవలెను. ఇందుపచారవక్రతలో సమస్త ధ్వనిభేదములును గ్రహింపఁబడినవి. (ఉపచారవక్రతాదిభిస్సమస్తో ధ్వనిప్రపంచః స్వీకృతః)

౩. ప్రత్యయవక్రతా (కృత్తద్ధితప్రత్యయసంయోగముచేఁ గలిగినచారుత్వము)

౪. వాక్యవక్రతా (అర్థాలంకార విచారము)

౫. ప్రకరణవక్రతా (రసాననుకూలముగా నున్న కథావస్తువును రసోచితముగా మార్చుట (శాకుంతలమున దుర్వాసుని ప్రవేశాదులు)

౬. ప్రబంధవక్రతా (ఒకరసములో నున్న కథాభాగమును మరొక రసప్రధానముగా మార్చుట (శాంతరసప్రధానమగు భారతకథను వీరరసప్రధానమగు నాటకముగా మార్చఁబడినది.— వేణీసంహారము)

కానీ యీమతముగూడ నిలువలేదు. ఈమతముగూడ నలంకారశాఖయే. మహిమభట్టు కావ్యానుమితిసిద్ధాంతమును, కుంతకుని వక్రోక్తిసిద్ధాంతమును, వారి తరువాత నాసిద్ధాంతములను బోషించువారులేమి నశించి నామమాత్రముగా నిలిచి పోయినవి. కుంతకుని మతమున శబ్దార్థోభయమే కావ్యశరీరము.

## క్షేమేంద్రమతము

కుంతకుని యనంతరమున క్షేమేంద్రుఁ డను నొకపండితుఁ డొక నూతనసిద్ధాంతమును లేవఁదీసెను. అది యిది

ఔచిత్యస్య చమత్కారకారిణశ్చారుచర్వణే
రసజీవిత భూతస్యవిచారం కురుతేఽధునా
కావ్యస్యాఽలమలంకారైః కిం మిథ్యాగుణితైర్గుణైః
యస్యజీవితమౌచిత్యం విచింత్యాఽపి న దృశ్యతే
అలంకారాస్త్వలంకారా గుణాఏవ గుణాస్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరంకావ్యస్యజీవితం

(రసమునకు జీవితభూతమును, జమత్కారకారియు నగు నౌచిత్యమును గూర్చి విచారణ సేయుదును. కావ్యమునకు జీవితభూతమైన యౌచిత్యము లేకున్నచో నలంకారములేల? గుణములేల? అలంకారము లలంకారములే. అనఁగా బాహ్య శోభాహేతువులు. కాని జీవితముగాదు. అట్లే గుణములును శ్రుత తపస్సత్యశీలాదుల వలెనే గుణములే. అనఁగా నవియు జీవితముగావు. కాన రసవంతమగు కావ్యమునకు జీవితభూత మౌచిత్యమే.)

మరియు నుచితస్థానమున నుంచినపుడే యలంకారము లలంకారములగును. ఔచిత్యము వీడనపుడే గుణములు గుణములగును. దేని కేది తగునో యది యుచితము. ఉచితముయొక్క భావమే యౌచిత్యము. ఈ యౌచిత్యము పదమున, వాక్యమునఁ, బ్రబంధమున, గుణమున, అలంకారమున, రసమునఁ, గ్రియయందుఁ, గారకమున, లింగమున, వచనమున, విశేషణమున, ఉపసర్గమున, నిపాతమునఁ, గాలమున, దేశమునఁ, గులమున, వ్రతమునఁ, దత్త్వమున, సత్త్వమున, అభిప్రాయమున, స్వభావమున, సారసంగ్రహమునఁ, బ్రతిభయందు, అవస్థయందు, విచారమున, నామమున, ఆశీస్సున నుండునని సిద్ధాంతించెను. అతఁడు వీని కన్నింటికిని నుదాహరణములను గూడఁ జూపెను.

ఆంగ్ల సాహిత్యమునఁ గూడ నీ యౌచిత్య చర్చ గలదు. ఔచిత్యమున కాంగ్లమున Decorum అందురు. అది పదములు, వృత్తములు మొదలగువానిలో నుండునని క్షేమేంద్రునివలెనే తదాలంకారికులును వచించిరి.

ఈతఁడు ధ్వనికారుని

అనౌచిత్యా దృతేనాన్య ద్రసభంగస్య కారణం ।
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా ।

అనౌచిత్యముకన్న రసభంగమునకుఁ గారణము లేదు. చక్కని యౌచిత్యము గల కావ్యము రసోపనిషత్తే. అనుకారికార్థమును గ్రహించి దానినిఁ బెంచి యీ సిద్ధాంతమును బ్రతిష్ఠించెను.

ధ్వనికారుఁడు గూడ నీ "అనౌచిత్యాదృతే" అను నభిప్రాయమును దండి యొద్దనుండి గ్రహించినట్లున్నది. దండి

"కామం సర్వోఽప్యలంకారో రసమర్థే నిషించతి ।
తథాప్య గ్రామ్యతైవైనం భారం వహతిభూయసా ।

సర్వవిధములగు ననఁగా శబ్దగత, అర్థగత, ఉభయగత, అలంకారములును రసస్ఫోరకము లగును. అందు సందేహము లేదు. అయినను నగ్రామ్యత్వమే యనఁగా ననౌచిత్యరాహిత్యమే (ఔచిత్యవత్త్వము) యీ భారమునంతను వహించుచున్నది. అని నుడివెను. అనౌచిత్య రాహిత్యమే రసస్ఫోరక మనుటచే ననౌచిత్య సత్త్వము రసభంజక మని తేలుచున్నది.

ధ్వనికారుఁడు కావ్యాత్మ ధ్వని యనఁగా నీతఁ డౌచిత్యమని నిర్వచించెను. ఈతఁడు ధ్వని మతమును ఖండింపనులేదు. పోషింపనులేదు. కాని ధ్వనిమతమునకిది విరుద్ధముమాత్రము కాదు.

భరత, భామహ, దండి, వామన, ఆనందవర్ధన అభినవగుప్త, మహిమభట్ట, కుంతక, క్షేమేంద్రు లలంకారశాస్త్రమున స్వతంత్ర సిద్ధాంతములను స్థాపించిరి. ఆనందవర్ధనునితోడనే కావ్యమార్గము నిర్ణీతమైనది. దీనినే యీ మద్భేదములో నభినవగుప్తుఁ డంగీకరించెను. మహిమభట్టాదుల సిద్ధాంతము లెవ్వియును నిలువలేదు. మమ్మట, విశ్వనాథ, జగన్నాథ, విద్యాధర, విద్యానాథాదు లీ యానందవర్ధనుని సిద్ధాంతమునే పోషించిరి. కాని రుద్రటాదులగు కొంద అలంకారమార్గమునే పట్టుకొని వ్రేలాడుచు గ్రంథములను వ్రాయుచువచ్చిరి. కాని వీనికి మమ్మట, విశ్వనాథ, జగన్నాథాదుల గ్రంథములకుఁ గల ప్రశస్తి లేదు. కావున నానందవర్ధనుని ధ్వని సిద్ధాంతమే సర్వ శేషమగు సిద్ధాంతము.

ఇన్నివిధములగు సిద్ధాంతము లేల బయలుదేరినవని ప్రశ్న వచ్చుచున్నది. వీరికందఱకును గావ్యము నాస్వాదించునపుడు రుచిభేదము గోచరించినదా? అన్నచోఁ గాదు. కావ్యాస్వాదమున భేదములేదు. ఎల్లరకును జక్కెర మధురముగా నుండున ట్లెల్లరకును గావ్యాస్వాదమున మతభేదము లేదు. కాని తామనుభవించిన యాస్వాదమును వాక్కులతోఁ బ్రకటింపవలసినపుడు మతభేదములు బయలుదేరినవి. ఒకరు తమకుఁ గలిగిన కావ్యరుచి యలంకారములవలన ననిరి. మఱొకరు గుణములవలన ననిరి. వేఱొకరు రీతివలన ననిరి. ఇంకొకరు ధ్వనివలన ననిరి. ఇట్లే కుంతకాదులును వచించిరి. ఈ కారణమువలననే మతభేదములు వెలువడినవి.

ఈ క్రింది కావ్యలక్షణములను దెలిసికొనుటకు ముందీ తెలిపిన విషయమును తెస్సగాఁ దెలిసికొనవలసి యున్నది. ఇటఁ గావ్యలక్షణ మనఁ గావ్యశరీరలక్షణ మనియుఁ గావ్యాత్మనుగుఱించిన విచారముగాదనియు గ్రహింపవలెను. కావ్యాత్మను గుఱించిన విచారము ముందు చేయఁబడియున్నది.

౧. ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం (దండి).

౨. తదదోషౌ సగుణావనలంకృతీ పునఃక్వాఽపి (మమ్మటుఁడు).

3. వాక్యం రసాత్మకం కావ్యం (విశ్వనాథుఁడు).

౪. రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం (జగన్నాథుఁడు).

కావ్యలక్షణములు *పెక్కులు గలవు. అందు సుప్రసిద్ధములయిన నాలుగు లక్షణములనుమాత్ర మిచ్చటఁ జూపుచున్నాను. ఇందు మొదటిలక్షణమున కర్థమిది.

---

*"శబ్దార్థౌ సహితౌ కావ్యం" అని భామహుఁడు. "గుణాలంకారయుక్తార్థౌ కావ్య"మని వామన మతము. "అదోషౌసగుణౌ వనలంకృతీ పునః క్వాఽపి" అని మమ్మటమతము. ప్రభాకరమతముగూడ నిదియే. "నిర్దోషం గుణాలంకార రసవత్ వాక్యం కావ్యం" అని భోజమతము. "గుణాలంకార రీతి రసోపేతః సాధుశబ్దార్థ సందర్భః కావ్య"మని వాగ్భటమతము. "నిర్దోషం గుణాలంకార రీతివృత్తిమత్ వాక్యంకావ్యం" అని పీయూషవర్ష మతము. "రసాదిమద్వాక్యం కావ్యం" అని శౌద్ధోదనిమతము. "వాక్యం రసాత్మకం కావ్యం" అని విశ్వనాథమతము. "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం" అని దండిమతము. "రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యం" అని జగన్నాథమతము. "రసాలంకారయుక్తం సుఖవిశేషసాధనం వా కావ్యం" అని కేశవమిశ్ర మతము. (వీనిని వామనాచార్య ఝల్కర్ పండితుఁడు కావ్యపరికాశ పరిస్తావనలో జూపెను)

౧. "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం." అనఁగా మనోహరమగు నర్థముతో నలంకృతమైన పదసముదాయము 'కావ్యము' అని యర్థము. ఈ కావ్య శరీరమునకు శోభాహేతువులు గుణములనియు,

"తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన ।
స్యాద్వపుస్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగం"

(కావ్యమున నల్పమగు దోషమునుగూడ నుపేక్షింపరాదు. శరీర మెంత యందముగానున్నను నొక్కచో బొల్లి (శ్వేతకుష్ఠము) యున్నచో నెంతో యసహ్యముగాఁ గనఁబడును) అని యల్పదోషము గూడఁ గావ్యమున నుండరాదనియును వచించెను. విశ్వనాథ, జగన్నాథాదులయొక్క లక్షణములనుబట్టి రసాపకర్షకములు గాని దోషములు దోషములు గావనియు సర్వథా దోషస్పర్శలేని కావ్య ముండదనియు మనము తెలిసికొనఁగలము. కావున దండి కావ్యదోషములఁగూర్చి చేసిన సిద్ధాంతము దారుణతునక తప్పదు.

౨. తదదోషౌ సగుణావనలంకృతీ పునః క్వాఽపి:—దోష రహితములును, గుణసహితములును, అలంకారయుక్తములు నగు శబ్దార్థయుగళము కావ్యశరీరము. 'అనలంకృతీ పునః క్వాఽపి' అనుదానికి వ్యాఖ్యాత "యత్సర్వత్ర సాలంకారౌ క్వచిత్తు స్ఫుటాలంకార విరహేఽపి నకావ్యత్వహానిః" (ఎల్లెడలను శబ్దార్థములు సాలంకారములుగానే యుండవలెను. ఒకానొకచో నలంకారములు స్ఫుటముగా లేకున్నను గావ్యము గాకపోదు.) అని వ్యాఖ్యానించెను. ఈ కావ్యశరీరమునకు ధ్వని లేక వ్యంగ్యమే యాత్మ. వ్యంగ్య ప్రాధాన్యమునుబట్టి కావ్య ముత్తమమనియు, వ్యంగ్యా ప్రాధాన్యమునుబట్టి మధ్యమమనియు, నవ్యంగ్యమగునది యధమమనియుఁ దెలిపెను. ఈతఁ డానందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమును బోషించినవాఁడే. ఈ కావ్య లక్షణమునే ప్రతాపరుద్రీయకారుఁడును స్వీకరించెను. ప్రతాపరుద్రీయమునవలె సర్వథా 'నకలు' గానున్న నరసభూపాలీయమునందును నీలక్షణమే స్వీకరింపఁబడినది.

3. 'వాక్యం రసాత్మకం కావ్యం' అనఁగా రసస్వరూపము గల వాక్యము (మహావాక్యము లేక వాక్యసమూహము) కావ్యము.' అని యర్థము. విశ్వనాథుఁడీ లక్షణమును వచించి మమ్మటలక్షణము నీవిధముగా విమర్శించెను. "లక్షణవాక్యమున 'అదోషౌ' అని యుండరాదు. ఏలన దోషరహితములగు శబ్దార్థములు కావ్యమన్నచో లోకములో నే కావ్యముగూడ యత్కించిద్దోషస్పర్శలేకయుండనే యుండదు. చూడుఁడు.

శ్లో. న్యక్కారో౽హ్యయమేవ మే యదరయ స్తత్రా౽ప్యసౌ తాపస
సో౽ప్యత్రైవ నిహంతి రాక్షసకులం జీవత్యహో రావణః
ధిక్ ధిక్ శక్రజితం; ప్రబోధితవతా కిం కుంభకర్ణేన వా
స్వర్గగ్రామటికా విలుంఠన భుజోచ్ఛూనైః కిమేభిర్భుజైః.

ఇవి రావణుని పలుకులు :— నాకు శత్రువులు గలరని చెప్పుటయే పెద్ద యవమానము. అందును నా శత్రువు తాపసుఁడఁట; అతఁడును మా రాక్షసకులము నిచ్చటనే యనఁగా నాయెదుటనే త్రుంచునఁట; అక్కటా! రావణుఁ డింకను బ్రదికియేయున్నాఁడు. చావలేదే? ఇదియే సంభవించినచో నింద్రజిత్పరాక్రమ మేల? నిద్రమేల్కొన్న కుంభకర్ణుని ప్రతాపము కాల్పనే? స్వర్గ మను పల్లెను గొల్లఁబెట్టి వృథగా బలిసిన నా బాహువులేల?

ఈ శ్లోకమున 'అవిమృష్ట విధేయాంశ' మను దోషము రెండుతావులందుఁగలదు. అవిమృష్టవిధేయాంశమన న్యాయముగా ననువాద్యాంశము (కర్తృభూతము) ముందు చెప్పి విధేయాంశమును (క్రియాభూతము విధేయ విశేషణము) బిమ్మటఁ జెప్పవలసి యుండఁగా నట్లు చెప్పక విధేయాంశమును ముందు జెప్పి యనువాద్యాంశమును బిమ్మటఁజెప్పుట. "అనువాద్యమనుక్త్వైవ నవిధేయముదీరయేత్" (అనువాదమును జెప్పక విధేయమును జెప్పరాదు) అని న్యాయము. "అవిమృష్టః ప్రాధాన్యేన అనిర్దిష్టః విధేయాంశః" అనఁగా విధేయవిశేషణము వాక్యమునఁ బ్రాధాన్యము వహింపవలసియుండఁగా దాని నట్లు వ్యవహరింపకుండుట. ఎట్లన "వాఁడు పండితుఁడు" అను వాక్యములో 'పండితుఁడు' అను పదము విధేయవిశేషణము. వాక్యమున దానికిఁ బ్రాధాన్యముండును. 'పండితుఁడు వాఁడు' అన్నచో నవిమృష్టవిధేయాంశదోష మగును. అట్లే 'నక్కారోహ్యయమేవ' అనుచోట నీదోషముగలదు. "అయమేవన్యక్కారః" (ఇదియే యవమానము) అనుచోట 'అయమేవ' అనునది యనువాద్యాంశము. 'నక్కారః' అనునది విధేయాంశము. శ్లోకమున న్యక్కార పదము మొదటఁ బ్రయోగింపఁబడినది. కాన నవిమృష్ట విధేయాంశదోష దూషిత మైన దీ శ్లోకము. మరియు "వృథోచ్ఛూనైః" అనుచోటఁగూడ నీదోషమే కలదు. 'ఉచ్ఛూనత' వ్యర్థమని యర్థము. ఇట ననువాద్యాంశమైన యుచ్ఛూనతయు, విధేయాంశమైన వైయర్థ్యమును, శ్లోకమున మొదటి పాదమునందువలెనే వెనుకముందులఁ బడినవి. మొదటిది వాక్యదోషము. రెండవది పదదోషము. "వృథా న్యార్థభంగముఁ గావించెదు వారలెవ్వరో యెఱుంగ౽శక్యమే యేరికిన్" అనుచోఁగూడ నీదోషమే కలదు. ఈ శ్లోకము దోషదూషితమైనది. కావునఁ గావ్యము కాకపోవలసిచ్చెను.

ఈ శ్లోకము ధ్వని ప్రాధాన్యమునుబట్టి యుత్తమ కావ్యముగా ధ్వనికారుఁ డంగీకరించెను. ఇందలి ధ్వనియిది :—'మే యదరయః' అనునెడ 'అరయః' అను బహువచనమువలన "నాకు నొక శత్రు వున్నాఁడనుటయే యవమానము. పెక్కండ్రు గూడ నున్నారన్నచో నా యవమానమునకు మేర యుండునా?" అను నర్థము వ్యజ్యమాన మగుచున్నది. 'తాపస' పదమువలన "ఆ శత్రువు పౌరుష కథాహీనుఁడైన తపస్వి"యన్నచో "నా యవమాన మింతింతని నొడువరాదు" అను నర్థము వ్యక్తమగును. 'తత్రాఽపి' యందలి 'అపి' శబ్దముచే 'మిక్కిలి యసంభవ'మను నర్థము వ్యక్తమగును. 'అత్రైవ' అనుచో 'ఏవ' శబ్దమువలన "ఇచ్చటనే నా కన్నుల యెదుటనే" అను నర్థము వ్యక్తమగును. 'రాక్షసకులం' అను పదమువలన ఒక్క గాక్షసునిఁగాదు 'సర్వకులమును నిర్మూలించును' అను నర్థము వ్యక్తమగును 'నిహంతి' పదమువలన "వచ్చి జయించుటగాదు; నిశ్శేషముగా వధించును" అను నర్థము వ్యక్తమగును. "జీవత్యహో రావణః"అనుచో 'రావణ' పదమువలన "విశ్వవిజయము సేసినవాఁ"డను నర్థాంతర సంక్రమితవాచ్యధ్వని వ్యక్తమగును.'ధిక్ ధిక్' అను నిపాతనము లింద్రుని జయించిన యింద్రజిత్తుయొక్క పరాక్రమమును గూర్చి నిందను వ్యక్తముసేయును. "స్వర్గగ్రామటికా" పదము నందలి 'క' వర్ణముచే స్వర్గము నందలి నిర్లక్ష్యభావము వ్యక్తమగును. 'భుజైః' అను బహువచనముచే 'నిరువది చేతులును భారమాత్రమే' యని వ్యక్తమగును. ఈవిధముగా సాధారణముగా నిందలి పదము లన్నియు రావణుని యవమానమును వ్యక్తీకరించుచున్నవి. అనఁగా వాచ్యముగాఁగాక వ్యంగ్యముగాఁ దోఁపఁజేయుచున్నవి. కాన నీశ్లోకముత్తమ కావ్యము. కావున 'అదోషౌ'పదమువలనఁ గావ్యలక్షణమవ్యాప్తిదోషజుష్టమైనది.

(అవ్యాప్తియనఁగా లక్షణము గొన్నిచోట్లఁ బట్టకుండుట; అతివ్యాప్తియనగాఁ బట్టరానిచోట్ల లక్షణము పట్టుట. అసంభవమనఁగా బొత్తుగా నాలక్షణము దేని యందును బట్టకుండుట. లక్షణమవ్యాప్త్యతి వ్యాప్త్యసంభవాదిదోషవర్జితమైయుండ వలయును) మరియు రసాపకర్షకాదోషాః (రసమును దగ్గించునవి దోషములు) అనుటచే రసమును దగ్గింపకున్నచో దోషములు కాఁజాలవు. "న్యక్కారోఽహ్యాయమేవ" అను శ్లోకమందలి యవిమృష్టవిధేయాంశదోషము లందలి రసమును దగ్గించుట లేదు. కావున నీదోషము దోషమేగాదు. దోషరహితములగు శబ్దార్థములే కావ్యమని చెప్పినచో ధ్వనిప్రాధాన్యమునుబట్టి యుత్తమకావ్యము కాఁదగిన కావ్యము కావ్యమే కాకపోవును. కావున "అదోషౌ" పదము కావ్యలక్షణమున నుండరాదు. మరియు 'సగుణౌ' అనుపదముగూడ వ్యర్థమే. ఏలనఁ గావ్యమునకు రస మాత్మభూతమని చెప్పఁబడియున్నది. గుణములు లేకున్న రస ముండదు. రస మున్నచో

గుణము లుండును. గుణములు రసధర్మములు. అట్టిచో గుణములకును రసమునకును నవినాభావసంబంధము గలదు. కావున 'సగుణౌ' పదము కావ్యలక్షణమున ననవశ్యము. మరియు 'సాలంకారౌ' పదమును వ్యర్థమే. అలంకారములు లేకున్నను గావ్యము రసవంతముగా నుండవచ్చును. గుణములు రసధర్మములయిన ట్లలంకారములు రసధర్మములు గావు. కావున నలంకారములు గావ్యమునకు ముఖ్యాంగములు గావు. అద్దాన 'సాలంకారౌ' పదముగూడ వ్యర్థమే.

ఇట్లు మమ్మటుని కావ్యలక్షణమును ఖండించి విశ్వనాథుఁడు "వాక్యం రసాత్మకం కావ్యం" అను లక్షణమును వచించెను. రసస్వరూపముగల వాక్యము (మహావాక్యము) కావ్యమని దీనియర్థము. అభినవగుప్తుని సిద్ధాంతమే విశ్వనాథునిఁ బ్రేరేఁపించి యీలక్షణమును జెప్పించినది. అభినవగుప్తుఁడు దనలోచనమున "రసేనైవ సర్వం జీవతి కావ్యం; నహి రసశూన్యం కావ్యం కించిదస్తి; రసఏవవస్తుతః ఆత్మా; వస్త్వలంకారధ్వనీతు సర్వథా రసం ప్రతిపర్యవస్యేతే" (రసముచేతనే కావ్యము జీవించును. రసశూన్యముగు కావ్యముండదు. ముప్విధములగు ధ్వనులలో రసధ్వనియే కావ్యాత్మ. వస్త్వలంకారధ్వనులు గూడ రసపర్యవసాయులు గావలయును) అని నిర్వచించెను. ఈ రసధ్వనియే కావ్యాత్మ యను అభినవగుప్తుని సిద్ధాంతమును సర్వథా విశ్వనాథుని "వాక్యం రసాత్మకం కావ్యం" అను సిద్ధాంతమును బోలి యున్నది. పోలియుంటయేకాదు- అదియే యిదియని నిరాటంకముగా జెప్పవచ్చును. దీనినిఁ జూడుఁడు.

శ్లో॥ శ్వశ్రూరత్ర నిమజ్జతి అత్రాహం దివసకం ప్రలోకయ।
మా పథిక! రాత్ర్యంధ! శయ్యాయామావయోః ర్మాంక్షీః॥

గీ. ఇచటమాయత్తపండు; నేనిటఁ బరుండుఁ, బగటనే లెస్స కని గుర్తుపట్టుకొనుము
రేయి-చీఁకటిగానక రేయాయపాంథ! పడకుమా! మాదు మంచాలపైనిఁ దప్పి.

ఇట "మా యత్తప్రక్కలోఁ బడకుము. నా ప్రక్కలోఁ బడుము." అను వస్తువ్యంగ్యము గలదు. విశ్వనాథుఁడు వస్త్వలంకార ధ్వనులకుఁ బ్రత్యేకత్వము నంగీకరింపనివాఁడగుట నిట్టి వస్తువ్యంగ్యము గల పద్యములందును రసాభాసాదిమూలముననే కావ్యత్వమును స్థాపించెను. (ఉపనాయకరతి రసాభాసమని ముందు దెలియును.) అనఁగా నా వాక్యమున వస్తువ్యంగ్యముంటచే నుత్తమకావ్యము గాదు. మఱి రసాభాసముంటచేతనే యుత్తమకావ్యమైనది." అని సిద్ధాంతించెను. కావున నభినవగుప్తునివలెనే యీతఁడును వస్త్వలంకారధ్వనులను రసపర్యవసాయులుగానే యుండవలెనని విశ్వసించెను. రసాభాసము రసమగునా? యని శంకించుకొని

"రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః" అను రసశబ్ద వ్యుత్పత్తినిఁబట్టి భావము, భావాభాసము, రసము, రసాభాసము, మొదలయినవన్నియు రసశబ్ద వాచ్యములే యని వచించెను. పిమ్మటఁ దన "వాక్యం రసాత్మకం కావ్యం" అను సిద్ధాంతమును సమర్థించుటకై కొన్ని గ్రంథములనుండి కావ్యలక్షణములను జూపెను. అవి యివి:—

"వాగ్వైదగ్ధ్యప్రధానేఽపి రస ఏవాత్ర జీవితం" (అగ్నిపురాణము.)

ఎంత వాక్చమత్కారమున్నను (అలంకార చమత్కారమున్నను) గావ్యమునకు రసమే జీవితము.)

"కావ్యస్యాత్మని సంగిని రసాదిరూపే న కస్యచిద్విమతిః" (మహిమభట్టు)

రసాదులే కావ్యమున కాత్మయనుటలో నెవరికిని భిన్నాభిప్రాయములేదు.

"నహి, కవేరితివృత్తమాత్ర నిర్వాహేణ ఆత్మపదలాభః ఇతిహాసాదేవ తత్సిద్ధేః" (ధ్వన్యాలోకము)

కేవల మితివృత్తమును నిర్వహించినమాత్రమునఁ గవి కానేరఁడు. ఆ పని నితిహాసాదులే చేయుచున్నవి. కావ్యమున రసనిర్వాహముచేతనే కవియగును.

ఇట్లు స్వసిద్ధాంతానుకూలములయిన యితర విద్వాంసుల సిద్ధాంతముల నుదాహరించి 'వాక్యం రసాత్మకం కావ్యం' అనుటచేఁ బ్రబంధములోని కొన్ని నీరస పద్యములకుఁ గావ్యత్వము లేకపోవలసివచ్చును. అట్టియెడ రసవత్పద్యములనుబట్టి కావ్యత్వమును, నీరసపద్యములనుబట్టి యకావ్యత్వమును నొక కావ్యమందే సంభవించి యది కావ్యముగాని యకావ్యముగాని కాకపోవలసివచ్చునని యాశంకించుకొని రసవత్పద్యములలో నున్న కొన్ని నీరసపదములకును బద్యరసముచే రసవత్త్వము గలుగువిధమునఁ బ్రబంధరసముచే నీరసపద్యములకును రసవత్త్వము కలుగునని సమాధానించెను. ఇట్లు విషయవిచారణచేసి 'వాక్యం రసాత్మకం కావ్యం' అను సిద్ధాంతమును ధ్రువపఱచెను.

౮. "రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యం" అనగాఁ రమణీయమగు నర్థమును దెలుపు శబ్దము కావ్యము అని యర్థము. రమణీయార్థ మనఁగా నేయర్థమును దిరిగి తిరిగి భావించుటచే లోకోత్తరాహ్లాదము గలుగునో యది రమణీయార్థము. ఆలోకోత్తరాహ్లాదమునకే చమత్కారమనియు నామాంతరము. కావున రమణీయార్థ మనఁగాఁ జమత్కారము గలిగించు నర్థమని సారాంశము. "నీకుఁ బుత్త్రుఁ డుదయించినాఁడు" అను వాక్యములోఁ జమత్కారము గానరాదు.

చమత్కారము లేకున్నచో నది కావ్యమే కాఁజాలదు. ఎట్లన,

కిం కవే స్తేన కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూనయతి యచ్ఛిరః.

తా. పరహృదయమున నెయ్యది లగ్నమై తలను గంపింపఁజేయదో కవియొక్కయా కావ్య మేల? ఆ ధానుష్కుని బాణమేల? అన్నారు పెద్దలు. కానఁ గావ్యమునఁ జమత్కారమున్ననే పరుఁడు తల నాడించును.

కనుక "చమత్కారవత్త్వంకావ్యత్వం" అనఁగాఁ జమత్కారము గలిగియుంటయే కావ్యమని నిష్కృష్టార్థము. ఈచమత్కార మెట్లుగలుగు నన్న వస్త్వలంకార రసాది ధ్వనులవలన నేర్పడునని యభిప్రాయము.

ఇట్లు తనలక్షణమును నిర్వచించి పిమ్మట మమ్మట విశ్వనాథుల లక్షణములను ఖండించెను. మమ్మట లక్షణఖండన మిది:-

"మమ్మటుఁడు శబ్దార్థములు రెండును గావ్యశరీరమని నిర్వచించెను. ఇట్లనరాదు. లోకమునఁ గావ్యము పఠింపఁబడినది. కావ్యమువలన నర్థము తెలియుచున్నది. కావ్యము వింటిమి. కాని యర్థముగాలేదు. అని వ్యవహారము గలదు. దీనినిఁబట్టి కావ్యశరీరమనఁగా శబ్దవిశేషమేకాని శబ్దార్థయుగళము గాదు. మరియు శబ్దార్థములు రెండును గలిసి కావ్యశరీర మనుటలో లోకవ్యవహారము గాని శాస్త్రప్రమాణముగాని లేదు. కావున నీ మత ముపాదేయము గాదు. మరియు "అదోషౌ" అను విశేషణమును వ్యర్థమే లోకములో "నీకావ్యము దుష్టము" అను వ్యవహారము గలదు. దుష్టమనఁగా దోషయుక్తమని యర్థము. ఈ కావ్యము దుష్టమన దోషసహితమని తేలినది. ఈవ్యవహారమునుబట్టి దోషయున్నను గావ్యత్వమునకు హానిరాదు. సర్వథా దోషస్పర్శలేని కావ్య ముండదు. "సగుణౌ సాలంకారౌ" పదములును వ్యర్థములే. ఏలన "ఉదితం మండలం విధోః" అనువాక్యము గలదు. ప్రకరణాదివశమున నీవాక్యమున ననేక వ్యంగ్యార్థములు గోచరించుచున్నవి. ఈ కావ్యమున నెట్టి గుణాలంకారములును లేవుగదా! కావున గుణాలంకారములు లేకున్నను గావ్యత్వమునకు లోపమురాదు. లోకములో శూరత్వ, వీరత్వాదు లాత్మ ధర్మములు కాని శరీరధర్మములుగావు. అట్లే కావ్యమున గుణములుగూడఁ గావ్యాత్మ యగు రసముయొక్క ధర్మము లగును. ఇఁక హారాద్యలంకారములు శరీరమునలంకరించున ట్లుపమాద్యలంకారములు కావ్యశరీరము నలంకరించును. శరీరమన నేమి? అని యడిగినపు డాత్మవిశిష్టము శరీరమని లక్షణమును జెప్పవలెను. కానీ శూరత్వాది గుణములకును, హారాద్యలంకారములకును లక్షణమునఁ బ్రవేశముండదు గదా! అట్లే కావ్యలక్షణమున గుణములకును నలంకారములకును బ్రవేశముండరాదు.

"రమణీయార్థప్రతిపాదకశబ్దము కావ్య"మను లక్షణమున శబ్దము కావ్యశరీరము. రమణీయార్థము కావ్యాత్మయగును. ఆత్మవిశిష్టమగునదియే శరీరమైనట్లు రమణీయార్థ విశిష్టమగు శబ్దమే కావ్యశరీరమని సారాంశము. మరియు 'రమణీయ' పదముచేతనే నిర్దోషత్వ, సగుణత్వ, సాలంకారత్వములు గూడ భాసిల్లును. కావున నెల్లవిధముల మమ్మట లక్షణ మయుక్తము.

పిమ్మట విశ్వనాథ లక్షణమును నిట్లు ఖండించెను. "రసాత్మకమైనవాక్యమే కావ్య మన్నచో వస్త్వలంకార వ్యంగ్యప్రధానము లగు కావ్యములకుఁ గావ్యత్వము లేకపోవలసి వచ్చును. అట్టివి కావ్యములే కావనుట చెల్లదు. ప్రాచీనులగు మహాకవులు జలపాత, వేగ, భ్రమణ, కపి, బాలాది విలాసములను (రసస్పర్శలేని కేవల వస్త్వలంకార ప్రధానములగు కావ్యములను) రచించిరి. వానికిఁ గావ్యత్వమును దొలఁగించుట భావ్యముగాదు. అట్టి తావులలోఁ గూడ రసస్పర్శ గలదని చెప్పితిమేని "గౌశ్చలతి" (గోవు కదలుచున్నది) అను వాక్యమునఁగూడ నేదోవిధముగా రసమున్నదని చెప్పవచ్చును. ఇది యుక్తముగాదు. కావున జగన్నాథుని లక్షణ మయుక్తము."

మమ్మట, విశ్వనాథ, జగన్నాథులు మువ్వురును ధ్వనిసిద్ధాంతానుకూలవాదులే. మువ్వురును గావ్యాత్మ ధ్వనియే యని చెప్పుదురు. గావ్యశరీర నిర్వచనమున మాత్రమే భేదించిరి.

జగన్నాథ లక్షణమగు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" అనునది దండి లక్షణమగు "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం" అనుదానికి రూపాంతరమే. ఇష్టార్థ మన రమణీయార్థమే. వ్యవచ్ఛిన్న మన భూషిత మని యర్థము. మనోహరార్థముతో భూషితమైన పద సంఘాతము కావ్యమని దండి యర్థము. రమణీయార్థమును దెలుపు శబ్దము (శబ్దసంఘాతము) కావ్యమని జగన్నాథుని యాశయము. కావున నిరువురి లక్షణమును సమానమే.*

---

*కావ్యాదర్శమునకు వ్యాఖ్యాత యగు తరుణవాచస్పతి "ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ" అనఁగా వివక్షితార్థ వ్యవచ్ఛిన్నః శబ్ద సందర్భః (చెప్పఁదలఁచిన యర్థముతో నలంకృతమగు శబ్దము) అని యర్థమును వ్రాసెను. మరియు హృదయంగమ మను వ్యాఖ్యానమున "వివక్షితార్థస్య అన్యూనానతిరేకతాస్వరూపేణ ప్రతిపాదన సమర్థా పదావళీ" చెప్పఁదలఁచిన యర్థమును హెచ్చుతచ్చులులేనివిధమునఁ జెప్పఁజాలు పదసముదాయము అను నర్థము వ్రాయఁబడి యున్నది. ఈ యర్థమునుబట్టి చూచినచో దండి లక్షణమును జగన్నాథుని లక్షణమును సమానార్థకములు గావు.

ప్రాయికముగాఁ బూర్వాలంకారికు లెల్లరును శబ్దార్థయుగళమే కావ్యశరీర మని సిద్ధాంతించిరి. దండి జగన్నాథులు మాత్రమే శబ్దవిశేషము కావ్యశరీరమని నిర్వచించిరి. ఈ మతమే యుత్తమోత్తమ మైనది. ఈ లక్షణమే ధ్వన్యాలోకకర్తకును సమ్మతమనియు నాతఁడు సూటిగాఁ గావ్యలక్షణమును జెప్పకున్నను వ్యతిరేకముఖ మునఁ జెప్పినట్లతని ధ్వన్యాలోకపంక్తిని వెనుకఁజూపి దానికిని జగన్నాథలక్షణము నకును సమన్వయమును గుదిరించి చూపియుంటిమి. మరల నా విషయము నిటఁ జెప్పుట చర్వితచర్వణమగును.

ఇఁక నిట నాంగ్లకావ్యలక్షణములఁ జూపుదును. D.T. Tatacharya M.O-L. తమ Definition of Poetry అను వ్యాసమున నుదాహరించిన పంక్తులనే యిచ్చటఁ జూపుదును.

1. The expression of the imagination
   తన భావనను (ప్రతిభను) వాగ్రూపముగాఁ బ్రకటించుటయే కవిత్వము
2. The language of the imagination
   తన భావనను (ప్రతిభను) బ్రకటించు భాషయే కవిత్వము
3. The art of employing words in such a manner as to produce an illusion on the imagination.
   ప్రతిభకు నొక మిథ్యారూపమును గల్పించు విధమునఁ బదములను గూర్చు కళ కవిత్వము
4. The rhythmic creation of beauty.
   సౌందర్యమును గణబద్ధముగా సృజించుటయే కవిత్వము
5. The most delightful and perfect form of utterance that human words can reach.
   మానవవాక్కుల కందఁదగినంత యానందకర మైనట్టియు రసస్ఫోరక మైనట్టియు నిర్దుష్టమైనట్టియు రచనారూపము కవిత్వము
6. The art of uniting pleasure with truth by calling imagination to the help of reason.

---

నేఁటివఱకుఁ బెక్కండ్రీ రెండు లక్షణములను సమానార్థకములుగానే తలంచు చుండిరి. కానీ D. T. తాతాచార్య M. O. L. గారు Definition of Poetry లో నీ యర్థములను జూపిరి. పండితు లింకను దీనినిఁగూర్చి చర్చింపవలెను.

ప్రతిభోత్థాపితమైన కారణములతో సత్యమును సానందముతో సమ్మేళ
నముఁజేయు కళయే కవిత్వము

We may assume that the authors of these difinitions are indirectly referring the essence of the poetry which resides in words and thoughts and which owes itself to tropes and figures. I am inclined therefore to think that though the above and like definitions require a verble change before they can be strictly called definitions, yet they are in substance the same as the definitions of our old Alankarikas of the Alankara School which will be considered in the third chapter.

Of a quite different nature and value in John Stuart Mill's difinition which is contained in his question "what is poetry" but the thought words in which emotion spontaneously embodies itself. Perhaps we have our Rasa theory of Poetry poorly expressed. In a more developed form we find the Rasa principal in Wordsworth's observation which also refers to the question of origin and philosophy of poetry.

"Poetry is the spontaneous overflow of powerful feelings." This observation of Wordsworth as well as that of John Keble that "poetry is a vent for overcharged feelings" brings for our memory Ananda Vardhana's Sloka.

కావ్యస్యాత్మా సఏవార్థ స్తథా చాదికవేః పురా
క్రౌంచద్వంద్వవియోగోత్థశ్శోకః శ్లోకత్వమాగతః.

and Abhinagupta's comment upon it. It would be wrong, hower, to think that these critics had ever conceived with any vividness the Rasa or its relation to poetry. All we can safely say is that as Goldsmith and Leigh Hunt represent the old Alankara School, So William Wordsworth and John Keble represent the very iacipient stage of the Rasa School, though of course unconsciously."

"ఈ పై లక్షణకర్తలు సాక్షాత్తుగాఁగాదు కానిపరంపరగాఁ గావ్యతత్త్వమును నిరూపించుచున్నారు. వారి యుద్దేశానుసారముగా నా కావ్యతత్త్వ మలంకార సహితమగు శబ్దార్థస్వరూపము. కావున నీ లక్షణములును, నింకను నిట్టివియు, 'లక్షణములు' అని చెప్పవలసినచో మరికొంత మార్పుఁబడయవలయును. అప్పటికిని నవి మన యలంకారసిద్ధాంతమువంటి సిద్ధాంతములే యగును.

'జాన్‌స్టువర్టుమిల్' అను లాక్షణికుఁడు 'కావ్యమన నేమి?' అని ప్రశ్నించు కొని పై లక్షణములకన్న భిన్నమగు దృక్పథములో "మూర్తీభవించిన యావేశము

గల పదములును, అర్థములును కావ్యము” అనెను. ఇట మన రససిద్ధాంత మత్యల్పముగా బీజభూతముగాఁ దెలుపఁబడెను.

వర్డ్సువర్తు ఇంతకన్న విశేషముగా “కావ్యమనఁ బరిపూర్ణమైన యావేశముతో హృదయమునుండి వెలువడు వాక్ప్రవాహము” అని తెలిపెను.

అట్లే జాన్ కేబెలు అనునాతఁడు “కావ్యమన హృదయముయొక్క యొడ్డులొరసి ప్రవహించు భావప్రవాహమునకుఁ బరీవాహము”. అని వచించెను. ఈ వచనములుఁ

“కావ్యాత్మ యా రసధ్వనియే. ఆదికవియొక్క క్రౌంచద్వంద్వ వియోగోత్థమైన శ్లోకమే శోకమయ్యెను.” అను నర్థముగల యానందవర్ధనునిశ్లోకమును, దానిపై యభినవగుప్తుని వ్యాఖ్యను దలఁపించుచున్నవి. ఆంగ్ల లాక్షణికులు మన రససిద్ధాంతము నూహించినారని చెప్పలేము. కాని గోల్డుస్మిత్తు; లేహంటు ప్రభృతులు అలంకారమార్గానుయాయులు. వర్డ్సువర్తు ప్రభృతులు రసమార్గానుయాయులు. అని మాత్రము చెప్పఁగలము.” (స్వేచ్ఛానువాదము).

ఇంతవఱకుఁగావ్యశరీరమును గూర్చియుఁగావ్యాత్మను గుఱించియు విచారణ సేసితిమిగదా! ఇట నిఁక గావ్యప్రయోజన మేమో తెలిసికొనవలయును.

మన వాఙ్మయము (వైదిక లౌకికము) ప్రభుసమ్మితము, మిత్రసమ్మితము, కాంతాసమ్మితము, నని మూడుతెఱఁగులుగా నభినవ గుప్తపాదులు ప్రప్రథమమున వ్యవహరించిరి. తరువాతి యాలంకారికు లెల్లరు నీ విషయము నిట్లే స్వీకరించిరి. వేద వాఙ్మయము (వేదశాస్త్రస్మృతులు) ప్రభుసమ్మితము; పురాణవాఙ్మయము మిత్రసమ్మితము; కావ్యవాఙ్మయము కాంతాసమ్మితమునని విభజించిరి. ప్రభుసమ్మితమనఁ బ్రభువువలె నిరంకుశముగా శాసించునది. వేదము “సత్యంవద; ధర్మంచర” ఇత్యాదికమగు కర్తవ్యధర్మమును శాసనరూపమున బోధించును. ప్రభుశాసన మల్లంఘింపరాని విధమున వేదశాసనముగూడ నుల్లంఘింపరానిది. ప్రభుశాసన మెట్లెదుర్కొనరాదో వేదశాసనము నెదుర్కొనరాదు. మన కిష్టములేకున్నను బ్రభుశాసనమును విధిగాఁ బాలింపవలసినవిధమున వేదశాసనమును బాలింపవలయును. ఇట హేతువాదము పనికిరాదు. ఈ వాఙ్మయమున శబ్దమునకే ప్రాధాన్యము. కావున వేదములు శబ్ద ప్రధానములు. ఏలన “ ఈషత్పాఠాన్యథా పాఠే ప్రత్యవాయ ప్రదర్శనాత్ ” ఈషత్పాఠమువలనను, అన్యథాపాఠమువలనను గూడఁ బ్రత్యవాయము గలుగును. అని కలదు. ఇఁక మిత్రసమ్మిత మన మిత్రునివలె నుపదేశించునది. లోకములో

మాతా మిత్రం పితాచేతి స్వభావా త్త్రితయం హితం ।
కార్యకారణ తశ్చాన్యే భవంతి హిత బుద్ధయః

అన్నవిధమున మన మేలుఁ గోరువారు తలిదండ్రులును, మిత్రుఁడును నను మువ్వురే. అట్టి మిత్త్రునివంటి పురాణవాఙ్మయము వైదికమగు "సత్యంవద, ధర్మంచర" అను శాసనమునే సహేతుకముగా సోదాహరణముగాఁ గథారూపమునఁ దదాచరణమువలన గలుగు లాభములను, అనాచరణమువలనగలుగు నలాభములను నుపదేశించి, కర్తవ్య ధర్మాచరణమునఁ బ్రవిష్టునిఁజేయును. కాన నీ వాఙ్మయ మర్థప్రధానము. ఇఁకఁ గాంతాసమ్మిత మనఁగా నుత్తమురాలగు భార్య తన శైలీ (ప్రవర్తన) గుణాలంకారాదులచే భర్తృ మనోరంజనమును జేయుచు నున్మార్గమున నున్నవానిని సన్మార్గమునకుఁ ద్రిప్పును. ఆ యుత్తమయువతి తన భర్తకు వాచ్యరూపముగా నుపదేశింపక తన గుణప్రవర్తనలచే వ్యంగ్యరూపమున నుపదేశము సేయును. ఆమెయే స్వాధీనపతిక యనఁబడును. కర్తవ్య ధర్మాచరణము నకు భర్తను స్వాధీనునిఁ జేసికొనునది. అంతేకాని కేవలము తన కామసంతృప్తి కాతనిని స్వాధీనునిఁ జేసికొన్నది కాదు. అట్టియెడఁ బ్రియుఁడు కాంతాదాసుఁ డగు టలోఁ దోసఁగులేదు. కావునఁ గావ్యవాఙ్మయము కాంతాసమ్మతమనుటవలన వేద, పురాణ వాఙ్మయములకన్న వైలక్షణ్య మేర్పడినది. ఇందు దానియందు లేని చిత్త రంజనము, వ్యంగ్యరూపమగు నుపదేశమును గలవు. ఇదియే వైలక్షణ్యము. ఈవాఙ్మయము ధ్వనిప్రధానము. ఇట నొక విషయమును స్మృతియం దుంచుకొనవలయును. వైదికవాఙ్మయమే కర్తవ్యధర్మమును నిరంకుశముగా శాసనరూపముగా బోధించు చున్నదో యా కర్తవ్యధర్మమునే పురాణవాఙ్మయము సహేతుకముగా సోదాహరణముగా బోధించుచున్నది. ఆ కర్తవ్యధర్మమునే కావ్యవాఙ్మయము శైలీగుణాలంకారములచే జనచిత్తము నాకర్షించుచు హృద్యముగా బోధించుచున్నది. వేదము 'సత్యంవద' అనిశాసించెను. పురాణము సత్యహరిశ్చంద్ర కథను దెలిపెను. ఆ కథయే దృశ్యశ్రవ్య కావ్యములం దంతకన్న మనోరంజకముగాఁ బ్రదర్శింపఁబడి యాధర్మమును మరింత లెస్సగా నాటుకొనునట్లు బోధించుచున్నది. ఈ క్రమమును బట్టి చూడఁగాఁ గావ్యము తప్పక ధర్మోపదేశకమై యుండవలెను. దీనినే భామహుఁడు

"ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కళాసు చ ।
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్య నిషేవణం"

అని చతుర్వర్గ వ్యుత్పత్తియే కావ్యప్రయోజనముగాఁ జేర్కొనెను. మరియుఁ గావ్యప్రకాశకర్త

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే ।
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే"

అని సద్యః పరనిర్వృతిని, (ఆనందమును) నుపదేశమును ఫలములనుగాఁ జెప్పెను. ధన్యాలోకకర్తయు "సదాచారోపదేశ రూపనిబంధనా హి నాటకాది గోష్ఠీ వినేయజనహితార్థ మేవ మునిభిరవతారితా" (పామరజనహితార్థమునకై సదాచారోపదేశమును జేయుటకే భరతాదులు నాటకాదులను నిర్ణయించిరి.) అని నుడివెను. కావున భరతాదులు "ఆనందము, ధర్మోపదేశము" అను రెండును కావ్య ప్రయోజనములుగాఁ జెప్పిరి.

The poets are unacknowledged legislators of the world

అను నాంగ్లోక్తికిఁ గూడ నిదియే యభిప్రాయము. మరియు నాంగ్ల లక్షణకర్తలు

The purpose of the poem is to teach and delight

అని తెలిపిరి. ఇంతేకాక వెనుకఁ గవి భేదపరిగణనములో శాస్త్రకావ్యోభయ కవి శ్రేష్ఠుఁడని చెప్పఁబడినపు డాతని కర్మ యగు శాస్త్రకావ్యము శ్రేష్ఠమైయుండ వలయును. శాస్త్రకావ్యమన శాస్త్రమునందువలెఁ బురుషార్థనిరూపణమును గావ్యము నందువలె రసనిరూపణమును గలది. కానఁ గేవల కావ్యములకన్న శాస్త్రకావ్యము లుత్తమములు. ఈ శాస్త్రకావ్యాదిభేదము కావ్యవిభాగమునఁ జూచుకొనవలయును. ఈ ధర్మోపదేశము, ఆనందము అను ప్రయోజనద్వయములో నేది ప్రధానము? అనఁగా నేవి కావ్యశ్రవణ సమనంతరమునఁ గలుగును? అని ప్రశ్నించుకొని యభినవగుప్తుఁ డీ క్రింది విధమునఁ దెలిపెను. "శ్రోతౄణాం వ్యుత్పత్తిర్యద్యప్యస్తి యథోక్తం ధర్మార్థ కామమోక్షేషు । తథాపి ప్రీతిరేవప్రధానం । అన్యథా ప్రభు సమ్మితేభ్యో వేదాదిభ్యః, మిత్రసమ్మితేభ్యశ్చ ఇతిహాసాదిభ్యః కోఽస్యకావ్య రూపస్య వ్యుత్పత్తిహేతోర్జాయాసమ్మితత్వ లక్షణోవిశేషః ఇతి ప్రాధాన్యేన ఆనంద ఏవోక్తః । చతుర్వర్గ వ్యుత్పత్తే రపిచ ఆనంద ఏవ పార్యంతికం ఫలం" (శ్రోతలకు వ్యుత్పత్తి కలుగుచునే యున్నది. అయినను ఆనందమే ప్రధానము. కానిచోఁ బ్రభుసమ్మితములగు వేదాదులకన్న మిత్రసమ్మితములగు నితిహాసాదుల కన్నఁ గావ్యము కాంతాసమ్మితమని చెప్పిన లక్షణమునకు విశేష మేముండును? కావున నీలక్షణముచేతనే ప్రధానముగాఁ గావ్యప్రయోజన మానంద మనియే సారాంశము. చతుర్వర్గవ్యుత్పత్తికంటెను నానందమే ముఖ్యఫలము) దీనివలనఁ బ్రధాన ఫల మానందమనియు, నానుషంగిక ఫలము చతుర్వర్గవ్యుత్పత్తి యనియుఁ దేలినది.

'కావ్యాలాపాంశ్చవర్జయేత్' కావ్యాలాపమును విడువవలెను. అనఁగాఁ జదువరాదని యొక విధివాక్యమువంటి వాక్యముగలదు. కావ్యములు ప్రాయిక ముగా శృంగారమయములుగా నుండును. అవి భోగలాలసతను బెంచును. ఐహిక భోగతత్పరుఁడు జీవితలక్ష్యమైన మోక్షమునకు దూరస్థుఁడగును. కావున వేదశాస్త్ర పురాణములు మాత్రమే పఠనీయములు. అవి మోక్షసాధనములు అని తాత్పర్యము. ధర్మోపదేశనిబంధము లేని పచ్చి శృంగారకావ్యములు (భాణములు) పఠనీయములు గావు. కాని ధర్మోపదేశనిబంధము గల కావ్యములు తప్పక పఠనీయములే యగును. కావున "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అను వాక్యము సర్వకావ్యసాధారణము గాదు. అది క్షుద్రకావ్యపరము. విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమున

"యత్రపునరుత్తమపురుషచరితం ననిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ।
తద్విషయాచస్మృతిః "కావ్యాలాపాంశ్చవర్జయేత్"

ఏకావ్యమున నుత్తమపురుషచరిత్రము నిబద్ధముగాదో యాకావ్యము పరి త్యాజ్యమే. కావ్యాలాపములను విడువవలెనను స్మృతివచనము దానివిషయమే యని వచించెను. ఉత్తమపురుషచరిత్ర ముపదేశకముగా నుండును. కాన నుపదేశకమైన కావ్య ముపాదేయమగు నని పైయభిప్రాయమునే ధృఢపఱచుచున్నది.

కావ్యవాఙ్మయమానందమును, ధర్మోపదేశమునుజేయు నని చెప్పియుంటిమి. ఆ యానందమెట్టిది? అని విచారణ సేయవలయును. కావ్యానందము బ్రహ్మానంద సహోదరమని యాలంకారికు లెల్లరు నిర్వచించిరి. మొదట బ్రహ్మానందమన నేమో తెలిసికొనవలసి యున్నది. తైత్తిరీయోపనిషత్తునందలి యానందవల్లిలో 'ఆనంద మీమాంస' యిట్లు చేయఁబడినది.

"సైషానందస్య మీమాగ్ంసాభవతి। యువాస్యాత్ సాధు యువాస్యాత్। ఆశిష్ఠోద్రఢిష్ఠోబలిష్ఠః। తస్యేయం పృథివీసర్వా విత్తస్య పూర్ణా స్యాత్। సఏకో మానుష ఆనందః। శ్రోత్రియస్య చాఽకామహతస్య।యేయేశతంమానుషా ఆనందాః। సఏకో మనుష్య గంధర్వాణామానందః। శ్రోత్రియస్యచాఽకామహతస్య। యే యే శతం మనుష్యగంధర్వాణా మానందాః। సఏకో దేవగంధర్వాణామానందః। శ్రోత్రియస్య చాఽకామహతస్య। యేయేశతం దేవగంధర్వాణామానందాః। సఏకః పితౄణాం పర లోకలోకానామానందాః। శ్రోత్రియస్యచాఽకామహతస్య। తేయేశతం పితౄణాం పర లోకలోకానామానందాః। సఏక ఆజానజానాం దేవానామానందాః। శ్రోత్రియస్య చాఽకామహతస్య। తేయేశతమాజానజానాం దేవానామానందాః। సఏకః కర్మదేవా-

నాం దేవానామానందః । యేకర్మణా దేవానపియంతి। శ్రోత్రియస్య చాఽకామహతస్య । తేయే శతం కర్మదేవానాం దేవానామానందాః। సఏకో దేవానామానందః। శ్రోత్రియస్య చాఽకామహతస్య । తేయే శతం దేవానామానందాః । సఏక ఇంద్రస్యానందః । శ్రోత్రియస్య చాఽకామహతస్య । తేయే శత మింద్రస్యానందాః। స ఏకో బృహస్పతేరానందః । శ్రోత్రియస్య చాఽకామహతస్య। తేయే శతంబృహస్పతేరానందాః । సఏకః ప్రజాపతేరానందః। శ్రోత్రియస్య చాఽకామహతస్య । తేయే శతం ప్రజాపతేరానందాః। సఏకో బ్రహ్మణ ఆనందః."

దీని వివరణ మిది :—

౧౦౦ మానుషానందములు = ౧ మనుష్య గంధర్వానందము
౧౦౦ మనుష్య గంధర్వానందములు = ౧ దేవగంధర్వానందము.
౧౦౦ దేవ గంధర్వానందములు = ౧ పితృ దేవతానందము.
౧౦౦ పితృ దేవతానందములు = ౧ ఆజాన దేవతానందము.
౧౦౦ ఆజాన దేవతానందములు = ౧ కర్మ దేవతానందము.
౧౦౦ కర్మ దేవతానందములు = ౧ దేవతానందము.
౧౦౦ దేవతానందములు = ౧ ఇంద్రానందము.
౧౦౦ ఇంద్రానందములు = ౧ బృహస్పత్యానందము.
౧౦౦ బృహస్పత్యానందములు = ౧ ప్రజాపత్యానందము.
౧౦౦ ప్రజాపత్యానందములు = బ్రహ్మానందము.

మానుషానందమన యువకుఁడును, సాధువును, ద్రఢిష్ఠుఁడును, బలిష్ఠుఁడును నగు నొక మహారాజు పొందునట్టి యానందము. పైనిఁ జూపిన లెక్కనుబట్టిచూడఁగా ౧,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦, (ఒక లక్షకోటి కోట్లు) మానుషానందములయినచో నొక్క బ్రహ్మానందమగునని సాక్షాద్ద్రష్టలును, బ్రహ్మిష్ఠులు నగు మహర్షులు వాకొనిరి. కాఁబట్టి కావ్యానంద మిట్టి బ్రహ్మానందముతోఁ దుల్యమైనది. బ్రహ్మానంద సహోదరమగు రసానందము గలిగించు కావ్యముగూడా చాలా గొప్పదిగానే యనఁగా రామాయణ మహాభారతాదులవలెఁ బెద్దదిగానే యుండవలెననియే ప్రప్రథమమున విద్వాంసు లూహించిరి. కావున వారు మహాకావ్యముల నాదరించిరి. ముక్తకాదులను నిరసింపలేదు. కాని మహాకావ్యమునకుఁ జూపినంత గౌరవమును జూపలేదు. ఇట్టి యానందమును గలిగించు కావ్యమునకుఁ గర్త యగు కవి యెట్టివాఁడో తెలిసికొనవలయును. కవి యనఁగా నెట్టివాఁడిదను విషయ మలఁతిగాఁ దడవితిమి. [illegible] విషయమును విచారింతము. [illegible] నాస్పృషిః కురుతే

కావ్యం"; "కవయః క్రాంతదర్శినః" అను లోకోక్తులను జూపితిమి. ఋషివంటివాఁడయినయెడలనే కవి బ్రహ్మానంద సహోదరమగు కావ్యానందమును గలిగింపఁగలుగును. ఇట్టి కవియే మహాకవి. ఇట్టి కవులు చాల తక్కువగా నుందురు. కావుననే ధ్వన్యాలోకమున "అస్మిన్నతివిచిత్రకవిపరంపరావాహిని సంసారే ద్విత్రాః పంచషావా మహాకవయ ఇతి గణ్యంతే" అని నుడువఁబడియున్నది. కావునఁ గాళిదాసాది కవులే కవులు. మిగిలినవారు కవిబ్రువులు. అనఁగాఁ గావ్యశాస్త్రోభయకవులే లేక విద్వత్కవులే కవులు.

"కవయః కాళిదాసాద్యాః కవయోవయమప్యమీ ।
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం ప్రతిష్ఠితం"

కాళిదాసాదులును గవులే; మేమును గవులమే; అన్నారఁట యొకరు. మరొకరు పర్వతమునందును బరమాణువునందును బదార్థత్వ మను ధర్మమున్నది. అని పరిహసించిరఁట. చెప్పవచ్చిన దేమన మహాకవులు కొలఁదిమంది మాత్రమే కలరు. సరియే. ఆ కాళిదాసాది మహాకవులకు మహత్త్వమును గలిగించిన హేతువులను గూర్చి విచారింతము.

కావ్యప్రకాశ కర్త కావ్యప్రయోజనములను జెప్పిన పిమ్మటఁ గావ్యహేతువుల నిట్లు పేర్కొనెను.

"శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్ ।
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే"

(శక్తి, లోకశాస్త్ర, కా, వ్యాద్యవేక్షణమువలనఁ గలిగిన నైపుణ్యము, పెద్దల శిక్షనుబొంది తదనుకూలముగా నభ్యాసమొనర్చుట, అను మూఁడును గలిసి కావ్యహేతువు; కాని యివి ప్రత్యేక హేతువులు గావు. ఈ శక్తినే యభినవగుప్తపాదులు 'ప్రతిభ' యనిరి. దీని నాతఁడు "ప్రజ్ఞా అపూర్వవస్తు నిర్మాణ క్షమా" (క్రొత్తక్రొత్త వస్తువుల నిర్మించు నేర్పు) అనెను. భామహుఁడు "ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా" (క్రొత్తక్రొత్త పోకడలఁ గలిగించు ప్రజ్ఞయే ప్రతిభ) అని నిర్వచించెను. ఈ ప్రతిభవలన లోకోత్తరచమత్కారము గలిగించు కావ్యమును రచింపఁగలుగును. ఈ లోకోత్తర చమత్కారమునే వైచిత్ర్యము, విచ్ఛిత్తి, చారుత్వము, సౌందర్యము, హృద్యత్వము, రమణీయత్వము, అని పెక్కు పదములతో వ్యవహరించిరి. కావున నీ ప్రతిభ కవికి ముఖ్యసామగ్రి. ఈ ప్రతిభనే యాధునికులు భావనాశక్తియనియు నాంగ్లమున Power of imagination అనియును వ్యవహరింతురు. ప్రతిభ యను పదమును 'కాణే' పండితుఁడు imagination అనియు,—

Thomos పండితుఁడు Faculty, లేక Fancy అనియును భాషాంతరీకరించిరి. ప్రతిభ, శక్తి, ప్రతిభానము, అనుపదములనాలంకారికులు పర్యాయపదములుగా వ్యవహరించిరి.

"కావ్యంతు జాయతే జాతు కస్యచిత్ప్రతిభావతః" (ఒకానొక ప్రతిభావంతునివలన నొకానొకప్పుడే కావ్యము వెలువడును) అని భామహుఁడు చెప్పెను. ఈ ప్రతిభలేని కవిత్వము "భోజనం దేహి రాజేంద్ర! ఘృతసూపసమన్వితం" కవిత్వము. ఇది కావ్యహేతువులో నొకభాగము. తరువాతిది నిపుణత. అనఁగాఁ వ్యుత్పత్తి. పాండిత్యమన్నమాట. బాలుఁ డెంతబుద్ధిశాలియయినను విద్యాభ్యాసములేకున్నచోఁ బండితుఁడు కాఁజాలన ట్లెంతప్రతిభావంతుఁడైనను బాండిత్యము లేనిచోఁ గవి కావ్యనిర్మాణదక్షుఁడు గాఁజాలఁడు. ప్రతిభావ్యుత్పత్తులు రెండును దుల్యప్రమాణము గలిగి యుండవలెను. ఈ వ్యుత్పత్తి కావ్యహేతువులో రెండవ భాగము. మూఁడవభాగ మభ్యాసము. పైరెండును సమగ్రముగానున్నను నభ్యాసము లేకున్నచోఁ గవి కబ్బము లల్లఁజాలఁడు. చక్కనిశైలి యలవడదు. వ్రాయగాఁ వ్రాయఁగాఁ గానీ దస్తూరి కుదరనివిధమున వ్రాయఁగా వ్రాయఁగాఁ గానీ మంచి శైలి యలవడదు. ఈ మూఁడుభాగములును గలిసియే కావ్యహేతువు. మరియుఁ గావ్య మీమాంసలో (పం. ఆ. నా. శా. గారి యనువాదము ౬౯ పుటలో) నిట్లున్నది. "ప్రతిభా వ్యుత్పత్తు లొకదానితో నొకటి చేరియున్నవని యాయావరీయుఁడు. లావణ్యములేని రూపసంపద గానీ రూపసంపదలేని లావణ్యము గానీ సౌందర్యాధిక్యమును వెల్లడింపఁజాలవుకదా! కావునఁ బ్రతిభావ్యుత్పత్తిమంతుఁడే కవి. కానఁ బ్రతిభావ్యుత్పత్తులు (రెండును), అభ్యాసము (మూఁడును) ను గలిసియే కావ్యమునకుఁ గారణము; కారణములు గావు" కావుననే "విద్వత్కవయః కవయః కేవలకవయస్తు కేవలం కపయః" అను వాచోయుక్తి వెలిసినది. కాళిదాసాది మహాకవులకుఁ బ్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు మూఁడును సమాన ప్రమాణమునఁ గలవు. కావుననే వారు మహాకవులయిరి. ఈ మూఁడును గరిష్ఠప్రమాణమున వారియందుండుటచే వారు మహాకవులు కాఁజాలిరి. ఈ మూఁడుభాగములలో నొక్కొక్కరి కొక్కొక్కభాగము హెచ్చుగను, మరొక్కటి తచ్చుగను నుండవచ్చును. అట్టివారు మహాకవులు కాఁజాలరు. ఒక్కొక్కమెట్టు దగ్గుదురు. అట్టివారే యప్పకవిచేనుడువఁబడిన సప్తవిధకవులు. మూఁడుభాగములును సమానముగాఁ గలవారే మహాకవులు. అట్టి మహాకవినిఁ గూర్చియే ధ్వన్యాలోకకర్త "అపారే కావ్యసంసారే" అని చెప్పెను. ఇందుఁ "గవి శృంగారియగుచో లోకమంతయును రసమయము సేయును.. విరాగియగుచో నీరసముసేయును" అనికదా యున్నది. దీని కొక యుదాహరణ

మిత్తును. భర్తృహరి వ్రాసిన శృంగారశతకమును జదువుచున్నపుడు సన్న్యాసియు శృంగారియగును. వైరాగ్యశతకమును జదువుచున్నపుడు శృంగారియు సన్న్యాసి యగును. కాన నట్టివాఁడే మహాకవి.

ఇఁకఁ గావ్యప్రకాశకర్త కవిసృష్టి బ్రహ్మసృష్టిని మించునని వ్రాసినాఁడు.

"నియతికృతనియమరహితాం । హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం
నవరసరుచిరాం నిర్మితిమాదధతీ భారతీ కవేర్జయతి"

తా. బ్రహ్మసృష్టిలోవలెఁ గవిసృష్టిలో నియతధర్మము లేదు. అనఁగా బ్రహ్మ సృష్టిలో ముఖము ముఖమే. కవిసృష్టిలో ముఖము చంద్రుఁడో పద్మమో యగు చున్నది. కాన నిట నియతధర్మము లేదు బ్రహ్మసృష్టి సుఖదుఃఖాత్మకము. కవి సృష్టి కేవల సుఖాత్మకము. బ్రహ్మసృష్టి పరమాణ్వాద్యుపాదానకారణపరతంత్రము. అనఁగా బ్రహ్మయైనను బరమాణ్వాదులులేక వస్తుసృష్టినిఁ జేయఁజాలఁడు. వానికి సహకారులు గావలయును. కవిసృష్టి కట్టి యుపాదానకారణము లక్కఱలేదు. బ్రహ్మసృష్టిలో నాఱే రసములు. కవిసృష్టిలోఁ దొమ్మిది రసములు.

పై యుల్లేఖనమును బట్టి, ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు మూఁడును గలిసియే హేతువుగాని ప్రత్యేక మొక్కొక్కటియు హేతువు కాఁజాలదు. ఇదంతయు మమ్మటాది ప్రాచీనాలంకారికుల మతము. ఆనందవర్ధనాచార్యులవారు స్థిరపఱచిన కావ్యసిద్ధాంతమును బ్రకరణవ్యవచ్ఛేదపూర్వకముగా విభజించి రచించినవాఁ డగుట చేత మమ్మటుఁ డితరాలంకారికులకుఁ బరమప్రామాణికుఁడుగా నయ్యెను.

నవ్యుఁడగు పండిత రాయలవారి మతము దీనికి భిన్నమైనది. మమ్మటుఁడు ప్రతిభకుఁ గారణమును నిరూపింపలేదు. ఈప్రతిభకు నొక్కొక్కచో దేవతానుగ్రహము, ఒక్కొక్కచో వ్యుత్పత్త్యభ్యాసములును హేతువులగును. ఎట్లన నొక్కొ క్కనికి వ్యుత్పత్త్యభ్యాసములు లేకున్నను కేవలము దేవతానుగ్రహమువల్లనే ప్రతిభ గలుగుట ప్రసిద్ధముగా నున్నది. ఒక్కొక్కఁడు కొంతకాలమువఱకుఁ గావ్యరచన మొనర్పరానివాఁడు వ్యుత్పత్త్యభ్యాసములు గలిగిఁగానే ప్రతిభావంతుఁడై కావ్య రచనము సాఁగించుచున్నాఁ డనుటయుఁ బ్రసిద్ధమే. కావున నెల్లరివిషయమునను బ్రతిభకు దేవతానుగ్రహమునే కారణముగాఁ దెలుపరాదు. కావునఁ బ్రతిభకు రెండుకారణము లని తేలినది. కారణములు రెండైనపుడు కార్యములు రెండగును. అట్టియెడఁ బ్రతిభయు రెండువిధములయినది. దేవతానుగ్రహరూపకారణమువలనఁ బుట్టిన ప్రతిభచే రచింపఁబడిన కావ్య మొకవిధముగను, వ్యుత్పత్త్యభ్యాసరూపకార

ణమువలన రచింపఁబడిన కావ్య మెంకవిధముగను నుండును. కారణవైలక్షణ్యమును బట్టి కార్యవైలక్షణ్య ముండునుగదా! కావునఁ బ్రిలిధయే (రెండువిధములు) కావ్య హేతువని జగన్నాథ మతము. రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో "ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా శ్రేయసీ''ఇత్యానందః'' (ప్రతిభావ్యుత్పత్తులలోఁ బ్రతిభయే శ్రేష్ఠతర) మని యానందవర్ధనుఁడుచెప్పినట్లుతెలిపెను. అనఁగా నాదేవతానుగ్రహమువలన లభించినప్రతిభ శ్రేష్ఠతరము."సా హికవే రవ్యుత్పత్తికృతం దోష మశేషమాచ్ఛాదయతి. తథాహి"

"అవ్యుత్పత్తి కృతోదోషః శక్త్యా సంవ్రియతే కవేః ।
యస్త్వశక్తి కృతస్తస్య ఝగిత్యేవావభాసతే"

తా. శక్తి (ప్రతిభ) గల కవి తన శక్తిచే వ్యుత్పత్తి లేమివలనఁ గలిగిన దోష మెల్లను గప్పివేయును. ప్రతిభలేమివలనఁ గలిగిన దోషము వెంటనే కనఁబడును. అనియును నొడివెను. దీనిచే దేవతానుగ్రహలబ్ధమగు ప్రతిభ వ్యుత్పత్త్యభ్యాసముల వలనఁ గలిగిన ప్రతిభకన్నను శ్రేష్ఠతర మని సారాంశము. ఈ ప్రతిభాగుణమునుబట్టియే కావ్యము క్రొంగ్రొత్తగా భాసించును. ఎట్లన,

దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవా ఇవాఽభాంతి మధుమాస ఇవ ద్రుమాః.

కావ్యార్థములు దృష్టపూర్వములయినను రసపరిగ్రహమువలన వసంతకాలమున వృక్షములవలెనే నూతనముగా భాసిల్లును.

పెక్కండ్రు కవు లీవిధముగా గ్రంథములు వ్రాయుచున్నచోఁ గొంత కాలమునకు వస్తుసామగ్రి క్షయింపదా? అని యొక ప్రశ్న వచ్చుచున్నది. అట్లుగాదు.

వాచస్పతి సహస్రాణాం సహస్రైరపి యత్నతః
నిబద్ధాఽపి క్షయంనైతి ప్రకృతిర్జగతామిత.

పెక్కువేలమంది బృహస్పతులు ప్రయత్నించినను జగత్ప్రకృతి (సత్త్వ రజస్తమోరూపము) వలెఁ గావ్యసామగ్రి నశింపదు.

ఒకప్పుడు రచనలలోఁ గొన్ని పోలిక లగపడవచ్చును. పోలిక లున్నమాత్రమున గ్రంథచౌర్య మాపాదింపరాదు. ఏలన

"సంవాదిన్యో మేధావినాం బుద్ధయః" (ప్రతిభావంతుల బుద్ధులొకదానితో నొకటి పోలును.) ఇది నైజము. ఈ పోలికలు మూఁడువిధములు.

౧. ప్రతిబింబాకార సంవాదము, ౨. ఆలేఖ్యాకార సంవాదము,

౩. దే[illegible] సంవాదము.

## ౧. ప్రతిబింబాకార సంవాదము.

బింబమునువలెఁ బ్రతిబింబమును సిద్ధముసేయుట. ఎట్లన.

కం. తరుణుండగు శీతలకరు । మరిగి వియల్లక్ష్మి తనూమాని ముదుకఁడుగా
ఖరకరుఁ డున్ననిదొర్చిన । కరణిగా రవి పశ్చిమాద్రికడఁగుంక నృపా ।

ఈ బింబమునకు

కం. తరుణుండగు శీతలకరు । మరిగి వియల్లక్ష్మి తన్నుమాని ముదుకఁడుగా
ఖరకరుఁ డున్ననిదొర్చిన । కరణిగా రవి పశ్చిమాద్రికడఁ గుంక నృపా !

ఇది ప్రతిబింబము. ఈ ప్రతిబింబాకార సంవాదము గల కావ్యవస్తువు సర్వథా పరిత్యాజ్యము. ఏలన, దీనికి శరీరము భిన్నముగాలేదు. దాని కిది నకలు.

## ౨. ఆలేఖ్యాకార సంవాదము.

చిత్తరువు పోలియున్నవిధమున నితరుల కావ్యవస్తువును బోలియుండుట. ఎట్లన

సీ. పేర్చి నందుండు పూలుగోసి యొసంగ, సరము లందముగ సుందరి రచించు
మెలఁత వర్ణమ్ములు మేళవించి యిడంగ, హరువుమై నతఁడుచిత్తరువు వ్రాయుఁ
బతి యనురూపభావము వచించిన నను,రూపపద్యమునఁ గూర్చును లతాంగి
అతివ చక్కనిరాగ మాలపించిన వీణఁ, బలికించు నతఁడు మై పులకరింప

గీ. నెట్టసెరల నందునిచూపు లింతియాన, నేంమునకుఁ గెంపులనివాళులెత్త, నతివ
కజ్జలపుఁజూడ్కి ప్రియుని వక్షఃకవాటిఁ, గట్టుఁ దోరణములు నల్లకల్వపూల.

ఈ పద్యమునకు నీ క్రిందిపద్యము మెఱుఁగువెట్టినట్లున్నది.

సీ. వీనులవిందుగా వీణెమీటఁగఁ బతి, లలన ముద్దుగను దాళములువేయు
హృద్యంబుగా వ్రాయఁ బ్రియుఁడు చిత్తర్వును, గోమలి తగిన రంగులనుదిద్దుఁ
గౌశలంబున మృదంగము భర్త వాయింప, నాపన్నెలాఁడి లాస్యంబొనర్చుఁ
బాడుచుంబాడు చాపాటఁప ననఁగుశాఁ, డా మనోహరి దానినంది పాడు

గీ. చదువశృంగారకావ్యంబు సరసుఁడెలమి, యువతి విరచించును దదర్థవివరణంబుఁ
బైనుదాహృతకావ్యముల్ వ్యత్యయముగ, వారుగావించుకొంద్రొక్కతూరి ప్రీతి.

సీ. వీఁ డటే । రక్కసి విగతజీవగఁ జన్నుఁ,బాలు ద్రావినమేటి బాలకుండు
వీఁ డటే । నందుని వెలఁదికి జగమెల్ల, ముఖమందు జూపిన ముద్దులాఁడు
వీఁ డటే । మందలో వెన్నలు దొంగిలి, దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁ డటే । యులయించి వేఁతల మానంబు, నూఱలాడిన లోకసుందరుండు

గీ. వీఁడు లేకున్న పురమటవీస్థలంబు, వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకనివచనంబు విహగరుతము, వీనిఁ జూడనిచూడ్కులు వృథలువృథలు

ఈ పద్యమునకే క్రిందిపద్యము ఛాయారూపముగా నున్నది.

సీ. అతఁడటే! సుకృతాత్మయైన మాయాదేవి, కడుపారఁగన్న బంగారుతండ్రి
ఆలుబిడ్డలును రాజ్యముఁ దృణమ్ముగాఁ గాన, కేగిఁట్టి విరక్తుఁ డీతఁడటవె!
వీఁడెయౌనే! కన్నబిడ్డలవలె మమ్ము, రక్షించుచునుకొన్న రాసుతుండు
మనబోటి పాపులకును మోక్షమునొసంగ, నరుదెంచుపుణ్యాత్ముఁడటవె! యితఁడు

గీ. ఎంతభాగ్యమొ? యెన్నాళ్ళకే లభించె, సౌమ్యగంభీరమైన యీ చక్కనయ్య
నెమ్మొగముఁ గాంచు పుణ్యమ్ము; నిఖిలజగము, లేలఁగలవాఁడు కాఁదగఁడే? యితండు.

ఆలేఖ్యమును జిత్రకారుఁడు వ్రాయునపు డొక్కొకచో మొదటిరూపమునకు పన్నెదచ్చువిధమునను వ్రాయవచ్చును. "యద్యత్సాధు న చిత్రే స్యాత్క్రియతే తత్తదన్యథా" (ఏది సహజముగా లెస్సగా నుండదో యది చిత్తరువున వేఱువిధముగా ననఁగా సుందరముగాఁ వ్రాయఁబడును) అని కాళిదాసకవియు నన్నాఁడు. ఒకప్పుడు మొదలిదానిరూపమునకన్న నసుందరముగాఁ గూడ వ్రాయవచ్చును. పై పద్యమునకన్న (వీఁడటే!) రెండవపద్య (అతఁడటే) మసుందరము. దీనికి శరీరాంతరమున్నను నాత్మతుచ్ఛముగా నున్నది. అనఁగా ననుందరముగా నున్నది.

## ౩. దేహాంతరతుల్య సంవాదము

దేహాంతరమును దేహాంతరము పోలియున్నవిధమున భావమునందుఁగాని, ప్రకరణమునందుఁగాని, విషయమునందుఁగాని పోలిక కనఁబడినను స్వాతంత్ర్యమును గోల్పోక సహజసుందరమగు జీవముతో నాస్వాద్యమానమైయున్న కావ్యవస్తువు. దీనికాత్మయు, శరీరమును వేఱుగాఁ గలవు. ఒకమనుష్యుని వేఱొక మనుష్యుఁడు పోలియున్న మాత్రమున నిరువురును నొక్కఁడే యని చెప్పఁజాలముగదా! మేఘసందేశము ననుకరించి హంససందేశము వ్రాయఁబడియున్నది. ఇది దేహాంతరతుల్యసంవాదరూపమే. ఏలన, దీనికి నాత్మయు శరీరమును భిన్నములుగానే యున్నవి. ఈ సంవాదము స్వీకార్యమే యగును. మొదటిది బొత్తుగా వర్జనీయము; రెండవది మధ్యమము; మూఁడవది యుపాదేయము; ప్రతిభావంతుఁడగు కవి యీ యనుకరణము లకుఁ బోక స్వతంత్రమార్గముననే కావ్యరచనము సేయును. కాళిదాసమహాకవి మేఘసందేశ మిట్టి ప్రతిభావిలాసమే.

## కవి కావ్యము నెట్లారంభించును?

ప్రతివాఁడును జగత్తును జూచుచునేయున్నాఁడు. కాని కవిచూపు వేఱు. ఒక నదినిఁ జూచి సామాన్యుఁడు దానిని నదియేయని చెప్పును. కాని కవి దానినిఁ 'బరమేశ్వరుని కరుణాప్రవాహము' అని వర్ణించును. సామాన్యునకుఁ దీఁగ తీఁగయే. కవికది యువతి. దానిపువ్వులు కవిదృష్టిలో నాయువతియొక్క స్తనములు. దాని చిగురాకు కెమ్మోవి. కావున లోకమున నెల్లరునుజూచు సామాన్యవస్తువులే కవికిఁ బ్రతిభచే విలక్షణముగా విశిష్టముగా లోకోత్తరముగా గోచరించును. ఇదియే లోకోత్తరవర్ణనము. ఇట్లే మనము మార్గమునఁ బోవుచున్నపుడు ప్రక్కలందేబిచ్చగానినో చూతుము. వెళ్ళిపోవుదుము. మఱచిపోవుదుము. కాని కవి వానినిఁజూచి, వాని దీన స్థితినిఁ జూచి, హృదయము ద్రవింప వానిని మనస్సునఁ జిత్రించుకొని 'పదేపదే' యా చిత్రరువువంకనే తదేకదృష్టిలోఁ జూచుచు దాను వానిలో లీనుఁడై వానిదైన్య మును దనదిగానే భావించుకొని వానినిఁ గావ్యమునఁ జిత్రించును. సామాన్యముగాఁ దాను గండ్లారఁ జూచిన దృశ్యమునే కవి చిత్రింపఁగలుగును. చూచిన యనుక్షణ ముననే సామాన్యముగా నెవ్వఁడును వ్రాయఁజాలఁడు. చూచిన దృశ్యమును మన స్సులోఁ జిత్రించుకొనుటకును, నాదృశ్యముయొక్క స్వరూపమునఁ దానైక్యముఁ బొందుటకును, గొంతవ్యవధి కావలయును. అదృశ్య మెంత హృద్యతమైన నంత యుద్వేగముతో నాకావ్యము వెడలును. కాని శ్రీమద్రామాయణమున వాల్మీకి క్రౌంచద్వంద్వవియోగమును గాంచి యనుక్షణముననే పారవశ్యమున

> "మానిషాద! ప్రతిష్ఠాంత్వమగమశ్శాశ్వతీస్సమాః
> యత్క్రౌంచ మిథునాదేకమవధీఃకామమోహితం"

అని శ్లోకరూపమునఁ బలికెననికలదు. దీని కవష్టంభకముగా "క్రౌంచద్వంద్వ వియోగోత్థ శ్శోకశ్శ్లోకత్వమాగతః" అని ధ్వన్యాలోకకర్తయు "శ్లోకత్వమాపద్యత యస్యశోకః" అని కాళిదాసకవియు వచించిరి. వాల్మీకిమహాముని ప్రతిభా వంతుఁడును, నంతర్ముఖుఁడును. అట్టివానికిఁ జూచిన క్రౌంచద్వంద్వచిత్రమును హృదయమునఁ జిత్రించుకొనుటకును, దానియందు లీనుఁడగుటకును, నితరులకుఁ గావలసినంత వ్యవధి యక్కఱలేకపోవలసివచ్చును. ఆరూఢుఁడగు యోగి తనకు వలసిన క్షణముననే బాహ్యప్రపంచమును మఱచి సమాధిలోఁ బ్రవేశించి బ్రహ్మా నందము ననుభవించునట్లు మహాకవియుఁ దలఁచుకొన్న క్షణముననే విషయమునఁ బ్రవేశించి లీనుఁడై కావ్యమును వ్రాయఁగలుగును. అప్పు డాతఁడు పొంగివచ్చు నా కవితాప్రవాహమును నాఁపుకొనఁజాలఁడు. అప్పు డాతనికి భావ చెప్పినట్లు

వచ్చును. శబ్దార్థములు మేము మేమని పరుగిడివచ్చును. వాల్మీకి యట్టివాఁడు గను కనే శోకించద్వంద్వవియోగమును గాంచఁగానే యావిధముగాఁ శ్లోకమును రచింపఁ గలిగెను. కాన శోకమే శ్లోకమయ్యెనని చెప్పఁబడినది.

కాని సామాన్యులకుఁ గొంత వ్యవధి కావలయును. కొందఱు కవి కావే శము, ఉత్సాహము, ఉద్రేకము, అనునవి కావలెనని చెప్పుదురు. మన భారతీ యాలంకారికు లీ పదములను వాడలేదు. వారు కావ్యహేతువుగాఁ జెప్పినది ప్రతిభ. ఈ యావేశాదు లా ప్రతిభలోనే యంతర్గతమగును. అల్లసాని పెద్దన కృష్ణరాయలవారు తన్నేదేనిఁ గావ్యము రచింపుమన

చ. నిరుపహతిస్థలంబు, రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురపువిడెంబు, నాత్మకింపయినభోజన, మొయ్యెలమంచ, మొప్పుత
ప్పురయురసజ్ఞు; లూహతెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపుమనంగ శక్యమే ?

అని యివ్విన్నియు నున్నఁగాని కావ్యము వ్రాయ సాధ్యముగాదని పలికెనఁట. ఇది హాస్యోక్తియైయుండును. ఇది కావ్యకారణ సామగ్రి గాదు. ప్రతిభగలవానికి దీనితోఁ బనిలేదు. ఇంటఁ దిండిలేక శుష్కోపవాసము లుసేయుచు పోతనగారు భాగవతమును రచించిరి.

ప్రతిభావంతుఁడయిన కవి యే వస్తువును గ్రహించినను దానిని సుందరముగాఁ జేయును. వస్తు గౌరవమునుబట్టి కావ్యగౌరవ మేర్పడును. వస్తు గౌరవమునుబట్టియే "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" అను ప్రతిష్ఠ వచ్చినది. ఒకప్పుడు వస్తువు లోకోత్తరము గాకపోవచ్చును. కాని కవి తన పనినిఁ జక్కఁగా సమర్థించును. అచేతన వస్తువులకును ప్రతిభావంతుఁడు చైతన్యముఁ బోయును. కోఁతి గొలుపు పెంటకుప్పలును, బంగారుబొమ్మలయిన పడఁతులును గవి కావ్యమున సమానముగా సుందరమూర్తులుగానే భాసింతురు.

నవ్యకవులు సుందర వస్తువులను గూర్చియే కవి వ్రాయవలెనందురు. సుందరవస్తు వెప్పుడును సుందరమే. అసుందరమునుగూడా సుందరముగాఁ జేయుట లోనే కవికిఁ బ్రత్యేకశక్తి గలదు. "తృణేనకార్యం భవతీశ్వరాణాం" అన్నట్లు కవి కనుపాదేయమగువస్తువేదియు లేదు. ఆవస్తువును గ్రహించు కవియొక్క ప్రతిభా మహత్త్వమునుబట్టి కావ్యగౌరవ మేర్పడును. కవిత్వము కళగావునఁ గళ ప్రకృత్యనుకరణమే కావునను ... ప్రయోజనము ... imitation be gets

pleasure (అనుకరణ మానందమును గొలుపును) అన్నవిధమున లోకమునందువలెఁ గాక కావ్యమునందలి యసుందరవస్తువులవలనను నానందమే కలుగును. ఈ క్రింది దశరూపకశ్లోకమును గనుఁడు

శ్లో॥ రమ్యంజుగుప్సిత ముదార మథాఽపి నీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వాఽప్యవస్తు కవిభావకభావ్యమానం
తన్నాస్తి యన్నరసభావ ముపైతిలోకే

(రమ్యముగానిండు; రోఁతగొలుపునది కానిండు; ఉత్తమముగానిండు; అధమముగానిండు; భయంకరముగానిండు; ప్రసన్నముగానిండు; గంభీరముగానిండు; వికృతముగానిండు; వస్తువుగానిండు; అవస్తువుగానిండు; లోకమునఁ గవిచే భావ్యమానమై రసభావమును గలిగింపనిది లేదు) దీనినిఁబట్టి కవి సుందరవస్తువులను గూర్చియే వ్రాయవలెననుట యనుచితము. ఆంగ్లమునఁగూడనిదేయభిప్రాయముగలదు.

"Poetry turns all things to loveliness". "It exatls the beauty of that which is most beautiful and it adds beauty to that which is deformed' 'Shelly'

(కావ్య మెల్లవస్తువులను సుందరముగా మార్చును. అది సుందరవస్తువులను సుందరతమములను జేయును. అసుందరవస్తువులను సుందరములుగాఁజేయును)

కం. తనువగు శబ్దార్థంబులు;
ధ్వని జీవ; మలం క్రియావితానము సొమ్ముల్;
తనరు గుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర! కావ్యేందిరకున్. ౫౩

తా. కావ్యలక్ష్మికి శరీరము శబ్దార్థములు; జీవితము (ఆత్మ) ధ్వని; అలంకారము లలంకారములు; గుణములు గుణములు; వృత్తులు వృత్తులు;

కావ్యశరీరమునుగూర్చి యింతకుమున్నే విపులముగాఁ జర్చించితిమి. ధ్వనతీతి ధ్వనిః(కావ్యం) ధ్వన్యతే ఇతి ధ్వనిః(వ్యంగ్యార్థము) ధ్వననం ధ్వనిః(వ్యంజనా) అని యభినవగుప్తుఁడు ధ్వనిశబ్దమునకు ముత్తెఱఁగులగు వ్యుత్పత్తుల నంగీకరించి కావ్యపరముగా, వ్యంగ్యార్థపరముగా, వ్యంజనావృత్తిపరముగా వ్యాఖ్యానించెను. 'ధ్వని జీవ' మనుచోట ధ్వనిశబ్దమునకు వ్యంగ్యార్థమనియే యర్థము.

ఇటఁ 'గావ్యేందిర' అని కావ్యమును నిందిరనుగా రూపించుటవలనఁ బ్రయోజనమేమియు లేదు. కావ్యము కాంతాసమ్మితమగుటచే సామాన్యముగాఁ గాంతగా రూపించినఁ జాలును. 'కావ్యరమణికిన్' అన్నచో సరిపోవును. గ్రంథకర్త యిచ్చటఁ దానిచ్చిన కావ్యసామగ్రిలో రీతి, పాకములను వదలెను.

గీ. అందు వాచక లక్షక వ్యంజకంబు
లనఁగ శబ్దప్రపంచంబు వినుతికెక్కుఁ
ద్రివిధమై యర్థజాతంబు తేజరిల్లు
నవని వాచ్యంబు, లక్ష్యంబు, వ్యంగ్యమనఁగ. ౫౪

గీ. శబ్దవృత్తులు, నభిధ, లక్షణ యనంగ
వ్యంజన యనంగఁ బేరుపొందు; నందు నభిధ
,సతత సంకేతితార్థ గోచర సుశబ్ద
ధామమై, యోగరూఢి భేదములఁ జెలఁగు. ౫౫

తా. పదములకు లేక శబ్దములకు నర్థమును బోధించు నొక శక్తి గలదు. "పదపదార్థ సంబంధశ్శక్తిః" (పదమునకును దాని యర్థమునకును గల సంబంధమే శక్తి) అని తార్కికవచనము. ఆ శక్తిఁ గొంద ఱాలంకారికులు 'వృత్తి' యనియును గొందఱు 'శక్తి' యనియును, గొందఱు 'వ్యాపార' మనియును బేరిడిరి. ఆ శక్తి అభిధా, లక్షణా, వ్యంజనా, యని మువ్విధము. అభిధాశక్తిచేఁ జెప్పఁబడు నర్థము వాచ్యము లేక అభిధేయము లేక శక్యము అనియు, లక్షణాశక్తిచే బోధింపఁబడు నర్థము లక్ష్యమనియు, వ్యంజనాశక్తిచే బోధింపఁబడు నర్థము వ్యంగ్యమనియుఁ జెప్పఁబడును. ఆ వాచ్యార్థమును బోధించు శబ్దము వాచకమనియు లేక శక్తమనియు, లక్ష్యార్థమును బోధించు శబ్దము లక్షకమనియు, వ్యంగ్యార్థమును బోధించు శబ్దము వ్యంజకమనియు వ్యవహరింపఁబడును. అనఁగా నిట్లు :

| శక్తి. | అర్థము. | శబ్దము. |
|---|---|---|
| అభిధా | వాచ్యము లేక అభిధేయము లేక శక్యము | వాచకము లేక శక్తము |
| లక్షణా | లక్ష్యము | లక్షకము |
| వ్యంజనా | వ్యంగ్యము | వ్యంజకము |

గ్రంథకర్త ప్రప్రథమమున నభిధాది శక్తులను, బిమ్మట వాచ్యాద్యర్థములను, దదుపరి వాచకాది శబ్దములను గుఱించియుఁ జెప్పిన యెడలను లెస్సగా నుండెడిది. అట్లు చెప్పఁబడమి నీ రెండుపద్యములకును గలిపియే వివరణము వ్రాయఁబడినది.

ఈ మూఁడుశక్తులనుగాక మీమాంసకులలో నొక తెగవారగు నభిహితాన్వయ వాదులు 'తాత్పర్యశక్తి' యను వేరొకశక్తి నంగీకరించిరి. (తాత్పర్యార్థోఽపి కేషుచిత్) అభిధా, లక్షణా, వ్యంజనాశక్తులు శబ్దశక్తులు. అనఁగా శబ్దముయొక్క యర్థమును బోధించు శక్తులు. తాత్పర్యశక్తి వాక్యశక్తి. వారి యాశయ మిది:—

"శబ్దములు వాని సంకేతితార్థమును మాత్రమే బోధించును. అన్వయమును బోధింపవు. ఎట్లన, 'గామానయ' (గోవును దెమ్ము) అన్నపుడు 'గాం' పదము 'గోవును' అనియు, 'ఆనయ' పదము 'తెమ్ము' అనియును నర్థమును దెలుపును. కాని యీ రెండర్థములను గలియుటెట్లు? ఏలన, నభిధ పదములయొక్క యర్థమును మాత్రమే బోధించును. కాని యన్వయమును బోధింపదు. కాన వాక్యము నందలి పదముల కన్వయమును గలిపి యఖండార్థమును బోధించుటకు వేఱొకశక్తి నంగీకరింపవలయును. దానికే తాత్పర్యశక్తి యని పేరు. అది లేకున్నచోఁ బదములు పరస్పరాన్వయమును బొందవు. మన కఖండార్థ మేర్పడదు. తీర్థమునకుఁ దీర్థము, ప్రసాదమునకుఁ బ్రసాదమునన్నవిధమున నర్థములు ఖండఖండములుగానే యుండును" వీ రభిహితాన్వయవాదులు. అనఁగా బదములమూలమున వాక్యార్థ మేర్పడునని చెప్పువారు.

ఈ మీమాంసకులలో నన్వితాభిధానవాదు లను వేఱొక తెగవారు గలరు. వారీ తాత్పర్యశక్తి నంగీకరింపరు. వారి సిద్ధాంత మిది :—

"గామానయ (గోవును దెమ్ము) అని యుత్తమవృద్ధుఁడు (పెద్దవాఁడు) మధ్యమవృద్ధునితో (యువకుఁడు) చెప్పఁగా మధ్యమవృద్ధుఁ డద్దానినిఁ దెచ్చుచుంటను జూచుచున్న బాలుఁడు, ఆవాక్యమునకు "ఒకానొక సాస్నా(గంగడోలు)దిమంతమగు పిండమును గొనితెచ్చుట" యని సాముదాయికముగా గ్రహించును. కాని ప్రత్యేకముగా "నీ పదమున కిది యర్థము" అని గ్రహింపఁజాలఁడు. పిమ్మట 'గాం బధాన' (గోవును గట్టుము) 'అశ్వమానయ' (గుఱ్ఱమును దెమ్ము) అను వాక్యములను విని వెనుకటి 'గోవును దెమ్ము' వాక్యములోని గోవువంటి వ్యక్తినే కట్టివేయుటను జూచి 'గోవు' అనఁగా 'ఇది' యని యర్థమును గ్రహించును. 'గుఱ్ఱమును దెమ్ము' అను వాక్యమును విని గుఱ్ఱమును దెచ్చుటను జూచి ఆనయ (తెమ్ము) పదము వెనుక 'గామానయ' వాక్యములోని 'ఆనయ' (తెమ్ము) పదమువంటిదే యనుకొని దాని యర్థమును గ్రహించును. ఈవిధముగా వాక్యార్థమువలననే ప్రత్యేక పదముల యర్థము గోచరించును." వీరి మతమునఁ బదముల యర్థమును గలుపుటకుఁ దాత్పర్యశక్తి యక్కఱలేదు. ఏలన వాక్యార్థమే ముందు గోచరించుచున్నది.

అభిహితాన్వయవాదులు "మొదటఁ బదములవలన నర్థబోధ; పిమ్మట వాక్యార్థబోధ" యందురు. అన్వితాభిధానవాదులు "మొదట వాక్యార్థబోధ; పిమ్మటఁ బదార్థబోధ" యందురు.

ప్రతాపరుద్రీయములో "తాత్పర్యార్థోఽపి వ్యంగ్యార్థ ఏవ న పునః పృథగ్భూతః (తాత్పర్యార్థముగూడ వ్యంగ్యార్థమే కాని భిన్నముగాదు) అని వ్రాయఁబడియున్నది. అట్టిచో "గోవును దెమ్ము" అను వాక్యములోని తాత్పర్యార్థమే వ్యంగ్యార్థమా? వ్యంగ్యార్థము రమణీయముగా నుండవలయును గదా! అని శంక గలుగుచున్నది. ప్రతాపరుద్రీయకారుని మతమునఁ దాత్పర్యార్థమన మీమాంసకుల పదముల విశిష్టార్థమును మాత్రమే బోధించుశక్తి గాదు. ఆలంకారికుల తాత్పర్యమిది :—

"తస్మిన్ పరాః తత్పరాః; తేషాంభావః తాత్పర్యం" అని వ్యుత్పత్తి. ఇట తచ్ఛబ్దమునకు 'వక్త తన బుద్ధిచే సహృదయ హృదయానుభవమునకుఁ దెచ్చిన రసాదులు.' 'తత్పరాః' అనఁగా నారసాసక్తములగు విషయములు. వాని భావము తాత్పర్యము. కేవల పదార్థాన్వయమును మాత్రమే తెలుపుట కవియొక్క పనిగాదు. ఆ వాక్యార్థములకంటె రమణీయమగు వాక్యార్థమును దెలుపుట యతనిపని. అదియే యాలంకారికుల తాత్పర్యము. భావప్రకాశములో.

"అతోధ్వన్యాఖ్య తాత్పర్యగమ్యమానత్వతః స్వతః
కావ్యే రసాలంక్రియాదిర్వాక్యార్థో భవతి స్ఫుటం"

తా. "ధ్వనియను పేరు గలిగి తాత్పర్యరూపముగా గమ్యమానమగునది. కానఁ గావ్యమున రసాలంక్రియాదులే వాక్యార్థము" అని తాత్పర్యము, ధ్వనియు నేకముగాఁ దెలుపఁబడినది.

ఈ తాత్పర్యమునకు భావము, అభిప్రాయము, ఉద్దేశము అనియు నామాంతరములు. ఈ తాత్పర్యమును వ్యంగ్యార్థమును భిన్నములుగావు.

## అభిధావృత్తి

"సతతసంకేతితార్థగోచర సుశబ్దధామము" అని దీనిలక్షణము. "సంకేతితమగు నర్థమును బోధించు శబ్దము నాశ్రయించియుండునది" అని దీని భావము. ఇందు 'గోచర సుశబ్దధామము' అనఁగా నిష్కృష్టమగు నభిప్రాయము తేలకున్నది. మరియుఁ బైఁ జెప్పఁబడిన లక్షణముగూడా డొంకతిరుగుడుగా నున్నది. "సంకేతితమగు నర్థమునుబోధించు శబ్దశక్తి యభిధ" అనినచో సూటిగా నుండును. సంకేతి

ళార్థమనఁగా వాచకముయొక్క ముఖ్యార్థము లేక వాచ్యార్థము. దానిని బోధించు శక్తి యభిధ. సంకేతమన శబ్దమునకును దాని యర్థమునకును గల పరస్పర సంబంధమును నిర్ణయించుట. (సంకేతశ్శబ్దార్థయోః స్సంబంధావధారణం) అనఁగా నీ శబ్దము వలన నీ యర్థము బోధపడవలెనను నీశ్వరేచ్ఛయే సంకేతమని ప్రాచీనులును, లోకేచ్ఛయే సంకేతమని నవ్యులును జెప్పుదురు.

ఈ సంకేత మీ క్రిందివానిచేఁ గ్రాహ్యమగును.

వ్యాకరణము, ఉపమానము, ఆప్తవాక్యము, వ్యవహారము, వివరణము, అన్య పదములయొక్క సాన్నిధ్యము వీనివలన నా సంకేతము గ్రాహ్యమగును. ఎట్లన, 'కర్త' అను పదమున కర్థమేమన్నచో వ్యాకరణ మిచ్చుటఁ బ్రకృతి ప్రత్యయవిభాగముచేసి యే యర్థమున నే ధాతువున కే ప్రత్యయము వచ్చెనో తెలుపును. దాన నర్థము తేటపడును. 'గవయము (ఒక జంతువు) గోవువలె నుండును' అను నెడ నీ యుపమానముచే గవయ శబ్దముయొక్క సంకేతము గ్రాహ్యమగును. ఆప్తులనఁ బెద్దలు. వా "రీ శబ్దమున కిది సంకేతము" అని చెప్పుటవలనను గ్రాహ్యమగును. వ్యవహారమన మీమాంసకమతమున నన్వితాభిధానవాదులు తెలిపిన మతము. దానినిఁ బట్టియు సంకేత మేర్పడును. వివరణమన "ఘటమనఁ గలశము" అనునది. దీనివలనను సంకేతము గ్రాహ్యమగును. అన్యపద సన్నిధివలన సంకేతము గ్రాహ్యమెట్లగునో ముందు బోధింపఁబడును. (చూ. పురారాతి యగు దేవరకు.)

అట్టి సంకేతముగల యర్థమును బోధించు శక్తియే యభిధ. అభిధాశక్తితోఁ గూడిన శబ్దములు వాచకములని తెలుపఁబడెను.

ఈ సంకేతము స్వరూప స్వభావమును బట్టి నాలుగు విధములు. ౧. జాతిసంకేతము, ౨. గుణసంకేతము, ౩. క్రియాసంకేతము, ౪. ద్రవ్యసంకేతము.

జాతిసంకేతమును దెలుపు పదములు జాతివాచకములు. ఉదా॥ గోవు. 'గోవు' అని చెప్పఁగానే యీ పద మొకానొక గోవును దెలుపునా? అన్నిగోవులను దెలుపునా? ఒకగోవును దెలుపునన్నచో నితరగోవులను దెలుపుటకు నొక్కొక్క పదమును వాడవలసియుండును. అనఁగా నిది గోవు; ఇదిగోవు; ఇదిగోవు; అని యనంతముగా గోపదములను జెప్పవలసియుండును. ఇది గౌరవముగదా! కాన నన్నిగోవులను బోధించునని చెప్పవలెను. అనఁగా గోజాతినంతను బోధించును. గోజాతి యనఁగా నేమి? గోవునందు 'గోత్వము' అనునది ధర్మము. అనేకవ్యక్తులయందనుగతముగా నుండుధర్మము జాతి. గోత్వమునునది యనేకవ్యక్తులయం దనుగతమగు ధర్మముగదా!

ఇట్లే ఘటత్వము, పటత్వము, మొదలగునవన్నియు జాతులే. గోత్వ, ఘటత్వ, పటత్వాదులుగల గోవు, ఘటము, పటము మొదలగుశబ్దము లన్నియు జాతివాచకములు. (వీనినే యాంగ్లమున Common nouns అందురు) జాతినిఁ దెలుపునది జాతివాచకము. గోశబ్దాదులు జాతివాచకములన గోత్వాదులను దెలుపుననిభావము. అనఁగా మనము "గోవును దెమ్ము" అని ప్రయోగింపఁగానే 'గోత్వమును' దెమ్ము అని యర్థమువచ్చును. గోత్వమును దెచ్చుట యెట్లు? కాన గోత్వమనుజాతి కార్యకారికాదు గాన నఁగా గోత్వమును దెచ్చుట సాధ్యముగాదు గాన గోత్వరూప జాతిచే 'గోవే' ఆక్షేపింపఁబడును. కాన, గోవు, ఘటము, పటము మొదలగు పదములు జాతివాచకములు.

గుణసంకేతముగల పదములు గుణవాచకములు. ఉదా: శుక్ల, నీల, పీతాది పదములు గుణసంకేతముగలవి.

క్రియాసంకేతముగల పదములు క్రియావాచకములు. ఉదా: వండుచున్నది. ఇట వంటయనఁ బొయిమీఁదబెట్టి యుడికినసిమ్మటఁ గ్రిందికిదించుటవఱకుఁ గల వ్యాపారము. ఇట్టి వ్యాపారమును బోధించు పదములు క్రియావాచకములు.

ద్రవ్యసంకేతముగల పదములు ద్రవ్యవాచకములు. ఉ॥ రాముఁడు. ఇట ద్రవ్యమన నామము. రామపద మొకరికి సంకేతము. ఇట్టివి ద్రవ్యవాచకములు.

కొందఱు గోశబ్దము గోత్వమనుజాతిని బోధించునట్లే శుక్ల, నీలాది గుణవాచకములును శుక్లత్వ, నీలత్వాది జాతులనే బోధించునుగదా! అట్లే 'వండుచున్నది' మొదలగు క్రియలుగూడ వంటలజాతినే బోధించును. అట్లే రామాది ద్రవ్యవాచకములుగూడ రామత్వాదిజాతులను బోధించును. రాముఁడు లేకవ్యక్తులు. అనేకవ్యక్తులున్నఁగాని జాతి యేర్పడదు. రామత్వాదులు జాతు లెట్లగు? నన్నచో బౌద్ధులు ప్రతిక్షణమును ద్రవ్యము భేదించునని చెప్పుదురు. అనఁగా రామాది ద్రవ్యము లేకవిధముగా సర్వకాలమును నుండదనియుఁ బ్రతిక్షణమునందును మార్పులు గలుగుచుండుననియుఁ గావున క్షణముక్రిందఁ జూచిన రాముఁడులే యీ క్షణమునఁ జూచిన రాముఁడులు గారనియు వారి సిద్ధాంతము. కావునఁ బ్రతిక్షణమును భేదించు రామాది ద్రవ్యములయందు రామత్వ రూపజాతి యుండవచ్చును. ఈవిధముగా నన్నియును జాతివాచకములే యనియు నొక మతము గలదు.

ఈవిధముగా సంకేతస్వభావమునుబట్టి శబ్దములు నాలుగువిధము లని మహాభాష్యకారుఁడు చెప్పెను. (గౌశ్శుక్లశ్చలో డిత్థః ఇతిశబ్దానాం ప్రవృత్తిః) కొన్ని

శబ్దములకు నొక్కయర్థమే సంకేతితము. మరికొన్ని శబ్దములకుఁ బెక్కర్థములు సంకేతితములై యున్నవి. అట్టిచోఁ బెక్కర్థములను బోధించు శబ్దములలోఁ బెక్కభిధా శక్తులుండునా? అన్నచోఁ బెక్కుశక్తు లుండవు. ఒకే యభిధాశక్తి యుండును. అట్టిచో నాశక్తి యన్నియర్థముల నొకతడవ బోధింపదా? అట్లు పెక్కర్థము లుపస్థితము లయ్యేనేని వాక్యార్థ మెట్లు బోధపడును? అని మరల శంకగలుగును. దీనికి సమాధాన మిది: అభిధాశక్తిని నియమించి యర్థనిర్ణయముసేయు సాధనములుగలవు

'సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాఽన్యస్య సన్నిధిః
సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తి స్స్వరాదయః
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః'

తా. సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధము, అర్థము, ప్రకరణము, లింగము, (చిహ్నము) అన్యశబ్దసన్నిధి, సామర్థ్యము, ఔచిత్యము, దేశము కాలము, లింగము, స్వరము, మొదలగునవి శబ్దముయొక్క అర్థము నిర్ణీతము కానపుడు నిర్ణయించు సాధనములు.

సంయోగము:— 'హరి సశంఖచక్రుఁడు' అనుచో 'హరి' యన నెవరు? హరిశబ్దమునకుఁ బెక్కర్థములు గలవు. ఇట నేమర్థము? అన్నచో నిచ్చటి హరి శంఖచక్రసంయోగము గలవాఁడని యర్థమగుటచే శంఖచక్రసంయోగము విష్ణువునకు మాత్రమే కలదు. కాన 'హరి' యన 'విష్ణువే'యని యర్థము తేలును. ఇట శంఖచక్రసంయోగము 'హరి' పదమునకు 'విష్ణువే' యను నర్థమును బోధింప నభిధను నియమించును.

విప్రయోగము:—"అశంఖచక్రుఁడగు హరి" (శంఖచక్రములులేనిహరి) ఇట 'హరి' పదమున కేయర్థ మన్నచో శంఖచక్రవియోగము 'హరి' పదమునకు 'విష్ణువే' యను నర్థమును బోధింప నభిధను నియమించును.

సాహచర్యము:—'రామలక్ష్మణులు' అన్నచో రామశబ్దమునకు నర్థమేమి? లోకమున 'రామ' శబ్దమునకు దాశరథిరాముఁడు, పరశురాముఁడు, బలరాముఁడు నని మూఁడర్థములు గలవు. ఇందేమర్థమన్నచో లక్ష్మణసాహచర్యము దాశరథి రామునకేకలదు గాన నిట నా సాహచర్యము 'రామ' పదమునకు 'దాశరథిరాముఁ' డని యర్థమును బోధింప నభిధను నియమించును.

విరోధము:— 'రామార్జునులు' అనుపదమున రామార్జును లెవరు? రామశబ్దమునకుఁ బైని మూఁడర్థములను జూపితిమికదా! అర్జునపదమునకుఁ బాండవార్జునుఁడు,

కార్తవీర్యార్జునుఁడు నను రెండర్థములు గలవు. ఇటనేమర్థ మన్నచో లోకమున భార్గవరాము, కార్తవీర్యార్జునులకుఁ గల విరోధమునుబట్టి రామశబ్దమునకుఁ బరశు రాముఁ డనియు, నర్జున శబ్దమునకుఁ గార్తవీర్యార్జునుఁడనియు నర్థమును బోధింప నా విరోధ మభిధను నియమించును.

అర్థము (ప్రయోజనము);— "సంసారచ్ఛేదమునకై స్థాణువును భజింపుము" అన్నచో స్థాణువన నేమి? ఈపదమునకు మొద్దు, శివుఁడు నను రెండర్థములుగలవు. ఇటనేమర్థ మన్నచో సంసారచ్ఛేదనరూప మగు ప్రయోజనమునకై భజింపఁదగిన వాఁడు శివుఁడుగాని వట్టిమొద్దు గాదు. కావున నిటనర్థము (ప్రయోజనము) స్థాణు శబ్దమునకు శివుఁడను నర్థమును బోధింప నభిధను నియమించును.

ప్రకరణము:— "దేవరకు సర్వము దెలియును" (సర్వంజానాతి దేవః) ఇట దేవర (దేవ) పదమునకు 'మీరు' అను నర్థమును బోధింపఁ బ్రకరణ మభిధను నియమించును.

లింగము (చిహ్నము):— మకరధ్వజుఁడు కోపించును. మకరధ్వజ శబ్దము నకు మన్మథుఁడు, సముద్రుఁడు నని యర్థద్వయము గలదు. ఇట నేయర్థమన్నచోఁ గోపరూపమగు చిహ్నము చేతనుఁ డగు మన్మథునికిఁ గలదు. కాని సముద్రుని కుండదుగదా! కానఁ గోపరూప చిహ్నము మకరధ్వజ శబ్దమునకు మన్మథుఁడను నర్థమును బోధింప నభిధను నియమించును.

అన్యశబ్దసన్నిధి:— "పురారాతి యగు దేవరకు" ఇటఁ బురారాతి యను నన్యశబ్దసన్నిధి 'దేవర' పదమునకు 'మీరు' అను నర్థముగాక శంభుఁ డను నర్థమును బోధింప నభిధను నియమించును.

సామర్థ్యము:— 'మధువుచేఁ గోకిల మదించినది' మధుపదమునకు మద్యము, వసంతము అను రెండర్థములు గలవు. ఇట నేమర్థమన్నచోఁ గోకిలకు మదమును గలిగించు సామర్థ్యము వసంతునికిఁ గలదు. కాన నిటఁ గోకిల మదకారణ సామర్థ్యము 'మధు' పదమునకు వసంతుఁడను నర్థమును బోధింప నభిధను నియ మించును.

ఔచిత్యము:— 'ప్రియురాలి ముఖము మిమ్ము రక్షించుఁగాత' ముఖశబ్దము నకు సమ్ముఖము, వదనము, అను రెండర్థములును గలవు. ఇట నేమర్థమన్నచోఁ బ్రియురాలి సమ్ముఖము రక్షించుననుచో నుచితముగా నుండును. కాన నిట నౌచిత్యము ముఖశబ్దమునకు సమ్ముఖ మను నర్థమును బోధింప నభిధను నియమించును.

దేశము:— "పరమేశ్వరుఁ డిట వెలయుచున్నాఁడు" పరమేశ్వర శబ్దమునకు లోకమున రాజు, దేవుఁడు నను రెండర్థములు గలవు. 'ఇట' అన రాజధానీరూపమగు 'దేశము' అని యర్థము. దేశవాచకమగు 'ఇట' అనునది పరమేశ్వర శబ్దమునకు 'రాజు' అను నర్థమును బోధింప నభిధను నియమించును.

కాలము:— "చిత్రభానువు ప్రకాశించుచున్నాఁడు" చిత్రభాను వనఁగా నగ్నియు, సూర్యుఁడు నని యర్థము. ఈ పదమును బగటఁ బ్రయోగించినచో 'సూర్యుఁడు' అనియు, 'రాత్రి' ప్రయోగించినచో 'నగ్ని' యనియు నర్థమగును. ఇటఁ 'గాలము' (పగలు - రాత్రి) ఆ యా యర్థములను బోధింప నభిధను నియమించును.

వ్యక్తి (లింగము):— "మిత్ర మొప్పుచుండెను" మిత్ర శబ్దమునకు 'సఖుఁడు' సూర్యుఁడు నని యర్థద్వయము గలదు. ఇట నపుంసకలింగముగా మిత్రశబ్ద ముపయోగింపఁబడినది. కాన స్నేహితుఁ డనియే యర్థము. ఇట నపుంసకలింగము స్నేహితుఁ డను నర్థమును బోధింప నభిధను నియమించును.

స్వరము:— స్వరము వేదమునందే యర్థవిశేషమును బోధింప నభిధను నియమించును. (స్వరమన ఉదాత్త, అనుదాత్త, స్వరితములు) ఎట్లన వృత్రాసురుఁడు తా నింద్రుని జయింపఁగోరి "ఇంద్రశత్రుర్వర్ధస్వ" (ఇంద్రుఁడు శత్రువుగాఁగల యో వృత్రాసురుఁడా! వర్ధిల్లుము) అని తన్నుగుఱించి తానుచ్చరించుచుండెను. "ఇంద్ర శత్రు" పదమునకు "ఇంద్రుఁడైన శత్రువు" (ఇంద్రశ్చ అసౌశత్రుః) అనియు, ఇంద్రుఁడు శత్రువుగాఁగల (ఇంద్రః శత్రుః యస్యసః) అనియును విగ్రహములు చెప్పవచ్చును. అనఁగాఁ గర్మధారయముగాని బహువ్రీహి గాని చెప్పవచ్చును. అట్టిచోఁ గర్మధారయమున నొకస్వరము, బహువ్రీహిలో నొకస్వరమును జెప్పవలయును. వృత్రాసురుఁడు బహువ్రీహిపరముగా నెంచియు, బహువ్రీహి సమాస స్వరము నుచ్చరింపక కర్మధారయ స్వరముతో నుచ్చరించెనఁట. దాన "ఇంద్రుఁడా! వృద్ధినొందుము" అని యర్థము వచ్చినది. దాన నింద్రునకే జయముగలిగి వృత్రాసురుఁడు నశించెనఁట. ఈయభిప్రాయమును దెలుపు శ్లోకమును గనుఁడు.

శ్లో॥ మంత్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో నతదర్థమాహ
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్

తా. స్వరవర్ణహీనమైనమంత్రము తన స్వాభావికార్థమును బోధింపక భిన్నార్థమును బోధించును. దాన నది పిడుగై యజమానుని పొంత్తును. స్వరకృతమైన యపరాధమున వృత్రాసురుఁడు నశించెను.

'స్వరాదులు' అనుచోట నున్న 'ఆది' పదముచే నభినయాదులుగూడఁ దత్తదర్థమును బోధింప నభిధను నియమించును.

"ఏతావన్మాత్ర స్తనికా ఏతావన్మాత్రాభ్యా మక్షిపత్త్రాభ్యాం
ఏతావన్మాత్రావస్థా ఏతావన్మాత్రైర్దివసైః

తా. ఇంతింత (ఔన్నత్యవర్తులత్వములుగల) చన్నులుగల యువతి యింతింత (వైశాల్యము) కన్నులతో, ఇన్ని (సంఖ్య) దినములలో ఇట్టి (కార్శ్యము) యవస్థకుఁ బాల్పడినది.

ఇట నభినయము "ఏతావన్మాత్ర" పదముయొక్క యాయాయర్థములను బోధింప నభిధను నయమించును.

ఈవిధముగా సంయోగాదులు వాచకమున కనేకార్థములు సంకేతములైనపుడొక్కయర్థమును మాత్రమే బోధింప నభిధను నియమించును.

## వాచక భేదములు

ఈ వాచకపద మర్థబోధక స్వభావమునుబట్టి యౌగికము, రూఢము, యోగరూఢము, యౌగికరూఢము, అని నాలుగువిధములు. వెనుక స్వరూప స్వభావమును బట్టియు, నిట నర్థబోధక స్వభావమునుబట్టియు భేదములు.

౧. అవయవార్థమును (వ్యుత్పత్త్యర్థమును) మాత్రము బోధించు శబ్దము యౌగికము. ఉదా॥ పాచకుఁడు. పచతీతిపాచకః = వంటను జేయువాఁడు అను వ్యుత్పత్త్యర్థమాత్రమే బోధింపఁబడును. సామాన్యముగా 'వంటలవాఁడు' అను నర్థమేకానీ ఫలాని జాతివాఁడని యర్థమురాదు.

౨. అవయవార్థముతోఁ బనిలేక సముదాయార్థమునే బోధించు పదము రూఢము. ఉదా॥ ఆకాశము, బల్ల, పుస్తకము మొ॥ ఈ పదముల కవయవార్థము లేదు. అనంతకాలమునుండి యివి రూఢిగా నొక యర్థమును బోధించుచున్నవి.

3. అవయవార్థమును బోధించుచున్నను విశేషించి సముదాయార్థమునే బోధించు పదము యోగరూఢము. ఉదా॥ పంకజము. ఇది "పంకమువలనఁ బుట్టునది" అను నవయవార్థమును బోధించుచున్నను 'పద్మము' అను నర్థమునందే

రూఢమై యున్నది. మిగిలిన 'నత్తపల్లి' మొదలగు నర్థములను బోధింపదు. యౌగికార్థమును రూఢ్యర్థమును గలది యోగరూఢము.

౪. యౌగికార్థమును, రూఢ్యర్థమును నీ రెండును నే శబ్దమువలనఁ బోధింపఁబడునో యది యౌగికరూఢము. ఉదా॥ ఉద్భిద్ (ఉద్భిదము) "ఉద్భేదించునది" అను నవయవార్థమునుబట్టి 'తరుగుల్మాది' యనియు, రూఢ్యర్థమునుబట్టి యాగవిశేషమనియు నర్థద్వితయమును నీ శబ్దము స్వతంత్రముగా బోధించును. ("ఉద్భిదాయజేత పశుకామః" అనుచోట 'ఉద్భిత్' అనఁగా యాగవిశేషము.)

ఈ యౌగికరూఢమును ముక్తావళీకారుఁడు దెలిపెను. రసగంగాధరమున దీని ప్రశంస లేదు.

మరియుఁ బదములు విచిత్ర స్వభావములు గలవి. కొన్ని పదములలో నేకదేశమే యర్థమును బోధించును. ఎట్లన, భీమసేన, బలదేవ ప్రభృతిపదములలో నాద్యమగు భీమ, బల, అను నేకదేశమే యర్థమును బోధించును. మతంగజ, వసుంధరా, ధరాధర ప్రభృతిపదములలోఁ జరమభాగమగు గజ, ధరా, ధర ప్రభృతిపదములే యర్థమును బోధించును. ఇట నేకదేశశ్రవణముచేతనే యర్థస్ఫూర్తి గలుగుచున్నది. మరియు అపాంసుల (పాంసుల గానిది) అనిందితుఁడు (నిందితుఁడు గానివాఁడు) మొదలగు పదములందలి 'ప్రతిషేధము'త్కృష్టమగు నితరార్థమును సంపాదించును. పాంసుల = కులట; అపాంసుల = పతివ్రత; నిందితుఁడు = దూషితుఁడు; అనిందితుఁడు = పూజితుఁడు మొ॥ అనుష్ణ, శీతేతర ప్రభృతిపదములు ప్రతిద్వంద్వియగు నర్థమునుబోధించును. అనుష్ణము = శీతము; శీతేతరము = ఉష్ణము మొ. ఒకానొకపదము రూఢ్యర్థము నపేక్షింపదు. అనఁగా నా పదము రూఢమైనను రూఢ్యర్థము నపేక్షింపక యౌగికార్థమును నపేక్షించును. "సింహాదవాపద్విపదం నృసింహః" నృసింహుఁడు (నరులను హింసించువాఁడు) సింహమువలన విపత్తినిఁ బొందెను. 'సింహ' శబ్దమునకు "హినస్తీతిసింహః" చంపును గావున 'సింహము' అని యౌగికార్థము. కాని యిది హర్యక్షమునందురూఢమైయున్నది. అయితే'నృసింహ' పదములోని సింహపదమున కిటఁ'జంపువాఁడు' అను యౌగికార్థమే యపేక్షితమై యున్నది. కొన్నిపదములకు యౌగికార్థ మనపేక్షితమై యున్నది. 'క్షీరాంభోధి' క్షీరాబ్ధి; ఇట 'అంభోధి' అబ్ధిపదములకు యౌగికార్థము నపేక్షింపరాదు. 'వామ' శబ్దమును వామనయనా, వామోరూ, అను నెడలనే ప్రయోగింపవలెను, కాని వామపదనా, వామపాణీ, మొదలగునెడమునఁ బ్రయోగింపరాదు.

నరసభూపాలీయ కర్త ప్రతాపరుద్రీయము ననుసరించి యోగమూలాభిధ, రూఢిమూలాభిద, అను రెంటి నే యనఁగా యౌగికములు, రూఢములు అను రెండు భేదములనే చూపెను. కాని యీ నాలుగుభేదములను దెలియఁదగినవి. కా దెలిపితిమి.

౧. యోగమూలాభిధ కుదాహరణము.—

చ. అలఘుబలాభిరాముఁడగు నౌబళరాజన్నసింహమేదినీ
తల బలవైరి దానజలధారలనిచ్చటఁ దేలి తేలి త
ద్గళితవిరోధి శోణితనదమ్ములనిమ్ములఁగూడి కూడి యా
జలధులు వాహినీశులనఁ జాలఁ జెలంగుఁ బయోనిధానముల్. ౯౬

ఇందలి వాహినీశులు, పయోనిధానములు, అనువానికిఁ గేవలవ్యుత్పత్త్యర్థములను బట్టి సముద్రుఁడని యర్థము. ఇవి యౌగికములు.

ఈ యోగమూలాభిధకు యోగపూర్వాభిధయనియు నామాంతరము. అనఁగా యౌగికార్థమును బోధించు శబ్దశక్తియని భావము. ఇట నిట్లనుటకన్న యౌగికవాచకమున కుదాహరణమన్నచో విస్పష్టముగా నుండును.

౨. రూఢి మూలాభిధ కుదాహరణము.

కం. కులమణినై బలవద్రిపు
కులగిరి కులిశంబునై, యకుంఠితధర్మా
కలనకలాలాలసుఁ డయి
వెలయు న్నరసింహవిభుఁడు విశ్వోన్నతుఁడై. ౯౭

బలవద్రిపు (పా) బలవదబల.

ఇటఁ గుల, మణి, రిపు, గిరి, కులిశాది పదము లన్నియు రూఢములే. వీనిశక్తి రూఢిమూలాభిధ. ఈపదములు రూఢములు.

పైపద్యమునందలి బలవైరి, జలధి పదములు యోగరూఢములు. దానపదము ఈవి - ఖండనము అను నర్థద్వయమునందును బ్రసిద్ధముగాన యౌగికరూఢము.

## లక్షణావృత్తి

గీ. ఇంక లక్షణ వివరింతు; నిదియు గౌణ
వృత్తియు నభిన్నమెపొల్లు; నెట్టలన

'క్షోణీసురుఁ డగ్ని' యనునెడ శుచిగుణంబు
వాచ్యవిభవాభిభావియై వరలుకతన. ౫౦

ఇక లక్షణను వివరింతును. గౌణవృత్తియు లక్షణయు నొక్కటే. భేదము లేదు. "గౌణవృత్తిరపిలక్షణా ప్రభేదఏవ" అని ప్రతాపరుద్రీయము. (కాని ప్రాభాకరులను నొక పూర్వమీమాంసకశాఖీయులు గౌణవృత్తియు లక్షణయును భిన్నమే యని చెప్పుదురు) ఎట్లన "బ్రాహ్మణుఁ డగ్ని" అన్నపుడు "గంగాయాం ఘోషః" (గంగలో గొల్లపల్లె) అనుచోట గొల్లపల్లెయందు శీతత్వ పావనత్వాదులెట్లు వాచ్యముగాఁగాక వ్యంగ్యముగా శోభిల్లునో యట్లే యగ్నిగత శుచిగుణము (పరిశుద్ధతయను గుణము) బ్రాహ్మణునియందు వాచ్యముగాఁగాక (వాచ్యమును దిరస్కరించి) వ్యంగ్యరూపమున శోభిల్లుచున్నది.

ఇట "గౌణవృత్తి లక్షణాప్రభేదమే" యని చెప్పుటకు గ్రంథకర్తయిచ్చిన 'శుచిగుణంబు వాచ్యవిభవాభిభావియై వరలుకతన' అను కారణము సూటిగాలేదు. క్లిష్టముగానున్నది. ప్రతాపరుద్రీయములో 'గౌణవృత్తిరపి లక్షణాప్రభేదఏవ। సంబంధానుపపత్తిమూలకత్వాత్। యథాగ్నిర్మాణవక ఇత్యత్ర అగ్నిసాదృశ్య విశిష్టమాణవక ప్రతిపత్తిర్వివక్షితా తథైవ గంగాయాంఘోషః ఇత్యత్ర గంగాసంబంధ విశిష్టతీరప్రతిపత్తిర్వివక్షితా" (గౌణవృత్తి లక్షణలో నొక భాగమే. 'గంగాయాం ఘోషః' అనుచోట ముఖ్యార్థానుపపత్తి గలిగినట్లే "అగ్నిర్మాణవకః" అనుచోటఁ గూడ ముఖ్యార్థానుపపత్తి గలుగుచున్నది. కాన సంబంధానుపపత్తి రెంటను సమానము. మరియు 'గంగాయాం ఘోషః' అనుచోట గంగాసంబంధి యగు తీరమను నర్థము వివక్షితమైనట్లే "యగ్నిసదృశమాణవకుఁడు" అను నర్థము వివక్షితము.) అని కలదు. కాన గౌణవృత్తి లక్షణలకభేదమును బ్రస్తావించునపుడు 'సంబంధానుపపత్తిని'ఁ గారణముగాఁ దెలుపవలెను. "శుచి గుణంబు ... వరలుకతన"ఇత్యాదికమగువచనముచే గౌణవృత్తిలక్షణలెట్లభిన్నములో నిస్సందిగ్ధముగా గోచరింపవు.

ఇట మొదట 'లక్షణ' యననేమో తెలుపక 'గౌణవృత్తి లక్షణాప్రభేదమే' అని చెప్పుట యుక్తముగాదు.

క౦. బంధురయగు లక్షణ, సం
బంధానుపపత్తి మూలభావన; నది సం
బంధ నిబంధన, సామ్యని
బంధన యని రెండుగతులఁ బరగుచునుండుఁ. ౫౧

తా. సంబంధానుపపత్తివలన లక్షణ యేర్పడును. అది సంబంధనిబంధన, సామ్యనిబంధన యని ద్వివిధము. నిబంధనమనఁగా మూలము. సంబంధమూలకమగు లక్షణయనియు, సామ్యమూలకమగు లక్షణయనియు నని భావము. "సంబంధానుపపత్తివలన లక్షణ యేర్పడును" అను లక్షణ మసమగ్రము. కావ్యప్రకాశమున

"ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్"

అని లక్షణము చెప్పఁబడినది. దీని వివరణ మిది :—

ముఖ్యార్థమునకు బాధకలుగఁగా, రూఢినిఁబట్టి కాని ప్రయోజనమునుబట్టికాని ముఖ్యార్థముతో సంబంధము గల వేఱొక యర్థమును లోకమునందలి రూఢినిఁబట్టి కాని లేక యొకానొక ప్రయోజనమునుబట్టి కాని స్ఫురింపఁజేయు శబ్దశక్తి లక్షణ. వాచ్యార్థసంబంధములేని లక్షణ యుండదు. అనఁగా వాచ్యార్థమునకు బొత్తుగా నెట్టి సంబంధమునులేని లక్షణ యుండదు. "గంగలో గొల్లపల్లె" అనుదానికి "కొండమీఁది కోఁతి" అనునది లక్ష్యార్థమై యుండదు. ఇందు గమనింపవలసిన ముఖ్యవిషయములు మూఁడు. ౧. ముఖ్యార్థమున కనుపపత్తి. ౨. దాని సంబంధము. 3. వేఱొకయర్థమును జెప్పుకొనుటకు రూఢికానీ ప్రయోజనముకానీ యుండుట.

చూడుఁడు. "గంగాయాం ఘోషః" అను నుదాహరణముఁ దీసికొందము. "గంగలో గొల్లపల్లె" (ఉన్నది) అను నర్థము పొసగదు. ఏలన. గంగలో గొల్లపల్లె యుండదు. కాన వాచ్యార్థమున కనుపపత్తి గలిగినది. కాఁబట్టి దాని సంబంధముగల వేఱొక యర్థమును జెప్పుకొనవలెను. 'గంగాయాం' అనుదానికి 'గంగలో' అను నర్థముగాక 'గంగాతీరమున' అను నర్థమును జెప్పుకొందుమేని నర్థము సరిపడును. అయితే యీ యర్థమును జెప్పుకొనుటకు లోకమున 'గంగాయాం' అనఁగా 'గంగాతీరమున' అని రూఢ్యర్థమైన నుండవలెను. లేదా ? ఏదేనిఁ బ్రయోజనమైన నుండవలెను. ఇట లోకరూఢి లేదు. ఇఁకఁ బ్రయోజనముండవలయును. "గంగాతీరమున" అని చెప్పుటవలన గంగలోని శీతత్వ పావనత్వాదులు గొల్లపల్లెలోఁ గూడఁ గలవు. అను నర్థమును స్ఫురించుటయే ప్రయోజనము. ఈ ప్రయోజనము "గంగాయాం ఘోషః" అని వాచ్యార్థానుపపత్తితోఁ జెప్పుటవలన భాసిల్లినట్లు "గంగాతీరే ఘోషః" అని చెప్పినను భాసిల్లదు. కాన నిటఁ బ్రయోజనమునుబట్టి గంగాశబ్దమునకు 'గంగాతీరము' అను నర్థమును జెప్పుకొనవలెను. ఈ యర్థమును దోఁపించు శక్తియే లక్షణ.

ఇట్టివే సామాన్యముగా వ్యవహారములో, బెక్కు ప్రయోగములు గనఁబడుచున్నవి. 'మా యిల్లు రోడ్డుమీఁదనే యున్నది' అందుము. ఇట నిల్లు రోడ్డుమీఁద

లేదు. కావున ముఖ్యార్థానుపపత్తి యేర్పడినది. 'రోడ్డుప్రక్కనే యున్నది' అని వాచ్యార్థ సంబంధముగల వేఱొకయర్థమును జెప్పుకొనుచున్నాము. ఇట "మాయిల్లు విస్పష్టముగా నెల్లరకును గోచరించును" అనునది ప్రయోజనము. మా యిల్లు రోడ్డు మీఁదనే యున్నదని చెప్పుటవలన నీ ప్రయోజనము భాసిల్లునట్లు 'మాయిల్లు రోడ్డు ప్రక్కనే యున్నది' అని చెప్పినను భాసిల్లదు. ఇదియే సంబంధనిబంధన. అనఁగా వాచ్యార్థ సంబంధము గల లక్షణ.

'బ్రాహ్మణుఁ డగ్ని' అను వాక్యము గలదు. బ్రాహ్మణుఁ డగ్ని యగునా? కాదు. వాచ్యార్థానుపపత్తి యేర్పడినది. కాన దాని సంబంధముగల వేఱొక యర్థమును జెప్పుకొనవలెను. అగ్నియందుఁ గల 'శుచిగుణము' బ్రాహ్మణునియందుఁ గూడ నుంటచే 'అగ్నిసదృశుఁడు బ్రాహ్మణుఁడు అను నర్థమును జెప్పుదుము. దీనికిఁ బ్రయోజనముగాని రూఢిగాని యుండవలెను. 'బ్రాహ్మణుఁ డగ్ని' యను రూఢి లేదు. అగ్నియందున్న శుచిత్వ పవిత్రత్వాదులు బ్రాహ్మణునియందు గోచరించుటయే ప్రయోజనము. 'అగ్నిసదృశుఁడు బ్రాహ్మణుఁడు అని చెప్పినను 'బ్రాహ్మణుఁ డగ్ని' అని చెప్పుటవలన నా ప్రయోజనము గోచరించినట్లు గోచరింపదు. ఇట్టివే 'ఆమె రంభ' 'అతఁడు సత్యహరిశ్చంద్రుఁడు' మొదలగునవియు సామ్యనిబంధనా లక్షణలు.

సంబంధనిబంధనా, సామ్యనిబంధనా లక్షణములలోఁ బ్రయోజనమున కుదాహరణములు చూపితిమి. రూఢి కుదాహరణము లిటఁ జూపుచున్నాము.

'వాఁడు పనిలోఁ గుశలుఁడు' లోకమునఁ 'గుశల' శబ్దమునకు గుశలను గ్రహించువాఁడు (కుశాన్ లాతీతి కుశలః) అని వ్యుత్పత్త్యర్థము. అదియే ముఖ్యార్థము. కుశలను గోయుట, గ్రహించుట మొదలగు పనులు క్లేశావహములు. ఒకప్పుడు చేతులు చీల్చుకొనిపోవును. కాన నట్లు చీల్చికొనిపోకుండ నేర్పుగాఁ గుశలను గ్రహించువాఁడు కుశలుఁడు. "వాఁడు పనిలోఁ గుశలుఁడు" అన్నపుడీ వాచ్యార్థము పొసగదు. కాన లోకరూఢినిఁబట్టి కుశలపద మిచ్చట 'దక్షుఁడు లేక నేర్పరి' అను నర్థమును బోధించుచున్నది. ఇది సంబంధ నిబంధనా లక్షణారూఢి కుదాహరణము.

'తైల' పదమునకు "తిలలనుండి పుట్టిన చమురు" అను నర్థము ముఖ్యార్థము. ఏరండతైలము, సర్షపతైలము, అనియు నితర పదార్థములనుండి తీసిన చమురునకుఁ గూడ సాదృశ్యమునుబట్టి తైలశబ్దము లోకమున వ్యవహరింపఁబడుచున్నది. కాన 'తైల' శబ్దము సామ్యనిబంధనా లక్షణారూఢి కుదాహరణము.

రూఢినిఁబట్టి యేర్పడిన లక్షణ 'నిరూఢలక్షణ' యందురు.

గీ. అందు జహదభిధేయయు, నజహదర్థ
యనఁగ సంబంధలక్షణ యలరు; సామ్య
గుణనిబంధన తాను ద్వైరూప్యమొందు
జగతి సారోప, సాధ్యవసాయ యనఁగ. ౬౦

ఈ సంబంధనిబంధనాలక్షణ జహదభిధేయ లేక జహద్వాచ్య లేక జహల్లక్షణయనియు, అజహదర్థ లేక అజహదభిధేయ లేక అజహద్వాచ్య లేక అజహల్లక్షణ యనియును ద్వివిధము. (వీని వివరణము ముందు చేయుదుము.) సామ్యగుణ నిబంధనాలక్షణ సారోప, సాధ్యవసాయ, యనియు నిరుదెఱఁగులు. (ఇట సామ్యగుణ నిబంధన యనుటకన్న గుణసామ్య నిబంధన యనుట లెస్స.)

సీ. అల 'గంగలో ఘోష' మను నెడ 'గంగా' ప
దఁబు సంబంధియౌ తటముఁ దెల్ప
సంబంధలక్షణ జహదర్థ యగు; నల్లె
'మంచె మ్రోసె'నటన్న 'మంచగతులు'
దోఁచుఁ; "గోడండవంత్తులు వచ్చె" ననవిండ్ల
నమరు యోధులుదోఁప నజహదర్థ;
'యవనిపాలుఁడు సింహ' మను వేళ సదృశతా
గుణసిద్ధి 'సామ్యలక్షణ' చెలంగు
గీ. అందు నుపమాన, ముపమేయ మభిన్న
మైన 'సారోప'; యుపమానమగడితోప
మేయమైయున్న 'సాధ్యవసాయ'; యట్టి
లక్షణల కన్నిఁటికొన ర్తు లక్ష్యములను. ౬౧

మ్రోసెనటన్న (పా) మ్రోయునటన్న.

తా. 'గంగలో గొల్లపల్లె' యనుచోట గంగాపదము స్వార్థమును త్యజించి తనసంబంధియగు తీరమును దెలుపుచున్నది. అనఁగా గంగాపదము తన 'ప్రవాహ' మను నర్థమును విడిచి 'తీరము' అను నర్థమును గ్రహించినది. ('గంగాయాం' అన గంగాతీరము అని యర్థము) కాన జహల్లక్షణ-(జహత్ = స్వార్థమును విడుచుచున్న

లక్షణ). ఇట్లే 'మంచెలు మ్రోసె' (మంచాః క్రోశంతి) అనుచోట 'మ్రోయుట' యను వ్యాపారము చేతనధర్మము. అచేతనములగు మంచె లెట్లు మ్రోయును? కాన 'మంచెలు' అనుశబ్దము స్వార్థమగు 'మంచములు' అనునర్థమును విడిచి 'మంచగతులు' అనునర్థమును గ్రహించినది. అనఁగా "మంచములపైనున్నవా రఱచిరి" అనునర్థము వచ్చును. ఇటఁగూడ స్వార్థము విడువఁబడినది. ఇదియు జహల్లక్షణయే.

మూలమున 'మంచె మ్రోసె' అని యున్నను "మంచాః క్రోశంతి" అను సంస్కృతవాక్యము నాంధ్రీకరించుపట్ల గ్రంథకర్త గణభంగమునకు వెఱచి యేకవచన ప్రయోగము సేసెను. కాన నేను బహువచనరూపమును గ్రహించి వివరించితిని.

ఇఁకఁ "గోదండపంక్తులు వచ్చె" నన్నచోటఁ గోదండపంక్తు లచేతనములు గదా! అవి స్వయముగా నెట్లు వచ్చును? కానఁ 'గోదండధరులు' అను నర్థమును జెప్పుకొనవలెను. ఇటఁ గోదండధరులతోపాటు గోదండములుగూడ వచ్చినవి. వెనుక 'మంచెలుమ్రోసె' ననుచోట మంచగతులతోపాటు మంచము లఱవ లేదు. కానఁ 'గోదండపంక్తులు' ననుచోట స్వార్థము విడువఁబడలేదు; ఇది యజహల్లక్షణ. (అజహత్ = స్వార్థమును విడువని లక్షణ) 'కుంతములు ప్రవేశించుచున్నవి' అనుచోటఁగూడ నిట్లే గ్రహింపవలయును.

'గంగాయాంఘోషః' అనుచోట వాక్యతాత్పర్యములో 'గంగాయాం' అను ప్రవాహరూప వాచ్యార్థమునకుఁ బ్రవేశములేదు. లక్ష్యార్థమగు 'తీర' పదమునకు మాత్రమే ప్రవేశము గలదు. 'మంచెలు మ్రోసె' ననుచోటఁగూడ వాక్యతాత్పర్యమున 'మంచగతులు' అను లక్ష్యార్థమునకే ప్రవేశము గలదు. కాని 'మంచములు' అను వాచ్యార్థమునకుఁ బ్రవేశములేదు. 'కోదండపంక్తులువచ్చె' నన్నచోట వాక్యతాత్పర్యములోఁ గోదండధరులతోబాటు గోదండములకుఁగూడ ప్రవేశము గలదు. ఎట్లనఁ గోదండములులేక కోదండధరు లెట్లువత్తురు? అనఁగా నిట లక్ష్యార్థమగు 'కోదండధరులు' అనుదానిలోని వాచ్యార్థమగు "కోదండములు" అనుదానికిని వాక్యతాత్పర్యమునఁ బ్రవేశముగలదు. కావున, నేవాక్యతాత్పర్యమున వాచ్యార్థమునకు బొత్తుగాఁ బ్రవేశముండదో యది జహల్లక్షణ. ఏవాక్యతాత్పర్యమున లక్ష్యార్థములోఁగూడ వాచ్యార్థమునకుఁ బ్రవేశముండునో యది యజహల్లక్షణ. జహల్లక్షణకు లక్షణలక్షణయనియుః అజహల్లక్షణకు ఉపాదానలక్షణ యనియు నామాంతరములు. ఇవి సంబంధనిబంధనా లక్షణలు.

"అవనిపాలుఁడు సింహము" అనుచోట సింహగతములగు శౌర్యాదిగుణములు రాజునందుఁగూడ గోచరించుచున్నవి. ఇం దుపమేయమగు 'నవనిపాలుఁడు' అను

పదమును, ఉపమేయమగు సింహపదమును వాక్యమునం బ్రత్యేకముగాం బ్రయోగింపం బడియున్నవి. కాన నిది సారోపలక్షణ; ఉపమేయమును జెప్పక యుపమానమును మాత్రమే చెప్పినచో నది సాధ్యవసాయలక్షణ. ఒకరినిం గూర్చి వర్ణించుచు "సింహము వచ్చె" నన్నచో నది సాధ్యవసాయలక్షణ. ఏలన, 'సింహము వచ్చె' నన్నచో నుపమానమగు సింహపదమే కానీ వర్ణ్యుండగువానిని బోధించు పదము ప్రయోగింపంబడలేదు గదా! ఇందు సింహమునకును వర్ణ్యుండగు రాజునకును నభేద ప్రతిపత్తి తోంచును.

ఇవి రెండును సామ్యనిబంధనాలక్షణలు. (సదృశతాగుణసిద్ధి యనుటకన్న 'గుణసదృశతాసిద్ధి' అనుట లెస్స.)

ఇచ్చట 'గంగలో గొల్లపల్లె; మంచెలు మ్రోసె; అవనిపాలుండు సింహము; సింహము వచ్చె' అను నుదాహరణములను జహదజహల్లక్షణా ప్రభేదముల కిచ్చియు నందు నరసభూపాల ప్రశంస లేదని కాంబోలు నరసభూపాల ప్రశంస గల పద్యముల నిచ్చుచున్నాండు.

## జహల్లక్షణ

చ. అగణిత శౌర్యధైర్యవిభవాన్విత! యోబయనారసింహ! నీ
గగనచరాగరాగ, శిబి, కర్ణ, జయోన్నత దానలక్ష్మికిం
జగములు సంతసిల్లె; నతిసాంద్ర భవజ్జయభేరి భాంకృతి
ద్విగుణిత సైన్యఘోషముల వేవడంకెం రిపు పట్టణావళుల్. ౬౨

తా. ఓ నరసభూపాలా! కల్పవృక్షమును, శిబిని, గర్ణుని జయించిన నీదాన లక్ష్మికి లోకములు సంతసిల్లె. మిక్కిలి దట్టమైన నీ జయభేరియొక్క భాంకారము లచే నిబ్బడిగా మ్రోయుచున్న సైన్యఘోషములచే శత్రుపట్టణములు వడంకెను.

ఇట 'జగములు సంతసిల్లె' అనుచోట నచేతనములగు జగము లెట్లు సంతసించును? కాన 'జగములు' అనుపదము స్వార్థమును విడిచి 'జగజ్జనులు' అను నర్థమును గ్రహించెను. ఇట్లే రిపుపట్టణావళులు వడంకెను. అనుచోటంగూడ నచేతనములయిన పట్టణములు వడంకవు. కాన నిటం 'బట్టణ' పదము స్వార్థమగు 'నగర' మను నర్థ మును విడిచి 'పట్టణవాసులు' అను నర్థమును గ్రహించెను. అపు డర్థము సరిపడును. ఇట స్వార్థమును విడుచుటచే జహల్లక్షణ.

## అజహల్లక్షణ

కం. అసమరణరంగమున నీ
యసినటి నటియింపఁ గరుల, హరులన్, సిరులన్,
వెసనొసఁగు నౌర! యెంతటి
రసికుఁడు నీవైరి? తొబరాజనృసింహా! ౬౩

అసినటి నటియింప (పా) అసి నటియింపంగ.

ఓ నరసభూపాలా! రణరంగమున నీ యసిరూపమగు నటి నటింపఁగా నీ శత్రువు దాని నాట్యమునకు మెచ్చుకొన్నట్లు గజతురగములను, సంపదలను సమర్పించుచున్నాఁడు. (ఇదియే పద్యము వ్యాజస్తుత్యలంకారమున కుదాహరణముగాఁ గూడ నీయఁబడినది.)

ఇట 'ఒసఁగు' అనఁగా 'సమర్పించుట' అనునది వాచ్యార్థము. ఈ యర్థమిటఁ బొసగదు. ఏలన, శత్రురాజు స్వయముగాఁ దన సంపదలను సమర్పింపఁడు. కాఁబట్టి "ఉపహారరూపమున సమర్పించుచున్నాఁడు" అను లక్ష్యార్థమును బోధించును. ఇటవాచ్యార్థమగు 'సమర్పణము' అను నర్థము విడువఁబడకయే లక్ష్యార్థముతో పాటు వాక్యతాత్పర్యమునఁ బ్రవేశించినది. కాన నజహల్లక్షణ.

వేదాంతులు జహదజహల్లక్షణ యను నొక లక్షణను స్వీకరించిరి. దీనికి సారస్వతమునఁ బ్రయోగము లేదు.

## సారోపలక్షణ

మ. అమరద్వీపవతీ కుమారాంతరములం దారూఢి నీలాంబుపూ
రము సూర్యాత్మజగాఁ దలంపుదురసారప్రౌఢిమైఁ గొంద; అ
ద్యమ తేజోఽధిక! నారసింహ! భవదుద్యత్కీర్తి నిర్ఘాత సం
భ్రమయై గంగ, యకీర్తిఁదాల్చెనని నే భావింతుఁ జిత్తంబునన్.

అసారప్రౌఢి (పా) అపారప్రౌఢి.

తా. గంగానదిలో నున్న నల్లని ప్రవాహమును యమునగాఁ గొంద అసమర్థులు దలంతురు. ఓ నరసభూపాలా! నీ కీర్తిచేఁ దన గర్వమును గోలుపోయి గంగ యపకీర్తి [illegible] దలంతురు.

ఇట "యమున యపకీర్తి" అనుచోట యమున యపకీర్తిగా నారోపింపఁబడెను. ఇట నుపమానోపమేయములు (యమున - అపకీర్తి) భిన్నభిన్నములుగాఁ గనఁబడుచుంటచే ననఁగా బ్రయోగింపఁబడుటచే సారోపలక్షణ.

## సాధ్యవసాయలక్షణ

కం. నిరత బుధ ప్రహ్లాదా
దరకరుఁడు, హిరణ్యకశిపు దానోన్నతుఁడై
ధరఁ బోచిరాజవంశ
స్థిరరత్న స్తంభమున నృసింహుఁడు పుట్టెన్. ౬౫

ఇట 'నరసభూపాలుఁడను నృసింహుఁడు పుట్టెన్' అని చెప్పినచో నుపమానోపమేయములు రెండును బ్రత్యేకముగాఁ బ్రయుక్తములై కనఁబడుచుండెడివి. కాని 'నృసింహుఁడు పుట్టెన్' అని చెప్పుటవలన నుపమాన మొక్కటియే గ్రహింపఁబడుటచే సాధ్యవసాయలక్షణ.

ఇటఁ జెప్పఁబడిన లక్షణాప్రభేదములే కాక మరి రెండు భేదములుగూడఁ గలవు. వాని నిట నుదాహరింతును.

## లక్షితలక్షణ

లక్షితలక్షణ యనఁగా వాచ్యార్థానుపపత్తి కలుగఁగా వాచ్యార్థమునకు సాక్షాత్తుగా సంబంధించిన యర్థముగాక పరంపరగా సంబంధించిన వేఱొకయర్థమును దోఁపించు శబ్దశక్తి.

'ద్విరేఫ' పదమునకు రెండురేఫలుగలది (ద్వౌరేఫౌయస్యసః) యని వ్యుత్పత్త్యర్థము. రేఫ మొంక యక్షరముగాన లోకములో రెండురేఫలుగల వస్తువుగాని, వ్యక్తిగాని యేముండును? అక్షరములు పదముల కవయవములుగాని వ్యక్తుల కవయవములు గావుగదా! కావున వాచ్యార్థానుపపత్తి యేర్పడినది. అపుడీ ద్విరేఫపదము రూఢినిఁ బట్టి రెండురేఫాక్షరములుగల 'భ్రమర' పదమును బోధించును. 'భ్రమర' పదమునకుఁ 'దుమ్మెద' యని యర్థము. ఇట 'ద్విరేఫ' పదము భ్రమరపదమును బోధించును. భ్రమరపదము తుమ్మెదను బోధించును. కాన ద్విరేఫమనఁగాఁ 'దుమ్మెద' యని యర్థము.

'గంగాయాంఘోషః' అనుచోట గంగాపదము తనతో సాక్షాత్సంబంధముగల తీర, శబ్దమును బోధించుచున్నది. ఇట ద్విరేఫపదము పరంపరాసంబంధముచేఁ దుమ్మెదను బోధించుచున్నది.

ఇట్లే 'రోదర' శబ్దము (రః ఉదరే యస్యసః రోదరః) చక్రశబ్దమును బోధించును. చక్రశబ్దము చక్రవాకమును బోధించును. కాఁబట్టి రోదరశబ్దమునకుఁ జక్రవాకమని యర్థము. ఇటఁగూడఁ బైనివలెనే వాచ్యార్థమునకుఁ బరంపరాసంబంధము గలదుగదా!

ఇట్టి లక్షితలక్షణాశబ్దములు లోకములో నతిప్రయుక్తములుగా (సుప్రసిద్ధముగా) నున్నవానినే ప్రయోగింపవలెను. కాని యనతిప్రయుక్తములను బ్రయోగింపరాదు. ఎట్లన 'ద్వికము' (రెండు 'క' వర్ణములు గలది ద్వికము) కాకపదమున రెండు కవర్ణములు గలవు. కాన 'ద్వికపదము 'కాక' పదమును 'కాక' పదము కాకిని బోధించునని చెప్పరాదు. ఏలన ద్విరేఫ, రోదర, శబ్దములవలె 'ద్విక' శబ్దమతిప్రయుక్తము గాదు.

## విపరీతలక్షణ

వాచ్యార్థానుపపత్తివలన నెచ్చట శబ్దమునకు విరుద్ధార్థము స్ఫురించునో యా శబ్దశక్తి విపరీతలక్షణ. "వీఁడు బృహస్పతి" (బృహస్పతిరయం) ఇదియొక పామరునిఁగూర్చి చేయఁబడిన ప్రయోగము. ఇట వాచ్యార్థానుపపత్తి యేర్పడినది. ఆ వాచ్యార్థమునకు విరుద్ధముగా 'మూర్ఖుఁడు' అనునర్థము స్ఫురించును. కొందఱు దీనిని జహల్లక్షణ యందురు. ఏలన 'బృహస్పతి' పదము స్వార్థమును ద్యజించినదికదా!

న్యాయముగా విచారింప లక్షణాశక్తి యర్థశక్తిగాని శబ్దశక్తిగాదు. ఏలన "స్వార్థమును బోధించి శబ్దము తన యభిధావ్యాపారమును ముగించిన పిమ్మట నా శబ్దమునకు మఱొకవ్యాపార మంటఁగట్టుట న్యాయముగాదు. ఇట నర్థము సరిపడకున్నది. కాన మఱొకవిధముగా నాయర్థమును సరిపెట్టుకొనుచున్నాము. కాన లక్షణాశక్తి యర్థశక్తియేకాని శబ్దశక్తిగాదు" అని యాక్షేపము గలదు. ఔను నిజమే! ఇట నర్థధర్మమును శబ్దమునం దారోపించి శబ్దవృత్తి యని యౌపచారికముగా వ్యవహరించుచున్నారు.

ఈ లక్షణను ఆంగ్లమున Epithet అందురు. సాదృశ్య సంబంధ లక్షణ Transferred epithet అనియు, సంబంధలక్షణ Synecdoche అనియు, Metonomy అనియును నందు వ్యవహరింపఁబడును. కాని వారు వీని నలంకారములుగా గణింతురు. మనవారు లక్షణ యను శబ్దశక్తిగా గణింతురు.

## వ్యంజనావృత్తి

కం. సంగతములగు పదార్థము
లంగల వాక్యార్థమున కలంకారంబై
రంగగు నర్థాంతరమర
యం గావ్యములందు వ్యంజనాఖ్య చెలంగున్. ౬౬

తా. పదములయొక్క యర్థ మనుకూలముగాఁ బొసఁగిన పిమ్మట నావాక్యార్థమునకు శోభాహేతువగు నర్థాంతరము కావ్యములందు వ్యంజన యనఁబడును.

ఇట నర్థాంతరము వ్యంజన యనుట దోషము. అర్థాంతరమును ద్యోతింపించు శబ్దశక్తి వ్యంజన యని యుండవలయును.

కం. ప్రకృతోపపన్న కభిధకుఁ
బ్రకృతానుపపత్తి గోచరకు లక్షణకున్
బ్రకటితవిభేద వ్యంజన
ప్రకృతాప్రకృతోపపత్తిఁ బరగెడు కతనన్. ౬౭

ప్రకటిత విభేదవ్యంజన (పా) ప్రకటిత భేదవ్యంజన.

తా. అభిధాశక్తి ప్రకృతార్థోపపత్తిని మాత్రమే కలిగించును. అనఁగాఁ బ్రాకరణికార్థమును మాత్రము బోధించును. లక్షణాశక్తి ప్రకృతార్థమున కనుపపత్తి గలిగినపుడు వాచ్యార్థ సంబంధము గల కేవలోకయర్థమును బోధించి ముగియును. ప్రాకరణికార్థమును, అప్రాకరణికార్థమును గూడ బోధించు శక్తి వ్యంజన. కాన వ్యంజనాశక్తి అభిధా లక్షణాశక్తులకంటె విలక్షణమైనది. ఇది వానిలోఁ జేరదు.

వ్యంజనావృత్తిని గుఱించి చాలా విషయమును దెలిసికొనవలెను. ఏమన, దీనినిఁ బ్రప్రథమమున నానందవర్ధనాచార్యులవారు క్రొత్తగా సారస్వతరంగమునకుఁ దెచ్చిరి. వారికి ముందు వైయాకరణులు, తార్కికులు, మీమాంసకులు మొదలగువారు శబ్దముయొక్క యర్థబోధకశక్తిని గుఱించి లెస్సగా విచారణలు సాఁగించి శబ్దమునకు అభిధా, లక్షణాశక్తు లను రెండుశక్తులు మాత్రమే కలవని నిర్ణయించిరి. వ్యంజనావృత్తి నెవ్వరును దెలుపరైరి. శ్రీ శంకరాచార్యులవారు క్రొత్తగా జహదజహల్లక్షణను స్వీకరించినవిధమున నానందవర్ధనాచార్యులవారును గ్రొత్తగా దీనిని స్వీకరించి సాహిత్యక్షేత్రమునఁ బాఁతిరి. దీనిని వారు సమర్థించుపట్ల చూపిన పాండిత్యమునకు మేరలులేవు.

శబ్దమునను న్న యర్థాంతరమును బోధించు శ క్తి వ్యంజనయనియు, నాయర్థాంతరము వ్యంగ్యమనియు, శబ్దము వ్యంజకమనియు మున్నే తెలుపఁబడినది కదా!

ఆనందవర్ధనుఁడు ధ్వన్యాలోకముయొక్క యారంభమున,

శ్లో. "కావ్యస్యాత్మా ధ్వని రితిబుధైర్య స్సమామ్నాతపూర్వ
స్తస్యాభావం జగదురపరే భాక్తమాహు స్త మన్యే
కేచిద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచు స్తదీయం
తేన బ్రూమ స్సహృదయ మనః ప్రీతయే తత్స్వరూపమ్"

తా. పూర్వవిద్వాంసులు కావ్యాత్మ ధ్వని యనిరి. కొంద ఱది లేదందురు. కొంద ఱది లక్షణాంతర్గతమే యందురు. కొంద ఱది వాచామగోచర మందురు. కాన సహృదయ మనః ప్రీతికై దాని తత్త్వమును నిరూపింతుము" అని నుడివెను. దీనినిఁబట్టి యా ధ్వనిసిద్ధాంత మానందవర్ధనునికి ముందే యున్నదనియుఁ బండితుల లోనే దీనినిఁగూర్చి వాగ్వాదములు జరుగుచున్నవనియుఁ దేలుచున్నది. ఆనంద వర్ధనునికి ముం దీ ధ్వనిసిద్ధాంతముయొక్క స్వరూపస్వభావము లస్ఫుటముగా ననిర్వచనీయముగా నుండెను. దాని స్వరూప స్వభావములను హేతువాద పురస్సరముగా నిర్ణయించి స్థిరపఱచిన ప్రతిభాశాలి యానందవర్ధనుఁడే. కావుననే

ధ్వనినాఽతిగభీరేణ కావ్యతత్త్వనివేశినా
ఆనందవర్ధనః కస్య నాఽసీదానందవర్ధనః

"అతి గంభీరమై కావ్యతత్త్వ నివిశిష్టమైన ధ్వనిచేత ననఁగా నట్టి ధ్వని యొక్క స్వరూప స్వభావములు నిరూపించుటచేత నానందవర్ధనుఁ డెవరి కానంద వర్ధనుఁడుగాఁడు? అని శ్లాఘింపఁబడెను. మఱియుఁ దానే

"సత్కావ్యతత్త్వవిషయం స్ఫురిత ప్రసుప్త
కల్పం మనస్సు పరిపక్వధియాం యదాసీత్
తద్వ్యాకరో త్సహృదయోదయ లాభహేతో
రానందవర్ధన ఇతి ప్రథితాభిధానః"

పరిపక్వబుద్ధిగల పండితుల మనస్సులందు స్ఫురిత ప్రసుప్తకల్పముగా నున్న సత్కావ్యతత్త్వమును సహృదయానందమునకై యానందవర్ధనుఁడు వ్యాఖ్యానించి చెప్పెను. అనియును జెప్పుకొనెను.

ఆతని తరువాత వచ్చిన మమ్మట, విశ్వనాథ, జగన్నాథాది మహామహా పండితులును నానందవర్ధనుని సిద్ధాంతమును బలపఱచిరి. ఇందలి వక్యమున ధ్వని

లేనేలేదని కొందఱు నొడివిరని చెప్పితిమిగదా! ఆ యభావవాదులు ముత్తెఱఁగులుగా నున్నారు.

అందు మొదటితెగవారు ధ్వని లేనేలేదందురు. వారి మతమును నానంద వర్ధనుఁ డీ క్రిందివిధమున ఖండించెను.

వాచ్యార్థము ముగిసిన పిమ్మటఁ బ్రకరణాదివశమున నర్థాంతరము తోఁచు చున్నది. ఆ యర్థ మెంకచో వస్తురూపముగా, నొకచో నలంకారరూపముగా, నొకచో రసభావాదిరూపముగాఁ దోఁచును. అదియే ధ్వన్యర్థము. ధ్వని శబ్దము నకు మూఁడువిధములయిన వ్యుత్పత్త్యర్థములను దెలిపితిమి. సహృదయ హృదయ సంవేద్యమై వాచ్యార్థముకన్న రమణీయమై యర్థాంతరము దోఁచుచుండఁగా నది శశశృంగాయమాణమని యపలపించుట యయుక్తముగదా!

ఇఁక రెండవతెగవారు ధ్వన్యర్థము పైవారివలె బొత్తుగా లేదనరు. కాని దానిని బోధించుటకు 'వ్యంజనాశక్తి' యను క్రొత్తశక్తి నంగీకరింపఁ బనిలేదనియు నాశక్తి యభిధాశక్తిలోనే యంతర్భవించుననియుఁ జెప్పుదురు. వారిమత మిది:—

వాచ్యార్థము ముగిసిన పిమ్మటఁ దోఁచు నర్థాంతరమును బోధించుటకు 'వ్యంజనాశక్తి' యను క్రొత్తశక్తి యక్కఱలేదు. అది యభిధావృత్తివలననే దోఁచును. ఎట్లన నభిధావృత్తి కేవల సంకేతితార్థమునే కాక సంకేతితార్థమును, తాత్ప ర్యమును, వ్యంగ్యార్థమునుగూడఁ గ్రమముగా బోధించును. ఎట్లన "సోఽయమిషో రివదీర్ఘదీర్ఘతరో వ్యాపారః" (ఈ యభిధావ్యాపారము శరముయొక్క వ్యాపా రమువలె దీర్ఘదీర్ఘతమము) అని చెప్పుదురు. అఁటగా సమర్థుఁడగు ధానుష్కుఁడు ప్రయోగించిన బాణము శత్రువుయొక్క కవచమును, శరీరమును, ప్రాణమును గ్రమ ముగాఁ దాఁకునట్లే సమర్థుఁడగు కవి ప్రయోగించిన శబ్దముగూడఁ గ్రమముగా సంకే తితార్థమును, తాత్పర్యార్థమును, వ్యంగ్యార్థమును బోధించును"

దీని నానందవర్ధనుఁ డిట్లు ఖండించెను: ప్రాచీన సంప్రదాయానుసారముగా నభిధాశక్తి సంకేతితార్థమును మాత్రమే బోధించును. కాని వ్యంగ్యమగు వస్త్వలం కార రసాదులను బోధింపఁజాలదు. ఏలన నవి సంకేతితములు గావు. అభిధాశక్తికి దీర్ఘదీర్ఘతరవ్యాపారమున్న దనుటకుఁ బ్రమాణమేమి? అభిధకు దీర్ఘదీర్ఘతరవ్యా పారము నంగీకరించినచో నభిధాశక్తి యొక్కటియే చాలును. లక్షణావృత్తిగూడఁ బనిలేదు. లక్షణావృత్తిపనినిఁగూడ నభిధయే నిర్వహించునుగదా! లక్షణావృత్తి నంగీకరించుటవలన స్వవచనవ్యాఘాతము రాదా? నిర్ణయము నభిధాశక్తిచే బోధింపఁ

బడు సంకేతార్థ మెల్లరకు నొక్కరూపముననే భాసిల్లును. కాని వ్యంగ్యార్థము ప్రకరణ, వక్తృ, బోద్ధవ్యాదిభేదమునుబట్టి బహురూపముగానుండును. ఎట్లన "గతోఽస్తమర్కః" (ప్రొద్దుగ్రుంకెను) అనువాక్యమున కభిధాశక్తిచే నొక్కసంకేతార్థమే యెల్లరకును గోచరించును. ఈవాక్యము దూతినాయికతోఁ దెలుపఁగా "అభిసరింపసమయమైనది" అనునది వ్యంగ్యార్థము. ఒకకూలివాఁడు మరొక కూలివానితోఁ జెప్పఁగాఁ "బనిచాలింతము" అనునది వ్యంగ్యార్థము. ఇట్లే యా యా ప్రకరణాదులనుబట్టి "సాంధ్యకృత్యము నెఱవేర్పుము; చీఁకటి పడుచున్నది; దూరము పోవలదు; గోవుల నింటికిఁ దోలుకొనిరమ్ము; ఎండవేఁడిమి చల్లారినది; ఇప్పటికిని బ్రియుఁడు రాలేదు;" అను నానార్థములు వ్యంగ్యముగాఁ దోఁచును.

మరియు వాచ్యార్థ వ్యంగ్యార్థములు స్వరూపమును బట్టియు భిన్నములు. ఎట్లన, వాచ్యార్థ మొకచో విధిరూపముగా నున్న వ్యంగ్యార్థము నిషేధరూపమున నుండును.

కం. ఇఁకఁదిరుగవచ్చు నిట న
మ్మకముగ నో పూజరి! పరిమార్చెనుకుమ్మా!
వికటోద్ధతమగు గోదా
నికుంజగత సింహమొకటి నేఁడా కుక్కన్.

ఒక పూజారి పత్త్రిపుష్పాదుల ననుదినమును గోయుచుండుటచేఁ దన సంకేత నికుంజము పలచఁబడి బహిరంగపడుచున్నదని చింతించుచున్న కులటానాయిక యా పూజారితో ననుచున్నది. ప్రథమమున నీ ప్రకరణమును దెలిసికొనవలెను. ఏలనఁ, బ్రకరణముచేతనే వ్యంగ్యము గోచరించును. ఇఁక దీని యర్థ మిది :—

"ఓ పూజారీ! ఇఁక నమ్మకముగఁ నీ విటఁ దిరుగుము. సమీపస్థ గోదావరీకుంజగతమగు సింహ మిచ్చటి కుక్కను జంపినదిలెమ్ము." అని.

ఇటఁ 'దిరుగుము' అను వాచ్యార్థము విధిరూపమున నున్నది. "సింహము కుక్కను జంపినది. కావున నిర్భయముగాఁదిరుగుము" అని చెప్పుటచే "నీవిదివఱకు కుక్కకే భయపడుచుంటివి. ఇప్పు డది చచ్చినను సమీపముననే సింహమున్నది. అది నిన్నుఁ బరిమార్చును. కానఁ దిరుగకుము" అని నిషేధార్థము తోఁచుచున్నది. ఇదియే వ్యంగ్యార్థము. కావున వాచ్యార్థము విధిరూపమునను వ్యంగ్యార్థము నిషేధరూపముగను నున్నది.

ఒకచో వాచ్యార్థము నిషేధరూపమునను వ్యంగ్యార్థము విధిరూపమునను నుండును.

గీ. ఇచట మాయత్తపండు; నేనిటఁ బరుండఁ
బగటనే లెస్స గని గుర్తుపట్టుకొనుము!
రేయిచీఁకటిఁ గానక రోయి పాంథ!
పడకుమీ! మాదు మంచాలపైనిఁ దప్పి.

ఇటఁ బ్రోషితభర్తృక నాయిక. ఇంటి కొక పాంథుఁడు వచ్చినాఁడు. వానితోఁ బైవిధమునఁబలికినది. ఇచ్చటఁ "బడకుమీ" అని వాచ్యార్థము నిషేధ రూపమున నున్నది. "తిన్నఁగాఁజూచి నా మంచము గుర్తుంచుకొని నా మంచముపైఁ బడుము" అనునది వ్యంగ్యార్థము. ఇది విధిరూపమున నున్నది.

ఒకచో వాచ్యార్థము విధిరూపముగను వ్యంగ్యార్థ మనుభయరూపముగను నుండును. (అనఁగా విధిరూపముగాఁగానీ నిషేధరూపముగాఁగానీ యుండదు.)

గీ. పొమ్ము! నాకొక్కతెకె కల్గనిమ్ము ప్రియుఁడ!
ఊర్పు లేడ్పులు; దాని వియోగకలన
నీకు నేటికిఁ? గలదొకో నీకుఁ బ్రీతి?
వచ్చితివి పూఁతమెఱుఁగుల వలపులోఁడ.

ఇది ఖండితనాయిక. 'పొమ్ము' అను వాచ్యార్థము విధిరూపమున నున్నది. నాయకుని 'లేచిపొమ్ము' అని కాని 'ఉండుము' అని కాని నాయికాభిప్రాయము గాదు. ఖండిత గావునఁ గృతాపరాధుఁడైన ప్రియుని నుపాలంభించుచున్నది. ఇట వ్యంగ్యార్థ మనుభయరూపము.

ఒక్కచో వాచ్యార్థము ప్రతిషేధరూపముగను, వ్యంగ్యార్థ మనుభయరూపముగను నుండును.

గీ. చాలు! మ్రొక్కుదు! మఱలుమోబాల! నీదు
మోముజాబిల్లిఁ జీఁకటి మొత్తమడఁగ
దారిఁ జరియించు నన్యాభిసారికలకు
నడ్డుతగులుచు నుంటి హతాశురాల!

ఒక యభిసారిక యభిసరింపఁ బ్రియతముని గృహమునకుఁ జనుచున్నది. మధ్యేమార్గమున నా ప్రియుఁ డగపడి తన్నెఱిఁగించుచు నిట్లు నర్మప్రసంగ మొనర్చెను.

ఇట 'మఱలుము' అనునది వాచ్యార్థము. ఇది నిషేధరూపమున నున్నది. 'మఱలుము' అన 'వెడలవలదు' అనికద్దా! యర్థము. కాన నిషేధరూపము. నాయ

కుఁడు "మోముజాఁబిల్లి......అద్భుతగుణంచునుంటివి" అని చెప్పుటచే బ్రియురాలి ముఖబింబమును వర్ణించుచు "నీ గమనమున నీకును నిష్టార్థసిద్ధిగాకు. నాయింటికైనను రమ్ము. లేక నేనే నీ యింటికి వత్తును." 'పద' అనునది వ్యంగ్యము. ఈ వ్యంగ్యము విధిరూపమునఁ గాని నిషేధరూపమునఁ గాని లేక ముఖబింబవర్ణనమునఁ బర్యవసించినది.

ఒక్కొకచో వాచ్యార్థముకన్న వ్యంగ్యార్థ మత్యంత భిన్నముగా నుండును.

కం. పలునొక్కులుగల తన కో
మలి మోవినిఁగాంచి యెవఁడు మండిపడఁడు ? నే
వలదన్న మూరుకొంటివి
వెలఁది ! సభృంగాబ్జ; మనుభవింపుము దీనిన్.

ఉపపతిచే నుపభోగింపఁబడి దంతక్షతములు గలిగియున్న నాయికనుగాంచి పతి శంకింపఁగా నాయికాసఖి యిట్లు వలుకుచున్నది :—

"దీని ననుభవింపుము" అనునది నాయికనుగూర్చి వాచ్యార్థము. "భృంగము దీనిమోవినిఁ గాటువేసినది. ఇతరుఁడుగాఁడు. కావున నీమె నిరపరాధురాలు" అను వ్యంగ్యార్థము పతినిఁగూర్చియు, "ఇప్పుడు నేనెట్లో చచ్చిచెడి సమర్థించితిని. ఇఁక ముం దెప్పుడును నీవిధముగాఁ గనఁబడునట్లు దంతక్షతాదులు సేయకుము" అను వ్యంగ్యార్థ ముపపతినిఁగూర్చియుఁ, బ్రియురాలి స్వవణాధరావలోకనమున రోషము గలుగును; అప్రియురాలగుచో త్యాగహేతువయిన ప్రీతిగలుగును; కాన మీరానంద పడకుఁడు ; "ఓహో దీని సౌభాగ్యమేమి ?" అను వ్యంగ్యార్థము సవతులను గూర్చియు, "ఇప్పు డిట్లు జరిగినది. మీరెన్నడు నీమెనుగూర్చి శంకింపకుఁడు" అను వ్యంగ్యార్థ మిరుగుపొరుగులవారినిఁగూర్చియు, "ఇపు డీ విధముగా గుట్టుదాఁచితిని. ఇఁకముందు మెలఁకువతో వర్తిల్లుము" అను వ్యంగ్యార్థము నాయికనుగూర్చియు, "ఉపపతివలనఁ జుంబనాదులనే గ్రహింపవలెను. కాని దంతక్షతాదులను గ్రహింపరాదు" అను వ్యంగ్యార్థము కులటానాయికలనుగూర్చియు నున్నవి.

వాచ్యార్థము శబ్దమాత్రము నాశ్రయించి యుండును. వ్యంగ్యార్థము : ౧. శబ్దము, ౨. శబ్దైకదేశము, ౩. అర్థము, ౪. వర్ణములు, ౫. రీతి, అనువానినెల్లను నాశ్రయించి యుండును.

శబ్దములు సుబంతములనియుఁ, దిజంతములనియు ద్వివిధము. వీనికిఁ గ్రమముగా నుదాహరణము లిత్తుము.

## ౧. శబ్దము — సుబంత శబ్దము (౧)

కం. సిరిగలవానికిఁ జెల్లును
 దరుణులఁ బదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
 దిరిపెమున కిద్దఱాండ్రా ?
 పరమేశా ! గంగవిడుపు ; పార్వతి చాలున్.

ఇట 'సిరిగలవాఁడు' అను సుబంతశబ్దము 'సంపదగలవాఁడు' అను వాచ్యార్థమును బోధించి పిమ్మట లక్ష్మీభర్త యనఁగాఁ 'గృష్ణుఁడు' అను వ్యంగ్యార్థమును బోధించుచున్నది. అట్లే 'గంగ' పదము 'గంగాదేవి' అను వాచ్యార్థమును బోధించి పిమ్మట 'జలము' అను వ్యంగ్యార్థమును బోధించును.

## తిఙ్ఞంత శబ్దము (౨)

గీ. ముసరఁగానిమ్ము ! జుమ్మని దెసలఁదేంట్లు
 మలయఁగానిమ్ము ! మెలమెల్ల మారుతంబు
 పాడఁగానిమ్ము ! కోయిలల్ పంచమంబు
 నరుగఁగానిమ్ము ! నాయయః ప్రాణములును.

ఇట 'ముసరఁగానిమ్ము' మొదలగు క్రియాపదము లావిరహిణియొక్క సంతాపాతిశయమును వ్యక్తపఱచుచున్నవి.

కొన్నియెడల శబ్దములు తత్సజాతీయవర్ణములు గల శబ్దములను స్ఫురింపఁ జేసియు నర్థాంతరమును వ్యక్తపఱచును. ఎట్లన,

"అత్రాంతరే కుసుమసమయయుగ ముపసంహరన్ అజృంభత గ్రీష్మాభిధానః ఫుల్లమల్లికా ధవళాట్టహాసో మహాకాలః" అనునెడ "కుసుమసమయ యుగ ముపసంహరన్" అను పదములు మన్మథ సంహర్తి' యను నర్థాంతరమును వ్యక్తము సేయుచున్నవి. ఇట 'కుసుమ' 'సంహరన్' అను శబ్దైకదేశములే వ్యంజకము లగుచున్నవి. ఇట్లే " కొఱఁతంబడుంగుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్ " అనుచోటి 'కొఱఁత' అను శబ్దము తత్సజాతీయ వర్ణములుగల 'కొఱుత' అను శబ్దమును స్ఫురింపఁ జేసి చోరరూప వ్యంగ్యార్థమును స్ఫురింపఁజేయుచున్నది. "కొఱఁతంబడున్" అనుచో శ్లేష యని కొందఱు భ్రమింతురు. ఇది వ్యంగ్యస్థలమే.

## ౨. శబ్దైకదేశము

శబ్దములో నొకభాగము శబ్దైకదేశము. అది ౧, ప్రకృతి, ౨, ప్రత్యయ, 3, ఉపసర్గ, ౪, నిపాత, ౫, వచన, ౬, సమాస, ౭, కారక, ఆది భేదములచే బహువిధముగా నుండును. ప్రకృతియనఁ బ్రత్యయముచేరని కేవలధాతురూపముగానీ కేవలనామరూపముగానీ యగును. అట్టి ప్రకృతియు వ్యంగ్యార్థమును సూచించును. ఎట్లన,

కం. తనచూపుతూపులను గ్రొ
న్ననఁబోఁడి కడిందితాఁకి నాలుగడుగులం
జని చచ్చెనో? లేదో? యని
వెనుదిరిగియుఁ దరుణుఁగాంచుఁ బెక్కులుతడవల్

ఇట "ఎను" అను భూతకాలిక ప్రత్యయరహితమైన 'చచ్చు' అనునది ప్రకృతి. 'చచ్చు' అనఁగా 'మరణించు' అని వాచ్యార్థము. ఈ 'చచ్చు' అను <u>ధాతుప్రకృతి</u> "మిక్కిలి సంతాపమును వహించు" అను వ్యంగ్యార్థమును బోధించుచున్నది.

చ........................................................

............................వాసవదత్త కటాక్షమాలికా
గురుతర శృంఖలాతతుల గుప్తముగా బిగియించి వత్సభూ
వరుఁ జెఱవెట్టియుంచె విరిపాన్పున బంగరుమేడలోపలన్.

కం. మనయేలిక నాప్రద్యో
తునిచెఱఁ దప్పింపవచ్చుఁ దొయ్యలిచెఱనే
యనువునఁ దప్పింపందగు
జనుఁడెట్టులు కొమ్మ విడిచి క్ష్మాజముఁ దెచ్చున్?

ఇట 'తొయ్యలి చెఱను' అనునది ద్వితీయావిభక్త్యంతపదము. 'చెఱ' అనునది ప్రాతిపదికము. అనఁగాఁ బ్రత్యయరహితమైన కేవల నామము. ఇదియే 'నిర్బంధాతిశయము' అను నర్థమును వ్యక్తము సేయుచున్నది. ఇట ద్వితీయావిభక్తి ప్రత్యయరహితమైన <u>కేవల నామప్రకృతియే</u> వ్యంగ్యార్థమును బోధించుచున్నది.

<u>ప్రత్యయములు</u> రెండు విధములు. ౧. కృత్తులు, ౨. తద్ధితలు. ఇవియు వ్యంగ్యార్థమును సూచించును.

గీ. పండితమ్మన్యులైన వైతండికులను

పండితమ్మన్య, పండితమానిన్, ప్రభృతిపదములయందలి ఖశ్, ణిని, అను కృత్ప్రత్యయములు నిందావ్యంజకములు. అనఁగా నాప్రత్యయములు "నింద్యుఁడైన పండితుఁడు" అనునర్థమును వ్యక్తముసేయుచున్నవి.

మ. "వృక్షకముల్ గడాసి యొకందు కోయఁదొడఁగెంగాఁ బుష్పముల్ గాంచితిన్"

ఇట 'వృక్షక' పదములోని తద్ధితప్రత్యయమగు 'క' ప్రత్యయము 'చిన్న' అనునర్థమును వ్యక్తముసేయును. ఇట్లే "క్వ బత హరిణకానాం జీవితం చాతిలోలం" అనునెడ 'హరిణక' శబ్దమునందలి 'క' ప్రత్యయము (తద్ధిత) హరిణములయొక్క అతికోమలత్వమును వ్యక్తపఱచును.

కం. ప్రవచించి ధర్మమార్గము......

ఇట 'ప్రవచించి' అనుచోటి 'ప్ర' అను నుపసర్గ వచనమునందలి ప్రకృష్టతను వ్యక్తపఱచును. 'అనఁగా నూరకవచించుట గాదు. ప్రకృష్టముగా వచించుట' అను నర్థమును స్ఫురింపఁజేయును.

ఉ. అక్కట! వాఁడు నాతగులమాఱడిసేసి దయావిహీనుఁడై

ఇట 'అక్కట' అను నిపాతము వరూధినియొక్క విరహతాపాతిశయమును వ్యక్తము సేయుచున్నది.

సీ. అవతంసకుసుమంబునందున్నయెలదేటి, రుతి కించిదంచితశ్రుతులనీన

ఇట 'శ్రుతులు' అను బహువచనము సరస్వతి పెక్కుశ్రుతులతో వీణ వాయించుచున్నట్లును, దేఁటి దాని కనుకూలముగా ధ్వనించుచు శ్రుతినిఁ బోషించుచున్నట్లును వ్యక్తము సేయుచున్నది.

'అగస్త్యభ్రాత' ఇది సమస్తముగా నిందను వ్యక్తముసేయును. అనఁగాఁ బేరులేనివాఁడను వ్యంగ్యార్థమును నీ సమాసము బోధించును. ఇది వ్యస్తముగా నున్నచో ('అగస్త్యుని భ్రాత') బోధింపదు. ఏలన, లోకమున సమాసముగానే ప్రయుక్తమై యున్నది.

'పశ్యతోహరుఁడు' (చూచువాని ననాదరించి హరించువాఁడు) అనఁగాఁ జూచుచుండఁగానే హరించువాఁడు (అగసాలెవాఁడు.) ఇచ్చటి 'పశ్యతః' అను షష్ఠీ విభక్తి (కారకము) అనాదరార్థ వ్యంజకము. 'షష్ఠీచానాదరే' అని పాణినీయసూత్రము.

## ౩. అర్థము

కం. పలునొక్కులు గల తనకో
మలి మోవినిఁ గాంచి యెవఁడు మండిపడఁడు? నే
వలదన్న మూరకొంటివి
వెలఁది! సభృంగాబ్జ మనుభవింపుము దీనిన్.

ఇచ్చట నీ వాచ్యార్థ మెన్నివిధములగు వ్యంగ్యార్థములను వ్యక్తముసేయు చున్నదో వెనుకఁ జూపితిమి.

## ౪. వర్ణములు

"శషౌ, సరేఫసంయోగౌ, ఢకారశ్చాపి భూయసా
విరోధినస్స్యుః శృంగారే తే న వర్ణా రసచ్యుతః
తఏవతు నివేశ్యంతే బీభత్సాదౌ రసే యదా
తదా తం దీపయన్త్యేవ తేనవర్ణా రసచ్యుతః" ధ్వన్యాలోకము.

శషవర్ణములును, రేఫతో సంయుక్తములయిన (క్ర, ప్రి, మొదలగు వర్ణము లును, ఢకారమును శృంగారరసమునకు విరుద్ధములు. అనఁగా నారసము నీ వర్ణములు వ్యక్తపఱుపవు. అవియేవర్ణములు బీభత్సాదులందుఁ బ్రయుక్తములయినచో దాని నుద్దీపింపఁజేయును. కాన వర్ణములుగూడ రసవ్యంజకములు.

## ౫. రీతి

అల్పసమాస యగు రీతి శృంగారాది రసములను, దీర్ఘసమాస యగు రీతి రౌద్రాది రసములను వ్యక్తపఱచును.

మరియు వాచ్యార్థము శబ్దశాస్త్రజ్ఞానముచేఁ దెలియును. వ్యంగ్యార్థము వక్తృ, బోద్ధవ్య, ప్రకరణ, దేశ, కాలాదులనుబట్టి తెలియును. వీని కుదాహరణములు "గతోఽస్తమర్కః" అనుచోట నీయఁబడినవి. మరియు వాచ్యార్థము పదార్థ జ్ఞానమునుమాత్రమే కలిగించును. వ్యంగ్యార్థము రమణీయముగానుండి యానంద మును గలిగించును.

ఇట్టియెడల వాచ్యార్థ వ్యంగ్యార్థముల నభిధాశక్తి యొక్కటియే బోధించు ననుట యనుచితము.

అభావవాదులలో మూఁడవతెగవారు వ్యంజనావృత్తి తాత్పర్యవృత్తిలో నంతర్భవించుననిరి. అట్లుగాదు. తాత్పర్యవృత్తి పదసమన్వయమునుమాత్రము బోధించును. పదసమన్వయము ముగిసిన పిమ్మటఁ బ్రకరణాదులవలనఁ దోఁచు నర్థాంతరమును నది యెట్లుబోధించును? అభిహితాన్వయవాదుల తాత్పర్యమునకును, నాలంకారికుల తాత్పర్యమునకును భేదమును జూపితిమి. ఆలంకారికుల తాత్పర్యమును వ్యంజనావృత్తియు నొక్కటే.

లక్షణాంతర్భావుల మత మిది:—"లక్ష్యార్థమే వ్యంగ్యార్థము. కాన వ్యంజనావృత్తితోఁ బనిలేదు" అని. అట్లుగాదు. లక్షణావ్యాపారమును వ్యంజనావ్యాపారమును భిన్నములు. ఎట్లన వాచ్యార్థము పొసగనపుడు దానిని వదలి మఱొక యర్థమును బోధించు శబ్దశక్తి లక్షణ. అనఁగా లక్ష్యార్థములో వాచ్యార్థము గొంత విడువఁబడును. వ్యంగ్యార్థము వాచ్యార్థముకన్న భిన్నమైనను, వాచ్యార్థము విడువఁబడదు. ఆవాచ్యార్థమున కీవ్యంగ్యార్థ ముపస్కారముగా నుండును. మరియు లక్షణావాక్యమగు "గంగాయాంఘోషః"అనుచోటఁ దీరము లక్ష్యార్థమును, శీతత్వ పావనత్వాదులు ప్రయోజనమును నయియున్నవి. అట్లే గౌణవృత్తి యగు "బ్రాహ్మణుఁడగ్ని" అనుచోట "అగ్నిసదృశుఁడు" అనునది లక్ష్యార్థమును, శుచిత్వ పవిత్రత్వములు ప్రయోజనములును నయియున్నవి. ఈ ప్రయోజనము వాచ్యార్థముగాదు. ఇది వ్యంగ్యమే. దీనిని బోధింప వ్యంజనాశక్తి యవశ్యమే.

"'గంగాయాం ఘోషః' అనుచోట ముఖ్యార్థబాధాది హేతుత్రయమును బట్టి 'గంగాతీరము' అనులక్ష్యార్థమును బోధించినపిమ్మట మరల శీతత్వ పావనత్వాదులనుగూడ లక్ష్యార్థముగనే లక్షణ బోధించును. వ్యంజనావృత్తియేల?"అని మరల వారు నొడువుదురేని నట్లనరాదు. "గంగాయాం ఘోషః" అనుచోట ముఖ్యార్థబాధాది హేతుత్రయమున్నట్లు "గంగాతీరము" అనులక్ష్యార్థమునకు ముఖ్యార్థబాధాదిహేతుత్రయము గానరాదు. ఎట్లన నసలు 'గంగాతీరము' అనునది లక్ష్యార్థముగాని ముఖ్యార్థమే కాదు. దానికి బాధయు ( వాచ్యార్థానుపపత్తి ) లేదు. ప్రయోజనమగు శీతత్వ పావనత్వాదులకు గంగాతీరములో సంబంధమును లేదు. శీతత్వ పావనత్వాదులు గంగాగతధర్మములు గాని తీరమునకు సంబంధించినవికావు కదా! మరియు శీతత్వ పావనత్వాదులు లక్ష్యార్థమే యగుచో ముఖ్యార్థబాధాది హేతుత్రియములో నొకటి యగు ప్రయోజన మేమిచెప్పుదురు? అనఁగా "గంగాయాం" అనఁగా 'గంగాతీరము' అను లక్ష్యార్థము చెప్పినపుడు శీతత్వ పావనత్వాదులు ప్రయోజనమని చెప్పితిమి. ఇప్పుడు గంగాతీరమునకు శీతత్వ పావనత్వాదులు

లక్ష్యార్థమగుచో వేఱొక ప్రయోజన మేమి చెప్పుదురు? ఏమియును లేదు. కాన లక్షణాంతరాభావము పొసగదు.

మరల వారు "ప్రయోజనమగు శీతత్వ పావనత్వాదులతో సహితమగు లక్ష్యార్థమునే లక్షణాశక్తి బోధించు"నని యందురేని నట్లుగాదు. ప్రయోజన సహితమైన లక్ష్యార్థ ముండదు. (ప్రయోజనేన సహితం లక్షణీయం న విద్యతే) మఱియు లక్ష్యార్థము ప్రథమమున గోచరించును. పిమ్మటనే ప్రయోజనము గోచరించును. రెండును నేకకాలమున గోచరింపవు. ఈ ప్రయోజనము వ్యంజనాశక్తిచే భాసించునని చెప్పితిమి. ప్రయోజనసహితముగా లక్ష్యార్థ మేకకాలమునభాసింపదు. కాన లక్ష్యార్థ వ్యంగ్యార్థము లొక్కటికాదని తేలినది.

లక్షణాశక్తి "గంగాయాం ఘోషః" ఇత్యాది స్థలమందు శబ్దమాత్రము నాశ్రయించి యుండును. వ్యంజనాశక్తి శబ్ద, శబ్దైకదేశ, అర్థ, వర్ణ, రీత్యాదులం దుండును. (వీని కుదాహరణముల నొసఁగియుంటిమి).

కొందఱు "పలునొక్కులుగల తన కోమలి" ఇత్యాదులందు వ్యంగ్యార్థము లెట్లు నానావిధములుగా నున్నవో యట్లే "రామోఽస్మి సర్వం సహే" (నేను రాముఁడను; సర్వమును సహింతును) అనుచోట 'రామ' శబ్దమునకు రాజ్యభ్రంశ, ప్రవాస, పితృవియోగ, సీతావియోగాది దుఃఖపాత్రత్వము లక్ష్యార్థము. "రామేణ ప్రియజీవితేన తు కృతం ప్రేమ్ణః ప్రియే నోచితం" (ప్రియురాలా! జీవితము మీఁది ప్రేమచే రాముఁడు నీమీఁది ప్రేమకుఁ దగినవిధమున వర్తింపలేదు) అనుచో 'రామ' శబ్దమునకు "దుష్కార్యకారిత్వము లక్ష్యార్థము." "రామోఽసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరాం" (ఈ రాముఁడు తన విక్రమగుణములచేఁ బరమప్రసిద్ధిని వహించెను) అనుచోట రామ శబ్దమునకు "సాహసైక రసత్వము లక్ష్యార్థము" నానావిధములుగానే లక్ష్యార్థములును నున్నవి. అచటి వ్యంగ్యార్థముల వలె నిచటి లక్ష్యార్థములును శబ్దార్థాధీనములే. రెండును ప్రకరణసాపేక్షములే. కాన వ్యంగ్యార్థమును లక్ష్యార్థమును దుల్యములే. కాన వ్యంజనావృత్తితోఁ బనిలేదు" అని చెప్పుదురు.

లక్ష్యార్థము నానావిధములుగా నున్నను, ననేకార్థములు గల శబ్దమునకు సంయోగాదు లేకార్థమును నియమించినట్లే లక్షణయు లక్ష్యార్థమును నియమించును. అనఁగా ముఖ్యార్థసంబంధముగల యర్థమునే లక్షణ బోధించును; కాని సంబంధము లేని యర్థమును బోధింపదు. ఇది నియమము. కావుననే లక్షణను నభిధాపుచ్ఛ

భూత యందురు. అనఁగా నభిధమృదోకరయైన దని యర్థము. ఇఁక వ్యంగ్యార్థము ప్రకరణాదివశమున నియతసంబంధము గలిగియు, అనియతసంబంధము గలిగియు, సంబద్ధసంబంధము గలిగియు నుండును.

"గీ. ఇచట మాయత్త పండు నేనిటఁబరుండు" అనునెడ వాచ్యార్థమగు "పడకుమీ" అనుదానికి నియతముగా వ్యతిరేకార్థము వ్యంగ్యము. ఇది నియత సంబంధముగల వ్యంగ్యార్థము.

కం. "పలునోక్కలుం గల తనకో,మలి" అనుచోట వాచ్యార్థమునకును వ్యంగ్యార్థమునకును నియతసంబంధము లేదు. ఏలన, నటఁ బెక్కు వ్యంగ్యార్థములుం గలవు. ఇట ననియతసంబంధముగల వ్యంగ్యార్థములుం గలవు. ఇఁక,

* విపరీతరతే లక్ష్మీః బ్రహ్మాణం దృష్ట్వా నాభికమలస్థం
హరేర్దక్షిణనయనం రసాకులా ఝుడితి స్థగయతి.

తా. లక్ష్మి పురుషాయిత సమయమున నాభికమలాసీనుఁడగు బ్రహ్మనుగాంచి రసాకులురాలై హరియొక్క దక్షిణనయనమును మూయుచున్నది.

ఇట 'హరి'పదము దక్షిణనయనమునకు సూర్యాత్మకత్వమును వ్యక్తము సేయుచున్నది. ఆసూర్య నిమీలనమున సూర్యాస్తమయము; దానిచేఁ బద్మసంకోచము; దానిచే బ్రహ్మ మూఁతవడును. అప్పుడు వానికి గోప్యాంగము గనరాకుండ నిరాటంకముగా బురుషాయితము రేఁగును. అనునది సంబద్ధ సంబంధముగల వ్యంగ్యార్థము. సంబద్ధ సంబంధముగల యన వ్యంగ్యార్థసంబంధము గల వ్యంగ్యమని యర్థము. ఇట 'హరి' పదము దక్షిణనయనము సూర్యుఁ డను నర్థమును బోధించినది. ఆ వ్యంగ్యార్థము మిగిలిన వ్యంగార్థమునంతను బోధించినది. అనఁగా వ్యంగ్యార్థమే యిట నర్థాంతరమునకు వ్యంజకమై యున్నది.

ఇట్టిదే మరొక శ్లోకమును గనుఁడు. చిలుకను ముద్దాడుచున్న నాయికతోఁ జెలి యనుచున్నది.

ఫలాని దిశ భవ్యాని నివేశ్య మణిబంధనే
బింబోష్ఠి! చుంబసై రేవమాళి! లాలయ మాశుకం.

---

*కుమారసంభవము నందలి జగత్పితరులగు పార్వతీ పరమేశ్వరుల రతి స్వపితృశృంగారమువలె నత్యంత మనుచితమని చెప్పఁబడియున్నది. అట్లే లక్ష్మీ శ్రీహరుల రతిక్రీడావర్ణనముగూడ నట్టిదే కాన నిదియు ననౌచిత్యదోషగ్రస్తమే.

"ఓ బింబోష్ఠీ ! ఓ నెచ్చెలీ ! నీ ముంజేతఁ గూర్చుండఁబెట్టుకొని చిలుకకుఁ బండ్లువెట్టుము. దానిని ముద్దాడకుము." ఇది వాచ్యార్థము. దీనిచే "బింబఫల భ్రాంతిచేఁ (ఆమె బింబోష్ఠిగదా) జిలుక నీ యధరమును ఖండించును" అనునది వ్యంగ్యము. ఆ వ్యంగ్యముచేత "నీపతి కన్యథా భ్రాంతికలుగును" అనునది వ్యంగ్యముగాఁదోఁచును. మొదటి వ్యంగ్యార్థము రెండవ వ్యంగ్యార్థమునకు వ్యంజకము. ఇదియు సంబద్ధ సంబంధముగల వ్యంగ్యమే.

కావున లక్ష్యార్థ వ్యంగ్యార్థములు భిన్నములే. కాన వ్యంగ్యార్థమును బోధింప వ్యంజనాశక్తి ప్రత్యేకముగా నుండవలసియే యున్నది.

మఱికొందఱు విద్వాంసులు (తార్కికులు) వ్యంగ్యార్థమును బోధింప వ్యంజనావృత్తి యక్కఱలేదనియు నా వ్యంగ్యార్థ మనుమానప్రమాణగమ్య మగు "అనుమేయము"లోనే యంతర్భవించుననియు వక్కాణింతురు. అనుమానప్రమాణ మనఁగా "పర్వతమున నిప్పు గలదు; ఏలనఁ, బొగయుంటవలన; ఎచ్చటెచ్చటఁ బొగ యుండునో యచ్చటనెల్ల నిప్పుండును; ఉదా॥ వంటయింటఁ బొగయున్నది; నిప్పున్నది; నిప్పులేనిచోటఁ బొగ యుండదు. కానఁ బర్వతమున నిప్పు గలదు" అనునది. ఇట 'పొగ' లింగము (హేతువు) నిప్పు లింగి (అనుమేయము - అనఁగా ననుమానింపఁదగినది) లింగమునుబట్టి లింగి యూహింపఁబడుచున్నది. ఈ లింగి లింగములకు నియతసంబంధము గలదు. ఇట్లే ప్రకరణాదులను బట్టి శబ్దములు వ్యంగ్యార్థమును బోధించుచున్నవి. కాన శబ్దములు లింగములు. వ్యంగ్యార్థము లింగి లేక యనుమేయము. కాఁబట్టి వేఱుగా వ్యంజనావృత్తి పనిలేదని వారి వాదము. అట్లుగాదు. అనుమేయమును, వ్యంగ్యార్థమును నొక్కటిగాదు. ఎట్లన, శబ్దోచ్చారణానంతరమున గోచరించు నర్థము అనుమేయము, ప్రతిపాద్యము, అని యిఱుదెఱగులుగా నుండును. అనుమేయార్థము ప్రయోక్తయొక్క శబ్దస్వరూప ప్రయోగేచ్ఛయు అర్థప్రతిపాదనేచ్ఛయు నని ద్వివిధము. అనఁగాఁ బ్రయోక్త "రాముఁడు" అను శబ్దమును బ్రయోగించెననుకొందము. శ్రోత దీనిని విని ప్రయుక్తమైన 'రాముఁడు' అను శబ్దమునుబట్టి ప్రయోక్తకు 'రాముఁడు' అను నొక యానుపూర్వినిఁ (రకారోత్తరవర్తి-ఆకారవిశిష్ట, మకారోత్తరవర్తి-ఊకారవిశిష్ట, డకారోత్తరవర్తి ఉకారవిశిష్టమగు శబ్దస్వరూపము) బ్రయోగించు నిచ్ఛ గలదనియోఁ లేక యొక యర్థమును (అభిప్రాయమును) బోధించు నిచ్ఛగలదనియో యనుమానించును. ఇట నానుపూర్వినిఁ బ్రయోగించు నిచ్ఛయు, నర్థముఁ దెలుపు నిచ్ఛయు ననుమేయములు. కేవల మీ యిచ్ఛలే యనుమేయములు. ఇట 'రాముఁడు' అను ప్రయుక్తశబ్దము

లింగము. ఇచ్ఛాద్వయమును ననుమేయము లేక లింగి. ఇఁక నా యర్థప్రతిపాదనేచ్ఛ లోని 'యర్థము' స్వరూపభేదమునుబట్టి ప్రతిపాద్యము వ్యంగ్యమున నని ద్వివిధము. ప్రయోక్త చెప్పవలసిన యభిప్రాయమును సూటిమాటలతోఁ జెప్పును. అది వాచ్యార్థము. ఒకపుడు రమణీయముగా నుంటకై సూటిమాటలతోఁ జెప్పక వేఱు మాటలతోఁ జెప్పి యా యర్థమును సూచించును. ఇది వ్యంగ్యార్థము. ఇట శబ్దోచ్చారణానంతరమున గోచరించు ద్వివిధమైన యిచ్ఛారూపమగు నర్థముమాత్రమే యనుమేయము. రెండవయర్థమగు ప్రతిపాద్యమును, వ్యంగ్యమును ననుమేయములు గావు. మరియు నీ వ్యంగ్యార్థమును బోధింప శబ్దములు లింగమనియు వ్యంగ్యార్థము లింగి యనియుఁ జెప్పరాదు. లింగలింగి భావము నియతమని చెప్పితిమి. (ధూమ మున్నచోట వహ్ని యుండుననునది లింగలింగిభావము) ఇట నట్టి నియమములేదు. అనఁగా నీ శబ్ద మీ వ్యంగ్యమును బోధించునని నియమములేదు. ప్రకరణాది భేద ముచే నీ వ్యంగ్య మనేకవిధములుగా నుండునని "గతోఽస్త మర్కః" అనుచోటఁ దెలిపితిమి. మరియు నీ వ్యంగ్యము నియతసంబంధము, అనియతసంబంధము, సంబద్ధ సంబంధము గలిగియుండుననియు నుదాహరించితిమి. కాన వ్యంగ్యార్థమును బోధింప ననుమానప్రమాణము చాలదు. వ్యంజనావృత్తి కావలసియే యున్నది.

తొలుత నానందవర్ధనాచార్యులవా రీ ధ్వనిసిద్ధాంతమును దాము వైయాకరణులవద్దనుండి గ్రహించినట్లు వాక్రుచ్చిరని తెలిపియుంటిని. వైయాకరణుల సిద్ధాంత మిది :—

"గౌః" అను మాట నుచ్చరింపఁగానే యది సాస్నాలాంగూల కకుద విషాణాదులుగల జంతువిశేషమను జ్ఞానమెట్లుగలుగును? "గౌః" అనుపదమునందు "గ్, ఔ, ః" అను మూఁడువర్ణములు గలవు. ఇందొక్కొక్కటియే యా యర్థమును బోధించునా? సముదాయముబోధించునా? ఒకవర్ణమే తెలుపునన్నచో మిగిలినవర్ణములు వ్యర్థములు. సముదాయము బోధించునన్నచో నొక బాధవచ్చును. నైయాయికులు వర్ణములు రెండుక్షణములుమాత్రమే యుండుననియు, మూఁడవక్షణమున నశించుననియుఁ జెప్పుదురు. దానిఁబట్టి గ్, ఔ, ః, అనునెడ మూఁడవవర్ణమగు విసర్గ నుచ్చరింపఁగానే మొదటివర్ణమగు 'గ్' నశించును. అప్పుడు సముదాయము లేదు. కావున నర్థమును బోధించున దేది? ఇట వైయాకరణు లిట్లు సిద్ధాంతము సేసిరి. :—"వర్ణాతిరిక్తః వర్ణాభివ్యంగ్యః అర్థప్రత్యాయకో నిత్యశ్శబ్దః స్ఫోటః" (వర్ణములకన్నభిన్నమై వర్ణములవలన వ్యక్తముసేయఁబడి యర్థమును బోధించు శబ్దము స్ఫోటము) లోకములోఁ గల శబ్దములన్నియు నాకాశమున నొక్కొక్కటియు నఖండరూపమున నుండుననియు

నవి నిత్యములనియు మన ముచ్చరించు వర్ణధ్వను లాయఖండమగు శబ్దమును వ్యక్త పఱచుననియు నావ్యక్తమగు శబ్దమువలననే శ్రోతల కర్థ మవగతమగుననియుఁ జెప్పు దురు. ఆవ్యక్తమగు నిత్యశబ్దము స్ఫోటమనఁబడును. వీరి సిద్ధాంతమున వర్ణము లని త్యములు. ఏలనఁ బైని వచింపఁబడినట్లు మూఁడవక్షణమున నశించుచున్నది. నశిం చునది యనిత్యమేకదా! ఇఁక స్ఫోటరూపశబ్దము నిత్యము. మూడవక్షణమున నశించు చున్నపుడు వర్ణసముదాయము గానరాదుకదా! ఆవర్ణములచే నాస్ఫోట మెట్లభివ్యక్త మగును? అర్థబోధ యెట్లగును? అన్నచో వినుఁడు. "పూర్వపూర్వవర్ణానుభవాహిత సంస్కారసచివేన అంత్యవర్ణానుభవేన అభివ్యజ్యతే స్ఫోటః" (మూఁడవవర్ణము నుచ్చరించునపుడు మొందటివర్ణము నశించుచున్నను దానిసంస్కారము చిత్తమున నిలు చును. ఆసంస్కారసహితమగు నంత్యవర్ణానుభవముచే స్ఫోట మభివ్యక్తమగును.) ఆస్ఫోటమే శబ్దము. స్ఫుటత్యర్థోఽస్మాదితిస్ఫోటః (దీనివలన నర్థము స్ఫుట మగునుకాన స్ఫోటము) అనియు, స్ఫోటయత్యర్థం (అర్థమును వ్యక్తపఱచునది) యనియును వ్యుత్పత్తులు గలవు. అప్పు డాశబ్దమువలన నర్థము బోధ్యమగును. ఈ సిద్ధాంతులకు స్ఫోటబ్రహ్మవాదులనియు లేక శబ్దబ్రహ్మవాదులనియుఁ బేళ్లు.

ఆనందవర్ధనాచార్యులవా రీసిద్ధాంతము నీవిధముగా గ్రహించిరి. "పూర్వ పూర్వవర్ణములయొక్క సంస్కారముతోఁగూడిన యంత్యవర్ణధ్వని స్ఫోటమును వ్యక్త పఱచువిధమునఁ బ్రకరణాదుల సాహాయ్యమున శబ్ద మర్థాంతరమును వ్యక్తపఱచును. అట వర్ణధ్వని స్ఫోటవ్యంజకము. ఇట శబ్ద మర్థాంతరవ్యంజకము. అచ్చట వ్యంగ్యము స్ఫోటము. ఇచ్చట వస్త్వలంకార రసాదులు. ఆధ్వనిపదమునే వ్యంజకత్వసాదృశ్య మునుబట్టి యీతఁడును గ్రహించెను. వైయాకరణులవ్యంగ్యము స్ఫోటము. ఆనంద వర్ధుని వ్యంగ్య మర్థాంతరము. ఇతర సిద్ధాంతులు "నీవు క్రొత్తగా ధ్వనిసిద్ధాంత మును లేవనెత్తితివి. ఇది ప్రామాణికసమ్మతముగా"దని యానందవర్ధనుని నాక్షేపిం పఁగా "నిది క్రొత్త సిద్ధాంతముగా"దనియు, "వైయాకరణు లంగీకరించినదే" యనియు నామ సాదృశ్యమును జూపి వారించెను.*

---

*భరతుఁడు ౭ వ అధ్యాయమున ౭౦ వ శ్లోకమునందలి "యదా న్యోన్యార్థ సంభూతై ర్విభావానుభావవ్యంజితై రేకోనపంచాశతా భావైః సామాన్యగుణయోగేన అభినిష్పద్యంతే రసాః।తత్కథం స్థాయినఏవ భావా రసత్వమాప్నువంతి? ఉచ్యతే" అనుచో 'వ్యంజితైః' అనుశబ్దమునుబట్టి వ్యంజనావృత్తి నానందవర్ధనుఁ డూహించిన ట్లున్నదని త్రివేదిపండితుఁడు వ్రాయుచున్నాఁడు.

ఈవిధముగా నానందవర్ధనుఁడు వ్యంజనావృత్తిని సాధించెను. ఈ వ్యంజనకు ధ్వననము, గమనము, ద్యోతనము, ప్రత్యాయనము, ధ్వని మొదలగునవి పర్యాయ పదములు. 'వ్యంజనా' శబ్దమును 'ఆ' కారాంతముగాఁగూడ వ్యవహరించుచున్నారు. (వ్యంజన వ్యాపారము)

ఈ వ్యంజనాశక్తి అభిధామూలమనియు, లక్షణామూలమనియును ద్వివిధము. అందభిధామూల వ్యంగ్యము లక్ష్యక్రమవ్యంగ్యము, అలక్ష్యక్రమవ్యంగ్యము నని మరల ద్వివిధము. లక్ష్యక్రమవ్యంగ్యము శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము, ఉభయశక్తిమూలము నని మువ్విధములు. ఈ విషయము మరల ముందు తెలియును.

ఆ. వె. జగతినదియు శబ్దశక్తిమూలంబును,
అర్థశక్తిమూల మరయు, నుభయ
శక్తిమూలమనఁగ సన్నుతిఁగాంచుఁ; ద,
దీయు లక్ష్యములను దేటపఱతు. ౬౭

తా. ఆ వ్యంజనావృత్తి శబ్దశక్తిమూల వ్యంజనావృత్తియనియు, అర్థశక్తి మూల వ్యంజనావృత్తియనియు, ఉభయశక్తిమూల వ్యంజనావృత్తి యనియును ముత్తెఱఁగులు.

## శబ్దశక్తి మూలవ్యంజన

కం. ఘనత నృసింహుని కరమునఁ
దనరెడు నసి నిజసమగ్రధారాగ్ర నిమ
జ్జనతత్పరులగు నరులకు
ననిమిషభావంబొనర్చు ననవరతంబున్. ౬౮

నరసభూపాలుని చేతికత్తి తనధారకు గుఱి కాఁదలఁచిన శత్రువులకు (తత్పరు లగు-|-అరులకు) తప్పపాటులేమినిఁ గలిగించును. అనఁగా వారాతని కత్తిఁగాంచి కొయ్యఁబాఱి తెప్పపాటుమాని చూచుచుందురు. (ఇది వాచ్యార్థము)

నృసింహావతారమును ధరించిన విష్ణుమూర్తియొక్క చేతికత్తి తన ఖడ్గధారలో మునుఁగఁదలఁచిన నరులకు దేవత్వము నొసఁగును. (ఇది వ్యంగ్యార్థము)

శబ్దశక్తిమూలవ్యంజన యనఁగాఁ బ్రధానముగా శబ్దమునకుఁ గల యర్థాంతర బోధకశక్తి. కొన్ని శబ్దము లేకార్థమును, మఱికొన్ని శబ్దము లనేకార్థములను

బోధించునుగదా ! ఈ నానార్థబోధక శక్తియే యిట శబ్దశక్తి యని పేర్కొనఁ బడినది. ఇది కారణముగాఁ గల వ్యంజనావృత్తి. ఇట నరసభూపాలుని వర్ణనము ప్రస్తుతప్రకరణము. నృసింహ, తత్పరులగు నరులకు, అనిమిషభావము, అను శబ్దములు నానార్థకములు. సంయోగ విప్రయోగాదులు నానార్థకశబ్దములయొక్క యర్థమును నియమించునని వెనకఁ జెప్పియుంటిమిగదా ! వానిలో నొకటగు ప్రకరణ మిచ్చట నీ శబ్దముల కే యర్థమును జెప్పవలయునో నియమించును. ఆ నియమింపఁ బడిన మొదటి యర్థము వాచ్యార్థము. ఈవిధముగాఁ బ్రకరణ మా యా శబ్దములకు వాచ్యార్థమును నియమించును. అది ముగిసినపిమ్మట నాశబ్దశక్తిచే విష్ణుపరమగు మఱియొకయర్థ ముత్థితమగుచున్నది. అది వ్యంగ్యార్థము. దీని నభిధాశక్తి బోధింపఁజాలదు. దానిపని వాచ్యార్థమునుమాత్రమే బోధించుట. "సకృదుచ్చరిత శ్శబ్దస్సకృదేవార్థం గమయతి నాసకృత్" (ఒకమాఱుచ్చరింపఁబడిన శబ్ద మొకమారే యర్థబోధ గలిగించును. కాని పెక్కుమాఱులు బోధింపదు) అని న్యాయము.

అయితే మీమాంసకు లిట నొక దోషమును జూపుచున్నారు. "ఒకశబ్దమునకు రెండువ్యాపారములు లేక రెండుశక్తు లంగీకరించి రెండర్థములు చెప్పినచో రెండు భిన్న భిన్నవాక్యము లేర్పడునుగదా ! అందొకటి విధిరూపముగానుండవచ్చును. వేఱొకటి నిషేధరూపముగాఁగూడ నుండవచ్చునుగదా ! ఇట్లు భిన్నముగానున్నను, లేక యేకవిధముగానున్నను 'వాక్యభేద'మను దోషము తటస్థించును. ఒకవాక్యమున కొకేయర్థ ముండవలయును. అర్థద్వయము గూడదు" అని వారి సిద్ధాంతము. ఈ దోష నివృత్తికై యాలంకారికు లీ వాచ్యార్థ వ్యంగ్యార్థములు భిన్నవాక్యములు గావనియు, నేకవాక్యమే యనియు, రెండర్థములకును నేకవాక్యతఁ గల్పింపవలయుననియుఁ దెలిపి వాచ్యార్థ వ్యంగ్యార్థముల కుపమానోపమేయభావమును గల్పింతురు. ఎట్లన "నృసింహావతారమగు విష్ణుమూర్తిచేతికత్తి తనఖడ్గధారలో మునుఁగఁదలచిన నరులకు ననిమిషభావము (దేవత్వము) నొసఁగునట్లు నరసభూపాలుని చేతికత్తి తన ధారకు గుఱికాఁదలఁచిన శత్రువులకు ననిమిషభావమును (ఱెప్పపాటులేమి) నొసఁగును"

కాని విద్యానాథుఁ డీవిధముగాఁజెప్పక "ప్రయోక్తృవివక్షా పరతంత్రత్వాల్ లౌకికవాక్యానాం" (అపౌరుషేయమగు వేదవాక్యములలో వాక్యభేదము దోషముగావచ్చును. కాని పౌరుషేయమగు లౌకికవాక్యములలో నీదోషమురాదు. ఏలన నిట్టి యర్థద్వయమును బ్రయోక్త యుద్దేశించియే ప్రయోగించియున్నాఁడు) అనిచెప్పెను. ఈసమాధానమును బురస్కరించుకొని యొకశంక బయలుదేరుచున్నని.

ఏమన నీయర్థద్వయమునకును నేకవాక్యత యేల ? భిన్నభిన్నముగా నుంచి స్వతంత్రముగా రెండర్థములను జెప్పి శ్లేషయని యేలచెప్పఁగూడదు? ఉపమానో పమేయభావ మేల కల్పింపవలెను? అని కొందఱందురు. ఎచ్చటఁ బ్రకరణాదులచే నొకే యర్థము ప్రకృతమును, మరొకయర్థ మప్రకృతముగను దోఁచునో యట్టి చోట శబ్దశక్తి మూలవ్యంజన; *ఎచ్చట నర్థద్వయమును బ్రకృతమో యట్లుగాఁ బ్రకరణనియమము లేదో యట శ్లేష యనియు సిద్ధాంతీకరించిరి. రాఘవ పాండవీయాదులలోని పద్యములందు రెండర్థములును బ్రకృతములే కాన నచ్చట శ్లేషయే. వసుచరిత్రము నందలి పద్యములలోని రెండర్థములలో నొకటి ప్రకృత మును మరొకటి యప్రకృతమును గాన నది శబ్దశక్తి మూలవ్యంజన.

‘శబ్దస్య పరివృత్త్యసహత్వే శబ్దవ్యంజనా’ అని సిద్ధాంతము. అనఁగా నెచ్చట వ్యంజకమగు శబ్దమును మార్చి దాని పర్యాయపదము నుంచినచో నర్థాంత రము పొసగదో యట శబ్దశక్తి మూలవ్యంజన. ఇట వ్యంజకములయిన నృసింహాది పదములనుదీసి వాని పర్యాయపదముల నుంచినచో వ్యంగ్యార్థ ముత్థితము గాదు. కాన నిట శక్తి శక్తిమూలవ్యంజన.

## అర్థ శక్తి మూలవ్యంజన

చ. అలఘుపరాక్రమక్రమ సమగ్రభుజాగ్ర ! నృసింహభూప ! నీ
విలసదనూన దానగుణ విభ్రమమెంతయు నాలకించి తా
వెలవెలపాఱె మేఘు; మరవిందవిరోధియుఁ గందువాఱె; నా
కులపడెఁ గల్పశాఖ; తృణకోటి గ్రసించె సమర్థ్యధేనువుల్. ౨౦

మేఘము (పా) మేఘుఁడు.

తా. ఓ నరసభూపాలా ! నీ దాతృత్వమును విని మేఘుఁడు వెలవెలపాఱెను. (తెల్లవోయెను-శరదృతువున మేఘము తెల్లనగును గదా!) చంద్రుఁడు కందువాఱెను. (సంతాపపడెను - నలుపు లేక మచ్చను వహించెను.) కల్పవృక్షు మాకులపడెను. (వ్యాకులపాటు వహించెను - ఆకులు రాల్చెను.) కామధేనువు గడ్డికఱచెను (అవ

* ధ్వన్యాలోక మతానుసారముగా శబ్దశక్తి మూలాలంకార ధ్వనియే కాని శబ్దశక్తి మూలవస్తుధ్వని లేదు. కావున నానందవర్ధనాచార్య మతానుసారముగా వసుచరిత్రమునందు ధ్వనిగాదు. అచ్చటఁగూడ శ్లేషయే. అప్రకృతార్థమును గూడ నభిధయే బోధించును. మ[illegible] యీ శబ్దశక్తి మూలవస్తుధ్వని లేవఁదీసిరి.

మానపడెను - గడ్డినిఁ దినెను.) ఇటఁ 'దృణకోటి గ్రసించెను' అనుటకన్న 'గడ్డి కఱచెను' అను పదమునే ప్రయోగింపవలెను.

'శబ్దపరివృత్తి సహత్వే అర్థవ్యంజనా' అని సిద్ధాంతము. అనఁగా వ్యంజక శబ్దములను మార్చి వాని స్థానమునఁ బర్యాయపదములుంచినను నర్థాంతరమునకు భంగమురాదో యది యర్థశక్తి మూలవ్యంజన.

పై పద్యమున మేఘ, అరవింద విరోధి, కల్పశాఖి, అమర్త్యధేను పదము లను మార్చి వాని పర్యాయపదము లుంచినను నర్థాంతరము పొసగును. కాన నిది యర్థశక్తి మూలవ్యంజన కుదాహరణమని గ్రంథకర్త యభిప్రాయము.

ఈయుదాహరణము సరియైనది కాదు. ఇదియు శబ్దశక్తిమూలవ్యంజనయే. ఏలనఁ బైపద్యమున వ్యంజకములయిన నృసింహాదిపదములు మార్పుసహింపని విధ మున నిచ్చటను వ్యంజకములయిన వెలవెలపాఱు, కందువాఱు, ఉసులపడు, అను నవియు మార్పును సహింపవు. "తృణకోటి గ్రసించు" అను నొకపదమే సహించును. ఇట వ్యంజకములు మేఘాదిపదములు గావు. 'వెలవెలపాఱు' మొదలయినవియే వ్యంజకములు. కాననీయుదాహరణముసరిగాదు. ఈక్రిందిపద్య ముదాహరణార్హము.

గీ. ఇచట మాయత్తపండు; నేనిటఁబరుండుఁ
బగటనే లెస్సగని గుర్తుపట్టుకొనుము
రేయిచీఁకటిఁగానకరూాయిపాంథ!
పడకుమీ! మాదుమంచాలపైనిఁదప్పి

ఇచటఁ 'బడకుమీ!' అని వాచ్యార్థము. 'నా మంచముపైఁ బడుము' అనునది వ్యంగ్యార్థము. ఈ వ్యంగ్యార్థమును బోధించు శబ్దములను మార్చి వాని పర్యాయ పదము లుంచినను వ్యంగ్యార్థమునకు భంగమురాదు.

## ఉభయశక్తి మూలవ్యంజన

కం. అరిదరకరుఁడై సుమనో
వరభరణధురీణుఁడై యవారిత లక్ష్మీ
స్థిరవాసభాసురుఁడై
నరసింహుఁడువొల్చుఁ ద్రిభువనస్తుతమహిమన్. ౭౧

తా. నరసభూపాలుఁడు శత్రుభయంకరుఁడై (అరిదరకరుఁడు) పండిత భరణ మున ధురీణుఁడై, (సుమనోవరభరణధురీణుఁడు) అవారితమగు రాజ్యలక్ష్మియొక్క

స్థిరనివాసముచే వెలుఁగొందుచున్నవాఁడై, త్రిభువనస్తుతమగు మహిమతో నొప్పుచున్నాఁడు. ఇది వాచ్యార్థము.

నరసింహావతారమును దాల్చిన విష్ణుమూర్తి శంఖచక్రహస్తుఁడై (అరి = చక్రము; దరము = శంఖము - అరిదరకరుఁడు) దేవతలను భరించుటయందు ధురీణుఁడై (సుమనోవరులు = దేవతలు - సుమనోవరభరణధురీణుఁడు) లక్ష్మీదేవియొక్క స్థిరవాసముచే వెలుఁగొందుచున్నవాఁడై, త్రిభువనస్తుతమగు మహిమతో నొప్పుచున్నవాఁడు. ఇది వ్యంగ్యార్థము.

వ్యంజకములయిన శబ్దములు గొన్ని శబ్దపరివృత్తిని సహించియుఁ, గొన్ని సహింపకయు నున్నచో నది యుభయశక్తిమూలవ్యంజన. ఈ పద్యమున "అరిదరకరుఁడు, సుమనోవరభరణధురీణుఁడు" నరసింహుఁడు అను పదములు పరివృత్త్యసహములు; 'అవారిత లక్ష్మీస్థిరవాసభాసురుఁడు' 'త్రిభువనస్తుత మహిమక' పదములు పరివృత్తిసహములు. కాన నిది యుభయశక్తి మూలవ్యంజన.

లక్షణామూలవ్యంజనకు "గంగలో గొల్లపల్లె" 'బ్రాహ్మణుఁడగ్ని' ఇత్యాదు లుదాహరణములు. అభిధామూలవ్యంజనాశక్తి, లక్షణామూలవ్యంజనాశక్తి యనియే కాని వ్యంజనామూలవ్యంజనాశక్తి యుండదు. ఒకచో ('విపరీతరతే లక్ష్మీః') వ్యంగ్యార్థముగూడ వ్యంజకమై మరొక వ్యంగ్యార్థమును బోధించుచున్నను నది సంబద్ధసంబంధము గల వ్యంగ్యమని విశదపఱచియుంటిమి.

## వృత్తులు

గీ. మరియు రచనాశ్రయంబులై మధురరస ని
వేశయోగ్యత వృత్తులు కైశికియును,
నారభటియును, సాత్త్వతి, భారతియును,
నాఁగఁ బొగడొందుఁ దల్లక్షణములొనర్తు. ౭౦

యోగ్యతవృత్తులు (పా) యోగ్యతావృత్తులు.

తా. వృత్తులు, కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి, అని నాలుగు విధములు. 'రసనివేశ యోగ్యములు' అను పాఠముకన్న 'రసనిదేశ యోగ్యములు' అనియుంట లెస్స. నిదేశమన నిర్దేశము. రసనిర్దేశమునకు = రసప్రకటనమునకు లేక రస వ్యక్తికి, యోగ్యములు = తగినవి అను నర్థము లభించును. 'వృత్తులు సాక్షాదరసోప స్కారకములు' అని నిష్కృష్టార్థము. ఇవి రచన నాశ్రయించి యుండుననిని

చెప్పఁబడినది. ఇట్లు రచనాశ్రయంబు లనరాదు. నటనాశ్రయంబు లనవలెను. ఏలన, రీతులను రచనాశ్రియములే యని ముందు చెప్పుచున్నాఁడు. వృత్తులు నాట్యాశ్రయములు; రీతులు రచనాశ్రయములు నని వ్యవహారము. వృత్తులు నాట్యాశ్రయములు గాన సాక్షాద్రసోపస్కారకములు. రీతులు రచనాశ్రయములు గానఁ బరంపరగా రసోపస్కారకములు. మరియు రీతులు కైశిక్యాది వృత్తులను స్ఫుటీకరించును. రీతులనఁగా గుణసమష్టిరూపములు గాన మాధుర్యాది తత్తద్గుణములు రచనానిష్ఠములు గాన నా రీతులు కైశిక్యాది వృత్తులను స్ఫుటీకరించును. ఆ వృత్తులు రసోపస్కారములు. చూడుఁడు.

శ్లో. ముహురంగులి సంవృతాధరోష్ఠం ప్రతిషేధాక్షరవిక్లబాభిరామం
ముహురంసవివర్తి పక్ష్మలాక్ష్యాః కథమప్యున్నమితంన చుంబితంతు.

దుష్యంతుఁడు ముద్దాడఁబోయినప్పటి శకుంతలా నాట్యమును (action) గాళిదాసకవి యీవిధముగా వర్ణించుచున్నాఁడు. శకుంతల దుష్యంతుఁడు దన్ను ముద్దాడరాఁగాఁ 'దన వ్రేళుల నధరోష్ఠమును మాటిమాటికిని మూసికొనుచున్నది. వలదు వలదని ప్రతిషేధాక్షరముల నాడుచున్నది. మొగము నటునిటు ద్రిప్పుకొనుచున్నది? అట్టి మొగము నెట్లో యతిప్రయత్నముచేముద్దాడనెత్తితిని. కాని అయ్యో! ముద్దాడలేకపోయితిని' అని దీని యర్థము.

ఇచ్చటి శకుంతలయొక్క యప్పటి నాట్యము (action) కైశికీవృత్తి యనఁబడును. ఇట్టివృత్తికి మృదుమధురమగు రచన లేక రీతి కావలయును. అట్టిరీతికి వైదర్భియని పేరు. అది ముందువచ్చును. అట్టిరచనచేత నావృత్తి చక్కగా వ్యక్తమగును. ఏలన వృత్తి యాంగికాభినయరూపము. రీతి వాచికాభినయరూపము. వాచికాభినయముతోఁగూడిన యాంగికాభినయమే రసస్ఫూర్తినిఁ గలిగించునుగదా? దాన సామాజికులకు రస మనుభవమునకు వచ్చును. ఇట్లే యితరరీతులుగూడ నా యా వృత్తులను (actions) వ్యక్తముచేయును. అప్పుడు రసానుభవము సహృదయులకుఁ గలుగును. కావుననే రీతులు వృత్తులను స్ఫుటీకరించునని చెప్పితిమి. ఇట్లగుట వృత్తులు సాక్షాద్రసోపస్కారములనియు రీతులు పరంపరగా రసోపస్కారములనియుఁ జెప్పితిమి.

మ. చెలఁగుంగైశికి కోమలార్థరచనా శ్రీ; నుద్ధతార్థక్రియా
చలితాడంబరమూర్తియారభటి; యీమత్ప్రౌఢ సందర్భ ని
శ్చలయాభారతి పొల్చు; సాత్త్వతియు నీమత్కోమలార్థక్రమం
బుల; నీవృత్తులకున్ యథోచిత రసస్ఫూర్తుల్ నిరూపించెదన్.

క్రమచలితాడంబరమూర్తి (పా) క్రమాస్ఖలితాడంబరమూర్తి

తా. కోమలమైన యర్థమును వర్ణించుట కైశికీవృత్తి; మిక్కిలి యుద్ధతమైన యర్థమును వర్ణించుట యారభటి; ఈషత్ప్రౌఢమైన యర్థమును వర్ణించుట భారతీవృత్తి; ఈషత్కోమలమైన యర్థమును వర్ణించుట సాత్త్వతి: (ఇట రచనా, సందర్భ, పదములకు 'వర్ణనము' అని యర్థము. మరియు ("క్రమాచలితాడంబరమూర్తి" అన్న సమాసము క్లిష్టముగా నున్నది) ఈవృత్తుల కేయేరసము లుచితములో నిరూపింతును.

ఇటఁ గోమలార్థము, ఉద్ధతార్థము, అనునెడల 'అర్థ' మన నేమి? కావ్యము లేక యితివృత్తమునందలి రసఘట్టములు. అర్థమనఁగా 'రసము' అనియు నర్థమున్నట్లు ప్రతాపరుద్రీయ వాక్యములు తెలుపుచున్నవి. చూడుఁడు:

"అత్యర్థ సుకుమారార్థ సందర్భా కైశికీ మతా
అత్యుద్ధతార్థసందర్భా వృత్తిరారభటీ స్మృతా
ఈషన్మృద్వర్థసందర్భా భారతీవృత్తి రిష్యతే
ఈషత్ప్రౌఢార్థసందర్భా సాత్త్వతీవృత్తిరిష్యతే"

అని నొడివి "అత్యర్థసుకుమారౌ ద్వౌ శృంగారకరుణౌ మతౌ
అత్యుద్ధతరసౌ రౌద్ర బీభత్సౌ పరికీర్తితౌ
హాస్యశాంతాద్భుతాః కించిత్సుకుమారాః ప్రకీర్తితాః
ఈషత్ప్రౌఢౌ సమాఖ్యాతౌ రసౌ వీరభయానకౌ"

(శృంగారకరుణము లతిసుకుమారములు; రౌద్రబీభత్సములు మిక్కిలి యుద్ధతములు; హాస్యశాంతాద్భుతము లతిసుకుమారములు; వీరభయానకము లలఁతిగాఁ బ్రౌఢములు)అనివచించెను. అత్యర్థసుకుమారార్థసందర్భమునకు వివరణముగా"అత్యర్థసుకుమారౌ ద్వౌ శృంగారకరుణౌ మతౌ" అని చెప్పుటచే 'అర్థ' మన రసమనియే యభిప్రాయము. మరియు నాతఁడే "యత్ర శృంగారకరుణావతి కోమలేన సందర్భేణ వర్ణ్యేతే తత్ర కైశికీ" యని వృత్తినిఁగూర్చి వ్రాసికొనియున్నాఁడు. దీనివలనను అర్థమన రసమనియే యభిప్రాయము. "యత్ర......సందర్భేణ వర్ణ్యేతే" అను లక్షణ వివరణమునుబట్టి శృంగార కరుణరసములు కోమలసందర్భముచే (రచనచే) వర్ణింపఁబడవలెననియుఁ దేటపడుచున్నది. ఈ యభిప్రాయమునే మేముగూడ వృత్తులను రీతులు స్ఫుటీకరించునని వెనుకఁ జెప్పియుంటిమి.

అభినవగుప్తుఁడు 'అర్థ' శబ్దమునకు నొకానొకచో రసమనియే యర్థమును జెప్పెను. "కావ్యేచ నాట్యాయమాన ఏవ రసః కావ్యార్థః కావ్యస్య అర్థః

కావ్యార్థః (అర్థ్యతే ప్రాధాన్యేన ఇత్యర్థః నత్వర్థః అభిధేయవాచీ) ” కాన ‘అర్థ’ మన రసమనియు, రసవంతమైన యితివృత్తాదులనియు మనము గ్రహింపవచ్చును.*

కాన శృంగారమున కనుకూలమైన నాయికానాయకుల వ్యాపారములు, (actions) మలయానిల, సాయంకాల, పుష్పోద్యానాదులును గోమలార్థములు. వీని వర్ణనము కైశికీవృత్తి. ఉద్ధతార్థమన వ్యాదయోద్రేకమును లేక చిత్తదీప్తినిఁ గలిగించు యుద్ధాదిఘట్టములు. వీని వర్ణన మారభటీవృత్తి. ఇఁక సాత్త్వతీ భారతులను గూర్చి యిచ్చిన నరసభూపాలీయ లక్షణము దుష్టము. పై ప్రతాపరుద్రీయ లక్షణమున “ఈషన్మృద్వర్థసందర్భా భారతీవృత్తిరిష్యతే” అనియుండఁగా “ఈషత్ప్రౌఢ సందర్భ నిశ్చలయా భారతి” అనియు, “ఈషత్ప్రౌఢార్థసందర్భా సాత్త్వతీవృత్తిరిష్యతే” అనియుండఁగా “ఈషత్కోమలార్థక్రమము” అనియు నొకదాని లక్షణమును మఱొకదాని కంటఁగట్టినాఁడు గ్రంథకర్త. ఈషన్మృదువగు నర్థముల వర్ణనము భారతీ వృత్తి. ఈషత్ప్రౌఢములు అనఁగా నుద్ధతములగు నర్థముల వర్ణనము సాత్త్వతీవృత్తి.

ప్రతాపరుద్రీయ నరసభూపాలీయ కర్త లిరువురును కైశిక్యాది వృత్తుల లక్షణములను జెప్పుచు నందుఁ గొంత రీతినిఁగూడఁ గలుపుచువచ్చిరి. కైశిక్యాది వృత్తిలక్షణములను వివిక్తముగాఁ జెప్పరైరి.

భరతునిమతమునఁ గైశికీ, ఆరభటీ, సాత్త్వతీవృత్తులు మూఁడును అర్థవృత్తులు. అర్థమన రసమని కానీ రసానుకూలములగు విషయములని కానీ చెప్పియుంటిమి. ఇఁక భారతీవృత్తి శబ్దవృత్తి. అనఁగా వాగ్వ్యవహారము. (భారతీ సంస్కృతప్రాయో వాగ్వ్యాపారో నటాశ్రయః) విద్యానాథుఁడు శబ్దవృత్తి యగు భారతీవృత్తినిఁ గూడ నర్థవృత్తినిఁగా మార్చి ‘ఈషత్ప్రౌఢార్థ సందర్భా భారతీవృత్తి రిష్యతే) అని లక్షణమును వ్రాసెను. భరతుని మతమున మూఁడర్థవృత్తులని తెలిపితిమి. వృత్తులను రీతులు స్ఫుటీకరించునని చెప్పియుంటిమి కదా! కావున మూఁడువృత్తులకు మూఁడురీతులు గావలయును. రీతి యన శబ్దముల కూర్పుగదా! అదియేకదా భారతీ వృత్తి. కావున నీ భారతీవృత్తియే మూఁడు రీతు లయ్యెను. భారతీవృత్తి యనఁ

---

*దీని కవష్టంభకముగా Some concepts of Alankara Sastra అను గ్రంథమున నిట్లుగలదు: “They keep the concept of the four ancient Vrittis derived from Natya, Kaisiki etc., and hold them, as Anandavardhana did, *as the name of the devolopment or delineation of such ideas, Artha as are in consonance with Rasa’.*

గావ్యమునందలి వాగ్వ్యవహారము లేక వాగ్రచన లేక శబ్దరచన. ఈశబ్దరచన మువ్విధములు. ఈ ముత్తెఱఁగులగు రీతులును ముత్తెఱఁగులగు వృత్తులను స్ఫుటీకరించును. భారతీవృత్తి నర్థవృత్తిగా మార్చినచో మూఁడేరీతులు వానినాల్గింటి నెట్లు స్ఫుటపఱపఁగలవు? అప్పుడు నాలుగురీతులు గావలయును. సాహిత్యదర్పణకారాదులు నాలుగురీతులు స్వీకరించిరి. కాని న్యాయముగా విచారింపఁగా మూఁడువృత్తులును, మూఁడురీతులును జాలునని నాయాశయము. మూఁడు వృత్తులు, మూఁడు రీతులు, మూఁడుగుణములు, మూఁడుపాకములు నున్నచోఁ బరస్పరసంబంధబాంధవ్యములు సముచితముగా నుండును.

గీ. కైశికి చెలంగు శృంగార కరుణలందు
నారభటి రౌద్రబీభత్స హారిణియగు
నలరు భారతి హాస్యశాంతాద్భుతముల
నమరుసాత్త్వతి వీరభయానకముల. ౩౪

స్పష్టము (కరుణాపదము దుష్టము- కరుణములందు, అనవలెను.)

## కైశికి

ఉ. తిన్నని మేను, గన్నుగవ, తేటలుఁ, దేనియలొల్కు మాటలున్
సన్నపుఁగౌనుఁ, గుందనపుఁజాయలు దేఱు మెఱుంగుఁజెక్కులున్
గ్రొన్నెలవంటి నెన్నుదురు, గుబ్బచనుంగవ, తళ్కుచూపులున్
జెన్నలరారఁగన్య నరసింహునిఁజూచె విలాసధన్యయై. ౭౫

తళ్కుచూపులున్ (పా) తళ్కుచెక్కులున్

ఇట శృంగారరసానుకూలమగువస్తువు కన్య. కాన దాని వర్ణనము కైశికీవృత్తి. ఈవృత్తిని (వైదర్భి) రీతి స్ఫుటీకరించుచున్నది. అనఁగా నీపద్యమున రీతిచే శృంగారసము వ్యక్తమగుచున్నది.

## ఆరభటి

పరిపంథిపక్షపక్ష్మపక్షః ఫలకవిదళనప్రౌఢ గాఢపరితాప
ప్రతిభాసంరంభగుంభప్రబలసుబల శుంభన్నృసింహోగ్రరంహో
యుతమైకల్పాంతదృప్యద్ద్యుమణి ధగధగప్రోద్యత్జ్వాలజాల
ప్రతికూలప్రక్రమంబై పరగు నరసభూపాలదోః ఖడ్గమార్జీ. ౭౬

ఇందు యుద్ధఘట్టమునందుఁ దాండవించు నరసభూపాలుని ఖడ్గము వర్ణింపఁబడినది. ఇది రౌద్రరసానుకూలమగు వస్తువు. దీనిని గాడీ రీతి స్ఫుటీకరించును. అనఁగా నీపద్యమున తిచే రౌద్రరసము వ్యక్తమగుచున్నది.

## భారతి

సీ. నీకీర్తికెన యని నెగడిన సురదంతి
శిరము మధ్యేభిన్నతరము గాదె!
నీకీర్తితోఁ బ్రతి నెరసిన యిందుమం
డలము పదాలు ఖండములు గాదె!
నీకీర్తి నొరసిన కాకోదరస్వామి
తల సహస్రచ్ఛిదాకులము గాదె!
నీకీర్తిఁబోలఁబూనిన ధవళాంభోజ
తతి శతధాదళితంబు గాదె!

గీ. అహహ! నీకీర్తి కవనిలో నమర కరియు
గిరియు నిందుండు గిందుండు నురగపతియు
గితియుఁ దెలిదామరలచాలు గీలునెనయె?
యాబలేందుగ్రని నారసింహక్షితీంద్ర! ౭౭

ప్రతినెరసిన (పా) ప్రీతినెరసిన; మధ్యేభిన్నతరము (పా) మధ్యము భిన్నతరము.

'మధ్యే భిన్నతరము' అను పద మసాధువు. 'పారే మధ్యే షష్ఠ్యావా' అను పాణిని సూత్రముచే షష్ఠ్యర్థమునందే పారే మధ్యే పదములు నిపతితములు. ఇట షష్ఠ్యర్థము లేదు.

ఇది యద్భుతరసానుకూలమగు వస్తువర్ణనము. దీనిని వైదర్భీరీతి వ్యక్తము సేయుచున్నది.

## సాత్త్వతి

చ. ఉభయరగండ! తావకరణోగ్రజయానకముల్ గుభుల్ గుభుల్
గుభులని మ్రోయఁగా, భవదకుంఠిత వీరభటుల్ "ప్రభుల్ ప్రభుల్
ప్రభు''లని శత్రుభూపతులపైఁ జొఱఁబాఱు నెడన్ ''విభుల్ విభుల్
విభు''లని సంభ్రమింపుదురు వేడ్కనఖర్వ సుపర్వభామినుల్. ౭౮

ఇట వీర శృంగారానుకూలమగు వస్తువర్ణనము గలదు. వీనినిఁ బాంచాలీరీతి వ్యక్తము సేయుచున్నది.

గీ. ఇంక రీతులు వివరింతు వృత్తులట్ల
సముచితార్థపదన్యాస సౌష్ఠవములు
గాక సందర్భమాత్ర సంగతిములైన
కతన రీతులు వృత్తిభిన్నతఁ జెలంగు. ౭౯

తా. వృత్తులవలె రీతులు సముచితార్థ పదన్యాస సౌష్ఠవములు గాక కేవలముగా సందర్భసంగతములు. కావున వృత్తిరీతులు భిన్నములు.

'సముచితార్థ పదన్యాస సౌష్ఠవములు' అన సముచితమైన అర్థము గల పదములయొక్క న్యాససౌష్ఠవముగలవి' అని యర్థము. న్యాససౌష్ఠవమనఁ గూర్పుయొక్క చక్కనయనఁగాఁ 'జక్కనికూర్పు' అని భావము వచ్చును. కానీ పదన్యాససౌష్ఠవమనుదానికి 'వర్ణనము' అను నర్థము వేసికొని సముచితమైన యర్థము (రసానుకూల వస్తువు) యొక్క వర్ణనము గలవి 'వృత్తులు' అని చెప్పుకొనవలయును. లేనిచో నర్థము కుదరదు. ఈవిషయమును వెనుకఁ బ్రస్తావించియుంటిమి. ఇఁక రీతులు సముచితార్థము నపేక్షింపక కేవలము 'శబ్దములకూర్పు' రూపమున నుండును. అని చెప్పబడినది. ఈమాట పొసఁగదు. రీతులు సముచితార్థమును (రసానుకూలమగు వస్తువును) నపేక్షింపనిచో శృంగారమున గౌడీరీతియు రౌద్రమున వైదర్భీరీతియు వ్యవహరింపవచ్చునని యభిప్రాయము వచ్చును. అట్లయగుచో నట్టిరచన రసప్రతిబంధకమగును. రీతులుగూడ రసవ్యక్తిహేతువులే.

తత్తద్రసోపకారిణ్య స్తత్తద్దేశ సముద్భవాః
పద్యేషు రీతయోగౌడీ వైదర్భీ మాగధీ తథా

ఆయాదేశములవలనఁ బుట్టిన గౌడీ, వైదర్భీ, మాగధీ (పాంచాలీ) రీతులు రసోపకారిణులు అని యలంకారశేఖరమునను గలదు.

రీతు లెప్పుడును వృత్తులనాశ్రయించియే యుండును. వృత్తుల యభివ్యక్తికి రీతులసాహాయ్య మపేక్షితమై యున్నది. కావున నివి యన్యోన్యాశ్రయములై యున్నవి. వృత్తులురీతులమూలముననేభాసించును గనుక రీతులనువిడిచివృత్తులుండవు. అట్లగుటచే సాహిత్యదర్పణకారాదులు తమగ్రంథములలోఁ గైశిక్యాది వృత్తులను గూర్చి తడవక కేవలము రీతులనే చెప్పి వదలిరి. కావున మనము వృత్తి రీతులకు భేదము నీక్రింది విధమునఁ దెలిసికొనవలయును. వృత్తు లర్థాశ్రయములు. అనఁగా

రసానుకూల నాయకవ్యాపారములు లేక రసానుకూలవస్తువులు. కాన సాక్షాద్రసోపస్కారములు. రీతు లీవృత్తుల నుచితముగా వ్యక్తము సేయునవి. కానఁ బరంపరగా రసోపస్కారములు.

"స్త్రీతి నామాఽపి మధురం" (స్త్రీయను పేరుగూడ మధురము) అనియున్నది. కావున శృంగారరసమున కాలంబనమైన స్త్రీ మధురపాత్రమైనపుడు దాని చేష్టలును దాని యుద్దీపనసామగ్రియు మధురము లేకదా! కావున వీనిని వినఁగానే యప్రయత్నముగానే శృంగార ముబుకును. అట్లే యుద్ధాదిఘట్టములనుగూర్చి వినఁగానే మనకు రౌద్రరసము ఉబుకును. కావుననే వృత్తులు సాక్షాద్రసోపస్కారకములని చెప్పితిమి.

గీ. పరగురీతులు కోమల ప్రౌఢపదవి
ధానవాసన; నందు వైదర్భియనఁగ
గౌడి పాంచాలియనఁబొల్చుఁ; గ్రమముతోడ
వీనికివి లక్షణంబులు విస్తరింతు. ౮౦

తా. కోమలపదరచననుబట్టియుఁ బ్రౌఢపదరచననుబట్టియు నుభయవిధమగు రచననుబట్టియు వైదర్భి, గౌడి, పాంచాలి యని రీతి మూఁడువిధములు.

గీ. అతిమృదులబంధయుత, యనాయతసమాస
దనరు వైదర్భి; రూక్షబంధయును, ఖరస
మాసయగు గౌడి; యుభయాత్మ మహిమగలిగి
యలరుఁ బాంచాలి; వీని లక్ష్యములొనర్తు. ౮౧

తా. మిక్కిలి మృదుపదములును, అల్పసమాసములుగాని లేక యసమాసముగాని కల రచన వైదర్భి. పరుషాక్షరములతోఁగూడిన పదములును, దీర్ఘసమాసములునుగల రచన గౌడి. కొంత మృదుపదరచనయుఁ గొంత పరుషపదరచనయుఁగలది పాంచాలి. వీని లక్షణములను జూపుదును.

## వైదర్భి

శా. ఆలావణ్యమగణ్య; మాగుణగణం, బవ్యాజ; మాతేజము
ద్వేలం: బావినయం బమేయతర; మావీర్యం బనిర్వాచ్య; మా
యాలాపంబతిసత్య; మావితరణం బాశాంతవిశ్రాంతి; మా
శీలంబార్జవమాల మెన్నఁదరమే? శ్రీనారసింహేంద్రునిన్. ౮౨

ఇందన్నియు మృదుపదములే. సమాసము లేదు. 'ఆక్రాంతవిక్రాంత' మను చోట 'అల్పసమాసము' గలదు. ఇది వైదర్భీరీతి.

## గౌడి

శా. అంభోరాశిగభీర ! రాయబయనృసింహా ! నీరణోద స్తదో:
స్తంభో త్తంభిత జృంభితాసిలతికా సంరంభసంభావనా
దంభానర్గళదుర్గ, దుర్గమమదోద్యద్దుష్టధృష్టారి రా
ట్షుంభచ్ఛుంభ నిశుంభసంభ్రమ హారస్ఫూర్తిన్ విడంబించురా!

తా. నీదోః స్తంభమున విజృంభించుచున్న ఖడ్గలత యను కాళికాదేవి శత్రురాజులనుశుంభనిశుంభులను హరించుచున్నది.

ఇందుఁ బరుషాక్షరములుం గలపదములును దీర్ఘసమాసములును గలవు. కానగౌడి.

## పాంచాలి

శా. ఆరూఢిం దపమాచరించెదవు చంద్రా! ఫుల్ల మందాకినీ
తీరక్షోణితటిన్ మహానటజటా దీర్ఘాటవీవాటిలోఁ
బ్రారబ్ధంబగు మేనియంకము హరింపన్ పేడి; యింతేల ? నీ
కారాధింపఁగరాదె! రాయబయనృసింహాధ్యక్షు సత్కీర్తులన్.

తటిన్ మహానట (పా) నటన్మహానట; రటన్మహానట.

ఇటఁ గొంత దీర్ఘసమాసమును గొంతమృదుపదబంధమునుగలదు. కానఁబాంచాలి.

న్యాయముగా 'రీతి' యన గుణసంకలనరూపమే కదా! కావున రీతులను గూర్చి చెప్పినపుడా రీతులుం దేనివలన నేర్పడుచున్నవో యా గుణముల నిటనే చెప్పవలసియున్నది. కాని యీ విచారము ప్రత్యేకముగా వేఱొకచోటఁ జేయఁబడి యున్నది.

## పాకము

ఉ. పాకము దీరితార్థ పరిపాకమనం దగు; నందు గోస్తనీ
పాకము, నారికేళఫల పాకమనన్ ద్వివిధంబు; గోస్తనీ
పాకమ సంవృతార్థ పరిపాకనివేద్యము; నారికేళపా
కాకలనంబు గూఢసిబిడార్థవిచార్యము; వీని లక్ష్యముల్. ౨౫

అర్థముయొక్క పాకము రెండువిధములు. అర్థమనఁగా నిట భావము. ద్రాక్షాపాకమనియు, నారికేళపాకమనియు నిరుదెఱఁగులు. ద్రాక్షాపాకమనఁగా నసంవృతమైన (అగూఢమైన) యర్థముయొక్క రుచి. నారికేళపాకమన గూఢమైన యర్థముయొక్క రుచి. మరియు నీ విశేషమును గ్రహింపవలెను. ద్రాక్షాఫలముయొక్క రుచినిఁ జూచుట మిక్కిలి సుకరము. చెట్టునుండి కోయఁగానే యప్రయత్నముగా దాని రుచి ననుభవింపవచ్చును. అట్లే యెట్టి బుద్ధిప్రయత్నమును నక్కఱలేకయే గోచరించి యానందపఱచు నర్థభేదము ద్రాక్షాపాకము.

ఇఁక నారికేళముయొక్క రుచి చూచుట మిక్కిలి దుష్కరము. దానిపైనున్న దట్టమైన బరడును గునపముతోఁ దీసి టెంకను బగులఁగొట్టి లోని కొబ్బెరను గట్టిగా నమలవలెను. అప్పటికిఁగాని దాని రుచి తెలియదు. కాన నధిక బుద్ధిప్రయత్నముచేఁ దెలియఁదగిన యర్థభేదము నారికేళపాకము. ఎంత యత్నించినను నారికేళపాకము ద్రాక్షాపాకమువంటిది గాదు. ఇవిగాక కదళీపాకమనియు మరియొకటి గలదు. కదళీఫలమును రుచిచూచుటకు ద్రాక్షాఫలమును రుచిచూచునంత సౌలభ్యముగానీ నారికేళమును రుచిచూచునంత క్లేశముగానీ యుండదు. కదళీఫలమును పైనున్న చర్మమును దీసి యల్పతిజతనముతో నమలుదుము. కాన నాతికఠినము నాతిసులభమును గాని యర్థభేదము కదళీపాకము.

మరియొక విశేషమును గమనింపవలెను. ద్రాక్షాఫలమునఁ బరిత్యాజ్యమగునదేదియును లేదు. కదళీఫలమున నల్పతిగాఁ బరిత్యాజ్యము గలదు. నారికేళమునఁ బరిత్యాజ్య మధికము. కాన సర్వాకారముగా మధురమును, ప్రచురముగా మధురమును, అల్పమధురమును నగు కావ్యము లాయాపాకముగాఁ బరిగణింపఁబడును. కదళీపాకమును గూర్చి విద్యానాథుఁడును, ఇట్టుమూర్తియును దెలుపరైరి. కాని యిది యవసరమే. ఏలన, మూఁడర్థవృత్తులకును మూఁడురీతులు వలయును. మూఁడురీతులకును మూఁడుగుణములు వలయును. (వామనమతమున ౧౦ గుణము లున్నవి) ఆ వృత్తి, రీతి, గుణములయొక్క కలయికవలనఁ గలిగిన (పానకరసన్యాయమునఁ గలిగిన) రుచిభేదమే పాకము. కావున మూఁడుపాకము లుండవలయును.

## ద్రాక్షాపాకము

కం. వాలికలై వెలిదమ్ముల

పోలికలై చందమామ పులుఁగులకును దా

మేలికలైన నిరీక్షణ
మాలికల నృసింహుఁజూచె మదవతి వేడ్కన్. ౭౬

ఇచ్చటఁ బద్యభావ మయత్నముగాఁ గోచరించుచున్నది. కాన ద్రాక్షాపాకము. ఇట్లే

ఉ. నిక్కముదాఁపనేల ధరణీసురనందన! నాకు నీపయిం
జిక్కె మనంబు; నింక ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో?
చొక్కి మరందమద్యములచూఱలఁ బాటలుపాడు తేంట్ల సొం
పెక్కిన యట్టి పూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో?

ఇందును ద్రాక్షాపాకము గలదు.

## నారికేళపాకము

మ. వరభూషాదులపై మనంబిడక, దృగ్వ్యాపార మెంతేఁ బర
స్పర సందర్శన నాతిభిన్నమయి చూపట్టంగఁ, గార్యాంతర
స్మరణం బేమియులేక నిశ్చలత నీ సాంగత్యముం గోరి మా
హరిణీలోచన యాత్మయందు నరసింహా! నిన్నె భావించెరా!

తా. మా చెలికత్తె తన మనస్సును ధన కనక వస్తు వాహనాదులపైఁ బోనీక (ఇతరులం దన కివి యిత్తునన్నను లెక్కింపక) దృగ్వ్యాపార మొకరినొకరు చూచుకొనుటకన్న భిన్నముగానిదికాఁగా ననఁగా నిన్నదియు నది నిన్నును జూచు చున్నట్లుగానే చూపట్టఁగా దేనినిఁ గూడఁ దలంపక నీసాంగత్యమునుగోరి యాత్మయందు నిన్నే స్మరించుచున్నది.

ఈ యర్థము విస్పష్టముగా గోచరింపక క్లేశముచే గోచరించుచున్నది. కాన నారికేళపాకము. ఈనారికేళపాకమునకు "వెనుకటి ఆరభటీవృత్తి కుదాహృతమగు ప్రతిపక్షక్ష్మాప" పద్యముగూడఁ దగినది. మరియు 'ఆముక్తమాల్యద' లోని పెక్కు పద్యముల నుదాహరింపవచ్చును.

## కదళీపాకము

ఉ. నిండుమనంబు నవ్యనవనీత సమానము; పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు: నుర్వినీ
రెండును రాజులందు విపరీతము; గావున విప్రుఁడోపు; నో
పండలికాంతుఁ డయ్యువరసాలందు శాపము [illegible]

ఇందలి 'విపరీతము' అనుపదము బ్రాహ్మణధర్మమునకు క్షత్రియధర్మము విరుద్ధమైనది. (తలక్రిందు) అనునర్థమును బోధించును. ఈపద్యమును రెండుసారులు చదివినఁగాని యర్థముగోచరింపదు. అలఁతిజతనము గావలయునుగానఁ గదళీపాకము.

వెంత్తముమీఁద నీక్రిందివిషయమును గ్రహింపవలెను.

కైశికీవృత్తి, వైదర్భీరీతి, మాధుర్యగుణము, ద్రాక్షాపాకమును;
ఆరభటీవృత్తి, గౌడీరీతి, ఓజోగుణము, నారికేళపాకమును;
సాత్త్వతీవృత్తి, పాంచాలీరీతి, ప్రసాదగుణము, కదళీపాకమును;
అన్యోన్యాశ్రయములుగా నుండును. ఇంకను వీనివివేచనము ముందుచేయుదుము.

## శయ్య

కం. కదిసిపదంబులు ముండఱి
పదములతోఁ బరమమైత్రిఁ బరగి పరపదా
స్పదమనకుండిన గతులం
దదిశయ్య; తదీయలక్ష్య మాపాదింతుఁ. ౮౭

తా. "పదములయొద్దిక లేక పదములపాటు శయ్య" అనఁగా నేపదమువెంట నేపదముగూర్చిన సొబగోయదిశయ్య. స్త్రీపురుషులు వేషములుధరించునపు డేచీరకు నేరవిక యందమో యేకోటునకు నేపర్టు అందమో విచారించుకొందురు కదా! అట్లే పదరచనయందునుబొత్తుండవలెను. పొత్తుపొసగని పదరచన గూడదు. ఈశయ్య నే పరివృత్త్యసహిష్ణుత యందురు.

కం. రతిపతివో చెలువున! భా
రతిపతివో? నుతిగుణాభిరామత రామ
క్షితిపతివో? ధరనోబ
క్షితిపతినరసింహ; శౌర్యజిత నరసింహా! ౮౮

ఇది యనుప్రాసభూయిష్ఠముగా నున్నది. కాఁబట్టి యిట్లనుప్రాసభూయిష్ఠముగానుంటయే శయ్యయని భ్రమింపరాదు. చూడుఁడు.

కం. చెఱనుండి ముక్తిగాంచిన
నరుగతి నీదేహబంధనమువీడి మహా
త్తరగతిఁ బొందెడి జీవుల
కీవు [illegible]

ఇందును బదములయొద్దిక గలదు. ఇదియుఁ బరివృత్త్యసహిష్ణువే. శయ్యకు శబ్దపాకమనియు, ద్రాక్షాదిపాకముల నర్థపాకమనియు నామాంతరము.

వెనుక రీతులు గుణసమూహరూపములని చెప్పితిమిగదా! పరివృత్త్యసహిష్ణువుగా గుణములను సంకలనముచేయుటయే శయ్యయగును. కావున శయ్య రీతులధర్మ మనవచ్చును. ఆయా రీతులకుఁ దగిన విధమునఁ బరివృత్త్యసహిష్ణువుగా గుణసంకలనము చేసినయెడల శయ్య యగును.

ఈ శయ్యావిషయమునఁ గవులు జాగరూకత వహింపవలెను. భామహుఁడు

"మాలాకారో రచయితి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యే ష్వవహితధియా తద్వదేవాభిధానం"

పూలమాలనుగట్టువాఁ డేపువ్వు నేపువ్వుతో జోడించినచో బాగుగానుండునో యది లెస్సగా విచారించి కట్టునట్లు కవియు నవధానముతో నేపదముతో నేపదమును జోడించిన నందముగానుండునో తెలిసికొని రచింపవలెను" అని చెప్పెను. ఆంగ్లమునఁగూడ నీశయ్య గలదు. క్రిందఁ జూడుఁడు.*

Wordsworth మహాకవియు నిట్టి యభిప్రాయమునే తెలిపెను. "The choice of best words in best place"

మరియు పింగళిసూరన

"సీ. పాసఁగ ముత్తెపుసరుల్ పోహళించిన రీతిఁ
దమలోన దొరయు శబ్దములు గూర్చి"

అని యీ యభిప్రాయమునే తెలిపెను.

ఈ వృత్తి, రీతి, శయ్య, పాకములనుగూర్చి మరికొంత చర్చింతము.

## వృత్తి

వృత్తిశబ్దమునకు సరస్వతీకంఠాభరణ వ్యాఖ్యానమున రత్నేశ్వరుఁ డీ క్రింది విధమున వ్యుత్పత్తినిఁ దెలిపెను.

---

* Lord Mecaulay in his essay on Milton expresses the same idea. He speaks of the magical influence of Poetry; The expression in general means nothing; but applied to the writings of Milton, It is most appropriate. His poetry acts like an incantation.........Change the structure of the sentence, Substitute one synonym for another and the whole effect is destroyed. This felicity of expression of words is what Sanskrit writers on poetics called మైత్రీ, శయ్య or పాక.

Bhandarkar Commemoration Volume. 403 page.
(Trivedi on Bhamaha)

"యా వికాసేఽథ విక్షేపే సంకోచే విస్తరే తథా
చేతసో వర్ణయిత్రీ స్యాత్సా వృత్తిస్సాఽపి షడ్విధా
"వర్తతే అనయాచిత్తం వికాసాదిషు ఇతి కరణసాధనోఽయం వృత్తిశబ్దః"

(దేనిచే ననఁగా నేవ్యాపారముచేఁ జిత్తవికాస, విక్షేప, సంకోచ, విస్తరములు గలుగునో యావ్యాపారము (నాయికా నాయకాదుల వ్యాపారము) వృత్తి యని వ్యవహరింపఁబడును. అర్థవృత్తులన్నపు డర్థశబ్దమునకు రసమనియు, రసానుకూలమగు వస్తువనియుఁ దెలిపితిమి. కావున నర్థవృత్తులన నట్టి రసానుకూలములగు వ్యాపారములు (actions) అని యర్థము. వీనివలనఁ జిత్తవికాసాదులుకలుగును. లోచనకారుఁడు "వ్యవహారోహి వృత్తి రుచ్యతే" (వృత్తి యనఁగా వ్యవహారము) అనిచెప్పెను. వ్యవహారమన వ్యాపారమే. ఈ వ్యాపారము శబ్దాశ్రితము, అర్థాశ్రితము నని ద్వివిధము. అనఁగా శబ్దవృత్తి, అర్థవృత్తి అని ద్వివిధము. శబ్దవృత్తి మరల రెండు విధములు. ౧. అభిధాదివృత్తులు, ౨. ఉపనాగరకాదివృత్తులు. అభిధాదివృత్తులను గూర్చి యిదివరకే వివరించితిమి. ఇట నుపనాగరికాదివృత్తులనుగూర్చియే విచారము.

ఈ వృత్తులు మొదటఁ బ్రధానముగా ననుప్రాసము నాశ్రయించియుండెను. ఉద్భటుఁ డనుప్రాసమును పరుషా, ఉపనాగరికా, గ్రామ్యా, లేక కోమలా, అని మూఁడుతెఱఁగులుగా విభాగించెను. వృత్తియన నిట నియతవర్ణగత మగు రసవిషయ వ్యాపారము. అనఁగా 'కలకలకోకిల లలితే' ఇత్యాదిస్థలమున 'ల' వర్ణము పెక్కు సారులు వచ్చుటచే శ్రావ్యత గలుగుచున్నది. ఇట్టి శ్రావ్యతను లేక సౌందర్యమును గూర్చు వ్యాపారమే వృత్తి. ఇదియే రసవిషయ వ్యాపారము. ఇట రసపదమునకు సౌందర్యమనియే యభిప్రాయము.

రుద్రటుఁడు మధురా, పరుషా, ప్రౌఢా, లలితా, భద్రా, అని యైదువిధములుగా విభజించెను. ధ్వనికారుఁ డీ వృత్తులనుగూర్చి సూటిగా నిర్వచింపలేదు. మమ్మటుఁడు "ఏతాస్తిస్రో వృత్తయః వామనాదీనాం మతే వైదర్భీ, గౌడీ, పాంచాల్యాఖ్యరీతయో భవంతి" (ఈమూఁడువృత్తులనుననఁగా కోమలా పరుషా, ఉపనాగరికా, వృత్తులు వామనాదులమతమున వైదర్భీ గౌడీ పాంచాలీరీతులే) అని యుద్భటుని వృత్తిత్రయమును వామనుని రీతిత్రయములో నంతర్భవింపఁజేసెను. జగన్నాథుఁడు రీతిని వృత్తి యని వ్యవహరించెను. "తాం విబుధా వదంతి వృత్తిం గృహీత పరిపాకాం" అస్యాశ్చ రీతేర్నిర్మాణే కవినా నితరామవహితేన భావ్యం" ఇఁక నభినవగుప్తుఁడు "రీతయస్తు గుణేష్వేవ పర్యవసితాః" (రీతులు గుణములలోనే పర్యవసించును) అనియు, "నైవ వృత్తిరీతీనాం తద్గుణవ్యతిరిక్తత్వం సిద్ధం" (వృ

రీతులు గుణవ్యతిరిక్తములు గావు) అనియుఁ దెలిపి ధ్వనికారుఁ డంగీకరించిన మాధుర్యౌజః ప్రసాదము లను మూఁడు గుణములలోనే వృత్తిరీతుల నంతర్భవింపఁ జేసెను. రత్నేశ్వరుఁడు "తస్యాః (రీతేః) గుణవత్పదరచనా రూపత్వాత్; అత ఏవ పానకరసన్యాయేన సంభూయ చిత్రాస్వాద పర్యవసానక్షమం గుణసంకలన మేవ రీతి రితిలోచనకారః" (రీతి యనఁగా గుణములు గల పదరచనయే; కావునఁ బానక రసమువలెనే యీ గుణములన్నియును గలిసి యాస్వాదమును గలిగించును. కాన గుణసంకలనమే రీతి) అని లోచనకారుఁడు దెలిపెనని తెలిపెను. కావున నీ రీతులును, వృత్తులును శబ్దాశ్రితములే కాన నామభేదమే కాని యన్యభేదములేదు. కావునఁ దత్తద్రసోచితముగాఁ గావ్యమున నిరూపితములగు మాధుర్యౌజః ప్రసాదములలోనే వృత్తిరీతు లంతర్భవించును.

పైని నుడివిన శబ్దవృత్తులు గాక యర్థవృత్తులని మరికొన్ని గలవు.

అర్థమనఁగా గావ్యవస్తువు. అనఁగా నితివృత్తమనియు రసములనియుఁ దెలిపితిమి. వృత్తియన నభినవగుప్తుఁడు "రసోచితఏవ చేష్టావిశేషోవృత్తిః" (ఆయితివృత్తరసానుకూలమగు చేష్టావిశేషమేవృత్తి) అనివచించెను. అనఁగా నాయారసానుకూలముగా నాటకాదులందు నాయకాదులుసేయు నౌచిత్యయుక్తమగు వ్యాపారము. దీనినే యాంగ్లమున action అందురు. నాటకాదులందు శృంగారరస మభినయించు నాయకాదుల వ్యాపారము కైశికియనియు, రౌద్రరసమభినయించు నాయకాదుల వ్యాపారము 'ఆరభటి' యనియు బీభత్సమభినయించు నాయకాదుల వ్యాపారము సాత్త్వతియనియునభిప్రాయము. దృశ్యకావ్యమున నీమూఁడేయర్థవృత్తులు. భరతుఁడు భారతీవృత్తిని శబ్దవృత్తిగానే పరిగణించెను. అనఁగా నాటకమునందలి వాగ్వ్యవహారము. ఈ భారతియొక్క ప్రభేదములే వైదర్భీ, గౌడీ, పాంచాలీ రీతులు, అని తెలిపియుంటిమి.

ఈ యర్థవృత్తులు మొదట దృశ్యకావ్యాశ్రయములుగా నున్నను లాక్షణికులు వీనిని శ్రవ్యకావ్యమునగూడఁ బ్రవేశపెట్టిరి. అత్తటి శబ్దవృత్తియగు భారతీ వృత్తినిఁగూడ నర్థవృత్తినిఁ జేసిరి. విద్యానాథుఁడు గైశిక్యాదులగు నాలుగువృత్తులను నర్థవృత్తులనియే చెప్పెను. (మూఁడేయర్థవృత్తులుండుట న్యాయమని చెప్పితిమి) అతనిననుసరించి బట్టుమూర్తియు నాలుగర్థ వృత్తుల నుదాహరించెను. ఇంతేకాదు. "కైశికిచెలంగు శృంగారకరుణలందు" అనుపద్యమున గైశిక్యాదులనుభరతప్రోక్తములగు రసములందేకాక యితర రసములందును నుండునని విద్యానాథుననుసరించి చెప్పెను. ఈ యర్థవృత్తులను గోమలప్రౌఢాది రచనలు (రీతులు) స్ఫుటముచేయును.

రీతులచేతనే యాయావృత్తు లాస్వాద్యమానములగును. కావున వృత్తిరీతులన్యో న్యాశ్రయములు.

## రీతి

తత్తద్దేశీయు లాశ్రయించుటంబట్టి తత్తద్దేశ నామముచేఁ గావ్యమునఁ దత్త్రీతు లేర్పడినవి. విదర్భదేశీయు లాశ్రయించినరీతి వైదర్భియనియు, గౌడ దేశీయులాశ్రయించినరీతి గౌడియనియుఁ, బాంచాలదేశీయు లాశ్రయించిన రీతి పాంచాలియనియు వ్యవహరింపఁబడును.

భామహునికన్న ముందే వైదర్భీ, గౌడీ, రీతులనురెండు కావ్యరీతులు లోకమునఁ గలవు. అందు వైదర్భ యుత్తమమనియు, గౌడి యధమమనియు, నభి ప్రాయము ప్రబలియుండెను. కాని భామహుఁ డాభేదమును బాటింపక నిరసిం చెను. కావ్యమునకుఁ బ్రధానమైన వక్రోక్తి యున్నచో నేరీతియైన నుపాదే యమే. కాని వైదర్భీ, గౌడీ భేదములనుబాటించి యది యుత్తమమనియు, నిది యధమమనియుఁ జెప్పరాదని భామహుని వాదము. భామహుని తరువాతి వాఁడగు దండి వైదర్భీ, గౌడీరీతుల రెంటిని నంగీకరించెను. ఇతఁడు దనగ్రంథ మగు కావ్యాదర్శమున 'రీతి' అనుపదమును వాడక 'మార్గము' వర్త్మము, (కావ్యమార్గము కావ్యవర్త్మము) అనుపదములు వాడెను: పిమ్మట వామనుఁడు వైదర్భీ, గౌడీ, పాంచాలీ రీతులను మూఁటినిమాత్రమే యంగీకరించెను. తరువాత రుద్రటుఁడు పై రీతులకు 'లాటీయా' అను మరొకటిఁజేర్చి నాలుగు సేసెను. భోజుఁడు తన సరస్వతీ కంఠాభరణమున రుద్రటుని నాలుగురీతులకు మాగధీ, అవంతీ నామకములగు మరి రెండురీతులను జేర్చి మొత్త మాఱురీతు లుదాహరించెను. శారదాతనయుఁడు తన భావప్రకాశములో

శ్లో. ప్రతివచనం ప్రతిపురుషం తదవాంతరజాతితః ప్రతిప్రీతి
ఆనంత్యాత్సంక్షిప్య ప్రోక్తా కవిభిశ్చతుర్విధే త్యేషా
తాసు పంచోత్తరశతం విధాః ప్రోక్తా మనీషిభిః
గ్రంథవిస్తరభీతేన మయా తాభ్యో విరమ్యతే
తఏవాక్షరవిన్యాసా స్తాఏవ పదపంక్తయః
పుంసిపుంసి విశేషేణ కాఽపికాఽపి సరస్వతీ
తస్మా చ్చతుర్ధా బోద్ధవ్యా రీతిభేద ప్రకల్పనా

అనఁగాఁ బురుషులనుబట్టి నూటయిదురీతులు గలవనియు సంక్షేపించి నాలుగు రీతులు మాత్రమే యంగీకర్తవ్యము లనియుఁ దెలిపెను. శారదాతనయుఁడు రీతులు

గ్రంథకర్తలనుబట్టి యేర్పడుచున్నట్లు తెలిపెను. వాస్తవ మేమన నాయారసాను కూలముగా రీతు లుండవలయును. కాని కవినిఁబట్టికాదు. ప్రతాపరుద్రీయకర్త వామనమతానుసారముగా మూఁడు రీతులనే గ్రహించెను. ఈ రీతిత్రయసిద్ధాంతమే ధ్వనికారసమ్మతము. నరసభూపాలీయకర్తయు నామూఁడురీతులనే స్వీకరించెను.

ఈ రీతిసిద్ధాంతమును మొట్టమొదట దండి లేవనెత్తెను. అతఁడు దానిని విస్పష్టముగాఁ జూపఁజాలకపోయెను. కాని వామనుఁడు దాని నెక్కువహేతువాద బలముతో సిద్ధాంతమొనర్చెను. రీతి కావ్యాత్మయనియు (రీతిరాత్మా కావ్యస్య) విశిష్టపదరచన రీతియనియు విశేషమన గుణములేయనియు (మొత్తముమీఁద గుణవత్పదరచన రీతి) నిర్వచించెను. అనఁగా గుణములచే రీతి యేర్పడునని యభిప్రాయము. సన్నసన్న దారములచే వివిధములయిన రజ్జువు లేర్పడు విధమునఁ గొన్ని కొన్ని గుణములచేఁ గొన్ని రీతు లేర్పడునని నిష్కృష్టార్థము. వామనమతమునఁ బది గుణములు; అతని మతమున రసమునకుఁ బ్రాధాన్యముగాక రీతికే ప్రాధాన్యము కావున నాతఁడు రీతినే కావ్యాత్మగాఁ దలఁచెను. కాని ధ్వనికారుఁడు రసాదులకు; ప్రాధాన్యమిచ్చి రసాదిధ్వనినే కావ్యాత్మగా నంగీకరించుటచే మానవునికి గుణములాత్మధర్మములయినట్లు మాధుర్యాది గుణములును గావ్యాత్మయగు రసముయొక్క ధర్మములే యగును. కావున గుణములును, గుణములచే నేర్పడు రీతియు, రసము ననువర్తించి యుండవలెను. ధ్వనికారుఁ డీరీతిని రీతి పదముతో వ్యవహరింపక 'సంఘటన' యను పేరితో వ్యవహరించెను. ఈ సంఘటన వక్తృ, వాచ్య, ప్రబంధా (విషయ) చిత్యములఁబట్టి అసమాస, అల్పసమాస, దీర్ఘసమాస, అని మువ్విధములుగా నుండునని చెప్పెను. (ఈ విషయమును జతుర్థాశ్వాసము నందలి గుణప్రకరణము తుదియందుఁ జూడవలెను )

*ఈవిధముగా రీతులు వక్తృ, వాచ్య, ప్రబంధా(విషయ)చిత్యముల ననుసరించి యుండవలెననునియమమును ధ్వనికారుఁడే మొదట స్థాపించినవాఁడు. కావుననే గుణములు రసధర్మములు. గుణములచే నేర్పడు రీతులును రసధర్మములేయగునని చెప్పితిమి. కేశవమిశ్రుఁడు,

---

* మన యాలంకారికులు రీతికి వక్తృవాచ్యప్రబంధా (విషయ) చిత్యములే నియామకములని చెప్పినవిధమున నాంగ్లాలంకారికులును గొందఱు దెలిపిరి. ఎట్లన, Demitrius says that there are certain subjects with the quality of elevation to which that style is thence suited. Such are subjects like scenes of battle. Surely these cannot be treated in the styles

"తత్త్ద్రసోపకారిణ్య స్తత్తద్దేశ సముద్భవాః
పద్యేషు రీతయో గాడీ వైదర్భీ మాగధీ తథా"

రీతులు రసోపకారకములనియే తెలిపెను. ప్రతాపరుద్రీయ నరసభూపాలీయ కర్త లీ విషయమును దెలుపరైరి. 'రీతులు సందర్భమాత్ర సంగతములు' అని నరసభూపాలీయమునఁ గలదు. ధ్వనికారుఁడు నుడివినవిధమున రసమునుబట్టి రీతిభేదమును జెప్పుకొనినచోఁ గోమలమైన శృంగారరసమునఁ బరుషాక్షరబంధ దీర్ఘసమాసము లుండవచ్చును. హృదయోద్రేకమును గలిగించు రౌద్రాదులందుఁ గోమలాక్షర బంధము, అసమాసములు నుండవచ్చును. ఇట్లయినచో నా యా రసములు వ్యక్తములు గావు. దండి వామనులు రసప్రాధాన్యవాదులు గారు గాన వా రీ రీతులను రసములతో మేళవింపలేదు. కావుననే "రియంతే పరంపరయాగచ్ఛంతి అనయా కరణసాధనోఽయఁ రీతి శబ్దః మార్గపర్యాయః (రీతి యనఁగా మార్గము. దీనిచేఁ గ్రమముగా రసపదవినిఁ బొందుదురు) అని రత్నేశ్వరుని వ్యుత్పత్త్యర్థము సరిపడుచున్నది. పింగళి సూరనయు "రసభావములకు సర్వంబుగ వైదర్భి మొదలైన రీతులిమ్ముగ నమర్చి" అని యిదే యభిప్రాయమును దెలిపెను. కామధేను వీ క్రింది

---

called " the plain and Elegent." They must be rendered in the styles called "The elevated and the Forcible."

Demitrius gives the Elegant as the style for elegant and grace-ful subjects like Sringara. He says "The meterials of the grace are the gardens and Nymphs etc. One of the two deciding factors in the grand style M. Murray Says, is the theme, the other factor being vocabulary. In connection with the theme, " the nature of the plot or the Muthos," he observes that the grand style is adopted if super human or mejestic figures are involved. If the characters of the plot are super human and mejestic, it seems more or less necessary that their mannar of speech, should differ from that of ordinary dramatic poetry by being more dignified. "The poet heightens the speech of superhuman characters in order that they may appear truely super--human."

This is clearly a case of theme being a Niyamaka of style a case of standard style. " a technical poetic devise for a particular end." as Murry says of the grand style.

Thus the linking of style to theme is not absent from Western Criticism.

(Some concepts of Alankara Sastra. Page 154-155.)

వ్యుత్పత్తి నిచ్చుచున్నది. "రీణంతి గచ్ఛంతి అస్యాం గుణాః ఇతి, క్షరతి అస్యాం వాఙ్మధుధారా ఇతివా రీతిః అధికరణే క్తిః" (దీనియందు గుణములు నడచును. (వర్తిల్లును) అని కానీ, దీనియందు మధుధార (రసము) స్రవించుచుండును అని కానీయర్థము.

## పాకము

పాక పర్థధర్మము. 'అర్థగంభీరిమా పాకః' అని ప్రతాపరుద్రీయ లక్షణము. కాని పాకమన నర్థాస్వాదభేదము. వృత్తి, రీతి, గుణముల కలయికవలనఁ బుట్టిన యాస్వాదమే పాకము. పాకమున నానావస్తు సంయోగమునఁ గ్రొత్తక్రొత్త రుచిభేదములు గలుగునట్లే వృత్తి, రీతి, గుణసంయోగమువలన రుచిభేద మేర్పడును. ఇందు రెండు పాకములే చెప్పఁబడినవి. కాని మూఁడుపాకము లుండవలెనని చెప్పితిమి. రాజశేఖరుఁడు నవవిధపాకములను దెలిపెను.

అవి యివి:—పిచుమంద, బదర, మృద్వీకా, వార్తాక, తింత్రిణీ, సహకార, క్రముక, త్రాపుష, నారికేళపాకములు.

## శయ్య

శయ్య యనఁ బదమైత్రి యని చెప్పితిమి. ఇది శబ్దధర్మము. దీనినిఁగూర్చి విపులముగాఁ జెప్పియుంటిమి. ఈ శయ్యను దండి, వామన, ధ్వనికార, మమ్మట, విశ్వనాథ, జగన్నాథాదులు దెలుపలేదు. ప్రతాపరుద్రీయకర్తయే తెలిపెను. దీనికి మైత్రి, ముద్ర యనియు నామాంతరము లగ్నిపురాణమునఁ గనఁబడుచున్నవి. ఈ శయ్యను విశ్వనాథాదులు రీతులలోనే యంతర్భవింపఁజేసిరి.

## కావ్యవిశేషములు

గీ. ఇట్లుకావ్యస్వరూపంబు నేర్పఱిచి
యింక గావ్యవిశేషముల్ పొంకపఱతు
నటనపటు ధూర్జటి జటాగ్రచటులసింధు
ఘుమఘుమారంభ గంభీర గుంభనములు. ౯౦

స్పష్టము.

గీ. వ్యంగ్యము ప్రధానమైనను, నప్రధాన
మైన, నస్ఫుటమైనఁ గావ్యము త్రిసంఖ్య

నమరు నుత్తము మధ్యమాధమత; ధ్వనిగు
ణీకృత వ్యంగ్యమును జిత్రమైకడంగి. ౬౦

తా. వ్యంగ్యార్థము లేక ధ్వన్యర్థము వస్తురూపము, అలంకారరూపము, రసరూపము, అనిమువ్విధములుగాఁ జెప్పితిమి. వీనిలో వస్తురూపవ్యంగ్యమున కుదాహరణము లీయఁబడినవి. మిగిలిన వ్యంగ్యము లుదాహరింపఁబడును. ఈ త్రివిధమగు వ్యంగ్యార్థమును ప్రధానముగా ననగా వాచ్యార్థముకన్న సుందరముగా గోచరించినచో నుత్తమకావ్యము; అప్రధానముగా ననఁగా వ్యంగ్యార్థముకన్న వాచ్యార్థమే సుందరముగా భాసించినచో మధ్యమకావ్యము; అస్ఫుటముగా ననఁగా గూఢముగా గోచరించినచో నధమకావ్యము; అస్ఫుటముగా ననగా వ్యంగ్యరహితమనియే యర్థమును జెప్పుకొన వలయును. "అవ్యంగ్య మవరంస్మృతం" వ్యంగ్యహీనమయిన కావ్యమధమమని కావ్యప్రకాశకారుఁడు చెప్పెను.

వ్యంగ్యప్రధానమగు కావ్యము ధ్వనికావ్యమనియు, వ్యంగ్యమప్రధానముగా నున్నకావ్యము గుణీభూతవ్యంగ్యమనియు, వ్యంగ్యస్పర్శలేని కావ్యము చిత్రమనియు వ్యవహారము.

మమ్మట విశ్వనాథాదులెల్లరును నీవిధమునఁ గావ్యము త్రివిధముగానే వ్యవహరించిరి. కాని జగన్నాథ పండితుఁడు, ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము, అని నాలుగు విధములుగా విభజించెను. మమ్మటాదులయుత్తమకావ్యము నీతఁడుత్తమోత్తమముగా గ్రహించెను. వ్యంగ్యార్థ మప్రధానమైనను జమత్కారకారణమగుచో నది యుత్తమకావ్యము ( యత్ర వ్యంగ్య మప్రధానమేవసల్ చమత్కార కారణంతద్ద్వితీయం ) అనిచెప్పి యీక్రిందిశ్లోకము నుదాహరించెను.

శ్లో. రాఘవ విరహజ్వాలా సంతాపితసహ్యశైలశిఖరేషు
శిశిరే సుఖం శయానాః కపయః కుప్యంతి పవనతనయాయ.

కం. అలరాముని దగు విరహా
నలమునఁగడుఁ గ్రాఁగు సహ్యనగ శిఖరములం
జలికాలి సుఖముండిన కోఁ
తులు కని హనుమంతుఁ గినిసిరిఁదొడఁగిరి కడిఁదిన్.

హనుమంతుఁడు సీతాకుశలవార్తను శ్రీరామునికి నివేదించెను. అది వినఁగానే రాముని విరహతాపముచల్లాఱినది. అఁగా రాముఁడు చల్లఁబడినాఁడు. "శిశిరర్తువులో రాముని విరహతాపముచే [illegible] శైలశిఖరములందుఁ సుఖముగాఁ

బందుకొని యున్నకోఁతులు రాముఁడు చల్లఁబడఁగానే శైలశిఖరములుంగూడఁ జల్లఁబడుటచే శీతార్తులై హనుమంతునిపైఁ గోపించిరి" అనియర్థము.

ఇదివాచ్యసిద్ధ్యంగమను గుణీభూత వ్యంగ్యమని యాలంకారికుల మతము. వాచ్యసిద్ధ్యంగ మనఁగా నెచ్చటఁ గావ్యమున నర్థము సరిపడక పోయినపుడు వ్యంగ్యార్థమువలన నర్థము సరిపడునో యది వాచ్యసిద్ధ్యంగము. ఇటఁ గోఁతులు హనుమంతునిపైఁ గోపించినవి" అనునది వాచ్యార్థము. అకారణముగా నేలకోపించినవో తెలుపఁబడ లేదు. వాచ్యార్థమున కనుపపత్తివచ్చినది. "రాముఁడు చల్లఁబడినాఁడు" అను వ్యంగ్యార్థమును జెప్పుకొన్నచో వాచ్యార్థము సరిపడును. ఇట్టియెడల నీ వ్యంగ్యము వాచ్యసిద్ధికిఁగారణమైనది. కానఁ బ్రధానమగు వ్యంగ్యముగాలేదు. ఈ వ్యంగ్యమిటఁ బ్రధానముగాకున్నను జమత్కారమునుగూర్చుచునేయున్నది. ఆ చమత్కారము సహృదయానుభవైకవేద్యము. దౌర్భాగ్యవశమున దాస్యమనుభవించుచున్నను రాజకళత్రము సౌందర్యమును గోలుపోదుకదా! ఆమె ప్రధానమగు రాజ్ఞీత్వమును గోలుపోయినను సౌందర్యమును గోలుపోని విధమున నీ వ్యంగ్యమును నప్రధానమైనను, జమత్కారమును గోలుపోకున్నది. కాన నిదేవిధమున వాచ్యసిద్ధ్యంగము, అపరాంగము, అనువ్యంగ్యములును, జగన్నాథుని మతమున, నుత్తమకావ్యములుగా గణింపఁబడినవి. ఈ వాచ్యసిద్ధ్యంగ రూపవ్యంగ్యము సమాసోక్తి, వ్యాజస్తుతి, అప్రస్తుత ప్రశంసా, పర్యాయోక్తులు మొదలగు నలంకారము లందును గలదు. మమ్మటాదులు దీనిని గుణీభూత వ్యంగ్యమనిరి. ప్రాచీనుల మధ్యమ అధమకావ్యములకును, జగన్నాథుని మధ్యమ, అధమకావ్యములకును భేదముగానరాదు. కాని యధమకావ్యమును జగన్నాథుఁడు శబ్దచిత్రప్రధానము అర్థచిత్రప్రధానము,నని మరల రెండుగావిభజించెను. ఈవిధముగా నర్థప్రాధాన్యమునుబట్టి జగన్నాథునిమతమునఁ గావ్యము నాలుగువిధములు. ప్రతిపాద్యవిషయమునుబట్టి మరికొన్ని భేదములు గలవు. అవి ముందు తెలుపఁబడును.

ఆనందవర్ధనాచార్యులవారు ధ్వన్యాలోకమున నీ ధ్వన్యర్థమును సాధించుచు నీ విధముగాఁ దెలిపిరి :—

అర్థము వాచ్యము, వ్యంగ్యము లేక ప్రతీయమానము నని ద్వివిధము. వాచ్యమనఁగా వాచకముయొక్క యర్థము. ఇది సుప్రసిద్ధముగా నెల్లరెఱిఁగినదే! స్త్రీల కవయవములకన్న భిన్నముగా లావణ్యము భాసిల్లువిధమున మహాకవుల కావ్యములందు వాచ్యార్థములకన్న భిన్నముగా వ్యంగ్యార్థము భాసిల్లును. ఆ వ్యంగ్యార్థము వాచ్యసామర్థ్యముచేతనే యాక్షిప్తమగును. (ఆకర్షింపఁబడును) అది వస్త్వలంకార

రసరూపము. వస్తురూప వ్యంగ్యమునకు వ్యంజనావృత్తి ఘట్టములో "కం. ఇఁకఁ దిరుగవచ్చునట; గీ. ఇచట మాయత్తపండు నేనిటఁబరుండు" మొదలగు పద్యము లుదాహరింపఁబడినవి. అలంకార రసాది వ్యంగ్యములు ముందు దెలియును. ఈ వ్యంగ్యములన్నియు వాచ్యసామర్థ్యాక్షిప్తములే. వస్తువ్యంగ్య, అలంకారవ్యంగ్య ములలో మనకుఁ గ్రమము గోచరించును. అనఁగా ముందు వాచ్యార్థము; తరువాత వ్యంగ్యార్థమును గ్రమముగా గోచరించును. ఇచ్చటి క్రమము స్ఫుటముగా గోచ రించును. కాని రసాది వ్యంగ్యమున నా క్రమము గోచరింపదు. ఆ వ్యంగ్యము వాచ్యముతోడనే భాసిల్లుచున్నట్లుండును. ఆ త్రివిధమగు వ్యంగ్యార్థమే కావ్యాత్మ; ఈ వ్యంగ్యార్థము శబ్దశాస్త్రమును బఠించుటవలనఁ గానీ నిఘంట్వాదులను వల్లించుట వలనఁగానీ తెలియరాదు. అది సహృదయ హృదయైకవేద్యము. అన్ని శబ్దములును నా వ్యంగ్యార్థమును వ్యక్తపఱుపఁజాలవు. కొన్ని కొన్ని శబ్దములు మాత్రమే కలవు. వానికై కవి యత్నింపవలెను. అట్టి పదప్రయోగమువలననే మహాకవియగును. ఎట్లన,

గీ. కలవు నాదగు హృదయరోగముఁ గుదుర్చు
మందు మాత్రలు పొరుగింటి సుందరికడ;
నాకు నధరామృతానుపానంబుతోడ
నాల్గుపూటలు సేవింప నయముగలుగు

ఇట హృదయరోగ పదమునుదీసి హృదయవ్యాధియనియు, లేక హృదయా మయమనియు, మాత్రలు పదమునుదీసి గుళికలనియు, అనుపానపదమునుదీసి 'కూడా చేర్చు మందు' అనియు, 'సేవింప' పదమునుదీసి భక్షింప, అనియును నుంచినచోఁ బద్యములలోని సౌందర్యమంతయును భ్రష్టమగునుగదా!

పదార్థమువలన వాక్యార్థము బోధపడువిధమున వాచ్యార్థము గోచరించిన పిమ్మటనే వ్యంగ్యార్థము గోచరించును. అట్లు వాక్యార్థము గోచరించిన పిమ్మటఁ బదార్థము పృథక్కుగా గోచరింపనివిధమున సహృదయుల కా వాచ్యార్థసామర్థ్య ముచే వ్యంగ్యార్థము గోచరించిన పిమ్మటఁ బృథక్కుగా వాచ్యార్థము గోచరింపదు. ఇఁక ధ్వనిలక్షణ మిది :—

"యత్రార్థశ్శబ్దోవా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః"

తా. ధ్వని యనఁగా నెచ్చట శబ్దము తన యర్థమును, అర్థము దన్నును, అప్రధానములఁజేసి యర్థాంతరమును బోధించునో యది ధ్వని. ఎట్లన,

కం. ఆయందంబాచందం
బాయాలాపక్రమంబు నాసమయమునం
బీయూషధారయై యిడె
హాయిని; నన్నిపుడలంచె నది పెనుజ్వరమై

ఇట ఆ, ఆ, అను శబ్దములు స్వార్థమును నప్రధానముగాఁజేసి 'లోకోత్తరము' అను నర్థాంతరమును వ్యక్తము సేయుచున్నవి.

గీ. 'ఇచట మాయత్తపండు నే నిటబరుండు'

అను పద్యమునందలి వాచ్యార్థము తన్నుప్రధానముగాఁ జేసికొని "నా మంచముపైఁబడుము" అను వ్యంగ్యార్థమును వ్యక్తము సేయుచున్నది.

ఈ వ్యంగ్యార్థ ప్రాధాన్యాప్రాధాన్యములఁబట్టియే ధ్వని, గుణీభూతవ్యంగ్యాది భేదములు చెప్పఁబడినవి. సమాసోక్తి, ఆక్షేపము, దీపకము, అపహ్నుతి, పర్యాయోక్తము, అప్రస్తుతప్రశంస, యీ యలంకారములలో వాచ్యమునకే ప్రాధాన్యముగాని వ్యంగ్యమునకుఁ బ్రాధాన్యములేదు. కాన నివి గుణీభూత వ్యంగ్యకావ్యములే యగును.

## ధ్వని

సీ. తలయెత్తుకొనఁగల్గె గులమువారలలోనఁ
బడినూఱు శిరసుల పాఁపతేని
కనుపమచ్ఛాయా విహారమందఁగఁగల్గెఁ
జిమ్మచీఁకటి మ్రింగు నెమ్మికాని
కమృతాబ్ధిలో నిద్ర యవధరింపఁగఁగల్గె
వెలిదమ్మి పొక్కిటివేల్పుసామి
కలమహానటజటా వలభినుండఁగఁగల్గె
నెలకొన్న చల్లని వెలుఁగువాని

గీ. కవుర! భువనాతిశాయి వైభవవిభూతిఁ
బూని జగదేకజేగీయ్యమానుఁడైన
మోబభూపాలు నరసింహుఁ డుర్వియందు
నవతరించి శుభస్ఫూర్తి నతిశయిల్ల.

కొనఁగల్గె (పా) కోఁగల్గె; నతిశయిల్ల (పా) నమరుచుండ

తా. మొదటిపాదముచే నరసభూపాలుఁడు భూభారమును వహించెననియు, ద్వితీయపాదముచేఁ బ్రతాపమును వహించెననియుఁ, దృతీయపాదముచే నార్తరక్షణముఁ గావించుచుండెననియుఁ, జతుర్థముచే లోకమునఁ గీర్తిని వ్యాపింపఁజేసెననియు ధ్వన్యర్థములు గోచరించుచున్నవి. ఆ యా పాదములందలి శబ్దములు తమ స్వార్థముల నప్రధానముగాఁ జేసికొని "భూభారమును వహించెను" మొదలగు నర్థాంతరములను దోఁపించుచున్నవి. 'నరసభూపాలుఁడు భూభారమును వహించె' నని వాచ్యరూపమునఁ దెలిపినచో రమణీయత్వములేదు. ఆ యర్థమును నోటితోఁ దెలుపకుండఁ దోఁపింపఁజేసిననే యందముగానుండును. ఇట వాచ్యార్థ మప్రధానమై వ్యంగ్యార్థములేక ధ్వనిప్రధానముగా నున్నది. ఇది యుత్తమకావ్యము.

గీ, ఇందుఁ దలయెత్తుకొనఁగల్గె దండశూక
పతికి నన నారసింహ భూపాలుఁడుర్విఁ
దాల్చెనను వ్యంగ్యమాదియౌ ధ్వనులు దోఁచఁ
దనరు నుత్తమ కావ్యమై ధ్వనియనంగ ౬౩

పై వివరణముచేతనే గతార్థము.

## గుణీభూతవ్యంగ్యము

కం, కొలువాసయొసఁగి సురగవి
వెలికిలఁబడుఁ; గల్పతరువు వేఁడినమరియా
కులపడి పండ్లిగిలించును;
నలువుగ నినుఁ బోలఁగలవె? నరసింహనృపా! ౬౪

వేఁడినమతి (పా) వేఁడుకొనిన.

తా. కామధేనువు తన్నుఁ గొలుచువారి కాళగొలిపి వెలికిలఁబడును. అనగాఁ జేతకాదని వెనుదీయును (పాఱుగుఁ జూపును) తన్ను వేఁడఁగాఁ గల్పవృక్షము వ్యాకులపడును (ఆకులురాల్చును) పండ్లిగిలించును. అనఁగా లేదనినవ్వును. (పండ్లనొసంగును) ఇవి నిన్నుఁ బోలఁగలవే? అనికావు.

కం, నినుఁబోలఁగలదె సురతరు
వను నెడ లేదనెడు వ్యంగ్యమరయఁగవాచ్యం

బునతిక్రమించి మించమిఁ
దనరున్ ధర నిది గుణీకృత వ్యంగ్యంబై. ౬౫

పైపద్యమున గుణీకృతవ్యంగ్యము 'పోలఁగలవె?' అనుస్థలమందుఁగలదు. ఎట్లనఁ గల్పవృక్షము నిన్నుఁబోలఁగలదే? అనువాచ్యార్థము 'పోలలేదు' అనువ్యంగ్యార్థమును బోధించును. ఇచ్చటి కాకువ్యంగ్యము వాచ్యార్థము తోడనే భాసిల్లును. కాని వాచ్యార్థానంతరమునఁ గాదు. ఇట వ్యంగ్యమునకుఁ బ్రత్యేకత్వములేదు. కాకువుచే నాక్షిప్తమగు వ్యంగ్యమెల్లయెడల నీవిధముగానే వాచ్యార్థసంకలితముగానే భాసిల్లును. వాచ్యార్థమున కావ్యంగ్యార్థములేక విశ్రాంతియే లేదు. కాన నిచ్చటివ్యంగ్యము సుందరముగాదు. కావుననే గుణీభూతవ్యంగ్యము. లేక గుణీకృత వ్యంగ్యము. (గుణము) అప్రధానము; గుణీకృతము – అప్రధానముగాఁ జేయఁబడిన–వ్యంగ్యము.)– గుణీభూత వ్యంగ్య ప్రకరణము నందలి కాకువ్యంగ్యమును జూడుఁడు.)

## చిత్రము

శం॰ చిత్రము శబ్దార్థోభయ
చిత్రములనఁ ద్రివిధగతులఁ జెలగు;నదియు సం
స్థాశ్రితమగు ముందఱనా
చిత్రాలంకార తతులు చెప్పెడిచోటన్. ౬౬

తా. శబ్దచిత్రము, అర్థచిత్రము, శబ్దార్థోభయచిత్రము, అనిచిత్ర కావ్యము త్రివిధము. దీనిని ముందుదాహరింతుము.

త్రివిధములగు చిత్రములున్నవని యిచ్చటఁ జెప్పి చతుర్థాశ్వాసమున ౩౩వ పద్యమున

కం. ఇవియును శబ్దార్థంబుల
ద్వివిధములై క్రమముతోడ వెలయు ననుప్రా
సవిశేషంబుల నుపమా
దివిశేషమ్ములను గావ్యదీపితసరణిన్.

అని ద్వివిధమునే చెప్పి ద్వివిధమునే యుదాహరించెను. శబ్దార్థోభయ చిత్రమును మే ముదాహరించి తెలుపుదుము.

శం. ద్వివిధంబగు ధ్వని కృతులం
దవిరళగతి లక్షణాభిధామూలితమై

యవివక్షిత వాచ్యంబును
వివక్షితాన్యపరవాచ్యవృత్తియు ననఁగన్. ౯౭

తా. లక్షణామూలధ్వని యనియు, నభిధామూలధ్వని యనియును ధ్వని రెండువిధములు. లక్షణామూలధ్వని యవివక్షిత వాచ్యము. అనఁగా నందలి వాచ్యార్థము వివక్షితముగాదు. అనఁగా వాచ్యార్థము పొసగనేపొసగదు. అది స్వార్థమును గోలుపోయి పొసగుచున్న మరొక యర్థమును దెలుపును.

అభిధామూలధ్వని వివక్షితాన్యపరవాచ్యము. అనఁగా వాచ్యార్థము పొసగి నను నన్యపరముగా (ధ్వనిపరముగా) వివక్షింపఁబడును.

లక్షణామూలధ్వనిలో వాచ్యార్థము పొసఁగనే పొసగదు. అభిధామూల ధ్వనిలోఁ బొసగుచున్నను నా వాచ్యార్థము వ్యంగ్యపరముగా వివక్షింపఁబడును.

కం. చను నత్యంత తిరస్కృత
మన, నర్థాంతరసమేతమన, ద్వివిధతఁ గై
కొని యవివక్షితవాచ్యం;
బినుమడి యగు వాక్యపదములెనసిన నదియున్. ౯౮

తా. మరల నా లక్షణామూలధ్వని యగు నవివక్షితవాచ్యము – అత్యంత తిరస్కృతవాచ్యము, అర్థాంతర సంక్రమితవాచ్యము, నని ద్వివిధము. ఆ ద్వివిధ ధ్వనియు వాక్యగతము, పదగతము, అను భేదములచే నాలుగువిధములగును.

వాచ్యార్థము బొత్తుగా సరిపడక యత్యంతతిరస్కృతమై వాచ్యార్థమునకు సంబంధించిన మరొక యర్థమును బోధించినచో నది "యత్యంత తిరస్కృతవాచ్యము" అనఁబడును. ఇది వెనుకఁ దెలుపఁబడిన జహల్లక్షణయే.

"రవి సంక్రాంత సౌభాగ్యస్తుషారావృతమండలః
నిశ్శ్వాసాంధ ఇవాదర్శశ్చంద్రమా న ప్రకాశతే"

తా. సూర్యునియందు సంక్రమించిన తన సౌభాగ్యముగలవాఁడును, మంచుగప్పిన బింబముగలవాఁడు నగు చంద్రుఁడు నిశ్శ్వాసాంధమగు (నిట్టూర్పు గాలులచే గ్రుడ్డి బాఱిన) నద్దమువలెఁ బ్రకాశింపకున్నాఁడు. ఇట నంధత్వము చేతనధర్మముగదా! అచేతనమగు నద్దమెట్లంధమగును? కాన 'నంధ' శబ్దము స్వార్థమును దిరస్కరించి 'ప్రకాశహీనము' అను నర్థమును స్వీకరించినది. ఇట 'అప్రకాశాతిశయము' వ్యంగ్యము.

ఇట వెనుకఁ జెప్పిన 'మంచాః క్రోశంతి' అను స్థలమునవలెనే జహల్లక్షణ. 'అప్రకాశాతిశయ' రూపవ్యంగ్య మా లక్షణామూలము. కాన నిది యత్యంత తిరస్కృతవాచ్యరూపధ్వని.

'సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు; శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' ఇటఁ గరములు కరములుగాక మరేమగును? జిహ్వ జిహ్వకాక మరేమగును? కాన రెండవ కర, జిహ్వాదిశబ్దము 'ఉత్తమకరములు, ఉత్తమజిహ్వ' ఇత్యాద్యర్థాంతరమును స్వీకరించును. ఇందలి ద్వితీయ కరాది శబ్దముల వాచ్యార్థములు పైవిధమగు నర్థాంతరమున సంక్రమించినవి. కాన నిట నర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని. (అర్థాంతరమున సంక్రమింపఁజేయఁబడిన వాచ్యార్థముగల ధ్వని యని వ్యుత్పత్త్యర్థము) ఇదియే యజహల్లక్షణ. ఎచ్చట వాక్యతాత్పర్యములో స్వార్థముతోఁగూడియే లక్ష్యార్థము భాసిల్లునో యది యజహల్లక్షణ యని చెప్పితిమి. "కుంతాః ప్రవిశంతి" "కోదండపంక్తులు వచ్చె" అను చోటులందువలె నిట ద్వితీయ కరాది శబ్దముల యొక్క వాచ్యార్థము విడువఁబడకయే లక్ష్యార్థమగు నుత్తమకరత్వాదులు వాక్యతాత్పర్యములోఁ బ్రవేశించుచున్నవి. ఈ యవివక్షితవాచ్యధ్వని పదగతము. "నిశ్వాసాంధ" "కరములు కరములు" అనుచోట్ల 'అంధ, కర' ఇత్యాదికమగు నేకపదమువలననే యిచ్చట ధ్వనులు దోఁచుచున్నవి.

## వాక్యగతాత్యంత తిరస్కృత వాచ్యము

ఉపకృతం బహుయత్ర కి ముచ్యతే। సుజనతా ప్రథితా భవతా పరం
విదధదీదృశ మేవ సదా సఖే! సుఖితమాస్వ తత శ్శరదాం శతం.

కం. సలిపితి కడు మేలేమన
వలె? నీదగు పెద్దతనముఁ బ్రకటించితివో
చెలికాఁడ! యివ్విధముననె
సలుపుచు నూరేండ్లు మనుము! సౌఖ్యముతోడన్.

పెక్కుపకారములను దనకుఁ గావించిన మిత్రునితో నొకఁ డనుచున్నాఁడు. ఇట విపరీతలక్షణచే "నాకుఁ జాల గీళ్లుసేసితివి. ఈవిధమున నీ ముక్కుడితనమును దెలిపితివి. నన్నీవిధమునఁ జేసితివి కాన నీవు పెద్దకాలము బ్రతుకవు" అను నర్థాంతరము వాచ్యార్థమును దిరస్కరించి యుత్థితమగుచున్నది. ఇది వాక్యగతమగు నత్యంత తిరస్కృతవాచ్యధ్వని.

## వాక్యగతార్థాంతర సంక్రమిత వాచ్యధ్వని

త్వామస్మి వచ్మి విదుషాం సమవాయోఽత్ర తిష్ఠతి
ఆత్మీయాం మతిమాస్థాయ స్థితి మత్ర విధేహి యత్

కం. నినుఁగూర్చి నేను మాటొక
టనుచుంటిని; విబుధనివహ మిదరు నిచట; దా
నిని సావధానమతివై
వినుమీ! చెవియొగ్గి యాత్మ పేర్మి చెలంగన్.

విద్వత్సమాజములోనికి వచ్చుచున్న యొక బాలునిఁగూర్చి యొక వృద్ధుఁడనుచున్నాడు: శిక్షణీయుఁడగు నా బాలుఁ డెదుటఁ గూర్చున్నవాఁడగుటచేతనే సిద్ధించుచుండ "నినుఁగూర్చి" అని చెప్పుట "ఇతరులగుఱించి కాదు; నినుఁగూర్చియే సుమా" అను లక్ష్యార్థమును బోధించుచున్నది. 'అనుచుంటిని' అను నుత్తమపురుష క్రియాపదముచేతనే కర్త లభించుచుండగా 'నేను' అని తిరిగి చెప్పుట ‘‘నీకుఁ జెప్పునది యితరులుగాదు. నీయాప్తుఁడ నగు నేను" అను లక్ష్యార్థమును బోధించుచున్నది. "ఇచట విబుధనివహ మిదరు" అని చెప్పిననే సరిపోవుచుండ "మాటొకటనుచుంటిని" అనుట "నీకుపదేశించుచున్నాను" అను లక్ష్యార్థమును బోధించుచున్నది. ఈ లక్ష్యార్థములన్నియును వాని యతిశయమును బ్రయోజనముగా వ్యక్తము సేయుచున్నవి. దీనిచే "నామాట నీకు హితమైనది. కానఁ దప్పక చేయవలెను" అను నభిప్రాయము గోచరించును. ఇట నీవిధముగా వాక్యమంతయును నర్థాంతరమునఁ బరిణమించినది.

చ. ననువుగ వీసిలక్షణమొనర్తు; ధృతేందిరుఁడన్నఁ గృష్ణుఁడన్
ధ్వని యభిభూతవాచ్యముగఁ దత్ప్రథమంబు చెలంగు; "యావనుల్
మనమునఁ గ్రొవ్వుమానుఁ"డన మత్తతురుష్కులఁ ద్రుంచుసీతఁడన్
ధ్వని యితరార్థసంక్రమిత వాచ్యముగాఁగ ద్వితీయ మింపగున్.

ఈ వెనుకటి వివరణము నందలి విషయమే యిందుఁ గలదు. "నరసభూపాలుఁడు ధృతేందిరుఁడు" అన్నచో నభిభూతవాచ్యము (అత్యంత తిరస్కృతవాచ్యము). దీనికి "నరసభూపాలుఁడు గృష్ణుఁడు" అనునది వ్యంగ్యార్థము. "విష్ణుర్నారాయణః కృష్ణః" అను నమరకోశమునుబట్టి కృష్ణుఁడన్నను విష్ణువన్న నొక్కటియే. కాన "నరసభూపాలుఁడు విష్ణువు" అని వ్యంగ్యార్థము.

ధృతేందిరుఁడన నిందిరను ధరించినవాఁడు. నరసభూపాలుఁడు శ్రీమహావిష్ణువు యొక్క భార్య యగు లక్ష్మి నెట్లు ధరించును ? కావున "నరసభూపాలుఁడు ధృతేందిరుఁడు" అనుచో వాచ్యార్థముపొసగదు. ఇది జహల్లక్షణ యని తెలిపితిమి. కాన 'ధృతేందిర' పద మత్యంత తిరస్కృతవాచ్యమై 'రాజ్యలక్ష్మిని ధరించిన వాఁడు' అను నర్థమును స్వీకరించినది. ఇది లక్ష్యార్థము. 'నరసభూపాలుఁడు శ్రీవిష్ణువు' అనునది ప్రయోజనము. ఇది యత్యంత తిరస్కృత వాచ్యధ్వని పదగతము.

'యావనుల్ మనమునఁ గ్రొవ్వుమానుఁడు' అనుచో "నీతఁడు మత్తు తురుష్కులఁ జంపు" అనునది వ్యంగ్యము.

అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనియందు 'అజహల్లక్షణ యుండునని తెలిపితిమి. "సీ. కమలాక్షునర్చించు కరములు కరములు" అనుచోట లాటానుప్రాసమున దీని నుదాహరించియుంటిమి. 'యావనుల్ మనమునఁ గ్రొవ్వుమానుఁడు' అనుచో నావిధముగా లాటానుప్రాసము లేదే! అని యనుకొనవచ్చును. వినుఁడు : లాటానుప్రాసముగలచోటనే యర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనియుండునని నియమములేదు. వాచ్యార్థమిచ్చుటఁబొసగదు. ఎట్లన "యావనుల్ మనమున గ్రొవ్వుమానుఁడు" అనునది వాచ్యార్థము. ఏలయావనులు క్రొవ్వుమానవలెను? మానకున్న నేమి?" అను ప్రశ్నలు లేచును? ఈవాక్యము సంతృప్తికరముగా సమాధాన మిచ్చుటలేదు. ఆకాంక్ష పూర్తి కాలేదు. ముఖ్యార్థ బాధయుండవలెఁగదా! ఇట 'కరములు కరములు' అనుచోటియందువలె ముఖ్యార్థబాధ యేమిగలదు? అన్నచో ముఖ్యార్థము పూర్తి కాకుంటయు ముఖ్యార్థబాధయే యగును.

ఇట ముఖ్యార్థము లేక వాచ్యార్థము పొసగకున్నది. "ఈతఁడాయావనులను ద్రుంచు" ననునర్థాంతరమున నీవాచ్యార్థము సంక్రమించినది. కాన నర్థాంతర సంక్రమితవాచ్యధ్వని ఇది వాక్యగతము.

గీ. అరయ మఱియు వివక్షితాన్య పరవాచ్య
మవని లక్ష్యక్రమవ్యంగ్యమన, నలక్షి
తక్రమ వ్యంగ్యమన ద్వివిధంబు; వీని
లక్షణము లేర్పఱింతు నెద లలిత ఫణితి. ౧౦౦

టీ. వివక్షితాన్యపరవాచ్యధ్వని సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనియు, నసంలక్ష్యక్రమవ్యంగ్యమనియు ద్వివిధము. సంలక్ష్యక్రమవ్యంగ్య మనఁగా దేనియందు వాచ్యార్థ

వ్యంగ్యార్థముల క్రమము స్ఫుటముగాగోచరించునోయది సంలక్ష్యక్రమవ్యంగ్యము. దీనికే యనురణనవ్యంగ్యమనియు నామాంతరము. అనురణనమనగాఁ బ్రతిధ్వని. ముందు ధ్వని. పిమ్మటఁ బ్రతిధ్వనియుఁగదా! అట్లే వాచ్యార్థము గోచరించినపిమ్మట వ్యంగ్యార్థము గోచరించినచో నది యనురణనవ్యంగ్యము. వాచ్యార్థవ్యంగ్యార్థముల క్రమ మెచ్చట సూక్ష్మముగా నుంటచేఁ దెలియరాదో యది యసంలక్ష్య క్రమ వ్యంగ్యము.

గీ. "ఇతఁడు నరసింహుఁ" డనునెడ నిదియవ్యంజ
కంబగుచుఁ'గృష్ణుఁ'డనెడు వ్యంగ్యమునువరుసఁ
దెలుప లక్ష్యక్రమవ్యంగ్య; మిలనలక్షి
తక్రమ వ్యంగ్య మిట్లవేద్యక్రమంబు. ౧౦౧

ఇతఁడు 'నరసింహుఁడు' అన్నచో నరసింహపదముచేఁ 'గృష్ణుఁడు' అనునది వ్యంగ్యార్థము వ్యక్తమగుచున్నది. ఇది లక్ష్య క్రమవ్యంగ్యము.

"ఇతఁడు నరసింహుఁడు" అనునెడ ముఖ్యార్థబాధ యేమియులేదు. 'నరసింహ' పదముయొక్క శబ్దశక్తినిఁబట్టి 'విష్ణువు' (కృష్ణుఁడు) అనునర్థాంతరము వ్యక్తమగుచున్నది. మొందటి కక్ష్యలో నరసింహపదముచే నరస భూపాలుడనియు ద్వితీయ కక్ష్యలో విష్ణువనియు నర్థమగుచుచున్నది. ఈ క్రమము స్ఫుటముగా గోచరించుచున్నది. కాన సంలక్ష్యక్రమ వ్యంగ్యము. అసంలక్షితక్రమవ్యంగ్యమున నీవాచ్యార్థవ్యంగ్యార్థములకుఁ గ్రమము స్ఫుటముగా గోచరింపదు.

గీ. అందు లక్ష్య క్రమవ్యంగ్యమమరు 'శబ్ద
శక్తిమూలం' బనఁగ 'నర్థశక్తి మూల'
మన "నుభయశక్తి మూలంబు" నఁ ద్రిసంఖ్యఁ
దాల్చు; వేర్వేఱ వీనిభేదము లొనర్తు. ౧౦౨

స్పష్టము.

కం. తనరారు వస్తురూపం
బనఁగ నలంకారరూపమనఁగ ద్వివిధమై
ఘనవాక్య పదగతత్వం
బుననాల్గగు శబ్దశక్తిమూలము ధరణిన్. ౧౦౩

తా. శబ్దశక్తి మూలధ్వని శబ్దశక్తిమూలవస్తుధ్వని, శబ్దశక్తి మూలాలంకారధ్వని యనిద్వివిధము. అదియుఁబదవాక్యభేదములచే మొత్తము నాలుఁగువిధములు.

సీ. సమధికంబగు నర్థశక్తిమూలము స్వతః
ప్రతిపన్నమును, గవిప్రౌఢవచన
సిద్ధంబు, సుకవినిబద్ధోక్తి సిద్ధంబు,
నన& ద్రిరూపంబగు; నవియు వస్తు
కలితవస్తుధ్వని; యలవస్తుభవదలం
కృతిమయధ్వని; యలంకృతి సిరూఢ
వస్తుధ్వని; యలంకృతిస్తుతాలంకృత
ధ్వని; యననాల్గు భేదములు పరుస

గీ. నొకొక్కటి&దాల్ప రవిసంఖ్యనొనరు; నవియు&
దనరుముప్పది యాత్రై పదప్రబంధ
వాక్యగత భేదముల; నిట్లు వరలు నుభయ
శక్తిమూలంబు నేకమై జగతియందు. ౧౦౪

తా. స్వతస్సిద్ధార్థశక్తి మూలవస్తుధ్వని, స్వతస్సిద్ధార్థశక్తిమూలాలంకారధ్వని, స్వతస్సిద్ధార్థ శక్తిమూలవస్తుకృతాలంకారధ్వని, స్వతస్సిద్ధార్థ శక్తిమూలాలంకార కృతాలంకార ధ్వనియని యని నాలుగు విధములు ; కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూల వస్తుధ్వని, కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలాలంకారధ్వని, కవిప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తిమూలవస్తుకృతాలంకారధ్వని, కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలాలంకారకృతా లంకారధ్వని యని నాలుగువిధములు; కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి మూలవస్తు ధ్వని ; కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి మూలాలంకారధ్వని ; కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని ; కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థ శక్తిమూలాలంకార కృతాలంకారధ్వని ; అని నాలుగు విధములు. ఈ విధముగ నర్థశక్తి మూలధ్వని పండ్రెండు భేదములు. వీనివివరణము ముందు దెలియును. ఇదియు& బదగత, వాక్యగత, ప్రబంధగత భేదములచే ముప్పదియాఱు భేదములు. ప్రబంధమన సంఘటిత నానావాక్య కదంబరూపము. ఇది గ్రంధరూపముగా&గానీ తదవాంతరప్రకరణ రూపముగా& గానీ యుండవచ్చును. ఉభయశక్తిమూలధ్వని యేకవిధమే. అది కావ్యగతము మాత్రమే.

కం. నలువది యొకరూపంబుల&
బొలుపగు నీరీతి భేదము&జాస్పదమై

యిల సంలక్ష్యక్రమమన
నలరెడు వ్యంగ్యంబ శేషమాపాదింతున్, ౧౦౫

శబ్దశక్తి మూలధ్వని నాలుగువిధములు; అర్థశక్తి మూలధ్వని ముప్పదియాఱు భేదములు; ఉభయశక్తి మూలమేకవిధము; మొత్తము సంలక్ష్య క్రమవ్యంగ్యధ్వనికి నలుబదియొక్క భేదములు. వీనినుదాహరింతును.

కం. అసమ విభావాదులచే
రసధ్వని జనించువేళఁ గ్రమమొదవమిఁ జెం
పొసఁగున లక్ష్యక్రమమై
యెసఁగిన వ్యంగ్యంబు; దీనికిల భేదంబుల్. ౧౦౬

విభావ, అనుభావ, వ్యభిచారుల సంయోగమువలన రసము నిష్పన్నమగును. నిష్పన్నమగుననఁగా వ్యక్తమగునని యర్థము. రసపదముచే రస, భావ, రసాభాస, భావాభాస, భావోదయ, భావసంధి, భావశాంతి, భావశబలతాదులు గూడ గ్రాహ్యములే. రస్యమానతా సాధారణ్యముచే ననఁగా వీని యన్నింటియందును రస్యమానత్వము లేక యాస్వాద్యమానత్వము గలదు. కాన రసములే. (సర్వేఽపి రసనాద్రసాః) పూర్వసిద్ధమైయున్న ఘటాది పదార్థములను బ్రదీపము ప్రకాశింపఁ జేయునట్లు లేక వ్యక్తముసేయువిధమున విభావానుభావసంచారి భావములును బూర్వసిద్ధమై సహృదయ హృదయనిష్ఠమగు రసమును వ్యక్తముసేయును. ఇచివఱకచ్చట లేనివస్తువును గ్రొత్తగా దీపము వ్యక్తముసేయదు. ఉన్నవస్తువునే వ్యక్తముసేయును. అదేవిధమున సహృదయహృదయమున వాసనారూపమున నున్న రసములను విభావాదులు వ్యక్తముసేయును. ఇంకను దీని వివరణము ముందు విశేషముగాఁ గలదు. ఆ రసము వ్యక్తమగునపుడు వాక్యార్థ వ్యంగ్యార్థములకుఁ గ్రమమున్నను నది యతిసూక్ష్మమగుటవలన గోచరింపదు. ఎట్లన, శతపత్త్రి పత్త్రిశత భేదన్యాయానుసారముగా. అనఁగా నూఱు తామరపూరేకుల నొక సూదితోఁ బొడుచుచున్నపుడు గ్రమముగా నొక్కొక్క రేకునకే యా సూది గ్రుచ్చుకొనుచుఁబోయినను నొకేపర్యాయమే యన్ని రేకులకును గ్రుచ్చుకొన్నట్లు దోఁచును. ఆ క్రమ మతి సూక్ష్మమగుటచే గోచరింపనివిధమున రసాది వ్యంగ్యములలోఁగూడ వాచ్యార్థవ్యంగ్యార్థముల క్రమము గోచరింపదు. కావుననే ధ్వనికారుఁడు "వాచ్యసామర్థ్యాక్షిప్తమై వాచ్యముతోడనే భాసిల్లుచున్నట్లుండును" అని నుడివెను. కావున రసాదిధ్వని యసంలక్ష్యక్రమవ్యంగ్యమగును.

కాని కొన్నియెడల రసాది ధ్వని గూడ సంలక్ష్యక్రమ వ్యంగ్య మగునని లోచనకారుఁ డీ క్రిందివిధముగఁ దెలుపుచున్నాఁడు :—

"యద్యపి రసభావాదిరర్థో ధ్వన్యమాన ఏవ భవతి । నవాచ్యః కదాచిదపి। తథాఽపి న సర్వోఽలక్ష్యక్రమస్య విషయః। యత్ర హి విభావానుభావేభ్యః స్థాయి గతేభ్యః వ్యభిచారిగతేభ్యశ్చ పూర్ణేభ్యో ఝుటిత్యేవ రసవ్యక్తిః తత్రాస్తు అలక్ష్య క్రమః యథా"

నిర్వాణభూయిష్ఠ మథాస్యవీర్యం సంధుక్షయంతీవ వపుర్గుణేన
అనుప్రయాతా వనదేవతాభి రదృశ్యత స్థావరరాజకన్యా

ఇత్యాదౌ సంపూర్ణాలంబనోద్దీపన విభావయోగ్య స్వభావవర్ణనం ।

ప్రతిగ్రహీతుం ప్రణయిప్రియత్వాత్ త్రిలోచనస్తా ముపచక్రమేచ
సమ్మోహనం నామచచ పుష్పధన్వా ధనుష్యమోఘం సమధత్త బాణం

ఇత్యనేన విభావతయా ఉపయోగ ఉక్తః ।

హరస్తు కించిత్పరివృత్తధైర్య శ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోకనాని

అత్రహి భగవత్యాః ప్రథమమేవ తత్ప్రిణయిత్వాత్ తస్యచ ఇదానీం తదున్ముఖీ భూతత్వాత్, ప్రణయి ప్రియతయాచ పక్షపాతస్య సూచితస్య గాఢీభావాత్, రత్యాత్మనః స్థాయి భావస్య ఔత్సుక్యావేగ చాపల్యహర్షాదేశ్చ వ్యభిచారిణః సాధారణీభూతః అనుభావవర్గః ప్రకాశితః ఇతి విభావానుభావచర్వణైవ వ్యభిచారి చర్వణాయాం పర్యవస్యతి । వ్యభిచారిణాం పారతంత్ర్యాదేవ స్రక్సూత్రకల్పస్థాయి చర్వణావిశ్రాంతే రలక్ష్యక్రమత్వం । ఇహతు

ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రథోముఖీ ।
లీలా కమలపత్రాణి గణయామాసపార్వతీ ॥

పద్మదలగణన మధోముఖత్వంచ అన్యథాఽపి కుమారీణాం సంభావ్యతే । ఇతి ఝుడితి న లజ్జాయాం విశ్రమయతి హృదయం। అపితు ప్రాగ్వృత్త తపశ్చర్యాది వృత్తాంతానుసరణేన తత్ర ప్రతిపత్తిం కరోతీతి క్రమవ్యంగ్యతైవ। రసస్త్వత్రాపి అదూర ఏవ వ్యభిచారిస్వరూపే పర్యాలోచ్యమానే భాతీతి తదపేక్షయా అలక్ష్యక్రమతైవ । లజ్జాపేక్షయాతు తత్ర క్రమవ్యంగ్యత్వం ॥

(తెప్పుగా విచారింపఁగా రసభావాద్యర్థము ధ్వన్యమానము గావలసినదే కాని యెన్నడును వాచ్యముగారాదు. అయినను సర్వము నా రసాద్యర్థమును నసంలక్ష్య

క్రమవ్యంగ్యమే కాదు. ఎచ్చట స్థాయిగతములయినట్టియు, వ్యభిచారిగతములయినట్టియు సంపూర్ణ విభావానుభావ వర్ణనములచే వినఁగానే (ఝుడితి) రసోదయమగునో అచ్చట నసంలక్ష్యక్రమ వ్యంగ్యము. ఎట్లనఁ, గుమారసంభవమునఁ దపస్సు సేయుచున్న శివుని కథాఘట్టమును గనుఁడు.

"చాలావఱకు నాటిపోయిన నా మన్మథుని వీర్యమును దన మేనియందచందములచే రగులుకొలుపుచున్నట్లున్న పార్వతీదేవి వనదేవతలచే ననుసరింపఁబడుచు వచ్చి కానఁబడెను." ఇటఁ బార్వతి యాలంబనవిభావము; మేని యందచందము లుద్దీపన విభావములు.

"ఆ త్రిలోచనుఁడు ప్రణయిప్రియుఁ డగుటవలనఁ దనఁగాఁ దన పరిచితులందుఁ బ్రీతిగలవాఁడగుటవలన నామె తెచ్చిన పూలదండను గ్రహింపఁబోయెను. ఆ సందుచూచి పువ్విల్తుఁడును సమ్మోహనాస్త్రమును వింటఁ దొడిగెను" దీనిచే నా విభావముయొక్క యుపయోగము వర్ణింపఁబడినది.

"చంద్రోదయారంభమునందలి సముద్రమువలె హరుఁడు ధైర్య మలఁతిగాఁ జలింప బింబఫలమువంటి యధరముగల యుమాముఖమునందుఁ దన చూపులు పఱపెను."

ఇట భగవతి యింతకుమున్నే యాతని వలచియుంటవలనను, నాతఁడును నామెకున్నభిభూతుఁడగుటవలనను, బరిచితులందుఁ బ్రీతిగలవాఁడగుటచేఁ గలిగిన పక్షపాతము గాఢముగా నగుటవలనను' రతిరూపమగు స్థాయిభావమునకును, ఔత్సుక్య, ఆవేగ, చాపల్య, హర్ష, ఆదికమగు వ్యభిచారులకును, సామాన్యభూతమయిన ధైర్యపరివృత్తి, విలోచన వ్యాపారరూపమగు ననుభావవర్గము వ్యక్తమగుచున్నది.

కావున స్థాయియగు రతియొక్క విభావానుభావచర్వణయే వ్యభిచారిచర్వణగాఁ బర్యవసించుచున్నది. అనఁగా నిట వ్యభిచారిభావముల చర్వణము విభావానుభావచర్వణమునందే కలిసిపోయినది. వ్యభిచారిచర్వణము ప్రత్యేకముగాఁ గానరాదు. వ్యభిచారిభావములు స్థాయిపరతంత్రములు. స్థాయి సూత్రము. వ్యభిచారులు పూలదండ. వ్యభిచారులు స్థాయిపరతంత్రములగుటచే స్థాయిచర్వణయందే విశ్రాంతిగొనును. అనఁగా నిట్టి తావులందు విభావానుభావ వ్యభిచారుల చర్వణము వివిక్తముగా గోచరింపదు. ఇట్టిచో ఝుడితి రసవ్యక్తి కలుగుచున్నది. కాన నసంలక్ష్యక్రమ వ్యంగ్యము. ఇఁక

"ఈవిధముగాఁ దేవర్షి పలుకుచుండఁగాఁ దన తండ్రిప్రక్కనే తలవంచుకొని యా పార్వతి లీలాకమలపత్రములను లెక్కించెను."

ఇటఁ దామరరేకులు లెక్కించుట, తల వంచుకొనుటయుఁ గన్యకలకు లజ్జ వలననే కలుగునని చెప్ప వీలులేదు. ఇతర కారణములవలఁ గూడ గలుగవచ్చును. ఆమె పూర్వ మాతనికొఱకై తపస్సుచేసిన వృత్తాంతము దోఁచిననే లజ్జ వ్యక్త మగును. లేకున్నచోఁ బై కార్యములచే లజ్జ వ్యక్తముగాదు. కావున నిట లజ్జ శీఘ్రముగా వ్యక్తముగాదు. కావుననే లక్ష్యక్రమము.

కానీ లజ్జ వ్యక్తమయినపిమ్మట వెంటనే రసము స్ఫురించును. లజ్జ విలంబ ముగా వ్యక్తమగుచున్నది కాన లక్ష్యక్రమవ్యంగ్యమని చెప్పితిమి.

దీనివలన నెచ్చట శీఘ్రముగాఁ బూర్ణముగా రసము స్ఫురించునో యట నసంలక్ష్యక్రమవ్యంగ్యము. ఎచ్చటఁ బూర్వప్రకరణానుచింతనమున నాలస్యముగా వ్యభిచారిభావము వ్యక్తమగునో యట సంలక్ష్యక్రమవ్యంగ్యము. ఇది వెనుకటి సంలక్ష్యక్రమవ్యంగ్యమువంటిది గాదు. అసంలక్ష్యక్రమవ్యంగ్యములోని సంలక్ష్య క్రమవ్యంగ్య మిది.

ఈ రసాదులు విభావాదులచే వ్యక్తములు గావలయును. స్వశబ్దముచేతఁ (రసశబ్దముచేత) గానీ, శృంగారాదిశబ్దములచేతఁ గానీ యవి వాచ్యములు (వచన ముచేఁ జెప్పఁదగినవి) కావు. కాఁగూడదు.

> శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనై
> ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం
> విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకామాలోక్య గండస్థలీం
> లజ్జా నమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుంబితా.

తా. ఒకానొక ముగ్ధానాయిక ప్రియుఁడు పాన్పుపై నిద్రావ్యాజముతో నుండఁగా గదిలో నెవ్వరులేకుంటఁ జేసి మెల్లగాఁ బాన్పునుండిలేచి యాతని మొగముపై మొగమునుబెట్టి జూచి నిజముగా నిద్రించుచునే యున్నాఁడనితలచి సమ్మికతో ముద్దాడెను. అతఁడు కపటనిద్రలోనుంట నాతని గండస్థలిపులకరించెను. దానినిఁ జూచి యాబాలికసిగ్గువడి మొగమువంచుకొనఁగా ప్రియుఁడు నవ్వుచు నాబాలికను జిరకాలము ముద్దాడెను.

ఇందు నాయికా నాయకులాలంబన విభావములు. శూన్యమగు వాసగృహ ముద్దీపన విభావము. శయనమునుండి మెల్లఁగాలేచుట; పతిముఖముపై ముఖమునుబెట్టి

చూచుట, ముద్దాడుట, మొదలగునవి యనుభావములు; లజ్జాహాసములు వ్యభిచారి భావములు. ఇవన్నియుఁ గలిసి సంభోగశృంగారమును వ్యక్తము సేయుచున్నవి. ఇట రసపదముగానీ శృంగారపదముగానీ లేదు. లేకున్నను రసము గోచరించుచున్నది.

"తామనంగ జయమంగళ శ్రియం । కించిదుచ్చభుజమూలలోకితాం।
నేత్రయోఃకృతవతో౽స్యగోచరే । కో౽ప్యజాయతరసో నిరంతరః"

తా. జనులచేఁ జూడఁబడుచున్న కక్షమూలములుఁగల యా మన్మథుని జయలక్ష్మి నేత్రములకు గోచరింపఁగా నతనికొకానొక రసముపుట్టెను.

ఇట రసముపుట్టెను. అని రసపదము సాక్షాత్తుగాఁ బ్రయోగింపఁబడియున్నది. అయినను పైశ్లోకమునందువలె రసమువ్యక్తముగాకున్నది. ఔషధనామోచ్చారణము చేతనే రోగికి రోగశాంతి కలుఁగనివిధమున, 'రసముపుట్టె' అన్నమాత్రమున భావుకునకు (సహృదయునకు) రసము పుట్టదు. అది విభావాది సామగ్రి చేతనే వ్యక్తముగావలెను. రసాది పదప్రయోగముచే రసముపుట్టకపోఁగా స్వశబ్దవాచ్యత్వమను దోషముగూడఁ దటస్థించును. వెనుక ధ్వని లక్షణమున "శబ్దము తన యర్థమును, అర్థము తన్నును నప్రధానముగాఁ జేసికొని యేయర్థాంతరమును వ్యక్తపఱచునోయది ధ్వని"యనిచెప్పితిమి. "శూన్యం వాసగృహం" అను శ్లోకమున నీలక్షణమును సమన్వయము చేసికొనవలెను. ఎట్లనఁ గవి యిటఁ దరుణదంపతుల సంభోగశృంగారమును వర్ణింపఁ దలఁచెను. అట్టియెడల "నీతరుణదంపతులు సంభోగించిరి. లేక సంభోగశృంగార మనుభవించిరి." అనిచెప్పినచో నదియెట్టి యాస్వాద్యత్వమును గలిగింపదు. కావునఁ గవి వారి సమావేశస్థలము, మలయానిలచంద్రికాదుల స్థితి, శారిచేష్టాదులనువర్ణించెను. ఈవర్ణనరూపమగు వాచ్యార్థము మనకుఁబ్రధానముగాదు. సంభోగ శృంగారమే ప్రధానము. కావున నీవాచ్యార్థమంతయు నప్రధానమై సంభోగశృంగారమును వ్యక్తము సేయుచున్నవి. ఈవాచ్యార్థము వలననే వ్యంగ్యార్థము గోచరించుచున్నను వాచ్యార్థముతోడనే యా వ్యంగ్యము గోచరించుచున్నట్లుండును. ఇటవాచ్యార్థ వ్యంగ్యార్థములకుఁ గ్రమము గోచరింపదు. కావున నిది యసంలక్ష్యక్రమ సంభోగశృంగార వ్యంగ్యము.

కం. పద, వాక్య, వర్ణ, రచనా
 పదైక దేశములఁ, గృతులఁ, బరగుచునౌరా!
 యిదిగూడ నలువదేడగుఁ
 బదిలముగ వివక్షితాన్య పరవాచ్యములన్. ౧౦౭

తా. అసంలక్ష్య క్రమవ్యంగ్యము పదగత, వాక్యగత, వర్ణగత, రచనాగత, పదైకదేశగత, కావ్య (ప్రబంధ) గతరూపమున నాలు విధములుగానుండును. వీని కుదాహరణములు వ్యంజనావృత్తి ఘట్టమున వ్రాయఁబడియున్నవి. వెనుక సంలక్ష్య క్రమవ్యంగ్యమునకు నలువదియొక్క భేదములుండునని తెలిపితిమి. అసంలక్ష్యక్రమ వ్యంగ్య మాఱువిధములుగదా! వెరసి వివక్షితాన్య పరవాచ్యధ్వని నలువదేఁడు భేదములు వహించును.

ఏకపదముచే (పదగతము) నసంలక్ష్య క్రమవ్యంగ్యమెట్లు శోభిల్లును? ఏలన రసాద్యర్థము విభావాదులవలనఁ గాని వ్యక్తముగాదుగదా! అది పదసంఘాత రూపమున నుండవలెనుగదా! అట్టిచో నేకపదమువలన నదియెట్లు శోభిల్లునని శంక గలుగుచున్నది. సమాధానమిది.

కం. ఆయందంబాచందం। బాయాలాపక్రమంబు నాసమయమునం!
బీయూపధారమైయిడె। హాయిని; నన్నుపుడలంచెనది పెనుజ్వరమై

ఇట 'ఆ, ఆ' అనుపదములే లోకోత్తరత్వమనునర్థమును స్ఫురింపఁజేయుచున్నవి. ఆయందమనఁగా లోకోత్తరమైన యాసౌందర్యము' అనునర్థము స్ఫురించుచున్నది. ఇట ఆ, ఆ పదములే వ్యంజకములు. మిగిలినవి వానికుపకారకములు. కాఁబట్టి యేకపదముచేతను నసంలక్ష్య క్రమవ్యంగ్యము గోచరించును. దీనికవష్టంభకముగా ధ్వనికారుఁడు.

ఏకావయవ సంస్థేన భూషణేనేవ కామినీ
పదద్యోత్యేన సుకవేర్ధ్వనినా భాతి భారతీ

తా. ఏకావయవమున ధరించిన భూషణముచే సుందరి శోభిల్లునట్లు పద వ్యంగ్యముచేతను సత్కవికావ్యము శోభిల్లు' నని నుడివెను.

కం. మునువవివక్షితవాచ్యం
బునఁగలిగిన నాల్గు భేదముల నివికూడం
దనరుఁగృతి జీవశుద్ధ
ధ్వని యేకశతార్థభేదవంతం బగుచున్.                                      ౧౦౮

తా. అవివక్షిత వాచ్యధ్వని నాలుగువిధములని చెప్పితిమి. ఆ యవివక్షిత వాచ్యధ్వని భేదములును, వివక్షితాన్యపరవాచ్యధ్వని భేదములును వెరసి యేఁబది యొక్క భేదములగును. ఇవి శుద్ధభేదములు. అనఁగా నసంకీర్ణధ్వనులు.

క. ప్రకృతంబులైన యీధ్వను
లొకటొకటిం గూడ నేఁబదొక భేదములం
బ్రకటితమగుఁ బ్రాగ్భేదం;
బొకట! ద్వితీయంబు నేఁబదగు నీరీతిన్. ౧౦౯

క. కృతినన్నియు నేకైకో
నత సముచితసంఖ్యఁ గైకొనఁగ మిశ్రంబుల్
క్షితిషడ్వింశత్యుత్తర
శతత్రయాన్విత సహస్ర సంఖ్య చెలంగున్ ౧౧౦

తా. శుద్ధభేదము లేఁబదియొకటి. ఇందు మొదటిదియు రెండవదియుఁ గలసి యొక భేదమగును. మొదటిదియు మూఁడవదియుఁ గలిసి యొక భేదమగును. మొదటిదియు నాలుగవదియుఁ గలిసి యొక భేదమగును. ఇట్లు మొదటిదానితో మిగిలిన యొక్కొక్కటినిఁ గలుపఁగా మొదటిది యేఁబది భేదములగును. రెండవదియు మూఁడవదియుఁ గలిసిన నొక భేదము. రెండవదియు నాలుగవదియుఁ గలిసిన నొక భేదము, రెండవదియు నైదవదియుఁ గలిసిన నొక భేదము. ఇట్లు రెండవదానితో మిగిలిన యొక్కొక్కటినిఁ గలుపఁగా నలువదితొమ్మిదగును. ఇట్లు మూఁడవధ్వని మిగిలిన యొక్కొక్కటినిఁ గలియఁగా నలువదియెనిమిదగును. ఈవిధమున నొక్కొక దాని సంఖ్య తగ్గును. మొత్తము ౧౩౨౬ భేదములుగల మిశ్రధ్వను లేర్పడును.

గీ. త్రివిధమగు సంకరమున, సంసృష్టిచేత,
నొకటొకటి నాలుగై యివి యొప్పమీఱి
యవనిఁ జతురుత్తరశతత్రియాభిరామ
పంచదశ శతభేద ప్రపంచగరిమ. ౧౧౧

తా. ఈ ౧౩౨౬ ధ్వనులును త్రివిధమగు సంకరముచే, (సందేహ సంకరము, అనుగ్రాహ్యానుగ్రాహక సంకరము లేక అంగాంగిభావ సంకరము, ఏకవ్యంజకానుప్రవేశ సంకరము) ఏకవిధమగు సంసృష్టిచే, నాలుగురెట్లై ౫౩౦౪ ధ్వనిభేదము లగును.

## ఏకవ్యంజకానుప్రవేశ సంకరోదాహరణము

గీ. బటువు గుబ్బలజంటయు, వాలుఁజూపుఁ
బఱవ, ద్వారంబునన్ నిల్చి, వచ్చుపలికి

> సలిపెఁ బూర్ణఘటంబుల, నలరుదండ
> తోరణ, నయత్నమంగళాచార మింతి.

ఇట 'స్తనములు అను పూర్ణఘటములు' 'చూపులు అను అలరుదండతోరణ' అను రూపకము ధ్వనించుచున్నది. ఈ వ్యంగ్యరూపకాస్పదములగు స్తనములు, వాలుఁ జూపులే నాయకరతి కుద్దీపకములు. కాన శృంగారరసము వ్యంగ్యము. ఆ రూపక ధ్వనిరసధ్వనులు రెండును నొకే వ్యంజకపదమగు 'పూర్ణఘటములు' 'అలరుదండ తోరణ' అనునెడఁ బ్రవేశించియున్నవి. కాన నేకవ్యంజకానుప్రవేశ సంకరము. తక్కిన వూహ్యములు.

| | ధ్వని పేళ్లు | సజాతీయ విజాతీయ సంయోగములచే కలిగిన ధ్వనులు | సంకర సంసృష్టులతో నాలుగు భేదములు కలిగిన శుద్ధములు |
|---|---|---|---|
| ౧ | పదగతార్థాంతర సంక్రమితావివక్షితవాచ్యధ్వని | ౫౧ | ౨౦౪ |
| ౨ | వాక్యగతా... ,, | ౫౦ | ౨౦౦ |
| ౩ | పదగతాత్యంత తిరస్కృతావివక్షితవాచ్యధ్వని | ౪౯ | ౧౯౬ |
| ౪ | వాక్యగతాత్యంత ,, | ౪౮ | ౧౯౨ |
| ౫ | పదగత శబ్దశక్తిమూల సంలక్ష్యక్రమ వస్తుధ్వని | ౪౭ | ౧౮౮ |
| ౬ | ,, ,, అలంకారధ్వని | ౪౬ | ౧౮౪ |
| ౭ | వాక్యగత ,, అలంకారకృత వస్తుధ్వని | ౪౫ | ౧౮౦ |
| ౮ | ,, ,, వస్తుకృతాలంకారధ్వని | ౪౪ | ౧౭౬ |
| ౯ | పదగత స్వతస్సిద్ధార్థశక్తిమూల వస్తుకృత వస్తుధ్వని | ౪౩ | ౧౭౨ |
| ౧౦ | ,, ,, వస్తుకృతాలంకారధ్వని | ౪౨ | ౧౬౮ |
| ౧౧ | ,, ,, అలంకారకృతాలంకారధ్వని | ౪౧ | ౧౬౪ |
| ౧౨ | ,, ,, అలంకారకృత వస్తుధ్వని | ౪౦ | ౧౬౦ |
| ౧౩ | వాక్యగత స్వతస్సిద్ధార్థశక్తిమూల వస్తుకృతవస్తుధ్వని | ౩౯ | ౧౫౬ |
| ౧౪ | ,, ,, వస్తుకృతాలంకారధ్వని | ౩౮ | ౧౫౨ |
| ౧౫ | ,, ,, అలంకారకృత వస్తుధ్వని | ౩౭ | ౧౪౮ |
| ౧౬ | ,, ,, అలంకారకృతాలంకారధ్వని | ౩౬ | ౧౪౪ |
| ౧౭ | ప్రబంధగత స్వతస్సిద్ధార్థశక్తిమూల వస్తుకృతవస్తుధ్వని | ౩౫ | ౧౪౦ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧౮ | ,, | ,, | వస్తుకృతాలంకారధ్వని | ౩౪ | ౧౩౬ |
| ౧౯ | ,, | ,, | అలంకారకృత వస్తుధ్వని | ౩౩ | ౧౩౨ |
| ౨౦ | ,, | ,, | అలంకారకృతాలంకారధ్వని | ౩౨ | ౧౨౮ |
| ౨౧ | పదగత కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూల వస్తుకృతవస్తుధ్వని | | | ౩౧ | ౧౨౪ |
| ౨౨ | ,, | ,, | వస్తుకృతాలంకారధ్వని | ౩౦ | ౧౨౦ |
| ౨౩ | ,, | ,, | అలంకారకృతవస్తుధ్వని | ౨౯ | ౧౧౬ |
| ౨౪ | ,, | ,, | అలంకారకృతాలంకారధ్వని | ౨౮ | ౧౧౨ |
| ౨౫ | వాక్యగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని | | | ౨౭ | ౧౦౮ |
| ౨౬ | ,, | ,, | వస్తుకృతాలంకారధ్వని | ౨౬ | ౧౦౪ |
| ౨౭ | ,, | ,, | అలంకారకృతవస్తుధ్వని | ౨౫ | ౧౦౦ |
| ౨౮ | ,, | ,, | అలంకారకృతాలంకారధ్వని | ౨౪ | ౯౬ |
| ౨౯ | ప్రబంధగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని | | | ౨౩ | ౯౨ |
| ౩౦ | ,, | ,, | వస్తుకృతాలంకారధ్వని | ౨౨ | ౮౮ |
| ౩౧ | ,, | ,, | అలంకారకృతవస్తుధ్వని | ౨౧ | ౮౪ |
| ౩౨ | ,, | ,, | అలంకారకృతాలంకారధ్వని | ౨౦ | ౮౦ |
| ౩౩ | పదగత కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి | | మూలవస్తుకృత వస్తుధ్వని | ౧౬ | ౭౬ |
| ౩౪ | ,, | ,, | ,, వస్తుకృతాలంకారధ్వని | ౧౮ | ౭౨ |
| ౩౫ | ,, | ,, | ,, అలంకారకృతవస్తుధ్వని | ౧౭ | ౬౮ |
| ౩౬ | ,, | ,, | అలంకారకృతాలంకారధ్వని | ౧౬ | ౬౪ |
| ౩౭ | వాక్యగత | ,, | వస్తుకృతవస్తుధ్వని | ౧౫ | ౬౦ |
| ౩౮ | ,, | ,, | వస్తుకృతాలంకారధ్వని | ౧౪ | ౫౬ |
| ౩౯ | ,, | ,, | అలంకారకృతవస్తుధ్వని | ౧౩ | ౫౨ |
| ౪౦ | ,, | ,, | అలంకారకృతాలంకారధ్వని | ౧౨ | ౪౮ |
| ౪౧ | ప్రబంధగత | ,, | వస్తుకృతవస్తుధ్వని | ౧౧ | ౪౪ |
| ౪౨ | ,, | ,, | వస్తుకృతాలంకారధ్వని | ౧౦ | ౪౦ |
| ౪౩ | ,, | ,, | అలంకారకృతవస్తుధ్వని | ౯ | ౩౬ |
| ౪౪ | ,, | ,, | అలంకారకృతాలంకారధ్వని | ౮ | ౩౨ |
| ౪౫ | ప్రబంధగతా సంలక్ష్యక్రమవ్యంగ్యము | | | ౭ | ౨౮ |
| ౪౬ | వాక్యగతా | ,, | | ౬ | ౨౪ |
| ౪౭ | పదగతా | ,, | | ౫ | ౨౦ |

| | | | |
|---|---|---|---|
| ౪౮ | పదైకదేశగతా సంలక్ష్యక్రమవ్యంగ్యము | ౪ | ౧౬ |
| ౪౯ | రచనాగతా ,, ,, | ౩ | ౧౨ |
| ౫౦ | వర్ణగతా ,, ,, | ౨ | ౮ |
| ౫౧ | వాక్యగతోభయశక్తిమూలధ్వని | ౧ | ౪ |
| | | ౧౩౬ | ౫౩౦౪ |

కం. ఎన్నిక వీసికి లక్ష్యము
నన్నిటికి నొనర్పఁజాల నగునని భీతిఁ
గొన్నిటికొనర్తు వినుఁడు ప్ర
సన్నలసన్నవవచోవిచారధురీణుల్ ! ౧౧౨

స్పష్టము.

## అత్యంత తిరస్కృతా వివక్షిత వాచ్యధ్వని

కం. ఖరఖురకుట్టన ఘట్టిత
ధరణి రజః స్థగిత సదృశతామదవిచల
త్ఖరకర తురగోత్కరమై
కరమమరు నృసింహధాటికాహయమవనిఁ. ౧౧౩

తా. నరసభూపాలుని సమరాశ్వము తన గొరిజలతాఁకుళ్ళచే లేచిన ధూళిచేఁ "దాము తనకు సదృశములం" అను గర్వముచే విఱ్ఱవీఁగుచున్న సూర్యాశ్వములను గప్పుచున్నది.

"నరసభూపాలుని సమరాశ్వము సూర్యాశ్వములను తన గొరిజల ధూళిచేఁ గప్పుచున్నది" అను వాచ్యార్థము పొసగదు. ఏలన, భూసంచారి యగు సమరాశ్వమాకాశసంచారియు బహు దూరమున నున్నట్టియు సూర్యాశ్వముల ఖురధూళిచే నెట్లు గప్పును ? కావునవాచ్యార్థ మత్యంతమును దిరస్కృతమైనది. 'ధూళి సూర్యమండలమువఱకు వ్యాపించియున్నది' అనునది లక్ష్యార్థము. 'సమరాశ్వ మతి సాహసముతో సమరాంగనమున సంచరించుచున్నది' అను నర్థముప్రయోజనము. వాచ్యార్థము తిరస్కృతమై "సమరాశ్వ మతి సాహసముతో సమరాంగమున సంచరించుచున్నది" అను వ్యంగ్యార్థమును వ్యక్తమొనర్చుచున్నది.

కం. ఖరఖురకుట్టనఘట్టిత
ధరణిరజఃస్థగిత సదృశతామదవిచల

ఖరకర తురగంబనునెడు
దిరస్కృతస్వార్థమగునది బహువ్రీహిః. (?) ౧౧౪

దీనికి వివరణము పైపద్యముక్రిందనే వ్రాయఁబడినది.

## అర్థాంతర సంక్రమితావివక్షితవాచ్యధ్వని

ఉ. ఇంద్రసుతుండు జయించినరసేంద్రుఁడొకమ్మున మత్స్యయంత్రమున్
సాంద్రనిరూఢినేసెనని సంతతమున్ విని తత్తఱించి మ
త్స్యేంద్రుఁడు యోగముద్రధరియించి చరింపఁదొడంగె; నౌర! ని
స్తంద్రజవంబునన్ విపినశైలగుహాగహనాంతరంబునన్. ౧౧౫

తా. అర్జునుఁడు మత్స్యయంత్రమును గొట్టినాఁడు. ఇపుడు నరసభూపాలుఁడును మత్స్యయంత్రమును గొట్టఁగా మత్స్యదేశాధీశ్వరుఁడు యోగముద్రఁబూని పర్వతారణ్యముల సంచరింపఁదొడఁగెను.

గీ. "నరసభూభర్త మత్స్యయంత్రంబునేయ
నలుకు మత్స్యేంద్రు", డనునెడ "నాత్మమత్స్య
శబ్దసామ్యంబుచేఁ గల్గుశంకఁ" దనరు
వ్యంగ్యమర్థాంతరసమేత వాచ్యమగుచు. ౧౧౬

మత్స్యశబ్దమునకు మీనము, మత్స్యదేశము, నని రెండర్థములు గలవు. నరసభూపాలుఁడు మత్స్య (మీన) యంత్రమును గొట్టుటవలన మత్స్యదేశాధీశుఁడు మత్స్యశబ్దసామ్యముచే భయపడుచుండెను. ఇట మత్స్యదేశరాజేల భయపడవలెను? "వృద్ధతాడనాద్దంతభంగః" అన్నట్లు నరసభూపాలుఁడు మత్స్యయంత్రమును గొట్టఁగా మత్స్యదేశాధీశ్వరుఁ డేలభయపడును? ఇట నర్థము దిన్నఁగా బొసగుటలేదు. కావున నిట మత్స్యేంద్రశబ్దములోని మత్స్యశబ్దమునకు వాచ్యార్థమగు 'మత్స్యదేశము' అనునదియుఁ, 'మత్స్యేంద్రుఁడు' అనుశబ్దమును మీనము, మీనములరాజు, అను నర్థాంతరరూపమునఁ బరిణమించుచున్నవి. ఇప్పుడు మీనయంత్రమును నరసభూపాలుఁడు గొట్టఁగా 'మీనమును, మీనముల రాజును భయపడుట పొసగును. తన్ను నరసపాభూలుఁడు గొట్టునేమో యని ముందుగానే యతఁడు భయపడెను.

## శబ్దశక్తి మూలాలంకార ధ్వని

కం. ఈకోమలి పద్మినియఁట
యేకాలముఁ [illegible]

నీకర సంస్పర్శనహాన
గాక చెలంగునె? నృసింహా! ఘనబలసింహా!

తా. ఈతరుణి పద్మినీజాతి స్త్రీ. నీ వెల్లకాలమునఁ బ్రోచు ప్రభువవు. నీహస్త స్పర్శలేకున్న నెట్లు బ్రదుకును? ఇది వాచ్యార్థము.

"ఇది తామరదీఁగ; నీవు సూర్యుఁడవు; నీకిరణస్పర్శలేకున్న నది యెట్లు విలసిల్లును? ఇది వ్యంగ్యార్థము.

గీ. ఇందుఁ బ్రకృతంబులగు వధూనృపతి వాచ
కంబు; లల పద్మినీన శబ్దంబు లెలమిఁ
గమలినీ భాస్కరులఁ దెల్పఁ గలుగు నుపమ
వ్యంగ్యముగ నీ యలంకృతిధ్వని చెలంగు. ౧.౧౮

తా. ఇట పద్మినీ, ఇన శబ్దములు వాచ్యార్థమును బోధించి పిమ్మటఁ దామరతీఁగ, సూర్యుఁడు, అను నర్థాంతరమును బోధించుచున్నవి. ఇట్టియెడల వాచ్యార్థ వ్యంగ్యార్థముల కుపమానోపమేయభావమును జెప్పుకొనవలయునని వ్యంజనాఘట్టమునఁ దెలిపియుంటిమి. అది యీవిధముగాఁ దెలిసికొనవలయును.

సూర్యుఁడు దామరదీఁగను గరస్పర్శనముచే నెలయించువిధమున నీవును నీ కోమలిని నీ హస్తస్పర్శచే విలసిల్లఁజేయుము. ఇట నుపమానము వ్యంగ్యము. వెనుక "ఘనత నృసింహునికరమున" అనుచోఁగూడ నీ శబ్దశక్తి మూలవ్యంగ్యమును వ్రాసితిమి. దానినిఁగూడఁ జూచుకొనవలెను.

ఈ శబ్దశక్తిమూలాలంకారధ్వనిలో నొక్క యుపమాలంకారమే కాక యితరాలంకారములుగూడ వ్యక్తములు గావచ్చును. ఎట్లన,

సర్వైకశరణ, మక్షయ, మధీశ, మీశంధియాం, హరిం కృష్ణం
చతురాత్మానం నిష్క్రియ, మరిమథనం నమత చక్రధరం.

తా. ఎల్లరకును ముఖ్యరక్షకుఁడు, (ఎల్ల ముఖ్యగృహములుగలవాఁడు) క్షయము లేనివాఁడు (గృహము లేనివాఁడు); అధీశుఁడు, బుద్ధుల కీశుఁడు, (ధీశుఁడు-ధీ+ఈశ) కానివాఁడు, హరి (కపిలవర్ణము గలవాఁడు), కృష్ణుఁడు (నల్లవాఁడు) పరాక్రమయుక్తుఁడు, నిష్క్రియుఁడు (ఏపనినిఁ జేయనివాఁడు) శత్రుమథనుఁడు, (అరము-అంచు అది గలది అరి - చక్రము; దానిని మథించువాఁడు) చక్రమును ధరించినవాఁడు నగువానికి నమస్కరింపుఁడు.

ఇట సర్వైకశరణం - అక్షయం; అధీశం - ధియామీశం; ఇత్యాద్యర్థములు పరస్పర విరుద్ధములు. ఈ విరోధాలంకారము వాచ్యార్థము ముగిసినపిమ్మట లేచుచున్నది. కాన నిట విరోధాలంకారము వ్యంగ్యము. ఇట్లే వ్యతిరేకాలంకారము, శ్లేషాలంకారము, మొదలగు నితరాలంకారములును శక్తిశక్తిమూలధ్వనిలో వ్యంగ్యములుగా భాసింపవచ్చును.

## శబ్దశక్తి మూలవస్తుకృత వస్తుధ్వని

కం. ఆపన్నులార ! చెప్పెద
మీపాలిటి కీ హితంబు; మెఱయ నృసింహ
శ్రీపాదకమలసేవా
వ్యాపారము మఱవకుండుఁ డాత్మలలోనన్. ౧౧౯

తా. స్పష్టము.

గీ. ఇచ్చట 'నృసింహపదసేవ నెనయుఁ' డనెడు
శబ్దశక్తినిఁ 'బ్రిశృతుఁడౌ జనవరేందుఁ
గొలువుఁ; డతఁడాపదలుమాన్చుఁ గొలుచువారి'
కనెడువస్తువు వ్యంగ్యమై యతిశయిల్లు. ౧౨౦

"మీరు నరసింహపదసేవ సేయుఁడు" అను వస్తువుచేత "నరసభూపాలునిఁ గొలిచినచో నాపదలు మాన్చును" అనువస్తువు వ్యంగ్యమై భాసిల్లుచున్నది.

న్యాయముగా విచారించిన నిదియు వెనుకటిపద్యమునందువలెనే యుపమాలంకరమునే వ్యంగ్యముగా భాసిల్లఁజేయుచున్నది. ఎట్లన 'ఎట్లు నృసింహ (విష్ణువు) శ్రీపాదకమలసేవావ్యాపారము మఱవకుందురో యట్లే నృసింహ(నరసభూపాలుఁడు) శ్రీపాదకమలసేవావ్యాపారమును మఱవకుండుఁడు'. అనియే చెప్పుకొనవలెను. కాన నీలక్ష్యము దగదు.

కావున నిట సాహిత్యదర్పణమునందలి యుదాహరణశ్లోకమున కనువాదము నిచ్చెదను.

ఆ. వె. కటికరాలుదక్కఁ గనరావుకంటికి । పల్లెకొంపలందు బాటసారి!
ఘనపయోధరములంగనుఁగొని నిలువంగఁ । దలఁచితేని నేఁడు నిలిచిపొమ్ము!

ఒక పరకీయనాయిక యింటికివచ్చిన పాంథునితో ననుచున్నది. "ఈ పల్లెకొంపలలోఁ బరుండుటకు రాళ్ళురప్పలేకాని చాపలుఁగూడ లేవు. మెనున్న (వర్షింప

సిద్ధముగానున్న) మేఘపటలమును జూచి నిలువఁదలఁచినచో నిలువుము” అని వాచ్యార్థము. (వస్తువు)

ఇటనున్నవా రందఱును మూర్ఖులు. కాఁబట్టి నీవిట నివసించినను నిచ్చటివా రెవ్వరును శంకింపఁజాలరు. కాన నీవు నా స్తనములనుజూచి యుపభోగింప సమర్థుఁడ వగుచో నేఁడు నిలువుము” అనునది వ్యంగ్యార్థము. (వస్తువు)

ఇట ‘కటికిరాలు’ అను పదము మొదట ‘మూర్ఖుఁడు’ అను నర్థాంతరమును వ్యక్తము సేయుచున్నది. ఆ యర్థాంతరము “నీవిట నివసించినను నిచ్చటివారెవ్వరును శంకింపఁజాలరు” అను మఱొక యర్థాంతరమును వ్యక్తము సేయుచున్నది. ఈరెండు వ్యంగ్యములచేఁ “దప్పక యుపభోగింప నిలువుము” అను మఱొక వ్యంగ్యమును నుత్థితమగుచున్నది. ఈ వ్యంగ్యములకన్నింటినిఁ ‘కటికరాలు’ ‘పయోధరము’ అను శబ్దములకుఁ గల శక్తియే యుత్థాపనము సేయుచున్నది. ‘కటికరాలు’ ‘పయోధర ములు’ అను పదములఁ దీసివేసి యన్యపదములు వేసినచో నా వ్యంగ్యము లుత్థిత ములు కాఁజాలవు. కావున నిట శబ్దశక్తి మూలవస్తుకృత వస్తుధ్వని. ఈ ధ్వనిభేద మున నీవిధముగా నొక వస్తువుచే మఱొకవస్తువు ‘దానిచే మఱొకవస్తువును’ వ్యంగ్య ముగా భాసిల్లును. ఇట్లు వ్యంగ్యము బహుముఖముగా శోభిల్లును.

ధ్వన్యాలోక మతమున శబ్దశక్తి మూలాలంకారధ్వని భేద మొక్కటియే కానీ శబ్దశక్తి మూలవస్తుకృత వస్తుధ్వని భేదములేదు.

## స్వతస్సిద్ధార్థశక్తి మూలవస్తుకృత వస్తుధ్వని

స్వతః ప్రతిపన్నము, స్వతస్సంభవి, స్వతస్సిద్ధము, యీ మూఁడు పదములును సమానార్థకములే. స్వతస్సిద్ధ మనఁగా ‘స్వభావసిద్ధమైన’అని యర్థము. కవికల్పనలు లేక స్వభావముగా సిద్ధమగు నర్థము. లోకమునఁగూడ యథార్థముగాఁదోఁచు నర్థము ‘స్వతః సంభవి’; స్వతస్సంభవికూడఁ గవిప్రౌఢోక్తిసిద్ధమే. కాని యా యర్థము లోకమునఁగూడ సంభావ్యమానమై యుండును. అట్టి యర్థము మూలముగా ననఁగాఁ గారణముగాఁగల వస్తువుచేత వ్యక్తమగు వస్తువు.

వెనుక శబ్దశక్తిమూలధ్వనియందు శబ్దమును బరివృత్తిసేసినచో ధ్వని యుండ దనియుఁ గాన శబ్దపరివృత్తిని సహింపనియెడలనే శబ్దశక్తి మూలధ్వని యని చెప్పి తిమి. శబ్దపరివృత్తినిఁజేసినను ధ్వన్యర్థమునకు భంగమురాకున్నచో నర్థశక్తి మూలధ్వని యగును.

ఉ. చల్లనివాఁడు మానెలవు చందురమామ; కడంగి వేఁడుముల్
చల్లనివాఁడు మాయచటి చందన శైల సమీరుఁ;డంచుఁ ద
ద్భిల్లవధూమతల్లికలఁ బేర్కొని పల్కు నృసింహ మేదినీ
వల్లభ! నీవిరోధి నృపవల్లభ దుర్భర శైలవాసయై. ౧.౨౧

ఓ నరసభూపాలా! నీ విరోధియొక్క భార్య యొక పర్వతమున వసించుచు "మాయూరనున్న చంద్రుఁడు చల్లనివాఁడు; మాయూరనున్న మారుతము చల్లనిది;" అని యచ్చటి కిరాత స్త్రీలతోఁ బలుకుచుండెను.

ఉ. 'చల్లనివాఁడు మానెలవు చందురమామ' యటన్నఁ దద్ద్విష
ద్వల్లభ మాగ్ధ్యవైభవము వ్యంగ్యము; తద్ధ్వనిచేత నాయకా
యల్లక మగ్నయానరుటవ్యంగ్యము; తద్ధ్వనిచేత వ్యంగ్యమా
నెల్ల విరోధిరాజుల జయించె విభుండనువస్తువెంతయున్. ౧.౨౨

తా. శత్రుభార్య "మాయూరనున్న చంద్రుఁడు చల్లనివాఁడు" "మాయూరనున్న మలయమారుతము చల్లనిది" అని పలికిన పలుకు లామె మాగ్ధ్యమను వస్తువును వ్యంగ్యమొనర్చుచున్నవి. (అక్కడ నొక చంద్రుఁడును, ఇక్కడ నొక చంద్రుఁడును; ఇక్కడ నొక మలయమారుతమును, అక్కడ నొక మలయమారుతము గలదనుకొనుట మాగ్ధ్యముచేత నేగదా!) ఆవ్యంగ్యముచే నామె భర్తృవియోగముచే సంతాపమువహించుచున్న దని వస్తువు వ్యంగ్యమగుచున్నది. ఆవ్యంగ్యముచే 'నరస భూపాలుఁ డెల్లరాజులను జయించె' ననువస్తువు వ్యంగ్యమగుచున్నది. ఇట్లు శబ్దశక్తి మూలవస్తుకృతవ్యంగ్యము వలెనే బహుముఖ్యవ్యంగ్యము.

ఇట ఉ. 'చల్లనివాఁడు .........' ఇత్యాదికమగు నర్థము స్వతస్సిద్ధమే కాని కల్పనాయుక్తముగాదుగదా. కావున స్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని.

## స్వతస్సిద్ధార్థశక్తి మూలవస్తుకృతాలంకారధ్వని

మ. సలిలచ్ఛాయఁగుఱించి యంత్రకృతమత్స్యంబీ నృసింహక్షమా
తలనాథాగ్రణి యేసెనంచువిని తద్వంశాధిపుంబట్టినన్
సలిలచ్ఛాయఁగుఱించియేయునని యంచద్భీతిమార్తాండునిన్
బలిమింబట్టెఁడు వేగ రాహు విధునిం బైకొన్న చందంబునన్. ౧.౨౩

తా. నీటిలోని నీడనుజూచి గుఱివెట్టి యీనరసభూపాలుఁడు మత్స్యయంత్రమును గొట్టెనాఁడుగదా! ఈరాజుయొక్క వంశాధిపుఁడగు సూర్యునిఁ బట్టుకొన్న చో

నీటిలో నీడనుజూచి గుఱివెట్టి సూర్యునిఁబట్టు నన్నును నేయునని భయపడి రాహువు చంద్రునిఁ బట్టుకొన్న విధమున సూర్యునిఁ బట్టెడు.

గీ. 'యంత్రమీనంబుఁ దునుమాడినట్లు దునుము
ననియుకాఁబోలు రాహు వర్కునిగ్రహింపఁ'
డనెడునుత్ప్రేక్ష వాచకంబెసయలేమి
వ్యంగ్యమగు నిట్టివాక్యార్థ వైభవమున. ౧౨౮.

తా. "యంత్రమీనమును గొట్టినట్లే నన్నునుగొట్టు నని యెంచికాఁబోలు లేక వలె రాహువు సూర్యునిఁ బట్టెడు" అనునది యుత్ప్రేక్ష. ఈపద్యములో నుత్ప్రేక్షా వాచకమయిన 'కాఁబోలు' లేక 'వలె' పదములేదు. 'ఏయుననియంచద్భీతి' అనియే యున్నది. ఇట వస్తువుచే నుత్ప్రేక్షవ్యంగ్య మగుచున్నది.

చిత్రమీమాంసాకారుఁ డిది గమ్యోత్ప్రేక్ష యగును; కాని వ్యంగ్యోత్ప్రేక్ష గాదని తెలిపెను. ఆ గమ్యోత్ప్రేక్షావ్యంగ్యోత్ప్రేక్షల కీభేదమునుదెలుపుచున్నాడు. 'విషయ(ఉపమేయము) విషయి(ఉపమానము) నిమిత్తములెచ్చటగ్రహింపఁబడి కేవలము సంభావనావాచకముమాత్రము ప్రయోగింపఁబడదో యది వాచ్యము గాకున్నను వాచ్యాయమానమై గమ్యోత్ప్రేక్షయని వ్యవహరింపఁబడును. ఎచ్చట నుత్ప్రేక్షింపఁ దగిన యుపమానపదము (విషయి) గ్రహింపఁబడక నిబద్ధమగు వస్తువుచేఁ గానీ యలంకారముచేఁ గానీ యా వస్తువు తోఁచునో యది వ్యంగ్యోత్ప్రేక్ష.

వీరరుద్రభటాన్ దృష్ట్వా జయలక్ష్మ్యావృతాన్ రణే
కర్షంత్యరివధూకేశాన్ కాననే కంటకద్రుమాః.

తా. జయలక్ష్మీ సమాలింగితులగు వీరరుద్రుని భటులను గాంచి కాననమునఁ గంటకవృక్షములు శత్రు వధూకేశములను లాఁగుచున్నవి.

"వృక్షములరివధూకేశముల నాకర్షించుచున్నవి" అనునది వస్తువు. దీనిచే జయశ్రీసమాలింగితభటదర్శనముచే మన్మథోద్దీపనము గలవివలె ( వృక్షములు ) లాగుచున్నవి" అను నుత్ప్రేక్షవ్యంగ్య మగుచున్నది. ఇట "మన్మథోద్దీపనము గలవివలె" అను నుపమానము "వృక్షములరివధూకేశముల నాకర్షించుచున్నవి" అను వస్తువుచే వ్యంగ్యమైనది.

'యంత్రమీన' పద్యమున గమ్యోత్ప్రేక్షయే.

## స్వతస్సిద్ధార్థశక్తి మూలాలంకారకృత వస్తుధ్వని

ఉ. భూరిభుజాప్రతాప గుణభూషణ! యోబయ నారసింహ! నీ
చారుయశోవధూమణికి సారసవైరి ముఖంబు; తారకల్
సారనఖాంకురంబు; లల శంకరశైలహిమాద్రు లాత్మవ
క్షోరుహముల్; సితాబ్జములు సొంపగు లోచన పంకజాతముల్.

ఓ నరసభూపాలా! నీ కీర్తికాంతకుఁ జంద్రుఁడు ముఖము; నక్షత్రములు గోళ్లు; కైలాస హిమవత్పర్వతములు స్తనములు; తెల్లతామరపూలు కన్నులు.

గీ. తనరు సత్కీర్తికాంతకుఁ దారకాదు
లరయ నంగంబులై వేడ్కఁ బరిణమింపఁ
గలుగు పరిణామమునఁ ద్రిలోకములు నిండు
నరసవిభు కీర్తి వ్యంగ్యమనం జెలంగు. ౧౨౬

తా. "నీ కీర్తికాంతకుఁ జంద్రాదులు ముఖాదులుగాఁ బరిణమించిరి" అని చెప్పటచే నిది పరిణామాలంకారము. ఇది వాచ్యము. దీనిచే "నరసభూపాలుని కీర్తి ముల్లోకముల నిండినది" అను వస్తువు వ్యంగ్యము. పరిణామాలంకారముచే నిట వస్తువు వ్యంగ్యమగుచున్నది.

## స్వతస్సిద్ధార్థశక్తి మూలాలంకార కృతాలంకారధ్వని

చ. అరిపురభంజనోజ్జ్వల బలాధిక! శ్రీ నరసింహరాజశే
ఖర! భవదీయకీర్తిరుచి గంగయనంగఁ జెలంగుఁ బొంగుచున్
హరిపదసంగసంకలితయై భువనత్రయపూర్ణయై నిరం
తరతరహంసజాంశు సముదాయసమన్వితయై వసుంధరన్. ౧౨౭

తా. ఓనరసభూపాలా! నీకీర్తి గంగవలె హరిపదమును (విష్ణుపదము - ఆకాశము) ముట్టుచు, ముల్లోకములను నిండి, నిరంతరతరహంసజాంశు సముదాయసమన్వితయై (హంసలకాంతివంటి కాంతిగలదై - హంసజా = సూర్యుని బిడ్డయగు యమునా కాంతిసముదాయముతో గూడినదై - గంగ యమునతో సంగమించెనుట ప్రసిద్ధమేకదా) యొప్పుచున్నది.

గీ. రాజశేఖర! భవదీయరమ్యకీర్తి
యొనరు నలగంగవలె నను నుపమచేతఁ

బరగుదు నృసింహ! నీవు శంకరునికరణి
నను నుపమ వ్యంగ్యమా నిందు నరసిచూడ. ౧౨౭

తా. 'నీకీర్తిగంగవలె నున్నది' అనునది వాచ్యమగు నుపమ. దీనిచే "నీవు శంకరునివలె నుంటివి" అను నుపమ వ్యంగ్యముగా భాసిల్లుచున్నది. ఇట నలంకారముచే నలంకారము వ్యంగ్యముగా భాసిల్లినది.

## కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలవస్తుకృత వస్తుధ్వని

కవిప్రౌఢోక్తి సిద్ధార్థమన స్వతస్సంభవివలె లోకమునఁగూడ యథార్థముగా గోచరింపని యర్థము. స్వతస్సంభవి యర్థము కేవల ప్రౌఢోక్తిచేతనే నిష్పన్నముగాక లోకమునఁగూడ యథార్థముగా గోచరించునది. అనఁగా నది (స్వతస్సంభవి) కవిప్రౌఢోక్తి నిష్పన్నమైనను లోకమునఁగూడ సంభావ్యమగును. కవిప్రౌఢోక్తిసిద్ధమగు నర్థ మట్లు లోకమున సంభావ్యముగాదు.

సీ. ఒంటిగా మడికాసు గుంటిపైఁ గూర్చుండి
సంజకెంజాయ పెంజడలు దాల్చి
సొరిది నేకాలంబు సురనదీస్నాతుఁడై
నిద్దంపుబూది మైనిండ నలఁది
యచ్చుగాఁ బులితోలు కచ్చడంబు ఘటించి
యొడలఁ బాములుప్రాఁక నోర్చుగలిగి
హాలాహలానలాభీల ధూమముఁ గ్రోలి
యఱచేత హవ్యవాహనముఁ బూని

గీ. నీ యశోలక్ష్మిఁబూను పూనికలఁ దపము
నేఁడు నొనరించుచున్నాఁడు నీలగళుఁడు
కానియెడ నేల యతనికీ గతి సెలంగ ?
సరసగుణహార ! యోబయనరస ధీర ! ౧౨౮

మడికాను = వెండి; గుంటిపై = గుండుమీఁద; కైలాసపర్వతముపై.

ఓ నరసభూపాలా ! ఒంటరిగాఁ గైలాసమున సంజకెంజాయలవంటి జడలం ధరించి, గంగాస్నానము సేయుచు, మేనికి బూడిదను బూసికొని, పులితోలుగుడ్డలం దాల్చి, శరీరమునఁ బాములు ప్రాఁకుచున్నను నోర్చుకొని, యనఁగా నంతగా ద్వంద్వ

ములను గెలిచి, హాలాహలరూపమగు పొగను గ్రావి, యగ్నినిఁ జేతఁబట్టుకొని శివుఁడు నీ యశోలక్ష్మినిఁ బోలుటకై తపము సేయుచున్నాఁడు. కానిచో నతఁడీ గతి నేలయుండును ?

కం. నరసవిభు కీర్తిఁబోలఁగ
హరుఁడు దపముసేయుచుండు ననువస్తువుచే
'సరిగాఁ డాతని కీర్తికి
హరుఁడును' ననువస్తువలరు వ్యంగ్యంబగుచున్. ౧౩౦

తా. పైపద్యమున "నరసభూపాలునిఁ గీర్తినిఁ బోలుటకై శివుఁడు దపస్సును జేయుచున్నాఁడు" అను వస్తువుచే "శివుఁడు గూడ నాతనికీర్తికిఁ బోలఁడు" అను వస్తువు వ్యంగ్యము. శివుని స్వభావస్థితినిఁ గవి తపశ్చరణరూపమగు ప్రౌఢోక్తిచేఁ జెప్పినాఁడు. ప్రౌఢోక్తియనఁ గవికల్పితోక్తి వైచిత్ర్యము లేక కవి విచిత్రముగాఁ గల్పించిన యుక్తి లేక వక్రోక్తి. *

## కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని

కం. మేలిమి నృసింహ ధరణీ
పాలు ప్రతాపాగ్ని దిశలఁ బ్రబలినఁ గీలా
భీలదవానల మడవుల
పాలయ్యెన్ ; జలధిఁబడియె బడబానలమున్. ౧౩౧

తా. నరసభూపాలుని ప్రతాపాగ్ని దిక్కుల విజృంభింపఁగా దావాగ్ని యడవులపాలయ్యెను. బడబాగ్ని సముద్రమునఁ బడెను.

కం. జనపతి ప్రతాపమడరఁగ
వనవాటికి నరిగె దావ వహ్నియనెడిచో
మనమునఁ గలఁగియునుంబలె
ననియెడు నుత్ప్రేక్ష వ్యంగ్యమగు వస్తువుచేన్. ౧౩౨

---

* "However Bhamaha's Vakrokti appeared in Kavyaprakas under the name of ప్రౌఢోక్తి" అని త్రివేది వ్రాసినాఁడు. దీనినిఁబట్టి భామహుని వక్రోక్తియే ప్రౌఢోక్తిరూపమున ధ్వనికారుఁడును వానినిఁబట్టి కావ్యప్రకాశకారుఁడును గ్రహించియుందురు.

తా. పై పద్యమున "నరసభూపాలుని ప్రతాపాగ్ని దిక్కుల విజృంభింపఁగా దావాగ్ని యడవులపాలయ్యె" అను వస్తువుచే "దావాగ్ని మనసునఁ గలఁత పడినది కాఁబోలు" అను నుత్ప్రేక్ష వ్యంగ్యమగుచున్నది. ఉత్ప్రేక్షావాచకమగు 'కాఁబోలు' మొదలయిన పదములులేమి నిది వ్యంగ్యోత్ప్రేక్ష.

(ఇది గమ్యోత్ప్రేక్ష కాని వ్యంగ్యోత్ప్రేక్ష గాదు. వీని భేద మిదివఱకుఁ జూపఁబడినది. చూ. ౧౨౮ పద్యవివరణము.)

## కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలాలంకారకృత వస్తుధ్వని

ఉ. అంచితవిక్రమంబున, మహాసమరవ్రతదీక్షచేనొ, బో
షించిన కారణంబుననొ, శ్రీనరసింహ కృపాణమాజులం
బొంచి మదించి మించు నరిభూభృదకుంఠిత కంఠపీఠముల్
ద్రుంచియు వాఁతినంటదలదుశ్శిక్షితపక్షతజప్రవాహముల్. ౧౩౩

తా. నరసభూపాలుని ఖడ్గము యుద్ధవ్రతదీక్షను బట్టియుండుటచేతనో, నింతకుమున్ను పోషించిన కారణముచేతనో, యుద్ధములలో శత్రురాజుల కంఠములను ద్రుంచియు వారి రక్తమును గ్రోలకున్నది.

వ్రతదీక్షను గొన్నవారు వ్రతమధ్యమున జలాదులను గ్రోలరు. "విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయంఛేత్తు మసాంప్రతం" అని యున్నను "ఆతతాయిన మాయాంతం హన్యాదేవాఽవిచారయన్" అను శాస్త్రానుసారముగా నొకపుడు దనచేఁ బోషింపఁబడియుఁ గృతఘ్నులై తనకు హానిచేయ సమకట్టి వచ్చిన శత్రురాజుల కంఠములను ద్రుంచెను. కాని భీముఁడు దుశ్శాసనునిఁ జంపి కసిపోక రక్తపానమును జేసినవిధమున నీ ఖడ్గము రక్తపానము సేయలేదు.

కం. అలఘుగతినిఁ బోషించియు
బలెనంటదు రక్త మతని పటుఖడ్గమనం
గలిగిన యుత్ప్రేక్షవలన
నలఖండన వేగవస్తు వలరున్ ధ్వనియై. ౧౩౪

తా. పై పద్యమున "మహాసమరవ్రతదీక్షను బట్టియుండుటచేతనో, బోషించిన కారణముననో కత్తి రక్తము నంటదు" అనుచోట నున్న హేతూత్ప్రేక్షలం "వేగముగా నతఁడు శత్రువులను ఖండించెను" అను ఖండనవేగరూపమగు వస్తువును వ్యంగ్య మొనర్చుచున్నవి.

## కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకార కృతాలంకారధ్వని

శా. ఆమోదంబున శ్రీనృసింహవిభు దానాంభోనిధుల్ సాగర
స్వామింజెంద యశంబు మేఘములఁబర్వంగల్గు వర్షాశర
త్సామానాధికరణ్యశంక నచటన్ దామోదరుండొందు ని
ద్రాముద్రానుగత ప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్. ౧౩౫

తా. నరసభూపాలుని దానజలప్రవాహములు సముద్రమునఁ బడెను. అతని కీర్తికాంతి మేఘములపైఁ బడెను. అట్టితఱి నాసముద్రమున శయనించియున్న నారాయణునకు వర్షాకాలభ్రాంతియు, శరదాగమభ్రాంతియుఁ గలిగెను. దాన నతఁడు నిద్రాప్రబోధములు రెండును నేకకాలమున నొందెను; ఇది చిత్రము.

గీ. హరికి వర్షాశరద్భ్రాంతి యడరునెడి
భ్రాంతిమదలంక్రియారూఢిఁ బ్రబలునిద్రఁ
దెలివినున్నట్లు యోగనిద్రిలు వహించు
ననెడి యుత్ప్రేక్ష వ్యంగ్యమై యతిశయిల్లు. ౧౩౬

తా. "హరికి వర్షాకాలభ్రాంతియు, శరత్కాలభ్రాంతియు నేకకాలమునఁ గలిగె" ననుచోట భ్రాంతిమదలంకారము. దీనిచేఁ "దెలివితోఁగూడిన నిద్ర (యోగనిద్ర) భగవంతుని కున్నట్లున్నది" అను నుత్ప్రేక్ష వ్యంగ్యముగా భాసిల్లుచున్నది.

## కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృత వస్తుధ్వని

వెనుకటిది కవిప్రౌఢోక్తి. ఇటఁ గవిచే నిబద్ధుఁడగు వక్తయొక్క ప్రౌఢోక్తి. అనఁగాఁ గవి సాక్షాత్తుగాఁ దానేచెప్పక దూత్యాదులచేఁ జెప్పించినట్లు తెలుపు ప్రౌఢోక్తి. ఈక్రింది పద్యమున దూతి కవినిబద్ధవక్త్రి. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి కవిప్రౌఢోక్తి గాదా? ఏల యీయవాంతరవిభాగమన్నచో వృద్ధోక్తికన్న బాలోక్తి చమత్కారముగా నుండువిధమునఁ గేవల కవిప్రౌఢోక్తికన్నఁ గవినిబద్ధవక్తృప్రౌఢోక్తి యధికచమత్కారమును గలిగించును.

మ. అనురాగాంబుధి యుబ్బి వెల్వడినయట్లా పూర్ణఘర్మాంబువుల్
తనువల్లిందిగజాఱఁ, గన్నుఁగవ లేఁదళ్కుల్ పిసాళించుచున్

వనవిల్కానిపురవధ్రివేశకలనా నాళీకదామంబులై
తనరం గోమలి నిన్నుఁజూచె నరసేంద్రా! సాంద్రతేజోనిధీ! 138

స్పష్టము.

క౦. ఈ వాక్యార్థముచేతను
భూవల్లభ! నిన్నుఁ గోరి పొలఁతి విరహతా
పావృత్తి నున్నదిపుడను
నావస్తువు వ్యంగ్యమగుచు నతిశయమొందుఁ. 139

తా. పైపద్యమున నాకోమలి మేనెల్లఁ జెమర్పఁగా నిన్నుఁగాంచె" నను వస్తువుచే "నామె విరహతాప తప్తురాలై యున్నది." అనువస్తువు వ్యంగ్యమగుచున్నది.

ఇటదూతి కవినిబద్ధవక్త్రి. ఆమెతనచెలినిఁగూర్చి చెలికానితోఁదెలుపుచున్నది.

కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి మూలవస్తుకృతాలంకారధ్వని

చ. సురగిరి చుట్టునుంబవరి చుట్టుదు వేల దినేశ! రత్నసం
భరితము దేవతాధనముఁ బాయక కాచెదనంచు నేటికిన్;
సురతరులం గరాంగులులఁ జొప్పడఁదాల్చి యశోఽభ్రగంగ చే
బరగి నృసింహుఁడే సుకవిపంక్తులఁ బ్రోవ నిదేలయేటికిన్. 140

ఓ సూర్యుఁడా! రత్నసమృద్ధమగు దేవతాధనమును గాపాడుదునని నేఁటికిఁ గూడనేల మేరువుచుట్టును దిరిగెదవు? ఆ ధనమెవరికిఁ గావలయును? ఏలనమానరసభూపాలుఁడు కల్పవృక్షములను దనచేతివ్రేళ్ళ ధరించెను. కీర్తిగంగనువహించెను. సుకవిపంక్తులను బోషించుచున్నాఁడు. ఇంతకన్న నామేరువు చేయఁగలపనియేమి? (ఇదియొక కవినిబద్ధుఁడగు యాచకునివాక్యము.)

'సుకవి పంక్తుల' ననుటకన్న 'విబుధపంక్తుల'నన్నచో సముచితము గానుండును.

క౦. తనరెడు నీవాక్యార్థం
బున శ్రీనరసింహుఁ డఖిలమును బ్రోవఁగ నా
యనిమిషగిరివలెఁ దగునను
ననుపమమగు నుపమ వ్యంగ్యమై పొగడొందున్. 141

తా. పైపద్యమున సూర్యునుద్దేశించి చెప్పినవస్తువుచే "నరసభూపాలుఁడు మేరువువలె నున్నాఁడు" అను నుపమానము వ్యంగ్యమగుచున్నది.

## కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని

చ. ధరణిననంతకీర్తియుఁ బ్రతాపము గల్గిన రాజవౌట నిన్
దరుణిమనోఽరవిందమునఁ దాల్చిన చుట్టఱికంబు పేర్మినో
కరివరయానకుఀ విశదకాంతియుఁ గాఁకయునై కడంగి బి
త్తరమగు మేనఁగీర్తియుఁబ్రతాపమునిల్చె నృసింహభూవరా! ౧౮౧

తా. నరసభూపాలా! కీర్తిప్రతాపములుగల నిన్ను మనస్సునఁ దలఁచుచుంట చేతఁగాఁబోలు నాతరుణికిఁ గూడఁ గీర్తిప్రతాపము లబ్బినట్లు దేహమునం దెల్లఁదనమును, వేఁడిమియుఁ (విరహతాపము) గలిగెను.

గీ. నెలయకీర్తి ప్రతాపాఢ్యు నిన్నుఁదలఁప
యశము, శౌర్యంబు గలిగినట్లలరు వెలరుఁ
గాఁకయును నను త్ప్రేక్షఁ 'గాంత నేలు
విరహమునకోర్వ' దనువ్యంగ్యవిభవమలరు. ౧౮౨

ఇట 'ధరణి ... చుట్టఱికంబు పేర్మినో కరివరయానకుఀ విశదకాంతియుఁ గాఁకయుఁగలిగె' నను త్ప్రేక్షచే 'కాంత నేలుకొనుము. ఆమె విరహతాపమున కోర్వఁజాలకున్నది' అనువస్తువు వ్యంగ్యమగుచున్నది.

## కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని

చ. చెలువ! యిదేమి? యామగువ చిత్రమునందు నృసింహభూవరుం
గలయ లిఖించువేళఁ బులకంబులుఁ గ్రొంజెమరుందలిర్పఁగా
నొలయవడంకుచున్నది; సముజ్జ్వలమైన నృపాలరూపముఀ
వలపులు రేఁపుచున్న రతివల్లభురూపని భీతిఁ జెందెనో! ౧౮౩

స్పష్టము.

కం. "వరుని లిఖించుచు వడఁకెడి
సరోజశరుఁ డనియొ?" యనెడి సందేహమునన్

నరసింహుఁడు మరుకై వడిఁ
బరగునసెడి యుపమ వ్యంగ్యభావము నొందున్. ౧౪౪

సరోజశరుఁడు (పా) సరసన్మరుఁడు.

ఇట సందేహాలంకారముచే నుపమానము వ్యంగ్యము.

క౦. ఈవరుసఁ బ్రబంధాదిగ
తా వేలధ్వనులు బుద్ధిననుమేయములా
నావలరసధ్వనులు రస
భావప్రకరణములం బ్రపంచితములగున్. ౧౪౫

తా. ఈవిధముననే ప్రబంధగత ధ్వను లూహించుకొనవలెను. రసధ్వనులు రసప్రకరణమునఁ జూపుదుము. ప్రబంధధ్వని నిట నుదాహరింతుము. ప్రబంధమన సంఘటిత నానావాక్య సముదాయము. అది గ్రంథరూపముగాఁగానీ తదవాంతర ప్రకరణరూపముగాఁగానీ యుండవచ్చును. మహాభారతమునందు శాంతిపర్వమున నీ క్రిందిఘట్టము గలదు. ఆంధ్రమహాభారతమున దీని యనువాదములేదు. దీనికి గృధ్ర గోమాయుసంవాద మని పేరు. గ్రద్ద పగటిపూటనే చూడఁగలదు. రాత్రిపూట దానికిఁ గనులు గానరావు. నక్క రాత్రిపూటనే లెస్సగా విజృంభింపఁగలదు. ఇట్టి స్థితిలో మరణించిన బాలునిఁగొని బంధుగులు శ్మశానమునకుఁ దెచ్చిరి. అది సాయం కాల సమయము. ఆ మృతబాలుని విడిచి పోలేక బంధుగులు దుఃఖించుచుండిరి. ఆ శ్మశానమున నీ గృధ్రగోమాయువులు రెండును గలవు. ఆ మృతకళేబరము నా రెండును హరింపఁదలఁచుచున్నవి. ఇంకను జీఁకటి పడలేదు. ఆ బంధుగు లిదేవిధ ముగాఁ జీఁకటిపడువఱకు నేడ్చుచున్నయెడలఁ దనకుఁ గన్నులు గానఁబడమి నా నక్కయే వాని శరీరమును మ్రింగునని గృధ్రము భయపడుచున్నది. కావున నవి యిట్లనుచున్నది.

"అలంస్థిత్వా శ్మశానేఽస్మిన్ గృధ్రగోమాయుసంకులే
కంకాళబహులే ఘోరే సర్వప్రాణిభయంకరే
నచేహ జీవితః కశ్చిత్కాలధర్మ ముపాగతః
ప్రియో వా యదివా ద్వేష్యః ప్రాణినాం గతి రీదృశీ"

తా. గృధ్రగోమాయు సంకులమును, నెముకలచే నెల్లప్రాణులకు భయంకర మునునైన యీ శ్మశానమున నుండవలదు; కాలధర్మమును బొందినవాఁడెవఁడును దిరిగి జీవింపఁడు; ఈ గతి యెట్టివారికినిఁ దప్పదు.

ఈ వాక్యసమూహమంతయుఁ బ్రబంధమని వ్యవహరింపఁబడును. ఈప్రబంధము "వీరీశవమును విడిచిపోయినచో నక్కకందకుండ నేనే భక్షింతును" అను వ్యంగ్యార్థమును వ్యక్తము సేయుచున్నది.

అప్పుడు నక్క యిట్లనుచున్నది :—

"ఆదిత్యోఽయం స్థితో మూఢాః స్నేహం కురుత సాంప్రతం
బహువిఘ్నో ముహూర్తోఽయం జీవేదపి కదాచన
అముం కనకవర్ణాభం బాలమప్రాప్తయౌవనం
గృధ్రవాక్యాత్కథం బాలా స్త్యజధ్వ మవిశంకితాః"

తా. ఓ మూర్ఖులారా! ఇంకను బ్రొద్దున్నది. ఆ బాలునిపైఁ బ్రేమనూపుఁడు. ఈ బాలుని మరణముహూర్తము బహువిఘ్నయుక్తము. ఒకవేళ మరల జీవించినను జీవింపవచ్చును. ఈ గృధ్రవాక్యమును విని బంగారమువంటి యీ పసిపాప నేల విడిచెదరు ?

ఈ ప్రబంధమంతయు "వీరీశవమును జీఁకటిపడువఱకు విడిచిపెట్టిపోక యున్నచోఁ బిమ్మట గృధ్రమునకందకుండ నేనే భక్షింతును" అను వ్యంగ్యార్థమును సూచించుచున్నది.

ఇదంతయు స్వతస్సిద్ధార్థశక్తిమూల ప్రబంధగత వస్తుకృత వస్తుధ్వని. ఇదేవిధముగా స్వతస్సిద్ధ, కవిప్రౌఢోక్తిసిద్ధ, కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తిసిద్ధములగు వ్యంగ్యములొక్కొక్కటియు నాలుగుచొప్పున ౧౨ విధములను జూపవచ్చును.

గీ. ఇచట మధ్యమకావ్యమై రుచిరమగు గు
ణీకృత వ్యంగ్యవిభవంబు నిశ్చయింతు;
నదియు నెనిమిదిభేదంబు లెనయు; వీని
భవ్యనామంబు లెఱిఁగింతుఁ బ్రకమమున. ౧౪౬

తా. మధ్యమ కావ్యమగు గుణీకృతవ్యంగ్య మెనిమిదివిధములు. వానిని దెలుపుదును. గుణీభూతమనఁగా నప్రధానము. వ్యంగ్యార్థ మప్రధానమై వాచ్యార్థమే ప్రధానముగాఁ గల కావ్యము గుణీభూతవ్యంగ్యకావ్యము.

కం. అమరు నగూఢము, నపరాం
గము, వాచ్యాంగంబు, నప్రకాశము, సంది
గ్ధము, నల తుల్యప్రాధా
న్యము, గాక్వాక్షిప్త, మరుచిరాఖ్యము ననఁగన్. ౧౪౭

ఈ గుణీభూత వ్యంగ్యము–అగూఢము, అపరాంగము, వాచ్యాంగము, అస్ఫుటము (అప్రకాశము) సందిగ్ధము, తుల్యప్రాధాన్యము, కాక్వాక్షిప్తము, అరుచిరము అని యెనిమిదివిధములు.

కం. వనితాకుచకుంభముగతి
ధ్వని గూఢంబైనఁగాని వైదగ్ధ్యము లే
మినిఁదగు మధ్యమకావ్యం;
బెనిమిదివగలకు నొనర్తు నిల లక్ష్యంబుల్. ౧౭౮

తా. ధ్వన్యర్థము కామినీకుచకలశమువలె గూఢముగానున్నఁగాని రమణీయముగా నుండదు. ఆ రామణీయకము దగ్గుటచే మధ్యమకావ్యమగును. ఇట నల్లసాని పెద్దన పద్యము నొకదాని నుదాహరించుచున్నాను.

చ. ఘనతర ఘూర్జరీ కుచయుగక్రియ గూఢముగాక, ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యటుచాటగు సాంధ్రవధూటి సిబ్బెపుం
జనుఁగవవోలె గూఢమును జాటుదనంబును లేకయుండఁ జె
ప్పిన నదెపో! కవిత్వమనిపించు; నగించటుగాకయుండినన్.

కాన ధ్వన్యర్థ మతిగూఢముగా నుండరాదు. అతిస్ఫుటముగా నుండరాదు. గూఢాగూఢముగా నుండవలెనని సారాంశము.

## అగూఢ గుణీభూత వ్యంగ్యము

కం. పరిపతిత కవాటములై
పరిపాటిత కనకకూట పటవాటములై
అరినికరపురప్రకరము
లరుదుగ నరసింహుశౌర్య మంతయుఁదెలుపున్. ౧౭౯

తా. పడిపోయిన వాఁకిళ్లును, హరింపఁబడిన కనకరాసులును, చింపఁబడిన డేరాలును గల శత్రుపట్టణములు నరసభూపాలుని శౌర్యమును జాటుచున్నవి.

కం. "పరిపతిత కవాటములై
యరిపురములు దెలుపు శౌర్యమంతయు" ననుచో
"నరివరులగెలిచె విభుఁ"డని
పరగెడివ్యంగ్యంబ గూఢభావము చెందున్. ౧౮౦

పై పద్యముయొక్క వాచ్యార్థమువలన వ్యక్తమగు "నరసభూపాలుఁడు శత్రుల గెలిచె" అను వ్యంగ్యము గూఢముగా లేక రమణీయముగాక యున్నది. ఈ గూఢత చాలదు. "ఓ నరసభూపాలా! నీ యరిపట్టణములు పరిపతిత కవాటములు; పరిపాటిత కనకకూటపటవాటములు" అన్నయెడల "నరసభూపాలా! నీవు శత్రువుల గెలిచితివి" అను వ్యంగ్యము రమణీయముగా భాసిల్లినట్లు "అరుదుగ నరసింహుశౌర్య మంతయుఁదెలుపుఁగ" అన్నపుడు భాసిల్లదు. కావునఁ బాఠకు లా భేదమును దెలిసికొనవలెను.

"కృశాంగ్యా స్సంతాపం వదతి నళినీ పత్త్రశయనం" (ఈనళినీపత్త్రశయన మాకృశాంగి సంతాపమును జెప్పుచున్నది) అనుచోఁ గూడ నగూఢరూపమగు గుణీభూత వ్యంగ్యమే.

## అపరాంగము

రసభావాదులకు రసభావాదు లంగములుగా నున్నచో నపరాంగము.

కం. మెడ గ్రుచ్చి కౌఁగిలించును;
నొడలెల్లం బారవశ్య మొందించు నరిన్;
వడి మోహనిద్రవుచ్చును
బుడమి నృసింహేంద్రు ఖడ్గపుత్త్రిక యౌరా! ౧౫౧

స్పష్టము.

కం. రంగుగ నీయెడ ధ్వనియగు
శృంగారము రౌద్రరస విశేషమునకుఁ దా
నంగంబై విలసిల్లుచు
సంగతి నపరాంగమనఁగ సన్నుతికెక్కున్. ౧౫౨

పైపద్యమున శృంగారరసము రౌద్రరసమున కంగమైనది. ఏలన, నిట నంగి రౌద్రము. దానికి శృంగారము పోషకము. శృంగార రౌద్రములు విరుద్ధరసములు గదా! వీని కంగాంగిభావ మెట్లు కుదురును? అన్నచోఁ జూడుఁడు.

శ్లో. కోపాత్కించిదుపాగతోఽపి రభసాదాకృష్య కేశేష్వలం
నీత్వా మోహనమందిరం దయితయా హారేణ బద్ధ్వా దృఢం
భూయోయాస్యసి తద్గృహా నితి ముహుః కంఠార్థరుద్ధాక్షరం
[illegible]

తా. ఒక యువతి కినుకతోఁ దనకడకు వచ్చిన ప్రియుని కేశములుపట్టి లాఁగి పడకగదిలోనికిఁ గొనిపోయి హారములో రెక్కలుంగట్టి "దానియింటికి మరలఁ బోవుగదా!" యనుచు గొంతులో మాట లడ్డుపడుచుండఁగా వదరుచు నశ్రువులు గీలుచు రహస్యముగాఁ గొట్టుచుండెను. అతఁ డెంత ధన్యుఁడో కదా!

ఇటఁ గేశాకర్షణము, బంధనము, తాడనము, మొదలగునవి రౌద్రరసాను భావములు. అయినను శృంగారమున నారోపింపఁబడినవి. రౌద్రము శృంగారమునకుఁ బ్రతికూలమయినను రౌద్రరసానుభావములగు కేశాకర్షణాదులు రూపకబలమువలన శృంగారాంగములుగా నారోపింపఁబడినవి. (కల్పింపఁబడినవి) కాన విరుద్ధరసాను భావము లెచ్చట నారోపింపఁబడునో యచ్చట దోషముగాదు. "మెడగ్రుచ్చి" అను పద్యమునఁ బైశ్లోకమునవలెఁగాక శృంగార రసానుభావములే రౌద్రమున నారోపింపఁబడినవి. అయినను బైవలెనే యిట శృంగార రౌద్రములకు విరోధములేదు.

## వాచ్యసిద్ధ్యంగము

కం. ధారుణి శ్రీ నరసింహుని
నీరంధ్ర ధనుర్వినీల నీరదమమరుఁ
దారుణతర శరధారా
వారితరిపుశౌర్యసూర్య వైభవమగుచున్. ౧౫౩

తా. నరసభూపాలుని ధనుర్మేఘము తన శరధారచేఁ శత్రుశౌర్యరూపసూర్య వైభవమును వారించును.

వాచ్యసిద్ధ్యంగమనఁగా నెచ్చటఁ గావ్యమున నర్థము కుదరకపోయినపుడు వ్యంగ్యార్థమువలన నర్థము కుదురునో యది వాచ్యసిద్ధ్యంగము. వాచ్యార్థసిద్ధి కంగ మని వ్యుత్పత్త్యర్థము.

కం. శరధార యనఁగ ధ్వనియై
పరిణతమగు సలిలధార పార్థివుని ధను
శ్శరదమను వాచ్యమునకు
ర్వరలో నంగంబుగాఁగ వాచ్యాంగమగున్. ౧౫౪

ఇట వాచ్యార్థమున 'శరధార' యనఁగా బాణధారయే. ప్రకరణము నరస భూపాల వర్ణనము కాఁబట్టి యా యర్థమే ముఖ్యార్థము. ఈ యర్థమును జెప్పు కొన్నచో 'నీరంధ్ర ధనుర్వినీలనీరదము' అను రూపకము కుదురదు. రూపక ముత్తర

పదార్థప్రధానమగుట మేఘమునుండి బాణధార వెలువడదుగదా! కాన 'శరధారా' పదము వాచ్యార్థసిద్ధికై 'జలధార' అను నర్థాంతరమును స్వీకరించినది. అదియే వ్యంగ్యార్థము. ఈ వ్యంగ్యార్థము రూపకసిద్ధికిఁ దోడ్పడుచున్నది. అనఁగా వాచ్యార్థసిద్ధికీ వ్యంగ్య మంగమయినది. కాన నిది వాచ్యసిద్ధ్యంగము.

కావ్యప్రకాశమున నీ క్రింది యుదాహరణ మీయఁబడినది.

శ్లో. గచ్ఛామ్యచ్యుత! దర్శనేన భవతః కింతృప్తి రుత్పద్యతే ?
కింత్వేవం విజనస్థయోర్హతజనః సంభావయత్యన్యథా
ఇత్యామంత్రణ భంగి సూచిత వృథావస్థాన ఖేదాలసాం
ఆశ్లిష్యన్ పులకోత్కరాంచిత తనుర్గోపీం హరిః పాతు వః.

మ. తనివింబొందను నీదుదర్శనముచేతం జేతమం దచ్యుతా!
మనలంగాంచి రహస్థులన్ జనులెదన్ భావింతు రన్యంబుగా
నని యాపిల్పునఁదెల్పుచున్ నిజవృథాయాసంబుఁ జింతిల్లు గో
పినిఁ గౌఁగింటికిఁదార్చి మోవిగొను గోవిందుండు మిమ్మోముతన్.

అచ్యుతుఁ డనఁ 'గృష్ణుఁ'డని వాచ్యార్థము. 'అక్షరణశీలుఁడు' అనునది వ్యంగ్యార్థము. 'ఆ పిల్పునఁదెల్పుచున్ నిజవృథాయాసంబు' అను నర్థ మీవ్యంగ్యార్థమును సమకూర్చుచున్నది. 'అచ్యుత' శబ్దమునకు వ్యంగ్యార్థమును '(అక్షరణశీలుఁడు)' జెప్పకొనక 'కృష్ణుఁడు' అను వాచ్యార్థమునే చెప్పకొన్నచో 'ఆ పిల్పునఁదెల్పుచున్ నిజవృథాయాసంబు' అనుచోట నర్థమే కుదరదు. పొసగదు. కాన నిదియు వాచ్యసిద్ధ్యంగమే. ఇట గుణీభూత వ్యంగ్యములుగా నుదాహరింపఁబడిన అపరాంగ, వాచ్యసిద్ధ్యంగములు రెండును నుత్తమకావ్యములనియే జగన్నాథుని మతమైనట్లు వెనుకఁ దెలిపితిమి.

## అస్ఫుటము

అతిగూఢమైన వ్యంగ్యము. (ఘనతర ఘూర్జరీ కుచయుగమువంటిది.)

కం. శ్రీ నరసింహుని భుజగ
న్మానిత కౌక్షేయకంబు మహిమండలిలో
నానారిపుభూనాథవి
తానార్థితకీర్తిదుగ్ధధారలు గ్రోలున్. ౧౫౬

తా. నరసభూపాలుని చేతికత్తి శత్రురాజుల కీర్తిదుగ్ధములను ద్రాఁగును.

కం. అరికీర్తిదుగ్ధమానును
ధరణీశ్వర ఖడ్గమనుడు దర్వీకరశే
ఖరముగతిఁ బొల్చునని యెడి
సరసోపమ కృతులయందుఁ జనునస్ఫుటమై. ౧౫౬

తా. పైపద్యమునఁ "గత్తి శత్రు కీర్తిక్షీరములానును" అనుటవలన "గత్తి పామువలెనున్నది" అను నుపమాన మస్ఫుటముగానున్నది. మఱొక యుదాహరణము.

కం. కనఁబడకుండిన నిన్నుం। గనఁగా నువ్విళ్లుగొందుఁ; గనిపించినచోఁ
జనుదువని వెఱతు; నిన్నుం। గనకున్నను గన్న నాకుఁగలుంగవు సుఖముల్.

'నాకు గనరానివాఁడవుగాకుండునట్లును, వియోగభయము నాకుఁ గలుగకుండునట్లును జేయుము' అనునర్థము క్లిష్టముగా వ్యక్తమగుచున్నది. వెనుకటి పద్యమునఁ గ్లిష్టముగా నుపమాలంకారము వ్యక్తమగుచున్నది. ఇటఁ గ్లిష్టముగా వస్తువు వ్యంగ్యమగుచున్నది.

## సందిగ్ధము

కం. నరసింహు నభంగుర సం
గరమున నెదిరించు రిపులు కడుముందఱగా
నరుగుదు; రాయిత వడుదురు;
శరముల విడుతురు సమగ్రసంభ్రమపరులై. ౧౫౭

స్పష్టము.

కం. అరివరులాయితపడుదురు;
శరజాలము విడుతు;రనిన సమరంబునకో?
గిరిగుహల కరుగనో? యన
సరివ్యంగ్యము లలరుచుండు సందిగ్ధములై. ౧౫౮

తా. 'శత్రువులు సిద్ధపడుచున్నారు. బాణములు విడుచుచున్నారు' అనఁగా యుద్ధమునకు సిద్ధపడుచున్నారో? గిరిగుహలకుఁబోవ సిద్ధపడుచున్నారో? అను రెండు వ్యంగ్యార్థములలో నేది యుద్దేశింపఁబడినదో సందిగ్ధముగా నున్నది. ఏలన రెండును జమత్కారముగానే యున్నవి. కావ్యప్రకాశకారాదులు సందిగ్ధమన వాచ్యార్థవ్యంగ్యార్థములలో దేనికిఁ బ్రాధాన్యము? అను సందేహమును గలిగించు కావ్యమని చెప్పి యీ క్రింది శ్లోకము నుదాహరించిరి.

హరస్తుకించిత్పరివృత్త ధైర్యశ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని

తా. చంద్రోదయకాలమున సముద్రమువలె హరుఁడు కొంచెము ధైర్యము వదలి దొండపండువంటి కెమ్మోవిగల పార్వతీదేవి మొగమునఁ జూపులు పఱచెను.

ఇటఁ 'గెమ్మోవి ముద్దాడ నభిలషించెను' అను వ్యంగ్యము ప్రధానమో ? 'చూపులు పఱచెను' అను వాచ్యార్థమే ప్రధానమో? రెండును జమత్కారావహములే యగుటచే సందిగ్ధము.

పై పద్యమున రెండు వ్యంగ్యములలో నేది ప్రధానమో సందేహము. ఇట వాచ్యార్థ వ్యంగ్యార్థములలో నేది ప్రధానమో సందేహము. ఇదియే సరియైన దృష్టాంతము.

## తుల్యప్రాధాన్యము

వాచ్యార్థ వ్యంగ్యార్థములు రెండును బ్రధానములుగా గోచరించుచున్నచోఁ దుల్యప్రాధాన్యము.

కం. నరసింహేంద్రుని చరణం
బరుణంబుగ సంఘటింపుఁ డరులార! భవ
ద్వరమకుట స్ఫురణంబుల;
నరుణంబగు నతని నయన మటుగాకున్నన్. ౧౫౯

తా. ఓ శత్రురాజులారా! నరసభూపాలుని పాదమును మీ కిరీటములచే నెఱ్ఱగాఁ గావింపుఁడు. లేకున్న నతని కన్నెఱ్ఱవడును.

కం. నరసింహేంద్రునకు నమ
స్కరణం బొనరింపకున్నఁ గాంతారంబే
శరణంబగు ననువ్యంగ్యము
నిరవగు వాచ్యంబు సమములిచ్చటఁ దలఁపన్. ౧౬౦

తా. 'నరసభూపాలునికి నమస్కరింపకున్నచో మీకరణ్యమేగతి' అనువ్యంగ్యార్థమును, 'నరసభూపాలుని పాదమును మీ కిరీటములచే నరుణముఁగాఁజేయుఁడు' అను వాచ్యార్థమును దుల్యములే. అనఁగా వ్యంగ్యార్థము వాచ్యార్థముకన్న సుందరముగా లేదు. మరొక యుదాహరణము :—

"బ్రాహ్మణాతిక్రమత్యాగో భవతామేవ భూతయే
జామదగ్న్యస్తథామిత్ర మన్యథా దుర్మనాయతే"

పరశురాముఁడు రావణుని మంత్రియగు మాల్యవంతుని కీవిధమున సందేశ మంపుచున్నాఁడు :— "బ్రాహ్మణులయెడ నత్యాచారమును విడుచుట మీకే మంచిది. అట్లైనఁ బరశురాముఁడు మీకు మిత్రుఁడు. కాని నాఁడు వాని మనస్సు మాఱును."

ఇటఁ "బరశురాముఁడు క్షత్రియులనువలె రాక్షసులను గూడ నశింపఁ జేయును" అను వ్యంగ్యార్థమును "వాని మనసు మాఱును" అను వాచ్యార్థమును సమముగానే యున్నవి.

ధ్వన్యాలోక మతమున నీ తుల్యప్రాధాన్యరూపమగు గుణీభూత వ్యంగ్యము లేదని తోఁచుచున్నది. వెనుక నొక వాక్యమునకు వాచ్యార్థ వ్యంగ్యార్థము లను రెండర్థము లున్నవన్నచో వాక్యభేదము తటస్థించునని పూర్వమీమాంసకు లాక్షే పింపఁగా శబ్దశక్తి మూలధ్వనిలో వాచ్యార్థ వ్యంగ్యార్థముల కుపమానోపమేయ భావమును గల్పించి యేకవాక్యతను గూర్చుకొనవలయునని చెప్పియుంటిమి. ఇక్కడ ధ్వనికారుఁడు మరొకవిధముగా సమాధానము జెప్పుచున్నాఁడు. "ఒకవాక్యములో రెండర్థములును బ్రధానములే యగుచో వాక్యభేద మేర్పడును. కాని యొకటి ప్రధానమును, మరొకటి యప్రధానమును నగునేని వాక్యభేదము రాదు. ఏకవాక్యత గుదురును. సర్వత్ర వాచ్యవ్యంగ్యములలో నొకటి ప్రధానముగా మరొకటి యప్రధా నముగా నుండును. కానీ రెండును బ్రధానములుగా నుండవు"

ఇట్టిస్థితిలో వాచ్యవ్యంగ్యములకుఁ దుల్యప్రాధాన్య మెట్లుపొసగును? వాచ్యార్థ వ్యంగ్యార్థములు రెండును బ్రధానములే యగుచో వాక్యభేదదోషము తటస్థించును గదా! కావునఁ దుల్యప్రాధాన్యరూపమగు గుణీభూతవ్యంగ్య ముండదని తేలినది. కానీ మమ్మట, విశ్వనాథాదు లీ "బ్రాహ్మణాతిక్రమత్యాగో" అను శ్లోకమునే దీని కుదాహరించిరి.

## కాక్వాక్షిప్తము

కం. ఒసఁగునెడఁ గసరు; గర్జిలు
నొసఁగియొసఁగి వెల్లబాఱు; నొగినీకరణిన్
వినువశ యొసఁగఁగ నేర్చునె?
యసదృశగతి నంబువాహ మహాభళనరసా! ౧౯౬

తా. నరసభూపాలా! మేఘము నీవలె దానముసేయునే? అనఁగాఁ 'సేయుదు' అని వ్యంగ్యార్థము. " భిన్నకంఠధ్వని ర్ధీరైః కాకురి త్యభిధీయతే " శోక క్రోధవిస్మయాదులవలనఁ గలుగు స్వరభేదము 'కాకువు' అనఁబడును.

కం. ఒసఁగు నెడఁ గసరు గర్జిలు
నెసఁగఁగ నీలాంబువాహ; మిలనీవలెఁ దా
నొసఁగఁగ నేర్చునె! యనవుడు
'నొసఁగఁగ లే'దనెడివ్యంగ్య మొగిఁగాకువగున్. ౧౬౨

పైపద్యమున 'ఒసఁగదు' అను వ్యంగ్యార్థము ' ఒసఁగఁగ నేర్చునె ? ' అను వాచ్యార్థనిషేధముతోడనే యనఁగా సమకాలమందే భాసిల్లును. అనఁగాఁ బ్రిథమమున వాచ్యార్థము; దానివలన వ్యంగ్యార్థము భాసిల్లునుగదా! కాని కాకువుచే నాక్షిప్తమగువ్యంగ్యము వాచ్యార్థానంతరమునఁగాక వాచ్యార్థముతోడనే భాసిల్లును. కాన నిట వ్యంగ్యచమత్కారము వాచ్యార్థముచే నాక్షిప్తము గావుటలేదు. కాన నిట ధ్వనిత్వముగాక గుణీభూతవ్యంగ్యత్వమే. కావునఁ గాకుస్థలమం దెల్లెడలను వాచ్యార్థము వ్యంగ్యసంకలితముగానే భాసించును. కేవలము వాచ్యార్థము భాసింపనే భాసింపదు. వ్యంగ్యసంవలితముకాక వాచ్యార్థమునకు విశ్రాంతిలేదు.

కాకువువలనఁగూడ నెచ్చట వాచ్యార్థానంతరముననే వంగ్యార్థము గోచరించునో యట నుత్తమమగుధ్వనియేకానీ గుణీభూతవ్యంగ్యముగాదు. ఎట్లన

తథాభూతాం దృష్ట్వాన్నృపసదసి పాంచాలతనయాం
వనే వ్యాధైః సార్ధం సుచిరముషితం వల్కలధరైః
విరాటస్యాఽవాసే స్థితమనుచితారంభ నిభృతం
గురుఃఖేదం ఖిన్నే మయి భజతి నాఽద్యాపి కురుషు

"అన్నగారికి నామీఁదఁ గోపము వచ్చుచున్నది? ఇప్పటికినిఁ గౌరవులమీఁద లేదు?" అని వాచ్యార్థము. 'నామీఁదఁ గోపముందగదు. కౌరవులమీఁదఁ దగును' అనునది వ్యంగ్యార్థము. ఇది 'భజతి' అను కేవలకాకువుచేఁగాక "నాఽద్యాపి కురుషు" అను వాచ్యార్థసామర్థ్యముచే నాక్షిప్తమైన కాకుసాహాయ్యమున వ్యక్తమగుచున్నది. కాన వెనుకటి కాకువువంటిది గాదిది. కాన నిది యర్థశక్తిమూల ధ్వనియే యగును. పైది గుణీభూతవ్యంగ్యము.

## అరుచిరము లేక అసుందరము

మ. బలితంబైన మనోజబాణహతిచేఁ బల్మాఱు నిల్పోవలే
 కలికీలాలక ప్రాణముల్వెడలి నేత్రాంభోజమార్గంబునన్
 గలయంబ్రాఁకుచువచ్చి యన్నెలవునం గన్నీటియేఅడ్డమై
 నిలుపన్ నిల్చె నృసింహభూరమణ! మన్నింపంగఁ బ్రోఁడింతటన్.

తా. మన్మథబాణహతులచే నెంత యత్నించినను ప్రాణములు వెడలి కన్నుల లోనికివచ్చి యచ్చటఁ గన్నీరడ్డమై నిలుపఁగా నిలిచెను. ఓ నరసభూపాలా! దానిని మన్నింపుము.

క. 'ఏణాక్షి రాకయున్నను
 ప్రాణంబులు విడుచు' ననెడు వ్యంగ్యంబునకుం
 క్షోణిన్ వాచ్యముకన్నఁ బ్ర
 వీణత్వములేమిఁ దనరు వెస నరుచిరమై. ౧౬౪

తా. "నీవు రాకున్నచో నాయువతి ప్రాణములువిడుచు"నని వ్యంగ్యార్థము. ఇది వాచ్యార్థముకన్న సుందరముగా లేదు.

అయితే కొన్నియెడల సమాసోక్తి, ఆక్షేప, అప్రస్తుతప్రశంసా, పర్యాయాదులందు వస్తువ్యంగ్యము గలదు. రూపక, ఉపమేయోపమా, తుల్యయోగితా, దీపక, నిదర్శనాదులందు నుపమాలంకార వ్యంగ్యము గలదు. అతిశయోక్తి సర్వాలంకార సామాన్యమనియు నదిలేని యలంకారమే లేదనియును గొందఱ మతము (మమ్మట మతము). ఉపమాలంకారము సర్వసాధారణాలంకారమనియు నది లేని యలంకారమే లేదనియు కొందఱమతము (వామనమతము). "శ్లేషః పుష్ణాతి సౌభాగ్యం ప్రాయోవక్రోక్తిషు స్థితం" (శ్లేషాలంకార మెల్లయలంకారములతోఁగలిసి వాని సౌందర్యమును హెచ్చించును) అనియు నున్నది. ఇట్టియెడల వస్తువ్యంగ్యమును బట్టియు, నలంకారవ్యంగ్యమునుబట్టియుఁ జూచినచో నవి ధ్వనికావ్యములే యగును. కాని చిత్రకావ్యము లెట్లగును ? అను ప్రశ్న యుదయించుచున్నది. దీనికి సమాధాన మిది:—

సమాసోక్త్యాదులందును రూపకాదులందును వ్యంగ్యముగా భాసిల్లు వస్త్వలంకారములు ప్రధానములుగావు. అనఁగా సమాసోక్త్యాదులందును రూపకాదులందును వాచ్యములయిన వస్త్వలంకారములచేతనే చారుత్వాతిశయము కాని వ్యంగ్యము

లయిన వస్త్వలంకారములచేతఁగాదు. వీనిలో వ్యంగ్య మప్రధానము. కాన నివి గుణీభూత వ్యంగ్యకావ్యము లగును. మరొకవిషయము.

వస్తువుచే వస్తువును, నలంకారమును, అలంకారముచే నలంకారమును, వస్తువును వ్యంగ్యమైనపు డచ్చటి వస్త్వలంకారము లగూఢములగుటచే గుణీభూతవ్యంగ్యమనియు, వ్యంగ్యమైన వస్త్వలంకారములనుబట్టి ధ్వనికావ్యమనియును జెప్పవలసి వచ్చుచున్నది. అట్లే యపరాంగమునను రస, భావ, రసాభాస, భావాభాస, భావోదయ, భావసంధి, భావశబలతాదులు వేరొక రసభావాదుల కంగమగుచో మొదటిదానినిఁబట్టి ధ్వనికావ్యమనియు, రెండవదానినిఁబట్టి గుణీభూత వ్యంగ్యమనియును జెప్పవలసివచ్చుచున్నది. ఇట్టిచో గతి యేమి ? అనుచో నిట్టివి యుత్తమ ధ్వనికావ్యములే యగును. ఏలన, నే యర్థమువలనఁ జమత్కారాతిశయముగలుగునో యది యుత్తమము. ఇట వ్యంగ్యములగు వస్త్వలంకార రసాదులచేతనే చారుత్వము గలుగుచున్నది. కాన నవియే ప్రధానములు. ఇవన్నియు నపరాంగములోనే చేరును. జగన్నాథుఁడు వీని నుత్తమకావ్యములుగానే పరిగణించెనని చెప్పితిమి.

## కావ్యభేదములు

గీ. ఇంకఁ గావ్యప్రభేదంబు లేర్పఱింతు
వరుస నష్టాదశ విశిష్ట వర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు
నెలమిఁ దన్నామధేయంబు లెట్టివనిన. ౧౬౫

కం. పుర, సింధు, న,గ, ర్త్వైన, శశి,
సరసీ, వనమధు, రతిప్రసంగ, విరహముల్,
పరిణయ, తనయోదయ, నయ
విరచన, యాత్రాజి, దౌత్య, విభువర్ణనముల్. ౧౬౬

గీ. ఇందు నొకకొన్ని కడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్య మనఁగఁబరగు
మఱియు క్షుద్రప్రబంధనిర్మాణ మర్మ
లక్షణము లేర్పఱించెద లలితఫణితి. ౧౬౭

పుర, సముద్ర, శైల, ఋతు, సూర్యోదయ, చంద్రోదయ, సరఃక్రీడా, వనక్రీడా, వసంత, రతిప్రసంగ, విరహ, పరిణయ, పుత్రోదయ, నయవిరచన (సంధి

విగ్రహాదులు) దండయాత్రా, యుద్ధ, దౌత్య, ప్రభువర్ణనములు అను నష్టాదశవర్ణ నములు గలది మహాకావ్యము.

ప్రతాపరుద్రీయములో 'దౌత్యము' లేదు; 'ద్యూత' మున్నది. ఇదియే సరియైనది. మరియు 'మధు' అనక 'మధుపానము' అని యున్నది. కేవలము 'మధు' శబ్దముచే 'వసంతము' అను నర్థము వచ్చును. వసంతము, మధుపానము ననునవి పరస్పర సంబద్ధములే. కాన నెట్లు చెప్పుకొన్నను దోషములేదు. సాహిత్యదర్పణములో నిట్లున్నది.

సంధ్యా సూర్యేందురజనీ । ప్రదోషధ్వాంతవాసరాః ।
ప్రాతర్మధ్యాహ్నమృగయా । శైలర్తు వనసాగరాః
సంభోగ విప్రలంభౌచ । మునిస్వర్గపురాధ్వరాః
రణప్రయాణోపమయ । మంత్రపుత్రోదయాదయః
వర్ణనీయా యథాయోగం । సాంగోపాంగా అమీదశ.

సంభోగము మొదలుకొని పుత్రోదయమువఱకుఁగల పదియు సాంగోపాంగముగా వర్ణింపవలెను. సంధ్యాప్రభృతి సాగరపర్యంతము యథాయోగము వర్ణింపవలెను. అప్పకవీయమున నిట్లున్నది :—

సీ. పురమును, ఋతుషట్కమును బ్రయాణంబును । శైలంబు, వేఁటయు, సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును, మంత్రంబు, । ద్యూతంబు, పిదప నద్భుతరణంబు,
విజయంబు, మద్యపానజ వికారంబును, । వనవిహారంబును, వారికేళి,
కన్యాంగసౌందర్య కథనంబు, హిమకరా।భ్యుదయంబు, విప్రలంభోచితంబు,

గీ. పద్మమిత్త్రోదయంబును, బరిణయంబు,
సురతమును, దౌహృదంబును, సుతజననము,
ననఁగ నిరువదిరెండు వర్ణనలఁగూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస!

ఇౘ్చిరువదిరెండు వర్ణనము లుండవలెనని యున్నది. ఇందుఁ గొన్ని తగ్గినను మహాకావ్యమే యగును.

అలంకారశేఖరకారుఁ డీవిధముగాఁ గావ్యవర్ణనీయములను దెలుపుచున్నాఁడు:-

వర్ణ్యాశ్చరాజా దేవీ చ దేశో గ్రామః పురీ సరిత్ ।
సరోఽబ్ధ్యరణ్యోద్యానాద్రి ప్రయాణ రణవాజినః ।
[illegible]

సురాపుష్పంబు సంభోగః విశ్లేష మృగయాశ్రమాః ।
కలా ఋతువయస్సంధీ ధాతువృక్షాభిసారికాః ॥

రాజు, రాణి, దేశము, గ్రామము, పురి, నది, సరస్సు, అబ్ధి, అరణ్యము, ఉద్యానము, అద్రి, ప్రయాణము, రణము, గుఱ్ఱములు, ఏనుగులు, సూర్యోదయము, చంద్రోదయము, ఋతువులు, వివాహము, స్వయంవరము, సురాపానము, పుష్పావచయము, జలకేళి, సంభోగము, విశ్లేషము (విరహము), మృగయ, ఆశ్రమము, కళలు, ఋతువులయొక్కయు వయస్సుయొక్కయు సంధులు, ధాతు, వృక్ష, అభిసారికలు అను విషయములు వర్ణ్యములు.

రాజునందు:—కీర్తి, ప్రతాప, ఆజ్ఞా, దుష్టదండన, వివేకిత్వ, సంగ్రామశస్త్రాభ్యాస, రాజనీతి, క్షమా, ప్రజాపాలన, శత్రుశైలాధివాస, అరిపురశూన్యత్వ, ఔదార్య, ధైర్య, గాంభీర్య, శౌర్య, ఐశ్వర్య, ఉద్యమాదులు వర్ణ్యములు.

రాణియందు:—సౌభాగ్య, లావణ్య, శీల, శృంగార, మన్మథావస్థా, త్రపా, చాతుర్య, దాక్షిణ్య, ప్రేమ, మానవ్రతాదులు వర్ణ్యములు.

దేశమున:—పెక్కుగనులు, ద్రవ్యము, పశుధాన్యసమృద్ధి, దుర్గ, నదీమాతృకాదులు వర్ణ్యములు.

గ్రామమున:—ధాన్య, లతా, వృక్ష, సరసీ, పశుపుష్టి, క్షేత్ర, హట్ట (అంగడి) గ్రామ్యస్త్రీ విభ్రమములు వర్ణ్యములు.

పురమున:—అట్ట, పరిఖా, వప్ర, తోరణ, ధ్వజ, ప్రాసాద, మార్గ, ప్రపా, ఆరామ, వాపీ, వేశ్యా, నదులు వర్ణ్యములు.

నదియందు:—జలప్రవాహ, గజ, పద్మ, షట్పద, హంస, నక్ర, తీరోద్యాన, స్త్రీ, పాంథ, కేళులు వర్ణ్యములు.

అబ్ధియందు:—ద్వీప-అద్రి-రత్న-ఊర్మి-పోత (నౌకలు) - జలచరములును-నదీప్రవేశము - చంద్రునివలనఁ గలుగు వృద్ధి - బడబాగ్ని-మేఘములు త్రాగుట - మొదలగునవి వర్ణ్యములు.

అరణ్యమున:—వరాహ - ఇభ - యూధ - సింహాదులు (క్రూరజంతువులు)-ద్రుమములు-కాక-ఉలూక-కపోతాదిపక్షులు మొదలగునవి వర్ణ్యములు.

ఉద్యానమున:— మార్గము-ఫల-పుష్పలతాలతలు-శుక-పికాదులు-కేళీహంసాదులు-క్రీడలు-పాంథులు మొదలగు విషయములు వర్ణ్యములు.

శైలమున:—మహౌషధులు-ధాతువులు - వంశములు (వెదుళ్లు) - కిన్నరులు-నిర్ఝరులు-శృంగ-తట-గుహా-రత్న-వనజంతు-ఉపత్యకలు వర్ణ్యములు.

ప్రయాణమున:—భేరీభాంకార - భూకంప - బలధూళి - కరభ-ఉష్ట్ర-గజ-ఛత్రి, వణిక్, శకట, వేసరములు వర్ణ్యములు.

యుద్ధమున :— సైన్యధూళి, తూర్యధ్వని, శరమండపము, రక్తనదులు, ఛిన్నాతపత్రి, రథ, చామర, కేతు, కుంభి, యోధులును, సురనారీవృతభటులును, సురపుష్పవృష్టియును వర్ణ్యములు.

అశ్వమునందు:— వేగిత్వము, ఔన్నత్యము, తేజము, శుభలక్షణము, ఖురోత్థాతరజము, ప్రౌఢి, గతివిచిత్రితయును, దెలివియును వర్ణ్యములు.

గజమునందు:—సహస్రములతో యుద్ధము సేయుప్రౌఢి,ఉచ్చత్వము,కర్ణచాపలము,శత్రువ్యూహవిభేదకత్వము,కుంభములుండుట,మదాళులుండుటయునువర్ణ్యములు

సూర్యునియందు:—అరుణత్వము, సూర్యకాంతశిలలకుఁ, జక్రవాకములకును అంబుజములకును, పథికలోచనములకును బ్రీతియుఁ, దారా- ఇందు - దీప - ఓషధి-ఘూక-తమ-శ్చోర-కులటాదులకుఁ బీడయును వర్ణ్యములు.

చంద్రునియందు:—కులటా-చక్రవాక-అంబుజ పీడయును- చకోర - చంద్రకాంత-దంపతిప్రీతియును వర్ణ్యములు.

(షడృతువులందు నేది వర్ణింపవలెనో దోషప్రకరణమునఁ గవిసమయములలోఁ గలదు. అటఁ జూచుకొనవలెను)

వివాహమందు:—స్నానము-అంగభూషణములు-తూర్య - వేదఘోషములు - వేదీ-సంగీత-హోమ-లాజాదులును వర్ణ్యములు.

స్వయంవరమందు:—శచీరక్ష-మంచములు (కుర్చీలు) మండపములు మొదలగువానిని సిద్ధముసేయుట-రాజపుత్రి- రాజుల యాకారములు-అన్వయవర్ణనము చేష్టలును వర్ణ్యములు.

సురాపానమునందు:—వికలత్వము-మాటలలో-నడకలో స్ఖలనము-లజ్జయును మానమును విడుచుట - ప్రేమాధిక్యము - కనుఱెప్పవడుట - భ్రమణము మొదలగునవి వర్ణ్యములు.

పుష్పాపచయమున:—పూలుగోయుట - ప్రియుఁడు పూలనందిచ్చుచు గోత్రస్ఖలనము సేయుట-మాలను బాఱవిడుచుట-కోపము-వక్రోక్తులు-సంభ్రమాశ్లేషములు వర్ణ్యములు.

జలకేళియందు:—సరస్సును క్షోభపఱచుట-చక్రవాకములు-హంసలు మొదలగునవి తొలఁగిపోవుట-నీళ్ళు చల్లుకొనుట-భూషణచ్యుతి మొదలగునవి వర్ణ్యములు.

సురతమున:—సాత్త్వికభావములు - సీత్కారము-కనులు ముడుఁచుకొనుట-కాంచీ-కంకణ-మంజీరరవములు- నఖాధరక్షతములును వర్ణ్యములు.

విరహమున:- తాప-నిశ్వాస-చింతా-మౌన-జాగర-కృశాంగత్వములును-క్షణములు సంవత్సరములుగా-రాత్రులు దీర్ఘములుగా-శిశిర ముష్ణముగా వర్ణింపవలెను.

మృగయయందు:—సంచారము-వలలు-నీలవేషము-మృగత్రాసము - మృగాధిక్యము- హింస- జంతువులను జంపుట-గతిత్వరయును వర్ణ్యములు.

ఆశ్రమమునందు:—అతిథిపూజ - ఏణములకు విశ్వాసము - క్రూరజంతువులు శాంతముగా వసించుట - యజ్ఞధూమము - మునికుమారికలుచేయు వృక్షసేచనము - వల్కలములు - ద్రుమములును వర్ణ్యములు.

ప్రాతఃకాలమున:— పద్మములు వికసించుట - కోకదంపతులు ప్రీతినొందుటయు వర్ణ్యములు.

మధ్యాహ్నమున:—తాపబాహుళ్యము వర్ణ్యము.

సాయంకాలమున:—సూర్యుని యెఱుపు-చక్రవాక-పద్మములకు విప్లవమును వర్ణ్యములు. (ఈ మూఁడుకాలములకుఁ గళలని నామాంతరము)

అంధకారమున:—అతికాఠిన్యము-సమస్తలోకములను లోపింపఁజేయు సామర్థ్యము-అభిసారికాసంచారమును వర్ణ్యములు.

వృక్షమున:—బహుశాఖావత్త్వము-ఆకుల దట్టనచే సూర్యుఁడగపడకుండుట-ఉచ్చత-పుష్పసమృద్ధి-పథికసేవ్యత్వమును వర్ణ్యములు.

అభిసారమున:—భయభ్రంశము-మంజీరాదుల తిరస్కారము - సాహసము-అతిమోహము-కాలానుగుణమైన వస్త్రధారణము మొదలగునవి వర్ణ్యములు.

శైశవతారుణ్యసంధులును, ఋతుసంధులును వర్ణ్యములు.

ఇపుడు మహాకావ్యలక్షణము చెప్పఁబడినది. కాని కావ్యవస్తు వెట్లుండవలయునో చెప్పలేదు. కొందఱీ వర్ణనములఁబట్టియే కావ్యవస్తువు నిర్ణీతమగుచున్నదనియు ననఁగా నివ్వన్నియుఁగలకథ గావలయుననియుఁ జెప్పుదురు. ధ్వనికారాదు లెవ్వరును మహాకావ్యమున కీలక్షణమును దెలుపలేదు. ధ్వనికారుఁడు పదవాక్యవ్యంగ్యములను దెలిపి ప్రబంధవ్యంగ్యమును దెలిపెను. ప్రబంధ మెట్లున్న రసవ్యంజకమో దానినిఁ దెలిపియున్నాఁడు. అనఁగాఁ గావ్యవస్తు వెట్టుండవలయునో వచించెను.

## కావ్యవస్తువు

మన కవులు నాటకవస్తువునందుఁ జూపినంత శ్రద్ధను శ్రవ్యకావ్యవస్తువునందు జూపరైరి. భరతునిమతమునఁ గావ్యమన దశరూపాత్మకమే. (కావ్యంహి దశరూపాత్మకమేవ) కావుననే యతఁడు రూపకవస్తువును రూపకరసమును గుఱించియే చర్చించెను; కాని శ్రవ్యకావ్యవస్తువును, శ్రవ్యకావ్యరసమును గుఱించి చర్చింపఁడయ్యె. కాని ధ్వనికారుఁడే ప్రప్రథమమున రూపకమునకువలెనే శ్రవ్యకావ్యమునకును రసమే ప్రధానమనియు, దాననే రమణీయత్వముగలుగుననియు నిర్వచించెను. (ఏతచ్చ రసాదితాత్పర్యేణ కావ్యనిబంధనం భరతాదావపి సుప్రసిద్ధమేవ-ధ్వన్యాలోకము) ఈవిషయము S. K. De గారి Sanskrit Poetics అను గ్రంథమువలనను స్పష్టమగుచున్నది.

'We get the first definite exposition, as we shall see of the idea of Rasa, and its relation to poetry in the works of Dhwanikara and Ananda Vardhana; and its importance in Poetry, as distinguished from Drama, was probably understood from that time,

Page 22. Footnote 44

That the Doctrine of Rasa was originally associated with the Dramuturgy and later on applied to poetics is clear from the tradition which survives even in very late writters and makes them not only discuss the theory directly in connection with the Drama but even borrows the illustrations from dramatic poetry. Page 23. Footnote 45

ఈ విధముగా De పెక్కుచోట్లఁ దెలిపెను. అభినవగుప్తపాదాచార్యులవారును దమలోచనమున "నాట్యాత్ సముదాయరూపాత్ రసః కావ్యేచ నాట్యాయమాన ఏవ రసః కావ్యార్థః" అని తెలిపిరి. ఈ యుల్లేఖములనుబట్టి ధ్వనికారుని కాలమునుండియే యాలంకారికులు కావ్యమునందును, నాటకమునందువలెనే రసప్రాధాన్య మంగీకరించిరి. ధ్వనికారునికిఁ బూర్వులయిన భామహ, దండి, వామనులు క్రమముగా అలంకార, గుణ, రీతి, ప్రాధాన్యముల నంగీకరించి రసము నప్రధానముగా నిరూపించిరి. ధ్వనికారుఁ డట్లుగాక భరతుని రూపకరససిద్ధాంతమును గావ్యమునకుఁగూడ సమన్వయించెను. ఆరస మెట్లాస్వాద్యమానమగునో చక్కఁగా నభినవగుప్తుఁడు నిర్వచించెను. ఆవిషయము రసప్రకరణమునఁ జర్చింపఁబడును.

ఇటఁ గావ్యవస్తువునుగుఱించి ధ్వనికారుఁ డేమివచించెనో చూతము.

"విభావ భావానుభావ సంచార్యౌచిత్యచారుణః
విధిః కథాశరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య వా

ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాఽననుగుణాం స్థితిం ।
ఉత్ప్రేక్ష్యోఽప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః ।
సంధిసంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా ।
నతు కేవలయా శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా ।
ఉద్దీపన ప్రశమనే యథా ఽవసరమంతరా ।
రసస్యాఽరబ్ధవిశ్రాంతే రనుసంధానమంగినః ।
అలంకృతీనాం శక్తాఽవప్యానురూప్యేణ యోజనం ।
ప్రబంధస్య రసాదీనాం వ్యంజకత్వే నిబంధనం ।

(విభావ, భావ, అనుభావ, సంచారుల యౌచిత్యము గలిగి రమణీయముగా నున్న కథాశరీరమును (ప్రఖ్యాతముగాని, ఉత్పాద్యముగాని, మిశ్రముగాని) గ్రహింపవలయును. ఇతివృత్తగతమగుననౌచిత్యము లున్నవానినిఁ దొలఁగించి రసోచితముగాదానిని మార్పవలెను. రసాభివ్యక్తినుద్దేశించి యనఁగాఁదదుపస్కారకముగా సంధి, తదంగములను గూర్పవలెను. అంతేకాని శాస్త్రమర్యాదను బాలించుటకై రసోపస్కారకములుగాని సంధి తదంగములను గూర్పరాదు. ఆయా ఘట్టములందు రసోద్దీపనమును, రసప్రశమనమును, సముచితముగాఁ గావింపవలెను. ఆరంభింపఁబడి యాఁగిపోయిన యంగిరసమును మరల ననుసంధింప వలయును. సామర్థ్యమున్నది గదాయని యలంకారములను గూర్పక యనురూపముగా మాత్రమే కూర్పవలెను. ఇది ప్రబంధము రసాదివ్యంజకమగుటలో నిబంధనము.)

ప్రబంధమనఁ గావ్యము. "ఇతివృత్తం తు కావ్యస్య శరీరం పరికీర్తితం" అని భరతమతము. కాననిటఁ గావ్యశరీరమని యర్థము. కావ్యవస్తువు రసాదివ్యంజకముగావలయునన్నచో నావస్తువు పైవిధముగానే యుండవలయును. అనఁగా రూపకమునందుఁ వలెనే కావ్యమునందును వస్తువు రమణీయముగా, రసోచితముగా, నుండవలయును. రూపకమునందుఁగవి కథను "అనఁగనఁగా నొకరాజు" అని ప్రారంభింపక యితివృత్తము నందలి రమణీయఘట్టములను బ్రదర్శనీయము లగు వానిని మాత్రమే తీసికొని యంకములుగా విభాగించి వ్రాయును. అట్లే శ్రవ్యకావ్యమునను వస్తువుయొక్క రసవద్ఘట్టములను దీసికొనియే రచింపవలెను. ఒక విశేషము గలదు. రూపకము దృశ్యమగుటవలన రంగమునఁ గొన్ని విషయములు నిషిద్ధములై యున్నవి. కాని కావ్యము శ్రవ్యమగుటవలనఁ గనుకలిచేఁ గలిగినంత జుగుప్సాదులు వినుకలిచేఁ గలుగవు; కాన దృశ్యకావ్యముననిషిద్ధము లయినవన్నియు శ్రవ్యకావ్యమున నిషిద్ధములు గానక్కఱలేదు. కావునఁగావ్యవస్తువు రసవ్యంజకము గావలయునన్నచోఁ

వైవిధ్యమున రచింపవలయును. ఇదియే కావ్యశిల్పము. ఈ శిల్పదృష్టియే కవికి ముఖ్యముగా నుండవలెను.

"విభావానుభావ" ఇత్యాది విషయమును కేవల రూపకవస్తువును గుఱించి ధ్వనికారుఁడు వచింపలేదు. ఎట్లతఁడు రూపకరసమును గావ్యమునకును బ్రధానముగా రమణీయతాప్రయోజకముగా నుద్దేశించెనో యట్లే రూపకవస్తువువంటి వస్తువునే శ్రవ్యకావ్యమునందును నుండవలెనని యుద్దేశించి దృశ్యశ్రవ్యోభయకావ్య సాధారణముగా నీ లక్షణమును వచించెను. ఇంతేకాదు. గద్య ప్రబంధములగు నాఖ్యాయికాదులందును నీ శిల్పదృష్టి యుండవలెను.

ఈ శిల్పదృష్టితో మనము చూచినచో మన కవులలో ముప్పాతికమువ్వీసము కావ్యవస్తువును గుఱించి శ్రద్ధ వహింపలేదనవలయును. మహాకవి కాళిదాస కావ్యములగు రఘువంశ కుమారసంభవములు గూడ నేతద్దోషదూషితములగును. అందలి వస్తువులు పై లక్షణములకు లక్ష్యములుగామి రసవ్యంజకములు గాఁజాలవు. ఆంధ్ర ప్రబంధములలోఁ గళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము, మొదలగుకొన్నింటఁ దక్క మిగిలిన పెక్కు కావ్యములందు వస్తువు రసవ్యంజకముగా రచింపఁబడలేదు. పింగళి సూరన తన కావ్యవస్తువులను జాలవఱకు రసవ్యంజకములుగానే సృజించెను. కానీ యాతఁడును గతానుగతికమగు సంప్రదాయములను బాటించి యటనట నా వస్తువులను గొంత రసాపకృష్టములనే చేసెను. ఇంకను వసుచరిత్రమునందును, మహాభారతమునఁ గొన్ని భాగములందును బ్రబంధరసవ్యంజకత గానఁబడును. ఇతిహాసములందిది మృగ్యము. వానిమాట నావలనుంతము. కాని ప్రబంధములలో వస్తువును రసవ్యంజకమునుగాఁ జేయవలయును. ఏలొకో? కవుల కీ విషయమున శ్రద్ధ సన్నగిల్లినది. ఈ విషయమునే శిరోమణి పి. యస్. సుబ్బరామభట్టర్ గారు తమ "Studies in Dhwanyaloka" అను గ్రంథమున ౧౧౩-౧౧౪ పుటలలో నిటు దెలిపిరి.

"Bharata Says

ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితం ।
పంచభిస్సంధిభిస్తస్య విభాగాః పరికీర్తితాః ।

and thus shows the natural divisions of a poetical action in general. It may be assumed, therefore, that according to his view there is no essential distinction between drama and non-dramatic poetry, as far as the construction of plot is concerned. In his description of the essential features of a Mahakavya, Bhamaha also says "పంచ

భిస్సంధిభిర్యుక్తం" and appears to hold the same view. It seems to be faintly echoed by Dandin also. But it was overlooked by latter writters of poetics to the entire neglect of plot-junctures in the criticism of a non-dramatic poetry. This truth is born out by the fact that all the writters of poetics who have ever dealt with the technics of drama have invariably exemplified the rules of plot-building by quotations from dramatic literature and none of them has even attempted to give a single illustration from epic poems. But Ananda makes no distinction between these two speeics of poetry as far as the construction of the plot is concerned. In both of them it is to subserve the sentiment. A plot device is certainly to be condemned, whether it be in a play like Venisamhara, as he observes or in an epic poem, if it does not contribute to the development of Rasa."

కాళిదాసాది మహాకవులు కావ్యవస్తువు రసవ్యంజకము గాకున్నను దమ ప్రతిభానిష్పన్నమైన కవితాసంపదచే నుదాత్తముగా రమణీయముగా రసపూర్ణముగా విరచించిరి. దీనికిఁదోడు గావ్యవస్తువుగూడ రమణీయముగా నున్నచో బంగారమునకుఁ దావి యబ్బినట్లుండునుగదా!

ఆంగ్ల సాహిత్యమునఁ గావ్యమునకును జరిత్రకును గల భేదమేమి? నీతి (తత్త్వ) శాస్త్రమునకును గావ్యమునకును గల భేదమేమి? అనియును విచారణసేసిరి. ఈ విచారము మన సాహిత్యమున లేదు. దాని నిటఁ జూపుట యప్రస్తుతము గాదని చూపుచున్నాము.

## కావ్యమునకును జరిత్రకును గల భేదమేమి?

చరిత్ర రచయిత గద్యములో వ్రాయును. కవి పద్యమున వ్రాయును. ఇదియే భేదమనరాదు. ఏలనఁ జరిత్ర జరిగిన కథ నున్నదున్నట్లుగాఁ దెలుపును. కావ్య "మీకార్యకారణభావమును బట్టి యిట్లు జరుగును" అని తెలుపును. చరిత్రకథకుఁ గార్యకారణభావ మక్కఱలేదు. కావ్యకథ కిది యత్యావశ్యకము. కావుననే చరిత్రనుగూడ దృశ్యశ్రవ్యకావ్యములుగా రచించునపుడు గార్యకారణసామగ్రితో మార్పులు సేయుదురు. మరియుఁ జరిత్ర యొకవ్యక్తిగతమగు నితివృత్తమును దెలుపును. కావ్యముగూడ వ్యక్తిగతమగు నితివృత్తమును దెలుపుచున్నను నావ్యక్తి సర్వసాధారణమగువ్యక్తియేకాని ప్రత్యేకవ్యక్తిగాదు. కావ్యమున నావ్యక్తికిఁ బ్రాధాన్యముగాక యావ్యక్తియొక్క వ్యాపారమునకే ప్రాముఖ్యము. వ్యాపారమనునది వ్యక్తిభిన్నముగా నిర్వహింపఁబడదు. కావునఁ గావ్య మొక కల్పితనామములో నావ్యక్తి

నుపయోగించుకొనుచున్నది. ఆవ్యక్తిపేరేదేనిఁగావచ్చును. చరిత్రమున వ్యక్తివ్యాపారమునకుఁగాక వ్యక్తికే ప్రాముఖ్యము. ఉదాహరణమును జూపుదును. శివాజీ చరిత్రమునఁ గవి శివాజీ పేరును దీసివేసి మరొకపేరును బెట్టరాదు. మేఘసందేశమున యక్షదంపతులు నాయికానాయకులు. యక్షదంపతులపేరినిఁ దీసి గంధర్వదంపతులన్నను సందేశమునకుఁ గొఱఁతరాదు. ఈ యక్షదంపతులకుఁ గవి నామకరణము సేయలేదు. దాన నేకొఱఁతయు రాలేదు. చరిత్రమునందువలెనే పురాణకథాకావ్యములందును వ్యక్తుల నామములే ప్రధానములు. పురాణములుగూడఁ జరిత్రములే కదా! "పురాఽపి నవం పురాణం" అని దానివ్యుత్పత్తి. అనఁగాఁ బురాణకథయైనను దాని యుత్తమలక్ష్యములనుబట్టి లోకమున్నంతదనుక నది నవ్యమే యగును.

ఇకఁ గావ్యమునవలెఁ జరిత్రమునఁ బ్రతిభతోఁ (భావనాశక్తి) బనిలేదు. గుణాలంకార రీతు లక్కఱలేదు. రసమక్కఱలేదు. అది యున్నదున్నట్లు విషయమును జెప్పును. కావ్యమున దానియందుఁ బనిలేనివన్నియును గావలయును. చరిత్రమొకానొక కాలమునకు సంబంధించినది. కావ్యము సర్వకాలములకును సంబంధించి యుండును. మొత్తముమీఁదఁ గావ్యము సర్వవ్యక్తిసాధారణము; సర్వకాల సాధారణమును నగును.

## నీతిశాస్త్రమునకును గావ్యమునకును గల భేదమేమి?

కావ్యము నీతిని వాచ్యరూపమునఁగాక వ్యంగ్యరూపమున బోధించును. నీతిశాస్త్రము వాచ్యరూపముగా నీతిని బోధించును. మనవారు కావ్యము కాంతాసమ్మితమని చెప్పిరిగదా! ఈ పైయర్థ మీ పదములోనే యిమిడియున్నది.

ఆనందవర్ధనుఁడు చెప్పిన కావ్యవస్తులక్షణము చాల రమణీయమైనది. దానిలోనిందలి యష్టాదశ వర్ణనలలోఁ గొన్ని చేరును. కొన్ని చేరవు. చేరినవానినే గ్రహించి చేరనివానిని విడువవలయును. తదనుకూలముగా

> "ఇందు నొక కొన్ని కడమైన నెంచిచూడ
> నదియు నవని మహాకావ్య మనఁగఁబరఁగు"

అని యీ కవి చెప్పియే యున్నాఁడు.

ఇందలి యష్టాదశవర్ణనములలో నొకటగు విరహమును (విరహ విప్రలంభము) వర్ణించుచో నాంధ్ర ప్రబంధములందు మలయానిల చంద్రదూషణాదులు, శైత్యోపచారాదులును, మితిమీఱి వర్ణింపఁబడి యున్నవి. ఇవి మన్మథావస్థలలో నొకటగు

ప్రలాపముయొక్క కార్యములు. ద్రవిడ కర్ణాటాది భాషలలోఁ గూడ నిట్టి వర్ణనలు గలవు.

ఇవి యీవిధముగా నిబంధింపఁ బడవలెనని యేయలంకారగ్రంధమునందును శాసింపఁబడలేదు. ఆంధ్రమున అల్లసాని పెద్దనయే ప్ర ప్రథమమున మనుచరిత్రమునఁ బ్రవేశపెట్టెను. అది పెద్దనోపజ్ఞమే. కట్టమంచి రామలింగారెడ్డిగారు కవిత్వతత్త్వ విచారమున నలంకార శాస్త్రమనునేమో తెలియక యితరులనడిగి తెలిసికొనకయు నిదంతయు నలంకార శాస్త్రమునందే కలదని భ్రమపడి మితిమీఱి దానిని దూయఁ బట్టిరి. అలంకారశాస్త్రమన "Literary Criticism" అని వారర్థముసేసికొన్నచో నీవిధముగా వ్రాసియుండరు. పెద్దన వ్రాసినదానిని తరువాతికవులు గ్రుడ్డిగా ననుసరించిరి. ఈ విషయమునఁ బూర్వకవులౌచిత్యమును మీఱి వర్తించిరన్నచో దోషము లేదు. ఇదికవుల దోషమే కానీ యాలంకారికుల దోషముగాదు. రామలింగారెడ్డి గారికన్న మనయాలంకారికులు విమర్శకతములు.

ఈ కావ్యము వస్తువునుబట్టి ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము, అని మువ్విధములు. ప్రఖ్యాతమునఁ బురాణప్రసిద్ధము–రామాయణాదులు; ఉత్పాద్యమన కేవల కవికల్పితములు – కళాపూర్ణోదయాదులు; మిశ్రము కొంత ప్రఖ్యాతవస్తువును గొంత యుత్పాద్య వస్తువును మిళితమైనది. మదీయమగు కీరసందేశము–వీనిలో నేది రమణీయముగా నుండునేనని ప్రశ్నించుకొని రామరాజభూషణుఁడు వసుచరిత్ర లోనిట్లు చెప్పెను.

ఉ. కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము; లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము; లవారిత సత్కవి కల్పనావిభూ
షావహ పూర్వవృత్తములు సానలఁ దీఱిన జాతిరత్నముల్
కావుననిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్.

దీనినిఁ బట్టి ఉత్పాద్యవస్తువు కృత్రిమరత్నము; ప్రఖ్యాతవస్తువు గనిలోఁ బుట్టినరత్నము (అనఁగా మెఱుఁగుపెట్టని రత్నము) మిశ్రవస్తువు సానలఁ దీఱినజాతి రత్నము. అనినిష్కృష్టార్థము.

ఇవిగాక గద్య, పద్య, ఉభయ భేదములచే గావ్యమెల్లయుఁ ద్రివిధము. గద్య, పద్యకావ్యములు ప్రసిద్ధములేకదా! ఇఁక నుభయకావ్యమనఁగా జంపూకావ్యము.

"గద్యపద్యోభయమయం చంపూరిత్యభిధీయతే"

మన యాంధ్రకావ్యములలో నిర్వచనోత్తర రామాయణము దక్క మిగిలిన కావ్యములన్నియుఁ జంపూకావ్యములే! వీనికిపుడు 'ప్రబంధము' లని వ్యవహారము-

వచ్చినది. వర్ణనాభూయిష్ఠమగు నీప్రబంధమును నన్నెచోడుఁడు 'వస్తుకవిత' యనియు లక్షణదీపికాకారుఁడు 'విస్తరకవిత' యనియు వ్యవహరించిరి. చంపూకావ్యము నందువలెనే యాంధ్ర ప్రబంధము లందుననొక్కొక్క యాశ్వాసమునందును బెక్కు వృత్తములను గవులు వాడుదురు. రఘువంశాది సంస్కృత కావ్యములలో సర్గారంభము నుండి సర్గాంతము వఱకు నొకే వృత్తముండును. అంతమున మాత్ర మొక భిన్నవృత్తముండును. నానావృత్తమయమగు సర్గలును గలవు (నానావృత్తమయః క్వాఽపి సర్గః కశ్చన దృశ్యతే) ఇప్పటికవులలోఁ గొందఱు సంస్కృతకావ్యములలోవలె నొక్క టేవృత్తమును దుదిదాఁక వాడుచున్నారు. ఇదేది సమీచీనమని ప్రశ్నవచ్చుచున్నది. గాయకుఁడు తనపాటకచ్చేరీలో మొదటినుండి తుదిదాఁక నొకే రాగముతోఁ బాటలన్నియును బాడఁడు. కృతి, వర్ణము, జావళీ, రాగము, మొదలయిన వన్నియు వివిధరాగములతో వివిధతాళములతోఁ బాడును. అట్లు గానిచో లోకము మెచ్చదు. అట్లే కవియును నిర్వచనముగా భిన్నభిన్న వృత్తముల లోనే వ్రాసినచో సజమంసమని నాతలంపు.

పద్యకవిత్వమును మార్గకవిత్వమనియుఁ బదకవిత్వమును దేశికవిత్వ మనియు వ్యవహరింతురు. అనఁగా సంస్కృతపద భూయిష్ఠమై సంస్కృతచ్ఛందశ్శాస్త్ర సంగతములగు వృత్తములు గలరచన మార్గకవిత. దేశీయములగు మాత్రాచ్ఛందస్సు నుండి పుట్టిన జాతివృత్తములరచన దేశికవిత. ఈదేశికవితకు జానుఁదెనుఁగు, పదకవిత, గేయవాఙ్మయము, అనియు నామాంతరములు.

మఱియు వర్ణ్యవస్తుభేదమునుబట్టి గద్యపద్యాది భేదములను బాటింపవలయు నని సరస్వతీ కంఠాభరణ వ్యాఖ్యాతయగు రత్నేశ్వరుఁ డిట్లు తెలుపుచున్నాఁడు.

> కశ్చిద్గద్యేన పద్యేన కశ్చిన్మిశ్రేణ శక్యతే
> కవితుం కశ్చన ద్వాభ్యాం కావ్యాఽర్థః కశ్చన త్రిభిః

"యథా హి అటవీవర్ణనాదౌ గద్యం ప్రగల్భతే తథా న పద్యం; యథా చ కావ్యశాస్త్రతా నిర్వహణోచితేఽర్థే పద్యముత్సహతే న తథా గద్యం" ఇత్యాది పదోపాత్తబంధౌచితీ ద్రష్టవ్యా" (అరణ్యవర్ణనమున గద్యము శోభిల్లినట్లు పద్యము శోభిల్లదు. కావ్యశాస్త్ర రూపములగు కావ్యములందుఁ బద్యము శోభిల్లినట్లు గద్యము శోభిల్లదు. కథా, ఆఖ్యాయికాదులందు గద్యమేశోభిల్లును. చంపువులం దుభయమును నుండవచ్చును.

కానీ కవులీనియమమును బాటించినట్లు గానము. మహాకావ్యమునఁ గానీ ఖండకావ్యమునఁ గానీ యొక్కఁడే నాయకుఁడుండవలెను. అతఁడు ధీరోదాత్తుఁడు.

శృంగారవీరరసములలో నొకటి ప్రధానముగా నుండవలెను. సాహిత్యదర్పణకారుడు శృంగారవీరశాంతములలో నొకటి యంగిగా నన(గా ప్రధానముగానుండవలెనని నుడి వెను. సాహిత్యదర్పణమునకు సంపాదకు(డగు దుర్గాదాస పండితు(డు భరతుని "శృంగారోవీర ఏవవా" అనువచనము సముచితరస సూచకమనియు( ప్రబోధ చంద్రోదయమున శాంతమును, ఉత్తరరామ చరితమున( గరుణమును గలవని వ్రాసెను. అట్లే శక్తి భద్రకృతమగు ఆశ్చర్యచూడామణి, కృత్యారావణము, అద్భుతదర్పణము. అనునాటకములం దద్భుతరసమంగిగా( గలదు. కావున నాట కమునందు వలెనే కావ్యమునందును శృంగార, వీర, శాంత, కరుణ, అద్భుత, హాస్య, రౌద్ర, భయానక, బీభత్సములు ప్రధానముగా నన(గా నంగిరసములుగా నుండును. మరియును.

> ఆదౌ నమస్క్రియాశీర్వా వస్తునిర్దేశ ఏవ వా
> క్వచిన్నిందా ఖలాదీనాం సతాంచ గుణకీర్తనం
> ......................................
> సర్గాంతే భావిసర్గస్య కథాయా స్సూచనం భవేత్.

తా. కావ్యారంభమున నిష్టదేవతానమస్కారము గానీ, ఆశీర్వాదము గానీ, వస్తునిర్దేశము గానీ యుండవలెను. కుకవినిందా సుకవిస్తుతు లుండవలెను. ఏ కవుల గ్రంథములను జదివి తాము విజ్ఞానమార్జించిరో వారియెడల( గృతజ్ఞతను జూపుట ధర్మముగదా! అదియే సుకవిస్తుతి. సర్గాంతమున భావిసర్గ కథాసూచన ముండవలెను.

ఇక క్షుద్రప్రబంధముల(గూర్చి తెలుపుదును.

## క్షుద్ర ప్రబంధములు

### ఉదాహరణ కావ్యము

కం. కళికోత్కళికలు(, బద్యము,
లలరారు విభక్తులం; తదాభాసయుతో
త్కళికలు "సజయతిపదమా"
నలమాలిని మొదల(దగ నుదాహరణమగుఁ. ౧౬౮

తా. కళికోత్కళికలును, పద్యములును, విభక్తులతో నలరారుచుండును. ఉత్కళికలు విభక్త్యాభాసములతో నుండును. 'జయతి' అను పదము మొదట(గల

మాలిన్యాదివృత్తము మొదట నుండవలెను. ఇట్టిది యుదాహరణమగును. దీని వివరణము ముందు చేయుదుము.

కం. అందు విభక్త్యాభాసము
లందుఁ జతుర్థికినిఁ దెనుఁ గుదాహరణము పెం
పొందం గలికోత్కలికల
సందీప్త విభక్తితాలసంప్రాసంబై. ౧౬౯

ఈ పద్యముయొక్క యర్థ మస్పష్టము. ఇట వీనికి మూలమగు ప్రతాపరుద్రీయ లక్షణమును జూపుదుము.

"యేన కేనాఽపి తాళేన గద్యపద్య సమన్వితం
జయత్యుపక్రమం మాలిన్యాదిప్రాస విచిత్రితం
తదుదాహరణం నామవిభక్త్యష్టక సంయుతం.

యత్రాఽదౌ జయత్యుపక్రమం మాలిన్యాదివృత్తం రమ్యం పద్యం నిబధ్యతే! అనంతర 'మపిచ' ఇత్యుపక్రమ్య అష్టవాక్యాని సప్రాసాని సతాళాని ప్రతివిభక్తి నిబధ్యంతే । అనంతరం విభక్త్యాభాసా స్తదుదాహరణం"

ప్రప్రథమమున 'జయతి' పదముతోఁ బ్రారంభింపఁబడిన 'మాలినీ' ప్రభృతి వృత్తములలో నేదోయొకటి యుండవలయును. పిమ్మట 'అపిచ' అని ప్రారంభించి ప్రాసములతోఁ దాళముతోఁ గూడిన యెనిమిది వాక్యములు రచింపవలెను. ఇట్లు ప్రతి విభక్తియందును నెనిమిదెనిమిది వాక్యము లుండవలెను. పిమ్మటఁ బ్రాసతాళములతోఁగూడిన విభక్త్యాభాస చిహ్నితములయిన యెనిమిదివాక్యము లుండవలెను. అనఁగా మొదట 'జయతి' పదసహితమైన మాలిన్యాదివృత్తము; పిమ్మట ప్రథమాది విభక్త్యంతవాక్యము లెనిమిదుండును. దీనికిఁ గళిక యని పేరు. పిమ్మట నెనిమిది విభక్త్యాభాసాంకితములగు వాక్యములుండును. దీనికి 'ఉత్కళిక' అని పేరు. ఇది యుదాహరణ కావ్యము.

ఈ లక్షణము సంస్కృతముననున్న 'ఉదాహరణ కావ్యము'నకు సరిపోవును. ఆంధ్రమున 'జయతి' పదముతో నారంభింపఁబడిన యుదాహరణములు లేవు. మరియు విభక్త్యాభాసాంకితములగు వాక్యములుగల యుత్కళికలును లేవు.

ఈ లక్షణమైనను నిస్సందిగ్ధముగా లేదు. అప్పకవీయమున నీ క్రింది లక్షణము గలదు.

సీ. సప్తవిభక్తులు, సంబోధనంబును, గూడ। నెన్మిది విభక్తులు గ్రమమునఁ
బలిపేరు దొరలంగఁ బద్యమొక్కటిచెప్పి। రగడ భేదములు మార్గములుగాఁగఁ
గళికలు నెనిమిది దళములు గావించి, దానిలో సగము నుత్కళికఁజేసి,
యదియొక్క సమసనంబయ్యెడు దళములెన్మిదిఁగూర్చి వానికిఁ దుదవిభక్తి

గీ. బయలుపఱచి కట్టకడను బద్యమొకటి
పలుకవలయును సార్వవిభక్తికముగ
నిర్వదాలు పద్యములందు నిడిన ధాత్రి
నిది యుదాహరణమటందు రిద్ధచరిత।

దీనివలనఁగూడ నుదాహరణలక్షణము సమగ్రముగా నిస్సందిగ్ధముగాఁ దేల కున్నది. అప్పకవీయమున నీయఁబడిన 'కృష్ణోదాహరణము' ననుసరించియుదాహరణ లక్షణము నిట సమగ్రముగా రచించి యాకృష్ణోదాహరణములోనిసప్తవిభక్తులందలి ప్రథమపాదముల నుదాహరింతుము. విద్యార్థు లద్దానిని సమగ్రముగాఁ జూచి దీని నవగతము సేసికోవలెను.

ఇది దేవతాస్తోత్రరూపమగు కావ్యము. సంబోధనముతోఁ గలిసి యెనిమిది విభక్తులతో నీ యుదాహరణకావ్య మీ క్రిందివిధమున రచింపఁబడును. కవి యుద్దే శించిన దేవతానామములోఁ బ్రథమావిభక్తి క్రమమున నొక్కొక్క విభక్తిలో మొదట నొకపద్యమును, కళిక, ఉత్కళిక, యను పేరుగల గేయరూపమగు గద్యములును రచింపవలెను. ఇట్లు సంబోధన విభక్తితోఁగలిపి యెనిమిదివిభక్తులలో రచింపవలెను. తుట్టతుదఁ బ్రథమావిభక్తి క్రమమున నెనిమిదివిభక్తులతోఁ గూడిన దేవతాస్తోత్రపరమగు పద్యమును రచింపవలెను. ఇందుఁ గళికకును, ఉత్కళికకును నెనిమిదనిమిది పాదములుండును. అయితే కళికోత్కళికలన నేమో తెలిసికొన వలయును. (నరసభూపాలీయలక్షణమువలన నింత యర్థమురాదు.)

దీర్ఘసమాసములుగల గద్య ముత్కళిక. ఈవిషయము గద్యకావ్యలక్షణములలోఁ దెలియును. ఈయుదాహరణ కావ్యమున నుత్కళికయొక్క యెనిమిదిపాదములందొకే సమాసముండవలెనను నియమము 'అప్పకవీయ'పద్యమునఁ గలదు. దీనినిఁబట్టి కళిక సమాసరహితముగాని యల్పసమాసముగలదికాని కావచ్చును. కళికయొక్క పాదాం తమునసమాసముముగియును. (ఉత్కళికకువలెఁ గళికకు లక్షణముగానరాదు) మరియు నిట సంగీతశాస్త్రవిషయ మల్పముగాఁ దెలిసికొనవలయును. సంగీతశాస్త్రమున ౩, ౪, ౫, ౭, ౯ మాత్రల గతులు గలపంచతాళములుండును. వానికిఁ గ్రమముగా, త్రిశ్ర గతి, చతురశ్రగతి, ఖండగతి, మిశ్రగతి, సంకీర్ణగతి, అనినామములు. వీనినొక్కొక్క

దానిని ౨ చేఁగాని ౪చేఁ గాని౮చేఁగాని యావర్తించి (హెచ్చించి)యొక్కొక్క పాదమును రచింపవలెను. మనము త్రిశ్రగతితాళమును దీసికొందము. దీనికి మూఁడు మాత్రలగతి. దీనిని రెంటిచే హెచ్చించిన నాలుమాత్రలును, నాలుగుచే హెచ్చించినఁ బండ్రెండు మాత్రలును, నెనిమిదిచే హెచ్చించిన నిరువదినాలుగుమాత్రలును వచ్చును. కాఁబట్టి కవి తనయిష్టానుసారముగాఁ బాదమునకు ౬, ౧౨, ౨౪ మాత్రలను నియమించుకొని రచింపవలయును. ఇట్లెనిమిది పాదములు రచింపవలెను. ప్రతిపాదాంతమునందును ద్వితీయావిభక్తి ప్రత్యయము లుండవలెను. దీనికిఁ గళికయని పేరు. ఈకళికయొక్క పాదములోనున్న మాత్రలలో సగము మాత్రలతోఁ బ్రతి పాదమును రచింపఁబడినయెడల నావిధముగా నెనిమిది పాదములు గూర్పఁబడినచో నది యుత్కళిక యనఁబడును. అనఁగాఁ గళికయొక్క పాదమునకు ౨౪ మాత్రలున్నచో నుత్కళికయొక్క పాదమునకు౧౨ మాత్రలేయుండవలెను.ఇట్లేయితర తాళములందుఁగూడ నూహింపవలెను. ఈకళికోత్కళికలలో రెండేసి పాదముల కొకప్రాసయుండును. ప్రతి పాదమునకును గళికలలో మాత్రమే యతి కనఁబడుచున్నది. ప్రతాపరుద్రీయ లక్షణానుసారముగాఁ గళికాపాదాంతములందు విభక్తులును, ఉత్కళికా పాదాంతములందు విభక్త్యాభాసములును నుండవలెను. విభక్తులవలెఁ గనఁబడునని విభక్త్యాభాసములు, ఎట్లన.

అరద మెక్కకపూని.

పురికి వచ్చినవాని.

ఇట 'కాని' అనుద్వితీయా విభక్త్యంత పదమువలెనే పూని' అనుపదము నిబంధింపఁబడినది. అప్పకవి లక్షణమున విభక్త్యాభాసములుండవలెనని చెప్పలేదు. ఆతనిలక్షణమున నుత్కళికయొక్క యెనిమిదిపాదములును నొకటే సమాసముగా నుండవలె ననియున్నది. కాని లక్ష్యమునని దిగానరాదు. సంస్కృత బసవోదాహరణమున నేకసమాసముగలదు. లక్షణమున నుత్కళికలో నంత్యప్రాస నియమమును జెప్పలేదు. కానీలక్ష్యములలో నంత్యప్రాస నియమము కానవచ్చుచున్నది. ప్రతాపరుద్రీయలక్షణము ననుసరించిన లక్ష్యముగానరాదు.

ఆంధ్రోదాహరణ కావ్యములకుఁ గృష్ణోదాహరణమే ప్రమాణము.

కాన నప్పకవీయమునందలి కృష్ణోదాహరణము నుదాహరించి చూపుదును.

## ప్రథమావిభక్త్యంత పద్యము.

ఉ. శ్రీవనితాసనాథుఁడు వశీకృత భక్తమనోంబుజుండు...

(నాలుగు పాదములు మొదలు)...

## ప్రథమా విభక్త్యంత కళిక.

'మఱియు దేవకి కౌరసేనకుమార నిర్మలరత్నరాజము'

(ఇట్లెనిమిది పాదములున్నవి. ఇదిమిశ్రగతి తాళము. దీనికేడు మాత్రలగతి. దీనిని నాలుగుచే హెచ్చించి యొక్కొక్క పాదమునకు నిరువదెనిమిది మాత్రలం కవికూర్చెను: ప్రతిపాదాంతమందును ప్రథమా విభక్త్యంతపదములు గలవు.

## ఉత్కళిక.

'కమలనేత్రుని రాకరోయుచు'

(ఇట్లెనిమిది పాదములున్నవి. పాదమునకు ౧౪ మాత్రలున్నవి. అనఁగాఁ బైనుదాహృతమగు కళికలో సగమున్నది. ఉత్కళిక పాదాంతమందు నాయావిభక్త్యంత పదములక్కఱలేదు. కాని యంత్యప్రాస ముండును. తుదియెనిమిదవ పాదాంతమున మాత్రమే విభక్త్యంతపదముండును)

## ద్వితీయావిభక్త్యంత పద్యము.

ఉ. మానవులార! ... గొల్వఁడీ! పరా
ధీనులుగాక మీరు వసుదేవకుమారకు ముక్తికోసమై

## ద్వితీయా విభక్త్యంత కళిక.

'మఱియుఁ ద్రేతలనెల్ల మరులు గొల్పినవాని'

(ఇట్లెనిమిదిపాదము లుండవలెను. కాని యప్పకవీయమున నాలుగుపాదములు ముద్రణమున జాఱిపోయినవి. ఇది ఖండగతితాళము. దీని కైదుమాత్రల గతి. దీనిని నాలుగుచే హెచ్చించి ప్రతి పాదమును నిరువదిమాత్రలతోఁ గవి నిబంధించెను. ప్రతి పాదాంతమందును ద్వితీయావిభక్త్యంతపదములు గలవు.)

## ఉత్కళిక

'మందుపావకుఁ గొల్చి'

(ఇట్లెనిమిది పాదములుగలవు. పై కళికలో నిది సగముమాత్రమే. అనఁగాఁ బదిమాత్రలుమాత్రమే గల పాదము. పాదాంతమున విభక్త్యంతపదములు లేవు. అంత్యప్రాసము గలదు. తుదియందు ద్వితీయా విభక్త్యంతపదము గలదు)

## తృతీయా విభక్త్యంత పద్యము

చ. పులసిలనేల ... ... ... వాంఛితార్థముల్
కలుగు నమేయుచేతఁ గమలాధవుచే వటపత్త్రశాయిచేఁ.

## తృతీయా విభక్త్యంత కళిక

'మఱియు బ్రహ్మమాయగెల్చి మసలుమంత్రవాదిచేత'

(ఇట్లెనిమిది పాదములు గలవు. ఇది త్రిశ్రగతి తాళము. దీనికి మూఁడు మాత్రలు. దీనిని నెనిమిదింటిచే హెచ్చించిన నిరువదినాల్గుమాత్రలగును. ఇందుఁ బాదమున కావిధముగా నిరువదినాల్గు మాత్రలు నిబంధించెను. ప్రతి పాదాంతమందును దృతీయావిభక్త్యంతపదములు గలవు.)

### ఉత్కళిక

'గట్టిగ శరపంజరంబు'

(ఇట్లెనిమిదిపాదములు గలవు. పై పాదములో నిది సగము. అనఁగాఁ బండ్రెండుమాత్రలు గలవు. పాదాంతమునఁ దృతీయావిభక్త్యంతపదములు లేవు. అంత్యప్రాస గలదు. ఎనిమిదవ పాదాంతమునమాత్రమే విభక్త్యంతపదము కలదు)

## చతుర్థీ విభక్త్యంత పద్యము

శా. ఓలంబాసకు ... ... ...
కేలంబట్టి నిమిర్చినట్టి హరికై కృష్ణాంబుభృన్మూర్తికై.

## చతుర్థీ విభక్త్యంత కళిక

'మఱియును గౌమోదకియును ఖడ్గము మణియును శంఖముఁ బట్టిన హరికై'

(ఇట్లెనిమిదిపాదములు గలవు; ఇది చతురశ్రగతి తాళము. దీనికి నాలుగు మాత్రలుండును. దీనిని నెనిమిదిచే హెచ్చించిన ౩౨ మాత్రలగును. కాన నిందావిధముగాఁ బాదము రచింపఁ బడినది. ప్రతి పాదాంతమందును జతుర్థీ విభక్త్యంతపదములు గూర్పఁబడినవి)

### ఉత్కళిక

'తొలిపుట్టువు నోముఫలంబుననే'

(ఇట్లెనిమిదిపాదములు గలవు. ఇందుఁ బాదమునకుఁ బదునాఱు మాత్రలు మాత్రమే. ఏలనఁ, బైకళికలో నిది సగమే యుండవలెను. పాదాంతమునఁ జతుర్థ్యంత

పదములులేవు. అంత్యప్రాసముగలదు. ఎనిమిదవ పాదాంతమునమాత్రమే విభక్త్యంత పదము గలదు)

## పంచమీ విభక్త్యంత పద్యము

మ. పురిటింటం బసిబిడ్డచందమున ... ...
... ... నందపుత్త్రివలనం దార్క్షాణ ధర్మస్థితుల్.

### పంచమీ విభక్త్యంత కళిక

'మఱియు గీతామృత సమగ్రసింధునివలన'

(ఇట్లెనిమిదిపాదములు గలవు. ఇది ఖండగతి తాళము. దీని కైదుమాత్రలగతి. దీనిని నాల్గింటిచే హెచ్చించి పాదమున కిరువదిమాత్రలు కవి కూర్చెను. ప్రతి పాదాంతమునందును బంచమీ విభక్త్యంతపద ముండును)

### ఉత్కళిక

'తనుఁ బిల్వఁ గదుఁగూరఁ'

(ఇట్లెనిమిదిపాదములు గలవు. పాదమునకు ౧౦ మాత్రలు గలవు. పైదానిలోనిది సగము. పాదాంతమునఁ బంచమీ విభక్త్యంతపదము లేదు. అంత్యప్రాసము గలదు. ఎనిమిదవపాదాంతమున మాత్రమే విభక్త్యంతపదము కలదు)

## షష్ఠీ విభక్త్యంత పద్యము

శా. కారాగారమునుండి ... ... ...
... ... హరికిన్ వాలార నేఁ బ్రెంకెక్కొదన్.

### షష్ఠీవిభక్త్యంతకళిక

'మఱియుఁ బెఱయ, నెఱయమఱియు మధునిఁగూల్చినట్టి హరికి'

(ఇట్లెనిమిదిపాదములు గలవు. ఇది త్రిశగతి తాళము. దీనికి మూఁడు మాత్రలు. వీని నెనిమిదింటిచే హెచ్చించి ఇరవైనాల్గుమాత్రలతోఁ బాదమును బంధించెను. ప్రతి పాదాంతమందును షష్ఠీ విభక్త్యంతపదము గలదు.

### ఉత్కళిక

'గొల్లలెల్లఁ దల్లడిల్ల'

(ఇట్లెనిమిదిపాదము లుండవలయును. కాని రెండుపాదములు ముద్రణమున జాఱిపోయినవి. ఈ పాదమునకు ౧౨ మాత్రలే. పాదాంతమున విభక్త్యంతపదము

లేదు. అంత్యప్రాస గలదు. ఎనిమిదవపాదాంతమున మాత్రమే విభక్త్యంతపదము గలదు.)

## సప్తమీ విభక్త్యంత పద్యము

మ. పృథులావంతి వరస్వయంవరమునన్ ... ...
... ... పెండ్లాడిన కృష్ణునందు నిలిచెన్ దీర్ఘప్రతాపోన్నతుల్

## సప్తమీవిభక్త్యంతకళిక.

'మఱియు గసేనామాత్యునందు'

(ఇట్లెనిమిది పాదములుండవలెను. ఒకపాదము పోయినది. ఇదిచతురశ్రగతి తాళము. దీనికినాలుగు మాత్రలు. దీనిని నాల్గింటిచే హెచ్చించి యొక్కొక్క పాదమును ౧౬ మాత్రలతోఁ గవి రచించెను. ప్రతి పాదాంతమునందును సప్తమీ విభక్త్యంతపదము గలదు)

## ఉత్కళిక.

'సజ్జరాగంబు'

(ఇట్లెనిమిది పాదములుగలవు. ఇందుఁ బాదమునకెనిమిది మాత్రలే కలవు ప్రతిపాదాంతమందును సప్తమీ విభక్త్యంత పదములేదు. అంత్యప్రాసము కలదు. ఎనిమిదవ పాదాంతమున మాత్రమే విభక్త్యంత పదమున్నది.

## సంబోధనావిభక్త్యంత పద్యము.

ఉ. ధర్మజుఁడంపినన్ ... ... ...
... ... తలఁతుఁ సాదుమనంబున నందనందనా!

## సంబోధనావిభక్త్యంత కళిక

'మఱియుఁ ద్రిజగన్మోహ మాయఁదాల్చినజాల'

(ఇట్లెనిమిది పాదములుగలవు. ఇదిఖండగతి తాళము. దీని కైదు మాత్ర లుండును. దీనిని నాల్గింటిచే హెచ్చించి ౨౦ మాత్రలతో నొక్కొక్క పాదమును గవి రచించెను. ప్రతిపాదాంతమునందును సంబోధనా విభక్త్యంత పదముగలదు)

## ఉత్కళిక.

'గురుభీష్మ రాధేయ'

(ఇట్లెనిమిది పాదములుంగలవు. దీనిపాదమునకుఁ బది మాత్రలే కలవు. పాదాంతమున విభక్త్యంత పదములేదు. అంత్యప్రాస గలదు. ఎనిమిదవ పాదాంతమున మాత్రమే విభక్త్యంతపదము కలదు)

## సార్వవిభక్తిక పద్యము.

శా. నీవొక్కండవు; నిన్ను నమ్మి కొలంతున్, నీచే సుఖంబబ్బె; నీ
కై వేదండ మొసర్తు; నీవలన నిష్టావాప్తి చేకూఱె; నీ
కే విశ్వాసముఁ జేర్తునింక మదిలో; హెచ్చుయ్యె నీయందు నా
కై వారంబులు; శౌరసేనతనయా! కామేపలీ వల్లభా!

ఈసార్వవిభక్తిక పద్యముపిమ్మటఁ గవియొక్కయు గ్రంథముయొక్కయు నామములు వచ్చుపద్యమొక్కటి యుండవలెను. కృష్ణోదాహరణమున నది గలదు.

ఆంధ్రభాషలో రావిపాటి త్రిపురాంతకకవికృతత్రిపురాంతకోదాహరణము, అప్పకవివ్రాసిన కృష్ణోదాహరణము, శేషార్యోదాహరణము, వేంకటేశ్వరోదాహరణము, (తాళ్ళపాక పెదతిరుమలయ్య) హనుమోదాహరణము (చిత్రకవిపెద్దన) విశ్వేశ్వరోదాహరణము (ఏనుఁగు లక్ష్మణకవి) ముఖలింగోదాహరణము, అనునెనిమిది గలవు.

సంస్కృతభాషలోఁ బాల్కుఱికి సోమనాథుని బసవోదాహరణమున్నది. మరియుఁ గాళిదాసకవి విక్రమోర్వశీయమున "ప్రతే నివేశిత ముదాహరణం ప్రియాయాః" అనియు, రఘువంశమున "జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్" అనియును బ్రయోగించి యుంటవలనఁ గొన్ని యుదాహరణ గ్రంథములున్నట్లు తెలియుచున్నది. మొత్తముమీఁద నిప్పుడాంధ్రమున నున్నన్ని యుదాహరణ గ్రంథములు సంస్కృతమునఁ గానరావు

ఈ యుదాహరణములు నాలుగుతెగలుగా నప్పకవి చెప్పుచున్నాఁడు. ఎట్లన,

సీ. సంబుద్ధి యొడలించి సప్తవిభక్తులు । పలికిన భక్తి 'సద్దలి' యనంగ
సంబుద్ధితోఁగూడ సప్తవిభక్తులు । బలుక నొప్పారు 'బద్దలి' యనంగ
సంబుద్ధితోడ విషమవిభక్తులతోడఁ । బలికిన కృతియు 'విద్దలి' యనంగఁ
గళికలుత్కళికలు గమకింపఁ బలికిన । కావ్యంబు 'నుత్ఫుల్లకంబు' ననఁగ

గీ. నవనిఁ జాటుప్రబంధంబులందు మిగుల
నాటుకొని యొప్పుచుండు నీ నాల్గుతెగలుఁ

గానఁబడు నుదాహరణముల్ గానలోల!
కామెపల్లీశ! వల్లవీకామ! కృష్ణ!

*సంబుద్ధిని వదలి యేడువిభక్తుల కేడు పద్యములం జెప్పినచో నా కావ్యము 'సద్దలి' అనఁబడును. సంబుద్ధియు మిగిలిన యేడు విభక్తులును గలిసి యెనిమిదివిభక్తులను నెనిమిది పద్యములలో నిబంధించిన కావ్యము 'బద్దలి' యనఁబడును. సంబుద్ధిని, మిగిలిన విభక్తులను, క్రమమక్కఱలేక పద్యములఁగూర్చి చెప్పిన 'విద్దలి' కావ్యమగును. పద్యములంలేని కేవలము కళికోత్కళికలం వైవిధమున నెల్ల విభక్తులలోఁ గూర్చినచో 'ఉత్ఫుల్లకము' అను కావ్యమగును.

కావ్యాలంకార చూడామణిలో సద్దళి, పద్దళి, విద్దళి, అను భేదములం మాత్రమే కలవు. ఎట్లన,

కం. సంబుద్ధివిడిచి మును గల
సంబంధం బెడలకుండ సప్తవిభక్త్యా
డంబరమడరించిన నొడి
కంబగు 'సద్దళి' యనంగఁ గవులకుఁజెప్పన్.

గీ. సరివిభక్తుల సంబుద్ధి సహితగాఁగ
జెప్ప నొప్పారు 'బద్దళి' సిద్ధమగుచు;
ముక్తసంబుద్ధి, విషమవిభక్తికలిత
యైన కృతిపేరు 'విద్దళి' యండ్రు బుధులం.

ఇట 'విద్దళి' లక్షణము భిన్నముగా నున్నది. పై లక్షణమున "సంబుద్ధితోడ విషమవిభక్తులతోడ" అని యున్నది. ఇట "ముక్తసంబుద్ధి విషమవిభక్తికలిత" అని యున్నది.

ఈ నాలుగుఁ దెగలను నుదాహరణములకుఁ బూర్వరూపములనియుఁ గ్రమక్రమముగా నభివృద్ధిచెంది తుదికి నుదాహరణముగాఁ బరిణమించినదనియు 'నిడదవోలు వేంకటరావుగారు' త్రిపురాంతకోదాహరణ పీఠికలో వ్రాసిరి.

---

* అప్పకవీయలక్షణమునఁ గాని కావ్యాలంకార చూడామణి లక్షణమునఁ గాని సద్దళి మొదలగునవి కేవల పద్యములలో రచింపఁబడవలెనో లేక కళికలవంటి తాళ లయాన్వితములగు గద్యములతో రచింపఁబడవలెనో లేక యొక్కొక్క విభక్తి కొక్కొక్క గద్యము చెప్పవలెనో విస్పష్టముగా నవగతము కాకున్నది.

ప్రకరణానుసారముగా యక్షగాన, వీథీనాటకముల లక్షణములను గూడఁ జెప్పుదుము. అప్పకవీయమున యక్షగానలక్షణ మిట్లున్నది.

సీ. తుదనేడు లఘువులు తొలఁగించి చదివినఁ । ద్రిపుటకు వృషభగతి పదయుగము
లలిఁగడపలనొక్క లఘువుమానిన జంపె । మనుద్విరదగతి సమపదయుగము
గురుతగు రచ్చెరకుఁదురగవల్గ నాఁ(?)హ్వాయ మేకతాళి యా మధురగతికి ?
సంక్షిపికిర్వదినాలు గటతాళమునమాత్ర । లోలి విశ్రాంతి పద్నాలుగింటఁ

గీ. దెలియ నర్ధంబు, నర్ధచంద్రికలు వీట
యక్షగాన ప్రబంధంబు లదుకవచ్చు
రగడ భేదంబు లివియంద్రు రసఁగవీంద్రు
లవితనిజసేవకస్తోమ । యబ్ధిధామ ।

అప్పకవి నవవిధ రగడలను నొడివియున్నాఁడు. ఆ రగడలలోఁ గొంతకొంత మార్పుజరిపి త్రిపుట, జంపె, ఏక, అట, తాళముల కనుగుణముగాఁజేసి గేయములను యక్షగానములలోఁ బాడుదురు. అప్పకవి పేర్కొన్న యీ గేయము (రగడ భేదములు) లేకాక యక్షగానములలో నింకను ననేకవిధములయిన దేశిరచనములుచేరినవి. ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, చందమామసుద్దులు, వెన్నెల పదములు, విరాళిపదమును, తుమ్మెదపదములు, గొబ్బిపదములు, కోవెలపదములు, చిలుకపదములు, అల్లోనేరేళ్లు, సీసార్ధములు, కందార్ధములు, త్రిభంగులు, ద్విపదలు, త్రిపదలు, చౌపదులు, షట్పదులు, మంజరులు, జక్కులరేకులు మొదలయినవి.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవవిజయమను యక్షగానమునకు పీఠికను వ్రాయుచు నందీయక్షగానాదులు ప్రాచీనులగు లక్షణకర్తలు తెలిపిన * ఆశు, మధుర, చిత్ర, విస్తరములను నామముల వర్తిల్లు చతుర్విధ కవితలలో

* ఆశుకవిత్వమన ఏకపాద, త్రిపాద, కఠినప్రాస, విషమసమస్యాపూర్తులు, వ్యస్తాక్షర, నిషేధాక్ష రచనలు, అష్టావధాన శతావధానములు, ఘటికాశత గ్రంథకల్పనలు, ఆశాశపురాణము, మొదలగు తత్కాలోచితమగు నతిత్వరిత గతిని రచింపఁబడునది.

మధురకవిత్వమీయక్షగానాదుల కవిత్వము.

చిత్రకవిత్వమన నొకవృత్తమున మరొకవృత్తము వచ్చునట్లుచెప్పుట; అనఁగా కంద గర్భసీసము, మొ.

విస్తరకవిత్వమనఁ బ్రబంధ కవిత్వమని తెలిపితిమి.

(ఇవి లక్షణదీపిక యందలి లక్షణములు)

మధుర కవితలోఁ జేరునని తెలిపిరి. మరియును వారీయక్షగానములయొక్క చరిత్ర మును గూడ విరచించిరి. గ్రంథవిస్తర భీతిచే వదలితిని. కావున విద్యార్థు లావీతికను జదివి దీనివిషయమును విపులముగాఁ దెలిసికొన వచ్చును. ఈ యక్షగానములకు జక్కులపాటయనియును నామాంతరము. ఇదిసంస్కృతమునందలి యుపరూపకముల తరగతిలోనిది. (ఈయుపరూపకములకు గేయరూపకములనియు నామాంతరము.)

యక్షగానములవంటివేయగు పెక్కు మధురకావ్యములు గలవు. వాని నిటఁ జేర్కొందును. ౧ జాజరపాట, ౨ వెన్నెలపాట, ౩ అర్ధచంద్రికలు, ౪ త్రిభంగులు, ౫ మటిమెరేకులు, ౬ విరాళిపదములు, ౭ అల్లోనేరేళ్ళు, ౮ గొబ్బిపాటలు ౯ పాళిరేకులు, ౧౦ ధవళములు, ౧౧ ఏలలు, ౧౨ సువాలలు, ౧౩ చిలుకపదాలు ౧౪ తుమ్మెదపదాలు, ౧౫ ఏకతాళి(ఎగతాళి), ౧౬ తందానపదాలు, ౧౭ జోలలు ౧౮ జక్కులరేకులు, ౧౯ దరువులు, ౨౦ చందమామపదాలు, ౨౧ నట్టొట్లు, ౨౨ సుద్దులు, ౨౩ కూనరాగాలు, ౨౪ చిందులు, ౨౫ జక్కిణి, ౨౬ మంగళహారతులు ౨౭ జావళీలు, ౨౮ గీతార్థములు, ౨౯కందార్థములు;౩౦ సీసార్థములు; మొదలయినవి. వీని లక్షణ లక్ష్యములను సంగీతచూడామణి మొదలగు గ్రంథములను జూచుకొన వలెను. ఈకావ్యములకుఁ బదకవితలనియు, జానుఁదెనుఁగు కావ్యములనియు, గేయ వాఙ్మయమనియు వ్యవహారము.

## వీథీలక్షణము.

వీథ్యా మేకో భవే దంకః కశ్చిదేకోఽత్ర కల్ప్యతే,
ఆకాశభాషితై రుక్తైశ్చిత్రాం ప్రత్యుక్తిమాశ్రితః
సూచయేద్భూరి శృంగారం కించిదన్యాన్ రసానపి
ముఖనిర్వహణే సంధీ అర్థప్రకృతయోఽఖిలాః. (సాహిత్యదర్పణము)

వీధియందొక్కటే యంకముండును. ఒక్కఁడే నాయకుఁడుండును. వాఁడు త్తమ, మధ్య, మాధములలో నెవ్వఁడైనను గావచ్చును. (కశ్చిత్ ఉత్తమమధ్యమాధ మాన్యతమః అనిసాహిత్య దర్పణరుచిరవ్యాఖ్య) ఆకాశభాషితములకుఁ బ్రతిభాషణ మును నాతఁడు సేయును. అనఁగా నాయకుఁడొక్కఁడే కావునఁ దానే మింటివైపు జూచి "నీవేమనుచున్నావు. ఓ, హో! ఇట్లనుచున్నావు......అని యెదుటి పాత్ర చెప్పవలసినదంతయుఁ దానే చెప్పి దానికిఁ బ్రత్యుత్తరించుచుండును. (ఒకానొక చో నిరువురు పాత్రలు గూడ నుండవచ్చును.) ముఖ్యముగా శృంగారమును, నలఁతిగా నన్యరసములను సూచింపవలెను. ముఖనిర్వహణ సంధులును, అర్థప్రకృతులెల్ల

యును నుండవలెను. (ముఖనిర్వహణ సంధులఁగూర్చియు, నర్థప్రకృతులఁగూర్చియు నిట దెలుపుట కవకాశము లేమి దశరూపకము వలనఁ దెలిసికొనవలెనని సూచింతుము) 'వీథీవవీథీ' అనఁగా వీధివంటిది. ఈకావ్యము శృంగారరసమునకు వీధివంటిది. ఉత్తమ శృంగారము వాఁకిలిదాఁటదు. అది యేకాంతమునందే శోభిల్లును. వీధీశృంగారము పచ్చిశృంగారము. ఇది పరదార సురాపానాది సుఖలలితమగు కామశృంగారము. కాని వీనియందు భాణమునందున్నంత పచ్చిశృంగార ముండదు. మధ్యమశృంగారమే యుండును. దీనియందుత్తమ నాయకుఁడు గూడనుండవచ్చునని రుచిరవ్యాఖ్యాత చెప్పియున్నాఁడు. కాని లక్ష్యమున నుత్తమనాయకుఁడు గానరాఁడు. మధ్యమ, అధమ, నాయకులే కానవత్తురు. ఆంధ్రము నందున్న శ్రీనాథుని వీధినాటకమున కీలక్షణము పట్టదు. ఈవీధినే వీథినాటకమనియు వ్యవహరింతురు.

## చక్రవాళము.

కం. ముక్తపదగ్రస్తంబై
సక్తాదిమపద్యమై, ససంబోధనమై
ప్రోక్తమగు చక్రవాళము
ముక్తమహాధీరశబ్ద మోహానమగుచున్. ౨౦

తా. మొదటనొక పద్యము గలిగినదియు, ముక్తపదగ్రస్తమును, సంబోధన సహితమును నగుకావ్యము చక్రవాళము. ఇదియుస్తోత్రప్రాయమగు కావ్యమే. మొదట నొకపద్యమనుటచే మిగిలిన కావ్యము గద్యమయము. ఆగద్యములు కళికలే, కళికల నుదాహరణకావ్యమునఁ దెలిపి యుంటిమి కదా! అప్పకవీయమున నీ చక్రవాళ లక్షణ మిట్లున్నది.

కం. ఒకపద్యముఁ, బిదప దశా
ష్టకసందర్భాష్టగద్య చతురంబగు ఫ
క్కిక్కిఁ బేరు చక్రవాళం
బకట! చతుర్భద్రమదియె! యచ్యుత! మరియున్.

కం. తొలి సమసనాంత్యవర్ణయు
గళమే పునరుక్తిగాఁగఁ గైకొని సామీ
ప్యలసత్సమాసము మొదల
నలరించినఁ జక్రవాళమగు దాశార్హా!

ఈ పద్యములందు 'సంబోధనాంతముగానుండవలయు' నన్నలక్షణము లేదు. కాన నరసభూపాలీయాప్పకవీయ లక్షణముల కేకవాక్యతను గల్పించుకొనవలెను. ఎట్లన, మొదల నొకపద్యము; పిమ్మట నెనిమిదిదళములగద్య. (ఇదియే కలిక). ఆపద్య గద్యములు రెండును ముక్తపదగ్రస్తములై సంబోధనాంతములుగా నుండవలెను. ముక్తపదగ్రస్తమనఁ దొలి సమాసముయొక్క యంతమునందున్న రెండక్షరములను మాత్రమే గ్రహించి మలి సమాసారంభమున నుంచుట ఎట్లన,

మ. ఫణికుంభద్భుజసార! సారసముఖీ పంచాయుధాకార! కా
రణ సంతత్యవతార! తారగిరి ధైర్యస్థేమ దుర్వార! వా
రణ సమ్రాడ్బలభార! భారవికవిప్రౌఢోక్తి పంచార! చా
రణ సంస్తుత్యవిహార! హారహర విభ్రాజద్యశో వైభవా!

ఇట్టి యొక పద్యమును, దానివెంట నెనిమిది యిట్టి గద్యలునుగల కావ్యము చక్రవాళము. దీనికిఁ జతుర్భద్ర మనియు నామాంతరము.

## బిరుదావళి

కం. ఆ చక్రవాళ లక్షణ
సూచితమై బిరుదభరిత శుభవాఙ్మయమై
ఆ చక్రవాళ విపుల
త్వోచక్రమునందు బిరుదగద్యము పొల్చున్. ౧౭౧

ప్రతాపరుద్రీయ లక్షణమున "ఆచక్రవాళలక్షణ సూచితమై" అనునది లేదు. ఆ లక్షణ మిట్లున్నది:—

వర్ణ్యమానాంక బిరుదవర్ణనప్రచురోజ్జ్వలా।
వాక్యాడంబర సంయుక్తా సామతా బిరుదావళీ.।

తా. వర్ణింపఁబడుచున్న రాజాదుల బిరుదములనుగూర్చి వాక్యాడంబరముతో వ్రాయఁబడిన కావ్యము బిరుదావళి. నరసభూపాలీయమున 'బిరుద గద్యము' అని యున్నది. కాన గద్యమయమని తెలియుచున్నది. ప్రతాపరుద్రీయ లక్షణమునుబట్టి గద్యమయమో పద్యమయమో తెలియరాకున్నది. సాహిత్యదర్పణమున "గద్యపద్యమయీ రాజస్తుతి ర్బిరుద ముచ్యతే" అని యుంటచే గద్య పద్యోభయమని తేలుచున్నది. మరియు విశ్వనాథుఁడు 'బిరుదమణిమాలా' అను కావ్యమును లక్ష్యముగా నిచ్చెను. అప్పకవీయమున నీ క్రింది లక్షణము గలదు.

గీ. క్షితి మహారాష్ట్రభాషచేఁ జెప్పఁబడెడు
భీకరోక్తులు బిరుదులై పెక్కుఁ దనరు
వాటి బిరుదావళి యొనర్పవలయునండ్రు
బుధులు సంబుద్ధిపదములు పొసగఁ గూర్చి.

చ. సలలితవాక్యగుంభనల, సర్వవిభక్తుల, దీవనంబులన్,
దెలుపుగఁ బద్యమొక్కటి రచించిన పిమ్మట గాదరీతి సం
కలిత చతుష్క, షట్క, దళగద్యము లెన్మిదియుం బదాలు నిం
పలరఁగఁ గూర్చిపేర్చి బిరుదావళి చెప్పఁగనొప్పు నెంతయున్.

ప్రథమమున సర్వవిభక్తులతో నాశీర్వాదరూపమగు నొకపద్యమునుజెప్పి పిమ్మట గాదరీతితో నాలుగు, లేక యాఱు, లేక యెనిమిది, లేక పదునాఱు బిరుదగద్యలు తత్ప్రతాపభుజవిక్రమాదులను వర్ణించునవి చెప్పవలెను. ఈ బిరుదములు మహారాష్ట్రభాషామయము లని చెప్పఁబడెను. మహారాష్ట్రభాష యనునది యుపలక్షణము. ఏదేశభాషలో నున్నను నాబిరుదముల నాంధ్ర సంస్కృతాదుల లోనికి మార్పక యదేవిధమున వ్యవహరింపవలెను.

## మంజరి

కం. తరుణీమణి శృంగారము,
విరహము, మధుమదనగర్వవిభవంబు, సరో
వరవన ఖేలనములు గల
దరయన్ మంజరియనంగ నభినుతికెక్కున్. ౧౭౨

తా. స్త్రీల శృంగారము, విరహము, వసంతమన్మథాదుల విజృంభణము, సరఃకేళి, వనకేళి మొదలగువాని వర్ణనము మంజరీకావ్యము.

ఇది గద్యమున నుండవలెనో పద్యమున నుండవలెనో రెంటను నుండవలయునో గద్యలయినచోఁ గలికలో? యేమియును గ్రంథకర్త దెలుపలేదు. దీనికిఁ బ్రతాపరుద్రీయాదులందు మూలములేదు. ఇట్టిగ్రంథము పద్యమయముగా నున్న నే శోభిల్లును.

కం. తారక లిఱువదియేడును
నారయ నొక్కొక్కపద్యమందుఁ దెలంగన్

గూరిచిన పద్యమాలిక
తారావళియనఁగ నభిమతంబై పొల్చుఁ. ౧౭౩

ఇరువదేడుపద్యములు గల కావ్యము తారావళి లేక నక్షత్రమాల అనఁబడు నని కవి యభిప్రాయము. కాని యిరువదేడు నక్షత్రములు(నామములు) ఒక్కొక్క పద్యములో నిబంధించినచో నది 'తారావళి' అనునర్థము వచ్చుచున్నది. ఇది కాదు. ప్రతాపరుద్రీయములో

'తారాణాం సంఖ్యయా పద్యైర్యుక్తా తారావళీ మతా' అని యున్నది. తారాణాం సంఖ్యయా 'సప్తవింశత్యా' అని వ్యాఖ్య.

ఈ యుదాహృత కావ్య భేదములు గాక యింకను గొన్ని కలవు. వాని నుదాహరింతుము.

## విశ్వావళి

'విశ్వేషాం సంఖ్యయా పద్యైర్యుక్తా విశ్వావళీ మతా'

విశ్వములు పదునాలుగు. కావునఁ బదునాలుగుపద్యములకావ్యము విశ్వావళి.

## రత్నావళి

'రత్నానాం సంఖ్యయా పద్యైర్యుక్తా రత్నావళీ మతా'

రత్నములు తొమ్మిది. కానఁ దొమ్మిదిపద్యముల కావ్యము రత్నావళి. దీనికి 'నవరత్నము'లని నేటి వ్యవహారము.

## పంచాననావళి

'పద్యైశ్చ పంచభిర్యుక్తా ప్రోక్తా పంచాననావళీ'

అయిదుపద్యముల కావ్యము 'పంచాననావళి' అనఁబడును. దీనికి 'పంచ రత్నములు' అని నేటి వ్యవహారము.

ఈసందర్భమున 'అప్పకవి' విభాగమునుగూడఁ జూపుదును.

సీ. ఒనరు ముక్తకమన నొక్కపద్యము; ద్వికం । బగురెండు;త్రికము మూఁడైనఁ;బంచ
రత్నంబులైదు; వారణమాల యెనిమిది; । నవరత్నములు పద్యనవకమైన;
భాస్కరమాలిక పన్రెండు; శశికళ । పదియాఱు; నక్షత్రపంక్తి యిరువ
దియు నేడు;త్రింశదాహ్వాయము ముప్పది గాఁగ;।సంఖ్య వెండియు మెండుసాఁగ నేని
గీ. వరుసఁ బంచాశదాఖ్య;మవ్వల శతకము; । సప్తసమధికశతికంబు; ననఁగ వెలయు
నేఁబదియు, నూఱు, నూటిపైనెనిమిదియును।సప్తశతి సప్తశతమైన శార్ఙ్గపాణి!

ఒకపద్యము ముక్తకము; రెండైన ద్వికము; మూఁడైనఁ ద్రికము, అయిదైనఁ బంచరత్నములు; ఎనిమిదైన గజమాల: తొమ్మిదైన నవరత్నములు; పంద్రెండైన సూర్యమాల; పదునాఱైన శశికళ; ఇఱువదేడైన నక్షత్రమాల; ముప్పదైన త్రింశత్తు; ఏఁబదైనఁ బంచాశత్తు; నూఱైన శతకము, నూటెనిమిదైన నష్టోత్తరశతకము, ఏడునూఱులైన సప్తశతి.

త్రింశత్తు, పంచాశత్తు, అను పదములు సముదాయార్థమున త్రింశికా (సింహాసన ద్వాత్రింశికా) పంచాశికా (చోరపంచాశికా) రూపమునసుండును. త్రింశత్తన ముప్పది, పంచాశత్తన నేఁబదియనియే యర్థము. కాని'అప్పకవి'యిచ్చిన యీపదము లసాధువులు. త్రింశికా, పంచాశికా, అనియే యుండవలెను.

మరియు నాతఁడు కొన్నిఁటి నింకను జెప్పలేదు. అష్టకము (ఎనిమిదింటి సముదాయము) పంచదశీ (పదునైదింటి సముదాయము) చత్వారింశికా (నలువదింటి సముదాయము) షష్టికా (అరువదింటి సముదాయము) సప్తతికా (డెబ్బదింటిసముదాయము) అశీతికా (ఎనుబదింటి సముదాయము) నవతికా (తొంబదింటి సముదాయము) పంచశతీ (ఐదునూర్లసముదాయము) సహస్రికము (వేయింటిసమూహము)

'శుకసప్తతి' ఇత్యాదులలో 'సప్తతి' అనియే వ్యవహారము గలదు. అట్లే 'పాదుకాసహస్రము' ఇత్యాదులలో 'సహస్రము' అనియే ప్రయోగముగలదు.

కావ్యము, శాస్త్రము, ఇతిహాసము, కావ్యశాస్త్రము, కావ్యేతిహాసము, శాస్త్రేతిహాసము, అని యాఱువిధములగు కావ్యము లున్నవని భోజుఁడు సరస్వతీ కంఠాభరణమున వచించెను. కావ్యశాస్త్రమును శాస్త్రకావ్యమనియు జెప్పవచ్చును. ధ్వన్యాలోకమున "మహాభారతేఽపి శాస్త్రకావ్య రూపచ్ఛాయాన్వయిని" అని యున్నది. శాస్త్రకావ్య మనఁగా శాస్త్రమునందువలెఁ బురుషార్థ నిరూపణమును, గావ్యమునందువలె రసనిరూపణమును గల కావ్యము. క్షేమేంద్రుఁడు శాస్త్రకావ్య మనఁ/జతుర్వర్గప్రాయమై సర్వోపదేశకమనియుఁ, గావ్యశాస్త్రమన భట్టి కావ్యాదు లనియుఁ దెలిపెను. భోజుఁడీ భేదమును దెలుపలేదు. అట్లే శాస్త్రేతిహాసము, కావ్యేతిహాసము, అనుచోఁ దదుభయధర్మములు కల కావ్యములని యర్థము.

## ఖండకావ్యము

'ఖండకావ్యం భవేత్కావ్యస్యైకదేశానుసారిచ' అని సాహిత్యదర్పణము. మహాకావ్య లక్షణములలో నేకదేశమును గ్రహించి వ్రాసిన కావ్యము; మేఘ

దూతాదులు. మహాకావ్య, ఖండకావ్యములకు 'సంఘాతము లేక సంఘాతకము' అనియు నామాంతరము.

## ముక్తకము

క్రియాసమాప్తికై పద్యాంతరములతోఁ నెట్టి సంబంధమును లేక రసభావాదులు గల యేకపద్యము. (ముక్తం అన్యేన నాలింగితం స్వార్థే కన్) అమరుకము, ఆర్యాసప్తశతి మొదలగునవి.

ఈ ముక్తకములందు 'అ' కారాది 'హ' కారాంతములాద్యక్షరములుగాఁ గలపద్య సంగ్రహమునకు 'వ్రజ్య' అని నామము. ఆర్యాసప్తశతిలోనీవ్రజ్యలుగలవు.

## యుగ్మకము

క్రియాసమాప్తికై పరస్పర సంబంధము గల పద్యములజంట. అప్పకవి రెండు పద్యముల మొత్తమునకు ద్వికమని పేరు పెట్టెను. అటఁ గ్రియాసమాప్తికై పరస్పరాపేక్షతోఁ బనిలేదు. ఇటఁ గావలయును. ఈ భేదమునుబట్టి నామభేదము.

## *సందానితకము

క్రియా సమాప్తికై పరస్పరాపేక్షగల మూఁడుపద్యముల సమూహము. వెనుక మూఁడుపద్యముల మొత్తమునకు అప్పకవి త్రికమనిచెప్పెను. అటఁబరస్పరాపేక్షలేదు. ఇటనుండవలెను. కానసామభేదము.

## కలాపకము

క్రియాసమాప్తికై పరస్పరాపేక్షగల నాలుగు పద్యములమొత్తము.

## కులకము

క్రియాసమాప్తికై పరస్పరాపేక్షగల యైదుపద్యములమొత్తము.

## చాటు పద్యము లేక శ్లోకము

స్తోత్రప్రాయమగు పద్యము లేక శ్లోకము. ఈ'చాటుపద్యము' అనుపదమును నీకాలమున 'అనిబద్ధకావ్యము' అనునర్థమున వ్యవహరించుచున్నారు.

---

*అభినవ గుప్తుఁడు లోచనమున మూఁడు పద్యముల సమూహమునకు విశేషకమనియు రెండుపద్యముల మొత్తమునకు సందానితకమనియు వ్యవహరించెను.

## కోశము

"కోశః శ్లోకసమూహస్తు స్యాదన్యోన్యానపేక్షకః"
అన్యోన్యాపేక్షలేని శ్లోకసమూహము కోశ మనఁబడును.

## వాకోవాక్యము

ఉక్తిప్రత్యుక్తి మద్వాక్యం వాకోవాక్యం విదు ర్బుధాః ।
ద్వయోర్వక్త్రోస్తదిచ్ఛంతి బహూనా మపి సంగమే ।

"వాక్యంచ ఉపవాక్యంచ వాకోవాక్యం" వాక్యోపవాక్యము లెందుండునో యది వాకోవాక్యము. అదియే యుక్తిప్రత్యుక్తి రూపము. ఈ యుక్తిప్రత్యుక్తు లిరువురకును గూర్పవచ్చును. పెక్కండ్రకును గూర్పవచ్చును. ఇది ఋజూక్తి, వక్రోక్తి, వైయాత్యోక్తి, ప్రశ్నోత్తరోక్తి, చిత్రోక్తి, అని పంచవిధములుగా సరస్వతీ కంఠాభరణమునఁ గలదు.

మ. చనుదెంచెన్ సుందరి ! పాంథుఁడా! చనుము! నీ స్వాంతంబునన్ శోకముం
గనఁగాఁబోకుము; శోకమెందుల?కిఁకం గన్నీరురాల్తేల ? నే
చన వైతంచునె! తొందరేల ననుఁబుచ్చన్ నీవు ? నీతోడఁ బో
వనె వాంఛించుచు నిట్లు వేగపడు నా ప్రాణంబు లత్యంతమున్.

ఇది ప్రియునియొక్కయుఁ బ్రియురాలియొక్కయు నుక్తిప్రత్యుక్తి రూపమగు వాకోవాక్యము. మిగిలినవూహ్యములు.

ఈముక్తకాదులకు'అనిబద్ధకావ్యము'లనియు నామాంతరము. వామనుఁడు కావ్యము- నిబద్ధము, అనిబద్ధము, అని రెండు తెగలుగా విభజించెను. మహాకావ్య ఖండకావ్యములు నిబద్ధములు. ముక్తక, యుగ్మక, సందానితక, కలాపక, కులకము లును, అష్టకవిప్రభృతులు నొడివిన భేదములును'అనిబద్ధకావ్యములు'మహాకావ్యము దక్క మిగిలినవన్నియు క్షుద్రప్రబంధములని విద్యానాథుఁడు వ్యవహరించెను. వీనికి 'ఉపకావ్యము'లనియు నామాంతరము. 'ఉపమితం కావ్యేనఉపకావ్యం' అనువ్యుత్ప త్తినిబట్టి కావ్యసదృశము అనియర్థము.

## ఆఖ్యానము.

"స్వయందృష్టార్థ కథనంప్రాహు రాఖ్యానకం బుధాః" కవి తాను స్వయముగాఁ జూచినదానినిఁ జెప్పుట యాఖ్యానము.

## ఉపాఖ్యానము,

"శ్రుతస్యార్థస్య కథనముపాఖ్యానం ప్రచక్షతే" ఇతరులవలన విన్నదానినిఁ జెప్పుట యుపాఖ్యానము.

## గాథ.

'పితృపృథ్వీప్రభృతి గీతయః' తల్లిదండ్రులు, లేక పితృదేవతలు, భూమి, మొదలగు వానినిఁ గూర్చి చేయుస్తోత్రము; మరియు దాతలయు వీరపురుషులయు కృత్యములఁ దెలుపుగీతము. దీనికి నారాశంసియనియు నామాంతరము.

ఈ మూఁడింటి లక్షణములును, విష్ణుపురాణ టీకాకారుఁడైన శ్రీధరస్వామి యిచ్చెనని కే. వి. లక్ష్మణరావుగారు 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమున' వ్రాసిరి.

## దండకము

త, న, స, హ, గణములలో నొకటి మొదలనిడి తక్కినవన్నియుఁ దగణములే కూర్చి తుది నొకగురువు నిడవలెను. యతి ప్రాస నియమము లేదు. ఇది గద్య కావ్యమా ? పద్యకావ్యమా ? యని సందేహము గలిగించును. కాని గద్యము గణబద్ధముగా నుండదుగదా ! కానఁ బద్యకావ్యమే. సామాన్యముగా దండకములు స్తోత్రరూపములే. అనఁగా భక్తిరస కావ్యములే. ఆంజనేయ దండకము మొదలగునవి. కాని పోతనకవి వ్రాసిన శృంగారప్రధానమగు భోగినీదండకముగూడఁ గలదు.

## ఇతిహాసము — పురాణము

విద్యారణ్యులవా రైతరేయ బ్రాహ్మణ భాష్యోపోద్ఘాతమున నిట్లు వ్రాసియున్నారని కే. వి. లక్ష్మణరావుగారు ఆంధ్ర విజ్ఞానసర్వస్వమున నిట్లు వ్రాసిరి. "దేవాసురాస్సంయత్తా ఆసన్" ఇత్యాదయః ఇతిహాసాః.

'ఇదం వా అగ్రే నైవ కించిదాసీత్' ఇత్యాదికం జగతః ప్రాగవస్థా ముపక్రమ్య సర్గప్రతిపాదికం వాక్యజాతం పురాణం"

అనఁగాఁ బూర్వరాజాదుల కథలను దెలుపునది ఇతిహాసము. 'ఇతి-హ-(అనియఁట) అస్మిన్ అస్తీతి ఇతిహాసః'అని వ్యుత్పత్తి. ఉదా॥ భారత రామాయణాదులు.

సర్గము (ప్రపంచోత్పత్తి) ప్రతిసర్గము (బ్రహ్మాదులు నేసెడు సృష్టి) వంశము (దేవాసురాది విభేదోత్పత్తి) మన్వంతరము (వేలువేలు మనువుల తరములు) వంశానుచరితము (సూర్యచంద్ర వంశముల చరిత్రము) అను నైదు లక్షణములు

గలది పురాణము.'పురాఽపినవంపురాణం' అనివ్యుత్పత్తి. పురాణములలో మొదట నీ యైదులక్షణములే కనఁబడినను దరువాతికాలమున వీనిని మించిన వర్ణనములు సేరినవి. పోఁగాఁబోఁగా నితిహాసములవలెనే పురాణములును బెక్కు కథలకు నిలయములయ్యెను. కావున నితిహాసముల వ్యాప్తి చిన్నది. పురాణముల వ్యాప్తి పెద్దదిగాఁ బరిణమించినది. ఇప్పుడీ యల్పభేదమును బాటింపక పురాణపదమునే రెంటికిని వ్యవహరించుచున్నారు.

పాశ్చాత్యులు ప్రతిపాద్యవస్తువునుబట్టి కావ్యము నీ క్రిందివిధమున విభజించిరి:- ౧. పురాణకావ్యము (Epic), ౨. ఖండకావ్యము (Lyric), 3. అధిక్షేపకావ్యము (Satyre), ౪. మృతవిషయకకావ్యము(Elegy), ౫. హితోపదేశకావ్యము(Diadactic Poetry), ౬. ఏలపాటలు (Ballads.) ౭. గ్రామీణజీవనకావ్యము (Pastoral Poetry) ౮. వర్ణనాత్మకకావ్యము (Discriptive Poetry) ౯. కథాత్మకకావ్యము (Narrative Poetoy)

## గద్య కావ్యములు

ప్రతాపరుద్రీయము గద్యకావ్య ప్రశంస చేయలేదు. కావున నరభూపాలీయకర్తయుఁ దెలుపలేదు. గద్యరచన విశేషించి సాఁగుచున్న యీ దినములలో వానినిఁ గూర్చి కూడ మనము దెలిసికొనవలెనుగదా! కావున నల్పముగాఁ దత్ప్రశంస చేయుదుము.

'గద్యం కవీనాం నికషం వదంతి' గద్యము కవులకు సానరాయి. అనఁగాఁ బరీక్షాస్థానము. ఏలనఁ, బద్యకావ్యమునఁ గవియొక్క ప్రతిభతోపాటు వృత్తము గూడ రసమునకు సహాయపడును. గద్యమున వృత్తములేమిఁ గవి కేవల ప్రతిభాబలముచేతనే రసవంతములుగాఁ బద్యకావ్యముతోఁ సమానముగాఁ జేయవలసియున్నది. కాన దీనినిఁ బరీక్షాస్థానమని చెప్పిరి. కావున గద్యము వ్రాయుట సులభమని తలంపరాదు.

*సంస్కృతమున గద్యకావ్యములు నాలుగు విధములు. ౧. ముక్తకము, ౨. వృత్తగంధి, 3. ఉత్కలికాప్రాయము, ౪. చూర్ణకము లేక చూర్ణము.

---

* ఆంధ్రభాషలోని గద్యములను గుఱించి ముఖ్యముగాఁ దెలిసికొనవలసియున్నది. అదిచాల విస్తరముగా నుంటచే గ్రంథవిస్తర భీతిచే వదలితిని. ఈ విషయమును సమగ్రముగాఁ దెలిసికొనఁ గోరువారు శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావు బి. ఏ. బి. యల్ గారి (యలమంచిలి) ఆంధ్రగద్య వాఙ్మయ చరిత్రను జదువుకొన వలయును.

## ౧. ముక్తకము.

సమాసరహితమయిన గద్యము. "గురుర్వచసి పృథు రురసి" మొ॥

## ౨. వృత్తగంధి.

వృత్తభాగముగలది. " సమరకండూలనిబిడభుజదండ కుండలీకృతకోదండ శింజినీటంకారోజ్జాగరిత వైరినగర" ఇత్యాదికమగు వాక్యమున "కుండలీకృత కోదండ" అనుపదసమూహమనుష్టుబ్వృత్తముయొక్క పాదము.

## 3. ఉత్కలికా ప్రాయము.

దీర్ఘసమాస బహుళము. వృత్తగంధికిని దీనికిని భేదమేమన రెండునుదీర్ఘ సమాసబహుళములే యైనను వృత్తగంధిలో వృత్తభాగము కానవచ్చును. ఇట నది గానరాదు.

## ౪. చూర్ణకము.

అల్పసమాసములు గలది.

మరియు నితివృత్తి భేదమునుబట్టి కథా, ఆఖ్యాయికా, ఖండకథా, పరికథా కథాలికా, అనునైదు గద్యప్రబంధ భేదములుంగలవని కావ్యాదర్శ వాఖ్యాత జీవానంద విద్యాసాగర భట్టాచార్యులు దెలిపిరి. కానీ వీని లక్షణములను దెలుపలేదు. ఈ 'కథాలికా' పదమును గొందఱు 'కథానికా' అని వ్యవహరించు చున్నారు. పృషోదరాది పాఠముచే 'లి' వర్ణము 'ని' వర్ణముగావచ్చును. దీనిని (Short story చిన్నకథ) అనునర్థమున నేఁటివారు వాడుచున్నారు. ఆనందవర్ధనుఁడు ధ్వన్యాలోకమున కథాలికా, కథానికా, పదములురెంటిని వాడలేదు. దీని స్థానమునఁ 'బర్యాయబంధము' అనివ్యవహరించెను. ఆతని విభాగములును వానిలక్షణము లునునివి :—

### ఆఖ్యాయికా.

ఉచ్ఛ్వాసాది విభాగములు గలిగి నడుమనడుమ నితరుల పద్యములుంగల గద్య ప్రబంధము.

### కథా.

అవాంతర విభాగములులేకయుఁ బద్యములులేకయు నున్న గద్యప్రబంధము.

దండి కథా, ఆఖ్యాయికలకు భేదములేదని "తత్కథాఽఖ్యాయికే త్యేషా ఏకా సంజ్ఞాద్వయాంకితా" అనిచెప్పెను. కాని యానందవర్ధనుఁడు పై విధమున భేదమును దెలిపెను. మరియు 'శివతత్త్వ రత్నాకరమున'

'కథా కల్పితవృత్తాంతా సత్యార్థాఽఖ్యాయికా మతా'

కల్పితవృత్తాంతముగలది కథయనియు, సత్యవృత్తాంతముగలది యాఖ్యాయిక యనియును దెలుపఁబడెను.

మరియు "వృత్త మాఖ్యాయతే యస్యాం నాయకేన స్వచేష్టితం" నాయకుఁడే స్వయముగా నెంతుఁ దన వృత్తాంతమును దెలుపునో యది 'యాఖ్యాయిక' అని మరొక లక్షణముగూడఁ గన్పట్టుచున్నది. దీనినిఁబట్టి 'ఆఖ్యాయిక' యన 'ఆత్మకథ' (Auto-Biography) యని సారాంశము.

ఈవిధముగాఁ గథా, ఆఖ్యాయికలకు లక్షణభేద విషయమున నభిప్రాయ భేదము గానవచ్చుచున్నది. శివతత్త్వరత్నాకర లక్షణము యుక్తముగానున్నది.

ఖండకథా

ఏకదేశవర్ణనము గల గద్యప్రబంధము.

---

* సాహిత్యస్థాపక శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు 'కథానికారచన' అనుగ్రంథమునకుఁ బీఠికనువ్రాయుచు నీవిధముగా వ్రాసిరి. "కథ్యతే ఇతికథా అని నైఘంటికుల నిరూపణ, ఉపరికథ, ఖండకథ, ఉపకథ, బృహత్కథ, మున్నగునవి కథావిశేషములు. వీటిని మన వాఙ్మయవిధాతలు ఎరుగుదురు."

శ్రీవారెచ్చట వీనినిఁ దిలకించిరో యేవిధాత లెఱుఁగుదురో సప్రమాణ ముగాఁ దెలిపిన బాగుగానుండును. ఉపరికథా బృహత్కథలనుగూర్చిన ప్రశంస మాకెచ్చటను లభింపలేదు. మరియు వీనిలక్షణముల నీక్రిందివిధముగా వారువ్రాసిరి.

"ప్రసంగకుశలులైన వారుచెప్పే బహునాయక వృత్తముగలది ఉపరికథ. అపూర్వవిశేషంగా ఆరంభించి, నడుమనో చివరనో గ్రంథాంత విషయమును సంక లితము చేసే రచన ఖండకథ. ప్రధానాంశము మరొక గ్రంథమునుండి తీసికొన్నా, దానిని చెప్పడంలో అపూర్వమని భ్రాంతికలిగేటట్లు అతివిచిత్రంగా నడిచే రచన ఉపకథ. అంకాదివిభాగములతోను, అద్భుతసన్నివేశములతోను గొలుసుకట్టే కల్పనా గ్రథనము బృహత్కథ."

ఈలక్షణములెందున్నవో వారు సప్రమాణముగాదెలిపినచో బాగుగానుండును.

ఉపరికథా, బృహత్కథా, అనునవి లేనేలేవు. బృహత్కథ యొకగ్రంథ నామముకాని కథాభేదముగాదు.

## పరికథా

ధర్మార్థ కామాదులలో నొక్కదాని నవలంబించి విచిత్రప్రకారములతో ననంతముగా వర్ణింపఁబడిన గద్యప్రబంధము.

## పర్యాయబంధము

ఒక్క వసంతాదులను గానీ యొక్క మహారాజాదులను గానీ వారి విజయ యాత్రాదులను గానీ వర్ణించు ప్రబంధము.

## సకలకథా

చతుర్విధ పురుషార్థములయొక్కయు ఫలము లంతమందుఁ గల యితివృత్త వర్ణనముగల ప్రబంధము.

## ఉపకథ

పెద్దకథలోని కథ.

ఈ యెల్లవిధములగు గద్యప్రబంధము లందును గూడ గవి ధ్వనికారుఁడు దెలిపిన ప్రబంధ రసవ్యంజకతకుఁ గావలసిన శిల్పదృష్టిని వహించి రచింపవల యును. పద్యమయ కావ్యమువలెనే గద్యమయ కావ్యము గూడ రసవత్తరముగానుండ వలెను. కానఁ బద్యప్రబంధము రసవత్తరముగా నుంటకు వలసినవిధానమంతయు గద్యప్రబంధమునఁగూడ నవలంబింపవలెను.

వాఙ్మయమునఁ గావ్యస్థ భాగ, ప్రవిభాగములకుఁ బెక్కు నామములు గాన వచ్చుచున్నవి. ౧. సర్గము, ౨. ఆశ్వాసము, ౩. ఉచ్ఛ్వాసము, ౪. ఉల్లాసము, ౫. కాండము, ౬. స్కంధము, ౭. పర్వము, ౮. స్తబకము, ౯. అధ్యాయము, ౧౦. అధికరణము, ౧౧. ప్రకరణము, ౧౨. లంబకము ౧౩. దళము, ౧౪. ఉద్ద్యోతము, ౧౫. ఉన్మేషము, ౧౬. పరిచ్ఛేదము, ౧౭. ఖండము మొదలగునవి. వీనికి వివరణ మిది.

## సర్గము

సర్గమన సృష్టి. బ్రహ్మ లోకమును సృష్టించినవిధమునఁ గవి గావ్యమును సృష్టించునుగదా! బ్రహ్మ లోకమునకు వలసిన వివిధములగు సృష్టులమూలమున నానందమును గలిగించువిధమునఁ గవియు రసికులకు వలసిన రససంబద్ధములగు నానావిషయములయొక్కసృష్టులమూలమున నానందముగలిగించును. కాన రససంబద్ధ విషయసృష్టి సర్గము. అది యేభాగమున నుండునో యా భాగమున కౌపచారికముగా సర్గమని వ్యవ[illegible]

## ఆశ్వాసము

"కథాంశానాం వ్యవచ్ఛేద ఆశ్వాస ఇతి కథ్యతే" (కథాంశములయొక్క విభాగ మాశ్వాసమనఁబడును.) మరియు నాశ్వాసమన నూపిరి పుచ్చుకొనుట. ఉపచారముచేత "నొకతూరి నిరాయాసముగాఁ జదువఁదగిన భాగము" అనియు నర్థమును జెప్పుకొనవచ్చును.

## ఉచ్ఛ్వాసము

పై వివరణమే.

## ఉల్లాసము

"యస్మిన్ మన ఉల్లసతి స ఉల్లాసః" విషయ సౌలభ్యముచే దేనియందు మనసున్నల్లాసమొందునో యా భాగ ముల్లాసము.

## కాండము

పెక్కు మొత్తములయొక్క మొత్తము. "కాండః సమూహః ఖండానాం" అను వచనము గలదు. పెక్కు సర్గల మొత్తము కాండముగా వ్యవహరింపఁబడుచున్నది. రామాయణ విభాగములగు కాండములు పెక్కు సర్గల మొత్తములుగదా! సర్గమునఁ బెక్కు శ్లోకములుండును.

## స్కంధము

'స్కంధ ఇవ స్కంధః' స్కంధము (చెట్టుమొదలు) వంటిది స్కంధము. నానా శాఖోపశాఖలతో వర్ధిల్లు జగద్వృక్షమునకు స్కంధము భగవంతుఁడే. కావున భగవన్మాహాత్మ్య వర్ణనైకపరతంత్రమగు భాగము స్కంధము. కావుననే భాగవత భాగములకు స్కంధము లనుపేరు తగియున్నది.

"స్కంధమనఁ బెద్దశాఖ. వృక్షప్రకాండము గొంత సాఁగినపిమ్మట దానికి నలుదిక్కులందును నాలుగు పెద్దశాఖలు వెడలును. భాగవతగ్రంథ మనునది వృక్షప్రకాండము. ఈ ప్రకాండమునుండి పండ్రెండు స్కంధములు వెలువడినవి" అనియును జెప్పుదురు.

## పర్వము

'చెఱకు మొదలగువాని కనుపు' అని యర్థము. మహాభారత మిక్షుఖండము వంటిదని లోకప్రసిద్ధి. ఏలన, నెచ్చటఁదిన్నను జెఱకు దియ్యగానుండున ట్లెచ్చట

జదివినను భారతము రుచ్యముగా నుండును. కావున దాని భాగములకుఁ బర్వ మను నామ ముచితమే.

## స్తబకము

"స్తబక ఇవ స్తబకః" పూలగుత్తివంటిది: దీనిచేఁ గావ్యము పుష్పవృక్షముగా నారోపితమగుచున్నది.

## అధ్యాయము

సామాన్యముగా నిది శాస్త్రభాగములకు మాత్రమే వ్యవహరింతురు. ఏభాగము వలన నధికమగు నాయము (ఆయము = లాభము; అనఁగా జ్ఞానలాభము - శాస్త్రజ్ఞానలాభము) కలుగునో యది యధ్యాయము. 'అధీయతేఽస్మి న్నిత్యధ్యాయః' (దీనియం దధికముగా జ్ఞానమును బొందుదురు కాన నధ్యాయము) అని వ్యుత్పత్త్యర్థము. ఈ పదమును శాస్త్రగ్రంథ భాగములకేకాక కావ్యభాగములకు వాడినచో నౌపచారికముగా గ్రహింపవలెను.

## అధికరణము

ఇదియు శాస్త్రవిభాగములకే వ్యవహరింపఁబడును. విషయము, సందేహము, పూర్వపక్షము, ఉత్తరపక్షము లేక సిద్ధాంతము, నిర్ణయము, అను నైదువిషయములుం గల ఘట్టము. పూర్వ మీమాంసాదిశాస్త్రములం దీ యధికరణములు గలవు.

## ప్రకరణము

"ప్రకృష్టం కరణం సాధనం ప్రకరణం" అనఁగా నుద్దేశించిన విషయసిద్ధికిఁ బ్రకృష్టమగు సాధనము.

## లంబకము

ఇది యపపాఠము. 'లంభకము లేక లంభము' అని శుద్ధపాఠము. ఏ భాగముచే లంభము (లాభము-ఆనందలాభము) కలుగునో యది లంభము లేక లంభకము. కథాసరిత్సాగరమున నీ లంభకములు గలవు.

## దళము

'దళమివదళం' దళమువంటిది కావునదళము. కావ్యభాగము దళముగా నారోపింపఁ బడుటవలనఁ గావ్యము శాఖారూపముగా నారోపింపఁ బడుచున్నది.

## ఉద్ద్యోతము

పెద్దవెలుఁగని యర్థము. గహనమైన శాస్త్రీయవిషయములను దెలుపుభాగము నకుద్ద్యోతమని పేరు. వెలుఁగుచేఁ జీకటి తొలఁగు విధమున నేభాగముచేఁ దెలియమి దొలఁగునో యనఁగాఁ దెలియనివిషయము సుగమమగునో యదియుద్ద్యోతము.

## ఉన్మేషము

వెలుఁగు, వికాసము, నేత్రాద్యున్మీలనము. దేనివలనఁజదువరి కిట్టివి గలుగునో యది యున్మేషము.

## పరిచ్ఛేదము

'పరిచ్ఛిద్యతే అనేన ఇతి పరిచ్ఛేదః' దీనిచేఁ (భాగముచే) గొంత విషయము విభక్తమగును. కానఁ బరిచ్ఛేదము. ఇదియు శాస్త్రవిభాగములకే నామము.

## ఖండము

'ఖండమివ ఖండం' ఖండమువంటిదికాన ఖండము.

ఇవిగాక మరికొన్ని పారిభాషిక పదములకిట వివరణము వ్రాయుదుము.

## సూత్రము

శ్లో. అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖం।
అస్తోకమనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః.।

కొలఁది యక్షరములు గలిగియుండవలెను. అర్థమసందిగ్ధముగా బోధింప వలెను. సారముగలదై యనఁగా బుద్ధిబలము కొలఁది తెలియఁదగిన యర్థగాంభీ ర్యము గలిగియుండవలెను. ఎల్ల లక్ష్యములందును సమన్వయించునదిగా నుండవలెను. చూచుటకుఁ జిన్నదిగానున్నను భావమును బట్టి గొప్పదిగా నుండవలెను. నిర్దుష్ట ముగా నుండవలెను. అట్టిదానిని సూత్రమని సూత్రవేత్తలు చెప్పుదురు. దారమెట్లు చుట్టఁగాఁ జుట్టఁబడి యున్నపు డల్పముగాఁ గానఁబడి విప్పఁబడినపుడు దీర్ఘముగా గానఁబడి పెక్కింటిని బంధించుట కవకాశము గల్పించునో యట్లే సూత్రము గూడఁ బనిసేయును. 'సూత్రమివ సూత్రం' అని వ్యుత్పత్తి.

## వృత్తి

'సూత్రమాత్రస్య యా వ్యాఖ్యా వృత్తి రిత్యభిధీయతే' సూత్రమాత్రమునకు వనఁగా మిక్కిలిలోఁతునకుఁ బోరక చేసిన వ్యాఖ్య వృత్తి యనబడును.

## పద్ధతి

సూత్రవృత్తిని లెస్సగా వివేచనము సేయునది పద్ధతి.

## భాష్యము

పూర్వపక్షోత్తర పక్షములలో విషయమును జల్లెడ పట్టినట్లు గావించుచు భాషించునది భాష్యము. ఇది స్వతంత్ర విమర్శగా నుండును.

## సమీక్ష

భాష్యమును లెస్సగా నీక్షించునది సమీక్ష.

## టీక

సంభవించినంత వఱకు మూలగ్రంధమునకు నర్థమును సమగ్రముగా వివరించునది టీక (Explonatory notes) 'టీకా నిరంతరవ్యాఖ్యా సంజి కాపదన క్తికా' అనియాకరము.

## టుప్పీక

స్వల్పమగు టీక (Notes). (ఇది పంజిక కన్నను జిన్నది)

## పంజిక

అర్థముగాని విషమపదములకుమాత్రి మర్థమును నిర్వచించునది 'పంజిక.' (Short Notes). దీనికి టిప్పణి యనియుఁ బేరు.

## కారిక

అర్థమును విరచించు శ్లోకరూపమగు వ్యాఖ్యానమునకుఁ గారిక యని పేరు.

## పరికర శ్లోకము

"పరికరోతి ప్రకృతార్థం అధికాధానేన ఉపకరోతీతి పరికరః; పరికరార్థం కారికార్థస్య అధికాధానం కర్తుం శ్లోకః పరికరశ్లోకః" అనఁగాఁ గారికార్థమును విశదీకరించి విపులీకరించిన శ్లోకము పరికర శ్లోకము.

శాస్త్రకారు లటనట శాస్త్రములందుఁ దాము వచనరూపమున వివరించిన విషయములను విద్యార్థులు కంఠపాఠముసేయుట కనుకూలముగా శ్లోకరూపమున విరచింతురు. అట్టివే కారికలు, పరికర శ్లోకములును.

## వార్తికము

"ఉక్తా ఽనుక్త, దురుక్త, చింతాకరం వార్తికం" చెప్పఁబడినదానిలోఁ జెప్పఁబడనిదానిని గుఱించియు, దోషయుక్తముగాఁ జెప్పఁబడినదానిని గుఱించియు విచారించి సవరించి చెప్పునది వార్తికము.

## వివేకము

"వివరీతుం క్వచిద్గ్రథ్నం నవం సందర్భితుం క్వచిత్ ... వివేకః ప్రవితన్యతే" ఇదివఱకుఁ గూర్పఁబడినదానిని వివరించుచుఁ గ్రొత్తదానినిఁ గూర్చుచు రచింపఁబడినది వివేకము.

## వ్యాఖ్య; వ్యాఖ్యానము

"పరిచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా
ఆక్షేపశ్చ సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణం"

పదవిభాగము, పదముల యర్థము, సమాసపదములకు విగ్రహ ప్రదర్శనము, కావ్యము నందలి యలంకారములను సమన్వయించుట, వ్యాకరణాద్యంశములపై నాక్షేప సమాధానములు; ఈ యైదులక్షణములును గలది వ్యాఖ్య లేక వ్యాఖ్యానము.

ఈ వ్యాఖ్యానమునకు గచ్ఛద్వ్యాఖ్యానము, ధావద్వ్యాఖ్యానము, అని రెండవాంతరభేదములు గలవు. వీనినిఁ గ్రమముగా టుప్పీక, పంజిక, అని వ్యవహరింపవచ్చును.

ఇటఁ గొన్ని సారస్వతప్రసిద్ధవైదికపదములకునువివరణమునువ్రాయుదుము.

## శ్రుతి

వినుకలిచే నేర్చుకొనునది; అనఁగా వేదము. అనాదికాలమునుండి నేఁటిదాఁక వేద మొకరు సంతచెప్పుచుండఁగా మఱొకరద్దానినట్లే యుచ్చరించుచు నేర్చుకొందురు. కాన నొకరిశ్రుతినుండిమఱొకరిశ్రుతికి,వారినుండివేఱొకరిశ్రుతికినివచ్చినది.

## స్మృతి

"శ్రుత్యర్థః స్మర్యతేఽత్ర" శ్రుత్యర్థ మిందు స్మరింపఁబడును. కాన స్మృతి. 'శ్రుతేరివార్థంస్మృతి రన్వగచ్ఛత్' (శ్రుత్యర్థమును స్మృతియనుసరించిన విధమున వెంబడించెను) అనికూడ నుండుటవలన శ్రుత్యర్థమును స్మృతి యనుసరించును.

## ఆగమము

పరమేశ్వరా దాగత ఏవఆగమః" (పరమేశ్వరునుండి వచ్చిన జ్ఞానరాశి-దానినుపదేశించు గ్రంథముపచారముచే నాగమము) శైవ, వైష్ణవాదు లాగమములు గూడఁ బరమేశ్వరప్రోక్తములే యని వానికిఁ బ్రామాణ్య మంగీకరింతురు. ఈ'ఆగమ' పదమునకు శైవులీ క్రిందివిధమున వ్యుత్పత్తినిఁ జెప్పుదురు.

"ఆగతం పంచవక్త్రాత్తు గతం చ గిరిజాముఖే
మతంచ వాసుదేవస్య తస్మాదాగమ ఉచ్యతే.

శివునినుండి వచ్చినదియుఁ, బార్వతీముఖమును జొచ్చినదియు, వాసుదేవునికి సమ్మతమయినదియు నగునది యాగమమనఁబడును. ఇందు, ఆ, గ, మ, యనువర్ణ త్రయమునకును నీవిధముగా నిర్వచనము చేయఁబడినది.

## శాస్త్రము

'శాసనాచ్ఛాస్త్రముచ్యతే' శాసించునది కాఁబట్టి శాస్త్రము; మరియును నజ్ఞాతజ్ఞాపకత్వము శాస్త్రలక్షణము. అనఁగా నితరగ్రంథములవలనఁ దెలియఁబడని విషయములను గూలంకషముగాఁ దెలుపునది శాస్త్రము.

## దర్శనము

అతీంద్రియ జ్ఞానముచేఁ దత్త్వమును సాక్షాత్కరించుకొనుట దర్శనము. అట్టి ఋషులు ద్రష్టలు. ఆయాత్మదర్శనము నిరూపించు గ్రంథ ముపచారముచే దర్శన మనఁబడును.

## ప్రస్థానము

చతుర్దశసు విద్యాసు మధ్యే ప్రకౢప్తం స్థానం యస్య తత్ (పదునాలుగు విద్యలలో దేని స్థానము ప్రకౢప్తమోయది ప్రస్థానము.) అనఁగా వేదాంతము. సూత్ర భాష్య, గీతాభాష్య, ఉపనిషద్భాష్యములకుఁ బ్రస్థానత్రయమని పేరు.

## శిక్ష

వర్ణములయొక్క (అక్షరముల) ఉచ్చారణరీతి, ఉత్పత్తిస్థాన, ప్రయత్న, స్వర, కాల భేదములను గూర్చి శాసించుగ్రంథము.

## కల్పము

వేదములలో నటనటఁ బఠింపబడిన కర్మ బోధకమంత్రములయొక్క వినియోగమును దెలుపుసూత్ర గ్రంథము కల్పము.

## వ్యాకరణము

"ప్రకృతి ప్రత్యయోపాధినిపాతాది విభాగశః
పదవ్యాఖ్యానకరణం శాస్త్రం వ్యాకరణం విదుః"

ప్రకృతి, ప్రత్యయము, ఉపాధి, నిపాతము, మొదలగువానిని వివిక్తముగాఁ జూపి చేయు పదవ్యాఖ్యానము వ్యాకరణము. "వ్యాక్రియంతేశబ్దాః అనేన ఇతి వ్యాకరణం" అనివ్యుత్పత్తి.

## సంహిత

'పదప్రకృతిస్సంహితా' వేదమునందలి పదపాఠమునకుఁ బ్రకృతిభూతమగు పాఠము (పదపాఠము × సంహితాపాఠము).

## నిరుక్తము

వైదికశబ్దములయొక్క. యర్థ మెందు నిర్వచింపఁబడునో యది నిరుక్తము.

## అర్థవాదము

"అర్థస్య ప్రయోజనస్య వాదః" ప్రయోజనము నుద్దేశించి చేయు ప్రశంసా వాక్యము. ఈ యర్థవాదములు వేదమునఁ గలవు. అందముఖ్యములగు విషయములఁ గూడ నత్యధికముగాఁ బ్రశంసించు వాక్యములుండును. 'వ్రతానా ముత్తమం వ్రతం' అన్నట్లేదో ప్రయోజనము నుద్దేశించి 'నీవే మహారాజవు. నీవే సార్వభౌముఁడవు' అని పొగడుదురు. ఈ పొగడికలు యథార్థములు గాఁజాలవు. ఇవి ప్రయోజనాపేక్షితములు. ఇవియే యర్థవాదములు.

## ఆన్వీక్షకి (లూ) అన్వీక్షికి

"అన్వీక్షా ప్రయోజనమస్య ఆన్వీక్షకీ" లోకమునందలి పదార్థముల తత్త్వమిందన్వీక్షణము చేయఁబడును. అనఁగా లెస్సగాఁ దర్కింపఁబడును. దీనికిఁ దర్కశాస్త్రమనియుఁ బేరు.

"ఆన్వీక్షక్యాత్మవిద్యా స్యా దీక్షణా త్సుఖదుఃఖయోః ।
ఈక్షమాణ స్తయా తత్త్వం హర్షశోకౌ వ్యుదస్యతి."

సుఖదుఃఖములను లెస్సగా విచారించి తత్త్వమును దెలిసికొని యీ శాస్త్రము వలన నా సుఖదుఃఖములను విడుచుచున్నాఁడు (మానవుఁడు). కాఁబట్టి యాన్వీక్షకి యన నాత్మవిద్య. ఆ యా శాస్త్రకారులు తమ తమ శాస్త్రములవలననే మోక్షము

లభించునని చెప్పుదురు. కాన నాన్వీక్షకియు నా శాస్త్రకారుల మతమున నాత్మ విద్యయే.

## దండనీతి

ధర్మమును బురస్కరించుకొని యపరాధికి దండమును విధించు శాస్త్రము.

## వార్త

పురుషార్థములలో నొకటైన యర్థమును గుఱించి విచారించు శాస్త్రము. కృషి (వ్యవసాయశాస్త్రము) గోరక్షణ (పశుశాస్త్రము) వాణిజ్యాదు (క్రయవిక్రయాది వ్యవహారము) లిందే చేరును.

## మీమాంస

న్యాయములచే వేదార్థమును లెస్సఁగాఁ (మీమాంశించు) జర్చించు శాస్త్రము.

## ఆశ్వాసాంతము

మ. ఫణిశుంభద్భుజసార ! సారసముఖీ పంచాయుధాకార ! కా
రణ సంతత్యవతార ! తారగిరి ధైర్యస్థేమ దుర్వార ! వా
రణ సమ్రాడ్బలభార ! భారవిశవిప్రౌఢోక్తిసంచార ! చా
రణ సంస్తుత్యవిహార ! హారహార విభ్రాజద్యశోవైభవా ! ౧౭౪

కం. భూమి సుమనోఽమరద్రుమ !
వామాప్రద్యుమ్న ! భానువంశోద్భవ ! పౌ
లోమీవిభు శుభవైభవ !
భీమోపమ ! భీమభీమ పృథుదోర్విభవా ! ౧౭౫

## పంచ చామరము

ఘనాఘనాఘనాశనాధిక ప్రగానరంజనా !
జనావనాది నాగతల్పస త్కవిప్రసాధనా !
ధనాధినాథ నందనాబ్జ దర్పకాంగవాసనా !
సనాతనాధునాతనాతి శౌర్యధుర్య లంఘనా ! ౧౭౬

## గద్యము

ఇది శ్రీ హనుమత్ప్రసాదలబ్ధ కవితాసార, సారస్వతాలంకార, నిరంకుశ
ప్రతిభాబంధుర, ప్రబంధపఠన రచనాధురంధర, ప్రబంధాంక వేంకట
రాయ భూషణసుపుత్త్ర, తిమ్మరాజపౌత్ర, సకల భాషావిశేష
నిరుపమావధాన శారదామూర్తి మూర్తిప్రణీతంబైన కావ్యా
లంకార సంగ్రహం బను మహా ప్రబంధంబునందు
సర్వరస సాధారణనాయక వర్ణనంబును, శృంగార
నాయికాఖ్యానంబును, రీతి వృత్తి ప్రశంసయుఁ
బాకశయ్యా ప్రశంసనంబును, గావ్యభేద
ప్రకరణంబును, మహాకావ్యప్రకటనంబు
ఁ క్షుద్రప్రబంధ మార్గదర్శనంబునన్నది
ద్వి తీ యా శ్వా స ము.

---

# కావ్యాలంకార సంగ్రహము

## తృతీయాశ్వాసము

కం. శ్రీరమణ చరణసేవా
పారాయణ! యుభయవంశపావన! లక్ష్మీ
కారచితభాగధేయ! య
పారకృపారసిక! యోబపార్థివు నరసా! ౧

గీ. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల
నవఘ భవదీయ నామధేయాంకితముగ
బహువిభక్తుల నొనరింతుఁ బద్యవితతి
నిచ్చటఁ బ్రబంధజీవితం బెట్లటన్న. ౨

లక్ష్మ లక్ష్యములు = లక్షణ లక్ష్యములు ; బహువిభక్తులు = పెక్కు విభాగములు.

గీ. మహిత కవితావిలాసినీ మధురతరవి
లాస విన్యాసముల లీల వాసికెక్క

నవరసంబుల నెఱిఁగింతు నవరసార్థ
గుంభగంభీరతరవచోజృంభణముల. ౩

తా. కావ్యకాంతయొక్క యందచందములు స్ఫుటమగుటకై దానికి జీవిత భూతమగు రసముయొక్క నవవిధములు అనఁగా నవరసముల నెఱిఁగింతును.

కం. పులకండంబులు గలిపిన
నలువగు సలిలము రసాయనంబగు పగిదిన్
లలితవిభావాదులచే
నలఘుతరస్థాయిభావమమరుఁ రసమై. ౪

తా. కండచక్కెర కలుపఁగా జలము పానకమగు విధమున విభావ, అను భావ, సంచారి భావములచేఁ బరిపుష్టమై యధికముగా నాస్వాద్యమైన స్థాయి భావము రసము. జలము తనజలరూపముతో నున్నపుడెక్కువగా నాస్వాద్యముగా నుండదు. అట్లేసహృదయుల హృదయమున వాసనారూపముననున్న స్థాయిభావము గూడ నాస్వాద్యముగా నుండదు. కాని యాజలము కండచక్కెఱ, ఏలకులు, మిరియపుపొడి, మొదలగువానియొక్క కలయికచేఁ బానకరూపమును బొంది కడుంగడు నాస్వాద్యమానమగుచున్నది. అట్లే యాసహృదయుల స్థాయియు విభావ,అనుభావ, సంచారిభావములచేఁ బరిపుష్టమై మిక్కిలియు నాస్వాద్యమగుచున్నది. కాఁబట్టి సహృదయులహృదయమున నున్న స్థాయియే రసమగుచున్నది. దశరూపకమున నిదే విధముగాఁ గలదు.

విభావైరనుభావైశ్చసాత్త్వికైర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః

విభావానుభావ వ్యభిచారి భావములచే నాస్వాద్యమానమగు స్థాయిభావము రసము; అనియభిప్రాయము.

గీ. గరిమనదులెన్ని గలసినఁ గప్పుకొనుచు
జలధి గనుపట్టురీతి, సంచారిభావ
సంచయములెన్ని గలిసినఁ మించనీక
తాన కనుపట్టుభావంబు స్థాయిదలఁప. ౫

స్థాయియన స్థిరముగా నిలుచునది. ఎన్ని యాఘాతములు వచ్చినను జలింపక నుస్థిరముగా నుండు స్థాయిభావము. ... మధురజలము

లగునవు లెన్ని గలిసినను వానితియ్యఁ దనమును మించనీక తనక్షారత్వమును స్థిరముగా నిలుపువిధమునఁ దనలో నెన్ని సంచారిభావములు (విరుద్ధములు గాని యవిరుద్ధ ములుగాని) గలిసినను వానిని మించనీక తానే స్థిరముగా నిలుచుభావము స్థాయి భావము.

ఇటస్థాయి యనఁదేలినది. భావమన నేమి? యన్నచో వినుఁడు. "వికారో మానసోభావః" (మనోవికారమే భావము) దీనినే మరికొంత వివరింతుము. "నిర్వి కారాత్మకేచిత్తే భావః ప్రథమవిక్రియా" (ఎట్టివికారములును లేనిచిత్తమున మొదటి వికారము భావమనఁబడును.) 'భావయతిజ్ఞాపయితిహృదయగత మితిభావః' (హృద యగతమును దెలుపునది) అనియు వ్యుత్పత్త్యర్థముగలదు. కావున స్థాయిభావ మనఁ జిరస్థాయి యనఁగాఁ జిరకాలము దాఁకననఁగా రసస్ఫూర్తి వఱకును సహృదయ హృదయముల నుండుభావము. ఈస్థాయిభావాదులగు రత్యాదు లనుకూలములగు సంచారిభావములచే నొకతూరి యావిర్భావమును (ప్రకాశము) మరొకతూరి ప్రతికూల సంచారులచేఁ దిరోభావమును(అప్రకాశమును)బొందుచున్నను సంస్కార రూపమున రసస్ఫూర్తివఱకును నిలుచును. ఇదియే యభిప్రాయము నీక్రింది శ్లోకము తెలుపుచున్నది.

> చిరం చిత్తేఽవతిష్ఠంతే సంబద్ధ్యంతేఽనుబంధిభిః।
> రసత్వం యే ప్రపద్యంతే ప్రసిద్ధాః స్థాయినోఽత్ర తే.।

చిరకాలముదాఁక సహృదయుల చిత్తమున నిలుచునవియు విభావాదుల సంబంధము గలవియు ననఁగా వానివలన వ్యక్తము సేయఁబడినవియు రసత్వమును బొందునవియు నగునవి స్థాయిభావములు.

ఇటఁ బద్యములో "సంచారిభావసంచయము లెన్నిగలిసిన" అనునది పొర పాటు. ఏలన, దశరూపకమున

> సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్
> యావద్రసం వర్తమానః స్థాయీభావ ఉదాహృతః.

సజాతీయ విజాతీయ భావములచే భంగపడక రసస్ఫూర్తి పర్యంతము సహృదయహృదయముల నిలుచునది స్థాయిభావమని తెలుపఁబడినది. సజాతీయ విజాతీయభావము లనఁగాఁ బ్రతాపరుద్రీయ వ్యాఖ్యాత "కస్యాం చిన్నాయికాయా మనురాగస్య నాయికాంతర విషయానురాగః సజాతీయః । తత్ర బీభత్సాది ర్విజాతీయః ।" అని వ్యాఖ్యానించెను. అనఁగా నొక నాయికయందున్న రతికి మరొక నాయికారతి సజాతీయము. రతికి విరుద్ధములగు బీభత్సాదులు విజాతీయ

ములు” కావున సజాతీయములయిన విజాతీయములయిన స్థాయిభావములచే నుప మర్దితముగాక తుదిదాఁక రసస్ఫూర్తి కలుగువఱకు నిలుచునది స్థాయిభావము. కాఁబట్టి “సంచారిభావసంచయము లెన్నిగలిసిన మించనీక” అనరాదు. స్థాయిభావములకును స్థాయిభావములకే సజాతీయత్వ విజాతీయత్వములు గాని సంచారి (వ్యభిచారి) భావములకును స్థాయిభావములకును గాదు. ఈ రత్యాది స్థాయిభావములు గూడ నొకప్పుడు సంచారిభావములు గావచ్చును. ఎట్లన,

> రత్యాదయః స్థాయిభావా స్స్యుర్భూయిష్ఠ విభావజాః
> స్తోకై ర్విభావై రుత్పన్నాస్త ఏవవ్యభిచారిణః

అధిక విభావములవలన వ్యక్తములయిన రత్యాదులు స్థాయిభావములు. అల్ప విభావములవలన వ్యక్తములయిన రత్యాదులు వ్యభిచారులు. మరియు

> యథా నరాణాం నృపతిః శిష్యాణాంచ యథా గురుః
> ఏవం హి సర్వభావానాం భావః స్థాయీ మహానిహ.

ఎల్లరును సమానావస్థగలవారయ్యుఁ గులవిద్యా [illegible] లచేఁ గొందఱు రాజులగుదురు. కొందఱు అనుచరులగుదురు. అదేవిధముగా విభా[illegible] ప్రకర్షమున నొకభావము స్థాయిత్వమును బొందును. విభావాద్యపకర్షమున నస్థాయిత్వమును బొందును. అస్థాయిత్వమన వ్యభిచారిత్వమే కదా! అనియుఁగలదు.

స్థాయిభావము రసమగునని చెప్పితిమికదా! ఇట ముందు రసపదమును గూర్చి చర్చింతము (చూ:'The Theories of Rasa and Dhvani' ౨వ పుట)

రసపదము మొట్టమొదట ఋగ్వేదమునఁ గానఁబడుచున్నది. ఆ పదమా కాలమున వ్యవహరింపఁబడు కావ్యరసపరముగాఁ గాక భిన్నార్థమునవ్యవహృతమై యున్నది. అచ్చటలంత సోమరసము, జలము, క్షీరము, సారము, అనునర్థములందు భిన్నభిన్న మండలములలోఁ గానవచ్చుచున్నది. అథర్వ వేదమునందుఁ బై యర్థము లందు వ్యవహారము గానరాదు. కాని 'రుచి' అనునర్థమున స[illegible]గా గానఁబడును. ఉపనిషత్కాలమున “ప్రధానసా[illegible]ము” అనునర్థము వచ్చి[illegible] చా[illegible] గ్యోపనిషత్తులో రుచి, ప్రధానసారము అనురెండర్థములు [illegible] భిన్నభి[illegible] స్థ[illegible] లందుఁ గలవు. తైత్తిరీయోపనిషత్తులో “రసో వై సః” 'రసగ్ హ్యే[illegible] ఉ[illegible]యం లబ్ధ్వానందీ భవతి' అనియు, మైత్రేయోపనిషత్తులో “తద్వై సత్యస్యరూపం; తత్సత్యమేవే రితం రసః; ససంప్రాస్రవత్” అనియునుగలదు. వీనిలోని 'రస' పదములకు నీ యుభయార్థమును (రుచి, ప్రధానసారము) నిర్వచింపవచ్చును. ప్రధానసార

భూతమేదిగలదో, యేదియోగులు ధ్యానముగఁ దలఁతురో దేనిని సాక్షాత్కరించు
కొని శాశ్వతానంద మనుభవింతురో యాపరమాత్మయే యారసపదమునకర్థము.
ఆలంకారికులిట్టి యుభయార్థముగల రసపదమునుగ్రహించి దీనినిఁగావ్యమున వ్యవ
హరించిరి. కావుననే కావ్యానందము బ్రహ్మానందసహోదరమనియునుడివిరి.

లోకమున శకుంతలా దుష్యంతాదు లనుభవించిన రసమును దద్రసమునకుఁ
గారణముగాని సామాజికుఁ డెట్లనుభవించి యానందించుచున్నాఁడు? అని ప్రశ్నించు
కొని భరతుఁ డీ క్రింది సూత్రమును జెప్పుచున్నాఁడు.

## రసచర్చ

"విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" అని భరతుని రస
సూత్రము. విభావానుభావవ్యభిచారులయొక్క సంయోగమువలన రసము నిష్పన్నమగు
ననియర్థము. పైపద్యములో "లలితవిభావాదులచే, నలఘుతరస్థాయి భావసమరుక్షా
రసమై" అనునదెంత యస్పష్టముగానున్నదో యావివరణమును నంత యస్పష్టముగా
నేయున్నది. సంయోగ, నిష్పత్తి పదముల కర్థభేదమును గల్పించి భట్టలోల్లట,
శ్రీశంకుక, భట్టనాయక, అభినవగుప్తులను నలువురు పండితులు నాలుగు విధముల
వ్యాఖ్యానించిరి.

## భట్టలోల్లటమతము

ఆలంబన విభావములయిన సీతాదులచే, నుద్దీపన విభావములయిన యుద్యా
నాదులచే, రామాదులందు రత్యాదిస్థాయి భావము జనించును. అది కటా
క్షాద్యనుభావములచే గమ్యమాన మగును. అనఁగా స్పష్టముగా గోచరించును.
పిమ్మట నిర్వేదాది వ్యభిచారులచేఁ బుష్టమగును. అట్టి స్థాయిభావము రస
మగును. ఆరస మీవిధముగా ముఖ్యముగా రామాద్యనుకార్యనిష్ఠము. అనఁగా
మొదట రామాదులందుండును. అనుకార్యమన ననుకరింపఁదగిన రామాదిపాత్ర విశే
షములు. (నటులుగారు). రసము ముఖ్యముగా రామాది నాయకనిష్ఠమే. అయినను
సర్పము లేకున్నను సర్పాకారముగాఁ గనఁబడు రజ్జువువలనను జూపఱకు భీతి పుట్టు
నట్లు రామాదినాయకరూపము ధరించు నటునియందు సీతాదివిషయకరత్యాదులు
లేకున్నను నాట్యనైపుణ్యమున నున్నట్లు భాసిల్లును. వానిని సందర్శించు సామాజికుని
యందు రత్యాదులు స్ఫురించును. దాన నాతనికిఁ జమత్కారముగలిగి యాతఁ
డానందించును. అనఁగా రసము ప్రధానముగా ననుకార్యములగు రామాదులందే

(నాయకులందే) యుండును. అది రామాది పాత్రముల ధరించు నటునియందు లేకున్నను నున్నట్లు భాసిల్లును. సామాజికుఁడా నటునిఁ జూచుటవలన నాతని హృదయమందు రామాది నాయకనిష్ఠమగురసము స్ఫురించును. దానఁ జమత్కారము గలిగి యానందించును.

ఈ మతమున రసము నాయకనిష్ఠము. అది యుత్పాద్యము లేక జన్యము లేక కార్యము (పుట్టునది). విభావము లుత్పాదకములు, (జనకములు లేక కారకములు) అనుభావములు గమకములు. సంచారిభావములు పోషకములు. అనఁగా విభావము లగు సీతాదులవలన రామాదులందు రసము పుట్టును. అనుభావములచే గమ్యమాన మగును. (ఊహింపఁబడును) సంచారులచేఁ బుష్టమగును. నటుఁడా విభావ, అను భావ, వ్యభిచారిభావముల నటించుటచే నాతనియందుఁగూడ రసమున్నట్లు కనఁ బడును. ఆ నాట్యమునుగాంచు సహృదయుని హృదయమున నా రామాది నాయక నిష్ఠమగు రసము స్ఫురించును అని నిష్కృష్టార్థము.

ఈ మతమున సంయోగపదమునకు ఉత్పాద్య, ఉత్పాదకభావము, గమ్యగమక భావము, పోష్యపోషకభావము అని మూఁడర్థములు. నిష్పత్తిపదమునకు ఉత్పత్తి, అభివ్యక్తి, పుష్టి, యని మూఁడర్థములు. దీని కుత్పత్తివాదమని పేరు.

'విభావానుభావ వ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః' అనఁగా నుత్పాదకము లగు విభావములచే రత్యాది స్థాయిభావ ముత్పాద్యమై గమకములయిన యనుభావ ములచే గమ్యమై, పోషకములయిన వ్యభిచారులచేఁ బుష్టమై రసమగును.

ఇందలి దోష మిది :— లౌకికరస మనుకార్య (నాయక) నిష్ఠమే. అట్టిచో సామాజికునికిఁ జమత్కార మెట్లు గలుగును ? రసము రామాదులకు సంబంధించినది కావున వారికే యానందము గలుగవలెను ! తత్సంబంధములేని సామాజికుని కట్లు గలుగును ? ఇట సామాజికుఁడా రస మెట్లనుభవించునో చక్కగా నిరూపింపఁ బడలేదు.

## శ్రీశంకుక మతము

భట్టలోల్లటమతమున రసమును కార్యనిష్ఠమని నొడివితిమిగదా ! శ్రీశంకుకుని మతమున ననుకర్తృనిష్ఠము. అనుకర్త యనఁగా రామాదిపాత్రములనటించు నటుఁడు. ఆరసము నటునియందుండును. దానిని సామాజికుఁ డెట్లనుభవించుచున్నాఁడో యతఁడు తెలుపుచున్నాఁడు.

నటుఁ డభినయించు విభావానుభావ వ్యభిచారులయొక్క సంయోగమువలన ననఁగా గమ్యగమకభావమువలన, ననఁగా "విభావాదు లెచ్చటనుండునో యచ్చట తప్పక రత్యాదులుండును" అను తార్కికవ్యాప్తివలన (ఎచ్చట ధూమముండునో యచ్చట నగ్నియుండును. ఎచ్చటధూమములేదో యచ్చట నగ్నిలేదు. అనునదివ్యాప్తి యని తార్కికులు వ్యవహరింతురు. ఈపదము పారిభాషికము) సామాజికుఁడు నటునియందు రత్యాదుల ననుమానించుచున్నాఁడు. ఎట్లన "ఈ రాముఁడుగా గ్రహింపఁబడిన నటునియందు రత్యాదులు గలవు. కాన వీనియందు రసమున్నది. రసము లేకున్నచో రత్యాదులుండవు" అను వ్యాప్తిమూలమున నటుని యందురత్యాదులను సామాజికుఁ డనుమానించుచున్నాఁడు. కాని యీయనుమానము పైధూమాగ్న్యనుమానమువలె నీరసముగాక వస్తుసౌందర్యబలమువలన ననఁగా నటగతవేష భాషానాట్యాది నైపుణ్యమువలన సుందరముగా భాసిల్లును. ఆ నటగతరత్యాది స్థాయిభావమే సామాజికుఁ డనుభవించి యానందించుచున్నాఁడు. రసము నట నిష్ఠమే. పైవ్యాప్తిమూలమున నే సామాజికుఁ డనుభవించును.

ఈమతమున సంయోగపదమునకు గమ్యగమకభావము లేక జ్ఞాప్యజ్ఞాపక భావము, అని యర్థము. 'నిష్పత్తి' పదమున కనుమితి లేక జ్ఞప్తి యని యర్థము. దీని కనుమితివాదమని పేరు.

జ్ఞాపకములయిన విభావానుభావ వ్యభిచారులవలన జ్ఞాప్యమైన స్థాయి భావమురసమగును.

ఇందలిదోష మిది:—ప్రత్యక్షజ్ఞానమే చమత్కారజనకము. అనుమానజ్ఞానము గాదు. మరియు సామాజికునకుఁ బైనుదాహృతమగు వ్యాప్తిజ్ఞానములేకున్నను రసాస్వాదము గలుగుచున్నది. 'రసం సాక్షాత్కరోమి' (రసమును బ్రత్యక్షముగా ననుభవించుచున్నాను) అనువచనము లోకమునఁ గలదు. రసమును బ్రత్యక్షముగా ననుభవించుచున్నట్లు సహృదయప్రమాణముండఁగా ననుమానజ్ఞానముచే రసమను భవించుచున్నా ననుట యనుభవవిరుద్ధము.

## భట్టనాయక మతము

భట్టలోల్లటమతమున రసమనుకార్యనిష్ఠము. శ్రీశంకుకునిమతమున ననుకర్తృ నిష్ఠము. భట్టనాయక మతమున సామాజిక నిష్ఠము.

ఈతని సిద్ధాంత మిది:—కావ్యరస మనుకార్యనిష్ఠమును గాదు. అనుకర్తృని ష్ఠమును గాదు. అట్లగుచో సామాజికునికి రసాస్వాదము గలుగదు. మరియు రసము

సామాజికనిష్ఠమందమా ? అన్నచో విభావాదులవలనఁగదా రసముపుట్టునని రస సూత్రము దెలుపుచున్నది. సీతాదులు సామాజికులకు విభావాదులుగారు గదా ! విభావాదులులేకుండ రస మెట్లు కలుగును ? కారణము లేకయే కార్యము గలుగదు గదా ! అను శంకవచ్చుచున్నది. దీనికి సమాధాన మిది:—

రసము లౌకికమనియు నలౌకికమనియు నిరుదెఱగులు. లౌకికములగు శృంగారాది రసములు లౌకికనాయకాశ్రితములు. కావ్యగతనాయకులు లౌకికులుగారు. వారలౌకికులు. తదాశ్రితమగు రస మలౌకికము. ఈయలౌకికరస మలౌకికనాయకాశ్రితమైనను నాస్వాదించువారుసామాజికులు. ఈయభిప్రాయముతోడనే రసము సామాజికనిష్ఠమని చెప్పఁబడుచున్నది. ఈయలౌకికరసమును సామాజికుఁ డెట్లాస్వాదించు? నన శబ్దమునకు అభిధావ్యాపారము, భావకత్వవ్యాపారము, భోజకత్వవ్యాపారము లేక భోగకృత్త్వవ్యాపారము అను మూఁడు వ్యాపారములు గలవు. అభిధావ్యాపారము శబ్దముయొక్క వాచ్యార్థమును మాత్రమే బోధించును. భావకత్వవ్యాపారము శబ్దముయొక్క రసాదులను బోధించును. భోజకత్వవ్యాపార మా రసాదులను సహృదయునిచే భోగింపఁజేయును. "అభిధా, భావనా చైవ, తద్భోగీకృతిరేవ చ" అని సిద్ధాంతము. అందు మొదటిదగు నభిధావ్యాపారము ముగియఁగానే భావకత్వవ్యాపార ముత్థితమగుచున్నది. అది విభావాదులను సాధారణముగాఁ జేయును. దీనినే సాధారణీకరణమందురు. అనఁగా రామత్వ సీతాత్వాదులు పోయి సాధారణ నాయక నాయికాత్వాదులు మాత్రమే సామాజికునికి గోచరించును. ఇట్లు ప్రత్యేకరూపము పోయి సామాన్యరూపముగా భాసిల్లుట భావకత్వవ్యాపారమహిమ వలననే. ఈ సాధారణీకరణమువలననే సామాజికునకు నాయకునితో నభేదము గలుగును. దీని పని ముగిసినపిమ్మట భోజకత్వవ్యాపారము పనిసేయును. భావకత్వవ్యాపారముచే సాధారణరూపమును బొందిన రత్యాదు లీ వ్యాపారముచే సామాజికునిచే భుజ్యమానములగును. అనఁగా ననుభవింపఁబడును. అది యెట్లన, నాభోజకత్వవ్యాపారముచే సామాజికుల రజస్తమోగుణము లడఁగును. సత్త్వగుణమతిశయించును. దానిచేఁ బ్రాపంచిక జ్ఞానశూన్యమైన స్వస్వరూపానందముతో సంవలితములైన రత్యాదులు భాసిల్లును. ఈ యానందము గలిగినపుడు చిత్తమునకు ద్రుతి, విస్తార, వికాసము లను ధర్మములు గలుగును.

ఈ మతమున సంయోగపదమునకు భావకత్వమని యర్థము. నిష్పత్తియనఁగా భుక్తి లేక యాస్వాదము అని యర్థము. ఇందు విభావాదులు భోజకములు (భోగమును గలిగించునవి) రసము భోజ్యము. దీనికి భుక్తివాదమని పేరు.

ఇందలిదోష మిది :— శబ్దమునకు భావకత్వ భోజకత్వ వ్యాపారములు రెండును గల్పితములు. ఇవి ప్రామాణిక సమ్మతములుగావు. భావకత్వవ్యాపారముచే విభావాదులు సాధారణీకృతములయినను సామాజికునియందుఁ బ్రిప్రిథమమున బీజరూపముగానైన రత్యాదులులేనిచో నెట్లనుభవింపఁబడును? నాయకాభేద మెట్లు గలుగును? ఈరెండు దోషములును నీమతమున గలవు.

## అభినవగుప్తపాద మతము.

లోకములో సహృదయుఁడు రతిశోకాదులననుభవించుచున్నాఁడు. ఆయను భవమువలన నాతనిహృదయమున నొక సంస్కారముత్పన్నమగును. దానిని 'వాసన' యందురు. దీనిని వేదాంతులును నంగీకరించిరి. ఇది రసాస్వాదమునకు ముఖ్యసాధనము. ఇదిలేకున్న రసాస్వాదముగలుగదు. కావుననే మీమాంసకులకును వైయాకరణులకును రసాస్వాదము గలుగదని యానంద వర్ధనా చార్యులవా రన్నారు. కావున నీతని మతమున 'వాసన' ప్రధానకారణము. ఈయభిప్రాయముననే తెలుపు ధర్మదత్తుని శ్లోకమును సాహిత్యదర్పణకారుఁ డుదాహరించెను.

> సవాసనానాం సభ్యానాం రసస్యాఽఽస్వాదనం భవేత్
> నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠకుడ్యాశ్మ సన్నిభాః

"వాసనా సహితులగు సభ్యులకే రసాస్వాదము గలుగును. వాసనలేనివారు నాటకాదులు చూచుచున్నను రసాస్వాదనమును జేయఁజాలక రంగమందున్న స్తంభములు, గోడలు, రాళ్ళునువలె నుందురు."

భట్టనాయకమతమం దీవాసనాప్రసంగములేదు. ఆతఁడుదీని నంగీకరింపలేదు. ఈమతమున నదిలేకున్న రసాస్వాదము గలుగదు. దీనినే యభివ్యక్తి వాదమందురు. అభివ్యక్తి యనఁగా నున్నదానిని వెలువఱచుట. సహృదయుని హృదయమున వాసనారూపముగా నున్నరత్యాది స్థాయిభావములను విభావాదులు వ్యక్తము నేయును. ఆవ్యక్తములయిన స్థాయిభావమే రసమగును.

ఈతని సిద్ధాంతమిది:—లోకములో రత్యాదులకు శకుంతలా దుష్యంతాదులాలంబన కారణములు. మలయానిల చంద్రికాదులుద్దీపన కారణములు. అశ్రుపాతాదులు కార్యములు. చింతాదులు సహకారులు.*ఇవియే కావ్యపరిభాషలోఁగారణ

* భట్టలోల్లటుఁడు లౌకిక రత్యాదులకుఁ గారణములగు వానినిఁగూడ విభావాదులనియే వ్యవహరించెను. అభినవగుప్తుఁడు లౌకికములు గారణములనియు నలౌకికములు (కావ్యగతములు) విభావములనియు వ్యవహరించెను. ఈభేదమును గమనింపవలెను.

కార్య సహకారి నామములను విడిచి విభావ, అనుభావ, వ్యభిచారినామములను వహించును. అనఁగా గావ్యము నందలినాయికా నాయకులగు శకుంతలా దుష్యం తాదులాలంబన విభావములు. మలయానిల చంద్రికాదు లుద్దీపన విభావములు. అశ్రుపాతాదులనుభావములు. చింతాదులు వ్యభిచారి భావములు. అనివ్యవహారము.

విభావమనఁగా విభావన వ్యాపార యుక్తము. విభావనమన సామాజికుల హృదయమందు వాసనారూపముగా నున్న రత్యాదుల నాస్వాదయోగ్యములఁగాఁ జేయు వ్యాపారము. నాయికా నాయకులేకదా! ప్రప్రథమమున సహృదయుని రత్యాదు లుద్బుద్ధములుగాఁజేయువారు. కావున నీ వ్యాపారము విభావనము. అది గలది విభావము. ఆ వాసనారూప రత్యాదుల ననుభవింపఁజేయుట యనుభావనము. అది గలది యనుభావము. కావ్యమునందు రత్యాదులను విశేషముగా నంతటను సంచరింపఁజేయుట (ప్రసరింపఁజేయుట) వ్యభిచారణము. అది గలది వ్యభిచారి భావము. సంచారిభావమునకే వ్యభిచారిభావమనియు నామాంతరము.

సహృదయుఁడనఁగా సమానమైన (కవి, నాయకులయొక్క హృదయముతో సమానమైన) హృదయముగలవాఁడని యర్థము. అభినవగుప్తపాదులవారు తమ ధ్వన్యాలోకలోచనమున 'సహృదయ' పదమున కిట్లు నిర్వచనము సేసిరి.

"యేషాం కావ్యానుశీలన వశాత్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవనయోగ్యతా తే హృదయసంవాదభాజః సహృదయాః" అనఁగా దృశ్య శ్రవ్యకావ్యములనుబరిశీలించుటవలన హృదయముబాహ్యవిషయజ్ఞానమునుండిముక్తమై శుద్ధమగు నద్దమువలె భాసిల్లును. అప్పుడా కావ్యమున వర్ణితములయిన విభావాదులు నూటిగాఁ నందుఁ బ్రతిఫలించును. వానితో నప్పుడాసహృదయునకుఁ గావ్యగత నాయకాదులతోఁ దన్మయత్వము (అభేదప్రతిపత్తి) గలుగును. అట్టివారేసహృదయులు.

భట్టతౌతుఁడు తన కావ్యకౌతుకమున నీ క్రింది సిద్ధాంతమును దెలిపినట్లు కాణేపండితుఁడు తెలిపెను. "Another doctrine that he held was that the poet, the hero, (of a poem) and the (Sympathetic) reader pass through the same experience." "నాయకస్య కవేః శ్రోతుః సమానోఽనుభవ స్తతః" దీనినిఁబట్టికవినాయకులహృదయములతోసమానానుభవముగలవాఁడేసహృదయుఁడు.

భావప్రకాశమున సహృదయ లక్షణమిట్లు చెప్పబడినది:—

యస్తుష్టే తుష్టి మాప్నోతి శోకే శోక ముపైతిచ
క్రోధే క్రుద్ధో భయే భీరు స్సశ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః

ఎవఁడు నాయకుని తుష్టియందుఁ దాను దుష్టినందునో శోకమునందు శోకమునుజెందునో క్రోధమునఁ గ్రుద్ధుఁడగునో భయమున భయపడునో వాఁడు శ్రేష్ఠుఁడగు ప్రేక్షకుఁడు. అనఁగా సహృదయుఁడు.

కావ్యమునం దీ విభావాదులను గాంచఁగానే సహృదయుని సత్త్వగుణ ముద్రిక్తమగును. సత్త్వగుణమనఁగా రజస్తమోగుణముల స్పర్శయు లేని యాంతరమగు ధర్మము. దాని యుద్రేకమువలన వాని హృదయమందు వాసనారూపముగా నున్న రత్యాదు లుద్బుద్ధము లగును. అనఁగా విభావానుభావ వ్యభిచారులే సహృదయునిలో వాసనారూపమున నున్న రత్యాదుల నభివ్యక్తము సేయును. తిరిగి తిరిగి భావించుకొనుచుంటచే నా విభావాదులు సాధారణము లగును.

అనఁగా నాభావనలో నచ్చటి శకుంతలాదుల శకుంతలాత్వాదులడఁగి సాధారణ కాంతలుగా గోచరింతురు. సహృదయుని పరిమితత్వ మడఁగును. అనఁగాఁ దాను ఫలానావాఁడనను జ్ఞానము దొలఁగిపోవును. తన్నుఁ దాను మఱచును. ప్రపంచమును మఱచును. ఆరత్యాదులను దానే యనుభవించుచున్నట్లుగానీ యితరులనుభవించుచున్నట్లుగానీ యనుకొనఁడు. అనిర్వచనీయమగు నానందమును బొందును. ఇట్టిస్థితియంతయును విభావాదుల భావనాబలమువలననే కలుగును.

ఈభావనకే సాధారణీకరణమని నామాంతరము. ఇది శబ్దగతవ్యాపారమనియు, నభిధావ్యాపారము ముగిసినపిమ్మట నిది పనిసేయుననియు భట్టనాయకుఁడనెను. అభినవగుప్తుఁ డీవ్యాపారము విభావాదులదే యనెను. భరతుఁడు "తాఏవ పరిహృతవిశేషా రసహేతవః" (నాయికానాయకులు తమ తమ విశేషధర్మమును బోఁగొట్టుకొని సామాన్యాకారముగా గోచరించి రసహేతువు లగుదురు) అనియు, విశ్వనాథుఁడు 'వ్యాపారోఽస్తి విభావాదేర్నామ్నా సాధారణీకృతిః' (విభావాదులకు సాధారణీకరణమను వ్యాపారముగలదు) అనియును దెలిపిరి. కావుననే భట్టనాయకుఁడు దెలిపినభావకత్వవ్యాపారమప్రామాణికమని దూషింపఁబడెను. ఈసాధారణీకరణముచేత సామాజికుఁడు నాయకునితో నభేదమును బొందును. నాయకాభేదమును బొందినపుడే వానికి రసానుభవము గలుగును 'తాఏవ పరిహృతవిశేషా రసహేతవః' అను భరతముని వాక్యమున కిదియే భావము.

ఎంతకాలము సహృదయుఁడు విభావాదుల ననుసంధించుకొని చర్వణము సేయునో యంతకాల మాతఁ డట్లే యానందించును. ఆచర్వణము ముగియఁగానే యాయానందమును ముగియును. ఈయానందమునకు రసానందమని పేరు. ఇది విభావాది జీవితావధికము. ఈరసానందము బ్రహ్మానంద సహోదరము. బ్రహ్మానందము

కేవలానందము. ఈరసానందము విభావాదియుక్తము. కావున నిది బ్రహ్మానంద సహోదరము. బ్రహ్మానందమున నేమో యిదివఱకుఁ దెలుపఁబడినది.

ఆత్మ యానందస్వరూపము. దాని నజ్ఞాన మావరించియుండును. ఆ యజ్ఞానము దొలఁగినచో యానందము స్వస్వరూపములో భాసిల్లును. కావ్యమున విభావాదు లాయజ్ఞానావరణమును దొలఁగించును. అపుడు దన్నంటిపట్టికొన్న రత్యాది వాసనలతో సాత్మానందము భాసిల్లును. ఆ యానందములో సంవలితమైన రత్యాదులకు రసములని పేరు.

జగన్నాథుఁ డిచ్చట స్థాయిభావముతోఁ గూడిన యానందము రసమా? లేక యానందవిశిష్టమగు స్థాయిభావము రసమా? యని శంకించి 'రసో వై సః। రసగ్ హ్యేవాఽయం లబ్ధ్వానందీ భవతి' అను శ్రుతిస్వారస్యముచే స్థాయిభావముతోఁ గూడిన యానందమే రసమని సిద్ధాంతీకరించెను.

ఆ యానందానుభవము విచిత్రము. అదేమో! కన్నులయెదుట స్ఫురించుచున్నట్లు, హృదయమునఁ బ్రవేశించుచున్నట్లు, సర్వాంగములందును వ్యాపించుచున్నట్లు, బాహ్యప్రపంచమును గనఁబడకుండఁ జేయుచున్నట్లును నుండును.

మరియు నీరసమాస్వాదింపఁ బడునపుడు పానకరసమాస్వాదింపఁ బడుచున్నట్లుండును. పానకమునఁ జక్కెర, ఏలకులు, మిరియాలు, కర్పూరము, మొదలగునవి చేర్పఁబడుటవలన విలక్షణమైన రుచివచ్చును. కావ్యరసముగూడ విభావానుభావ వ్యభిచారుల సంయోగమువలనఁ గడంగడు విలక్షణమగు రుచి గలిగియుండును.

'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' అనుసూత్రస్థసంయోగ పదమునకు వ్యంగ్య వ్యంజక భావమనియు, నిష్పత్తిపదమున కభివ్యక్తి యనియు నభినవగుప్తునియర్థము. వ్యంజకములగు విభావానుభావసంచారులవలనస్థాయిభావము వ్యంగ్యమై రసమగును. అనిసూత్రార్థము. "పులకండంబులు గలిసిన" అనుపద్యమున నీ యభిప్రాయమే సూక్ష్మముగాఁ జెప్పఁబడియున్నది.

లోకమునందలి హర్షశోక కారణముల వలన హర్షశోకములే కలుగును. సురతకాలమునదంతక్షతాదులవలనను నానందమేకలుగువిధమునఁ గావ్యమున నన్నింటివలనను నానందమే కలుగును. కావుననే యీ యానంద మలౌకికమని చెప్పుదురు.

అనఁగా లౌకికములగు హర్షశోకాదులవలన నరులకు హర్షశోకాదులే కలుగును. కావ్యశిల్ప మలౌకికమగుటవలన ననఁగా కావ్యగత నాయకాదులు లౌకికులు గాక

పోవుటవలన (వారు లౌకిక నాయకాదుల యనుకర్తలు గాని లౌకికనాయకులే కారు గదా!) సామాజికునకున్నింటివలనను హర్షమే లేక యానందమే కలుగును.

ఈ విషయము సాహిత్యదర్పణమున నిట్లు గలదు.

హేతుత్వం శోకహర్షాదేర్గతేభ్యో లోకసంశ్రయాత్
శోకహర్షాదయో లోకే జాయంతాం నామ లౌకికాః
అలౌకిక విభావత్వం ప్రాప్తేభ్యః కావ్యసంశ్రయాత్
సుఖం సంజాయతే తేభ్యః సర్వేభ్యోఽపీతి కా క్షతిః

లౌకిక శోకహర్షాది కారణములవలన లోకమున శోకహర్షాదులే కలుగును. కానీ కావ్యమున నా కారణములే యలౌకిక విభావము లను పేర వ్యవహృతములై హర్షమునే కలిగించును. కావున Imitation begets pleasure (అనుకరణ మానంద మును గూర్చును) అను నాంగ్లోక్తియు సరిపడును. కావ్యనాయకాదులు లౌకికనాయ కానుకర్తలేకదా! అనుకరణములగుటచేతనే యెల్ల లలితకళలవలనను నానందమే కలుగును.

అట్లగుచో హరిశ్చంద్రాది నాటక దర్శనమువలన నేల యశ్రుపాతాదులు గలుగుచున్నవి? అనవచ్చును. అవి దుఃఖము వలనఁగాదు. దుఃఖమే కలుగుచో మనమా నాటకములు జూడఁబోవుదమా? ఎవఁడేని గావలెనని దుఃఖమును గొని తెచ్చుకొనునా? ఇఁకనేమి? మన హృదయము కరగి కన్నులవెంట నీరై వచ్చును. (అశ్రు పాతాదయ స్తద్వద్ద్రుతత్వాచ్చేతసోమతాః) ఇవి యానంద బాష్పములు. కావునఁ గావ్యమున శోకాదికారణముల వలనను నానందమే కలుగును.

ఆంగ్ల సాహిత్యగ్రంథములం దివ్విధమున సామాజికుఁ డెట్లు రసాస్వాదము చేయునో వర్ణింపఁబడలేదు. వారు "సామాజికుఁడు కావ్యగతపాత్రలతో sympathy చూపు"నందురు. ఆ sympathy పదమును 'సానుభూతి' యని యనువదించి వాడుదురు. మన యాలంకారికుల సిద్ధాంతమున sympathy కాదు. పాత్రలతో identity (తాదాత్మ్యము) అగును.

భరతుఁడు రూపకరసమునుగూర్చియే తెలుపుటచే నా రసము రూపకమున సామాజికులచే నెట్లాస్వాదింపఁబడునో తెలుపఁబడినది. ఆనందవర్ధనుఁ డీ రూపక రససిద్ధాంతమునే శ్రవ్యకావ్యమునకుఁగూడ నన్వయించుటచే శ్రవ్యకావ్యమున దృశ్య కావ్యమునందువలె నాయకాదులు ప్రత్యక్షముగాఁ గానరారుగదా! సామాజికుఁ డా నాయకాభేదమును బొంది యెట్లు రసాస్వాదము సేయును? అని శంక గలుగు చున్నది. ఇచ్చట వాక్యపదీయకారుఁడు భర్తృహరి యిట్లనెను.

శ్లో. శబ్దోపహిత రూపాంస్తాన్ బుద్ధే ర్విషయతాం గతాన్
ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే!

కావ్యమూలమున రూపమునుబడిసి బుద్ధికి విషయములైన, కంసాదులను బ్రత్యక్షములను వలె సాధనముగాఁదలంచును.

అనఁగా శ్రవ్యకావ్యమున వర్ణితములయిన కంసాదులు (నాయకులు) తత్తద్వర్ణనములచే రూపమును బొంది హృదయమునఁ బ్రవేశించి ప్రత్యక్షముగా గోచరింతురు. అప్పుడు సామాజికుఁడు తదభేదముతో రసాస్వాదము చేయును.

## రససిద్ధాంత సంగ్రహము.

లోకమున శకుంతలా దుష్యంతాది నాయకు లనుభవించిన రసమును ద్రష్టనమునకుఁ గారణముగాని సామాజికుఁడెట్లనుభవించును? అని ప్రశ్నించుకొని భట్టలోల్లటాదులు పైవిధమున సమాధానము నొసఁగిరి. దాని సంగ్రహమిది. భట్టలోల్లటుఁడు 'రసము దుష్యంతాది నాయకుఁడే యనుభవించును. వానినిఁగాంచి సామాజికుఁడు చమత్కారమునుబొంది యానందించును' అనెను. శ్రీశంకుకుఁడు 'అనుకర్త యనఁగా నటుఁడునటించిన విభావ, యనుభావాదులఁ గాంచి వ్యాప్తిజ్ఞానమూలమున సామాజికుఁడానందపడు'నని వచించెను. భట్టనాయకుఁడు 'సామాజికుఁడునాయకాభేదమును బొంది సాక్షాన్నాయక రసానుభవముఁ బొందున'ని నుడివెను. అభినవగుప్తుఁడు 'సామాజికుఁడు వాసనచేత నాయకాభేదమునుబొంది సాక్షాన్నాయక రసానుభవమును బొందునని తెలిపెను. భట్టలోల్లటుఁడును శ్రీశంకుకుఁడును సామాజికుఁడానందమును బొందుననిరి. భట్టనాయక, అభినవ గుప్తులు సామాజికుఁడు సాక్షాన్నాయకుఁడు పొందిన రసానుభవమునే సామాజికుఁడును బొందుననిరి. అభినవగుప్తుఁడు భట్టనాయక మతమునలేని వాసన నంగీకరించెను. ఇదియే భేదము. భట్టలోల్లట శ్రీ శంకుకుల మతమున సామాజికుఁడు సాక్షాన్నాయక రసానుభవమునే పొందుననుమాటలేదు. కేవలమానందపడునని మాత్రమే గలదు.

కం. ధర శృంగారము, హాస్యము,
కరుణయు, వీరము, భయానకము, భీభత్సం,
బురురౌద్ర, మద్భుతము, శాం
తరసంబును రసములనఁగఁ దనరుం గృతులన్. ౬

తా. శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, బీభత్స, రౌద్ర, అద్భుత, శాంతము లనునవి తొమ్మిది కావ్యరసములు.

ఇందుఁ 'గరుణ' అని యుండఁగూడదు. రసవాచకము కరుణము;(అకారాంత పుంలింగము) దయావాచకము కరుణ (ఆకారాంత స్త్రీలింగము.)

ఇందుదాహృతములయిన నవరసములలో శాంతము రసముగాదని కొందఱు; శృంగారమొక్కటే రసమని కొందఱు; కరుణమే రసమని యొకరు; అద్భుతమే రసమని యొకరు; తొమ్మిదియేకాదు; భక్తిగూడ రసమే యని యొకరు; వత్సలమను రసము గ్రాహ్యమని కొందఱు; ప్రేయోరసమనునది యున్నదని కొందఱు; వ్యభిచారిభావము లన్నియు రసములేయగునని యొకరు. ఒక్కటే రసము కాని యిన్నిరసములు లేనే లేవని మఱొకరు. ఇట్లు రసములనుగూర్చి పెద్ద కోలాహలము గలదు. దాని నిట సంగ్రహముగాఁ జూపుదును.

## శాంతరసము

భరతుఁడు నాట్యశాస్త్రమున నెనిమిది రసములను, వాని కెనిమిదింటికిని నెనిమిది స్థాయిభావములను మాత్రమే నిరూపించెను. వానిలో శాంతరసము పేర్కొనఁబడలేదు.

> శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
> బీభత్సాద్భుతసంజ్ఞౌ చే త్యష్టౌ నాట్యే రసాః స్మృతాః
> రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
> జుగుప్సా విస్మయశ్చేతి స్థాయి భావాః ప్రకీర్తితాః (నాట్యశాస్త్రము).

"నాట్యమున శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుతము లను నెనిమిది రసములు గలవు. వానికిఁ గ్రమముగా రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అను నెనిమిదియు స్థాయిభావములు."

ఇందు శాంతరస ప్రస్తావమును భరతుఁడు సేయలేదు. కానీ ప్రకృతము మన కుపలభ్యమానమగు నాట్యశాస్త్ర గ్రంథములలో శాంతరస ప్రస్తావము గలదు. ఇది భరతుని తర్వాత శాంతరసాభిమానులగు పండితులు తమ యభిప్రాయములను నాట్యశాస్త్రములోని కెక్కించినట్లు కానఁబడును. కొందఱు 'వాసుకి' యనునాతఁడు ప్రప్రథమమున శాంతరసమును స్థాపించెనందురు. కొందఱు 'కోహలుఁ' డనువాఁడు మఱొకఁడు శాంతరస సిద్ధాంతములను బలపఱచినట్లు చెప్పుదురు. కాని వాసుకి కోహలులయొక్క ప్రమాణవాక్యములు లభింపలేదు. పిమ్మట నీ శాంతరసమును గుఱించి విచారించి నిర్ధారించినవాఁడు భట్టోద్భటుఁడు. అతఁడు తన కావ్యాలంకార

సార సంగ్రహమునం దొమ్మిదిరసముల నుదాహరించెను. అతండు నాట్యశాస్త్రమున శ్లోక వ్యాఖ్యానమును వ్రాసినట్లు కానంబడును. అది మనకుం బ్రకృతకాలమున నుప లభ్యమానము గాదు. అతండే యీ శాంతమును రసమునుగా నంగీకరించి దానికి వలసిన స్థాయిభావాదులను నిర్ణయించి నాట్యశాస్త్రమునం బ్రవేశపెట్టెను.

అతని పాఠ మిది:—

> శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
> బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసాఃస్మృతాః
> రతిర్హాసశ్చ శోకశ్చక్రోధోత్సాహౌ భయం తథా
> జుగుప్సావిస్మయశమాః స్థాయిభావాః ప్రకీర్తితాః

ఈ శ్లోకములలో శాంతము రసముగాను, శమము దానిస్థాయిభావముగాను జేర్కొనంబడి యున్నది.

కొందఱు విమర్శకులు భరతుండు "అష్టౌరసాః" అనినొడువుటచే శాంతరస మును గూర్చి తెలుపలేదనియు నాతనికిది సమ్మతముగాదనియు వచింతురు. మఱియు భరతుం డెనిమిది రసములకును స్వర 'లయ' గుణ, అలంకార, వృత్తి, వృత్తముల నిరూపించెను. కాని శాంతమునకు నిరూపింపలేదు. కావున శాంతము రసముకాదు. అనిపలుకుదురు. ఇంతేకాక ధ్వన్యాలోకమున నానందవర్ధనుండు శాంతరసమును గూర్చి చర్చించుచుం దనవాదమున కవష్టంభకముగా భరతుని వాక్యములను జేర్కొ నక తన యుక్తులచేతనే సిద్ధాంతమొనర్చెను. భరత నాట్యశాస్త్రమున నిపుడుపలభ్య మానమగు శాంతరస వాక్యములాతనికి యథార్థములేయని తోంచినచో నాతండేల యావాక్యముల నుదాహరింపకుండును? అనియును వాదింతురు.

ఈవాదమును బట్టి భరతునికి శాంతరసము సమ్మతముగాదనియే తోంచును. కానీ యాతండు శాంతరసమును గుఱించి ఋజుమార్గమున (Directly) దెలుపక వక్రమార్గమున (Indirectly) దెలిపెను. ఎట్లన,

> "క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః
> దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం
> విశ్రాంతిజననం కాలే నాట్యమేతద్భవిష్యతి,
> బ్రహ్మర్షీణాంచ విజ్ఞేయం నాట్యం వృత్తాంతదర్శనం."

దుఃఖార్తులకు ధర్మముపదేశించుచు, శ్రమార్తులకు వినోదముంగలిగించుచు, శోకార్తులకర్థోపదేశము [illegible] తపస్వులకు [illegible]చు, నాయా

కాలములయందు నాట్యము విశ్రాంతికారణమగును. అని నిష్కృష్టార్థము. ఇందు "క్వచిచ్ఛమః" అనియుంటఁబట్టి యభినవ గుప్తుఁడు శాంతరసమును స్థాపించుఘట్టమున "మునినాఽప్యంగీక్రియతే క్వచిచ్ఛమ ఇతివదతా" (క్వచిచ్ఛమః అనిచెప్పుటచే మునియు నీశాంతమునంగీకరించెను.) అనివచించెను. మరియును భరతుఁడు.

"తుష్యంతి తరుణాః కామే విదగ్ధాస్సమయాశ్రితే
అర్థేష్వర్థరాశ్చైవ మోక్షేష్వథ విరాగిణః."

"విదగ్ధులగు తరుణులు సమయమునఁ గామమున (శృంగారమున) హర్షింతురు. అర్థపరులర్థములఁగాంచి సంతసింతురు. విరాగులు మోక్షవిషయమున సంతోషింతురు." అనియును నుడివెను. దీనినిఁబట్టి విరాగులు శాంతరసాస్వాదపరులని సారాంశము.

మరియును భరతుఁడు శాంతరసము నంగీకరింపకున్నచో నాట్యము త్రైలోక్యానుకరణమని యెట్లు చెప్పఁగలుగును?

"నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకం
లోకవృత్తానుకరణం నాట్యమేతన్మయాకృతం
....................................
సప్తద్వీపానుకరణం నాట్యేఽహ్యస్మిన్ ప్రతిష్ఠితం" (నాట్యశాస్త్రము)

అనికదా కలదు. ఇంతేకాక నాట్యాంగముకాని దేదియు లేదని యిట్లు తెలిపెను.

"నతత్ జ్ఞానం నతచ్ఛిల్పం నసా విద్యా నసా కళా
న స యోగో నతత్కర్మ నాట్యేఽస్మిన్ యన్నదృశ్యతే"

ఈ కారణములనుబట్టి భరతుఁడు ఋజుమార్గమున శాంతరసము నంగీకరింపకున్నను వక్రమార్గమున నంగీకరించెననుట స్పష్టము. భరతుఁ డేల ఋజుమార్గమునఁ దెలుపలేదో యను ప్రశ్నమున కభినవగుప్తుఁడు పిమ్మటఁ బ్రత్యుత్తరించును.

దశరూపకవ్యాఖ్యాతయగు ధనికుఁడు శాంతమును గుఱించిన పరమతము నిట్లు నుడివెను. "అన్యేతు వస్తుతత్త్వస్య అభావం వర్ణయంతి అనాదికాలప్రవాహాయాతరాగద్వేషయో రుచ్ఛేత్తు మశక్యత్వాత్" (కొందఱు శాంతరసము లేనే లేదందురు. ఏలన, ననాది కాలప్రవాహమునఁబడి వచ్చుచున్న రాగద్వేషములను శమింపఁజేయు[illegible]) దీని[illegible]మిచ్చెను.

"యదినామ సర్వజనానుభవగోచరతా తస్యనాస్తి నైతావతా అసౌ అలోక సామాన్య చిత్తవృత్తివత్ ప్రతిక్షేప్తుంశక్యః" ( ఇది సర్వజనములకును ననుభవ గోచరము కానంతమాత్రమునఁ దీనినిఁ ద్రోసివేయరాదు.) మరియు నభినవగుప్తుఁడు

" యథాచ కామాదిషు సముచితాశ్చిత్తవృత్తయః రత్యాది శబ్దవాచ్యాః కవి నటవ్యాపారేణ ఆస్వాదయోగ్యతాప్రాపణద్వారేణ తథావిధహృదయసంవాద వతః సామాజికాన్ ప్రతి రసత్వం శృంగారాదితయా నీయతే తథామోక్షాభి ధాన పురుషార్థోచితా చిత్తవృత్తిః కి మితి రసత్వం నానీయతే? ఇతి వక్తవ్యం" (ఎట్లు చిత్తవృత్తి విశేషములగు రత్యాదులు కవినటుల వ్యాపారముచే నాస్వాద యోగ్యములై సామాజికులకు శృంగారాది రసములుగా నాస్వాద్యములగుచున్నవో యట్లే మోక్షరూపమగు పురుషార్థమున కుచితమగు చిత్తవృత్తి యేల రసస్వరూప మును బొంది యాస్వాద్యముగాదు?" అని వాదించెను. దీనిచే ననాదికాలప్రవాహ పతితములగు రాగద్వేషముల నుచ్ఛేదించెడు వీతరాగులుండురనియు వారే మోక్షము నకు నధికారులనియు వారే యీశాంతరసము నాస్వాదించు సామాజికులనియును సారాంశము.

దశరూపకర్తయగు ధనంజయుఁడు

"శమ మితి కేచిత్ప్రాహుః పుష్టిర్నాట్యేషు నైతస్య"

(కొందఱు శమమను (శాంతము) రసమును జేర్చిరి. కాని దానికి నాట్య మునఁబుష్టిలేదు) అని చెప్పెను. కాని తద్వ్యాఖ్యాతయగు ధనికుఁడు మాత్రము 'ననుశాంతస్య అభినేయత్వాత్ యద్యపినాట్యేఽనుప్రవేశోనాస్తి। తథాపి సూక్ష్మా తీతవస్తూనాం సర్వేషామపి శబ్దప్రతిపాద్యతాయాః విద్యమానత్వాత్ కావ్యవిష యత్వం నవార్యతే' (శాంతమభినయింపఁదగినది కామి నాట్యమునఁ బ్రవేశము లేక పోవునుగాక. అతిసూక్ష్మములగు వస్తువులనుగుఱించియు శబ్దముచేఁ జెప్పవచ్చును గదా! కావున శ్రవ్యకావ్యమున శాంతమును నిబంధింపవచ్చును) అని శాంతమును శ్రవ్యకావ్యమున నిబంధింప ననుమతించెను. ధనంజయుఁ డీమాత్రపుమాటనుగూడఁ దెలుపలేదు. మరియు నాధనికుఁడు శాంతరసస్వరూపము నిట్లు తెలిపెను.

"శాంతోహి తావత్ –నయత్ర దుఃఖం నసుఖం నచింతా నద్వేషరాగా నచ కాచిదిచ్ఛా
రసస్తుశాంతః కథితోమునీంద్రైః సర్వేషు భావేషు శమప్రధానః

ఇత్యేవం లక్షణః; తదాతస్యమోక్షావస్థాయామేవ ఆత్మస్వరూపాపత్తి లక్ష ణాయాం ప్రాదుర్భావాత్ తస్య స్వరూపేణ అనిర్వచనీయతా । తథాహి శ్రుతి రపి స ఏష నేతి నేతి [illegible] (శాంతమునందు [illegible]లో దుఃఖము

గానీ ప్రపంచసుఖముగానీ రాగద్వేషములుగానీ యిచ్ఛగానీ లేవో యాదశయే శాంతము. ఎల్లవిషయములందును శమమే ప్రధానమగు రసము శాంతము. ఇట్టిశాంత మాత్మస్వరూపప్రాప్తిరూపమగు మోక్షావస్థయందే లభించును. దానికి సంచార్యాదులు లేవు. మరియు నాశాంతమును నూటిగాఁ స్వరూపముచేఁ జెప్పఁజాలము. శ్రుతియును బరమాత్మను నూటిగా నిర్వచింపఁజాలక "ఇదిగాదు; ఇదిగాదు" అనియే యన్యాపోహరూపమునఁ దెలిపెను. అట్టి స్వరూపముచే నిర్వచింపఁబడని శాంతము నాస్వాదించు సహృదయులు లేరు. ఇఁక నిత్యసంతుష్టి, మైత్రి, దయా, ఉపేక్షా, రూపమున నారస మెల్లరిచే ననుభవింపఁబడును. ఆయాస్వాదముగూడ మిగిలిన రసముల నాస్వాదించునపుడు గలుగు చిత్తద్రుతి, వికాస, విస్తారరూపమే? అనియు నాతఁడు తెలిపెను.

విశ్వనాథుఁ డీపైనున్న "అట్టిస్వరూపముచే నిర్వచింపఁబడని శాంతము మోక్షావస్థయందే కలుగును. దానికి సంచార్యాదులు లేవు. శాంతమును నూటిగాఁ జెప్పఁజాలము. నిత్యసంతుష్ట్యాదులమూలముననే దాని ననుభవింపవలెను" అనునభిప్రాయము నీవిధమున ఖండించెను.

"యుక్తవియుక్త దశాయామవస్థితో యశ్శమస్స ఏవయతః
రసతామేతి తదస్మిన్ సంచార్యాదేః స్థితిశ్చన విరుద్ధా"

మోక్షావస్థయందున్న శమమేకాక యుక్తవియుక్త దశయందు ననఁగా నాత్మసాక్షాత్కారదశయందును, దదసాక్షాత్కారదశయందును సాధారణముగా నుండు శమము రసత్వమును బొందును. దానికి సంచార్యాదు లుండును.

విశ్వనాథుఁడీవిధమునశాంతముగావ్యనాటకముల రెంటనునుండునని సమర్థించెను.

ధనంజయుఁడు నాట్యమున శాంతరస ముండద నెను. ధనికుఁడు నాట్యమున లేదని యంగీకరించుచు శ్రవ్యకావ్యమున నుండవచ్చునని చెప్పెను. కాని శాంతరసము స్వస్వరూపముచే నిర్వచింపఁబడదనియు దానికి సంచార్యాదులు లేవనియును దెలిపెను. విశ్వనాథుఁడు శాంతము రసమగుననియు దానికి సంచార్యాదు లుండుననియు నది కావ్యనాటకముల రెంటను నుండవచ్చుననియు సిద్ధాంతించెను.

మఱికొందఱు రస మనుకర్తృనిష్ఠమని భావించి యిట్లు వచించిరి.

"శాంతస్య శమసాధ్యత్వాత్ నటేచ తదసంభవాత్
అష్టావేవ రసానాట్యే న శాంతస్తత్ర యుజ్యతే"

(శాంతరసము శమసాధ్య మగుటవలనను, ఆ శమము నటునియందు సంభవింపదు. కావునను నాట్యమున నెనిమిదిరసములే, అందు శాంతమునకుఁ దావులేదు)

కాని యభినవగుప్తపాదాచార్యులవారు "రసము నటనిష్ఠము గాదు; సామాజిక నిష్ఠము. సామాజికునియందు వాసనారూపముగా నున్న స్థాయిభావములగు రత్యాదులే నటుని నాట్యముచే నభివ్యక్తములై యాస్వాదింపఁబడి యలౌకిక చమత్కారమును గలిగించును. అదియే రసము" అని తెలిపిరి. దీనిచే రసము సామాజికనిష్ఠము. కావున శాంతముగూడ రసముగా నుండవచ్చును.

> "నటేశమస్యైవాభావాదితిహేతురసంగతః
> నటే రసాభివ్యక్తిస్తు నైవ స్వీక్రియతే యతః
> సామాజికాస్సహృదయాశ్శాంతాస్తత్త్వ విచక్షణాః
> అతస్తేషాం రసోద్బోధే శమవత్త్వాన్న బాధకం."

"నటునియందు శమములేదు. కావునశాంతము రసముగాదు" అనుహేతువసంగతము. రసము నటనిష్ఠముగానేగాదుగదా! సామాజికులు సహృదయులు. శాంతులు; తత్త్వవివేచనా పరులు. కావునవారికి రసోదయమగుటలోవిప్రతిపత్తి లేదు. కావునఁ గావ్యమునందువలెనే నాట్యమునందును దొమ్మిది రసములు సిద్ధించును. ఈయభిప్రాయానుసారముగా "శాంతోఽపినవమోరసః" అనిచెప్పఁబడియున్నది. మరియు సంగీతరత్నాకరమున,

> "అష్టావేవ రసానాట్యే ఇతి కేచిదచూచుదన
> తదచారు; యతఃకించిన్నరసం స్వదతే నటః"

(నాట్యమున నెనిమిదిరసములే యుండునని కొందఱనిరి. అది యయుక్తము. నటుఁడు రసాస్వాదనపరుఁడుగాఁడు. అనఁగా రసము నటనిష్ఠముగాదు; అనియును జెప్పఁబడినది.

ధ్వన్యాలోకమునకు వ్యాఖ్యాతయగు చంద్రికాకారుఁడు శాంతరసమును గుఱించి విచారణము చేసెను. అతనిసిద్ధాంతమిది:—శాంతమును రసముగా నంగీకరింపవలెను. కాని దానిని కావ్యమున నంగిరసముగాఁగాక యంగరసముగామాత్రమే నిర్వహింపవలెను. నాగానందమున శాంతరస మంగిగా నిర్వహింపఁబడక యంగరసముగానే నిర్వహింపఁబడినది.

ఈయభిప్రాయము నభినవగుప్తుఁ డిట్లు ఖండించెను. "ఆధికారికత్వేనతు శాంతోరసో ననిబద్ధవ్యః ఇతి చంద్రికాకారః। తచ్చేహాస్మాభిర్న పర్యాలోచితం" (చంద్రికాకారుఁడు శాంత మాధికారికరసముగా నిబంధింపఁగూడదని నుడివెను. దానిని మేమంగీకరింపము)

బౌద్ధజైనకవులు ౧౨వ శతాబ్దిలోనే శాంతరసము నంగిరసముగా నంగీకరించిరి. జైనుల 'అనుయోగాద్వారసూత్రము' ప్రశాంతరసమను పేరితో శాంతము నంగిరసముగా గ్రహించెను.

కొందఱు శాంతమును దయావీరమున నంతర్భవింపఁజేసిరి. అదికూడదు. ఏలన శాంతమునకు స్థాయిభావము నిర్వేదము. దయావీరమున కుత్సాహము. ఉత్సాహ మహంకారరూపము. శాంత మహంకారప్రశమరూపము. దీని కవష్టంభకముగా సాహిత్యదర్పణకారుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

'నిరహంకారరూపత్వా ద్దయావీరాదిరేష నో'

(శాంతము నిరహంకారరూప మగుటవలన దయావీరముగాదు) మరియు

'సర్వాకార మహంకారరహితత్వం వ్రజంతిచేత్।
అత్రాఽన్తర్భావమర్హంతి దయావీరాదయ స్తథా'

(దయావీరాదులు సర్వాకారముగా నహంకారరహితములగుచో నాశాంతరసమందే యంతర్భవించును. అంతేకాని శాంతము దానిలో నంతర్భవింపదు)

హరిపాలుఁడు సంగీత సుధాకరమున శాంతరసమును శాంతరసమనియు, బ్రహ్మరసమనియు విభజించెను.

బ్రహ్మో నామ రసస్సర్వ ప్రపంచో త్తీర్ణరూపకః
నిత్యః స్థిరోఽతఏవాయం పార్థక్యేన ప్రకీర్తితః"

బ్రహ్మరసము నిత్యము, స్థిరముననియు, శాంతరసమనిత్యము, అస్థిరము, నని యును దెలిపెను. నిర్వేద స్థాయికమగు శాంతరసము మోక్షమునకుఁ గొని పోవదనియు, ఆనందస్థాయికమగు బ్రహ్మరసము మోక్షమునకుఁ గొనిపోవుననియు నతని సిద్ధాంతము.

ఈవిధముగా భరతుఁడు నిర్దేశింపలేదు; కావున శాంతము రసమే కాదని కొందఱు; కావ్యమందైనను నాధికారికరసముగాఁగాక ప్రాసంగికరసముగా మాత్రమే గ్రాహ్యమని కొందఱు; తుదికిఁ గావ్యమునను నాటకమునను గూడ నంగిరసముగా గ్రాహ్యమే యని యభినవగుప్తపాదులవారు సిద్ధాంతీకరించిరి.

శాంతరసము స్థాపింపఁబడిన పిమ్మట దీనికి స్థాయి యేమి? అని ప్రశ్న వచ్చుచున్నది. ఈ విషయమునఁ బెక్కు మతభేదములు గలవు.

కొందఱు 'శమము' దీనికి స్థాయిభావమందురు. (అథ శాంతో నామ శమ స్థాయిభావాత్మకో మోక్షప్రవర్తకః) భరతుఁడు నిర్దేశించిన యెనిమిది భావముల నే

చూపెను. (ఎనిమిది స్థాయిభావములు; ఎనిమిది సాత్త్వికభావములు; ముప్పది మూఁడు వ్యభిచారిభావములు.) శమమునుఁగూడ గలిపినచో నేఁబదిభావము లగును గదా! మరియు శమ, శాంతపదములు పర్యాయములు. కావున శమ స్థాయికము శాంతమన్నచో శాంతిస్థాయికము శాంతరసమని యర్థమువచ్చును. ఇది దోషము. కాన శమము స్థాయిభావముగాదని మఱికొందఱందురు. శమ శాంతములు పర్యాయములుగావు. ఏలన, భయభయానకములు, విస్మయాద్భుతములు, హాసహాస్యములు, నెట్లు భిన్నములో యివియును భిన్నములే. శమ, భయ, విస్మయ, హాసములు లౌకికములు. శాంత, భయానక, అద్భుత, హాస్యము లలౌకికములు. కాన నవి భిన్నములే కావున నిది పెద్ద శంక గాదు. కాని యేఁబదిభావము లగుననుట యొక యాక్షేపమే.

రుద్రటుఁడు సమ్యగ్జ్ఞానము స్థాయిభావమనెను. (సమ్యగ్జ్ఞానం స్థాయిభావః) ఇతని యుద్దేశమున సమ్యగ్జ్ఞానమన్నను శమమన్న నొక్కటియే.

ఆనందవర్ధనుఁడు తృష్ణాక్షయసుఖమే స్థాయిభావమనెను. (శాంతశ్చ తృష్ణాక్షయసుఖస్య యః పరిపోషస్తల్లక్షణో రసః ప్రతీయతే ఏవ) ఈ తృష్ణాక్షయసుఖమనఁగా శమమనియే యాతని యభిప్రాయము. ఏలన, నితఁడు దయావీరమునుండి శాంతమును వేఱుపఱచుచు "అస్య చ శాంతస్య అహంకార ప్రశమైకరూపతయా స్థితేః" (ఈ శాంత మహంకారప్రశమైకరూపము) అని నుడివెను.

ఇట నభినవగుప్తుఁడు గూడ నహంకారప్రశమ మనఁగా 'నిరీహత్వము' అని వ్యాఖ్యానించెను. హేమచంద్రుఁడుగూడఁ దృష్ణాక్షయమన 'శమ'మనియే తెలిపెను. (తృష్ణాక్షయరూపశ్శమః స్థాయిభావశ్చర్వణాం ప్రాప్తశ్శాంతో రసః) మఱికొందఱు "సర్వచిత్తవృత్తి ప్రశమము" స్థాయి యని చెప్పుదురు. సర్వచిత్తవృత్తి ప్రశమ మనఁగా "సర్వథా చిత్తవృత్తులయొక్క నాశము లేక యభావము" అని యర్థము. అట్లగుచో నభావము భావమెట్లగును? భావము చిత్తవృత్తి రూపము. కావున నభావము స్థాయిభావము గానేరదు." అని యభినవగుప్తుఁ డాక్షేపించెను.

ఇఁకఁ గొందఱు 'నిర్విశేష చిత్తవృత్తి' స్థాయిభావముగాఁ జెప్పిరి. (అనుపజాత విశేషాంతరం చిత్తవృత్తిరూపం శాంతస్యస్థాయిభావం మన్యంతే) వీరు శాంతము ప్రకృతిరసమనియు మిగిలిన రసములు వికృతిరసములనియు వికృతిరూప విశేషములులేని చిత్తవృత్తియే శాంతమునకు స్థాయిభావమనియుఁ దెలుపుదురు. తృష్ణాక్షయ సుఖము, నిర్విశేష చిత్తవృత్తి యనురెండును దాదాపుగాఁ బర్యాయములే.

భోజుఁడు 'ధృతిని' శాంతమునకు స్థాయిభావముగాఁ బేర్కొనెను. ధృతిః స్థాయిభావః వస్తుతత్త్వాలోచనాదిభిర్వ్యభిచారిభావైః వాగారంభాదిభిరనుమజ్యమానః నిష్పన్నః శాంతఇత్యభిధీయతే" అన్యేపునరస్య శమం ప్రకృతి మామనంతి. సతుధృతేరేవ విశేషోభవతి"

ధృతియనఁగా నిత్యసంతుష్టి. ఇది శమరూపమగు తృష్ణాక్షయమే. 'అన్యేపున' అనుపైమాటలచే శమము ధృతియొక్క విశేషమని తెలియుచున్నది. భోజుఁడు శృంగారప్రకాశమున " అత్రశమప్రకృతిశ్శాంతః " అని శమమునే స్థాయిభావముగాఁ దెలిపెను. కావున ధృతియన్నను శమమన్న నొక్కటియే.

కొందఱు నిర్వేదము స్థాయిభావమందురు. (తత్త్వజ్ఞానజో నిర్వేదోఽస్య స్థాయీ) వీరు భరతుఁడు నిర్వేదమును స్థాయిభావముగా సూచించెనందురు. ఎట్లన స్థాయిభావముల నెనిమిదింటినిఁ దెలిపి వ్యభిచారి భావముల గణించుచుఁ బ్రథమముననే 'నిర్వేదమును' బేర్కొనెను. నిర్వేదము మంగళప్రాయము. వ్యభిచారులను బేర్కొనుచు "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే" అను న్యాయానుసారముగా మంగళప్రాయముగాఁ దెలుప వలసినభరతముని యమంగళ ప్రాయమగు నిర్వేదమును బ్రథమమున నేలపేర్కొనెను? ఇది యమంగళ ప్రాయమైనను స్థాయిభావములవెంటనే దీనినిఁ బఠించుటఁబట్టి స్థాయిభావముగను వ్యభిచారి భావముగను గూడ దీనినుద్దేశించెను. అతనికీ యుద్దేశమే లేనిచో భరతుఁడు దీనిని స్థాయిభావములవెంటనే వ్యభిచారిభావములకగ్రమునఁ బఠింపఁడు. ఈనిర్వేదము దారిద్ర్య, వ్యాధి, అవమాన, అధిక్షేప, క్రోధ, ఇష్టజన వియోగ, తత్త్వజ్ఞానాది విభావములవలనఁ గలుగును. కానితత్త్వజ్ఞానమువలనఁ గలిగిన నిర్వేదమే శాంతమునకు స్థాయిభావము.

కొందఱుత్సాహము స్థాయిభావమని తెలుపుదురు. (ఉత్సాహఏవఅస్యస్థాయీత్యన్యే) "ఉత్సాహము వీరమునకు స్థాయిభావము" వీరము, దాన, దయా, యుద్ధ, ధర్మ భేదములచే నలుదెఱఁగులు. ఇందు దయావీరమే శాంతము. కానశాంతమునకుత్సాహమే స్థాయిభావము. అంతేకాక మోక్షపదవినిఁ బొందుటకుఁ దీవ్రయత్నముగావలెను. అతీవ్రయత్నమే యుత్సాహము." వీరు శాంతముప్రత్యేకముగా లేదని దయావీరములోనే యంతర్భవింపఁజేసిరి. దీనినానందవర్ధనుఁడిట్లు ఖండించెను.

"నచాస్య వీరేఽంతర్భావః కర్తుం యుక్తః; తస్య అభిమానమయత్వేన వ్యవస్థాపనాత్ । అస్యచ అహంకార ప్రశమైకరూపతయా స్థితేః । తయోశ్చ ఏవంవిధ విశేషసద్భావేఽపి యద్యైక్య[illegible] ప్రసంగ"

(శాంతమును వీరమున నంతర్భవింపఁజేయరాదు. వీర మభిమానమయము. శాంత మహంకారప్రశమైకరూపము. ఇట్టి భేదమున్నను వీని రెంటికిని నైక్యముగల్పించినచో వీరరౌద్రములకుఁగూడ నైక్యమును గల్పింపవచ్చును.

కొందఱు శాంతమునకు జుగుప్సను స్థాయిభావముగాఁ దెలిపిరి. (జుగుప్సేతి కేచిత్) బీభత్సరసము, క్షోభణము, శుద్ధము, ఉద్వేగి, అని మువ్విధములనియు నందు శుద్ధబీభత్సము మోక్షసాధనమనియుఁ దెలిపిరి. "బీభత్సస్తావత్ విభావ విశేషాత్ యత్రతు సంసారనాట్యనాయక రాగప్రతిపక్షతయా మోక్షసాధనత్వాత్ శుద్ధః" దశరూపకావలోకమందుఁ గూడ "అన్యేతు వీరబీభత్సాదౌ అంతర్భావం వర్ణయంతి" (ఇతరు లీ శాంతమును వీర బీభత్సాదులలో నంతర్భవింపఁజేయుదురు) అని చెప్పఁబడియున్నది. దీని కభినవగుప్తుఁడు "జుగుప్స శాంతమునకు వ్యభిచారి యగును; కాని స్థాయిభావము గానేర"దని యిట్లు నుడివెను. "కేవలం యథా విప్రలంభే ఔత్సుక్యం సంభోగేఽపి వా ప్రేమ అసమాప్తోత్సవం ఇతి, యథా చ రౌద్రే ఔగ్ర్యం, యథా చ కరుణ, వీర, భయానకాద్భుతేషు నిర్వేద, ధృతి, త్రాసహర్షాః వ్యభిచారిణోఽపి ప్రాధాన్యేన అవభాసంతే తథా శాంతే జుగుప్సాద్యాః సర్వథైవ రాగప్రతిపక్షత్వాత్"

కొందఱు "ఆత్మరతి" శాంతస్థాయిభావముగాఁ బలికిరి. (తత్ర అనాహతానందమయస్త్వాత్మ విషయారతిరేవ మోక్షసాధన మితి సైవశాంతే స్థాయినీతి). తదనుకూలముగా భగవద్గీతలోని

> 'యస్త్వాత్మ రతి రేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః
> ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే'

(ఎవఁ డాత్మరతుఁడును, ఆత్మతృప్తుఁడును, ఆత్మసంతుష్టుఁడునో వానికిఁకఁ గర్తవ్యము లేదు) అను శ్లోకము నుదాహరింతురు. అభినవగుప్తుఁడు దీనిని జుగుప్స వలెనే శాంతమునకు వ్యభిచారిగానే పరిగణించెను.

కొందఱు రత్యాదులగు నెనిమిదిస్థాయిభావములలో నేదే నొకటి శాంతమునకు స్థాయిగా నుండవచ్చుననిరి. (అన్యేమన్యంతే రత్యాదయ ఏవ అష్టౌ చిత్తవృత్తి విశేషా ఉక్తాః। త ఏవ కథితవిభావ వివిక్తతయా అలౌకిక విభావ విశేష సంశ్రయాః విచిత్రా ఏవతావత్ । తతశ్చతన్మధ్యాదేవ అన్యతమోఽత్రస్థాయీ) అభినవగుప్తుఁడీ వాదమునిట్లు విస్పష్టపఱచెను. "సమస్తవిషయజాలము వికృతరూపముగాఁ దలఁచి హసించుచు, విశ్వమంతయును శోచ్యముగాఁ దలఁచి దుఃఖించుచు సాంసారికమైన ప్రవృత్తినంతయుఁ దనకపకారిగానేక శత్రువుగానెంచి

క్రోధముఁ గన్పఱచుచు, విషయ వ్యామోహ దూరీకరణ రూపమగు వీర్యము నవలంబించుచు, సర్వవిషయ సమూహమునుండి భయపడుచు, సర్వలోక రమణీయాకారములుగల ప్రమదాదులఁ గాంచి యసహ్యించుకొనుచు, అపూర్వమైన జ్ఞానలాభమునఁ దన్నుఁ గూర్చి తాను విస్మయపడుచు నుండెడివానికి మోక్షసిద్ధి యగును. కానఁ గ్రమముగా హాస, శోక, క్రోధ, ఉత్సాహ, భయ, జుగుప్సా విస్మయములు శాంతమునకు స్థాయిభావములుగా నుండవచ్చును" అతఁడే యీవాదము నిట్లు ఖండించెను. "స్థాయిభేదమునుబట్టి రసభేదమేర్పడును. ఒకేరసమునకుఁ బెక్కు స్థాయి భావములుంట రససిద్ధాంతమునకు విరుద్ధము. ఇవన్నియుఁ గలిసియే స్థాయి భావముఁ గాఁగూడదా! అన్నచో నదియు నసంభవమే. ఇవన్నియుఁ జిత్తవృత్తి విశేషములు గదా! ఇన్ని చిత్తవృత్తులేక కాలమున నెట్లుత్పన్నము లగును? మరియు నివి పరస్పరవిరుద్ధములుగాఁ గూడ నున్నవి కదా! కాన నివ్వన్నియుఁగలిసి కాని ప్రత్యేకముగాఁగాని శాంతమునకు స్థాయిభావములు గాఁజాలవు. ఇవన్నియు శాంతరసమునకు వ్యభిచారిభావములే యగును. (తత్త్వజ్ఞాన లక్షణస్యచ స్థాయినస్సమస్తోఽయింలౌకికాలౌకిక చిత్తవృత్తి కలాపో వ్యభిచారితామభ్యేతి) రస మొక్క స్థాయి భావమువలననే యేర్పడును. పెక్కు భావములుగనబడినవివ్యభిచారిభావములే యగును.

అయితే యిట స్థాయియేమి? అనుప్రశ్నకు నభినవగుప్తుఁడు 'తత్త్వజ్ఞానమే యయిభావమని చెప్పుచున్నాఁడు. (''ఇహతత్త్వజ్ఞానమేవతావన్మోక్షసాధనమితి తస్యైవ మోక్షేస్థాయితా యుక్తా తత్త్వజ్ఞానంచనామ ఆత్మజ్ఞానమేవ; తేన ఆత్మైవ జ్ఞానానందాది విశుద్ధధర్మయోగీ పరికల్పిత విషయోపభోగరహితోఽత్రస్థాయీ'') (జ్ఞానానందాది విశుద్ధధర్మములు గలిగి విషయోపభోగ శూన్యమైన యాత్మయే స్థాయియని సారాంశము.) ఈస్థాయిభావ మితర స్థాయి భావముల వంటిదిగాదు. ఇదిస్థాయి తమము. మిగిలిన స్థాయిభావము లన్నింటికిని నిదిమూలభూతము ఏలన శాంతరసము ప్రకృతిరసము. మిగిలినవి వికృతిరసములు.

> "భావా వికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతిర్మతః
> వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే
> స్వంస్వం నిమిత్తమాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
> పునర్నిమిత్తాపాయే తు శాంత ఏవ ప్రలీయతే."

శాంతము ప్రకృతిరసము. రత్యాదిభావములు వికృతులు. ప్రకృతివలనఁ బుట్టిన వికృతి ప్రకృతియందే లీనమగును. ఆ యా నిమిత్తమునుబట్టి శాంతమునుండి

రత్యాదులు ప్రవర్తిల్లును. ఆ నిమిత్త మడఁగఁగానే శాంతమే నిలుచును. కావున శాంతము భిత్తివంటిది. రత్యాదులు వానిపై వ్రాయఁబడిన చిత్తరువులవంటివి. భిత్తి స్థిరమైనది. చిత్తరువు లస్థిరములు. ఒక చిత్తరువును జెఱిపి మరొక చిత్తరువును వ్రాయుచున్నను భిత్తి యేకరూపముగా నిలుచును. కావున శాంతరసమునుండియే నిమిత్తమునుబట్టి యితర రసములు వెడలును. నిమిత్తమడఁగఁగానే మరల శాంతమే నిలుచును. మరియు

"శమార్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః
తస్మాత్స సర్వశాస్త్రజ్ఞః యస్య శాంతం మనస్సదా"

(ఎల్లశాస్త్రములను శమముకొఱకే పండితులు నిర్మించిరి. కావున నెవని మనస్సు శాంతముగానుండునో వాఁడు సర్వశాస్త్రజ్ఞుడు) అని చెప్పఁబడుటచే శాంత రసము ప్రధానమని తేటపడుచున్నది. దీనికి రత్యాదులన్నియును వ్యభిచారులగును. ఈశాంతమునకు స్థాయిభావము తత్త్వజ్ఞానము లేక యాత్మజ్ఞానము లేక జ్ఞానానందాది ధర్మోపేతమై విషయోపభోగరహితమైన యాత్మయే. రత్యాదులన్నియు శాంతమునకు వ్యభిచారులగునట్లే శాంతరసముయొక్క యాత్మరూప స్థాయిభావమేయితరరసమునకును వ్యభిచారి కాఁజాలదు. భరతుఁడు నికృతిరసములనే పేర్కొనదలచెను. ఇది యన్నింటికన్న నుత్కృష్టమగుటచేతను, మూలభూతమగుటచేతను, ప్రకృతియగుటచేతను నుక్తప్రాయముగాఁదలఁచి ఋజుమార్గమున రససంఖ్యాపరిగణనమునఁ బేర్కొనఁడయ్యె. కాని యభినవగుప్తునికన్నఁగూడఁ బ్రాక్తనములగు నాట్యశాస్త్ర గ్రంథములందుఁ బ్రప్రథమమున శాంతరస ప్రస్తావమే కలదనియుఁ బిమ్మటనే మిగిలిన శృంగారాది రసప్రసంగము గలదనియు నేలాకో యప్పటి గ్రంథములలో నీ ప్రశంస గానవచ్చుటలేదనియు నభినవగుప్తుని యీ క్రింది వ్రాఁతవలన నవగతమగుచున్నది. (తథా చ చిరంతన పుస్తకేషు స్థాయిభావాన్ రసత్వముపనేష్యామః ఇత్యనంతరంశాంతో నామ శమ స్థాయిభావాత్మకః ఇత్యాది లక్షణం పఠ్యతే) ఇప్పటి నాట్యశాస్త్ర గ్రంథములందే కాక యభినవగుప్తుని కాలమందున్న నాట్యశాస్త్ర గ్రంథములలోఁ గూడ శాంతరసప్రసంగము లేదు. కాని యాతని కాలమునకుఁ బూర్వమందున్న యతి ప్రాచీనగ్రంథములలో మొట్టమొదటనే శాంతరస ప్రస్తావమున్నట్లు విశదమగుచున్నది. ఈ శాంతరస స్థాయియగు శమము స్థాయితమమగుటచేతను, శాంతరసము ప్రకృతిరసమగుటచేతను రత్యాదులన్నింటికి నిదియే మూలభూతమగుటచేతను [illegible]

నాట్యశాస్త్రములో శాంతరస ప్రస్తావము లేదనువారు భరతుఁడు ప్రకృతిరసములనే పేర్కొనదలఁచెనని సమాధానింతురు. ఆ ప్రశంస గలదనుమతమున విప్రతిపత్తియేలేదు.

ఆత్మయే స్థాయిభావముగా నభినవగుప్తుఁడు పేర్కొన్నను "శాంతో నామ శమస్థాయిభావాత్మక!" అని శమమే స్థాయిభావమనుపాఠము చిరంతన నాట్యశాస్త్ర గ్రంధములలో నున్నట్లతని చేతనే యుదాహరింపఁబడుటచే స్థాయిభావ భేదము గన్పట్టుచున్నదని సంశయింపవచ్చును. మరియు మొదట దెలిపిన విధమున శమమే స్థాయిభావమగుచో ౫౦ భావములగునను నాక్షేపము మరలవచ్చుచున్నది గదా! అన్నచో నట్లుగాదు. శమము, నిర్వేదము, అనునదియాత్మ స్వభావము. ఇది వికృతిగాదు. ఆత్మయొక్క ప్రకృతిధర్మమే. కాన నాత్మయే స్థాయియన్నచో శమమంతర్గతమే యగుచున్నదిగదా! కాన శమస్థాయిక మన్నను దోషములేదు.

శాంతరస ప్రధానములగు దృశ్యశ్రవ్య కావ్యములున్నవా? యనుసందేహమక్కఱలేదు. మహాభారతము, సౌందర నందకావ్యము, బుద్ధ చరిత్రము మొదలయిన శ్రవ్యకావ్యములును, భర్తృహరి నిర్వేదము, ప్రబోధచంద్రోదయము మొదలయిన దృశ్యకావ్యములును రమారమి యేఁబది శాంతరసప్రధానములు గలవు.

అసలు శాంతరసమే ప్రధానరసమని యానందవర్ధనాభినవగుప్తుల సిద్ధాంతమయినట్లు కొందఱి వ్రాఁతలవలన స్ఫుటమగుచున్నది. మరియు నభినవగుప్తుని గురువగు భట్టతౌతుఁడుగూడ నిదే యభిప్రాయమును దెలిపినట్లు కాణేపండితుఁడు తన Introduction to Sahityadarpana లో వ్రాసెను.

We know that Bhattatouta was the Guru of Abhinavagupta and that he wrote a work called కావ్యకౌతుక on which అభినవగుప్త wrote a Vivarana. One of his doctrine was that Santa was at the head of all Rasas as it led on to Moksha.

## ప్రేయోరసము

రుద్రటుఁడు 'దశమోరసః ప్రేయాన్' (ప్రేయోరసము పదవది) అనిచెప్పి "స్నేహప్రకృతిః ప్రేయాన్" అనిదానికి స్నేహము స్థాయిభావముగాఁ బేర్కొనెను. మరియు "అన్యోన్యం ప్రతిసుహృదోర్వ్యవహారోఽయంమత స్తత్ర" (స్నేహితుల పరస్పర వ్యవహారమే ప్రేయోరసము) అని నుడివెను. ఇంతేకాక రసములు పదియేకాదు; నిర్వేదాదులుగూడ శృంగారాదులవలెఁ బరిపుష్టములయిన యెడల రసత్వమును బొందును.

రసనాద్రసత్వ మేతేషాం మధురాదీనామివోక్త మాచార్యైః
నిర్వేదాదిష్వపి తన్నికామమ స్తీతి తేఽపి రసాః.

"రస్యమానత్వరూపధర్మమును బురస్కరించుకొని శృంగారాదులకు రసత్వమును నాచార్యులు దెలిపిరి. ఆ రస్యమానత్వము నిర్వేదాదులందును గలదు. కావున నవియు రసములే" అని యాతని వాదము. ఈ వాదమును బ్రప్రథమమున భట్టలోల్లటుఁడే లేవఁదీసెను. ఆతఁడు రసము లనంతము లనియు, లోకప్రసిద్ధి ననుసరించి భరతుఁడు గొన్నింటినే రసములని యుదాహరించెననియు నుడివెను. రుద్రటుఁడా సిద్ధాంతమునే బలపఱచెను. వ్యభిచారిభావములు గూడ విభావాది సంయోగమున రసములగునని నిష్కృష్టార్థము. అభినవగుప్తుఁ డీ సిద్ధాంతము నంగీకరింపలేదు.

## వత్సల రసము

భరతుఁడు "హాస్య శృంగారయో స్స్వరితోదాత్తైః, వీర రౌద్రాద్భుతేషు ఉదాత్త కంపితైః, కరుణ వాత్సల్య భయానకేషు అనుదాత్తస్వరిత కంపితైః వర్ణైః పాఠ్య ముపపాదయతి" అని యా యా రసములందు వర్ణముల నెట్లుచ్చరింపవలయునో చెప్పుచు వాత్సల్యమును జేర్కొనెను. దీని నెనిమిది రసములలోఁ జెప్పలేదు. ఇటనే యీ పదమును వాడెను. దీనినిఁ జూచియే సాహిత్యదర్పణకారుఁడు "అథ మునీంద్ర సమ్మతో వత్సలో రసః" అని యారంభించి,

స్ఫుటం చమత్కారితయా వత్సలంచ రసం విదుః
స్థాయీ వత్సలతా స్నేహః పుత్రాద్యాలంబనం మతం
ఉద్దీపనాని తచ్చేష్టా విద్యా శౌర్యోదయాదయః
ఆలింగనాంగసంస్పర్శ శిరశ్చుంబన మీక్షణం
పులకానందబాష్పాద్యా అనుభావాః ప్రకీర్తితాః
సంచారిణోఽనిష్టశంకా హర్ష గర్వాదయో మతాః.

మిక్కిలి చమత్కారిగా నుంటఁబట్టి వత్సలమునుగూడ రసముగాఁ దలంతుము. దీని స్థాయి ప్రేమయుక్తమగు రతి. దీనికిఁ బుత్త్రిభ్రాత్రాదు లాలంబనము. వారి చేష్టలును, విద్యా, శౌర్యోదయాదులును నుద్దీపనములు. ఆలింగనము, గాత్రసంస్పర్శము, శిరశ్చుంబనము, ఈక్షణము, పులకలు, ఆనందబాష్పములు మొదలగునవి యనుభావములు. అనిష్టశంక, హర్షము, గర్వము మొదలగునవి వ్యభిచారిభావములు.

భ్రాత్రాలంబనమున గల వత్సలమున కుదాహరణము

దేశేదేశే కళత్రాణి దేశేదేశే చ బాంధవాః
తంతు దేశం న పశ్యామి యత్రభ్రాతా సహోదరః.

"దేశదేశమునందును గళత్రములు సంభవింతురు. దేశదేశమునను బంధువులు కానవత్తురు. కాని తోఁబుట్టువు గల దేశము గానరాదు." ఇది శ్రీరాముని వచనము. పుత్రాలంబనము గల వత్సలరసము నూహించుకొనవలెను.

జగన్నాథుఁ డీ వత్సలరసమును, ముందు చెప్పఁబోవు భక్తిరసమును రసములు గావనియు భావములే యనియు నుడివెను. (ఏతేన వాత్సల్యాఖ్యం పుత్రాద్యాలంబనం రసాంతర మితి పరాస్తం).

మరియుఁ గొందఱు మృగయా, అక్షక్రీడా, ప్రీతి, శ్రద్ధలును, ఆర్ద్రతా స్థాయికమగు స్నేహమును, గర్ధస్థాయికమగు లౌల్యమును, ఆసక్తిస్థాయికమగు వ్యసనమును, అరతిస్థాయికమగు దుఃఖమును, సంతోషస్థాయికమగు సుఖమును, మతిస్థాయికమగు నుదాత్తమును, గర్వస్థాయికమగు నుద్ధతమును, స్పృహాస్థాయికమగు కార్పణ్యమును, రసములుగా గణించిరి. మొదటి నాల్గింటికిని స్థాయిభావము లెవ్వియో వారు తెలుపరైరి. అభినవగుప్తుఁ డివి యన్నియును రసములు గావనియు భావములే యనియుఁ దెలిపెను. అతఁడు రసభావముల కిట్లు భేదము నిరూపించెను.

"రసములు సహృదయ హృదయావర్జకములు. పురుషార్థోపయోగులు. రంజనాధిక్యము గలవి. భావము లట్లుగాదు. మరియు రసమనఁగా నేమి? యని భరతుఁడు శంకించి "యేది యాస్వాద్యమో యది రసము" అని నిర్వచించెను. రుద్రటుఁడు నిర్వేదాదులందును నాస్వాద్యత్వమున్నది. కాన నవియు రసములే" యనెను. భరతుఁడు సహృదయ హృదయావర్జకములగుటచే నెనిమిదో తొమ్మిదో మాత్రమే రసములని తెలిపెను. అంతేకాని భరతుఁడు నిర్వేదాదు లన్నియును రసములని సిద్ధాంత మొనర్పలేదు. అభినవగుప్తుఁడు 'రత్యాదులగు స్థాయిభావములు నవిభావానుభావసంచారిభావములచేఁ బరిపుష్టములై శృంగారాది రసస్వరూపమును బొందునట్లు నిర్వేదాది వ్యభిచారిభావములు పొందఁజాలవనియుఁ గావున రసలక్షణమగు నాస్వాద్యత్వము శృంగారాదులందువలె నిర్వేదాదులందు లేదనియు దానినిఁ బట్టి నిర్వేదాదులందుఁ బురుషార్థోపయోగియగు రంజనాధిక్యము లేమిని నవి రసములు గావనియు భావములే యనియును సిద్ధాంత మొనర్చెను.

## భక్తిరసము

పూర్వాచార్యులు భక్తి రసము గాదనియు "రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంజితః భావః ప్రోక్తః" అని యుంటచే దేవతావిషయక మగు రతి భావము గాన భక్తి భావమే యని వ్యవహరించిరి.

భక్తి రసము గాదను సిద్ధాంతమును బ్రతిపాదించిన ప్రథముఁడు దశమశతాబ్ది వాఁడగు ధనంజయుఁడు. అతని యాశయమిది:—

ప్రీతిభక్త్యాదయో భావా మృగయాక్షాదయో రసాః
హర్షోత్సాహాదిషు స్పష్ట మంతర్భావాన్న కీర్తితాః

ప్రీతిభక్త్యాదులగు భావములును, మృగయ, అక్షక్రీడ మొదలగునవియు హర్షోత్సాహాదులలోనే యంతర్భవించును. కాన వానినిఁ బ్రత్యేకించి తెలుప మైతిమి. దీని యభిప్రాయ మిది:—విభావానుభావ వ్యభిచారిభావములచే వ్యక్తము చేయఁబడిన స్థాయిభావమే రసమగును; కాని యన్యముగాదు! అను ముని వచనము ననుసరించి స్థాయిభావమునకే రసత్వము. కాంతావిషయకమగు రతి స్థాయిభావము లలోఁ బరిగణింపఁబడినది. కాని పరమేశ్వరవిషయక మగు రతి పరిగణింపఁబడ లేదు. కావున నీ పరమేశ్వర విషయిక రతి హర్షోత్సాహాది వ్యభిచారిభావములలోఁ బరిగణింపఁబడుటవలన నిది రసత్వమును బొందదు. ఇట్లే హేమచంద్రుఁడును నిరాక రించెను. మమ్మటుఁడు రసము గాదనియు భావమే యనియును దెలిపెను. జగన్నా థుఁడు మొట్టమొదట భక్తికి విభావానుభావ వ్యభిచారి సామగ్రిని నిర్దేశించి రస త్వమును బ్రతిపాదింప ననుకూలమగు వాదమును లేవనెత్తి తుట్టతుదికిఁ గ్రిందికి ద్రొబ్బెను. ఎట్లన

అథ కథమేత ఏవరసాః ? భగవదాలంబనస్య రోమాంచాశ్రుపాతాదిభి రను భావితస్య హర్షాదిభిః పరిపోషితస్య భాగవతాది పురాణ శ్రవణ సమయే భగవ ద్భక్తై రనుభూయమానస్య దురపహ్నవత్వాత్ । భగవదనురాగరూపా భక్తిశ్చాత్ర స్థాయిభావః । న చాసౌ శాంతరసేఽంతర్భావ మర్హతి । అనురాగస్య వైరాగ్య విరుద్ధత్వాత్ । ఉచ్యతే । భక్తేర్దేవాది విషయరతిత్వేన భావాంతర్గతతయా రసత్వా నుపపత్తేః ।

రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంజితః
భావః ప్రోక్తస్తదాభాసా హ్యనౌచిత్య ప్రవర్తితాః ।

ఇతిహి ప్రాచాం సిద్ధాంతాత్ । న తర్హి కామినీ విషయాయా అపి రతే ర్భావత్వమస్తు । రతిత్వాఽవిశేషాత్ । అస్తువా భగవద్భక్తే ర్రేవ స్థాయిత్వం ।

కామిన్యాది రతీనాం చ భావత్వం। వినిగమకాభావాత్। ఇతి వాచ్యం। భరత
ముని వచనానామేవ అత్ర రసభావాది వ్యవస్థాపకత్వేన స్వాతంత్ర్యయోగాత్”
(ఇవియే రసములని యేల యనవలెను? భగవంతుఁ డాలంబనవిభావముగా, రోమాం
చాశ్రుపాతాదులనుభావములుగా, హర్షాదులు వ్యభిచారులుగాఁ గలిగి భాగవతాది
పురాణశ్రవణ సమయమున ననుభవింపఁబడు భక్తి రస మేల కాదు? ఇట భగవ
దనురాగరూపమగు రతియే స్థాయిభావము. దీనిని శాంతరసమున నంతర్భవింపఁజేయ
రాదు. ఏలన, భక్తిరసమునకు స్థాయిభావ మనురాగరూపమగు రతి. శాంతరమునకు
స్థాయిభావము వైరాగ్యము. ఇవి పరస్పర విరుద్ధములు. భక్తి దేవతావిషయకమగు
రతి యగుట రసము గాదనియు భావమనియుఁ జెప్పఁబడుచున్నది. “దేవతా విష
యకమగు రతియు, వ్యభిచారులును భావమని చెప్పఁబడును” అని ప్రాచీన
సిద్ధాంతము. అట్లగుచోఁ గామినీవిషయకమగు రతియు, భగవద్విషయకమగు
రతియు రతియే కావున భగవద్విషయకమగు రతి భావమగుచోఁ గామినీవిషయక
మగు రతియు భావమే యగుఁగాక! ఇదిమాత్ర మేల రసమని వ్యవహరింపఁబడ
వలెను? స్థాయిభావములలో నున్న రతి దేవతావిషయకరతియే యని యేలయనరాదు?
కామినీవిషయకమగు రతియే యని యేల యనవలెను? అని యనరాదు! ఏది
రసమో? ఏది భావమో? అను వ్యవస్థావిషయమున భరతముని వచనమే ప్రమాణము)

రమారమి యెల్ల సాహిత్యశాస్త్రకారులకును భక్తి రసము గాదనియు
భావమే యను సిద్ధాంతమున నైకమత్యమే కలదు. కాని సాహిత్యశాస్త్రకారులలో
నిరువురు మాత్రమే భక్తికి రసత్వము నంగీకరించి సవిస్తరముగాఁ బ్రతిపాదించిరి.
వారిలోఁ బ్రథముఁడు “ఉజ్జ్వల నీలమణి” కర్త యగు వంగదేశీయుఁడు రూప
గోస్వామి. ద్వితీయుఁడు పరివ్రాజకాచార్యుఁడైన మధుసూదన సరస్వతి. రూప
గోస్వామి “పృథగేవ భక్తిరసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః” అని ప్రతిజ్ఞసేసి
మధురము, ఉజ్జ్వలము, నను పేరిటో భక్తిరసమును విస్తరించి తెలిపెను కాని
యీ భక్తి శ్రీకృష్ణగోపీ విషయకము; శృంగారరూపము. దీనికిఁ జిత్తద్రవము స్థాయి
భావము. ఇతర శృంగార ముపాదేయముగాదు! కాని శ్రీకృష్ణగోపీ విషయకమగు
రతి యుపాదేయమనియు నది భక్తిరసమనియు నాతని మతము. ఇది నిజముగా
భక్తి గాదు. భక్తిలో నేకదేశము. కాని “మధుసూదన సరస్వతి” తన భగవద్భక్తి
రసాయన మను గ్రంథమునఁ బ్రతిపాదించిన భక్తి సంపూర్ణమైనది. ఉదాత్తము.
అతఁడు ప్రమాణ, ప్రమేయోపన్యాసపూర్వకముగా భక్తికి రసత్వమును స్థాపించెను.
ఎట్లన,

"శోక క్రోధ భయాదీనాం సాక్షాత్సుఖవిరోధినాం
రసత్వ మభ్యుపగతం తథాఽనుభవ మాత్రతః
ఇహానుభవ సిద్ధేఽపి సహస్రగుణితో రసః
జడేనైవ త్వయాకస్మాదకస్మాదపలప్యతే ?
రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంజితః
భావః ప్రోక్తో రసోనేతి యదుక్తం రసకోవిదైః
దేవాంతరేషు జీవత్వా త్పరానందాఽప్రకాశనాత్
తద్యోజ్యం; పరమానందరూపేన పరమాత్మని."

అనుభవమాత్రమువలననే సాక్షాత్సుఖవిరుద్ధములయిన శోక క్రోధ భయాదు లకు రసత్వ మంగీకృతమై యున్నది. అనుభవసిద్ధమై మిగిలిన రసములకన్న వేయిరె ట్లధికముగా రస్యమానమగుచున్న భక్తి రసము గాదనుట యెట్లు? రసకోవిదులు దేవాదివిషయక రతి రసము గాదనియు, భావమనియును జెప్పిరి. ఇతర దేవతావిష యకమగు రతి భావమే! ఏలన, వారు జీవులే యగుటచేఁ బరమానందము గలుగదు. పరమాత్మస్వరూప శ్రీకృష్ణరతి పరమానందమునకు గొంపోవును. మరియు

కాంతాదివిషయావా యే రసాద్యాస్తత్ర నేదృశం
రసత్వం పుష్యతే పూర్ణసుఖాస్పర్శిత్వ కారణాత్
పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్యప్రభేవ బలవత్తరా.

కాంతాది విషయకములగు నేరసములందును భగవద్రతియందువలెఁ బూర్ణ సుఖము లేక యానందము గలుగదు. కాన వానియందుఁ దగిన రసపుష్టిలేదు. అవి క్షుద్రరసములు. భగవద్రతి పూర్ణరసము. అది మిడుఁగురుపుర్వులకన్న సూర్యకాంతి యెట్లు బలవత్తరమో యట్లే మిగిలిన రసములకన్న శ్రేష్ఠతరము; బలవత్తరము" అనియును వచించెను. ఈ భక్తిరసమునకు నాలంబనవిభావము భగవంతుఁడు; తచ్చరిత్రలు విభావములు; భగవదాకార చిత్తవృత్తియే స్థాయిభావము. అదియే భగవద్రతి. అనుభావములు తత్కాలమునఁ బుట్టిన నేత్రాది వికారములు. వ్యభిచా రులు నిర్వేదశంకాహర్షాదులు. ఇవి పరమానంద స్వరూపమగు భక్తి రసముగాఁ బరిణమించును.

## మాయారసము

దీనిని రసతరంగిణీ గ్రంథకర్త యగు భానుదత్తుఁడు లేవఁదీసెను. ఎట్లనఁ, "చిత్తవృత్తి ప్రవృత్తిరూపమనియు నివృత్తిరూపమనియు ద్వివిధము. నివృత్తియందు

శాంతరసము గ్రహింపఁబడినవిధమునఁ బ్రవృత్తియందు మాయారస మంగీకరింప వలెను. రతి, హాస, శోక, క్రోధ, ఉత్సాహ, భయ జుగుప్సా, విస్మయములీ ప్రవృత్తి యందే మెఱపులవలెఁ బుట్టును; అడఁగును. కాన నివ్వన్నియు మాయారసమునకు వ్యభిచారిభావములు. ఈ మాయారసమునకు స్థాయిభావము మిథ్యా జ్ఞానము. సాంసారికభోగము నార్జించు ధర్మాధర్మములు విభావములు. పుత్త్ర, కళత్ర, విజయ, సామ్రాజ్యాదు లనుభావములు." ఈ మతమును మందారమరంద చంపువు గూడ బలపఱచెను.

ఈ మతమును గావ్యవిలాస కర్త యగు చిరంజీవి భట్టాచార్యుఁ డిట్లు ఖండించెను :—

"మాయ యనాది యగుటవలన నది యొకదానివలనఁ బుట్టదు. కాన రసము గాదు. రసములు జన్యములు. మాయయే మిథ్యాజ్ఞానమునకుఁ గారణమగును. కాని మిథ్యాజ్ఞానము మాయకుఁ గారణ మెట్లగును ? శాస్త్రవిరుద్ధము గదా! మరియు నాలంకారిక మతమున రసము నిత్యము. ఆనందరూపము. కావున బ్రహ్మస్వరూపము. అట్లగుచో మాయకు రసత్వ మెట్లు గలుగును? మాయ తుచ్ఛ, వినాశశాలిని. బ్రహ్మకన్న భిన్నము. కావుననే ప్రాచీనులు తొమ్మిదే రసములని సిద్ధాంతీకరించిరి."

## శృంగార రసము

భోజుఁడు "శృంగార ఏవ ఏకో రసః" (శృంగార మొక్కటే రసము) అని సిద్ధాంతించెను. మరియు నీ శృంగారమునకు 'అభిమానరసము, అహంకారరసము' అనియు నాతని మతమున నామాంతరములు. శాంత మొక్కటియే యహంకార ప్రశమరూపము. మిగిలిన రసములన్నియు నహంకారరూపములే. ఒక్క శృంగార మునే యాతఁ డంగీకరించుటచే నది యహంకారరసమని చెప్పెను.

శృంగార వీర కరుణాద్భుత రౌద్ర హాస్య
బీభత్సవత్సల భయానక శాంతనామ్నః
ఆమ్నాసిషుర్దశ రసాన్ సుధియో; వయంతు
శృంగారమేవ రసనాద్రసమామనామః

పండితులు శృంగారాది శాంతాంతములగు పది రసములను జెప్పిరి. మే మొక్క శృంగారమే రసమని సిద్ధాంత మొనర్తుము.

వీరాద్భుతాదిషు చ యేహ రసప్రసిద్ధిః
సిద్ధా కుతోఽపి వటయక్షవదావిభాతి

లోకే గతానుగతికత్వ వశాదుపేతా
మేతాం నివర్తయితు మేష పరిశ్రమో నః

వటయక్ష న్యాయానుసారముగా వీరాద్భుతాదులందు రసప్రసిద్ధి గలదు. దానిని నివారించుటకే మాయత్నము అనియును నతఁడు దెలిపెను. ఈయన సిద్ధాంత మది:—పండితు లెనిమది స్థాయిభావములను, ఎనిమిది సాత్త్వికభావములను, ముప్పదిమూఁడు వ్యభిచారిభావములను బేర్కొనిరి. ఈ నామకరణ మయుక్తము. ఇవన్నియును భావములే. అవస్థావశమున నొక్కొక్కటి యొకానొకప్పుడు స్థాయియు, మరొకపుడు వ్యభిచారియు, నింకొకపుడు సాత్త్వికమును నగును. ఇవన్నియు మనస్సునఁ బుట్టినవే కావున భావములే. "భవంతి మనసీతిభావాః" అని వ్యుత్పత్తి. స్థాయ్యాదిభేద మనుచితము. విభావానుభావ వ్యభిచారి సంయోగము వలన స్థాయిభావము (రత్యాదులు) రసత్వమును బొందుననుటయుఁ జింత్యము. హర్షాది వ్యభిచారులును విభావాది సంయోగమువలన రసత్వమును బొందును. కావున నెల్లభావములకును రసత్వము గలుగుచుండఁగాఁ బరప్రకర్షను బొందు రత్యాదులకు శృంగారాదివ్యపదేశ మనుపపన్నము. ఆ హర్షాది వ్యభిచారులే కాదు. అనందము, స్వాతంత్ర్యము, ప్రశమము, పారవశ్యము, సాధ్వసము, అనురాగము, సంగమము మొదలగున వన్నియును రసములు గావచ్చును. కావున 'రత్యాదులే రసము లగును. మిగిలినవికావు' అని చెప్పఁదగదు. రత్యాదులన్నియును భావములే. శృంగారమే రసము. అది రత్యాదులచేఁ బ్రకాశించుచు విశేషముగా నాస్వాదింపఁబడును.

కొందఱు "రతిప్రభవః శృంగారః" (రతివలన శృంగారము పుట్టును) అని చెప్పుదురు. కానీ యీ శృంగారమే రత్యాదులకు జన్మకారణమని చెప్పుదుము. శృంగారికే రత్యాదులు గలుగును. కాని యశృంగారికి గాదు. శృంగారి యగునతఁడు రమించును; విస్మయపడును; ఉత్సహించును. ఇవి (రతి, విస్మయ, ఉత్సాహములు) భావ్యమానములు గాన భావము లనఁబడును. అంతేకాని యివి రసములుగావు. రసభావములకు భేద మిది:—

సాధ్యమైనంతవఱకు భావనచే (పునఃపున రనుసంధానము) భావ్యమాన మగునది భావము. భావనాపథము నతిక్రమించునది రసము. అట్లగుట మనోఽనుకూలము లయిన దుఃఖాదులందుఁ దనకుఁగల సుఖానుభవాభిమానమే రసము. అది పరంపరా సుఖహేతువగుటవలన రత్యాదులందును రసపద మాపచారికము. కాన రత్యాదులకు రసత్వములేదు. భావనావిషయములగుటవలన భావత్వమే. కావున శృంగారమే

రసము. శృంగార మనఁగా “శృంగారోహినామ విశిష్ట, ఇష్ట, దృష్ట, చేష్టాభి వ్యంజకానాం ఆత్మగుణసంపదాం ఉత్కర్షబీజం బుద్ధిసుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్న సంస్కారా ద్యతిశయహేతురాత్మనోఽహంకార విశేషః” (తన యిచ్ఛావిషయ మగు విశేషముతోఁగూడిన చేష్టలచే నభివ్యక్తములును, చేష్టలను వ్యక్తీకరించునవియు నగు నాత్మగుణసంపదలను (రత్యాదులను) ఇతర వ్యక్తియందు గ్రహించి స్వవిషయ ములుగా భావించుటవలనఁ దన రత్యాదులకు నతిశయము గలుగును. మరియు బుద్ధి సుఖదుఃఖాదులకును నతిశయము గలుగును. ఈ యతిశయమునకు హేతుభూత మహంకార విశేషము. ఆ యహంకారమే శృంగారము. దీనిని మరికొంత వివరిం తును. లోకమున నొకానొక నాయికను గాంచినపుడే యొకనాయకునకు రతి గలు గును. అట్లే యొకానొక నాయకునిఁ గాంచినపుడే యొకానొక నాయికకును రతి గలు గును. అట్లు గలుగుటకుఁ గారణమేమనఁ దమతమ రతి కుద్బోధకములగు చేష్టలు వారి యందుఁ గనఁబడుటయే. అనఁగా నొకానొక విశేషముతోఁ గూడిన చేష్ట లోక నాయకుని రతి కుద్బోధకములగును. అపుడు నాయికానాయకు లొండొరుల చేష్ట లను స్వస్వవిషయములుగా భావించుకొనుట వలనఁ దమతమ రత్యాదుల కతిశ యము గలుగును. మరియును బుద్ధి, సుఖ, దుఃఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, సంస్కారాదులకును నతిశయము గలుగును. ఈ యతిశయమునకు హేతుభూత మహంకారవిశేషము. ఈ యహంకారమే శృంగారము.

అది యనఁగా నా యహంకారవిశేషము మనస్సుచే రస్యమానమై రస మగును. అహంకారమనఁగా లోకములో ననుకొన్నట్లు ‘గర్వము’ అని యర్థము గాదు. ‘నేను’ అను నొక యభిమానవిశేషము; అది గలవాఁడే రసికుఁడు. లేనివాఁడు నీరసుఁడు; ఆ రసావిర్భావమునకు హేతువులు దానినుండి పుట్టిన భావములే. అవి రతి హర్ష రోమాంచాదులు.

ఈశృంగారము ధర్మార్థ కామమోక్ష భేదములచేఁ జతుర్విధము. ఇదిదృశ్య శ్రవ్యములయందు సామాజికులచే నాస్వాదింపఁబడును. కాని శ్రవ్యమునందు దృశ్యమునందువలెఁ బదార్థములు ప్రత్యక్షములు గామినంతగా నాస్వాద్యమానము గాదు. కావున దృశ్యకర్తలగు కవులనే బహుమానింతుము.

## అద్భుతరసము

ఈరసమును స్థాపించినవాఁడు నారాయణుఁడు, ఇతఁడు సాహిత్యదర్పణ కర్తయగు విశ్వనాథునికిఁ బూర్వుఁడు ఆతనిసిద్ధాంతమిది:—

సత్త్వగుణాధిక్యమువలన మనసు బాహ్యప్రపంచమును మఱపించు నొకయానందము గలుగును. అది బ్రహ్మానంద సదృశము. దీనికి లోకోత్తర చమత్కారమే ప్రాణము. చమత్కార మనఁగా మనస్సు విస్తరించుటయే. మనోవిస్తార మనఁగా విస్మయమేకదా! కావున విస్మయ మెల్లరసములకును మూలకారణము. కాఁబట్టి యద్భుతరసముననే మిగిలిన రసము లన్నియును నిమిడియున్నవి.

## కరుణ రసము

*భవభూతి " ఏకోరసః కరుణ ఏవ నిమిత్తభేదాద్భిన్నః పృథక్పృథగివాశ్రయతే వివర్తాన్। ఆవర్త బుద్బుదతరంగమయాన్ వికారాన్। అంభో యథా సలిలమేవ హి తత్సమస్తం॥ (కరుణరస మొక్కటియే రసము. జలమావర్త, బుద్బుద తరంగ రూపములతోఁ గానఁబడునట్లు నిమిత్తభేదమువలన నాకరుణమే భిన్నభిన్నముగాఁ గానఁబడును) అని చెప్పినాఁడు. అనఁగా లోకమంతయు శోకమయమే. కాని యిదియే నిమిత్తభేదముచే శృంగారాద్యన్యతమముగా గోచరించును. శృంగారాదులు తాత్కాలికములు. అవి తుదికి శోకముగానే పరిణమించును. ఆవర్తాదులన్నియును జలరూపములే యయినట్లు శృంగారాదు లన్నియుఁ గరుణరూపములే యని యాతని వాదము. మఱియు రస మనుభవింపఁబడునపుడు చిత్త విద్రుతి (మనస్సు కరగుట) కలుగును. అది ప్రధానముగా విశేషించి కరుణరసమునఁ గలుగును. కావునఁ 'గరుణ మొక్కటియే రసము' అని సారాంశము.

విశ్వనాథునికిఁ బూర్వుఁడగు నారాయణుఁడు రసానుభవకాలమునఁ జిత్తవిస్తారముగలుగు ననెను. భవభూతి చిత్తద్రుతిగలుగు ననెను. భోజుఁడు చిత్తవికాసము గలుగు ననెను. ఈభేదముచే వారు క్రమముగా నద్భుతమును, గరుణమును, శృంగారమును బ్రధానముగాఁ జేకొనిరి.

## ఒకటే రసము

కవికర్ణపూరగోస్వామి యలంకారకౌస్తుభమున నిట్లు నుడివెను.

ఆస్వాదాంకుర కందోఽస్తి ధర్మః కశ్చన చేతసః
రజస్తమోభ్యాం హీనస్య శుద్ధసత్త్వ తయా సతః

---

*ఉత్తరరామచరిత్ర వ్యాఖ్యాతయగు వీరరాఘవపండితు డిట్లు వ్రాసెను. ఇద మత్ర కవేర్మతం:-యద్యపి శృంగార ఏక ఏవ రస ఇతి శృంగార ప్రకాశకారాదిమతం। తథాపి ప్రాచుర్యాత్ రాగి విరాగి సాధారణ్యాత్ కరుణ ఏక ఏవ రసః। అ[illegible] ఇతి॥

సస్థాయీ కథ్యతే విజ్ఞై ర్విభావస్య పృథక్తయా
పృథగ్విధత్వం యాత్యేష సామాజికతయా సతాం

రజస్తమోగుణముల స్పర్శయులేని శుద్ధసత్త్వస్వరూపము గల మనస్సునకు ఆస్వాదాంకురకందము 'లేక యానందము' అను ధర్మము గలదు. అదియే స్థాయి. ఒక్కటే రస మనియు దాని కానందమే స్థాయిభావమనియును నతని సిద్ధాంతము. అట్లగుచో భిన్నభిన్న రసములు లేవా? ఉన్నచో వాని కన్నింటికిని నొక్క యానందమే స్థాయి యెట్లగును? అను ప్రశ్న కతని సమాధాన మిది:—స్ఫటికము జపాకుసుమాది నానాపదార్థముల సంయోగమువలన నొకతఱి నెఱ్ఱగా, నొకతూరి పచ్చగా, నొకపరి నల్లఁగాఁ గనఁబడునట్టు లొకటియేయగు స్థాయి, యుత్సాహాది పోషకములగు నానావిధ విభావాదుల సంయోగమువలన వీరమనియు, అద్భుతమనియుఁ, గరుణమనియు, నీవిధముగా వివిధాకారమును దాల్చుచున్నది. మరియు,

రస స్యానంద ధర్మత్వా దైకధ్యం: భావ ఏవ హి
ఉపాధి భేదాన్నానాత్వం రత్యాదయ ఉపాధయః

ఘట శరావాది నానావిధపాత్రములందుఁ బెక్కు ప్రతిబింబములు ప్రతిఫలించినను సూర్యబింబ మెక్కటియే యైనవిధమున నుపాధిరూపములగు రత్యాదులందు భేదమేకాని యానందమున భేదము లేదు.

ఈసిద్ధాంతము దుష్టముగాదు. ఏలన నన్నిరసములవలనఁ గూడఁ గలుగు నానంద మెక్కటియే. ఆనందములో భేదము లుండవు. కావ్యమున శృంగారము వలనఁ గలుగు నానందమును, గరుణమువలనఁ గలుగు నానందమును నేకమే. విభావాదుల భేదమును బట్టియే రస భేదము లేర్పడినవి.

భోజుని సరస్వతీ కంఠాభరణమునకు నొక వ్యాఖ్యాతయగు భట్టనరసింహుఁడు గూడ రసాస్వాద మెక్కటే యని చెప్పెను. ఎట్లన

"అష్టావేవస్థాయినః ఇతి కుతః? తావతామేవ స్వాదాత్మకత్వాత్ ఇతిచేత్ కిమేతేష్వనుస్యూత ఏక ఏవస్వాదాత్మా? తర్హ్యనక్షర మిదముక్తం "ఏతేషాంకూటస్థ ఏక ఏవస్వాదాత్మా; ఏతే చ తద్విశేషా" ఇతి

అత్రసర్వేషాం కూటస్థ ఏక ఏవ స్వాదాత్మా

ఎనిమిదే స్థాయిభావములని యేల చెప్పవలెను? అవియే స్వాద్యమానములగు వంటిమేని వీనియం దొక్క స్వాదమే [illegible] అట్లనిఁ జెప్పఁ

బడకరయే వీనికిఁ గూటస్థమగు నొకటే స్వాదాత్మ గలదని చెప్పఁబడినట్లయినది. ఈ రసము లన్నియును దన్వికేషములే. కావున నెల్ల రసములకును స్వాదాత్మ యొక్కటే.

ఈమతము నభినవగుప్తుఁడు దెలుపలేదు. కాని యిది యితని సిద్ధాంతమునకు విరుద్ధము గాదు.

## రస సమీకరణ వాదము

మహామహోపాధ్యాయ S. Kuppuswami Sastry M.A., I.E.S. గారు ఆశ్చర్యచూడామణి నాటకోపోద్ఘాతములో నీ రస సమీకరణ వాదముల నిట్లు తెలిపిరి. రస సమీకరణ వాదమన నేదోయొక రసము ప్రకృతిరస మనియు మిగిలిన వన్నియు వికృతి రసము లనియుఁ దెలుపు సిద్ధాంతము.

"In the course of the development of the philosophy of Rasa, several attempts were made in the direction of Syinthesising the various Rasas. The more important results of such attempts were summed up in four kinds of syinthesis. Firstly, there is the Karuna-syinthesis which originated from Valmiki and found its culmination in Bhavabhuti's ఏకో రసః కరుణ ఏవ on the practical side and in Ananda Vardhana's శోకః శ్లోకత్వ మాగతః on the theoritical side. Secondly there is the Santha-syinthesis, which started perhaps from the Maha-bharata, found its practical fulfilment in work like Aswaghosha's శారీపుత్ర ప్రకరణ, Sriharsha's Nagananda and Krishna Misra's Prabodha Chandrodaya and received able advocacy on the theoretical side at the hands of the two great Alankarikas—Ananda Vardhana and Abhinava gupta. Thirdly there is the Sringara-syinthesis, which firmly rooted in human nature itself since the beginning of creation reached its acme of spiritual refinement, on the practical side, in the self effacing ideal of love delineated in an inimitable manner by the creative genious of great poets like Kalidasa and Bana and on the theoretical side, in the welknown dictum of the royal polymath, Bhoja రసోఽభిమానోఽహంకార శ్శృంగార ఇతి గీయతే. And fourthly there is Adbhuta syinthesis which on the theoretical side became crystallized in the views of Narayana and Dharma Datta, reffered to by Viswanadha in his Sahitya Darpana and in the views of Bhanudatta as expressed in his Rasatarangini, and which, on the practical side led to the production of the wonder-dominated dramatic type represented by the older Ascharyachudamani and the later Adbhuta Darpana of Mahadeva at the end of the 17th century".

రసతత్త్వ చర్చావసరమునఁ బెక్కండ్రు పండితులొక్కొక్కరసము నభిమానించి యిదియొక్కటే రసమనివాదములుచేసిరి. ఆ చర్చలనుండి నాలుగు సిద్ధాంతములు వెలువడినవి. మొదటిది కరుణరస సమీకరణము. సమీకరణమనమిగిలినవానినిఁ దగ్గించివేయుట. ప్రప్రథమమున నీకరుణము వాల్మీకినుండి యుత్పన్నమైనది. తదుపరి భవభూతిచే 'ఏకోరసఃకరుణఏవ' అనువిధమున రూపమునుబొందెను. పిమ్మట 'ఆనందవర్ధనునిచే' "శోకఃశ్లోకత్వమాగతః" అనిసిద్ధాంతము చేయఁబడెను. రెండవది శాంత రససమీకరణము. ఇది మహాభారతమునుండి యవతరించి యశ్వఘోషుని శారీపుత్ర ప్రకరణము, శ్రీహర్షుని నాగానందము, కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము, అను వానియందురూపొంది యానందవర్ధన, అభినవగుప్తుల ప్రతిభావంతములగు వాదములచే సిద్ధాంతితమైనది. మూఁడవది శృంగారసమీకరణము. ఇదిసృష్ట్యాదినుండియు మానవ ప్రకృతియందు బద్ధమూలమై మహాకవీశ్వరులగు కాళిదాస, బాణుల యమోఘ నిర్మాణశక్తిచే ననుకరింపరాని విధమున వ్యక్తీకృతమై యాధ్యాత్మికోన్నతినిఁ బొందినస్వార్థరహితప్రేమయేలక్ష్యముగాఁగలది. భోజుఁడిద్దానిని"రసోఽభిమానోఽహంకారశ్శృంగార ఇతిగీయతే"అనికీర్తించెను. నాల్గవది యద్భుతరససమీకరణము. సాహిత్యదర్పణమున నుదాహరింపఁబడినట్లు నారాయణ ధర్మదత్తులచే మొదట సిద్ధాంతము చేయఁబడినది. పిమ్మట ఆశ్చర్యచూడామణి యందును, అద్భుతదర్పణమునందును రూపొందినవి.

కరుణమొక్కటియే ప్రకృతిరసము; మిగిలినవి వికృతిరసములని కరుణసమీకరణవాదులవాదము. శాంతమొక్కటియే ప్రకృతిరసము; మిగిలినవి వికృతిరసములని శాంతరస సమీకరణవాదులమతము. శృంగారమొక్కటియే రసము; మిగిలినవన్నియును భావములేయని శృంగారరసమీకరణవాదులమతము. అద్భుతమొక్కటియే ప్రకృతిరసము; మిగిలినవి వికృతిరసములని యద్భుతసమీకరణవాదులమతము."

భరతమతానుసారముగా నెనిమిదిరసములున్నను నందుఁ బ్రధానరసములు నాలుగుమాత్రమే. అవిశృంగారము, రౌద్రము, వీరము, బీభత్సము. మిగిలిననాలుగు రసములును వీనినుండి పుట్టినవే. ఎట్లన శృంగారమునుండి హాస్యమును, రౌద్రము నుండికరుణమును, వీరమునుండి యద్భుతమును, బీభత్సమునుండి భయానకమును గలిగెను. శృంగారతిలకమున నిట్లుచెప్పఁబడినదని విద్యానాథుఁడీ క్రిందిశ్లోకము నుదాహరించెను.

> హాస్యోభవతి శృంగారాత్ కరుణో రౌద్రకర్మణః
> అద్భుతశ్చ తథా వీరాద్బీభత్సాచ్చ భయానకః.

ఇది ప్రాయోవాదము. శృంగారమునుండి జన్మించినహాస్యమే కాక కేవల హాస్యరసము గూడఁగలదు. చూడుఁడు.

గురోర్గిరః పంచదినాన్యధీత్య వేదాంతశాస్త్రాణి దినత్రయంచ
అమీ సమాఘ్రాయచ తర్కవాదాన్ సమాగతాః కుక్కుటమిశ్రపాదాః

అయిదుదినాలలోఁ బూర్వమీమాంసా శాస్త్రమునుజదివి, మూఁడుదినాలలో వేదాంతమువెలిగించి తర్కశాస్త్రమును మూచూచి కుక్కుట మిశ్రపాదుల వారువచ్చిరి. ఇట శృంగార సంబంధములేదు.

ఇష్టజనస్య వినాశాచ్ఛాపాత్క్లేశాచ్చ బంధనాద్వ్యసనాత్
ఏతైరర్థవిశేషైః కరుణాఖ్యరసస్సముద్భవతి (నాట్యశాస్త్రము).

ఇష్టజననాశమువలనను, శాపమువలనను, క్లేశమువలనను బంధనమువలనను వ్యసనమువలనను గరుణరసముత్పన్నమగును. పైశ్లోకమునఁ గరుణము రౌద్రకర్మము వలనఁ బుట్టునని చెప్పబడియున్నది. ఈ యిష్టజననాశాదులకు రౌద్రముకారణము గావచ్చును. ఇట్లేమిగిలినవానినిఁ గూడఁ జూచుకొనవలెను.

భరతమతానుసారముగాఁ గొందఱమతమున నెనిమిదిరసములున్నను, గొందఱి మతమునఁ దొమ్మిదిరసములున్నను మహాకావ్యమున "శృంగారవీరయోరన్యతరస్య ప్రాధాన్యం" అని ప్రతాపరుద్రీయకర్తయు, "శృంగార వీర శాంతానామేకోఽంగీ రసఇష్యతే" అనిసాహిత్య దర్పణకర్తయు వచించిరి. సాహిత్యదర్పణ కర్తయే శాంతమును జేర్కొనెను. కానియితర లాక్షణికు లెల్లరును శృంగారవీరములలో నొక్కటియే యంగిరసమనియు మిగిలిన రసములంగరసములనియు వచించిరి. మిగిలిన రసములకన్న వీనికే ప్రాధాన్యమిచ్చుటకుఁ గారణమేమి?

"శృంగారఏవ మధురః పరప్రహ్లాదనో రసః" అని ధ్వన్యాలోకము. (శృంగారమే మిక్కిలి మధురమును, ఆనందజనకమును నగురసము). ఈ రసము మాధుర్యమును బట్టియేనా యానందజనకముగాదు. జగత్తుయొక్క యవిచ్ఛిన్నతకు భోగేచ్ఛప్రధానమైనది. "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" (సంతానరూపమగు సూత్రమును ద్రెంపవలదు) అనివేదము నుడువుచున్నది. "సంతతిశ్శుద్ధవంశ్యా హి పరత్రేహచ శర్మణే" (పరిశుద్ధవంశమునఁ బుట్టిన సంతానమిహపర లోకములఁ గల్యాణముఁ గూర్చును.) కాన సంసారసాధనమైన సంభోగ ముపాదేయము. మరియు "క్రియాణాం ఖలుధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణం" (ధర్మబద్ధములైన కర్మల కుత్తమురాండ్రగు నిల్లాండ్రు మూలకారణము) అని కాళిదాసకవి వచించెను. ఈ శృంగార రసమునకు శ్రీమహావిష్ణువే యధిదేవతగాఁ జేర్కొనఁబడియున్నాఁడు.

దీనినిఁబట్టి దీని ప్రాముఖ్యము దెలియఁగలదు. ఈ శృంగారము ధర్మతత్పరులచే నవలంబింపఁబడి లోకకల్యాణహేతు వగును. ధర్మావిరుద్ధమగు కామము లేక శృంగార ముపాదేయమే యగును. "ధర్మావిరుద్ధో భూతానాం కామోస్మి భరతర్షభ! "నేను (శ్రీకృష్ణుఁడు) మనుష్యులయొక్క ధర్మావిరుద్ధమగు కామమను." అనఁగాఁ "గామస్వరూపుఁడను" అని భగవద్గీతలోఁ జెప్పఁబడి యున్నది. పురుషార్థములగు ధర్మార్థకామమోక్షములలో నైహికలక్ష్యములగు ధర్మార్థకామములలో ధర్మము ప్రధానమైనది. ధర్మము, ధర్మబద్ధమగు నర్థమును, ధర్మార్థబద్ధమగు కామమును లక్ష్యములు. అర్థకామముల నణఁచిన ధర్మమే లోకకల్యాణహేతు వగును. కావున ధర్మానుబంధియగు శృంగారమే యత్యుత్తమము. అదియే యానందజనకము. అట్టి శృంగారమే కావ్య నాటకములలో గ్రాహ్యమని దానికిఁ బ్రాధాన్యమొసఁగిరి.

ఇట్టి శృంగారము క్షుద్రులచేఁబడినచో నది ధర్మహీనమగును. "ఉత్తమ ప్రకృతిప్రాయః రసశ్శృంగార ఇష్యతే" (శృంగారరస ముత్తమనాయకాశ్రితము) అని సాహిత్యదర్పణకారుఁడు. 'లోకోత్తరనాయకాశ్రయేణ శృంగారస్య పరిపోషాతిశయః' (లోకోత్తరనాయకావలంబముచే శృంగారరసము పుష్టమగును) అని ప్రతాపరుద్రీయము. దీనిచే ధీరోదాత్తుఁడైన నాయకుఁడే యీ శృంగారరసమున కాలంబనమైయుండి యుత్తమమయిన గార్హస్థ్యమును ప్రదర్శించిననే 'యథారాజా తథాప్రజా' అన్నట్లు లోక మాతని ననుసరించుచుండును. ప్రజలు ధర్మపరుఁడగు ప్రభువును సేవించిన ట్లధర్మపరుని సేవింపరు. కనుకనివలె నట్టివానినిఁ బదభ్రష్టునిఁ జేయుదురు. ప్రాచీనకాలములో మన దేశమున రాజు ధర్మపరుఁడుగా నుండెడివాఁడు. ధర్మ మభివృద్ధినొందిన ట్లధర్మము వర్ధిల్లదు. ధర్మము నణఁచిన కామమున మునిఁగి యగ్నివర్ణుఁడు తుదికి క్షయరోగముచే మృతినొందెను. ధర్మమునణఁచిన యర్థపిపాసతో దుర్యోధనుఁడు సకుటుంబముగా నశించెను. ధర్మపరుఁడగు ధర్మరాజునకు లోఁగియుండి యర్థపరుఁడయిన భీముఁ డీప్సితమును బొందెను. కాఁబట్టి యర్థ కామముల నణఁచిన ధర్మము ప్రధానము. ఉత్తమసంస్కారము గలవారే యిట్టి ధర్మబద్ధమగు శృంగారమున కాలంబనము కాఁదగినవారు. అట్లుగానినాఁ డది క్షుద్రశృంగారమగును. సాధారణుల శృంగారమున ననుభావాది సామగ్రి తగినంత లేకపోవుటవలన నచ్చట రసము పుష్టముగాదు. కాన నది రసముగాక రసాభాసమే యగును. రసాభాసమైనను బరకీయారతిని విడిచి తిర్యఙ్మ్లేచ్ఛగతమగుచో నది యుపాదేయమే యగును. అందాస్వాద్యత గలదు. కాని జగదవిచ్ఛిన్నతకుఁ దన్మూలమున లోకకల్యాణమునకు శృంగార ముత్తమమయినదే! అది పరమపవిత్రముగా నుండవలెను. క్షుద్రముగా నుండరాదు.

శాకుంతలమున దుష్యంతుఁడు శకుంతలను దిరస్కరించిన ఘట్టమునుజూతుఁడు. మహర్షియగు కణ్వునిచేఁ బంపఁబడి పూజ్యురాలగు గౌతమిచేతను, శిష్యులచేతను, గొనిరాఁబడి స్వయముగా సౌందర్యాధిదేవతవలె నున్న శకుంతలను, బైఁగా నేను నీ భార్యనని చెప్పుచున్నను దుష్యంతుఁడు దిరస్కరించెను. ఏలన, వివాహము సేసి కొన్నట్లాతనికి స్మృతిలేదు. పరస్త్రీ స్పర్శపాంసులుఁడ నగుదునేమో యని యాతనికి భయము. ఇట నాతని ధర్మబుద్ధి మెచ్చుకొనఁదగినది గదా! దొరకుటయే తడవుగా దానినిఁ దన యంతఃపురములోనికిఁ గొనిపోలేదు. మఱొకటి జూడుఁడు. శ్రీరాముని కుమారుఁడగు కుశుఁ డొక గదిలో నిద్రించుచుండఁగా నాతనియొద్ద కొక స్త్రీ (అయోధ్యాపుర లక్ష్మి) వచ్చినది. ఆమె యయోధ్యాపుర లక్ష్మి యని యాతనికిఁ దెలియదు. అప్పు డామెనుజూచి యాతఁ డనుచున్నాఁడు:—

కా త్వం శుభే! కస్యపరిగ్రహో వా । కింవా మదభ్యాగమకారణం తే
ఆచక్ష్వమత్వా వశినాం రఘూణాం । మనః పరస్త్రీ విముఖప్రవృత్తి.

ఓ కల్యాణీ! నీ వెవరవు? ఎవని భార్యవు? ఎందులకు వచ్చితివి? రఘువంశస్థులు పరస్త్రీవిముఖులని గ్రహించి యెందులకు వచ్చితివో చెప్పుము.

ధర్మప్రవృత్తి యనఁగా నిట్టిదికదా!

ఇట్లే వీరరసము గూడ ధర్మరక్షకత్వమూలమున లోకకల్యాణహేతు వగును. వీరులలో స్వార్థత్యాగము, ధర్మపరతంత్రతయు ముఖ్యములు. వీరులగు శ్రీరామ, యుధిష్ఠిరాదుల స్వార్థత్యాగ ధర్మనిష్ఠతలు వివరింపఁ బనిలేదుగదా! కావున వీర రసమునకునాలంబనము ధీరోదాత్తులే కావలయును. ఏ రసమువలనలోకకల్యాణము గలుగునో వానికిఁ గావ్యమునఁ బ్రాధాన్య మిచ్చిరి. భరతుఁడు శృంగారవీరములకే ప్రాధాన్య మిచ్చినను దరువాతి విశ్వనాథాదులు శాంతరసమునకుఁగూడ సమాన స్థాన మిచ్చిరి. ఈ మూఁడే ధర్మానుబంధముగలివి లోకకల్యాణహేతువు లగును. అద్భుతము శృంగార వీరములతో సంకరముగానే యుండును. శృంగార వీర శాంత

కొందఱు కావ్యమున వీరశృంగారములే యుండవలెనన్న నియమము భర తుఁడు సేయలేదనియు, భరతుని 'శృంగారో వీర ఏవవా' అను వాక్యమునకు బై యర్థము గాదనియు లోకప్రసిద్ధినిఁబట్టి మాత్రమే శృంగార వీరములను గ్రహించె ననియుఁ జెప్పుచుఁ గరుణ రౌద్రాది రసములను గూడఁ బ్రధానముగా గ్రహించి కావ్యములను రచింపవచ్చుననియు నుత్తరరామాయణమున భవభూతి కరుణమును, వేణీసంహారమున భట్టనారాయణుఁడు రౌద్రమును బ్రధానముగాఁజేసిరనియు, నిదే విధమున నితర రసములను గూడఁ బ్రధానముగాఁ జేసి కావ్యముల రచింపవచ్చు ననియుఁ దెలుపుదురు.

నాయకులు స్వార్థమును ద్యజించి ధర్మతత్పరత్వమున వర్తించుచోట్ల నద్భుతరసము కనఁబడుచునే యుండును. 'వీర స్యైవచ యత్కర్మ సోఽద్భుతః పరికీర్తితః' (వీరుని కర్మయే యద్భుత మనఁబడును. అనఁగా నద్భుతరసముగాఁ బరిణమించును) అనిభరతుఁడు. ఇట్టి లోకోత్తర కావ్యమును గురించియే 'విశ్వశ్రేయః కావ్యం' అని నన్నయభట్టు వాకొనినాఁడు. కరుణ, బీభత్స, భయానక, హాస్యరసముల కట్టి లోకోత్తర నాయకాశ్రయత్వ మక్కఱలేదు. వీనికున్నంత ధర్మసంబంధము వానికి లేదు. ఈ కారణములను బట్టి శృంగార వీర శాంతములకే కావ్యమునఁ బ్రాధాన్యము స్వీకరింపఁబడినది.

## స్థాయిభావములు

క. రతి, హాస, శోక, యత్నము,
లతిభీతి, జుగుప్స, రోష, మచ్చెరువు, శమం
బతులక్రమమున నవి సాం
ద్రతము రసస్థాయిభావ భావనఁ జెందుఁ. ౭

శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, బీభత్స, రౌద్ర, అద్భుత, శాంతము లను తొమ్మిది రసములకును గ్రమముగా రతి, హాస, శోక, యత్న (ఉత్సాహము) భయ, జుగుప్సా, క్రోధ, విస్మయ, శమములు స్థాయిభావములు.

స్థాయిభావము లనఁగా వాసనారూపమున సామాజిక హృదయమున నున్న రత్యాదులు.

> "చిరం చిత్తేఽవతిష్ఠంతే సంబధ్యంతేఽనుబంధిభిః
> రసత్వం యే ప్రపద్యంతే ప్రసిద్ధాః స్థాయినోఽత్ర తే
> సజాతీయైర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్
> యావద్రసం వర్తమానః స్థాయీభావ ఉదాహృతః"

వీని యర్థము వెనుక వివరింపఁబడినది.

క. రసములకుఁ దొమ్మిదింటికిఁ
బొసఁగిన యీ స్థాయిభావములకు నొనర్తుర్
రసికత లక్షణ లక్ష్యము
లసదృశ రసశాస్త్రవేత్త లౌ నా ననఁగ. ౮

స్పష్టము.

## రతి లక్షణము

క. తరుణీమణులకుఁ బురుషుల
కరయఁగ సంభోగవిషయమగు నభిలాష
స్ఫురణము మనములఁ బొడమిన
ధరలో నది రతియనంగఁ దగు నెట్లన్నన్. ౯

పురుషులకనుటకన్నఁ 'దరుణుల'కనుట యుక్తము. తరుణీతరుణులకు మనస్సునఁ బొడమిన సంభోగ విషయకమగు నభిలాష లేక కామము రతి. "తత్ర సంభోగ విషయక ఇచ్ఛావిశేషో రతిః" (సంభోగ విషయకమగు నిచ్ఛావిశేషమే రతి) అనియు, "యూనోరన్యోన్య విషయాస్థాయినీచ్ఛా భవేద్రతిః" (యువతీయువకుల యన్యోన్యవిషయకమగు నిచ్ఛయే రతి) అనియును రతిలక్షణము కానఁబడుచున్నది. కాని రసగంగాధరకారుఁడు "తత్ర స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః" (స్త్రీపురుషులయొక్క యన్యోన్యాలంబనము గల ప్రేమమను చిత్తవృత్తి విశేషమగు రతి స్థాయిభావము) అని వచించెను. ఇట "సంభోగేచ్ఛ" యనక ప్రేమరూపమగు చిత్తవృత్తివిశేషమే రతి యని నిర్వచింపఁబడినది. రసములును, భావములును నివ్వన్నియుఁ జిత్తవృత్తివిశేషములే యని గర్తుంచుకొనవలెను. విభావాదులచే లెస్సగాఁ బరిపుష్టములయిన యా చిత్తవృత్తి విశేషములు రసములనియు, అపరిపుష్టములయినచో భావములనియు వ్యవహరింపఁబడును. ఈ రతియొక్క యవస్థ లీక్రిందివిధమునఁ బెద్దలు దెలిపిరి.

అంకుర, పల్లవ, కలికా, ప్రసూన, ఫల, భోగభా,గియం క్రమశః
ప్రేమా, మానః ప్రణయః స్నేహో రాగోఽనురాగశ్చ.

ఈరతి యంకురావస్థయందుఁ బ్రేమమనియుఁ బల్లవావస్థయందు మానమనియుఁ గలికా(మొగ్గ)వస్థయందుఁ బ్రణయమనియుఁ, బుష్పావస్థయందు స్నేహమనియు, ఫలావస్థయందు రాగమనియు, భోగావస్థయం దనురాగమనియు జెప్పఁబడును. ఇందు "అంకుర...ఫలాంతమగు పంచావస్థలు గల రతి పూర్వరాగమున ననఁగా సంభోగావస్థకుఁ బూర్వమునను, భోగావస్థగలరతి సంభోగమందును నుండును. పూర్వరాగమున నీ పంచావస్థలుగల రతివలన నాయికకుఁ గొందఱ మతమున దశావస్థలును, మఱి కొందఱమతమున ద్వాదశావస్థలును గలుగును. ఆ యవస్థలు ముందు తెలియును.

"ఆదౌ వాచ్యః స్త్రియారాగః పుంసః పశ్చాత్తదింగితైః"

ఈ రతి ప్రథమమున నాయికకే కలిగినట్లును, నా యా యింగితములచేఁ బిమ్మట నాయకునికిఁ గలిగినట్లును గావ్యమునఁ వర్ణింపఁబడవలెను. ఒకానొకచోఁ బ్రథమమున నాయకునికే కలిగినను నాయికకే కలిగినట్లు వర్ణించుట హృద్యమార్గము ఏలన, నాయకుఁడు పౌరుషోపేతుఁడై యుండవలెను. అనఁగా ధైర్య స్థైర్యాదులం గలిగి యుండవలెను. అట్లయిననే యాతఁడు శోభిల్లును. కాన నాతని మనసునఁ బ్రథమమున రతి గలిగినను గావ్యమున సహృదయులు దానిని నట్లు నిబంధింపరు. ఈ విషయమును రుద్రటుఁడు గూడ నిట్లు దెలిపెను.

పూర్వం నారీ భవేద్రక్తా పుమాన్ పశ్చాత్తదింగితైః
తత స్సంభోగ లీలేతి స్వభావ సుభగా స్థితిః.

మొదట నాయిక నాయకునిఁ జూచి యనురక్తురాలం గావలెను; దాని యింగితములచేఁ బిమ్మట నాయకుఁ డనురక్తుఁడు కావలెను; పిమ్మట వారి సంభోగ లీల; ఇది స్వభావసుందరమగు విధము.

ఉ. చల్లఁదనంబె చంద్రునకుఁ; జక్కఁదనంబె ప్రసూన ధన్వికిన్;
సల్లలితోరుసౌరభమె చైత్రున; కొక్కనికొక్క మేలిమే
తెల్లముగాక; నాపతి యుదీర్ణగుణాఢ్యుఁడు నారసింహభూ
వల్లభుఁ; డట్లు సర్వగుణవైభవ మెవ్వరికైనఁ గల్గునే? ౧౦

ఒక నాయిక నరసభూపాలుని గుణములు నిట్లు నుతించుచున్నది; చంద్రున కొక్క చల్లఁదనమే కలదు; మన్మథున కొక్క చక్కఁదనమేకలదు; చైత్రున కొక్క సౌరభమే కలదు; ఇందొక్కొక్కరి కొక్కొక్క గుణముమాత్రమే కలదు; నా ప్రియుఁ డగు నరసభూపాలుఁడు సర్వగుణాఢ్యుఁడు.

ఇట నాయిక చేసిన నుతివలన నరసభూపాలునియం దామెకుఁ గల రతి వ్యక్తమగుచున్నది. ఇటఁ దనకు రతి యుదయించినట్లు నాయిక నోటిమాటలతోఁ దెలుపలేదు. ఆ వర్ణనముచే వ్యక్తమగుచున్నది.

## హాస లక్షణము

క. చేకొని యప్రకారములగు
నాకార వికారచేష్ట లాలోకింపన్
గైకొను మనోవికాస
స్వీకారము హాసమయ్యె వినుమెటన్నన్. ౧౧

'అక్రూరములగు'నకు 'అతి వికృతములగు' అని పాఠాంతరము. ఇదియే లెస్స. మఱియు వికృతసంభాషణచేఁ గూడ హాసము గలుగును. కావున "కం. చేకొని యతి వికృతములగు ! నాకారాలాపచేష్టితాదులు చూడన్" అను పాఠము యుక్తము. 'అతి వికృతములయిన యాకారము, ఆలాపములు, చేష్టితములు మొదలయినవానినిఁ జూచుటచేఁ గలుగు మనోవికాసమే హాసము' అనియర్థము. ఈ యర్థమే యీక్రింది సాహిత్యదర్పణ, రసగంగాధరముల లక్షణములను గానఁబడుచున్నది.

వికృతాకార వాగ్వేషచేష్టాదే ర్న ర్తకాద్భవేత్
హాస్యోహాసః స్థాయిభావః      అని సాహిత్యదర్పణము.

వాగంగాది వికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః (వాగ్వికారములను, అంగవికారములను జూచుటవలనఁ బుట్టిన చిత్తవికాసరూపమగు వృత్తివిశేషమే హాసము) అని రసగంగాధర లక్షణము.

చ. అదె! యిదె! వచ్చెవచ్చె నరసాధిపు దాడియటంచుఁ బాళెముల్
బెదరి బరీదుఁడేగు నెడఁ బెంపఱి ఖానులు వెన్కముందుగాఁ
గదిసి హయాళినెక్కి హయకంధరముల్ వొడగాన కప్పుడే
చదిపిరి వాజిమస్తముల శత్రులఁటంచు భ్రమింతురెంతయున్. ౧౨

తా. బరీదుఁ డను నొక ముసల్మానుప్రభువు నరసాధిపునిదాడి "వచ్చె వచ్చె" నని సేనలు బెదరఁగాఁ దాను బరుగిడెను. ఆతని సేనానాయకులు విభ్రాంతులై గుఱ్ఱములపై వెనుకముందుగాఁ గూర్చుండి గుఱ్ఱపుఁ దలలను గానక యప్పుడే నరస భూపాలు సైన్యములువచ్చి తమ గుఱ్ఱపుఁ దలలను ద్రుంచినవని భ్రమపడిరి.

ఇట ఖానులు వెన్కముందుగాఁ గూర్చుండుట యను వికృతచేష్ట హాసమును వ్యక్తము సేయుచున్నది.

ఈ హాసోదాహరణ పద్యమును "అనఘనృసింహా!నీయరి" ఇత్యాద్యేతద్గ్రంథ భయోదాహరణ పద్యమును సమానముగానే యున్నవి. కావునఁ బ్రతాపరుద్రీయమందలి యీ క్రింది శ్లోకమును గ్రహింతము.

బిభ్రాణాః కబరీర్ధృతాంజన దృశః కృత్వా కుచౌ కృత్రిమౌ
స్త్రీవేషాన్నిశి కాకతీంద్ర నగరే ప్రచ్ఛన్నరూపాః నృపాః
దృష్ట్వాత్వామపాస్య వక్షసి కుచావాకృష్య నీవీస్పృశో
హ్రీహీకార మితి త్యజంతి విపణౌ శ్రేణీషు దూరాద్విటాః

తా. కొప్పులు పెట్టుకొని, కన్నులకుఁ గాటుక పెట్టుకొని, కృత్రిమ స్తనములు ధరించి స్త్రీవేషములతోఁ బ్రచ్ఛన్నరూపులై కాకతీంద్రనగర వీథులలోఁ జనుచున్న శత్రురాజులను జూచి దుండగీండ్రగు విటులు దువ్వాలువలూడ్చి కుచములులాఁగి నీవినిఁదాఁకి హీహీ యని నవ్వుచున్నారు.

## శోక లక్షణము

క. హితజన విరహ వ్యధచే
నతిశయమై జనుల మానసాంభోజమునన్
బ్రతిదినము పొడము దుఃఖం
బతిభూమివహింప శోకమగు నెట్లన్నన్. ౧౩

'హితజన విరహదుఃఖమునఁ గలుగుదుఃఖ మతిశయించినచో శోకమగును' అని యర్థము. ఇట 'వ్యథచేఁ బొడము దుఃఖము' అనుట పొరపాటు. మరియు నొక హిత జన విరహముచేతనే శోకము గలుగదు.

ఇష్టజనస్య వినాశాత్ శాపాత్క్లేశాచ్చ బంధనాద్వ్యసనాత్
ఏతైరర్థవిశేషైః కరుణాఖ్యరసస్సముద్భవతి. (నాట్యశాస్త్రము).

ఇష్టజన వినాశము, శాపము, క్లేశము, బంధనము, వ్యసనము మొదలయిన వానివలనఁ గరుణరసము గలుగును. మరియును రసగంగాధరమున

"పుత్రాదివియోగ మరణాదిజన్మా వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషశ్శోకః" (పుత్త్రుఁడు మొదలగువారి వియోగములవలనఁ గాని మరణాదులవలనఁగానీ కలిగిన వైక్లబ్యమనుచిత్తవృత్తివిశేషమే శోకము) అని లక్షణము చెప్పఁబడినది. ఈరెండు లక్షణములును సమగ్రములు. కాన గ్రాహ్యములు.

మరియు లక్షణపద్యమున "దుఃఖం బతిభూమి వహింప శోకమగు" నని యున్నది. "శోకస్య పరిపోషః కరుణః" (శోకముయొక్క పరిపుష్టావస్థయే కరుణము) అని కలదు. అతిభూమిని వహించిన శోకము కరుణమే యగునుగదా! కాన నది శోక స్థాయిభావ లక్షణము.గాక కరుణరసలక్షణ మగుచున్నది. "ఇష్టజనవిరహాదినా ఆత్మని దుఃఖాతిభూమి శ్శోకః" అను ప్రతాపరుద్రీయ శోక స్థాయిభావలక్షణము గూడ నీ దోషగ్రస్తమే యగుచున్నది.

చ. పటులనృసింహశౌర్యశిఖపాలుగఁ జేసిన యట్టి పాపపున్
శతధృతి కింతటం జలముజాలదు; మమ్మును దావపావక

ప్రతతులపాలు చేసె; నని పల్కుచు రోదనముందు విద్విష
త్సతులకు బాష్పపూరములె చాలు వనానలముం హరింపఁగన్.

శత్రుకాంతలకు భర్తృవిరహ కారణమున బాష్పము లుదయించినవి. ఇట వారి పలుకులును, వారి రోదనములును శోకమును వ్యక్తపఱచును.

## ఉత్సాహ లక్షణము

క. అత్యున్నత లోకోత్తర
కృత్యంబులు సేయవేఁడి కృతకృత్యులిలన్
నిత్యముఁ దలఁచు ప్రయత్నం
బత్యంతోత్సాహమయ్యె నది యెట్లన్నన్. ౧౫

తా. లోకోత్తర కార్యముల సాధింపఁజేయు గట్టి యత్న ముత్సాహము. లోకోత్తరకార్యములన నిట దాన, ధర్మ, దయా, యుద్ధాదులు.

రసగంగాధరమున దీని లక్షణ మిట్లున్నది.

"పరపరాక్రమమహానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్య శ్చిత్తవృత్తి విశేష ఉత్సాహః" (శత్రువులయొక్క పరాక్రమముయొక్క క్షీణతాదులను స్మరించుట వలనఁ బుట్టిన యౌన్నత్య ముత్సాహము.

మ. అసిఁ జెండాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్ఛటం బేల్చి శ
స్త్రసరత్సీరములన్ రణోర్వితలముం సంక్షుణ్ణముంజేసి వై
ర్యసృగార్ద్రింబొనరించి ప్రోదిగొనకుద్యత్కీర్తి సస్యౌఘముల్
వెససిద్ధించునె? యంచుఁబల్కునరసోర్వీనాథుయోధావళుల్ ౧౬

తా. నరసభూపాలుని యోధులు "శాత్రవులను వృక్షములను గొట్టివేసి శౌర్యాగ్నితోఁగాల్చి, శస్త్రములను నాఁగళ్ళతో రణభూమిని క్షుణ్ణముగాఁజేసి శత్రువుల రక్తముచేఁ దడపినఁగాని కీర్తిసస్యములు పండునే?" యనిపలుకుదురు.

ఇటయోధావళియొక్క పలుకులు రణోత్సాహమును వ్యక్తముసేయుచున్నవి.

## భయలక్షణము

క. క్రూరాకారముఁ జూచిన
నారయ వేజను నిహ్వాదయముందు ననర్గాం

క్రూరాశంకనమగునది
ధారుణిలో భయమనంగఁ దగు నెట్లన్నన్. ౧౮

'క్రూరాకారాదికమున' అనిపాఠాంతరము. క్రూరాకారాదులను జూచుట వలన నేజనునిహృదయమందు మరణాదిరూపమహా నర్థశంకకలుగునో యది భయము.

"వ్యాఘ్రదర్శనాదిజన్మా పరమానర్థ విషయకో వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తి విశేషః భయం" (వ్యాఘ్ర దర్శనము మొదలగు వానివలనఁ బుట్టినట్టి పరమానర్థ విషయకమగు వైక్లబ్యరూపమగు చిత్తవృత్తివిశేషము భయము) అని రసగంగాధర లక్షణము.

ఇటభయము సర్వప్రాణి సాధారణమైనను "ఏ జనుని హృదయమందు" అని చెప్పఁబడుటచేఁ బశుపక్ష్యాదులకుఁ గలుగు ననర్థశంక భయముగాదని యర్థమగును. కాననిది ప్రమాదము. జనశబ్దమునకు జంతువని యర్థము చెప్పుకొన్నచో సరిపోవును.

స్థాయిభావమగు భయమునకును సంచారిభావమగు త్రాసమునకును భేదమేమి? అన శార్దూలాది దర్శనమువలనఁ గలుగుమరణాదిరూపమహానర్థశంకభయము. ఇతర భయహేతువులవలనఁ గలుగు మరణాది భిన్నమగు ననర్థశంక త్రాసము. ఈత్రాసము వ్యభిచారిభావము.

చ. అనఘ! నృసింహ! నీయరి వనావళికేఁగి గుహాగ్రసుప్తుఁడై
యనిమరలంగలంగని భయంపడి పాఱుచు "నాజిగాదు శా"
దని సతి తెల్పినం దెలియఁడౌర! నిషాదులఁ జాపహస్తులం
గని విపినేభపంక్తిఁ గని క్రమ్మఱనాజియశాఁ దలంచుచున్. ౧౮

తా. నిద్రనుండి తటాలునలేచి పరుగెత్తుట, భార్యదెలిపినను నమ్మకుండుట, మొదలగునవి శత్రువుయొక్క భయమును వ్యక్తముసేయుచున్నవి. అది సామాన్య భయముగాక మరణరూపానర్థ శంకగానే గ్రహింపవలెను.

## జుగుప్సా లక్షణము

కం. పలలాస్థి శోణితాదులఁ
బలుమాఱును జూడ నరుచిభావము లోనం
దళుకొత్త నిగర్హణ మది
తలపోయ జుగుప్సయనఁగఁదగు నెట్లన్నన్. ౧౯

రక్తమాంసాదులను గాంచుటవలనఁ గలుగు నేవగింపు జుగుప్స. అయితే కొందఱకు మాంసాదులను జూచుటవలన నేవగింపు గలుగదుగదా! కాన నీ లక్షణ మసంపూర్ణము. ప్రతాపరుద్రీయమున "అర్థానాం దోషదర్శనాదిభిర్గర్హా జాగుప్సా" (ఆ యా పదార్థములందలి దోషదర్శనాదులచేఁ గలుగు రోఁత జుగుప్స) అని చెప్పఁబడినది. ఎవనికి దోషము గనఁబడిన వానికే రోఁత. లేనివానికి లేదు అని యర్థము వచ్చుచున్నది. రసగంగాధరమున

"కదర్య వస్తువిలోకన జన్మా విచికిత్సాఖ్య శ్చిత్తవృత్తి విశేషో జుగుప్సా" (ఏవగింపుగొలుపు పురీషాది వస్తువులను జూచుటవలనఁ బుట్టినట్టి విచికిత్స యను చిత్తవృత్తివిశేషము జుగుప్స యనఁబడును) అని చెప్పఁబడియున్నది. ఈ లక్షణమే సుందరమైనది. ఏలనఁ, బురీషాది దర్శనమున నెల్లరకును రోఁత గలుగును. రక్త మాంసాదుల దర్శనమువలనఁ గానీ, పదార్థములందలి దోష దర్శనమువలనఁ గానీ యెల్లరకును రోఁత గలుగదు. కొందఱకుమాత్రమే కలుగును. కావునఁ గదర్యవస్తు విలోకనమున నెల్లరకును సర్వసాధారణముగా నేవగింపుగొలుపు వస్తువులనుజూచుట. దీనివలనఁ గలుగు రోఁత జుగుప్స.

చ. తలలు సరోజముల్, మెడదు తండముక్రొన్నురు, వంత్రజాలముల్
జలఘణు, లస్థిఖండములు, శంఖములై తగు నెత్తుటేర్లలోఁ
గలభకపాలనౌచయముఁ గ్రక్కున నెక్కి చరించు సంగర
స్థలుల నృసింహనిర్దళిత శత్రువసారస మత్తభూతముల్. ౨౦

ఇట భూతములు నెత్తుటేర్లలోఁ జరించుచున్నట్లు చెప్పఁబడినది. ఆ నెత్తు టేర్ల వర్ణనము జుగుప్సను వ్యక్తము సేయుచున్నది.

## క్రోధ లక్షణము

కం. అపకారకారులకు నరు
లపరాధమొనర్ప నే మహామహుని మనం
బు పరిజ్వలితంబగు నది
యపరిమితక్రోధమయ్యె నది యెట్లన్నఁ.  ౨౧

"శత్రుకృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః" (శాత్రవులు నేసిన యప చారముచే మనసు ప్రజ్వలించుటయే క్రోధము) అని ప్రతాపరుద్రీయము. "గురు బంధువధాది [illegible] ప్రజ్వాఖ్య శ్చిత్తవృత్తి విశేషః క్రోధః।

అయంచ పరవినాశాది హేతుః । క్షుద్రాపరాధ జన్మా తు పరుష వచన, అసంభావణాది హేతుః । అయ మేవ అమర్షాఖ్యో వ్యభిచారీతి విశేషః” (గురుబంధు వధాదులగు పరమాపరాధముల వలనఁ బుట్టిన ప్రజ్వలన నామకమగు చిత్తవృత్తి విశేషము క్రోధము. ఇది పరవినాశము సేయును. ఈ క్రోధము మహాపరాధమువలనఁ గాక క్షుద్రాపరాధమువలనఁ బుట్టినచోఁ బరుషవచనములు, అసంభావణము మొదలగువానిని మాత్రమే కలిగించును. ఇదియే యమర్షాఖ్యమగు వ్యభిచారి భావము.)

చ. స్థిరభుజ విక్రమక్రమనృసింహ! నృసింహ! భవత్కరాగ్రభీ
కరకరవాలసిద్ధుఁడతిగాఢతమశ్శోరససిద్ధిఁగోరి బం
ధురహయసింధురావళులతో రణదుర్గ కనర్గళోన్నతిన్
నరబలి వెట్టు దుర్మదసనాథరిపుక్షితినాథయూథమున్.          —౨౨

ఓనరసభూపాలా! నీచేతికత్తియను సిద్ధుఁడు కీర్తియనురససిద్ధినిఁ గోరి యుద్ధభూమియనుకాళికి మదించిన శత్రురాజులను నరబలి వెట్టును.

ఇటఁ ‘గరవాలమున నరబలి వెట్టును’ అనియుంటచేఁ గ్రోధము వ్యక్తమగుచున్నదని యభిప్రాయము.

కాని ‘కరవాలసిద్ధుఁడు యశోరససిద్ధినిఁ గోరి’ యని చెప్పుటచే సిద్ధుఁడు రససిద్ధినిఁగోరి పెట్టు నరబలి యుత్సాహయుక్తము. కాని క్రోధయుక్తము గాదు. ఇందుఁ గ్రోధమేమియుఁ గానరాదు. రూపకబలమునఁ గ్రోధమునకుబదులుగా నుత్సాహమే వ్యజ్యమానమగుచున్నది. మరియు నీ పద్యమున శత్రుకృతాపచారమేమియును జూపఁబడలేదు. కాని యది యాక్షేపించుకొనవచ్చును. ఇందుఁ గరవాలముకర్తయగుటచే నదియచేతనమగుటచే దానికి మనఃప్రజ్వలన రూపమగు చిత్తవృత్తియుండదు. కాన నీయుదాహరణము చింత్యము.

ఈ క్రింది కావ్యప్రకాశోదాహరణము గ్రాహ్యము.

కృతమనుకృతం దృష్టం వా యై రిదం గురుపాతకం
మనుజపశుభిర్నిర్మర్యాదై ర్భవద్భి రుదాయుధైః
నరకరిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినా
మయమహమసృఙ్మేదోమాంసైః కరోమి దిశాంబలిం.

గీ. వీతమర్యాదులై గురుపాతకంబు
సలిపి సహియించి చూచిన నశరమనుజ

పశుల మిమ్మెల్ల నే గృష్ణ పార్థభీమ
యుక్తముగ భూతబలియిత్తు రక్తమునను.

ఇది ద్రోణవధానంతర మర్జునాదులను గూర్చి క్రుద్ధుఁడైన యశ్వత్థామ యన్న పలుకులు. ఇట శత్రుకృత మహాపరాధముచేఁ గలిగిన ప్రజ్వలన రూపమగుక్రోధము తెల్లగా వ్యక్తమగుచున్నది.

## విస్మయ లక్షణము

కం. వివిధాపూర్వములగు వ
స్తువులు గనుంగొనిన యెడల సుజనుని మదిలోఁ
దవిలిన ప్రమోద విస్తర
మవిరళ విస్మయమనంగ నగు నెట్లన్నన్. ౭౩

"అపూర్వవస్తుదర్శనా చ్చిత్తవిస్తారో విస్మయో మతః" (అపూర్వములగు వస్తువుల దర్శనమువలనఁ గలుగు చిత్తవిస్తారము విస్మయము) అని ప్రతాపరుద్రీయము. పద్యములోని "సుజనుని" పదము వ్యర్థము. సుజనునికి మాత్రమే చిత్తవిస్తారము గలుగును. ఇతరునికిఁ గలుగదను నర్థము వచ్చును. మరియు 'ప్రమోద విస్తరము' అన రాదు. 'చిత్తవిస్తారము' అనవలెను. ఇంతేకాక 'ప్రథనేవావశబ్దే' అను పాణినీయ సూత్రము ననుసరించి శబ్దప్రపంచమునందు 'విస్తరము' అనియుఁ దదితరవిషయమున 'విస్తారము' అనియు నుండవలెను: శబ్దవిస్తరము, చిత్తవిస్తారము మొదలగునవి; కానఁ బ్రమోదవిస్తార మనవలెను. రసగంగాధరమున "అలౌకికవస్తు దర్శనాది జన్మా ఆశ్చర్యాఖ్యో విస్మయః" (అలౌకికమగు వస్తువులను జూచుటవలనఁ బుట్టిన యాశ్చర్యమను చిత్తవృత్తివిశేషము విస్మయము) అని లక్షణము సేయఁబడినది.

చ. ధరణి నృసింహభూవరు ప్రతాపమహాతప మబ్జజాండ క
ర్పరములునిండి తీవ్రగతిఁ బర్వ నఖర్వసగర్వవైరి భూ
వరులు వడంకసాఁగుదు రవార్యనవవ్యజనాతపత్ర వై
ఖరులు దొలంగఁ జేయుదురు కన్నులఁ జీకటిగప్పుచుండఁగన్. ౭౪

తా. నరసభూపాలుని ప్రతాపరూపమగు బిట్టెండ బ్రహ్మాండమునఁ దీక్ష్ణముగాఁ గాయుచుండఁగా శత్రురాజులు కన్నులు మిఱుమిట్లుగొని వడఁకుచుఁ దమ ఛత్రచామరాదులను దొలఁగించుకొందురు.

నరసభూపాలుని ప్రతాపము బ్రహ్మాండమంతయుఁ గప్పి మిఱుమిట్లు గొలుపు చుండెను. ఈ యపూర్వవస్తు దర్శనమువలన శత్రురాజులకు విస్మయము గలుగు చున్నది. వారి చేష్ట లా విస్మయమును వ్యక్తము సేయుచున్నవి.

## శమ లక్షణము

కం. నిరుపమ వైరాగ్యాదుల
కిరవై నిశ్చలతఁబూని హృదయము తిరమై
నరులకుఁ బరిణతిఁ జెందిన
ధరలో నది శమమనంగఁదగు నెల్లన్నర్. ౨౫

తా. వైరాగ్యాదులచే మనస్సు విషయములనుండి నివృత్తమగుట శమము. "వైరాగ్యాదినా నిర్వికారచిత్తత్వం శమః" (వైరాగ్యాదులచే జిత్తము నిర్వికారమైయుండుట శమము) అని ప్రతాపరుద్రీయము. "నిత్యానిత్య వస్తువిచార జన్మా విషయవిరాగాఖ్యో నిర్వేదశ్శమః" (ఇది నిత్యము, ఇది యనిత్యము అను విచారము వలనఁ బుట్టిన విషయవిరాగ మను పేరు గల చిత్తవృత్తివిశేషమగు నిర్వేదము శమము) అని రసగంగాధర లక్షణము.

ఉ. ఘోర భవాదిదుఃఖములఁ గుందఁగనీక నృసింహుఁ డౌర! దు
ర్వారఫలప్రదంబగు విరక్తి సుఖంబొనరించెనంచు నీ
వైరులు మౌనులై విపినవాటిని నీవ గురుండవంచు నీ
పేరిటి యక్షరంబులె జపింతురు శ్రీ నరసింహభూవరా! ౨౬

తా. నరసభూపాలుని శత్రువులు సంసార పరిత్యాగముసేసి యడవుల నాశ్రయించిరని చెప్పుటచే వారి వైరాగ్యము వ్యక్తమగుచున్నది.

ఇట శత్రురాజులు సంసారపరిత్యాగము సేయుట వాస్తవికమగు వైరాగ్యమునఁగాదు. ప్రాణాపాయము దప్పించుకొనుటకై యరణ్యావాసము సేసిరి. అట్టిచో నిది యుక్తమైన యుదాహరణము గాదనవచ్చును. కాని మొదటఁ బ్రాణాపాయభయముచేతనే సంసార పరిత్యాగముసేసి యరణ్యముల నాశ్రయించిరి. క్రమముగా వారి కచ్చట యథార్థమైన వైరాగ్యము గలిగినది. కావుననే వారు నృసింహ నామాక్షరముల జపించుచుండిరి. మొదట వారి కా సంసార పరిత్యాగము కష్టముగానున్నను దుదికి, గీలును మేళ్ళకే వచ్చు' నను లోకోక్త్యనుసారముగా వారు

దానిని మేలుగానే తలఁచిరి. కావున వారిది యథార్థమైన వైరాగ్యమే యని గ్రహింపవలెను.

కం. ఈరసముల కుత్పాదన
కారణము విభావమనఁగఁగల; దది ద్వివిధం
బై రంజిలు; నాలంబన
మారయ నుద్దీపనంబుననఁగ ధరిత్రిన్. ౨౭

ఇంతవఱకును స్థాయిభావములే చెప్పఁబడియుండఁగా "ఈ రసములకు" అని యిటఁ జెప్పుట యనుచితము. రసములన నిట నుపచారముచే స్థాయిభావములనియే యర్థమును జెప్పుకొనవలెను. "రత్యాద్యుద్బోధకా లోకే విభావాః కావ్యనాట్యయోః" (లోకవ్యవహారమున రత్యాద్యుత్పత్తికిఁ గారణములయిన నాయకాదులు కావ్యములలో విభావములని వ్యవహరింపఁబడుదురు) అని సాహిత్యదర్పణము. "విభావ్యంతే ఆస్వాదాంకుర ప్రాదుర్భావ యోగ్యాః క్రియంతే సామాజిక రత్యాదిభావాః" (సామాజికుల హృదయమున వాసనారూపముగా బీజప్రాయముగా నున్న రత్యాది భావములు వేనిచే నంకురరూపమున నాస్వాద్యమానములగునో యవి విభావములు) అని వ్యుత్పత్త్యర్థము. ఆ విభావ మాలంబనవిభావమనియు, నుద్దీపనవిభావమనియు నిరుదెఱఁగులు. ఈ గ్రంథమున నొక్క శృంగారమునే కవి ప్రదర్శింపఁదలఁచుటచే శృంగార విభావములను మాత్రమే పేర్కొనుచున్నాఁడు.

## విభావ స్వరూపము

కం. వనితయుఁ బతియును నాలం
బనమగు; నుద్దీపనంబు ప్రాయంబును సొ
మ్మును, జేష్టలు, మదనాదులు
ననఁదగు; నేర్పఱతు వీనికగు లక్ష్యంబుల్. ౨౮

శృంగారరస స్థాయిభావమగు రతికి నాయికానాయకు లాలంబనవిభావము. వారి ప్రాయము, భూషణములు, చేష్టలును నుద్దీపన విభావములు. ఆలంబన మన నవలంబము. "ఆలంబనం నాయకాది స్త మాలంబ్య రసోద్గమాత్" (ఏ నాయికా నాయకులవలన రసావిర్భావము గలుగునో యా నాయికానాయకు లాలంబనవిభావములు అనఁగా రసమునకు సమవాయికారణములు. సమవాయికారణమన నేది లేక పోవుటచే నిట రసోదయముగాదో యది సమవాయికారణము. నాయికానాయ

కులు లేనిచో రసోదయము గాదుగదా!) అని సాహిత్యదర్పణము. ఉద్దీపనవిభావ
మన నుద్దీపింపఁజేయు విభావము. "ఉద్దీపనవిభావాస్తే రసముద్దీపయంతియే" (రసము
నుద్దీపింపఁజేయునవి యుద్దీపనవిభావములు.) యౌవనాదు లా రసము నుద్దీపింపఁ
జేయునవికదా! ఈ యుద్దీపనవిభావము సహజమనియుఁ దటస్థమనియు ద్వివిధము.
ఈ శృంగారమున నాయికానాయకుల యౌవన, భూషణ, చేష్టలు మూఁడును సహ
జములగు నవఁగా నాలంబనముయొక్క గుణములగు నుద్దీపనవిభావములు. నాల్గవ
విభావమగు మదనాదులు తటస్థరూపమగు నుద్దీపనవిభావము. సహజముగానిది
తటస్థము. "మలయానిల చంద్రాద్యాస్తటస్థాః పరికీర్తితాః" అని ప్రతాపరుద్రీయ
మున నుండఁగా నిటఁ బై పద్యమున 'మదనాదు' లుద్దీపనవిభావములని చెప్పఁబడి
నది. ఉద్దీపన వస్తుకోటిలో మన్మథుని నాలంకారికు లెవ్వరును జేర్పలేదు. కాని
కవులు తమ ప్రబంధములలో నాయికావిరహ వర్ణన ప్రకరణమునఁ దదుద్దీపక వస్తువు
లగు మలయానిల చంద్రాది దూషణములతోపాటు మన్మథదూషణమునుగూడఁజేసిరి.
అందుచేఁ నీ గ్రంథకర్త మన్మథునిఁగూడ నుద్దీపనవిభావమునుగాఁ జేర్కొనెను.

## ఆలంబన విభావోదాహరణము

చ. అలరురతిన్ రతీశు, దమయంతి నలున్ నలువొంద ముదుగా
నలువ సృజించి యందుకతనం దనచే యళుకెల్లఁదీఱె నే
ర్పులవడ నో లతాంగి; నరసాధిపునిన్ నినుఁగూర్చి ప్రేమసం
కలితముగాఁగ దంపతులుగా నొనరింపఁగఁబోలు నెంతయున్.

ఓ లతాంగీ! రతీమన్మథులను, నలదమయంతులను, బ్రహ్మదేవుఁడు ప్రప్రథ
మమున సృజించి జంకుదీఱె పిమ్మట నిన్నును నరసభూపాలుని సృజించి ప్రేమపూర్ణ
లగు దంపతులుగా నొనరించియుండును.

ఇట నాయికానాయకు లాలంబన విభావములు.

## ఉద్దీపన విభావము — ప్రాయము

మ. వరవక్త్రేందు విలాసకృన్నవవయో వర్షావసానంబునం
దరుణీశైశవ సింధులింకు నెడఁ దత్తత్కాలలక్ష్యంబు లా
స్వారసాంతఃస్థిత గండశైలములనం జందోయి యంతంతకుం
బరగుం; దత్క్రమశోష్య రేఖలనఁ గన్పట్టున్ వళీపుంజముల్. ౩౦

ముఖచంద్రునికిఁ జక్కని యందమునుగూర్చు యౌవనరూపమగు శరత్కాలమున నా యువతియొక్క బాల్యమను నదు లెండిపోయెను. అప్పు డచ్చోఁదేలిన గండశైలములో యనునట్లు చనుదోయి క్రమక్రమముగాఁ గనఁబడెను. నీరు దీసినపుడు గనఁబడు రేఖలో యనునట్లు వళులు గనఁబడెను.

ఇట నాయకుని రతి నుద్దీపింపఁజేయు నాయికయొక్క జవ్వనము వర్ణింపఁబడినది.

## ఉద్దీపన విభావము - సొమ్ము

కం. వెలఁదికి మణితాటంకము
  లలరున్ దిగ్విజయకాంక్ష నతనుఁడు చూపున్
  ములుకులు నిశాతములుగా
  నలవడ వడిఁదీడు శాణయంత్రము లనఁగన్. 3౧

ఆ యువతియొక్క రవలకమ్మలు మన్మథుఁడు దిగ్విజయార్థియై దాని చూపులను బాణములను నూఱుటకై యుంచిన సానరాళ్ళన వెలుఁగును.

ఇట నాయకరతి నుద్దీపింపఁజేయు నాయికయొక్క సొమ్ము వర్ణింపఁబడినది.

## ఉద్దీపన విభావము - చేష్ట

చ. సుదతి నృసింహునిన్ మరలిచూచె విలాస వివర్తితాస్యయై
  వదలినప్రేమ వెన్నవిలివచ్చె ముఖేందుఁడఁటంచు భీతిచేఁ
  జెదరి గిరీంద్రదుర్గములఁ జేరిన చీఁకటివోలె వాసనా
  స్పదమగు వాలుఁగొప్పు వలిచన్నులపై నసియాడుచుండఁగన్.

వెన్నవిలి (పా) వెన్దగిలి.

ఒక యువతి యొయ్యారముగా మొగమును ద్రిప్పి ప్రేమతో ముఖచంద్రుఁడు దన్ను వెంబడించి వచ్చెనన్న భయములోఁ బర్వతదుర్గముల దాఁగుటకై చేరిన చీఁకటియో యన్నట్లున్న కేశభారము స్తనములమీఁదఁ జలించుచుండఁగాఁ నరస భూపాలునిఁ జూచెను.

ఇట నాయకరతి కుద్దీపకమయిన నాయికాచేష్ట వర్ణింపఁబడినది.

## తటస్థ విభావము

చ. చిగురుకటారితోఁ జెఱకుసింగిణితో నలరంప గుంపుతో
నిగనిగమించు చెంగలువ నేజముతో వడిఁజిల్క తేజిపై
మగఁటిమి నెక్కి శూరుఁడయి మారుఁడు కోకిలకంఠకాహళుల్
నెగడ లతాంగిపై వెడలె నేఁడు నృసింహ! యెఱుంగఁజెప్పితిన్.

ఇట నాయికారతి కుద్దీపనవిభావములుగా మదనుఁడును గోకిలాలాపములును వర్ణితములు.

గీ. ఇరులపయ్యంట జాఱంగ, మరులుగొనుచు
నుదయశైల స్తనాగ్రమందునిచి కరము
కలువకన్నులు వికసింపఁ జలివెలుంగు
అమరపతిదిక్సుముఖంబు ముద్దాడుచుండె.

ఇట నాయికానాయకుల రతి కుద్దీపకుఁడగు చంద్రుఁడు వర్ణింపఁబడెను. నాయికానాయకాదుల నవలంబించి రత్యాదులావిర్భవించును గాన నాలంబనవిభావము జనకకారణమనియు, నావిర్భూతములయిన రత్యాదులకుఁ బోషకములగుటచే యావనాదులు పరిపోషకకారణమనియును గొందఱండ్రు.

## అనుభావము

క. కారణమైన విభావము
చే రసముత్పన్నమైనఁ జెలఁగెడిదానం
బ్రారూఢ కటాక్షాదిక
మారయ ననుభావమయ్యె నదియెట్లన్నన్. ౩౮

తా. విభావముచే రసముత్పన్నమయినపిమ్మటఁ గలిగెడు కటాక్షాదు లనుభావములు. ఈలక్షణముకన్న సాహిత్యదర్పణ లక్షణము లెస్సగా నున్నది చూడుఁడు.

ఉద్బుద్ధం కారణైః స్వైస్స్వైర్బహిర్భావం ప్రకాశయన్
లోకే యః కార్యరూపస్సోఽనుభావః కావ్యనాట్యయోః.

తమతమ కారణములచే ననఁగా వెనుకటి జనకపోషక రూపములగు నాలంబనోద్దీపన కారణములచే లోకమున సీతారామాదులం దుద్బుద్ధమైన రత్యాదిక మగు స్థాయిభావమును వెలుపలికిఁ దెలుపుక్రియావిశేషము కావ్యనాట్యములలో ననుభావమనఁబడును.

"అను = పశ్చాత్; భావః = ఉత్పత్తిః యేషాంతే అనుభావాః" (కారణమగు రతికవ్యవహితముగాఁ దటస్థించు కార్యము) అనియు, 'అనుభావయతి రత్యాదికం' (రత్యాదికమగు స్థాయిభావమును సామాజికునిచే ననుభవింపఁజేయునది యనుభావము) అనియు వ్యుత్పత్తులు స్వీకరింపఁబడి యున్నవి. ఈ యనుభావము లెన్నియో యిటఁ దెలుపఁబడలేదు. సాహిత్యదర్పణమున నిట్లుగలదు.

> ఉక్తాః స్త్రీణామలంకారా అంగజాశ్చ స్వభావజాః
> తద్రూపాస్సాత్త్వికా భావాస్తథా చేష్టాః పరా అపి.

అంగజములయిన (మనోభవములు) భావ, హావ, హేలలుమూఁడును, అయత్నజములయిన శోభ, కాంతి, దీప్తి, మాధుర్యము, ప్రగల్భత, ఔదార్యము, ధైర్యము, అనునేడును, స్వభావజములయిన లీలా, విలాస, విచ్ఛిత్తి, బిబ్బోక, కిలికించిత, మోట్టాయిత, కుట్టమిత, విభ్రమ, లలిత, మద, విహృత, తపన, మౌగ్ధ్య, విక్షేప, కుతూహల, హసిత, చకిత, కేళులు, అను పదునెనిమిదియుఁ, జెప్పఁబోవు సాత్త్వికభావము లెనిమిదియు, నింకను సంభావ్యమానములయిన చేష్టలును, శృంగారమున ననుభావములు; మరొకచో "అనుభావశ్చతుర్ధా స్యాన్మనోవాక్కాయబుద్ధిభిః" అనుభావములు మనోభవములు, వాగ్భవములు, కాయజములు, బుద్ధిజములు, అని నాలుగు విధములు. అనియును జెప్పఁబడినది.

౯౭, ౯౮ పద్యములలో లీలాదులు పదునైదుమాత్రమే చెప్పఁబడినవి. కాని సాహిత్యదర్పణమునఁ బదునెనిమిది యీయఁబడినవి. వీని కుదాహరణములు ముందీయఁబడినవి.

విభావములు కారణరూపములు. అనుభావములు కార్యరూపములు. వెనుకఁ జేష్ట యుద్దీపనవిభావముగాఁ జేర్కొనఁబడినది. ఇటఁ "ప్రౌఢారూఢ కటాక్షాదిక మనుభావము" అని గ్రంథకర్త చెప్పినాఁడు. కటాక్షాదికము చేష్టగాదా? మరియు ముందు చెప్పఁబోవు వ్యభిచారులుగూడఁ గార్యరూపములగుటవలన ననుభావములు గావా? అట్లగుచో నీ వ్యవస్థ యెట్లు? అను నీ శంకను ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత లేవఁదీసి సమాధానమును జెప్పియున్నాఁడు. దాని నిట వివరింతుము.

"ననుచేష్టాలక్షణోద్దీపనవిభావానాం భావహావాదీనాం శృంగారకార్యతయా అనుభావత్వం ప్రతీయతే। కటాక్షభ్రూవిక్షేపాదీనా మనుభావానా మనురాగజనకత్వేన సంభవత్యేవ విభావత్వం। ఉక్తానాముభయేషాం కల్లోలాయమానతయా రసపరిపో[illegible] దీనా మను

రాగకార్యతయా అనుభావత్వం । తద్దర్శన శ్రవణాభ్యా మనురాగాతిశయ జననా ద్విభావత్వం చానుభూయతే । తదుక్తం భావప్రకాశే

"విభావోఽప్యనుభావస్స్యా దనుభావో విభావవత్
తౌ పునశ్చారిణౌస్యాతాంతే చ తౌ స్యుః పరస్పరం"

అత్ర పరస్పరశబ్దేన సంచారిణామేవ మిథోఽనుభావత్వం చేత్యాద్యిద్రష్టవ్యం। అతః కథంపూర్వోక్తా విభావాదివ్యవస్థా ఇతి చేత్సత్యం । కస్యాశ్చి దనురాగవ్యక్తే ర్యాని కార్యకారణ సహకారీణితానితాం ప్రతితథైవ । నహించిదపి సాంకర్యమస్తి । వ్యక్త్యంతరాపేక్షయా తస్యా ఏవ ఆకారభేదాపేక్షయా వా అన్యథాభావే కో విరోధః ? । యథైకస్య పుత్రాపేక్షయా పితృత్వం పిత్రపేక్షయా పుత్రత్వం చ వ్యవతిష్ఠతే।అతో విభావాదీనామపి ప్రతియోగిభేదాదిభిః కల్పితా కారాంతరాణాం సాంకర్యశంకానవకాశా ద్విభావరూపతా నియతైవేతి సిద్ధం । "

తా. శృంగారరసమునఁ జేష్ట యుద్దీపనవిభావమని వెనుకఁజెప్పితిమి. భావహావాదులు చేష్టలు. అవి శృంగారకార్యములగుటచే ననుభావము లగుచున్నవి. కటాక్ష భ్రూవిక్షేపాదు లనుభావములుగదా! అవి నాయకుని కనురాగజనకము లగుటచే విభావములును నగుచున్నవి. ఈ రెండును గల్లోలాత్మకములై రసపరిపోషకములగుటచే సంచారులును నగుచున్నవి. సమస్త సంచారిభావములును (చింతాదులు) అనురాగకార్యములగుటచే ననుభావములును నగును. వానిని దర్శించుటవలనను వినుటవలనను ననురాగాతిశయము జనించుటచే విభావములును నగుచున్నవి. భావప్రకాశములో "విభావ మనుభావమగును. అనుభావము విభావమగును. అవి రెండును సంచారులగును. ఆ సంచారిభావములు పరస్పర మనుభావములును నగును" అని చెప్పఁబడినది.

ఇఁక విభావాది వ్యవస్థ యెట్లు ? అనఁగా నిది విభావము ; ఇది యనుభావము; ఇది వ్యభిచారిభావ మను విభాగమెట్లు? అన్నచో నిదంతయు సత్యమే! ఒకరి యనురాగవ్యక్తిలో నే విభావానుభావ సంచారిభావములు గలవో వానిలో సాంకర్యముండదు. అనఁగా నాయికాచేష్ట నాయకున కుద్దీపనవిభావము. మరియు నా చేష్టయే నాయకున కనుభావముగా నుండదు. అది నాయికాశృంగారమున ననుభావమై యుండవచ్చును. ఒకఁడే మనుష్యుఁడు తన పుత్రునికిఁ దండ్రియుఁ దన తండ్రికిఁ దాను బుత్త్రుడును గావచ్చునుగదా! కావున విభావాదులు వ్యక్తిభేదమును బట్టి రూపాంతరమును బొందును. కాన విభావాదివ్యవస్థ నియతమే!

మ. అల సాలోలములై యచంచలములై యాకేకరాగ్రంబులై
యలఘువ్రీడములై యనిందితములై యానందపూర్ణంబులై
సులభాసూయములై సుతీక్ష్ణరుచులై సువ్యక్తరాగంబులై
చెలువంబొందెడు చూపు లింతి నెఱపెం శ్రీనారసింహేంద్రుపై.

ఇందు నాయికానురాగముయొక్క కార్యములయిన చూపులు వర్ణింపఁబడెను.

## సాత్త్వికభావములు

౪౦. పరగత సుఖదుఃఖాదుల
నరయఁగ భావించి యట్లయలరుట సత్త్వ
స్ఫురణము ; తద్భవభావము
లరయఁగ సాత్త్వికములయ్యె నవియెట్లన్నన్. ౩౯

పరగతములయిన సుఖదుఃఖాదులను భావించి తన్మయత్వమును బొందుట సత్త్వమనఁబడును. ఈ సత్త్వశబ్దమునకుఁ బెక్కర్థములు గలవు.

"అభినయాదిముఖేన అన్యగత సుఖదుఃఖాది భావనాయా మంతఃకరణస్య అనుకూలత్వం సత్త్వం" (అభినయాదులమూలమునఁ బరగత సుఖదుఃఖములయెడ నంతఃకరణముసుముఖమగుట సత్త్వము) అనియు, "రజస్తమోభ్యామస్పృష్టం రజస్సత్త్వమిహోచ్యతే" (రజస్తమస్పర్శలేని మనసు సత్త్వము) అనియు, స్వాత్మవిశ్రామ ప్రకాశకారీ కశ్చన ఆంతరో ధర్మస్సత్త్వం" (తన యాత్మయందు విశ్రమించిన రత్యాదులను బ్రకాశింపఁజేయు నాంతరధర్మము సత్త్వము) అనియు, భావాంతర నైరపేక్ష్యేణ రసాపరోక్షీకరణత్వలక్షణో బలవిశేషస్సత్త్వం" (భావాంతరములతోఁ బనిలేక రసమును బ్రత్యక్షమొనర్చు బలవిశేషము సత్త్వము) అనియును వివిధ లక్షణములు కనఁబడుచున్నవి. ఆ సత్త్వమునఁ బుట్టినవగుట సాత్త్వికభావములని వ్యవహారము. లేక యాసత్త్వదశయందుఁ గలిగిన కార్యములే సాత్త్వికభావములు. ఇవియుఁ గార్యరూపములగుటచే ననుభావములే యగును. అయినను "ప్రత్యేక మూలత్వాత్ సాత్త్విక ప్రథా" కేవలము సత్త్వమునుండియే పుట్టినవి కావున సాత్త్వికములు. మిగిలిన యనుభావములు శరీరజములు.

ఉ. స్తంభ మచంచలత్వ; మవశత్వముగుం బ్రళయంబు; దృగ్జలో
జ్జృంభణమశ్రువౌఁ; జెమట స్వేదము; గద్గదవాక్యవై ఖరీ

గుంభము నిస్స్వరత్వము; తగుంబులకంబన రోమహర్షణా
రంభము; కంపమావడఁకు; రాఁ దగుఁ బాండురుచుల్ వివర్ణతల్.

ఇందనిమిది సాత్త్వికభావములు వాని లక్షణములును జెప్పఁబడినవి. స్తంభ మన 'అచంచలత్వము'; ప్రళయమన 'అవశత్వము'; అశ్రువనఁ 'గన్నీరు'; స్వేద మనఁ 'జెమట'; వైస్వర్యమన 'గాద్గద్యము'; రోమాంచమన 'గగ్గుఱుపాటు'; కంప మన 'వడఁకు'; వైవర్ణ్యమనఁ 'బాలిపోవుట'.

భరతాదులెల్లరును నెనిమిది సాత్త్వికభావములనే పేర్కొనిరి. కాని భాను దత్తుఁడు రసతరంగిణిలో "జృంభా చ నవమః సాత్త్వికోభావ ఇతి ప్రతిభాతి" (జృంభ యనునది తొమ్మిదవ సాత్త్వికభావము) అని తొమ్మిది సాత్త్వికభావము లను బేర్కొనెను.

వికారో మానసోభావః, నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమవిక్రియా, అని యితరులు 'భావ' లక్షణమును దెలిపిరి. భానుదత్తుఁడు "రసానుకూలో వికారో భావః" (రసానుకూలమగు వికారము భావము) అని లక్షణము చెప్పెను. మరియు నా భావము లాభ్యంతరములు, బాహ్యములు అని ద్వివిధము. ఆభ్యంతర భావములు స్థాయి వ్యభిచారులు. బాహ్యములు సాత్త్వికభావములు. సాత్త్వికభావములే రసానుకూలవికారములు. కటాక్షాదులు మాత్రము రసానుకూలభావములు గావా? యని శంకించి కటాక్షాదులు వికారములు గావనియుఁ జేష్టలనియుఁ దెలిపెను. శరీరచేష్టలు పురుషేచ్ఛాధీనములు. వానినిఁ జేయవచ్చును; మానవచ్చును. కాని వికారములు స్వతంత్రముగా నుదయించును. కాన రసానుకూల వికారరూపభావ ములు సాత్త్వికములే" యని చెప్పెను.

కం. తలఁపఁగ రసకార్యములై
జలజాక్షులయందుఁ బొడము సాత్త్వికభావం
బుల నెనిమిదింటికేర్పడ
నలరింతుం గడఁకతో నుదాహరణంబుల్. ౩౮

కార్యరూపములగు సాత్త్వికభావముల నుదాహరింతును. ఈ సాత్త్వికభావ ములు కేవలము నాయికకేకాక నాయకునకును నుదయించును. ఎట్లన,

ఏతత్పరిస్ఫురతి పద్మదృశాం సహస్రం
అక్షిద్వయం కథయ కుత్ర నివేశయామి ?

ఇత్యాకలయ్య వనునాంబురుహే నిమీల్య
రోమాంచితేన వపుషా స్థిత మచ్యుతేన॥

ఇదిగో! యిట సుందరీసహస్రము వెలుఁగుచున్నది. నా కందోయి నెట నుంతును? అని విచారించి కన్నులుమూసి కృష్ణుఁడు గగుర్పాటుగొన్న మేనిలో నిలిచెను. ఇట శ్రీకృష్ణునికి రోమాంచము వర్ణింపఁబడినది.

'స్తంభ మచంచలత్వ' మను పద్యముచే స్తంభాది సాత్త్వికభావములకుఁ జెప్పఁబడిన లక్షణములు చక్కఁగాలేవు. కాన సాహిత్యదర్పణమునందలి లక్షణ ముల నిటఁ జూపుదును.

## స్తంభము

"స్తంభశ్చేష్టా ప్రతీఘాతో భయహర్షామయాదిభిః" భయమువలన, హర్షమువలన, ఆమయాదులవలనను శరీరమునకుఁ గలిగిన చేష్టా ప్రతీఘాతము స్తంభము. 'ఆమయాదిభిః' అనునెడఁ గల 'ఆది' పదముచే ఘాత, పాతాదులు గ్రాహ్యములు.

చ. కలికి నృసింహభూవరునిఁ గన్గొని నిశ్చలగాత్రవల్లియై
అలరె విలాసచేష్టలొలయంగలయంగ నటింపఁజేయు నా
వలపుల సూత్రధారుఁడనవద్యనృపాకృతిఁజూచి తాను ని
శ్చలత వహింపఁగాఁ గదలఁజాలని జంత్రపుబొమ్మయో యనన్.

తా. నాయికి నరసభూపాలునిఁ జూచి నిశ్చలగాత్రవల్లియై పరుల శరీరము లపై విలాసచేష్టలను రచించు మన్మథుఁడే యా నరసభూపాలునిఁ జూచి నిశ్చలత్వ మును వహించుటచేఁ గదలజాలని జంత్రపుబొమ్మయో యన నలరెను.

ఇందు నాయికకు హర్షమువలన స్తంభముగలిగినట్లు వర్ణింపఁబడినది. కాన నిది స్తంభమను సాత్త్వికభావము.

## ప్రళయము

"ప్రళయస్సుఖదుఃఖాభ్యాం చేష్టా జ్ఞాననిరాకృతిః" (అత్యధికమయిన సుఖ దుఃఖములచేఁ గలుగు నచేతనత్వము ప్రళయము.)

ఉ. ఇత్తఱి నీతలోదరి వహించె నచేతనవృత్తి శారదా
చిత్తముఁ జూచికొన్న వరసింహుఁడు నేఁడు విజృంభగాడు వా

గుత్తపుగుబ్బలాఁడి పలుకుంజవరాలివలెం జెలంగఁగా
నిత్తరళాక్షిచిత్తము నహీనరసోన్నతిఁ జూఱవెట్టెనో? ౪౦

నరసభూపాలుఁడు సరస్వతీహృదయమును హరించినవాఁడు. అతఁడు వియోగముచేఁ దెల్లఁబాఱిన శరీరముగల యువతినిఁగాంచి యది సరస్వతియే యని తలఁచి దాని చిత్తము హరించెనోయేమో? ఏలన, నా తరుణి యిప్పు డచేతనవృత్తిలో నున్నది.

ఇట నచేతనవృత్తిరూపమగు ప్రళయము వర్ణింపఁబడినది. నరసభూపాలుని భావించుటచేఁ గలిగిన సుఖముచే నచేతనత్వము గలిగెను.

## అశ్రువు

"అశ్రునేత్రోద్భవంవారి క్రోధదుఃఖ ప్రహర్షజం" (క్రోధము, దుఃఖము, హర్షము, అనువానివలనఁ గన్నులఁబుట్టిన నీ రశ్రువు).

చ. మగువకు నంగజానలసమగ్రము లౌసులివేఁడియూరువుం
బొగలెగయం జనించుగతి ముత్తెపుఁజిప్పలఁబోలు ఱెప్పలన్
నెగడునుదశ్రుపూరములు నేత్రసరోరుహనాళచాతురిం
డిగియె నృసింహ! యింకఁ దరుణీమణి గౌఁగిట నాదరింపుమా! ౪౧

ఇట యువతి కశ్రుపూరములు గలిగినట్లు వర్ణింపఁబడినది. విరహదుఃఖముచే నశ్రువులు జనించినవి.

## స్వేదము

"వపుర్జలోద్గమస్స్వేదో రతిఘర్మశ్రమాదిభిః" (రతివలన, వేఁడివలన, శ్రమవలనను గలుగు శరీరజలము స్వేదము. ఆదిపదముచే భయంకరదర్శన, ఆకస్మికదుర్ఘటనాదులు గ్రాహ్యములు.

చ. సతికిఁ జెమర్చె మేను జలజాతదళాక్షి చతుస్సముద్రము
ద్రిత వసుధాధురంధరుని శ్రీ నరసింహుని భావవీథిలోఁ
బ్రతిదినమున్ వహించు నతిభారమువంకనొ? కాక సంతతా
పతదసమాస్త్రశస్త్ర భవపావకకీలలఁ వేఁడివంకనో? ౪౨

ఇట యువతికి శ్రమవలన స్వేదము గలిగినటు వర్ణింపఁబడినది.

## వైస్వర్యము

"మదసమ్మదపీడాద్యై ర్వైస్వర్యం గద్గదం విదుః" (మదముచే, సంతోషముచే, పీడాదులచేతను గలుగు గాద్గద్యము వైస్వర్యము. ఆదిపదముచే జాగరణము, (నిద్రలేమి) ఉచ్చారణాధిక్యము మొదలయినవి గ్రాహ్యములు.

చ. అమరఁ బరాంగనానఖముఖాంకితుఁడైన నృసింహభూవరుం
గమలదళాక్షి చూచి తమకమ్మున దూఱెదనన్న గద్గద
త్వమునఁ బొసంగవయ్యె సతి! వాక్యము; లాంతరమైచెలంగు న
య్యము హృదయేశు దూఱవలదంచు నిరోధమొనర్చెనో యనన్.

ఇట నరసభూపాలుని దూఱ యత్నించినను నోట మాట రాదయ్యెను. ఇట నిరోధరూపమైన పీడచేఁ గలిగిన వైస్వర్యము వర్ణితము.

## రోమాంచము

"హర్షాద్భుత భయాదిభ్యో రోమాంచో రోమ విక్రియా" హర్షము, అద్భుతము, భయము, మొదలగువానివలనఁ గలుగు రోమవికారము రోమాంచము.

చ. కలికి నృసింహునిం దలఁపఁగా నెలమిం బులక ప్రకాండముల్
మొలిచె మనోజహాలికుఁడు మోదమెసంగఁ గురంగనాభి పం
కిలమగు నింతిగాత్రమను క్షేత్రమునన్ వెలయంగఁజేయు న
స్ఖలితమనోమనోరథ నికాయము లీరికలెత్తెనో యనన్. 44

మన్మథుఁడను సేద్యగాఁడు యువతియొక్క కస్తూరిపూఁతగల శరీరమను పొలమునఁ జల్లిన మనోరథములు మొలకలెత్తెనో యన్నట్లు పులకలు జనించెను.

ఇట నాయిక నృసింహునిఁ దలఁపఁగాఁ గలిగినహర్షముచేఁ బులకలు గలిగినవి.

## కంపము

"రాగద్వేష శ్రమాదిభ్యః కంపో గాత్రస్య వేపథుః" రాగము, ద్వేషము, శ్రమము మొదలగువానిచేఁ గలిగిన గాత్రవేపథువే కంపము. ఆది పదముచే ఘోరదర్శనాదులు గ్రాహ్యములు.

ఉ. చెన్నగు శ్రీనృసింహవిభుఁ జిత్రపటంబున వ్రాసి బింకపుం
జన్నులమీఁదఁ జేర్చుకొని వాలుఁగనుంగవదోయిఁ జూచుఁ దాఁ

గన్నుల వింటివాఁడు త్రిజగంబుజయించెద నంచుఁ గోరి చే
నున్న కృపాణవల్లిక మహోజ్జ్వలతన్ జళిపించెనో యనన్.

ఇట నాయికకు రాగముచేఁ గంపము గలిగినట్లు వర్ణితము.

## వివర్ణత

"విషాద, మద, రోషాద్యైర్వర్ణాన్యత్వం వివర్ణతా" విషాదము, మదము, రోషము, మొదలగువానిచేఁ గలుగు వర్ణాన్యత వివర్ణత. వివర్ణత యనఁగాఁ 'బాండు రుచిః (పాలిపోవుట) అని గ్రంథకర్త వ్రాయుట పొరపాటు. శృంగార రసమునఁ బాండురుచియే కావచ్చును. ఈ సాత్త్వికభావము లితర రసములలోఁ గూడ రావచ్చును. అటఁ బాండురుచియే కలుగునని చెప్పలేము. ఆది శబ్దముచే శోక మోహ ములుగూడ గ్రహింపఁబడును.

ఉ. మానవతీలలామ యసమానసముజ్జ్వల గాత్రవల్లిపైఁ
గానఁగనయ్యెఁ బాండుతరకాంతి; నిరంతరమై మనంబునన్
శ్రీ నరసింహభూవరు ధరింపఁగఁ దద్వదనేందుమండలీ
మానితచంద్రికారససమాజము పైపయిఁ బర్వెనో యనన్. ౪౬

నిరంతరమును మనస్సున నరసభూపాలుని ధరించుటచే నాతని వదనచంద్ర చంద్రికాపూరము పైకుబికెనోయన్నట్లా యువతి మేను దెల్లనాయెను. ఇట మోహ ముచే వివర్ణత గలిగినది.

## సంచారిభావములు

కం. అహరహము రసోత్పత్తికి
సహాయభావంబు లెలమి సంచారులగుఁ
మహి నివి ముప్పదిమూఁడై
మహితములగు వీనికిం గ్రమంబేర్పఱతుఁ. ౪౭

"వ్యభిచార్యంజితో భావః" (అభివ్యక్తమైనభావము వ్యభిచారి యనఁబడును). రసవ్యక్తికి సహాయభూతములగు నీ భావములు సంచారులనఁబడును. సంచారిభావము లన్నను వ్యభిచారిభావములన్నను నొక్కటే. ఈ లక్షణముకన్న సాహిత్యదర్పణలక్షణ ముచితముగా నున్నది. చూడుఁడు.

విశేషాదాభిముఖ్యేన చరంతో వ్యభిచారిణః
స్థాయిన్యున్మగ్ననిర్మగ్నాస్త్రయస్త్రింశచ్చ తద్భిదాః।

విశేషించి యనఁగా విభావ, అనుభావ, సాత్త్వికభావములకన్న నతిశయించి రసానుగుణముగాఁ జరించునవి వ్యభిచారులు. (వి-|-అభితః-|-చరంతి వ్యభిచారిణః) ఇవి స్థాయియగు రత్యాదులందుఁ బ్రాదుర్భావ తిరోభావములుపొందుచుఁ జరించును. సంచారులన (సమ్యక్ చారయంతి) లెస్సగా రసము నెల్లెడలను వెదజల్లునవి సంచారిభావములు. ఇవి ముప్పదిమూఁడు. స్థాయిభావము సముద్రమువంటిది. సముద్రమునఁ దరంగము లావిర్భవించును. తిరోభావమును బొందును. మరల నావిర్భవించును. మరలఁ దిరోభావమును బొందును. అట్లే వ్యభిచారిభావములు స్థాయిభావమునందు మజ్జనోన్మజ్జనములు నేయుచుండును. ఆవిర్భావ తిరోభావ సామ్యమునుబట్టియే వ్యభిచారులకుఁ దరంగములతో సామ్యము. ఈ వ్యభిచారిభావములు స్థాయిభావములను లెస్సగాఁ బోషించి వానిని రస్యమానములు గాఁ జేయును.

## సంచారిభావ నిరూపణము

శా. నిర్వేదశ్రమ దైన్యజాడ్యములు, గ్లాని త్రాస శంకార్తి రు
డ్గర్వావేగ ధృతిస్మృతుల్, చపలతోగ్రత్వావహిత్థాత్రపాం
తర్వైక్లబ్యమదోత్సుకత్వ మతినిద్రా మోహా బోధాంత ము
త్సర్వాలస్య వితర్కసుప్త్యసహతాధ్యాన భ్రమాపస్మృతుల్.

౧. నిర్వేదము, ౨. శ్రమము, ౩. దైన్యము, ౪. జాడ్యము (జడత) ౫. గ్లాని, ౬. త్రాసము, ౭. శంక, ౮. ఆర్తి (వ్యాధి) ౯. రోషము (అమర్షము) ౧౦. గర్వము, ౧౧. ఆవేగము, ౧౨. ధృతి, ౧౩. స్మృతి, ౧౪. చపలత, ౧౫. ఉగ్రత్వము (ఔగ్ర్యము) ౧౬. అవహిత్థ, ౧౭. త్రప (లజ్జ) ౧౮. అంతర్వైక్లబ్యము (విషాదము) ౧౯. మదము, ౨౦. ఉత్సుకత్వము (ఔత్సుక్యము) ౨౧. మతి, ౨౨. నిద్ర, ౨౩. మోహము, ౨౪. బోధము, ౨౫. అంతము (మరణము) ౨౬. ముదము (హర్షము) ౨౭. ఆలస్యము, ౨౮. వితర్కము, ౨౯. సుప్తి (స్వప్నము) ౩౦. అసహత (అసూయ) ౩౧. ఆధ్యానము (చింత) ౩౨. భ్రమము (ఉన్మాదము) ౩౩. అపస్మారము. ఇవి సంచారిభావములు.

భరతుఁ డెనిమిది స్థాయిభావములనుగూడ నితర రసములందు వ్యభిచారులగునని చెప్పెను. ఆపక్షమున వ్యభిచారిభావములు నలుబదొక టగును. శోకస్థాయిభావము వ్యభిచారియైనపు డీ ముప్పదిమూఁటిలోని 'విషాదము' వ్యర్థమగుచున్నది. భయ స్థాయిభావము వ్యభిచారియైనపుడు 'త్రాసము' వ్యర్థమగుచున్నది. క్రోధ స్థాయిభావము వ్యభిచారియైనపుడు (అమర్షము) వ్యర్థమగుచున్నది. వ్యభిచారిభావ

ములలోని గ్లాని, శ్రమలలో నొక్కటే చాలును. అని యీవిధముగా "ఈవ ద్వైవమ్యమవివక్షితం" అను లోకోక్తినిఁబట్టి వానికిఁ గల యల్పభేదమును గణింపక వ్యభిచారిభావములను గొందఱు దగ్గించిరి. భోజుఁడు దన శృంగారప్రకాశికలో అపస్మార, మరణములను దీసివేసి 'ఈర్ష్యా శమములు' గ్రహించెను. భానుదత్తుఁడు రసతరంగిణిలో 'ఛలము' అను మరొక్క వ్యభిచారిభావమును గలిపెను. (అత్ర ప్రతిభాతి ఛల మధికో వ్యభిచారిభావ ఇతి) "గురుదేవ "నృపపుత్రాది విషయా రతిశ్చేతి చతుస్త్రింశత్" (గురు నృప పుత్రాదివిషయకమగు రతిగూడ భావమే; కాన భావములు ముప్పదినాలుఁగు) అని రసగంగాధర కారుఁడు. భామహుఁడు గురుదేవ నృపపుత్రవిషయప్రీతి వర్ణనమును ప్రేయోఽలంకారమని నుడివెను. ఉద్భటుఁడు దానిని భావాలంకారమనెను.

కం. ఈవరుసఁ ద్రయస్త్రింశ
ద్భావములకు లక్షణము లుదాహరణంబుల్
వావిరినొనర్తు నీయెడఁ
గేవల శృంగారసూత్ర కీలితభంగిన్. ౪౯

స్పష్టము.

## ౧. నిర్వేద లక్షణము

కం. నిరుపమ దుఃఖేర్ష్యాదుల
నిరతము జనియించు నరతి నిర్వేదమగున్. ౫౦

దుఃఖము, ఈర్ష్య మొదలగువానివలనఁ గలుగు నరతియే నిర్వేదము. ఇందు నిర్వేదాదుల కీయఁబడిన లక్షణము లసమగ్రములుగా దోషగ్రస్తములుగా నుంటచే రసగంగాధర లక్షణములఁగూడ నిత్తును.

"నీచపురుషేషు ఆక్రోశన, అధిక్షేప, వ్యాధి, తాడన, దారిద్ర్య, ఇష్టవిరహ, పరసంపద్దర్శనాదిభిః, ఉత్తమేషు తు అవజ్ఞాదిభిః జనితా విషయద్వేషాఖ్యా రోదన దీర్ఘశ్వాస, దీనముఖతాదికారిణీ చిత్తవృత్తిర్నిర్వేదః" నిర్వేదమన నీచులకు, ఆక్రోశన, అధిక్షేప, వ్యాధి, తాడన, దారిద్ర్య, ఇష్టవిరహ, పరసంపద్దర్శనాదుల చేతను, ఉత్తములకుఁ బరతిరస్కారాదులవలనను బుట్టిన విషయద్వేష నామాంతరముగల చిత్తవృత్తి. అది కలిగినపుడు రోదనము, దీర్ఘనిశ్వాసము,(నిట్టూర్పు) దీనముఖత్వము మొదలయినవి కలుగును.

రసము విభావానుభావములచే వ్యజ్యమానమయిన చందమున భావముగూడ విభావానుభావములచేతనే వ్యజ్యమానము గావలయును. నిర్వేదమునకు ఆకోశ వాదులు విభావములు; రోదనాదు లనుభావములు. విభావానుభావములచే నిట్లు వ్యజ్యమానమైన వ్యభిచారిభావమును భావధ్వని యందురు. అయితే రసములకును భావములకును గల భేదమేమి? అన్నచోఁ దెలుపుదుము.

"రత్యాదయః స్థాయిభావాస్స్యుర్భూయిష్ఠ విభావజాః
స్తోకైర్విభావైరుత్పన్నాస్త ఏవ వ్యభిచారిణః"

అధిక విభావములవలన వ్యక్తములయిన రత్యాది స్థాయిభావములు రసములు. అల్పవిభావములవలన వ్యక్తములయిన వ్యభిచారిభావములు భావములు. అనఁగా తెల్లగాఁ బరిపుష్టమైనది రసము. అపరిపుష్టమైనది భావము అని సిద్ధాంతము.

ఒక్కొక్కచో నొక వ్యభిచారిభావము వ్యంగ్యమయినపుడు తత్సామగ్రిచే నవినాభావముచే నంతకన్న నల్పముగా మరొకభావముగూడ ధ్వనింపవచ్చును. ఎట్లన, గర్వము ప్రధానముగా వ్యంగ్యమయినపు డమర్ష మల్పముగా ధ్వనించు చుండును. అమర్షము ప్రధానముగా వ్యంగ్యమైనపుడు గర్వ మల్పముగా ధ్వనించును. ఇట్టిచో నొకటి ప్రధానమును, వేఱొకటి గుణీభూతమును గాదా యని భ్రమింప రాదు. ఏలన, నివి (గుణీభూత వ్యంగ్యములు) ప్రత్యేక విభావానుభావములచే వ్యంగ్యములు కావుగదా! ప్రకరణాదివశమున నొక వ్యభిచారిభావము ప్రధానముగా వ్యజ్యమానమయినపుడు దాని సామగ్రిచేతనే మరొకభావ మల్పముగా వ్యజ్యమాన మయినను దోసములేదు. ఏ విభావాదులచేఁ బ్రధాన వ్యభిచారిభావము వ్యక్తమగు చున్నదో యా విభావములచేఁ గాక వేఱు విభావాదులచే నపరిపుష్టముగా వ్యజ్య మానమయిన వ్యభిచారిభావము గుణీభూతమగును. కాన నిట్టిచో గుణీభూతశంక లేదు.

## నిర్వేదోదాహరణము

కం. శిలలు మణిభూషణంబులు
చెలువగుహారములు జలధిఁజిందిన చినుకుల్
తలిరాకుఁబోఁడి! నాకగు
సులభదయానిధి నృసింహుఁ జూడకయున్నన్. ౫౧

తా. నరసభూపాలునిఁ జూడకున్నచో నాకు మణిభూషణములు రాళ్లేసుమీ! ముత్యాలహారములు నీటిచినుకులేసుమీ!

ఈ యువతి మణిభూషణములను రాళ్లుగాఁ హారములు నీటిచినుకులుగాఁ దలఁచుటచే నిది నిర్వేదము. ఇట 'ఇష్టవిరహము' (నృసింహుని యదర్శనము) విభావము. దైన్యాదులనుభావము లాక్షేప్యములు (ఊహ్యములు). వీనిచే నిర్వేదము వ్యక్తమగుచున్నది.

## ౨. శ్రమ లక్షణము

కం. సురతగమనాదిసంభవ
సరసస్వేదాంబులహరి శ్రమ; మెట్లన్నన్.

తా. సురతక్రీడా వ్యాపారమువలనను, గమనాది వ్యాపారమువలనను బుట్టిన స్వేదము శ్రమము.

"బహుతరశారీర వ్యాపారజన్మా నిశ్శ్వాసాంగసమ్మర్ద నిద్రాదికారణీభూతః ఖేదవిశేషః శ్రమః" బహుతరమైన శరీర వ్యాపారముచేతఁ బుట్టినదియు, నిట్టూర్పు, ఒడలినలుగుడు, నిద్ర, మొదలగువానినిఁ గలిగించు ఖేదవిశేషము శ్రమము. ఇట శరీరవ్యాపారము విభావము. నిశ్శ్వాస, అంగసమ్మర్ద, నిద్రాదు లనుభావములు. వీనిచే వ్యక్తమగు సంచారిభావము శ్రమము. నరసభూపాలీయ శ్రమలక్షణ పద్యములోని 'సరసస్వేదాంబులహరి శ్రమము' అనునది ప్రామాదికము. మరియు,

అధ్వవ్యాయామసేవాద్యైర్విభావై రనుభావకైః
గాత్రసంవాహనైరాస్య సంకోచై రంగమోటనైః
నిశ్శ్వాసైర్జృంభితైర్మందైః పాదోత్క్షేపైశ్శ్రమో మతః.

"మార్గగమనము, వ్యాయామసేవ మొదలగు విభావములవలనను, గాత్రసంవాహనము, ముఖసంకోచము, ఒళ్లువిఱుపు, నిట్టూర్పులు, ఆవలింతలు, ఎత్తలేకయు ఎత్తలేక కాళ్లెత్తుచుండుట, అనునసుభావములచేతను శ్రమ వ్యక్తమగును" అనియు శేరాళచోఁ గలదు.

## శ్రమోదాహరణము

కం. నరసేంద్రుఁజూడ రయమున
నరుదెంచి లతాంగి శ్రమ జలాపూరితయై
సరసేందుకిరణపరిణతిఁ
గరఁగిన నెలచట్టుబొమ్మకై వడి నమరెన్. ౫౭

తా॥ నరసభూపాలునిఁ జూడవచ్చి యొక యువతి చెమ్మటచేఁ జెమ్మగిల్లి చంద్రకిరణ పాతముచేఁ గరఁగిన చంద్ర కాంతశిలాకృతమగు బొమ్మవలె నుండెను॥ లక్షణపద్యములోని ‘‘సరసస్వేదాంబులహరి’’ దుష్టమని తెలిపితిమి॥ ఏ లక్షణ గ్రంథమునందును శ్రమమున ‘స్వేదము’ అని చెప్పఁబడలేదు. ప్రతాపరుద్రీయమునఁ జెప్పఁబడిన ‘‘శ్రమః ఖేదోఽధ్వరత్యాదేర్జాతః స్వేదాతిధూమికృత్’’ (మార్గగమనము, సురతము మొదలగువానివలనఁ గలిగిన ఖేదము (బడలిక) శ్రమము. అది మిక్కిలి స్వేదమును గలిగించును) అనునది యుక్తమే॥ ఏలన, శ్రమ కధ్వరత్యాదులు విభావములు. స్వేద మనుభావమును నగును॥ ఈ రెంటిచే శ్రమ వ్యక్తమగును. అయితే రసగంగాధర లక్షణమునఁ గాని మరొకలక్షణమునఁ గాని స్వేద మనుభావముగాఁ జెప్పఁబడలేదు.

‘నరసేంద్రుఁజూడ రయమున’ అను పద్యమున ‘‘అరుదెంచుట విభావము. స్వేద మనుభావము॥ ఈ రెంటిచే శ్రమ వ్యక్తమగును॥ సురతశ్రమ కీ క్రింది దుదాహరణ మగును.

చం॥ ‘‘చెదరిన ముంగురుల్ సరిగఁజేర్పుము చెల్వఁడ! బొట్టు దిద్దుమీ!
నుదుటవిలాసి! కూర్పుమా చనుంగవఁ ద్రెస్సిన ముత్తెపుఁ సరుల్
హృదయసఖుండ!’’ యంచు వచియించి రతాంతమునందు వానితోఁ
కుదలకొడల్ గగుర్పొడునఁ గోమలి క్రమ్మఱఁబొంద మోహముఁ.

ఇట సురతక్రీడ విభావము. ఆవలింతలు, నిట్టూర్పులు, అంగసమ్మర్దము మొదలగు ననుభావము లాక్షేప్యములు॥ వీనిచే శ్రమ వ్యక్తమగును. (‘‘చెదరిన... హృదయసఖుండ!) అన్నంతవఱకే శ్రమ॥)

## 3. దైన్యలక్షణము.

కం. బలమఱి యరికిఁ దయరాఁ
బలుకుట దైన్యంబనంగఁ బరఁగుఁ... ౫౩

తా. బలముడిగి శత్రునితోఁ గనికరంబు గలుగునట్లు పలుకుట దైన్యము॥ ‘‘దుఃఖ దారిద్ర్యాపరాధాది జనితః స్వాపకర్ష భావనాదిహేతు శ్చిత్తవృత్తివిశేషో దైన్యం’’ దుఃఖము, దారిద్ర్యము, అపరాధము, మొదలగువానివలనఁ బుట్టినట్టియు, స్వాపకర్షము (తన తక్కువతనము) సూచించు సంభావణమునకు హేతుభూతమగు చిత్తవృత్తి దైన్యము॥

దుఃఖాదులు విభావములు॥ స్వాపకర్ష భావనాదు లనుభావములు॥ వీనిచే దైన్యము వ్యజ్యమానమగును.

దైన్యోదాహరణము

కం. మదన! మదిరాక్షి లక్ష్యమె?
మొదలఁ బురాంతకుని నీళ్ళు మోయించిన నీ
కిది మొదలు కరుణఁ జూడుము
సుదతిన్ నరసింహుఁ గూర్పు సుకృతము గలుగున్. ౫౭౪

ఓ మన్మథుఁడా! త్రిపురాంతకుఁడంతవానిని నీళ్లు మోయించిన నీకు స్త్రీ యొక లెక్కయే? కావున దీనిని దయఁదలఁచి నరసభూపాలునితో గూర్పుము.

ఇట నే నాయిక నరసభూపాలుని విరహదుఃఖ మనుభవించుచున్నదో దానికే దైన్యమును జూపవలెను. రసగంగాధరలక్షణమున "స్వాపకర్ష" ఇత్యాదిక ముచే 'స్వ' యను నాయికయే చెప్పఁబడుచున్నది. "మదన! మదిరాక్షిలక్ష్యమె?" అను పద్యమున విరహదుఃఖ మనుభవించునది యొక నాయిక. దూతి మదనునితో దీనాలాపము లాడుచున్నది. కాన నిది సరిగాదు. కానీ ప్రియురాలి విరహదుఃఖ మును గాంచి దుఃఖించుచున్న దూతి దైన్యము వ్యక్తమగుచున్నదన్నచో యుక్తమే యగును. అప్పుడు ప్రియురాలి విరహదుఃఖమే విభావము. స్వాపకర్షభాషణము లనుభావములు. వీనిచే దూతీదైన్యము వ్యక్తమగుచున్నది.

## ౫. జాడ్య (జడత) లక్షణము

కం.:............మదిలోఁ
గల కోరికి చేకూఱిన
నలవెఱుఁగక యునికి జాడ్యమగు నెట్లన్నన్.

హృదయమనోరథము సిద్ధించినపుడు గలుగు మైమఱపు జాడ్యము.

"జాడ్య మప్రతిపత్తిః స్యాదిష్టానిష్టార్థ సంభవాత్" ఇష్టార్థసిద్ధివలనను, అనిష్టార్థసిద్ధివలనను గలిగిన యప్రతిపత్తి జాడ్యము అని ప్రతాపరుద్రీయ లక్షణము. ఇట నిష్టార్థసిద్ధి మూలకముగానే జాడ్యము గలుగునని చెప్పఁబడినది. ఇది పొరపాటు.

"చింతోత్కంఠా భయ విరహేష్టానిష్ట దర్శన శ్రవణాదిజన్యా, అవశ్య కర్తవ్యార్థ ప్రతిసంధానవికలా చిత్తవృత్తిర్జడతా" చింతా, ఉత్కంఠా, భయ, విరహ, ఇష్టానిష్ట దర్శన శ్రవణాదులవలనఁ బుట్టినట్టిదియు, నవశ్య కర్తవ్యములగు కార్యములందును నితి కర్తవ్యతామూఢత్వమును గలిగించునట్టిదియు నగు చిత్తవృత్తి విశేషము జడత.

చింతాదులగు విభావములచే నితిక ర్తవ్యతామూఢత్వరూపమగు ననుభావముచే జాడ్యము వ్యజ్యమానమగును.

జాడ్యోదాహరణము

కం. అదన నృసింహుఁడు వచ్చిన
సుదతి కనుంగొనదు; చెలులఁ జూడదు; భాషిం
పదు; మిగులఁ జలింపదు; త
ద్వదనామృతపారణావధానయుఁ బోలెన్. ౫౫

నరసభూపాలుఁడు రాఁగా నాయిక హర్షాతిశయమునఁ బ్రక్కలకుఁ జూడదు; చెలులను జూడదు; మాటలాడదు; చలింపదు; అతని ముఖచంద్రామృతపానమున నేకాగ్రచిత్తయై యున్నట్లు కనఁబడుచున్నది.

ఇట నిష్టదర్శనము (ప్రియదర్శనము) విభావము. చెలులతో భాషింపకుండుట మొదలగునవి యనుభావములు. వీనిచే నాయికయొక్క జడత వ్యక్తమగును.

"తద్వదనామృత పారణావధానయుఁ బోలెన్" అనుటచే నితికర్తవ్యతారూపమగు మూఢత్వములేదు. కాన నిది లేకుంట లెస్స.

౫. గ్లాని లక్షణము.

కం. కడుశక్తి యెడలి బడలిక
నడలుట యది గ్లానియయ్యె; ౫౬

తా. బలముదగ్గి బడలికపడుట గ్లాని.

"ఆధివ్యాధిజన్య బలహానిప్రభవో వైవర్ణ్య శిథిలాంగత్వ, దృగ్భ్రమణాది హేతుః దుఃఖవిశేషో గ్లానిః" ఆధి (మనోవ్యాధి) వ్యాధుల (శారీరక రోగములు) వలన బలము దగ్గుటచేఁ బుట్టినట్టియు, వైవర్ణ్యము, శిథిలాంగత్వము, దృగ్భ్రమణము మొదలగువానినిఁ గలిగించు దుఃఖవిశేషరూపమగు చిత్తవృత్తి గ్లాని.

కొందఱు "వ్యాధ్యాదిప్రభవ బలనాశః గ్లానిః" "బలస్యాపచయో గ్లానిరాధివ్యాధి సముద్భవః" వ్యాధ్యాదులవలనఁ గలిగిన బలనాశమే గ్లాని యనిరి. పైని గ్లానిలక్షణ పద్యముయొక్క భావముగూడ నిదియే. ఇది పొరపాటు. ఏలన, భావముఁగా చిత్తవృత్తివిశేషమని చెప్పితిమి. నాశము చిత్తవృత్తివిశేషమెట్లగును? కాన బలనాశజన్యదుఃఖవిశేషరూప చిత్తవృత్తియే గ్లాని యని చెప్పుకొనవలెను.

ఇట బలహాని విభావము; వైవర్ణ్యము, శిథిలాంగత్వము, దృగ్భ్రమణము మొదలగునవి యనుభావములు.

## గ్లాన్యుదాహరణము

కం. నిండదె బడలిక?మును చను
కుండలబరువాఁగలేని కోమలి మేనం
గొండంతవలపు పుట్టిన;
గండరగండాంక! రోబఘునరసింహా!

'నిండదె బడలిక?' అనుటవలన గ్లాని వర్ణింపఁబడినది. కాని యిది వ్యక్తము గాక వాచ్యమైనది. మరియు నీ బడలిక వలపువలనఁ బుట్టినట్లు చెప్పినాఁడు. ఇదియు ననుచితమే. కాన నీ యుదాహరణము సరిగాలేదు. ఇట రసగంగాధర లక్ష్యము విత్తుము.

శయితా శైవల శయనే। సుషమా శేషా నవేందు లేఖేవ
ప్రియమాగతమపి సవిధే। సత్కురుతే మధురవీక్షణైరేవ

"శోభామాత్రము మిగిలిన చంద్రికళవలె శైవాలతల్పమునఁ బండుకొని చెంతకు వచ్చినను బ్రియుని మధురవీక్షణములచేతనే సత్కరించుచున్నది" ఇటఁ బ్రియవిరహజనిత వ్యాధికృత బలహాని విభావము. ఎదుర్కొనకుండుట, చరణ పాతము సేయకుండుట, కౌఁగలింపకుండుట మొదలగునవి యనుభావములు. వీనిచే గ్లాని వ్యక్తమగుచున్నది.

## ౬. త్రాస లక్షణము

కం. ......ఆకస్మికమై
పొడము భయంబునఁ జిత్తము
తడఁబడు టది త్రాసమనఁగ దగునెట్లన్నన్. గీటూ

ఆకస్మికముగాఁ గలిగిన భయముచేఁ జిత్తము దడఁబాటుఁ బొందుట త్రాసము. "భీతోర్ఘోరసత్త్వదర్శన స్ఫూర్జథు శ్రవణాదిజన్మా చిత్తవృత్తివిశేష స్త్రాసః" పిడుగువానికి వ్యాఘ్రాది ఘోరజంతు దర్శనమువలనను, ఉఱుములు మొదలగువానిని వినుటవలనను గలుగు చిత్తవృత్తివిశేషము త్రాసము. దీనివలన రోమాంచ, కంప, స్తంభ, భ్రమాదులు గలుగును.

"ఆకస్మికభయాచ్చిత్తవిక్షోభస్త్రాసః" అను ప్రతాపరుద్రీయ లక్షణము నకుఁగూడ నింతియే యర్థము. భయస్థాయిభావోదాహరణమున భయత్రాసములకు భేదము తెలుపఁబడినది. (చూ. పుట 3౭౬)

## త్రాసోదాహరణము

కం. మరుఁజిత్రలిఖితుఁ గని బి
త్తరి వెఱవఁ బరాగభూతిఁ దగనిడి చిగురా
కరయుఁగ దిగఁదుడిచి యలులకు
విరిబోనము వోయఁ దొలఁగె వెఱపు నృసింహా! ౫౫

ఇటఁ జిత్రలిఖితమరుఁడు విభావము. రోమాంచ, కంప, స్తంభాదు లాక్షేప్యములు. ఇట ననుభావము లాక్షేప్యము లగుటవలనఁ ద్రాసము లెస్సగా వ్యక్తమగుటలేదు. ఈక్రింది రసగంగాధర లక్ష్య ముచితముగా నున్నది.

"మాస్తు కశాం కరాబ్జే కరుణావతి! కంపతే మమ స్వాంతం
ఖేలన్నజాతు గోపై రంబ! విలంబం కరిష్యామి"

"అమ్మా! నాచేతిలోఁ గొరడాదెబ్బలు గొట్టకుము. నాహృదయము వడఁకు చున్నది. గోపబాలురతో నాడుచు నిఁక ముందాలస్యముసేయను"

ఇది బాలకృష్ణుని వచనము.

ఇట గొరడా విభావము. హృదయకంప మనుభావము. వీనిచేఁ ద్రాసము వ్యక్తమగుచున్నది.

## ౭. శంకా లక్షణము

కం. తనకు ననిష్టంబగునో! యని కొదుకుట శంక. ౫౬

"కి మనిష్టం మమ భవిష్యతీత్యాకార శ్చిత్తవృత్తివిశేష శ్శంకా" దీనికిఁ బైయర్థమే. దీనివలన ముఖవివర్ణతా, కంపాదులు గలుగును.

## శంకోదాహరణము

కం. చిలుకలపలుకో? యని విన
నలుకుం జెలిపలుకుఁ; దలఁకు నద్దముసూడన్
గలువలచెలికాఁడో? యని
చెలువ వియోగంబుకతన శ్రీ నరసింహా! ౫౭

అర్థము స్పష్టము. ఇట ననిష్టము విభావము. ముఖవివర్ణతా కంపాద్యనుభావము లాక్షేప్యములు. వీనిచే శంక వ్యక్తమగుచున్నది.

## ౮. ఆర్తి (వ్యాధి) లక్షణము

కం......హృదయమందలి తాపం
బినుమడియై వెలిఁబర్విన
ననయము తనుపీడ యార్తియగు నెట్లన్నఁ.

తా. హృదయతాపము ద్విగుణమై వెలికిఁబర్వఁగాఁ గలిగిన శరీరపీడ తాపము. చిత్తవృత్తివిశేషమే భావమయినపుడు శరీరపీడ చిత్తవృత్తివిశేషము గాదుగదా! కానఁ బై లక్షణము దోషగ్రస్తము.

“రోగవిరహాదిప్రభవో మనస్తాపో వ్యాధిః” రోగము, విరహము, మొదలగు వానివలనఁ బుట్టిన మనస్తాపరూపమగు చిత్తవృత్తివిశేషము వ్యాధి” రోగ విరహాదులు విభావములు. గాత్రశైథిల్యము, శ్వాసము మొదలయిన వనుభావములు. (ఇట రోగము వ్యాధి కాదనియు రోగమువలనఁ బుట్టిన మనస్తాపమే వ్యాధి యని యును గ్రహింపవలెను.)

### ఆర్త్యుదాహరణము

కం. బెడిదపు మదనజ్వరమున
మిడిసిపడుఁగ హారలతలు మృగలోచనకున్
వెడవిలుతు వింటికోలల
వడువున; సతినింక నేఁచవలదు నృసింహా! ౬౧

“మదనతాపముచే హారలతలు మన్మథబాణములవలె నెగిరెగిరిపడుచున్నవి. ఇఁక నీ యువతి నేఁచవలదు.” ఇట శరీరతాపమే వ్యక్తమగుచున్నది; గాని మనస్తాపము వ్యక్తమగుటలేదు. రసగంగాధరలక్ష్యమును గనుఁడు.

హృదయే కృతశైవలానుషంగా ముహురంగాని యత స్తతః క్షిపంతీ
తదుదంతపరే ముఖే సఖీనా మతిదీనామియమాదధాతి దృష్టిం.

వక్షస్థలమునఁ దామరతూఁడ్లు వహించి మరల మరల నంగముల నిట్టట్టులు విసురుకొనుచుఁ బ్రియోదంతమును జెలికత్తె చెప్పఁబోఁగా నాయువతి దీనదృష్టితోఁ జూచుచున్నది.

ఇది విరహము విభావము. అంగక్షేపాదు లనుభావములు. వీనిచే వ్యాధి వ్యక్తమగుచున్నది.

## ౯. రోషలక్షణము (అమర్షము)

కం. ఎందును గృతాపరాధుల
యందు మనంబెరియ రోషమగునది; 3౧

ఈ వ్యభిచారిభావమగు నమర్షమునకును నీతఁ డిచ్చిన, స్థాయిభావమగు క్రోధమునకు లక్షణ మొకేవిధముగా నున్నది. క్రోధలక్షణమును జూడుఁడు.

కం. అపకారకారులగు నరు
లపరాధ మొనర్ప నే మహోమహుని మనం
బు పరిజ్వలితంబగు నది
యపరిమితక్రోధమయ్యె నది యెట్లన్నన్.

కాన రసగంగాధర లక్షణమును గ్రహింపవలెను. "పరకృతావజ్ఞాది నానాపరాధజన్యో మౌనవాక్యాది పారుష్యాది కారణీభూత శ్చిత్తవృత్తివిశేషోఽమర్షః" (పరకృతమగు నవజ్ఞారూప నానాపరాధములవలనఁ బుట్టినదియు, మౌనవాక్యములు (మాటలాడకుండుట) వాక్పారుష్యము మొదలయినదానినిఁ గలిగించు చిత్తవృత్తి విశేషమే యమర్షము) స్థాయిభావమగు క్రోధమునకును వ్యభిచారియగు నమర్షమునకును భేదము వెనుకఁ దెలుపఁబడినది. (చూ॰ పుట 3౨౯)

అవజ్ఞాదులు విభావములు. మౌనవాక్య పారుష్యాదు లనుభావములు. వీనిచే రోషము వ్యక్తమగును.

### రోషోదాహరణము

కం. నిలునిలుమనంగ! యెచటికిఁ
దొలఁగెదు? సరసింపుచుఁ డింతితోఁగూడినఁ జా;
లలరు భవదీయ చాపము
కలు గానుగఁద్రిప్పి పిప్పిగాఁ గావింతున్. ౬3

ఇందుఁ దనసఖి కపరాధ మొనర్చిన మన్మథునిపై మనఃప్రజ్వలనము వ్యక్తమగుచున్నది. మన్మథాపరాధము విభావము. పరుషవచన మనుభావము. వీనిచే రోషము (అమర్షము) వ్యక్తమగుచున్నది.

## ౧౦. గర్వ లక్షణము

కం. ..............ఒరులఁ
నిందించి తన్నుఁ బొగడు వ
మందోన్నతి గర్వమయ్యె మహి నెల్లన్నన్.

పరులను నిందించి తన్నుఁ బొగడుకొనుట గర్వము. ''రూప ధన విద్యాది ప్రయుక్తాత్మోత్కర్ష జ్ఞానాధీన పరావహేలనం గర్వః'' (రూపము, ధనము, విద్య, మొదలగువానిచేఁ బుట్టిన యాత్మోత్కర్ష జ్ఞానమువలనఁ గలిగిన పరావహేలనము గర్వము.)

### గర్వోదాహరణము

కం. ప్రతియె? కళంకాంకితునకు
సతియగు రోహిణియు నతనుసతియగు రతియుం
జతురు నృసింహునిఁ జెందిన
యతిధన్యకు నాకు? ననుచు నంగన నవ్వెన్. ౬౮

నరసభూపాలుని చెట్టపట్టిన నాకుఁ గళంకిభార్య యగు రోహిణియు, ననంగుని భార్య యగు రతియును సమానలా? అని నాయిక నవ్వెను.

ఇట నరసభూపాల ప్రాప్తిప్రయుక్తమగు 'అతిధన్యకు' అను నాత్మోత్కర్షము విభావము. అవహేలనము (నవ్వుట) అనుభావము. వీనిచే గర్వము వ్యక్తమగు చున్నది.

## ౧౧. ఆవేగ లక్షణము

కం. క్రమమున నిష్టానిష్టా
గమజమనస్సంభ్రమంబు గన నావేగంబు ౬౯

ఇష్టము, అనిష్టము, తటస్థించుటవలనఁ గలిగిన మనస్సుయొక్క తత్తఱపాటు ఆవేగము. రసగంగాధరమునఁ గేవల మనిష్టమువలనఁ గలిగిన తత్తఱపాటే యావేగ మని చెప్పఁబడినది. కానఁ బైలక్షణము పొరపాటు.

''అనర్థాతిశయ జనితా చిత్తస్య సంభ్రమాఖ్యా వృత్తిరావేగః'' అనర్థాతిశయమువలనఁ బుట్టిన మనస్సంభ్రమ మను పేరుగల వృత్తి యావేగము.

ఆవేగోదాహరణము

కం. సతిహారము నిడ నడలే
కతనునిఁ దనుసిద్ధిఁగోరి యలరతి వ్రతసం
గతి నత్పుసరముఁ గైకొను
గతిఁ గేలన తాల్చి నృపతిఁ గనుగొన నరిగెన్. ౬౬

తా. నరసభూపాలుఁడు వీధి నరుగుచుండఁగా నాయిక హారమును మెడలో వేసికొనుట కవకాశములేక చేతనే ధరించి యతనుఁడగు మన్మథునికి దను సిద్ధిఁగోరి వ్రతమునుబూని చేత నత్పుసరమును దాల్చిన రతినిఁ దలఁపించుచు నతనినిఁ జూడ నేఁగెను.

ఇట నిష్టాగమజనిత మనస్సంభ్రమము చెప్పఁబడినది. కేవల మనిష్టాగమజనిత మనస్సంభ్రమమే యావేగమని సిద్ధాంతము. కాన నీ యుదాహరణము చింత్యము. ఈ క్రిందిపద్య మనర్థమువలనఁ గలిగిన చిత్తసంభ్రమమున కుదాహరణీయము.

ఆ. వె. ఇది నపుంసకంబు గద! యంచుఁ బ్రియురాలి
ప్రాంతమునకు మనసుఁ బంపియుంటి
నది రమించుచుండె నటనె హా! పాణిని
పలుకు నమ్మి గోఁతబడితిఁ జెడితి.

ఇట మనసు ప్రియురాలితో రమించుట యనర్థము. ఇది విభావము. ఆతిత్వరాన్వితములగు వచనాదు లనుభావములు. వీనిచే నావేగము వ్యక్తమగును.

౧౨. ధృతి లక్షణము

కం. అమరఁగ మనము కృతార్థ
త్వముఁ జెందిన ధృతియనంగఁ దగునెట్లన్నన్.

తా. మనస్సు కృతార్థమగుట ధృతి.

"లోభ శోక భయాదిజనితోపప్లవ నివారణకారణీభూత శ్చిత్తవృత్తివిశేషో ధృతిః" లోభము, శోకము, భయము, మొదలగువానివలనఁ గలిగిన యుపప్లవమును నివారించు కారణమయిన చిత్తవృత్తివిశేషము ధృతి.

ధృత్యుదాహరణము

కం. నరసేంద్రుఁడు రాకుండినఁ
బరువడి భావింపఁ గలుగుభాగ్యమె చాలుం

జరితార్థనైతి మరునకు
గిరునకుఁ బ్రియమేలపల్కఁ గీడ్పడినాకుఁ? ౬౭

నరసభూపాలుఁడు నాచెంతకురాకున్నను వానిని స్మరింపఁగలిగెడు భాగ్యము గలిగినది. అదియేచాలును. నేనుగీడ్పడి మన్మథునిదేబిరింపనేల?

ఇట నరసభూపాలుని రామిచేఁగలిగెడు నుపద్రవము నామెధైర్యముతో నివారించుకొన్నది. ఇటవివేకము విభావము. చాపల్యముచే మన్మథుని దేబిరింపనని చెప్పుట యనుభావము. వీనిచే ధృతివ్యక్తమగుచున్నది.

## ౧౩. స్మృతి లక్షణము

కం. స్మృతియగు పూర్వానుభవ
స్మృతి............ ౬౮

పూర్వానుభవమును దలఁచుట స్మృతి. ఈ లక్షణము సరియైనది కాదు. పూర్వానుభవము వలనఁగలిగిన సంస్కారమువలనఁ గలిగినజ్ఞానము స్మృతియని చెప్పవలెను. "సంస్కారజన్యం జ్ఞానంస్మృతిః" సంస్కారమువలనఁ గలిగినజ్ఞానము స్మృతి. లోకములో నొకప్పుడు మనము దేనినేనిఁజూతుము లేక విందుము. ఆవిషయము ప్రత్యక్షమునకుదూరమైనను మనహృదయమునకు హత్తుకొనియుండును. అదియే సంస్కారము. మరలనెన్నఁడేని నావిషయమును జూచుటగాని వినుటగాని సంభవించినచో వెనుకటిసంగతి మనతలఁపునకు వచ్చును. అట్టితలఁపు స్మృతి.

## స్మృత్యుదాహరణము

కం. నాఁటి పరిరంభ సౌఖ్యము
నేఁటిబలెం బాయదాత్మనిండి తొలఁకుచుఁ
బోఁటి! నృసింహునిఁ బాయని
పాటల సుమగంధు లెంత భాగ్యాధికలో? ౬౯

ఇటఁ బరిరంభసౌఖ్యము విభావము. ఆనందాశ్రువులు, నేత్రనిమీలనము. ఆహాకారములు మొదలగునవి యనుభావము లాక్షేప్యములు. వీనిచేస్మృతి వ్యక్తమగుచున్నది.

## ౧౪. చాపల లక్షణము

కం. ...రాగద్వేషజనిత చేష్టాద్యనవ
స్థితి చాపలము

తా. రాగద్వేషములవలనఁ బుట్టిన చేష్టాదుల యనవస్థ, అనఁగా నిలుకడలేని చేష్టలుసేయుట చాపలము.

“అమర్షాదిజన్యా వాక్పారుష్యాది కారణీభూతా చిత్తవృత్తిశ్చపలతా” అమర్షాదులవలనఁ బుట్టినట్టియు వాక్పారుష్యాదులు గలిగించునట్టియు చిత్తవృత్తి చపలత. మరియు నొకచో నిట్లుగలదు.

> “అమర్షప్రాతికూల్యేర్ష్యారాగద్వేషాశ్చమత్సరః
> ఇతియత్ర విభావాస్స్యురనుభావాస్తు భర్త్సనం
> వాక్పారుష్యం ప్రహారశ్చతాడనం వధ బంధనే
> తచ్చాపలమనాలోచ్య కార్యకారిత్వ మిష్యతే”

అమర్షము, ప్రాతికూల్యము, ఈర్ష్య, రాగము, ద్వేషము, మాత్సర్యము అనునవి విభావములు. వాక్పారుష్యము, ప్రహారము, తాడనము, వధ, బంధనము, లెస్సగా నాలోచింపక పనులుసేయుట, అనునవి యనుభావములు. వీనిచే చాపలము వ్యజ్యమానమగును.

## చాపలోదాహరణము

కం. వనిత నృపాలునిఁ గనుఁగొని
చనుగుబ్బలమీఁది వలువ చక్కఁగ దిద్దున్‌;
జనఁజూచు; మరలుఁ జెలితోఁ;
బనిలేమియుఁ బలుకు; నురముపయి జెయిసేర్చున్‌. ౨౦

నరసభూపాలునిమీఁది రాగము విభావము. వలువ దిద్దుట, చనఁజూచుట, ఊరక పనిలేకయుఁ బలుకుట, ఉరమునఁ జెయిఁజేర్చుట యనునవి యాలోచింపక చేయు పను లనుభావములు. వీనిచేఁ జాపలము వ్యక్తమగుచున్నది.

## ౧౫. ఔగ్ర్య లక్షణము

కం. .........ఎగ్గొదవిన
నతిచండత యుగ్రభావమగు నెట్లన్నన్‌.

ఇతరులవలనఁ దనకుఁ గీడుగలుగఁగాఁ బుట్టిన చండత యౌగ్ర్యము.

“అధిక్షేపాపమానాదిప్రభవా కిమస్య కరోమీత్యాద్యాకారా చిత్తవృత్తిరుగ్రతా” అధిక్షేపము, అవమానము మొదలగువానివలనఁ బుట్టినట్టియు నేను వీనికి

ప్రతీకార మేమిచేయుదును? అను ప్రచండమగు చిత్తవృత్తి యౌగ్ర్యము. మరియు నీ క్రింది లక్షణముగూడఁ గనవచ్చుచున్నది.

"నృపాపరాధోఽసద్దోషకీర్తనం చోరధారణం
విభావాః స్యురథో బంధోవధస్తాడన భర్త్సనే
ఏతే యత్రానుభావా స్తదౌగ్ర్యం నిర్దయతాత్మకం"

నృపాపరాధము, లేనిదోషమును దలరుద్దుట, చోరధారణము, ఇవి విభావములు. బంధనము, వధ, తాడనము, భర్త్సనము, ఇవి యనుభావములు. వీనిచే నుగ్రత వ్యక్తమగును.

## ఔగ్ర్యోదాహరణము

కం. వలదువలదేచఁ గలువల
చెలికాఁడ! నృసింహుఁగూర్చు చెలిఁ; గాకున్నన్
బొలఁతుక నిట్టూర్పు పొగల్
వెలువడి నీబింబమెల్ల వెసమాయించున్. ౭౧

ఇటఁ జంద్రతాపము (చంద్రకృతాపరాధము) విభావము. 'నీబింబమెల్లవెస మాయించున్' అనునది భర్త్సనమనుభావము. వీనిచే నౌగ్ర్యము వ్యక్తమగును.

## ౧౬. అవహిత్థా లక్షణము

కం. భువిలో నాకృతిగోపన
మవహిత్థ... ౭౨

ఆకారమును దాఁచుకొనుట యవహిత్థ యందురు. "వ్రీడాదిభిర్నిమిత్తైః హర్షాద్యనుభావానాం గోపనాయజనితోభావవిశేషోఽవహిత్థం" సిగ్గు మొదలగు వానివలన హర్షాద్యనుభావములను దాఁచునట్టి, చిత్తవృత్తి యవహిత్థ.

"అనుభావపిధానార్థోఽవహిత్థంభావఉచ్యతే
తద్విభావ్యం భయవ్రీడా ధార్ష్ట్య కౌటిల్య గౌరవైః"

భయ, వ్రీడా, ధార్ష్ట్య, కౌటిల్య, గౌరవములవలనఁ బుట్టినట్టియు ననుభావ పిధానార్థమగు భావమవహిత్థ. అనియుమరొక లక్షణముగూడఁ గలదు.

## అవహిత్థోదాహరణము

కం. పూరములు గరఁగ నరసు
స్మారమణునిఁ జూడియొక్క సతిపులకలుమై

నీరికలె త్తినఁ దాఁచును
సారెకు హారాంబుజనిత శైత్యంబనుచున్. 23

ఇట వ్రీడ విభావము. పులకలు దాఁచుట యనుభావము. వీనిచే నవహిత్థ వ్యక్త మగుచున్నది.

## ౧౭. త్రపా లక్షణము

కం. మనంబు ముడుఁగుట త్రప

"స్త్రీణాం పురుషముఖావలోకనాదేః పుంసాంచ ప్రతిజ్ఞాభంగ, పరాభవాదేరుత్పన్నో వైవర్ణ్యాధోముఖత్వాది కారణీ భూతశ్చిత్తవృత్తివిశేషో వ్రీడా" స్త్రీలకుఁ బురుషముఖావలోకనమువలనఁ గలుగునట్టిదియుఁ బురుషులకుఁ బ్రతిజ్ఞాభంగము, పరాభవము మొదలగువానివలనఁ గలుగునట్టిదియు, వైవర్ణ్యము, అధోముఖత్వము మొదలగువానినిఁ గలిగించునట్టిదియు, నగు చిత్తవృత్తి విశేషము వ్రీడ. అదియే త్రప.

## త్రపోదాహరణము

కం. వనిత నృసింహేంద్రుఁ బరా
కునఁ బేర్కొని శిరమువంచుకొనుఁ; జెలి యెదుటన్
గనిపించె భావమని మో
మనయముఁ గుచదుర్గవసతి నాఁగినభంగిన్.

ఒకవనిత పొరపాటున నరసభూపాలుని పేరుచ్చరించి తనమొగము తనభావమును దెలిపివేసెనేయని దానినిఁగుచదుర్గములందు నిలిపెనో యన్నట్లు తలవంచుకొనెను.

ఇట నరసభూపాల నామోచ్చారణము విభావము. తలవంచుకొనుట యను భావము. వీనిచేఁ ద్రప లేక వ్రీడవ్యక్త మగుచున్నది.

## ౧౮. విషాద లక్షణము

కం. వివిధోపాయాభావా
ద్యవిరతభంగము విషాదమగు నెట్లన్నన్.

తా. వివిధములయిన యుపాయములు లేమిఁ గలిగిన భంగపాటు విషాదము.

"ఇష్టాసిద్ధి, రాజగుర్వాద్యపరాధాదిజన్యోఽనుతాపో విషాదః "ఇష్టము సిద్ధింపకుంట వలనను, రాజ, గురు ప్రభృతులయెడఁ జేసినయపరాధాదుల వలనను గలిగిన యనుతాపము విషాదము.

## విషాదోదాహరణము

కం. అలరులు మరునమ్ములు; హిమ
జలమిందుకరోదితంబు; శత్రువు దలఁపం
జలిగాడ్పు; శ్రీ నృసింహుం
డలిగిననాఁ డెట్లుమాను నతివకుఁ గాఁకల్. ౭౪

ఇట నృసింహుని యలుక (ఇష్టాసిద్ధి) విభావము. "ఎట్లుమాను నతివకుఁ గాఁకల్?" అనునప్పటి ముఖసంకోచాదులనుభావము లాక్షేప్యములు. వీనిచే విషాదము వ్యక్తమగును.

## ౧౯. మద లక్షణము

కం. మదము మదిరాదికృత స
మ్మదమోహ వ్యతికరంబు. ౭౫

తా. మద్యపానముచేతఁ గలిగిన సంతోషమోహముల కలయిక మదము.

"మద్యాద్యుపయోగజన్మా డోల్లాసాఖ్యః శయనహసితాది హేతుశ్చిత్తవృత్తి విశేషో మదః" మద్యపానాదులవలనఁ గలిగినట్టియు, శయన, హసితాదులను గలిగించునట్టియు నుల్లాసరూపమగు చిత్తవృత్తి మదము. దీనినే యిట్లుగూడఁ జెప్పుదురు. "సమ్మోహానందసందోహో మదో మద్యోపయోగజః" మద్యోపయోగమువలనఁ బుట్టిన సమ్మోహానందముల కలయిక.

ఉత్తమ పురుషాశ్రితమగు నీ మదమునకు నిద్ర యనుభావము. అనఁగా నుత్తముఁడు మదము గలిగినచో నిద్రించును. మధ్యముఁడు నవ్వును; పాడును. నీచుఁడు రోదనము, పరుషవచనములు మొదలగువాని నొనర్చును. మరియు నీ మదము మువ్విధములు. తరుణము, మధ్యమము, అధమము అని. అవ్యక్తములును, అసంగతములును నగు వాక్యములచేతను, సుకుమారమైన తొట్రుపాటుచేతను నభినయింపఁబడునది తరుణమదము. భుజాక్షేపము, (చేతు లెగురవేయుట) స్ఖలితము, (తొట్రుపాటులోఁగూడిన నడక) ఘూర్ణితము, (తిరుగుడుపాటు) మొదలగువానిచే నభిన

యింపఁదగినది మధ్యమమదము. గతిభంగ, స్మృతినాశ, హిక్కా (ఎక్కిళ్ళు) ఛర్దులు (వాంతి) మొదలగువానిచే నభినయింపఁదగినది యధమమదము.

### మదోదాహరణము

కం. అమరు నృసింహుని వనమున
నమితాసవరసములాని యలియూవతముల్
భ్రమియించు; నాడుఁ; బాడును;
రమణులతోఁగూడి సాంద్రరాగప్రౌఢిఁ. ౭౬

పెంటితుమ్మెదలు పుష్పాసవమాని గండుతుమ్మెదలతో నాడుచుఁ బాడుచు నుండును.

ఇటఁ బుష్పాసవమానుట విభావము. ఆటపాట లనుభావములు. వీనిచే సమ్మోహానందముల కలియిక యను మదము వ్యక్తమగుచున్నది.

### ౨౦. ఔత్సుక్య లక్షణము

కం. ...మరి యౌత్సుక్యం
బదన సమయాక్షమత్వము

కాలవిళంబమును సహింపలేకుండుట యౌత్సుక్యము. "అధునైవాస్యలాభో మమాస్త్వితీచ్ఛా ఔత్సుక్యం" (ఇప్పుడే నా కిది లభించుఁగాక యను కోరికియే యౌత్సుక్యము) మరొకచో నీక్రిందిలక్షణము గలదు.

సంజాతమిష్ట విరహా దుద్దీప్తం ప్రియసంస్మృతేః,
నిద్రయా తంద్రయా గాత్ర గౌరవేణచ చింతయా
అనుభావిత, మాఖ్యాత మౌత్సుక్యం భావకోవిదైః

ఇష్టవిరహాది రూపమగు నాలంబన విభావముచేతను, ప్రియసంస్మృతిరూపమగు నుద్దీపన విభావముచేతను, నిద్రా, తంద్రా, గాత్రగౌరవ (ఒడలుబరువుగాఁదోఁచుట) చింతలను ననుభావములచే వ్యజ్యమ్యావమగునది యౌత్సుక్యము.

### ఔత్సుక్యోదాహరణము

కం. వరుఁ బిలువఁబనిచి యెపుడెపు
డరుదెంచునొ? యనుచుఁదలఁచి యభిముఖియగు బి
త్తరి; యింత పరాకైనను
నరయఁ దదాలోకవిఘ్నమగు ననుభీతిఁ. ౭౭

ప్రియవిరహ మాలంబన విభావము. ఆక్షేప్యమగు ప్రియసంస్మృతి యుద్దీపన విభావము. 'ఎపుడెపు డరుదెంచునో?' అను చింతయును, అభిముఖీభావమును, అనుభావములు. వీనిచే నౌత్సుక్యము వ్యక్తమగును.

## ౨౧. మతి లక్షణము

కం. మది నర్థవినిర్ణయంబు మతి యెట్లన్నన్.

తా. అర్థనిశ్చయము మతి. "శాస్త్రాది విచారజన్య మర్థనిర్ధారణం మతిః" శాస్త్రాదులను విచారించుటచేఁ గలిగిన కార్యనిశ్చయము మతి. ఇందు నిశ్శంక తదర్థానుష్ఠాన(నిస్సంశయముగా నాకార్యమనుష్ఠించుట)సంశయోచ్ఛేదములు,(సందేహము దీఱుట) మొదలగునవి యనుభావములు.

## మత్యుదాహరణము

కం. చెలువరో ! శ్రీ నరసింహుం
డలనాఁటి నృసింహమూర్తి యగుఁ; గాకున్నన్
దలఁచిన తావుల నెల్లను
నెలకొని సాన్నిధ్యమొందు నిపుణత గలదే ? 22

నరసభూపాలుఁ డా నరసింహమూర్తియే ! కాకున్నచోఁ దలఁచుకొన్న తావుననే ప్రత్యక్షమగునా? ఇట "తలఁచిన తావుల నెల్లను...ఇత్యాదికముచేఁగలిగిన సంశయ విచ్ఛేదముచే నృసింహుఁడే యని యర్థనిర్ధారణము సేయఁబడినది.

ఇట శాస్త్రప్రమాణము విభావము. సంశయవిచ్ఛేద మనుభావము. వీనిచే మతి వ్యక్తమగుచున్నది.

## ౨౨. నిద్రా లక్షణము

కం. జగతిం జిత్తనిమీలన
మగు నిద్ర యనంగ... 23

మనస్సు మూసికొనిపోవుటయే నిద్ర. "శ్రమాది ప్రయోజ్యం చేతస్సమ్మీలనం నిద్రా" శ్రమాదులవలనఁ గలిగిన మనస్సమ్మీలనము నిద్ర. శ్రమాదులు విభావములు. నేత్రనిమీలనము, గాత్రనిష్క్రియత్వము. (ఒడలు కదల్పకుండుట) మొదలగునవి యనుభావములు.

కం. కలనైన శ్రీనృసింహునిఁ
గలయంగలనంచుఁ గలికి కన్నులు మొగిచెన్
జెలి బాహ్యేంద్రియపథమున
నలరు మనంబరుగకుండ నాఁగినభంగిన్. ౭౯

కలలోనైన నరసభూపాలునిఁ గలియుదు ననియెంచి యొకయువతి తనబాహ్యేంద్రియ మార్గమున మనస్సు పోకుండ నాఁపినట్లు కన్నులుమూసెను.

ఈ యుదాహరణము సుప్తికిఁ (స్వప్నము) దగినది కాని నిద్రకుఁ దగినది కాదుం మనస్సమ్మీలనాత్మకమగు నిద్రలో స్వప్నమురాదు. ఈక్రిందిపద్యముదాహరింపఁదగినది.

కం. లలన నృసింహుని కౌఁగిట
నలసియె పవలెల్ల నిద్రించెను నెలమిన్
నెలపొంపున రే ముద్దులు
గులికి పగల్ నిద్రవోవు కుముదినివోలెన్.

నృసింహుని కౌఁగిట నలయుట విభావము. నేత్రనిమీలన, గాత్రనిష్క్రియత్వాదులాక్షేప్యములగు ననుభావములు. వీనిచేనిద్ర వ్యక్తమగును.

## ౨౩. మోహ లక్షణము

కం. ... మూర్ఛనందుట మోహం
బగు ...

స్పష్టము. "భయవియోగాది ప్రయోజ్యా వస్తుతత్త్వానవధారిణీ చిత్తవృత్తిర్మోహః" భయవియోగాదులవలనఁ గలిగినట్టియు, వస్తుతత్త్వమును నిశ్చయింపఁజాలనట్టియు చిత్తవృత్తి మోహము.

## మోహోదాహరణము

కం. అతనుశరహతుల సొరిగెను
నతివిరహతపస్సమాధి జనితవ్రతమై
ధృతి శ్రీనృసింహుఁ దలఁపఁగఁ
మతి దన్మయమగుచు మేనుమఱచిన భంగిన్. ౮౦

సతి విరహరూపతపోనియమము గలదై నరసభూపాలుఁడను నృసింహమూర్తినిఁ దలఁపఁగా దన్మయమైనదో యనునట్లు మన్మథబాణహతులచే మూర్ఛిల్లెను. ఇటఁ

ప్రియవియోగము విభావము. పొరుగుట (వస్తుతత్త్వానవధారణము) అనుభావము. వీనిచే మోహము వ్యక్తమగుచున్నది.

## ౨౪. బోధ లక్షణము

కం. ...బోధ మెఱుకఁజెందుట

తెలివినిఁ బొందుటబోధము. "నిద్రానాశోత్తరం జాయమానోబోధో విబోధః" నిద్రానాశానంతరమునఁ గలుగు మెలఁకువయే విబోధము. బోధవిబోధ శబ్దములు పర్యాయపదములే.

నిద్రపూర్తియైనపుడును, స్వప్నాంతమందును, బెద్దశబ్దము వినుటవలనను, ఒకరుతాఁకుట వలనను నిద్రానాశము గలుగును. కాన నివి విభావములు. అక్షిమర్దన, గాత్రమర్దనాదులనుభావములు.

### బోధోదాహరణము

కం. తరణికులాధీశయశ
స్తరుణి జడత్వంబుమాని సంపుల్లసితాం
బురుహాక్షియు, జృంభితయై
చిరగతి మేల్కనియె శ్రీనృసింహుఁడు గలుగన్. ౮౧

సూర్యవంశ్యరాజుల కీర్తి యింతవఱకు నిద్రించి నరసభూపాలుఁడు జనించుట చేతఁ గనులుదెఱచి యావలించి మేలుకొనెను.

ఇట నరసభూపాలుని జన్మము విభావము. కనులు దెఱచుకొనుట, ఆవులించుటయు ననుభావములు. వీనిచే బోధము వ్యజ్యమానమగుచున్నది.

## ౨౫. అంత లక్షణము (మరణము)

కం. అగణితమృతియత్న మంతమగు నెట్లన్నన్.

మరణయత్న మంతము. "రోగాదిజన్యా మూర్ఛారూపా మరణప్రాగవస్థా మరణం" రోగాదులవలనఁ బుట్టినట్టియు, మూర్ఛారూపమగునట్టిదియు నగు మరణమునకుఁ బూర్వావస్థ లేక మరణయత్నము మరణము. ఇట మరణమనఁగాఁ బ్రాణవియోగమని యర్థమును జెప్పరాదు. ఏలన, భావమనఁగాఁ జిత్తవృత్తివిశేషమని చెప్పితిమి. ప్రాణవియోగము చిత్తవృత్తిగాదుగదా! ఎల్ల చిత్తవృత్తులగు భావములకును శరీరప్రాణసంయోగ మవసరముగదా!

## అంతోదాహరణము

కం. వలపెఱిఁగి రాఁడు; కౌఁగిట
నలమఁడు నరసావనీంద్రుఁ డని వగవఁజుమీ !
చెలులును జిలుకయు నెవ్వతి
వలనగునో యనుచుఁ గొంతవగచెద నాత్మన్.                    ౮౩

ఇట నరసభూపాలునిపైఁ గల విరహము విభావము. "చెలులును జిలుకయు నెవ్వతి వలనగునో" అను చింత యనుభావము. వీనిచే మరణయత్నము వ్యక్తమగుచున్నది.

### ౨౬. ముదముయొక్క లక్షణము (ముదము-హర్షము)

కం. ముద మిష్టలాభభవ స
మ్మదమగు

ఇష్టము లభించుటవలనఁ గలిగిన సంతోష మను చిత్తవృత్తి ముదము.

దేవ భర్తృ గురు స్వామి ప్రసాదః ప్రియసంగమః
మనోరథాప్తిరప్రాప్య మనోహర ధనాగమః
తథోత్పత్తిశ్చ పుత్రాదేర్విభావో యత్ర జాయతే
నేత్రవక్త్ర ప్రసాదశ్చ ప్రియోక్తిః పులకోద్గమః
అశ్రుస్వేదాదయశ్చానుభావా హర్షం తమాదిశేత్.

దేవ, భర్తృ, గురు, స్వామి, ప్రభృతుల యనుగ్రహము, ప్రియసంగమము, మనోరథలాభము, అప్రాప్యుఁడగు మనోహరుఁడు ధనము మొదలగువాని రాక, పుత్రాద్యుత్పత్తి మొదలగునవి విభావములు. నేత్రప్రసన్నత, ముఖప్రసన్నత, ప్రియభాషణము, పులకోద్గమము, అశ్రూదయము, స్వేదోదయము మొదలగున వనుభావములు. వీనిచే ముదము వ్యక్తమగును.

## ముదుదాహరణము

క. అలులై కింశుకశిఖలోఁ
జెలఁగుచుమున్నెంత తపముఁ జేసెనొ? చెలి వే
నలి; నరసింహుని యురమునఁ
జెలువగు చెంగల్వదండ చేరువగలిగెన్.                    ౮४

చెలియొక్క కొప్పు పూర్వజన్మమునఁ దుమ్మెదలై మొగలిపూవు టగ్గిలోఁ దపము సేసినదానికి ఫలముగా నీజన్మమున నరసభూపాలుని వక్షఃస్థలమున నున్న చెంగల్వదండ సాన్నిధ్యమును బొందెను.

ఇట దేవతానుగ్రహము విభావము. కేవలి యచేతనమగుటచేఁ దానికిఁ జిత్తవృత్తి రూపమగు ముదమెట్లుండును? కావుననే నేత్రప్రసన్నతాద్యనుభావములును లేవు. కావునఁ జేతనకర్తృకమగు నుదాహరణము నీయవలెను. చూడుఁడు.

క. నిలఁబడి నీముందెవ్వఁడు
కలికీ! కలిగించెఁ గనులఁగళుకుల్ బెళుకుల్?
కులికించెను గనుబొమలను?
బులకింపఁగఁ జేసె గాత్రము మనోజ్ఞముగన్.

ఇటఁ బ్రియసన్నిధి విభావము. కనులయందుఁ గళుకులు, తళుకులు, కనుబొమ్మల యందుఁ గులుకులు, గాత్రము పులకించుటయు ననుభావములు. వీనిచే హర్షము వ్యజ్యమానమగుచున్నది.

## ౨౭. ఆలస్య లక్షణము

కం...కర్తవ్య కార్యమందోద్యోగం
బదియలసత.

చేయవలసిన పనులయందుఁ జుఱుకుదనములేమి యాలస్యము.

"అతితృప్తి, గర్భ, వ్యాధి, శ్రమాదిజన్యా చేతసః క్రియానున్ముఖతా ఆలస్యం" అతితృప్తి, గర్భ, వ్యాధి, శ్రమాదులవలనఁ బుట్టినట్టియు, మనస్సునకుఁ గార్యవైముఖ్యమును గలిగించునట్టియుఁ జిత్తవృత్తి యాలస్యము.

అసమర్థత యాలస్యమని యెంచరాదు. కార్యాకార్య వివేకశూన్యత్వమాలస్యము గాదు. గ్లానియందసామర్థ్యము, జాడ్యమందుఁ గార్యాకార్య వివేకశూన్యత్వమును గలవు. ఆలస్యమనఁ గార్యవైముఖ్యము. కాన నీభేదమును గ్రహింపవలెను.

### ఆలస్యోదాహరణము

కం. చెలులాహా రాదులకుం
బిలిచిన నలుగంటఁ జూచుఁ బ్రియుఁడు నృసింహుం
డలఘునృపకుంజరుండని
యలికుంతల కుంభినీత్వమందెనో తానున్! లాగి

నరసభూపాలుఁడు నృపకుంజరుఁడుగాన నాయువతియుఁ గుంభిని (ఆడేనుఁగు) గానయ్యెనో యన్నట్లు చెలులాహారాదులకుం బిలిచిన నఱగంటఁ జూచును. (ఆడేనుఁగు గూడ నఱగంటనే చూచును.)

ఇట విరహశ్రమ విభావము. అఱకంటఁజూచుట (కార్యవైముఖ్యము) అనుభావము. వీనిచే నాలస్యము వ్యజ్యమానమగును.

## ౨౫. వితర్క లక్షణము

కం. .............సందేహా

భ్యుదయబహుత్వము వితర్కమొగి నెట్లన్నన్.

అనేక సందేహములు గలుగుట వితర్కము. "సందేహాద్యనంతరం జాయమాన ఊహో వితర్కః" సందేహాదులం గలిగినపిమ్మటఁ బుట్టిన యూహ వితర్కము. నరసభూపాలీయ లక్షణములో నీ యర్థము కానరాదు. కేవలము పెక్కు సందేహములు గలుగుటకాక సందేహానంతరమునఁ గలిగిన యూహయే వితర్కము. అదియు నిశ్చయానుకూలముగా నుండవలెను. అనఁగా దుదికా వితర్కము నిశ్చయమునకుఁ దోడ్పడవలయును.

## వితర్కోదాహరణము

కం. చెలు లెఱుఁగరాదు భావము;

చెలు లెఱుఁగకయున్న మరునిచే రాయిడియౌఁ

జెలులును మనసాక్షులైనను

వలపెఱిఁగి నృసింహవిభుఁడు వచ్చునొ? రాఁడో? ౧౬

ఇట సందేహమే కాని నిశ్చయానుకూలమగు నూహ లేదు. కాన నిది దోషగ్రస్తము. రసగంగాధరలక్ష్య మిత్తును.

యది సా మిథిలేంద్రనందినీ నితరామేవ నవిద్యతే భువి

అథ మే కథమస్తి జీవితం నవినాలంబన మాశ్రితస్థితిః.

ఆ సీత భూలోకమున నుండకయేపోయినచో జీవిత మెట్లు నిలిచియుండును? ఆమె లేకున్నచో నా జీవితము పోయియేయుండును. ఏలన, నాలంబనము లేకుండఁ దదాశ్రితవస్తువుండదు గదా!

సీత గలదా? లేదా? యను సందేహము విభావము. కనుబొమ్మ లెగురవేయుట, శిరస్సు నాడించుట, వ్రేళ్ళనాడించుట, మొదలగు నను భావము లాక్షేప్య

ములు. ఇది చింత యని భ్రమింపరాదు. ఏలనఁ, జింత నిశ్చయాంతముగా నుండదు. ఏమగునుకి ఎట్లగునుకి అను చిత్తవృత్తి చింత. 'ఇది యిట్లగుము' అను నిశ్చయగర్భ మగు చిత్తవృత్తి వితర్కము.

## ౨౯. సుప్తి లక్షణము

కం. అతినిద్ర సుప్తి. ౧౭౭

ఈ లక్షణము దుష్టము. ఏలన, సుప్తి యనఁగా స్వప్నము. గాఢనిద్రయు స్వప్నమును నొక్కటిగావు. "నిద్రావిభావోత్థజ్ఞానం సుప్తం" నిద్రవలనఁ గలిగిన జ్ఞానము స్వప్నము. దీని కనుభావములు ప్రలాపాదులు. నిద్రకు నేత్రనిమీలన, గాత్రనిష్క్రియత్వాదు లనుభావములని చెప్పితిమి.

### సుప్త్యుదాహరణము

కం. లలన నృసింహుని కౌఁగిట
నలసియొ పవలెల్ల నిద్రనందెడు నెలమిన్
నెలపొందున రే ముద్దులు
గులికి పగల్ నిద్రవోవు కుముదినివోలెన్. ౧౭౮

ఇది స్వప్నమున కుదాహరణార్హముగాదు. నిద్రకు దీని నుదాహరించితిమి. ఈక్రింది పద్యముదాహరణీయము.

గీ. నిన్న పగటిపూట నిద్రలో నినుఁగూర్చి
పాపమా నెలంత పలవరింప
సవతినవ్వె; నత్త దివులొందెఁ; బరువెత్తి
మానిరంత దాని మొగము జెలులు.

ఇటనిద్ర విభావము. ప్రలాపమనుభావము. (పలవరించుట) వీనిచేస్వప్నము వ్యక్తమగుచున్నది.

## ౩౦. అసూయా లక్షణము

కం...ఇతరుల । యతిశయము సహింపకుండుటది యీర్ష్యయగున్

" పరోత్కర్షదర్శనాదిజన్యః పరనిందాదికారణీభూతశ్చిత్తవృత్తి విశేషః అసూయా." పరులయుత్కర్షమును జూచుట మొదలగువాని వలనఁ బుట్టినట్టి చిత్త వృత్తివిశేషమసూయ.

## అసూయోదాహరణము

కం. ఈవికోలఁ దంతె; తనమే
లేవేళనుబాండుశోభ; యెనయేనాకుఁ
వావిరికీర్త్యంగన? యని
శ్రీ వెలయు నృసింహునొద్ద స్థిరతరలీలన్. ౮౯

లక్ష్మీదేవి నరసభూపాలుని కీర్తివిభవమును జూచి సహింపక దానినినిందించుచు నాతనినిఁ దానాశ్రయించుకొనియున్నది. ఇటఁగీర్తియొక్క యుత్కర్షము విభావము. ఈవికోలఁ దంతెతనమేలు; ఏవేళను బాండుశోభ; ఇట్టినించావచనము లనుభావములు. వీనిచే నసూయ వ్యజ్యమానమగును.

## ३౧. ఆధ్యాన (చింతా) లక్షణము

కం. హితవస్తువు చేకూఱమి
నతులాధ్యానంబు చింతయగు నెట్లన్నన్.

ఇష్టము సిద్ధింపకుంటవలనఁ గలుగు నాధ్యానము (పునఃపునరాలోచన) చింత యనఁబడును.

"ఇష్టాప్రాప్త్య నిష్టప్రాప్త్యాది జనితాఽధ్యానాపరపర్యాయా వైవర్ణ్య, భూలేఖన, అధోముఖత్వాదిహేతుశ్చిత్తవృత్తి విశేషశ్చింతా." ఇష్టము లభింపకుండుట, అనిష్టము వచ్చిపడుట, మొదలగువాని వలనఁ బుట్టినట్టియు, ఆధ్యానమనునామాంతరము గలిగినట్టియు, వైవర్ణ్యము, భూలేఖనము, అధోముఖత్వము మొదలగు వానినిఁ గలిగించునట్టియు చిత్తవృత్తి విశేషముచింత. మరియునిట్లుగలదు.

'విభావాయత్ర దారిద్ర్యమైశ్వర్య భ్రంశనం తథా
ఇష్టార్థాపహృతిః శశ్వచ్ఛ్వాసోచ్ఛ్వాసావధోముఖం
సంతాపః స్మరణంచైవ కార్శ్యం దేహానుపస్కృతిః
అధృతిశ్చానుభావాస్స్యు స్సాచింతాపరికీర్తితా
వితర్కోఽస్యాఃక్షణే పూర్వేపాశ్చాత్యే వోపజాయతే"

దారిద్ర్యము, ఐశ్వర్యభ్రంశనము, ఇష్టార్థము సిద్ధింపకుండుట, మొదలగునవి విభావములు. నిట్టూర్పులు, తలవ్రాల్చుట, సంతాపము, స్మరణము, కృశించుట, దేహసంస్కారము లేకుండుట, అధైర్యము, అనునవి యనుభావములు. ఈ చింతకు ముందువెనుకలలో వితర్కముగూడఁ జనించును.

### ఆధ్యానోదాహరణము

కం. సతిచెక్కిటఁ జెయిసేర్పఁగ
నతులకరాంగుళులు సాంజనాశ్రుయుతములై
రతిపతి శాసట మించిన
శితపంచశరమ్ము లనఁగఁజెలఁగు నృసింహా! ౮౯

నాయిక చెక్కిటిపైఁ జేయిసేర్పఁగా దాని కన్నీటితోఁదడిసిన దాని చేతి వ్రేళ్లు మన్మథునకు సాహాయ్యముసేయుటకు నతిశయించిన యైదు వాఁడిబాణము లన్నట్లుండెను.

ప్రియాప్రాప్తి విభావము. చెక్కిటఁ జెయిసేర్చుట యనుభావము. వీనిచేఁ జింత వ్యక్తమగును.

### ౩౭. ఉన్మాద లక్షణము

కం. అనయంబు చేతనాచే
తనసదృశ మనోభ్రమంబు ధర నున్మాదం
బనఁబొల్చు...... ౯౦

చేతనాచేతన వస్తువులయందు సమానమగు చిత్తవిభ్రాంతి యున్మాదము.

"విప్రలంభ, మహాపత్తి, పరమానందాదిజన్మా అన్యస్మిన్నన్యావభాసః ఉన్మాదః" విప్రలంభము, మహాపద, పరమానందము, మొదలగువానివలనఁ బుట్టినట్టియు, నొకదానిని మరొకదానినిఁగా భ్రమింపఁజేయునట్టియు చిత్తవృత్తివిశేషమున్మాదము.

### ఉన్మాదోదాహరణము

కం. నినుఁ బ్రార్థించెద భ్రమరమ!
చని నరసింహేంద్రుఁ దెమ్ము! చనవలదో హా!
చనిన నృపాలు ముఖాంబుజ
ఘనవాసనఁదగిలి నీవు క్రమ్మఱవుగదా! ౯౧

ఇట భ్రమరమునకు నరసభూపాలునిఁ గొనివచ్చు సామర్థ్యములేదని తెలియక యున్నట్లుగా భావించి నాయిక సంబోధించినది. పై యున్మాదలక్షణ మిటఁ బట్టదు. ఈ క్రిందిపద్యము తగినది.

గీ॥ అన్న భృంగంబ! భ్రమియింతు వఖిలదిశల
నాదు వరపులరాణి కన్పట్టెనోయి!
'ఝా' వటంచువు సఖ! తెల్పు మాలసింప
కెచటఁగలఁ? దేమిగావించుఁ? నెట్టిదామె?

ఇట ప్రియావిప్రలంభము విభావము. ఇట్టి యసంబద్ధప్రలాప మనుభావము. వీనిచే నున్మాదము వ్యక్తమగుచున్నది.

"ఉన్మాదస్తుల్యవర్తిత్వం చేతనాచేతనేష్వపి" (చేతనాచేతనములందుఁ దుల్యముగా వర్తించుట యున్మాదము) అని ప్రతాపరుద్రీయ లక్షణము. అట్టిచోఁ జేతనములందచేతనవ్యవహారము సేయుట, అచేతనములందుఁ జేతన వ్యవహారము సేయుటయే యున్మాదమని యర్థమువచ్చును. అట్టిచో "అన్న! భృంగంబ!" ఇత్యాదు లున్మాదోదాహరణములు గాకపోవును. విక్రమోర్వశీయములో నాల్గవయంకమందీయున్మాదమెంతో హృద్యముగా వర్ణింపఁబడినది. అచ్చటఁ గూడఁగేవలము చేతనములందచేతనవ్యవహారము, అచేతనములందుఁ జేతనవ్యవహారము మాత్రమే లేదు. కాన రసగంగాధరము నందలి "అన్యోన్యస్మిన్నన్యావభాసః" అను లక్షణమే యుచితము.

ఉన్మాదముగూడ నొకవ్యాధియేకదా! దీనిని వ్యాధిలో నేలయంతర్భవింపఁ జేయరాదు? అన్నచో మిగిలిన వ్యాధులకన్న నిదివిచిత్రమైన దగుటచేఁ బ్రత్యేకముగా గ్రహింపఁబడినది.

## 33. అపస్మార లక్షణము

కం॥...ధాతుచలనము
దనరనపస్మారమనఁగఁదగు నెట్లన్నన్.

ధాతువులగు వాత, పిత్త, శ్లేష్మములయొక్క కదలికవలన నపస్మారము గలుగును.

"వియోగ, శోక, భయ, జుగుప్సాదీనామతిశయాత్ గ్రహావేశాదేశ్చ, ఉత్పన్నో వ్యాధి విశేషోఽపస్మారః" వియోగ, శోభ, భయ, జుగుప్సాదుల తిశయించుటవలనను బుట్టినవ్యాధివిశేషమపస్మారము.

ఇదివ్యాధిలో నంతర్భవించును. కాని విశేషాకారముగాఁ జెప్పుటవలన బీభత్స, భయానక రసములలో నీయపస్మారమే వ్యభిచారియగును. కాని కేవల వ్యాధి వ్యభిచారి కాఁజాలదు. అని తోఁపింపఁజేయును. దీనికి వియోగ, శోకా

చల యతిశయము విభావము. కంప, ఫేన, నిశ్వాస, భూపాత, విపర్యాస జిహ్వా లోలవాదులనుభావములు.

క. మదనగ్రహంబు సోఁకెను
  సుదతీమణి దీర్ఘదృష్టిఁ జూచెడుఁజెలులార్
  ముదమొదవరక్షఁ గట్టుఁడు;
  మదవతికి నృసింహనామ మంత్రము కతనన్ ౬౨

మదనావేశము విభావము. దీర్ఘదృష్టి యనుభావము. వీనిచే నపస్మారము వ్యక్తమగును. (ఇందు నరసభూపాలీయలక్షణముపట్టదు. 'గ్రహావేశాదేశ్చ' యిత్యాదికమగు రసగంగాధర లక్షణము పట్టును)

వ్యభిచారిభావములు ముప్పదిమూఁడు మాత్రమే యని సంఖ్యానియమ మేల చేయవలెను? మాత్సర్య, ఉద్వేగ, దంభ, ఈర్ష్యా, వివేక, నిర్ణయ, క్లైబ్య, క్షమా, కుతుక, ఉత్కంఠా, వినయ, సంశయ, ధార్ష్ట్యాదులగు భావములు లక్ష్యములం దటనటఁ గానవచ్చుచున్నవే! అన్నచో నట్టుగాదు. ఈ మాత్సర్యాదు లందాహృతములయిన ముప్పదిమూఁడు భావములలోనే యంతర్భవించును. ఎట్లన, నసూయలో మాత్సర్యము, త్రాసమున నుద్వేగము, అవహిత్థమున దంభము, అమర్షమున నీర్ష్య, మతియందు వివేకనిర్ణయములు, దైన్యమునందుఁ గ్లైబ్యము, ధృతియందు క్షమ, ఔత్సుక్యమునందుఁ గుతుకోత్కంఠలు, లజ్జయందు వినయము, తర్కమునందు సంశయము, చాపల్యమునందు ధార్ష్ట్యమును, నంతర్భవింపఁజేయుదుము. అలఁతిభేదము వీనికున్నను మొదటివగు నసూయాదులు లేకున్నచో మాత్సర్యాదులు గలుగవు. అనఁగా వానికిఁ బరస్పర మవినాభావసంబంధము గలదు. కావున మాత్సర్యాదులకుఁ బ్రత్యేకగణనము చేయఁబడదు. ఈ వ్యభిచారిభావములలోఁ గొన్ని వానికి విభావములగును. కొన్ని యనుభావము లగును. ఎట్లన, ఈర్ష్య నిర్వేదమునకు విభావమును, అసూయ కనుభావమును నగును. చింత నిద్రకు విభావమును, ఔత్సుక్యమున కనుభావమును నగును. ఇట్టి వూహ్యములు.

"రత్యాదయోఽప్యనియతే రసే స్యుర్వ్యభిచారిణః" (రత్యాది స్థాయిభావములు గూడ నితర రసములందు వ్యభిచారులగును.) అని భరతమతమని చెప్పితిమి. ఈ రత్యాదు లే యే రసములలో వ్యభిచారులగునో తెలుపఁబడును. అసలు రత్యాది భావములు శృంగారాదులలో ననుచ్ఛిద్యమానములుగా ననఁగా నవిచ్ఛిన్నముగా

రసస్ఫూర్తివఱకు నుండును. కాన నవి యచ్చట స్థాయిభావములు. మరొక రసమం దవి రసస్ఫూర్తివఱకును నుండవు. కాన వ్యభిచారులగును.

శృంగారవీరయోర్హాసో వీరే క్రోధస్తథా మతః
శాంతే జుగుప్సా కథితా వ్యభిచారితయా పునః
ఇత్యాద్యన్యత్సమున్నేయం తథాభావిత బుద్ధిభిః (సాహిత్యదర్పణము)

శృంగార వీర రసములలో హాస స్థాయిభావమును, వీరమునఁ గ్రోధ స్థాయి భావమును, శాంతమున జుగుప్సా స్థాయిభావమును వ్యభిచారులగును. మిగిలినవాని నూహించుకొనవలెను. ఇంకను హాస మద్భుతమందును, క్రోధము శృంగారమం దును, శోకము శాంతమునందును గూడ వ్యభిచారులుగా నుండవచ్చును. అని రుచిర వ్యాఖ్య.

"రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంజితః భావః ప్రోక్తః" దేవాదివిష యక రతియు, వ్యంజితమైన భావమును వ్యభిచారి యని చెప్పఁబడును. సాహిత్య శాస్త్రకారులు నాయికానాయకులరతి స్థాయిభావమనియు, దేవతావిషయకరతి వ్యభి చారిభావ మనియును జెప్పిరి. "తత్ర స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః, గురుదేవతా పుత్రాద్యాలంబనస్తు వ్యభిచారీ" స్త్రీపురుషు లన్యోన్యాలంబనముగాఁ గల ప్రేమమను పేరుగల చిత్త వృత్తివిశేషమగు రతి స్థాయిభావమనియు, గురు, నృప, ముని, దేవ, పుత్రాద్యా లంబనముగల ప్రేమమను పేరుగల చిత్తవృత్తివిశేషమగు రతి భావమనియుఁ జెప్పఁ బడును. నాయికానాయకులయందును దేవాదులందును గలది ప్రేమరూప చిత్త వృత్తివిశేషమగు రతి యొక్కటియే. కాని మొదటిది స్థాయిభావమనియు, రెండ వది వ్యభిచారిభావమనియును జెప్పిరి. కావుననే జగన్నాథుఁడు దేవాదిరతినిఁ గూడఁ గలపి వ్యభిచారిభావములు ముప్పది నాలుగని చెప్పెను. ("గురుదేవ నృప పుత్రాది విషయారతిశ్చేతి చతుస్త్రింశత్.")

కం. ఇరవుగ నీభావంబులఁ
బరగెడు ననుభావములు విభావములు న
న్యరసంబులకుం గలవవి
విరచింపఁగనొల్ల నిందు విస్తరభీతిన్. ౯3

గ్రంథవిస్తర భీతిచే మిగిలిన రసములయొక్క విభావానుభావములను జెప్పుట మానివేసితినని గ్రంథకర్త తెలుపుట యనుచితము. ముఖ్యముగాఁ జెప్పవలసిన వానినిఁ జెప్పుట గ్రంథవిస్తరము కాఁజాలదు.

గీ. ఇంక శృంగారచేష్టల నేర్పఱింతు
నవియు నష్టాదశాఖ్యలై యలరుచుండు
లలితగతి వీని నామముల్ లక్షణములు
క్రమముతోఁ దెల్పి వీని లక్ష్యములొనర్తు. ౯౪

వెనుక శృంగారరసమున కుద్దీపనవిభావములుగాఁ జెప్పఁబడిన నాల్గింటిలోఁ జేష్ట యొకటి. ఇచ్చట నా చేష్టలను గ్రంథకర్త యుదాహరించుచున్నాఁడు. ఈ చేష్టలు నాయకున కుద్దీపనవిభావములును, నాయికకు ననుభావములును నగును. ఈ చేష్టలు శృంగారమునకేకాక యితర రసములకుఁ గూడ భిన్నభిన్నములుగాఁ గలవు. కాని యిట శృంగారచేష్టలుమాత్రమే చూపఁబడినవి. ఏలన, గ్రంథకర్త శృంగారరసము నొక్కదానినే నిరూపించెను. మిగిలిన రసములను వాని స్థాయి వ్యభిచార్యాది భావములను సాహిత్యదర్పణమునుండి ముందు మే ముదాహరించి చూపఁగలము.

కం. ఇల భావ, హావ, హేలా,
విలాస, మాధుర్య, ధైర్య, విభ్రమ, లీలా,
కిలికించిత, మోట్టాయిత,
లలితా,దులు చేష్టలగుఁ దలంపఁగ మరియున్. ౯౫

గీ. వెలయు బిబ్బోక, విచ్ఛిత్తి, విహృత, చకిత,
హసిత, కుట్టమిత, కుతూహ,లాదు లనఁగ
గలవు............................ ౯౬

భావము, హావము, హేల, విలాసము, మాధుర్యము, ధైర్యము, విభ్రమము, లీల, కిలికించితము మోట్టాయితము, లలితము, బిబ్బోకము, విచ్ఛిత్తి, విహృతము, చకితము, హసితము, కుట్టమితము, కుతూహలము, అనిశృంగార చేష్టలు పదునెనిమిది. ప్రతాపరుద్రీయమునఁ గూడ నీవిధముగనే యున్నవి. కాని సాహిత్యదర్పణమునవి యిరువది యెనిమిది గలవు. అవియివి:

యౌవనే సత్త్వజాస్తాసా మష్టావింశతి సంఖ్యకాః
అలంకారాస్తత్ర భావహావహేలాస్త్రయోఽంగజాః
శోభా కాంతిశ్చదీప్తిశ్చ మాధుర్యం చ ప్రగల్భతా.
ఔదార్యం ధైర్యమిత్యేతే సప్తైవ స్యురయత్నజాః.

లీలావిలాసో విచ్ఛిత్తిర్బిబ్బోకః కిలికించితం
మోట్టాయితం కుట్టమితం విభ్రమో లలితం మదః
విహృతం తపనం మౌగ్ధ్యం విక్షేపశ్చ కుతూహలం
హసితం చకితంకేళి రిత్యాష్టాదశ సంఖ్యకాః
స్వభావజాశ్చ; భావాద్యాదశ పుంసాం భవంత్యపి

యౌవనము వచ్చినపుడే చెప్పఁబోవు నిరువదియెనిమిది యలంకారములును, సత్త్వమువలనఁబుట్టును. సత్త్వమనఁ బెక్కర్థములను వెనుకఁజూపియుంటిమి. అందలి "స్వాత్మవిశ్రామ ప్రకాశకారీకశ్చన అంతరోధర్మస్సత్త్వం" (తనయాత్మయందు విశ్రమించిన రత్యాదులను బ్రకాశింపఁజేయు నొకయాంతర ధర్మము) అనునర్థమిట గ్రాహ్యము. అవియేవన భావము, హావము, హేల, ఇవిమూఁడును మనస్సువలన బుట్టును. శోభ, కాంతి, దీప్తి, మాధుర్యము, ప్రగల్భత, ఔదార్యము, ధైర్యము, ఇవియేడును నయత్నముగాఁ బుట్టినవి. పై నుదాహృతములగు మూఁడును, నీయేఁడును గలిసి పదియు స్త్రీపురుషుల కిరువురికినిఁ గలుగును. లీల, విలాసము, విచ్ఛిత్తి, బిబ్బోకము, కిలికించితము, మోట్టాయిదము, కుట్టమితము, విభ్రమము, లలితము, మదము, విహృతము, తపనము, మౌగ్ధ్యము, విక్షేపము, కుతూహలము, హసితము, చకితము, కేళి, యనునవి పదునెనిమిదియు స్వభావజములు. స్వభావమనఁ దనమనో వికారవిశేషము. భావాది ధైర్యాంతమగు పదియుఁ బురుషులకుఁ గూడగలుగునని చెప్పినను నివ్వన్నియు నాయికాశ్రితములయి యున్నపుడే రమణీయములుగా నుండును.

ప్రతాపరుద్రీయ కర్తయు, వానిననుసరించిన నరసభూపాల కర్తయు వీని నన్నింటిని శృంగార చేష్టలనియే యనిరి. సాహిత్యదర్పణకర్త వీనినలంకారములని వ్యవహరించెను. ఇందుమూఁడు మనోభవములగు నలంకారములు; ఏఁడయత్న జములయిన యలంకారములు; పదునెనిమిది స్వభావజములయిన యలంకారములు.

నరసభూపాలీయకర్త శోభ, కాంతి, దీప్తి, ప్రగల్భత, ఔదార్యము, మదము, తపనము, మౌగ్ధ్యము, విక్షేపము, కేళి, అనుపదింటినివర్ణింపలేదు

ప్రతాపరుద్రీయ కర్త అంగజ, అయత్నజ, స్వభావజ, భేదములను గూడఁ దెలుపలేదు. విద్యానాథుఁ డిరువదియెనిమిదింటిలో నీ పదునెనిమిదియే ముఖ్యమని తలఁచెనేమో ! ఇందలి భావాదుల లక్షణములును, లక్ష్యములును, దోషగ్రస్తము లగా నుంటచే సాహిత్యదర్పణ లక్షణములను గూడఁ జూపుదుము.

## ౧. భావ లక్షణము

గీ. ...మరి యందు భావంబు వెలయుచుండు
మహి రసజ్ఞానయోగ్యతామాత్రమగుచు

భావమనఁగా రసజ్ఞానయోగ్యత యని లక్షణము. కాని రసజ్ఞానయోగ్యత కాదు. రసజ్ఞానయోగ్యమగు మనోవికారము అని చెప్పవలయును. బాల్య యౌవన సంధియం దుత్పన్నమయిన శృంగారవిషయకమగు మొదటి యంతఃకరణవికారము భావమనఁబడును. యౌవనము రాకముందు శృంగారరసమును దెలిసికొను యోగ్యత యుండదు. అది రాఁగానే దాని నెఱుఁగఁజాలు నొక మనోవికారము గలుగును. భావయతి రిరంసామితి భావః (రమించు కోర్కెని దెలుపునది మనోవికారము) దీనినే సాహిత్యదర్పణ కర్త "నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమవిక్రియా" (నిర్వికారాత్మకమగు చిత్తమునఁ బ్రథమమునఁ గలిగిన వికారము) అని నుడివెను.

### భావోదాహరణము

చ. వరుఁడని పేర్కొనన్ శిరమువాంచుఁ దలోదరి సాలభంజికా
పరిణయవేళ; నెచ్చెలులఁబాయక యెప్పటియట్ల కేళికాం
తరమొనరింపఁబోదు; చనెనా యెదఁబయ్యెదఁ జేర్చి సిగ్గునం
బరగుఁ బ్రియాంగనానుకృతిభావనకేళికిఁగాఁగ నిచ్చలున్. ౯౭

బొమ్మలపెండ్లివేళ నొక మగబొమ్మను నరసభూపాలుఁడనియు నొక యాడు బొమ్మను దన్నుగాఁ జెలికత్తెలు పేర్కొన నొక యువతి శిరము వాంచుకొనెను. పిమ్మట వారిలోఁ గలిసి యాపె కేళికాంతరమునకు (ఆ బొమ్మల సంయోగ (సంభోగ) రూపక్రీడకు) పోదయ్యెను. ఒకవేళ వెళ్ళినచోఁ దన్నుతని ప్రియాంగనగా భావించుకొనుచు సిగ్గున నుండును.

ఇట శిరము వాంచుటచేత మనోవికార మలఁతిగాఁ దెలియుచున్నది. ఈ లక్ష్యము సరిగాదు. ఏలన, నీ వికారముయొక్క యనుభావము శరీరమునఁ గానఁబడఁగూడదు. ఇట శిరస్సువంచుట యను ననుభావము శరీరమునఁ గనఁబడు చున్నది. కావున నిది భావమున కుదాహరణార్హము గాదు. సాహిత్యదర్పణమున

స ఏవ సురభిః కాలస్స ఏవ మలయానిలః
సైవేయమబలా; కిం తు మనోఽన్యదివదృశ్యతే.

తా. ఆ వసంతకాలమే యిది; ఆ మలయానిలమే యిది; ఆ యబలయే యిది; కాని మనస్సుమాత్ర మదికానట్లున్నది. ఇట శరీరమున నెట్టి యనుభావములును జెప్పఁబడలేదు.

2. హావ లక్షణము

కం. అది యీషద్వ్యక్తముగా
సుభతులయెడ హావమయ్యె;

ఆ భావమే కొలఁదిగా వ్యక్తమగుచో హావమనఁబడును.

"భ్రూనేత్రాది వికారైస్తు సంభోగేచ్ఛా ప్రకాశకః।
భావఏవాల్పసంలక్ష్య వికారో హావఉచ్యతే"

భ్రూనేత్రాది వికారములచే సంభోగేచ్ఛను దెలుపు నాయల్పముగాఁ బైకిఁ గనఁబడువికారమే హావము.

హావోదాహరణము

చ. పడఁతి నృసింహుగీతములు పాడెడివేళ నృసింహు నామముల్
నుడువదు సిగ్గుతో; గురుజనుల్ నరనాథు గుణప్రశంస లె
ర్పడ నొనరించుచో నుచితభక్తిమెయిన్ గురుసేవసేయుకై
వడి వడినాలకించుఁ; దలవాంచుఁ; బరాకగుఁ గొంత వింతగన్

తా. ఇట నృసింహుని నామమును నుడువకుండుట, పెద్ద లాతని గుణప్రశంస సేయునపు డాలించుచుండుట, పరాకును వహించుట మొదలగువానివలన నాయుపతి భావ మీషద్వ్యక్తమగుచున్నది. కావున నిది హావము.

3. హేలా లక్షణము

కం. .........సువ్యక్తంబై
పొదలిన ననవరతంబును
నది మిక్కిలి హేలయయ్యె నదియెట్లన్నన్.

ఆ మనోవికారము సువ్యక్తమయినచో 'హేల' యనఁబడును.

హేలోదాహరణము

ఉ. మేలములాడుచుం గడు సమేళములై చెలులెల్లఁగూడి యో
"బాలిక! శ్రీ నృసింహనరపాలు వరించెదవే" యటన్న నీ

లాలిత యంగవల్లిఁ బులకాంకురముల్ వనలొత్తె నేమనం
జాలిత యూరకుండె ననిశంబు త్రపావృతయైన కైవడిన్. ౯౯

ఇటఁ గన్యకకు సర్వాంగీణమగు గగ్గురుపాటు గలిగినది. ఇట మనోవికార మత్యంత వ్యక్తముగా నున్నది. కాన నిది హేల.

ఈ భావ, హావ, హేలల లక్షణములు జాగ్రత్తగాఁ దెలిసికొనవలెను. భావ మలక్ష్యవికారము. (పైకెట్టి వికారమును గానరానిది.) హావ మల్పలక్ష్య వికారము (అల్పముగాఁ గనఁబడు వికారము గలది.) హేల యత్యంతలక్ష్య వికారము (మిక్కిలియును గనఁబడు వికారము గలది.)

## ౪. విలాస లక్షణము

కం. పతిఁగనఁ దాత్కాలికమగు|నతులవికారము విలాసమగు...౧౦౦

పతి కనఁబడఁగానే యా సమయమునఁ గలిగిన వికారము విలాసము.

"యానస్థానాసనాదీనాం ముఖనేత్రాది కర్మణాం ।
విశేషస్తు విలాసస్స్యా దిష్టసందర్శనాదినా"

ఇష్టునిఁ జూచుట మొదలగువానిచేఁ నడకలో, ఉనికిలో, కూర్చుండుటలో, మాటలాడుటలోఁ, జూచుట మొదలగు కార్యములలోఁ గనఁబడు విశేషము విలాస మనఁబడును.

### విలాసోదాహరణము

కం. ఇరుగడల వెడలి సుడిగొని
తరళములై వెలికి బెళికి తళతళమనుచున్
బరగు రువారపుఁజూపుల
హరిణాక్షి నృసింహవిభుని కారతిసేసెన్. ౧౦౧

తా. సుడిగొన్నట్టియు, తరళములయినట్టియుఁ, దళతళలాడుచున్నట్టియుఁ, జూపులచే నొకయువతి నరసభూపాలుని కారతిసేసెను. ఇట బెక్కువిధములగు చూపులు వర్ణింపఁబడినవి. ఇది విలాసము.

## ౫. మాధుర్య లక్షణము

కం. ......సొమ్ములులే
కతిరమ్యత్వము దలఁపఁగ
నతివలకున్ మధురభావమగు నెట్లన్నన్

నగలులేకయు నతిరమణీయముగాఁ గనఁబడుట మాధుర్య మనఁబడును. "సర్వావస్థావిశేషేషు మాధుర్యం రమణీయతా" ఎల్ల యవస్థలందును ననఁగా నెట్లున్నను రమణీయముగాఁ గానఁబడుట మాధుర్యము.

## మాధుర్యోదాహరణము

చ. గనుఁగవ పెంపు, నార్ద్రనఖగౌరతయుం జెలువొంద నొక్కయుం
గన రతివేగశీర్ణమణికంకణ నూపురహారవల్లియై
మునుపటికన్నఁ బొల్పగు సముజ్జ్వలతం దగెఁ బాండుపత్రియై
కొనలనిగిర్చియున్న యుతి కోమలవల్లి యతల్లి యో యనన్. ౧౦౨

రతికేళియందు మణికంకణాదులు జారిపోయినను గనుఁగవకెంపుచేతను, ఆర్ద్రనఖగౌరతచే(తెలుపు)తను మునుపటికన్న సముజ్జ్వలాకృతితోఁ గనఁబడినది. ఇట మణికంకణ నూపురములకు బదులుగాఁ గనుఁగవకెంపును, హారవల్లికలకు బదులుగా నార్ద్రనఖముల తెల్లకాంతులును నమరినవి. ఇట భూషణములు లేకున్నను సముజ్జ్వలత యున్నది. కాన మాధుర్యము.

## ౬. ధైర్య లక్షణము

కం. కులశీలాద్యవిలంఘన । మిల ధైర్యంబు... ౧౦౩

కుల మర్యాదలను దాఁటకుండుట ధైర్యము. "ముక్తాత్మశ్లాఘనా ధైర్యం మనోవృత్తి రచంచలా" ఆత్మశ్లాఘ లేనట్టియు, నచంచలమైనట్టియు మనోవృత్తి ధైర్యము.

## ధైర్యోదాహరణము

మ. అతులైశ్వర్య సమగ్రుఁడైన నరసింహాధీశ్వరుం డేడ? నీ
పితృవాచాపరతంత్రనై వ్రతతతిం బెంపొందు నే నేడ? నా
క్షితిపాలాగ్రణిపైఁ బ్రసక్తమగు నాచిత్తంబు సంధించినాఁ
డతనుం డక్కరొ! నేఁటినుండి విషమాస్త్రిభిఖ్యుఁడౌ నెంతయున్.

తా. నరసభూపాలుఁ డేడ? తలిదండ్రులచాటుదాననగు నే నేడ? మన్మథుఁడు వానిపై నా హృదయమును దగిలించినాఁడు.

ఇటఁ దన సౌందర్యశీలాద్యాత్మశ్లాఘనము లేదు. మన్మథుఁడు దన హృదయ మాతనిపైఁ దగిల్చినను దలిదండ్రులచాటున నుంటచే సాహసించి యతని నభిస

రించుట కిష్టపడకున్నది. ఈ యువతి తాను 'బిత్పృవాచాపరతంత్రురాల'నని చెప్పుటచే నచంచలమగు మనోవృత్తి వ్యక్తమగుచున్నది.

## ౭. విభ్రమ లక్షణము

కం... ఒడలఁదొడవులిడఁ దడఁబడినన్
వెలయఁగ విభ్రమము......

గాత్రమున భూషణములు దారుమారుగా ధరించుట విభ్రమము.

"త్వరయా హర్షరాగాదేర్దయితాగమనాదిషు ।
అస్థానభూషణాదీనాం విన్యాసో విభ్రమో మతః"

ప్రియుని రాకవలనఁ గలిగిన హర్షరాగాదులవలనఁ ద్వరచేత భూషణాదులను దారుమారుగా ధరించుట విభ్రమము.

## విభ్రమోదాహరణము

చ. అదన నృసింహభూమిరమణాగ్రణి వచ్చిన సంభ్రమంబుతో
సుదతినభోఽవలగ్నమునఁ జుక్కలపేరిటి కంఠమాలయుం,
బొదలుకుచాచలంబుల సముజ్జ్వల మేఖలయున్, ధరింపఁగా
నదిక్రమమయ్యెఁ; దొయ్యలికి నక్రమమయ్యె విలాసవైఖరిన్ ౧౦౫

తా. నరసభూపాలుఁడు హఠాత్తుగా రాఁగాఁ ద్వరపాటున నొకసుదతి నక్షత్రమాల (౨౭ రత్నములుం గలహారము) యను కంఠహారమును నాకాశమువంటి నడుమునఁ దాల్చెను. మేఖల (ఒడ్డాణము) పర్వతమువంటి కుచములపై ధరించెను. నక్షత్రమాల నాకాశమున, మేఖల (కొండసడిమిప్రదేశము) పర్వతమునందునుంట క్రమమే; యనఁగా నుచితమే. కాని యాయువతిసౌందర్యమునకుమాత్ర మా క్రమముచితముగాదు.

ఇటయువతి ప్రియాగమనము వలనఁ గలిగిన హర్షముచే భూషణములను దబ్బిబ్బుగాఁ దాల్చినది. కాన విభ్రమము. ఇట్టిదేమరొక పద్యము.

కం. తనప్రియుఁడు వచ్చెవాఁకిటి
కనిసొగసుం జేసికొనుచు నంగన విని యం
జనమును నొసటను, లత్తుకఁ
గనులను, దిలకంబుఁ జెక్కి గండస్థలిపై

## ౮. లీలాలక్షణము

క ...అధిపుని। యలఘుగుణానుకృతిలీల యగు నెట్లన్నన్

ప్రియుని గుణానుకరణములీల, గుణానుకరణమే కాదు; చేష్టా, భూషణా ద్యనుకరణముగూడ లీలయే.

"అంగై ర్వేషై రలంకారైః ప్రేమిభి ర్వచనైరపి।
ప్రీతి ప్రయోజితై ర్లీలాం ప్రియస్యానుకృతిం విదుః"

(చేష్టలచే, వేషములచే, భూషణములచే, ప్రేమవచనములచేఁ బ్రియుని ననుకరించుటలీల. యనఁబడును.

### లీలోదాహరణము

చ. ధరనకలంక భావమునఁ దామరసాహితునిం జయించు; నా
హరిపదసక్తయై వెలుఁగు నారయఁ బ్రాజ్ఞులకున్ వసుంధరన్
సురతరు నూతనాభ్యుదయ శోభయొనర్చు యశఃపురంధ్రి,యా
వరుఁడగు శ్రీనృసింహుగుణవాసనఁ దానుజెలంగు కైవడిన్ ౧౦౭

తా. నరసభూపాలుఁడు తననిష్కళంక భావమునఁ గళంకియగు చంద్రుని జయించెను. మరియు నతఁడు హరిపద (విష్ణుపద) సక్తుఁడు. ప్రాజ్ఞులకుఁ గల్ప వృక్షమువంటివాఁడు. అతని ప్రియురాలగు కీర్తికాంతయు నాతని గుణముల ననుకరింపఁదలఁచి యకళంకభావమునఁ జంద్రుని జయించెను. తానును హరిపద (ఆకాశ) సక్త యయ్యెను. కల్పవృక్ష శోభను (తెల్లఁదనమును) వహించెను. ఇటఁ బ్రియుని గుణానుకరణము గలదు. కావ నిది లీల. వేషానుకరణ మీ క్రిందిపద్యమునఁ గలదు.

ఆ. వె. పరఁగఁ దమ్మితూఁటి పాఁపకడెంబులు
వలల వేణి యనఁ కపర్దకంబు
హరుని ననుకరించు యా పార్వతీదేవి
లీలతోడ లోకమేలుఁగాక.

### ౯ కిలికించిత లక్షణము

క. అలుక, కలఁక, ముదమ్ము, నశ్రువు
గలిసినఁ గిలిగించితంబు..... ౧౦౮

"స్మిత, శుష్క, రుదిత, హసిత, త్రాస, క్రోధ, శ్రమాదీనాం
సాంకర్యం కిలికించితం ప్రియసంగమాది జాద్హర్షాత్."

ప్రియసంగమమువలనఁ గలిగిన హర్షముచేఁగలిగిన స్మిత, శుష్కరుదిత, హసిత, త్రాస, క్రోధ, శ్రమాదుల సాంకర్యము కిలికించితము. పైలక్షణమునఁబ్రియ సంగమము వలనఁ గలిగిన యనుమాటలేదు.

కిలికించితోదాహరణము

చ. పతి రచితాగసుండదరిపాటునవచ్చి దృఢోపగూహన
స్థితి నధరప్రవాళము గ్రసింప ససంభ్రమలోలహస్తయై
"మతకరి! చాలుఁజాలు; నిఁకమాదెసరాకు"మటంచు నల్కతో
నతివ బొమల్ ముడించెనయునాంబువు తెప్పలనప్పళించుచున్ ౧౦౭

తా. అపరాధియగు ప్రియుఁడు హఠాత్తుగావచ్చి కౌఁగిలించి మోవికొఱకఁగా జేతులతో విదిలించుచుఁ జాలుఁజాలు! నాకడకురాకుము! అని కోపముతో నశ్రువులనాఁవుకొనుచు బొమలుముడిఁచెను.

ఇట 'మతకరి' ఇత్యాదివచనములును బొమలముడుపును, అశ్రువులును, ప్రియసంగమాదిజహర్షముచేఁ గలిగినవికావు. ప్రియాపరాధముచేఁ గలిగినవి. కాన నిది యుదాహరణార్హముగాదు. ఈక్రింది దుదాహరణార్హము.

క. స్వమనోరథంబులకు భం
గము రానట్లడ్డగించుఁ; గలికి నవులయం
దముతోఁ దర్జించును బ్రియు;
సుమాంగికిల్లేడ్పులేడ్చు సుఖమగ్నయునై.

ఇచ్చటి యడ్డగింపు, తర్జింపులు, కల్లేడ్పులును, బ్రియసంగహర్షకృతములు. ఇదికిలికించితము.

౧౦. మోట్టాయిత లక్షణము

క...కడునిష్టకథా
దులనింగితమెఱిఁగించుట
దలఁపఁగ మోట్టాయితంబు దగునెట్లన్నన్.

ప్రియునిఁ గుఱించివచ్చు ప్రసంగములందుఁ దనయింగితమును (మనోభావమును) జేష్టలమూలమునఁ దెలుపుట మోట్టాయితము.

"తద్భావభావితే చిత్తే వల్లభస్య కథాదిషు
మోట్టాయితమితి ప్రాహుఃకర్ణకండూయనాదికం"

ప్రియునితో రతిక్రీడలఁ దేలవలెనని మనస్సుకలుగఁగా నాతనికథలు వినఁగానే చేయుకర్ణకండూయనాదికమగు చేష్ట మోట్టాయితము.

మోట్టాయితోదాహరణము

చ. చెలులు నృసింహుగీతములు జేరికగా నపరంజివీణెలోఁ
పలఁ బలికింప నూర్చుచును బాలిక యూర్పులచేత దీపికా
కళిక చలింప "నెచ్చెలులు! కంటిరె! మీ మృదుగానలక్ష్మికిం
దెలియఁగ మెచ్చుచున్నయది దీవియ"యంచు హసించు నెంతయున్.

తా. చెలికత్తెలు నరసభూపాలునిపై వీణెమీఁద గీతములు పాడుచుండఁగా నొక కన్య విని నిట్టూర్చుచు నా నిట్టూర్పులకు దీపము చలింపఁగాఁ దన యింగితమును వారు దెలియకుండునట్లు "చెలులారా! చూచితిరా! మీ గానమునకు మెచ్చుకొని దీపము దలయూఁచుచున్నది" అని నవ్వుచుఁ బలికెను.

ఇట లక్షణమున "ఇష్టకథాదుల నింగిత మెఱిఁగించుట" అని చెప్పియు గ్రంథకర్త తన యింగితమును దెలుపకుండ నేదో కల్లలాడుచున్నట్లు వర్ణించినాఁడు. కాన నిది యుచితోదాహరణముగాదు. ఈక్రింది పద్యము చక్కని యుదాహరణము.

ఆ.వె. మోహనాంగ! నీదు ముచ్చటలెత్తఁగఁ
గోమలాంగి చెవులు గోఁకికొనుచు
నావులించుకొనుచు హర్షాశ్రువులురాల
నొడలు విఱుచుకొనుచు నుండు సుమ్ము!

ఇటఁ జెవులు గోఁకుకొనుట, ఆవులించుట, హర్షాశ్రువులువిడుచుట, ఒడలు విఱుపు మొదలగు చేష్ట లింగితమును దెలుపుచున్నవి.

౧౧. లలిత లక్షణము

కం. భాసురతనువల్లీ వి।న్యాసము లలితమ్ము ... ౧౧౦

ప్రకాశించుచున్న (చక్కని) శరీరముయొక్క విన్యాసము లలితము. దీని వలన నర్థము స్ఫుటముగా భాసించుటలేదు. "సుకుమారతయాంగానాం విన్యాసో లలితం భవేత్" (కరచరణాద్యవయవములను సుకుమారముగా ననఁగా నొయ్యారముగా నుంచుట లలితము.)

### లలితోదాహరణము

చ. పడియు శ్రమాంబులోడుభుజవల్లి మృదంగముమీఁదఁ జేర్చి, కీ
లెడలిన నూపురంబు ఘటియింపఁగ దూతికరారవిందమం
దడుగిడి, కంపితస్తనరయంబున నూర్పులుదోఁప నింతి య
య్యెడ నటియించి నిల్చె సభయెల్ల ననంగునిపాలుసేయుచున్.

తా. చెమ్మగిల్లిన చేతిని మృదంగముమీఁదఁజేర్చి, కీలూఁడిన నూపురము నదు టకై యొక పాదమును దూతిచేతనిడి స్తనకంపముచేత సూచింపఁబడిన వేగము గల నిట్టూర్పులు విడుచుచు (స్తనకంపము నిట్టూర్పుల వేగమును సూచించుచున్నది.) నొక యింతి నటించి నిలిచెను. ఇది సింగభూపాలీయములోని యీ క్రింది శ్లోకమున కనువాదము.

శ్లో. స్వేదక్లేదితకంకణాం భుజలతాం కృత్వా మృదంగాశ్రయాం
చేటీహస్త సమర్పితైకచరణా మంజీరసంధిత్సయా
సా భూయ స్తనకంపసూచితరయం నిశ్వాస మాముంచతీ
రంగస్థానమనంగసాత్కృతవతీ తాళావధౌ తస్థుషీ.

ఇందలి స్తనకంప "సూచితరయం" అనుదానికి "కంపితస్తనరయం" అన్నది సరియైన తర్జుమా కాదు. "తాళావధౌతస్థుషీ" అనుమాటకుఁ దర్జుమాలేదు.

ఈపద్యమున నింతి సుకుమారముగా నిలిచినది. కాన లలితము.

### ౧౨. విచ్ఛిత్తి లక్షణము

క. ...సొమ్ములల్పములయ్యున్
భాసిల్లెడుశృంగారవి
కాసము విచ్ఛిత్తియయ్యెఁ గన నెట్లన్నన్ ౧౧౨

భూషణము లల్పముగానున్నను శృంగారముగాఁ గానవచ్చుట విచ్ఛిత్తి. "స్తోకాప్యాకల్పరచనా విచ్ఛిత్తిః కాంతిపోషకృత్" భూషణరచన కొలఁదిగా నున్నను గాంతినిఁబోషించినచో నదివిచ్ఛిత్తి.

చ. పరిమితభూషణంబులును ఫాలముపై నెలవంకనామముం
బరగనొయారియై, నయనపర్వమొనర్చె వధూలలామ తా
విరళగణేయతారలు, నవీనతరేందుకళావిలాసముల్
వరుస వెలుంగఁగా విదియనాఁటి విభావరివోల్కె వడిన్. ౧౧౩

తా. కొలఁది నగలును, నుదుటఁ జంద్రవంక బొట్టును, ధరించియొకయువతి కొలఁది చుక్కలును, జంద్రలేఖను వహించిన విదియనాటి రాత్రివలె శోభిల్లెను. ఇటఁగొలఁది భూషణములతోఁ గూడ యువతి శోభిల్లుటచే విచ్ఛిత్తి యనునలంకారము. ఈ క్రిందిపద్యమింతకన్న మనోహరమైనది.

ఆ. వె. తానమునఁ గడిందితళతళ మనుమేను,
దమ్మలమునఁ గెంపుఁదాల్చుమోవి,
జిలుఁగువలువ, యివియెచాలును వగలాఁడి
కలరువిల్తుఁడెడఁద మలిచియుండ.

## ౧౩. బిబ్బోక లక్షణము

క. వరునికథయుం దనాదర । మరయఁగ బిబ్బోకమయ్యె. ౧౧౪

"బిబ్బోకస్త్వతిగర్వేణ వస్తునీష్టేఽప్యనాదరః" (అతిగర్వముచే నిష్టవస్తువునందుఁ గూడ ననాదరము నూపుట బిబ్బోకము) పైలక్షణమున 'అతిగర్వముచే' అని లేదు. వరునికథ యన్నఁ జాలదు.

## బిబ్బోకోదాహరణము

చ. అతఁడు గుణాభిరాముఁ; డతఁడంగజసన్నిభుఁ;డంచు నెచ్చెలుల్
పతియగు శ్రీ నృసింహనరపాలు నుతింప లతాంగి నీటుతో
శ్రుతులఁ గరాంగుళుల్ సొనిపె; శోభవ తచ్చరితాభిపూర్ణమై
యతిశయమందు కర్ణయుగమం దవకాశమొనర్చు కై వడిన్.

తా. చెలికత్తెలు నరసభూపాలుని నుతింపఁగా లతాంగి యాతని చరిత్రలచే నిండిన తన చెవులలో సందుసేయుటకో యన్నట్లు చెవులలో వ్రేళ్లఁ జొనిపెను. ఈ యుదాహరణము బాగుగాలేదు. గర్వముచే నేర్పడిన యనాదరమేమియు లేదు. ఈ క్రిందిపద్య ముదాహరణీయము.

చ. ప్రియుఁడు సతంబుఁ దమ్మనుసరించినఁ దప్పులువట్టుచుండ్రు; నె
మ్మొయినిడనెంత్రుగాని ప్రియుమీఁద నిగుడ్పరు నిందుచూడ్కి నె
మ్మొయినిఁ; బొనర్తురిపో నిజసమీహితమందు నిషేధ; మీజగ
త్తియిని విలక్షణప్రకృతిఁ దాల్చిన వామలు నాకు గూర్చుతక.

ఇట గర్వముచేఁ బ్రియునియం దనాదరముఁజూపుట గలదు.

## ౧౮. విహృత లక్షణము

కం. ...అనుమతిఁ బలుకం
దరమగు తగు వేళల ను
త్తరమొసఁగమి విహృతమనఁగఁదగు నెట్లన్నన్.

పలుకవలసిన సమయమునఁ బలుకకుండుట విహృతము.

"వక్తవ్యకాలేఽప్యవచో వ్రీడయా విహృతం మతం" (సిగ్గుచేఁ బలుకవలసిన కాలమునఁ బలుకకుండుట విహృతము.) పై లక్షణమున 'సిగ్గుచే' అనునది లేదు.

## విహృతోదాహరణము

ఉ. బాలిక యల్కతో మరలిపల్కకయుండియుఁ బ్రాణనాథుఁ డ
వ్వేళ క్షుతంబొనర్పఁ గడు వేగఁ జిరాయువటంచుఁ బల్కఁగాఁ
జాలక రోషముం బ్రణయసంభ్రమమున్ మదిదొమ్ములాడ నీ
లాలక కుండలద్వయ ముదగ్రగతిన్ ఘుటియించె వీనులన్. ౧౧౬

ఒక యువతి ప్రణయకోపముతో మాటాడకుండియుఁ దనప్రియుఁడు దుమ్ము తుమ్మఁగా నమంగళశాంతికై తప్పక 'చిరంజీవ' యనవలసియున్నను ననక చెవులకుఁ గమ్మలం దొడుగుకొనెను. కమ్మలం దొడుగుకొనుట యమంగళపరిహారార్థము. అంతకు ముందు నిరాభరణురాలై యున్నది. నిరాభరణురాలై యుండుట స్త్రీ కయుక్తము. భర్తృశ్రేయముఁ గోరిన స్త్రీ సాభరణురాలై యుండవలెను. ఇట భార్య భర్తపైఁ గోపించియున్నను నతని చిరంజీవిత్వము నభిలషించియున్నది. కాన నిదివఱకుఁ గోపముచే ధరింపకున్న కమ్మలం వాని శ్రేయమునకై ధరించినది.

తుమ్మినపుడు తప్పక 'చిరంజీవ' యని పలుకవలసియున్నను నలుకచేఁ బలుకలేదు. కాన విహృతము. అయితే యీ పలుకకుండుట లక్షణమునఁ దెలిపినవిధమున సిగ్గుచేఁగాక 'యలుకచే'నని చెప్పఁబడినది. అలుకచేఁ బలుకకుండుటకన్న సిగ్గుచేఁ బలుకకుంటయే రసవత్తరము. ఈ క్రింది దుదాహరణీయము.

అవ-ప్రవాసమునాఁటి నాయికయొక్క చేష్టను నాయకుఁడు చెప్పుచున్నాఁడు.

ఆ.వె. నెపములోడఁ గాల నేలనురాయుచుఁ
దరుణి నన్నుఁగనుచు మరల మరలఁ
బలుకఁదలఁచి యెదియొ వాతెఱంగదిపియుఁ
బలుకదయ్యె లజ్జ బలిసియుంట.

ఇట సిగ్గుచేఁ బలుకకుంటయే నిబంధింపఁబడినది. ఇది విహృతము.

## ౧౧౫. చకిత లక్షణము

కం. అఱుకుట చకితము ౧౧౭

భయపడుట చకితము. "కుతోఽపి దయితస్యాగ్రే చకితం భయవిభ్రమః" ప్రియునియెదుట నేదో హేతువుచే భయపడి తొట్రుపాటునొందుట చకితము. అనఁగా భయపడఁదగినంత పెద్దహేతువు లేకున్నను బ్రియునియెదుట భయపడుట శృంగారచేష్టగదా!

### చకితోదాహరణము

చ. అడుగిడినిల్చు; నిల్చి చెలికానలువెట్టు; నదల్చు; సిగ్గునం
దడఁబడుఁ; గాంతుఁడున్న మణిధామమొగిం జొరజాలకెంతయున్
వడఁకు;గృహాంబుసొచ్చియుఁ గవాటముదాఁపుననిల్చు;నెచ్చెలుల్
వడిఁజనఁజూచినం బెనఁగు వారిజలోచన మాఘ్యసంపదన్. ౧౧౮

ఈ పద్యమున 'సిగ్గునం దడఁబడు' నన్నమాటచే భయవిభ్రమము గానరాదు. కాన నిది యుదాహరణార్హముగాదు. ఈ క్రిందిపద్య ముదాహరణీయము.

ఆ.వె. తొడలమీఁదుదాఁకఁ గడుఁ దత్తఱించుచు
వింత హొయలునూపె నింతియొకతె
చెలుల హేతువుగనె చేయుచుంద్రు విలాస
ములను హేతువున్నఁ దెలుపవలెనె ?

జలక్రీడలాడునపు డొక యువతి చేపలు తన తొడలఁదాఁకఁగాఁ దొట్రు వడెను. దానిచే నొక క్రొత్త హొయలు గలిగెను. ఇట భయపడుటకుఁ దగినంత పెద్దకారణము లేకున్నను భయపడి తొట్రువడుట వర్ణింపఁబడినది. కానఁ జకితము.

## హసిత లక్షణము

కం. ...నవ్వుచు । నలరుట హసితంబు...

ఇంతమాత్రమే కాదు. "హసితం తు వృథాహాసో యౌవనోద్భేదసంభ్రమః" యౌవనోదయముచే నకారణముగానే నవ్వుట హసితము. స్థాయిభావమగు హాసము వేఱు. అది వికృతాకారచేష్టాదులవలన వ్యక్తమగును. ఇది యౌవనోద్గమమున నకార ణముగానే కలుగును.

## హసితోదాహరణము

చ. వదనసరోజ వాసనకు వచ్చిన తేఁటి వదల్చిచూడఁగా,
నది యసితోత్పలంబులని యక్షులఁ వ్రాలఁగఁ, జేవిదుర్పఁగా
నది మరలంబరోజమని హస్తయుగంబునఁ వ్రాల, నవ్వె న
మ్మదవతి 'యేమిసేసినను మానదిదేమి' యటంచు నెంతయుః.

ఒక యువతి తన ముఖపద్మగంధమునకై వచ్చిన తుమ్మెద నదలించి చూచు చుండఁగా నా తుమ్మెద దాని కన్నులు నల్లగలువలని వానిపై వ్రాలెను. ఆ పెయుఁ జేతులతో విదిలింపఁగా మరల నా తుమ్మెద యా హస్తములను బద్మములనుకొని వానిపైని వ్రాలెను. దీనినిఁజూచి యేమిచేసినను నిది మానదని నవ్వెను.

ఇట యౌవనోద్భేదముచే వృథగాఁ గలిగిన హసితముగాదు. తుమ్మెదయొక్క భ్రాంతిచేఁ దాఁజేసిన చేష్టాపరంపరచేఁ గలిగిన హసితము. ఇది యుదాహరణీయము గాదు.

కం. తలవనితలఁపుగ. నవ్వెం
దలిరుంబోఁడి యిదియేలసా? నిక్కముగా
నలరులవిల్తుం డెక్కెను
చెలిమేనను రాజ్యమందు సింహాసనముః.

ఇట యౌవనోద్భేదజమగు హసితము వర్ణింపఁబడినది. కాన హసితము.

## ౧౭. కుట్టమితము

కం. ...రతుల నతిసమ్మర్దో । జ్వలసౌఖ్యము కుట్టమితము

రతులలోఁ గలిగిన తద్దయు నలుగుడులచే మిక్కలి సౌఖ్యమునుగొనుట కుట్టమితము. ఇంతకన్న సాహిత్యదర్పణలక్షణము మేలైనది.

"కేశస్తనాధరాదీనాం గ్రహే హర్షేఽపి సంభ్రమాత్
ఆహుః కుట్టమితంనామ శిరః కర విధూననం"

ప్రియుఁడు దన కేశస్తనాధరాదులను గ్రహింపఁగా లోలో హర్షించుచుఁ గూడఁ దత్తఱపడుచు శిరస్సును గరములను గదల్చుట కుట్టమితము.

## కుట్టమితోదాహరణము

చ. కెరలిప్రియుండు మోవిపయిఁ గెంపులునింపుట బారవశ్యత
త్వరత నెఱుంగలేక పిదపన్నిలువదము చూచి సిగ్గునం

దరుణి చెలుల్ గనుంగొనినఁ దారిఁక నేమని యాడుకొందురో
వరుని? నటంచుఁ జిల్కకు నవారణముద్దులు వెట్టుసారెకున్. ౧౨౦

ఇట నాయిక ప్రియుఁడు రతులయందు మోవిపయిఁ గెంపులునింపుటఁ బార వశ్యతత్పరత నెఱుంగలేకపోయినది. ఇది రతిసమ్మర్దసౌఖ్యము కానఁ గుట్టమితము. కాని యిది యంత లెస్సగాలేదు. ఈ క్రిందిపద్య ముదాహరణీయము.

కం. తలిరాకు చుట్టవగునా
చెలికెమ్మోవిని గ్రసింపఁ జెలువుండు, కరం
బుల నున్న కంకణంబులు
గలగలమనె నేవొ బెడఁదకలిగిన కరణిన్.

ఇట నధరపానకృతసౌఖ్యముచేఁ గరవిధూననము గలిగినట్లు వర్ణింపఁబడినది. కానఁ గుట్టమితము.

## ౧౮. కుతూహల లక్షణము

కం. లలనకుఁ జపలత కుతూహలం బెట్లన్నన్.

చాపల్యము కుతూహలమని యర్థము. "రమ్యవస్తు సమాలోకే లోలతాస్యా త్కుతూహలం" సుందరమైన వస్తువును సందర్శించుటయందుఁ జూపు చాపలము కుతూహలమనఁబడును.

## కుతూహలోదాహరణము

చ. కలికి నృసింహభూవిభునిఁ గాంచి నవప్రణయాభిరామయై
లలితకరాబ్జకేళి కమలంబు భ్రమింపఁగఁ జేసె విభ్రమం
బలవడఁ "బ్రాణనాథ! హృదయాబ్జము నిన్నెడఁబాయలేక యి
ట్లెలమి భ్రమించుచున్న" దని యేర్పడఁ జెప్పెడి చంద మొందఁగన్.

ఒక యువతి నరసభూపాలునిఁ జూచి నూతన ప్రణయము గలిగినదై తన చేత నున్న లీలాకమలమును "ఓ ప్రియుఁడా! నా హృదయకమలము నిన్నెడఁబాయ లేక యీవిధముగాఁ దిరుగుచున్నది" అని చెప్పుచున్నచందమునఁ ద్రిప్పఁదొడఁగెను.

ఇట రమ్యవస్తువగు నరసభూపాలుని సందర్శించుటవలనఁ గలిగిన చాపలము వర్ణింపఁబడినది. ఈ క్రింది మనుచరిత్ర పద్యముగూడ నుదాహరణీయము.

చ. జిలుఁగులఁ బెట్టుచుం దొడలఁ జెంద్రికపావడయంట మైతడిం
[illegible]

జలకములాడియాడి యొక చాన కరస్థితకేశయై నృపుఁగా
వెలువడిచూచె లోపడితి నీకని బాసకునిల్చెనో యనఁగా.

ఇట నా రాజును వీధివెంటఁ జనుచున్నవానిని దర్శింప నాయిక చాపలము గనఁబఱచుచున్నది.

నరసభూపాలీయకర్త యిచ్చిన పదునెనిమిదిశృంగారచేష్టల నిటఁ జూపితిమి. సాహిత్యదర్పణమున నిఱువదెనిమిదింటి నిచ్చెనని చెప్పితిమి. వానినిఁగూడ నిటఁ జూపుచున్నాము.

## ౧౯. శోభా లక్షణము

"రూప, యౌవన, లాలిత్య, భోగాద్యైరంగభూషణం శోభా" రూపము, యౌవనము, సుకుమారత్వము, భోగము (స్రక్చందన తాంబూలాది సేవనము) మొదలగువానివలన నంగములకుఁ గలిగిన యందము శోభ. మొత్తముమీఁద నయత్నకృతమగు నందము శోభ.

### శోభోదాహరణము

అసంభృతం మండనమంగయష్టే, రనాసవాఖ్యం కరణం మదస్య,
కామస్య పుష్పవ్యతిరిక్తమస్త్రం, బాల్యాత్పరంసాఽథ వయః ప్రపేదే.

శరీరమున కయత్నసిద్ధమగు నలంకారమును, ఆసవరూపముగాని మదకారణమగు నొక సాధనమును, మన్మథునికిఁ బుష్పముగాని యొక బాణమును నగు యౌవనము నా పార్వతి పొందెను. ఇట యౌవనశోభ వర్ణింపఁబడినది. భోగకృతమగు శోభ కీ క్రిందిపద్య ముదాహరణము.

కం. కనుదోయి కజ్జలంబును,
దనూలతకు దువ్వలువయుఁ, దములపుఁబెట్టం
దనమును మోవికి; నిది భూ
షణ మితరము దూషణంబు జవరాలికిలకా.

భోగమన స్రక్చందన తాంబూలాది సేవనమని తెలిపితిమి. అయితే భోగకృతమైన శోభ యయత్నకృత మెట్లగును? అని ప్రశ్న యుదయించును. స్వభావసిద్ధమగు శోభ యున్ననే భూషణాదుల శోభయు మెరయును. స్వభావశోభ లేని భూషణశోభ మెరయదుగదా! ఇట భోగకృతశోభ యన స్వభావశోభలేని కేవల భోగకృతశోభ యని [illegible] రూపాదులశోభ [illegible] వ్యాము.

## ౨౦. కాంతి లక్షణము

"సైవకాంతిర్మన్మథా ప్యాయితద్యుతిః" మన్మథునిచే వర్ధిల్లఁజేయఁబడిన యా శోభయే కాంతి యనఁబడును. మన్మథోన్మేషము గలుగకముందున్న యంద చందములు మన్మథోన్మేషము గలిగినపిమ్మట మరింత లెస్సగా శోభిల్లును.

### కాంత్యుదాహరణము

కం. తొలుప్రాయపు మగకోదమల
తలఁపుల తమకములు మిగులఁ దను నెదురుకొనం
జలజాక్షి జవ్వనము గడు
వెలసెఁ బ్రతిక్షణము వింతవింతగ నంతన్.

ఇట యౌవనమన యౌవనశోభ ప్రతిక్షణమును వింతవింతగాఁ గనఁబడుట మదనోన్మేషముచేతనేకదా! కాన నిది కాంతి.

## ౨౧. దీప్తి లక్షణము

"కాంతిరేవాతివిస్తీర్ణా దీప్తిరిత్యభిధీయతే" అత్యంతమైన కాంతియే దీప్తి యనఁబడును.

### దీప్త్యుదాహరణము

కం. ఎలజవ్వన మెలయింపఁగ
విలాసముల నొడలిపైని, విరివిల్తుండున్
ఇలుద్రొక్కి యెసరువెట్టఁగఁ
గలఁపడె చెలి తపసినేనిఁ గనుచూపులచేన్?

ఇట నాకాంతి మదనుఁ డెసరువెట్టుటచే మరింత వర్ధిల్లినది. కావుననే కను చూపులచేతనే తపసినేనిఁ గలఁచును. కాన నిది దీప్తి.

## ౨౨. ప్రగల్భతా లక్షణము

"నిస్సాధ్వసత్వం ప్రాగల్భ్యం" ప్రియుఁడు ప్రియురాలితోఁ గాని ప్రియురాలు ప్రియునితోఁగాని రమించుపట్ల నప్రతిబంధకముగా వర్తిల్లుట.

### ప్రగల్భతోదాహరణము

ఆ. వె. కౌఁగిలింపఁ దమ్ముఁ గౌఁగిలించుచు బిగ్గ
ముద్దులాడఁ దమ్ము ముద్దుగొనుచు

మోవిగఱవ రేఁగి మోవినిం గఱచుచుఁ
దెలుపు ప్రియుని దాసుఁజేసికొండ్రు.

ఇందు నాయిక యప్రతిబంధముగాఁ బ్రగల్భముగా నాయకునిలోఁ గ్రీడించుచున్నది.

## ౨౩. ఔదార్య లక్షణము

'ఔదార్యం వినయస్సదా' ఔదార్యమన వినయము. వినయమనఁ బ్రియుని యపరాధము దెలిసినను గోపమును వహింపకుండుట.

### ఔదార్యోదాహరణము

గీ. చిఱుతయలుకను వహియించి చిగురుఁబోఁడి
యలఁతి నవ్వులు, సిగ్గులుఁ, గోలఁది యూర్పు,
లలరఁ 'దాఁకకు! తాఁకకు'మనుచు జరిగి
పోయి మెలమెల్లఁగ గవాక్షమును బిగించె.

ఇట సాపరాధుఁడగు ప్రియునియం దలఁతికోపమును మాత్రము పూని యాతఁడు చరణపాతమొనర్పరాఁగా నన్నుఁ దాఁకకుమని జరిగిపోయి కిటికీమూసెను. (కేళికై).

ఆతని నమస్కార మక్కఱలేకయే నాయిక ప్రసన్నురా లైనందున నౌదార్యము చూపఁబడినది.

## ౨౪. మద లక్షణము

"మదోవికారస్సౌభాగ్య యౌవనాద్యవలేపజః" సౌభాగ్యము, యౌవనము మొదలగువానియొక్క గర్వమువలనఁ గలిగిన వికారము మదము.

### మదోదాహరణము

గీ. నాదు నునుజెక్కిళులపైని నాయకుండు
స్వయముగా వ్రాసెఁ బువ్వుమంజరి నటంచు
మురిసిపోకిట్టి వన్నెయుం బొందకున్న?
పాదువణఁ కట్టిచో విఘ్నపఱపకున్న.

ఇట సౌభాగ్యగర్వమువలనఁ గలిగిన మదము స్పష్టము.

## ౨౫. తపన లక్షణము

"తపనం ప్రియవిచ్ఛేదే స్మరావేగోత్థచేష్టితం" ప్రియవిరహ సమయమున మోహాతిరేకముచేఁ గలుగు చేష్ట.

### తపనోదాహరణము

మ. కడునిట్టూర్పులువుచ్చు; నేలఁబొరలున్; గాంచున్ భవన్మార్గ మె
ప్పుడు; బిట్టేడ్చు; గృశీభవించిన కరంబుల్ వేయు నట్టిట్టులున్
బడయుంగాఁ గలనైన నీకలయికన్ వాంఛించు నిద్రింపఁగా;
నిడఁడద్దానినిఁగూడఁ బాడువిధియో యీ! యెంత దౌర్భాగ్యమో?

## ౨౬. మౌగ్ధ్య లక్షణము

అజ్ఞానాదివ యా పృచ్ఛా ప్రతీతస్యాపి వస్తునః
వల్లభస్య పురఃప్రోక్తం మౌగ్ధ్యం తత్త్వవేదిభిః.

తెలిసియున్న వస్తువును గుఱించియుఁ దెలియనివిధమునఁ బ్రియసన్నిధినిఁ బ్రశ్నించుట మౌగ్ధ్యము.

### మౌగ్ధ్యోదాహరణము

కం. చెలికాఁడ! నాదు కంకణ
ములముద్దులుమూటగట్టు ముక్తాఫలముల్
గల వేవృక్షంబుల? నే
స్థలంబునను? నాఁటిరెవరు? సరిగఁ దెలుపవే!

## ౨౭. విక్షేప లక్షణము

భూషాణా మర్ధరచనా। మిథ్యా విష్వ గవేక్షణం
రహస్యాఖ్యానమీషచ్చ। విక్షేపో దయితాంతికే.

ప్రియునియెదుట భూషణములు సగము దాల్చుట, యూఱకయే యటునిటు చూచుట, రహస్యముగా భాషించుట మొదలగు చేష్ట విక్షేపము.

### విక్షేపోదాహరణము

కం. అఱవిరిసిన వేనలితో
నఱదీర్చిన బొట్టుతోడ నళుకుసుగొన్న

ట్లరయుచు దెసలం బ్రియుతో
జరుపును గోమలి రహస్య సంభాషణముల్.

### ౨౮. కేళి లక్షణము

"విహారే సహకాంతేన క్రీడితం కేళి రుచ్యతే" కాంతునితో విహరించునపు డొనర్చు చుంబనాలింగనాది క్రీడ కేళి.

### కేళ్యుదాహరణము

కం. కనుల్గా రాలిన పుప్పొడిఁ
దన వదనానిలము చేతఁ దలఁగింపఁగఁజా
లని ప్రియునిఁబొడిచెఁ బీన
స్తని యొకతె పయోధరమునఁ దద్వక్షమునన్.

తన ముఖవాయువుచేఁ బ్రియుఁడు ప్రియురాలి కను లూఁదుచుండఁగా నాప్రియురాలు కనులలోని పుప్పొడి పోయినను బోలేదని మరల మరల నూఁదించుకొనుటకై మరింత దగ్గఱకువచ్చుచుఁ దన స్తనాగ్రమున నాతనిఁ బొడుచుచున్నది.

గీ. మఱియు శృంగార మంగనామణులయందు
నంకురిత, పల్లవిత, పుష్పితాదిభేద
వర్ణితాకృతియై దశావస్థలయ్యె
వీని నామక్రమంబులు విస్తరింతు. ౧౨౨

స్త్రీలయందు శృంగార మంకురావస్థ, పల్లవావస్థ, కోరకావస్థ, పుష్పావస్థ, ఫలావస్థ యను పంచావస్థలను గ్రమముగాఁ బొందును. ఈ పంచావస్థాత్మకమగు శృంగారము దశావస్థలను బొందును. వీనినిఁ గ్రమముగా నెఱిఁగింతును.

ఇట శృంగారమన విప్రలంభశృంగారము. ఈ విప్రలంభము సంభోగావస్థకు ముందును బిమ్మటనుగూడ సంభవించును. సంభోగావస్థకు ముందున్న విప్రలంభమునకుఁ బూర్వరాగమని పేరు. ఆ పూర్వరాగరూప విప్రలంభ శృంగారమేక నాయంకురాద్యవస్థలను బొందును. అనఁగాఁ గ్రమాభివృద్ధినిఁబడసి సంభోగమునఁ బర్యవసించును. మరియు శృంగారమన శృంగారరసమని కాక దాని స్థాయిభావమగు రతియే యిట నుద్దిష్టము. ఆ రతి దశావస్థలను బొందుననుటయు దోషమే. ఇఁకేమనఁ బూర్వరాగరూపవిప్రలంభశృంగారముయొక్క స్థాయిభావమగు రతి వలన దశావస్థలుగలుగును. రతియే దశావస్థలనుబొందదు. అట్టి రతివలన దశావస్థలు

గలుగును. పై పద్యమునఁ 'బల్లవిత'కుఁ బిమ్మట 'కోరకిత' అని యుండవలెను. దానినిఁ జేర్పక తదనంతరావస్థ యగు పుష్పితత్వమును దెలుపుటదోషమగును.

మొత్తముమీఁదఁబూర్వరాగ రూపవిప్రలంభమునందే ( అభిలాష రూప విప్రలంభమునందే) దశావస్థలు గలుగును. సంభోగావస్థపిమ్మట సంభవించిన విప్రలంభమునందుఁ గూడ నీదశావస్థలలోఁ గొన్నిసంభవించును. అటనేయవస్థలు గలుగునో ముందుచెప్పెదము.

## దశావస్థలు

క. ఇలఁజూచుట, చింతించుట
తలఁచుట, గుణవినుతి, యరతి, తాపము, లజ్జా
స్ఖలనము, గమనము, మూర్ఛయు
నల ధన్యత యనఁగ నవస్థలగు నెట్లన్నన్. ౧౩౩

చూచుట, చింతించుట, తలఁచుట, గుణవినుతి, యరతి, తాపము, లజ్జాత్యాగము, గమనము, మూర్ఛ, ధన్యత, అనునవి దశావస్థలని గ్రంథకర్తయుద్దేశము. దీనికాకరమిది:—

దృఙ్మనస్సంగ సంకల్పా, జాగరః కృశతాఽరతిః
హ్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశాదశ.

దృక్కు (దర్శనములేక చక్షుఃప్రీతి) మనస్సంగము, సంకల్పము, జాగరము, కృశత, అరతి, హ్రీత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, అంతము (మరణము) అనునవి పదిమన్మథావస్థలు. నాయిక నాయకునిఁ జూడఁగానే 'చక్షుఃప్రీతి' యను ప్రథమావస్థ గలుగును. పిమ్మట మనస్సు వానిపైఁ బడును. ఇదియే మనస్సంగము. పిమ్మట నతనిసంగముచింత. ఇదిసంకల్పము. ఆసంకల్పముచే నిదురలేకుంట తటస్థించును. ఇదేజాగరము. దానిచే శరీరముకృశించును. ఇదికృశత. దానివలన దేనియందును ప్రీతి లేకుండుట. ఇదియేయరతి. పిమ్మటలజ్జాత్యాగము నేసిమాటలాడుట. ఇదియే హ్రీత్యాగము. తమపరి యున్మాదము. తుదికి మరణయత్నము (మరణముగాదు.)

ప్రతాపరుద్రీయమున నీదశావస్థలకుఁ దోడుగా ప్రలాపము, సంజ్వరము, అను మరిరెండవస్థలు చెప్పఁబడినవి. భావప్రకాశమున నీయవస్థలు భిన్నములుగా నున్నవి. ఎట్లన

దశధా మన్మథావస్థా భవేద్ద్వాదశధాఽపి వా
ఇచ్ఛోత్కంఠాభిలాషాశ్చ చింతాస్మృతి గుణస్తుతి

ఉద్వేగోఽథః ప్రలాపస్స్యాదున్మాదో వ్యాధిరేవచ
జాడ్యంమరణ మిత్యాద్యేద్వేకేచిద్వర్జ్యతే బుధైః

ఇచ్ఛ, ఉత్కంఠ, అభిలాష, చింత, స్మృతి, గుణస్తుతి, ఉద్వేగము, ప్రలాపము, ఉన్మాదము, వ్యాధి, జాడ్యము, మరణము, అను పండ్రెండింటిలో మొదటివి రెండును, (ఇచ్ఛ, ఉత్కంఠ) గొందఱు విడిచిరి.

నరసభూపాలీయ పద్యము నందలి 'గమనము, ధన్యత' యనునవి పై వేని యందును గానరావు. 'గుణవినుతి' భావప్రకాశ లక్షణమునఁ గలదు. 'తాపము' సంజ్వరనామముతోఁ బ్రతాపరుద్రీయమునఁ గలదు.

ప్రలాప, సంజ్వరములు గలిపికొని దృఙ్మనస్సంగ సంకల్పాదులగు పదియును స్వీకరించి మొత్తము పండ్రెండవస్థలు స్వీకరించుట యుచితమగును.

ఆంధ్ర కావ్యములలో నాయిక చేయు చంద్రాది దూషణము లీ ప్రలాప రూపములే. ఈ ద్వాదశావస్థాత్మకమగు శృంగారమునకుఁ బూర్వరాగమని పేరు. అనఁగా సంభోగశృంగారమునకుఁ బూర్వావస్థ.

క్రమముగా నరసభూపాలీయ దశావస్థలకు లక్షణలక్ష్యములను జూపుదుము.

## ౧. చూచుట (చక్షుఃప్రీతి).

"ఆదరాద్దర్శనం చక్షుఃప్రీతి రిత్యభిధీయతే" నాయిక నాయకుని నాదరముతోఁ జూచుట చక్షుఃప్రీతి యనఁబడును.

మ. అనురాగాంబుధి యుబ్బి వెల్వడిన యట్లాపూర్ణ ఘర్మాంబువుల్
దనువల్లిం దిగజాఱఁ గన్నుఁగవ లేఁదళ్కుల్ పిసాళించుచుఁ
ననవిల్కాని పురఃప్రవేశకలనా నాళీకదామంబులై
తనరం గోమలి నిన్నుఁజూచె నరసేంద్రా! సాంద్రతేజోనిధీ! ౧౨౮

అనురాగసముద్ర ముబ్బినవిధమునఁ జెమటజాఱు శరీరమునుండి దిగజాఱఁగా మన్మథుని పురఃప్రవేశ సమయమునఁ గట్టిన తామరపువ్వులదండలైన చూపులతో నా యువతి నరసభూపాలా! నిన్నుఁ జూచెను.

ఇట నాయిక యాదరముతో నాయకునిఁ జూచినట్లు జెప్పఁబడినది. కావునఁ జక్షుఃప్రీతి.

నాయిక నాయకునిఁ బ్రత్యక్షముగా దర్శించుటచేతనేకాక వానినిఁగూర్చి వినుటవలనను, జిత్రమునఁ గాంచుటవలననుగూడఁ రతి గలుగునని యాలంకారిక మతము. "శ్రవణాద్దర్శనాద్వాపి..."

## ౨. చింతించుట (సంకల్పము.)

మ. అరవిందంబు విలాసమందిరము; నీహారాంశుఁ డేకోదరుం;
డరయ న్గోత్రవిరోధమేటికి? ననర్వాంబంచు నూహించి యి
ర్వురఁ బొందించు పయోధికన్యక్రియఁ జేర్చుంగేలు గండస్థలిం
దరుణీరత్నము చింతచేత; నరసేంద్రా! సాంద్రతేజోనిధీ! ౧౨౫

పద్మము నాగృహము. చంద్రుఁడేకసోదరుఁడు. వీరిరువురికిని విరోధమేల? వీరిరువురికినిఁబొత్తుసుగూర్చెదనని లక్ష్మీదేవి తనహస్తమునఁ జెక్కిలినేర్చియున్న విధమున నిటఁ బ్రియునిఁ జింతించుచు నాయిక చెక్కిలిపైఁ జేయిచేర్చియున్నది. ఇట్లుగాక నాయికానాయకులు పరస్పర సంగమోపాయమును జింతించుచున్నట్లు చూపవలయును. ఎట్లన

కథమీక్షే కురంగాక్షీంసాక్షాల్లక్ష్మీం మనోభువః?
ఇతిచింతాకులః కాంతోనిద్రాం నైతినిశీథినీం.

మన్మథుని లక్ష్మీవలెనున్న యాకాంతను నేనెట్లు చూడఁగలనని చింతాకులుఁడైకాంతుఁడు రేలనిద్రింపఁడు— ఇట సంగమోపాయ చింతగలదు. పైపద్యమున నవ్విధము లేదుగదా!

## 3. తలఁచుట—స్మృతిఅనఁగా సంస్కారజన్యమగుజ్ఞానము

మ. వరభూషాదులపై మనంబిడక దృగ్వ్యాపారమొం తేఁబర
స్పరసందర్శన నాతిభిన్నమయి చూపట్టంగఁ, గార్యాంతర
స్మరణంబేమియులేక నిశ్చలత నీసాంగత్యముంగోరి మా
హారిణీలోచన యాత్మయందు నరసేంద్రా! నిన్ను భావించెరా!

ఓ నరసభూపాలా! భూషణములమీఁద మనసుపోనీక దృగ్వ్యాపారమొకరి నొకరు చూచుకొనుటకన్న భిన్నముగానిదిగాననఁగా నిన్నదియు నదినిన్నును జూచుచున్నట్లుగానే చూపట్టఁగా దేనినిఁగూడఁ దలంపక నీసాంగత్యమునుగోరి యాత్మయందాయువతి నిన్నే స్మరించినది.

ఇచ్చటివ్యంగ్యము (ఒకానొక యోగిని భగవదైక్యమునుగోరి ధ్యానించుచున్నది)నూహించుకొనునది. ఈస్మృతి పూర్వరాగమునందుకన్న నుత్తరవిప్రలంభమునందు రసవత్తరము.

క. అలకలు చెదరఁగఁ జెమటే
నలివిరియఁగ, నూర్పులకు స్తనద్వయ మెగయన్
వలువ ప్రిదుల, నెదఁ గేలిడి
చెలి రతివివశతఁ బర్న్న చెలువముఁ దలఁతున్

## ౮. గుణవినుతి

మ. పలుకుందోడగు వీణతోఁ జెలియ నీపై గీతముల్ మీటఁ దో
య్యలి మైనీడ మెఱుంగుఁ గాయనిరవై యవ్వీణలో వాణి "యో
లలితాంగీ! మనచిత్తముం బ్రియుఁడు గొల్లల్ వెట్టెఁగా!" యంచు వె
ల్వలికిం దానుబుసాడవచ్చెననఁ గన్పట్టున్ నృసింహాధిపా! ౧౨

నాయికవీణపై నరసభూపాలునిపై గీతములు మీటుచుండెను. అప్పుడు నాయికయొక్క బింబమా వీణయొక్క కాయలోఁ బ్రతిఫలించెను. ఆ ప్రతిబింబమా వీణలో నున్న సరస్వతీదేవి నాయికతో "నరసభూపాలుఁడు మనచిత్తమును గొల్లఁ బెట్టెనుగదా!" యనియుబుసాడుటకై వచ్చినట్లున్నది.

ఇట గుణములేమియు నుతింపఁబడలేదు. గుణకథనము చేసినఁగాని గుణవినుతి కాదుగదా! ఈ క్రింది దుదాహరణీయము.

కం. ఆయందంబాచందం
బా యా నెఱజాణతనము, లా మాటతనం,
బేయెడఁగన; మాసుందరి
యాయజు సామాన్యసృష్టి యగునే తలఁపన్.

జాగరము, కృశత, అను రెండవస్థలును దృజ్మనస్సంగశ్లోకమునఁ గలవు. వాని కుదాహరణము లివి :—

నాయకుని జాగరావస్థ కిది యుదాహరణము:—

కం. ఏ కడయందే చెట్టున
నే కొమ్మను గూరుచుండి యెల్లెత్తి మెదన్
శ్రీకరసుధాంశులేఖ వి
లోకించెఁ జకోర మట్టులు నిశం గడపెన్.

### కృశత

గీ. వలపుగాని పెల్లువలకాఁక నలుగుడువడి
[illegible]

మిగిలియున్నది నీకయి, మిత్తిగొంగ
వేల్పుకయిగట్లరాయని బిడ్డపోలె.

### ౫. అరతి. (విషయ నివృత్తి).

మ. నిరతం బాత్మకరాంఘ్రి బాహు నఖ కాంతిస్ఫూర్తికిం దిగ్గడై
శరణంబొందు ప్రవాళపద్మబిస పుష్పశ్రేణినిం గ్రమ్మఱన్
శరణంబందుట హీనమంచునొ! మదిన్ శైత్యోపచారక్రియా
గరిమంబొల్లదు మానినీమణి కడంకన్ శ్రీ నృసింహాధిపా! ౧౭౭

తన చేతులు, కాళులు, బుజములు, గోళ్లు, వీనియొక్క కాంతికోడి శరణు బొందిన చిగురాకులను, దామరపూలను, దామరతూండ్లను, బూలను దాను శరణు గోరుట హీనకృత్యమని కాఁబోలు నాయిక శైత్యోపచార మొల్లకున్నది.

ఇట శైత్యోపచారమం దరతి చూపఁబడినది. కాని యరతి యన విషయ నివృత్తి యని చెప్పితిమి. ఆహారాదులందుఁ బ్రీతిలేకుంట యరతి యనఁబడును. కాన నిది యుదాహరణార్హము గాదు. ఈ క్రిందిపద్య ముదాహరణీయము.

శా. ఆహారంబును మాని, పూని విషయవ్యావృత్తినిన్, జిత్తమున్
'సోఽహం' వృత్తికిఁద్రిప్పి, నిల్వఁబడ నాసాగ్రంబునంజూపు, వా
గ్రాహిత్యంబు వహించి శూన్యముగ లోకంబెల్ల భావింతు వో
హోహో! యోగినివో? వియోగినివొ? నాకో సీ! చెలీ! చెప్పవే!

ఇందు విషయవ్యావృత్తి గలదు. కాన నరతి.

### ౬. తాపము

మ. ధవళాక్షీమణి మేను హేమలలత యన్ తత్త్వంబు మున్నెల్లఁ ద
త్కవిలోకోక్తి యటంచునుంటి నది తథ్యంబయ్యెఁ; నెట్లన్న భ
వ్యవియోగానలతప్తమై నిబిడబాష్పాసక్తమై డస్సియున్
నవశోభాతిశయంబుఁ జెందె నరసేంద్రా! సాంద్రతేజోనిధీ! ౧౭౮

ఓనరసభూపాలా! 'ఆయువతిమేను బంగారుతీఁగ' యనుమాటను గవిప్రౌఢోక్తిగాఁ దలఁచితిని. కాని యది వియోగాగ్ని తప్తమై బాష్పాసిక్తమై కృశించియు నూతనశోభను వహించినది. కాన నిజమనియిప్పుడు గ్రహించితిని. బంగారుతీవను గాచి నీళ్ళముంచి తీయుదురు. అప్పుడది శోభాయమానముగా నుండును.

ఇందు నాయికయొక్క తాపము వర్ణింపఁబడినది. కాని తాపమువలన నామె దేహమునఁ గలిగినకార్యములు వర్ణింపఁబడవలెను. అప్పుడది హృద్యముగానుండును. ఎట్లన

చ. అలచెలిమేనిపైనిఁగల యచ్చపుఁ దామరతూండ్లు తేంట్లబా
రులవలెనయ్యె; నింద్రమణిరూపువహించెను నత్తుముత్తెమూ
ర్పులకుఁ; దటానబుస్సుమని పొంగెఁ జనుంగవనిడ్డ కప్రము
క్కల! మెయిఁబడ్డ నీర్మఱగెఁ గ్రాఁగిన యిన్మపయింజలంబటుల్.

ఇటఁ దాపముయొక్క కార్యములు వర్ణింపఁబడినవి.

## ౭. లజ్జాత్యాగము

మ. చెలి నీమూర్తి లిఖించిచిత్రపలకం జెన్నొందు బాష్పాంబుపి
చ్ఛిలమాపయ్యెదమీఁదఁ జేర్చుకొననాచిత్రం బలక్ష్యంబుగా
బళి రే! కట్టినచీరయుంబగయుకాపాటించె దైవంబటం
చలినీలాలక యార్తిఁజెందు నరసింహా! యింకఁ బాలింపుమా! ౧౩౦

ఓనరసభూపాలా! నాయిక చిత్తరువున నీమూర్తిని వ్రాసి దానినిఁ గన్నీటఁ దడసిన పైఁటపైఁ బెట్టుకొన నాతడిచే నాచిత్తరువు కరిగి కనఁబడకపోయెను. అప్పుడది నాచీరయే నాకుఁ బగగాదైవముసేసెనే, యని యార్తినిఁ జెందెను.

చిత్తరువునఁ బ్రియునివ్రాయుట, నాచీరయే నాకుఁ బగయయ్యెనని విలపించుటయు లజ్జాత్యాగ కార్యములని కవితలంచెను. చిత్తరువునువ్రాయుట చిత్తవినోదార్థము. ఇదిలజ్జాత్యాగోదాహరణము కాఁ జాలదు. ఈక్రిందిపద్యమునుగనుఁడు.

మ. అనిచింతించుచు మీనకేతన ధనుర్జ్యాముక్తనారాచ దు
ర్దినసమ్మూర్ఛిత మానసాంబురుహయై దీపించు పెంగత్తరం
బునఁ బేపెత్తినలజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయనడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁజూచి చేరఁజనిపల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై.

ఇటవరూధుని లజ్జాత్యాగము సేసి (పెపెత్తినలజ్జ) ప్రవరుని మార్గమునకడ్డము నిల్చినది. మరియు నాయకుని గోత్రస్ఖలనములు, మొదలయినవియు ఆజ్జాత్యాగ కార్యములే యగును.

## ౮. గమనము

మ. చెలులన్ వంచనసేసి యొక్కతెయుఁదాఁ జెన్నొందనీయొద్దకున్
నలినాక్షీమణి రాఁదలంచి నవరత్నప్రోతసౌధాంగణ

స్థలులన్ వెన్చనివచ్చు నిర్మలతనుచ్ఛాయన్ నిరీక్షించి నె
చ్చెలియే తెంచె నెఱుంగఁబోలునని నిల్చెన్ శ్రీ నృసింహాధిపా!

చెలికత్తెలను వంచించి తా నొక్కతయే నీవద్దకు రాఁదలఁచి రత్నసౌధాంగణమునఁ దన్ను వెంబడించివచ్చు నీడనుగని తన్నెఱుఁగుటకై చెలికత్తె వచ్చుచున్నదని భ్రమపడి నిలిచెను.

ఈ గమనము నే యాలంకారికులును దెలుపలేదు. దీని స్థానమున 'ఉన్మాదము' గలదు.

ఉన్మాదము

గీ. అన్న భృంగంబ! భ్రమియింతు వఖిలదిశల
నాదు వలపులరాణి గన్పట్టెనోయి!
'ఔ'నటందువు సఖ! తెల్పు మాలసింప
కెచటఁగల? దేమిగావించు? నెట్టిదామె?

భృంగమును గుఱించి యిట్టి ప్రశ్న యున్మాదకృతము గాక కింకృతము.

౯. మూర్ఛ

మ. లలితంబైన యనంగ వేదనలచేఁ బల్మాఱు నిల్వోపలే
కలినీలాలక ప్రాణముల్ వెడలి నేత్రాంభోజమార్గంబునం
గలయంబ్రాఁకుచువచ్చి యన్నెలవునం గన్నీటియేఁ బడ్డమై
నిలుపన్నిల్చె నృసింహభూరమణ! మన్నింపంగఁబాఁడింతటన్.

మన్మథవేదన సహింపలేని నాయిక ప్రాణములు కన్నులమార్గమున వెడలిపోఁబూని యచటఁ గన్నీటిప్రవాహ మడ్డగింపఁగా నాఁగెను.

ప్రాణములు కన్నులలోనికి వచ్చుట మూర్ఛాకార్యముగాఁ దెలుపఁబడినది. ఇదియు హృద్యముగాలేదు. ఈ క్రిందిపద్యముఁ గనుఁడు.

కం. పిలిచినను బలుక; దంగం
బుల నట్టిట్టులు కదల్పఁబోవదు; కనుద
మ్ములఁ దెఱవదు; రోఁజుచుఁ గడు
వలవంతలఁజిక్కి బాల పాన్పునపోలెన్.

పిలిచినను బలుకకుండుట, అట్టిట్టు కదలకుండుట, కనుదమ్ములు దెఱవకుండుట, రోఁజుట, అను నివి మూర్ఛాకార్యములు. వీనిచే మూర్ఛ వ్యక్తమగును.

## ౧౦. ధన్యత

మ. శుకవర్గం బొకమాటలో మెలఁగె; నాసూనాయుధుం డాంతరం
గికుఁడై యుండె; మరాళ మొక్కనడకం గ్రేళ్లుబ్బి వర్తించెఁ; జా
యక పేడ్కన్ సుముఖత్వ మొందె శశి మా యబ్జాక్షి సేమంబుతో
నకలంకస్థితి నీవుగూడ నరసింహా! రాజకంఠీరవా! ౧౩౩

నీవు మా యువతిం గలియఁగాఁ జిలుకలు దాని మాటలో మెలఁగెను. (పూర్వవైరము మానెను.) మన్మథుఁ డాంతరంగికుఁడై వర్తిల్లెను. (ఏఁచుట మానెను.) హంస లనుకూలముగా వర్తిల్లెను. (విరోధము మానెను.) చంద్రుఁడు సుముఖత్వ మొందెను. (అతఁడు వెనుక బాధించెను. ఇప్పు డనుకూలుఁడయ్యెను.)

ధన్యతను నే యాలంకారికులును దెలుపలేదు. ధన్యత సంభోగ శృంగార లక్షణము. దశావస్థలును విప్రలంభముననే కలుగునని చెప్పితిమి. దానిలో ధన్యత యెట్లుండును? కాన నిది దోషము. పదియవ యవస్థ మరణోద్యోగమునుగా నాలంకారికులు తెలిపిరి.

గీ. ముసరఁగానిమ్ము! జొమ్మని దెసలఁ దేంట్లు
మలయఁగానిమ్ము! మెలమెల్ల మారుతంబు
పాడఁగానిమ్ము! కోయిలల్ పంచమంబు
నరుగఁగానిమ్ము! నా యయఃప్రాణములును.

ఇది మరణోద్యోగము.

"రసవిచ్ఛేదహేతుత్వా న్మరణం నైవవర్ణ్యతే
జాతప్రాయం తు తద్వాచ్యం చేతసాఽకాంక్షితం తథా
వర్ణ్యతేఽపి యది ప్రత్యు జ్జీవనం స్యాదదూరతః."

కావ్యములందు రసవిచ్ఛేదము గలిగించును. కాన మరణమును వర్ణింపరాదు. ౧. మరణము సంభవించుచున్నట్లు కానీ, ౨. నాయికాదులు మరణమును గాంక్షించు చున్నట్లు గానీ వర్ణింపవలెను. 3. ఒకవేళ నియతముగా మరణము సంభవించినట్లు వర్ణించినను ద్వరలోనే మరల జీవించినట్లు వర్ణింపవలెను. లేకున్న రసభంగమగును. మొదటిదాని కుదాహరణము.

కం. విరియంబాఱఁగ వావిలిఁ
బరికిం దియు నెట్టొపట్టి ప్రాణమునిలిపెం

దరుణీమణి; యా పిమ్మట
నెఱుఁగము విని కోఁడికూఁత నేమగునో కటా!

ఇటఁ గోఁడికూఁత విన్నపిమ్మట మరణముసంభవించునట్లున్నట్లు వర్ణింపఁబడెను. రెండవదానికి "ముసరఁగానిమ్మ" అను పై పద్యము లక్ష్యము. అందు నాయిక మరణమును గాంక్షించుచున్నది. మూఁడవదాని కుదాహరణము కాదంబరిలో మహాశ్వేతా పుండరీక వృత్తాంతము. అందుఁ బుండరీకుఁడు విరహతాపముచే మరణించును. పిమ్మటఁ గొంతకాలమునకు జీవించును.

ఈ దశావస్థలకును మొత్తముమీఁద నీగ్రంథకర్త యిచ్చిన లక్ష్యములన్నియు దోషగ్రస్తములే.

గీ. తెలియ శృంగారమిదియును ద్వివిధమగుచుఁ
బరగు సంభోగ విప్రలంభంబులనఁగ
నందు బహుభేదముల నగణ్యంబుగాక
యేకవిధమయ్యె సంభోగమెట్లటన్న. ౧౩౪

శృంగారము సంభోగశృంగారమనియు, విప్రలంభశృంగారమనియు ద్వివిధము. అందు సంభోగశృంగారము కేవలము సురతరూపమేకాక పరస్పరాలోకన, చుంబన, ఆలింగన, జలక్రీడా ద్యనంతప్రకారముల నుండును. ఆ ప్రకారములు లెక్కింప సాధ్యముగామి నేకవిధమనియే యాలంకారికులు వ్రాసిచ్చిరి.

సంభోగ శృంగారము

మ. మరుఁడాచార్యుఁడుగా, విశీర్ణకబరీమాల్యాళి పుష్పాంజలి
స్ఫురణల్ గాఁ, దదుపేతభృంగనినదస్తోమంబు గానంబుగా
వరమంజీరరవంబు తాళగతిగా వర్ధిల్లు శాతోదరీ
సురతవ్యత్యయవేగతాండవ మొనర్చుం జింతితాభీష్టముల్. ౧౩౫

విప్రలంభ శృంగారము

కం. పురుషులకుఁ దలోదరులకు
నరయంగా విప్రలంభ మభిలాషేర్ష్యా
విరహ ప్రవాసకారణ
పరిణతిచే నాలుగతులఁ బరగుచునుండున్. ౧౩౬

నాయికానాయకుల విప్రలంభ శృంగారము, అభిలాష, ఈర్ష్యా, విరహ, ప్రవాస, భేదములచే నాలుగువిధములు. (అభిలాషవిప్రలంభము; ఈర్ష్యావిప్రలంభము; విరహ విప్రలంభము; ప్రవాస విప్రలంభము.)

అభిలాష విప్రలంభమునకే పూర్వరాగమని పేరు. వెనుకటి మన్మథావస్థలు దీనియందుఁ గలుగును.

౧. అభిలాష విప్రలంభము. (పూర్వరాగ విప్రలంభము.)

కం. కలియుటకుమున్ను కోరిక । యిల నభిలాషంబు... ౧౩౭

నాయిక నాయకునిఁ గలిసికొనుటకు ముందు గలిగిన కోరికయే యభిలాష మనఁబడును.

చ. అనయము శ్రీనృసింహు లలితాంకతలంబున నుండవచ్చు; నా
యనఘు నఖాంకసంగతుల నందఁగవచ్చు; నృపాలమాళితోఁ
జనవునఁ గుల్కవచ్చు; గుణసంగతి మెచ్చులుచూపవచ్చు నో
వనజదళాక్షి! యా కనకవల్లిక నైనను ధన్యనౌదుగా. ౧౩౮

ఇట నాయిక నరసభూపాలుని కూటమి నభిలషించుచున్నది. కాన నభిలాష. ఈ పూర్వరాగము ముత్త్రివిధములని సాహిత్యదర్పణకారుఁ డిట్లు తెలుపుచున్నాఁడు.

"నీలీ కుసుంభం మాంజిష్ఠా పూర్వరాగోఽపి చ త్రిధా
న చాతిశోభతే యన్నాపైతి ప్రేమ మనోగతం
తన్నీలీరాగమాఖ్యాంతి యథా శ్రీరామసీతయోః;
కుసుంభరాగం తత్ప్రాహుర్యదపైతి చ శోభతే
దేవహూత్యా సమం యద్వత్కర్దమస్య తపస్వినః;
మంజిష్ఠారాగమాహుస్త ద్యన్నాపైత్యతిశోభతే
ఇందుమత్యా యథాజస్య దమయంత్యా నలస్య చ."

నీలీరాగము, కుసుంభరాగము, మాంజిష్ఠారాగము, అని పూర్వరాగము త్రివిధము. నీలీరాగమనఁ బైకి మిక్కిలిగాఁ గానరాక యెన్నిటికినిఁ దొలఁగక మనోగతమైయుండు ప్రేమ. సీతారాముల రాగము నీలీరాగము. కుసుంభరాగమనఁ బైకిఁ గనఁబడును. కాని కాలాంతరమునఁ దొలఁగిపోవును. దేవహూతికర్దముల రాగము కుసుంభరాగము. మంజిష్ఠారాగమనఁ బైకధికముగాఁ గానవచ్చును. ఎన్నటికినిఁ దొలఁగదు. ఇందుమత్యజులయు, నలదమయంతులయు రాగము మంజిష్ఠారాగము.

## ౨. ఈర్ష్యా విప్రలంభము

కం. ...మాన మీర్ష్య...

ఈర్ష్య యన 'మానము' అని యర్థము. ఈ లక్షణము సరిగాలేదు. ఏలన, మానమును నీర్ష్యయు నొకటికావు. మానమనఁ గోపము. ఈ మానము ద్వివిధము. ప్రణయమానము, ఈర్ష్యామానము.

ఈ ప్రణయమానము నాయికానాయకు లిరువురికినిఁ గలుగవచ్చును. కారణము లేకయే ప్రేమాతిశయమునఁ గలుగు కోపము ప్రణయమానము లేక ప్రణయకోపము. " ప్రేమ్ణఃకుటిలగామిత్వాత్కోపో యః కారణంవినా " నాయకుని ప్రణయమాన మునకిది యుదాహరణము.

ఆ. వెం కన్నుదోయిమూసి కపటనిద్రనుబోవు
సొగను కాఁడ! నాకుఁజోటినిమ్ము
పులకరించెనాదు ముద్దులచే నీదు
చెక్కు; లింకనాలసింప లెమ్ము!

ఇట నాయకుఁడ ప్రణయకోపమును వహింపఁగా నాయిక యనునయించు చున్నది. నాయికా ప్రణయకోపమునకుఁ బెక్కులక్ష్యములుగలవు.

క. ఒడయని ప్రోలన్ నిలఁబడి
విడియంబందించుచుండె విరిబోఁడి యతం
డొడికముగ దానిచంటిని
దుడుకు మెయింగోట మీటఁ దొయ్యలియంతన్.

గీ. పఱచిరుసరుసలాడు చావలకుఁద్రిప్పి
నెమ్మొగముదమ్మి వైచియు బొమ్మముడిచి
మాఱుబిగియించి పొలయల్కఁ బూనియుండ
నవ్విభుండివ్విధంబున ననునయించె.

మరియు నాయకునిచే ననునయింపఁ బడకయే నాయిక ప్రసన్నురాలయిన యెడల నది విప్రలంభ భేదముగాక సంభోగశృంగారముయొక్క సంచారిభావమే యగును. ఎట్లన

గీ. నెమ్మొగముదమ్మివాంచి నానీశమాత్రఁ
దగిలి కనుచుండియును ధైర్యమెగయఁ జేసి

యుల్లమునుజించి వేసెను యువకుఁ డొకఁడు
అమ్మెగచి క్రీడి మీనయంత్రమ్ముఁబోలె.

నాయిక 'నానీడనుమాత్రము దగిలికనుచుండియును ధైర్యమెగయుఁ జేసి యుల్లమును జించివేసెను' అనిచెప్పుటచే ననునయింపఁ బడకయే ప్రసన్నురాలయి నట్లు గోచరించుచున్నది.

ఈర్ష్యా విప్రలంభోదాహరణము

మ. వదనాగ్రంబున వాణియున్నది; మఱుఁ వక్షమ్వనీ; దిందిరా
మదిరాక్షీమణి యున్నదక్షుల; మఱుఁ మన్నించి వీక్షింపనీ
దదియుంగాక నృసింహ! నీవిపుల బాహాశ్లేష మే నొందనో
ర్వదు భూదేవి బహుప్రియావర! నినుం బ్రార్థింప సిం కేటికిఁ? ౧౩౯

ఇందు వాణీ, లక్ష్మి, సరస్వతులు తమప్రియుఁడగు నరసభూపాలునియొక్క పరకాంతలతోడి సంగమమును సహింపకున్నారు. ఈవాణ్యాదులు సాహచర్యమును రోసి యొకనాయిక నరసభూపాలునిపై నీర్ష్య వహించియున్నది.

ఇటనాయిక యన్యకాంతాసక్తుఁడగు ప్రియునిపై నీర్ష్య వహించినది. పతి యన్యకాంతాసక్తుఁడై యుంటను జూచినను, విన్నను, అనుమానించినను, స్త్రీల కీర్ష్యా మానముగలుగును. తమప్రియునితోడి సౌఖ్యమును దానొక్కతెయే యనుభవింపవలెను. కానిమరొకతె కావగింజంతేని నిచ్చుటకుఁ త్తముకాంత లంగీకరింపరు. వీనిలోమూఁడవదగు ననుమానముమూఁడు విధములు. ఉత్స్వప్నాయితము (సురత శ్రమవలనఁ గలిగినగాఢనిద్ర) భోగాంకము (సంభోగ చిహ్నము) గోత్రస్ఖలనము (ప్రియురాలి నామోచ్చారణము.) వీనివలన భర్తయొక్క పరకాంతాసంగమములు స్త్రీ యనుమానించును.

నాయిక ప్రత్యక్షముగాఁ దన ప్రియుఁడు పరకాంతాసక్తుఁడై యుంటను జూచుట కుదాహరణము.

ఆ.వె. నిజముఖానిలమున నెయ్యుఁ దూఁదుచునుండఁ
బొలఁతి కనులఁబడిన పూరజంబు
నచటఁగాంచు యువతి యక్షియుగ్మమునందుఁ
గోపరజము నిండెఁ గొలఁదిమీఱి.

నాయిక తన ప్రియుఁడు పరనాయికకంటిలో నూఁదుచుంటను బ్రత్యక్షముగాఁ జూచినది. కాన దానికనులఁ గోపరజము నిండెను. ఈర్ష్యామానముగలిగెను.

నాయిక ప్రియుని పరకాంతాసక్తిని విన్నందుల కుదాహరణ మిది.

గీ. తన్ను వంచించి చని వేఱుతన్విఁ గూడి
కేళికాకుంజమందు నుయ్యాలలూఁగెఁ
దనప్రియుండంచుఁ జెలిచెప్ప విని వెలంది
యాత్మ రుసరుసలాడు; నాస్యము ముడుచు.

సంభోగ చిహ్నములఁజూచి నాయిక నాయకునిఁ బరకాంతాప్రణయము ననుమానించినందుల కుదాహరణ మిది.

గీ. ఉత్తరీయంబుఁ గప్పి గోరొత్తుదాఁచి
మోవి పల్లొత్తుదాఁతువు మూసికేల
కాని యన్యాంగనాసంగ కథలఁజాటు
కమ్మవాసన లెట్లింకఁ గమ్మఁగలవు?

ఇట నఖక్షత దంతక్షతములవలనను, గమ్మవాసనలవలనను నాయకుని పరకాంతా సంభోగమును నాయిక యనుమానించినది.

ఉత్స్వప్నాయిత గోత్రస్ఖలనముల కుదాహరణము లూహ్యములు. ఈ మానము నందలి భేదములు ద్వితీయాశ్వాసములోని "కం. ధీర యధీరయధీరా। ధీరయు" అను పద్యమున వ్రాయఁబడెను. (చూ. పుట ౭౧)

సామ, దాన, భేదముల, చేతను, నమస్కార, ఉపేక్షా, రసాంతరములచేతను నీర్ష్యామానము గల నాయికను నాయకుఁడు ప్రసన్నురాలినిఁ జేసికొనవలెను. సామ మనఁగాఁ బ్రియవచనము; బుజ్జగింపు. దానమన వస్త్రభూషణాదులిచ్చుట. భేదమన నాయిక చెలికత్తెలను దానినుండి విడఁదీసి తనపక్షమునకుఁ దెచ్చుట. నమస్కార మనఁ బ్రియురాలి పాదములపైఁబడుట. ఉపేక్షయన సామాదులన్నియును బ్రియురాలియెడ ఫలింపనిచో నేమియుఁజేయక యూరక వెడలిపోవుట. రసాంతరమన హాస్యముచేఁగాని భయానకాది రసములచేఁగాని దానినిఁ బ్రసన్నురాలిని జేసి కొనుట. దండమునుమాత్ర మెన్నుడును బ్రయోగింపరాదు. నాయకుఁడు తానెన్ని ప్రియురాలి చరణప్రహారములందిన్నను దానిమీఁదమాత్ర మట్టివి ప్రయోగింపరాదు.

## 3. విరహ విప్రలంభము

కం... విరహమహాఁ। గలిసి యెడఁబాయ హృదయోత్కలిక,

నాయికానాయకులు సంభోగసుఖమును బొందినపిమ్మట నేకారణముననేనిఁ దటస్థించిన యెడఁబాటు విరహము.

ఉ. నెచ్చెలులీనృసింహ ధరణీవరుఁ డెచ్చెదమంచుఁబోయిరా;
రిచ్చట నీవునుంగరుణయించుక లేకలరంపు గుంపులం
గ్రుచ్చెదవేల? మత్ప్రియునిఁ గూర్పుము మన్మథ! నీకుఁదద్విభుం
డెచ్చటకై యొసంగెద మదీయకటాక్షములన్ జయాస్త్రముల్.

ఒకతూరి నరసభూపాలునితో సంభోగసుఖమునుబొంది కాలాంతరమున నెడబాటు వహించుచున్న యొకనాయికయొక్క వచనమిది.

## ౪. ప్రవాస విప్రలంభము

కం... ప్రవాసము విదేశగతి యెట్లన్నన్

నాయికానాయకులేదేనిఁ గార్య విశేషముచేఁగానీ శాపముచేఁగానీ సంభ్రమమువలనఁ గానీ భిన్నదేశములనుంటఁ దటస్థించినచో నాయవస్థా విశేషము ప్రవాసవిప్రలంభము. ప్రవాసమనఁ గొన్నియామడల దూరముగల దేశ మని భ్రమింపరాదు. స్వేచ్ఛగాఁ గలిసికొనుట కవకాశములేని ప్రతిబంధక భూయిష్ఠమగు దేశమని యర్థము. కావుననే సాహిత్యదర్పణకారుఁడు విరహవిప్రలంభమును బ్రత్యేకముగాఁ జేర్కొనక ప్రవాసవిప్రలంభముననే చేర్చివేసెను.

చ. చిరయశ! యోబభూవర! నృసింహ! భవద్రిపుకాంత కాననాం
తరమునకేగి యందు నిజనాథునిఁగానక మన్మథార్తయై
వరుని సరోజపత్త్రమున వ్రాయునెడంగరముల్ సెమర్పఁగా
నరయనిజాంగకంబె పగయయ్యెనటంచుఁ దలంచు దైవముల్.

ఓ నరసభూపాలా! నీశత్రుకాంత యడవికిఁబోయి తనభర్తనటఁగానక మదనార్తయై సరోజపత్త్రమునఁ దన ప్రియుని వ్రాయుచుండఁగాఁ జేయి చెమ్మగిల్లి యావ్రాఁతకనబడకపోఁగాఁ దనహస్తమే తనకు శత్రువయ్యెనని దైవమునుదలంచెను.

ఇందునాయికానాయకులకు భిన్నదేశస్థితి తటస్థించినది. కావున బ్రవాస విప్రలంభము.

ప్రతాపరుద్రీయకారుఁడుగూడ అభిలాష, ఈర్ష్యా, విరహ, ప్రవాసభేదములచే విప్రలంభమును నాలుగుభేదములుగాఁ జెప్పెను. సాహిత్యదర్పణకారుఁడు పూర్వరాగ (అభిలాష) విప్రలంభము, మాన(ప్రణయ, ఈర్ష్యా) విప్రలంభము, ప్రవాసవిప్రలంభము, కరుణవిప్రలంభము, అనుభేదములను దెలిపెను. ఇతఁడు విరహ విప్రలంభమును బ్రవాసవిప్రలంభములోనే చేర్చివేసెను. సాహిత్యదర్ప

ణానుసారముగా మానవిప్రలంభముయొక్క భేదద్వయమును జూపితిమి. కరుణవిప్రలంభమును బిమ్మట నుదాహరింతుము.

ఈ ప్రవాస విప్రలంభము భావి విప్రలంభము, భవద్విప్రలంభము, భూత విప్రలంభము, అని ముత్త్రివిధములు. కార్యము బుద్ధిపూర్వకము. అనఁగా జ్ఞానపూర్వకము. కాఁబట్టి కార్యమునుబట్టి యీ మూఁడుభేదములు వచ్చినవి.

### భావి విప్రలంభము (భవిష్యద్విప్రలంభము)

మ. చనుదుగా సుందరి! పాంథుఁడా! చనుము! నీ స్వాంతంబునకా శోకముం
గనగాఁబోకుము! శోకమెందులకికిఁకం గన్నీరురాత్రేల? వే
చనవైతంచునె; తొందరేల ననుఁబుచ్చక నీకు? నీతోడఁబో
వనె వాంఛించుచు నిట్లు వేగపడు నా ప్రాణంబు లత్యంతముకా.

విప్రలంభము ముందు తటస్థించుచున్నదని యిప్పుడే నాయిక దుఃఖించుచున్నది.

### భవద్విప్రలంభము (వర్తమాన విప్రలంభము.)

"ప్రస్థానం వలయైః కృతం" దీనియర్థము ద్వితీయాశ్వాసమునఁ బ్రవత్స్యత్పతికయను శీర్షికక్రింద వ్రాయఁబడినది. (చూ. పుట ౧౮౪)

### భూత విప్రలంభము

చ. స్తిమితతనొందెఁ జింతలకుఁ జిత్తము; చెక్కిలికేల వ్రాలె; నా
స్యముకళదప్పె నాపసమృగాంకునిరీతినిఁ; బుండువాఱె శ్వా
సములకు మోవి; చల్లఁబడఁజాలదు తాపము శీతలోపచా
రములఁ; కెవండు దీని దశఁబ్రార్థిత దుర్లభుఁడై సహించునో?

మఱొక పద్యమునఁగూడఁ జూపుదుము.

గీ. సఖుఁడ! పరదేశమునకు నీ చన్న మొదలు
దివసములు లెక్కవెట్టుచు దినదినంబు
గీయు నున్నంపుగీఁతల గేహభిత్తి
తెలుపచెక్కిలి వడువునఁ దెల్లఁబాఱె.

ఈ మూఁడు లక్ష్యములును గార్యమువలనఁ గలిగిన ప్రవాస విప్రలంభమున కుదాహరణములు.

శాపమువలనఁ గలిగిన ప్రవాస విప్రలంభమునకు మేఘదూతమునందలి

కం. కూరిమి సహచరుఁడెడగా
వారటపడు చక్రవాకి యట్లుగాంచినటుల్

దీరెడలియుండు తల్పని

నా రెండవప్రాణమని మనమున నెఱుఁగుమీ!

అనునది యుదాహరణమగును.

ఇఁక సంభ్రమమువలనఁ గలిగిన ప్రవాస విప్రలంభము ముద్విధములు. సంభ్రమమన నలజడి. ఇది యుత్పాతమువలనఁ గలుగును. ఈ యుత్పాతము దివ్య, నాభస (ఆకాశభవము) మానుషభేదములచేఁ ద్రివిధము.

దివ్య సంభ్రమమువలనఁ గలిగిన ప్రవాస విప్రలంభమున కుదాహరణము విక్రమోర్వశీయ నాటకమునందలి యూర్వశీ పురూరవుల విప్రలంభము. అందుఁ బురూరవుఁ డూర్వశితో విహరించుచు నొక విద్యాధరకన్యను జూచెను. దానిచే నూర్వశికిఁ గోపముగలిగి తొంటి శాపవశమున వివేకముఁ గోల్పోయి యొకవనమునఁ బ్రవేశించెను. అట లతగా మాఱిపోయెను. అప్పుడు పురూరవుఁడు ప్రలపించెను. ఇది దివ్యమనఁగా దైవికమగు సంభ్రమమువలనఁ గలిగిన ప్రవాస విప్రలంభము.

నాభస సంభ్రమకృతమగు ప్రవాస విప్రలంభమున కుదాహరణము:—

ఆ. వె. దొలనుండివచ్చు తరుణుఁ గందోయిలోఁ

దనివిఁదీఱ బాల త్రావుచుచట

బెడిదమైన పెద్దపిడుగుచప్పుడు విని

మెఱుఁగుదీఁగ మించి పఱుగువాఱె.

మానుష సంభ్రమకృత ప్రవాస విప్రలంభమున కుదాహరణము.

కం. తడసి చనుదెంచు నన్నుం

బడంతి క్రేగంటఁబొడిచి పాదానతు నన్

గడుఁబ్రీతిలేపి యొవతో

వడి నటకరుదెంచ లేడివలె నెటో పఱచెన్.

ఈ ప్రవాస విప్రలంభమున నాయికకు గాత్రమాలిన్య, వస్త్రమాలిన్యములు, ఏకవేణీధారణము, నిశ్శ్వాస, ఉచ్ఛ్వాస, రుదిత, భూమిపాతాదులును గలుగును. ఈ ప్రవాస విప్రలంభమున నీ క్రింది మన్మథావస్థలు గలుగును.

అంగములం దసౌష్ఠవము (అంగమాలిన్యము) తాపము, పాండుత్వము (పాలిపోవుట) కృశత్వము, అరుచి, అధైర్యము, అనాలంబము (మతిమాలి యుండుట లేక శూన్యమనస్కత) తన్మయత్వము (బాహ్యాభ్యంతరములయందుఁ దన ప్రియుఁడే కానఁబడుట) ఉన్మాదము, మూర్ఛ, మృతి, యను మన్మథావస్థలు గలుగును.

## కరుణ విప్రలంభము

యూనో రేకతరస్మిన్ గతవతి లోకాంతరం పునర్లభ్యే
విమనాయతే యదైక స్తదా రసః కరుణవిప్రలంభాఖ్యః.

నాయికా నాయకులలో నొకరు లోకాంతరమును బొందియుఁ గాలాంతరమున నా శరీరముతోడనే మరల బ్రదికిరేని నా యవస్థ కరుణ విప్రలంభము. కాదంబరిలోని మహాశ్వేతా పుండరీకుల వృత్తాంత ముదాహరణము. అందుఁ బుండరీకుఁడు విరహోద్రేకముచే మరణించును. కాలాంతరమున నా శరీరముతోడనే బ్రదికి వచ్చి మహాశ్వేతతో సుఖించును. ఆ యవస్థ కరుణ విప్రలంభము.

తిరిగి జీవింపకపోయినను శరీరాంతరముతో వచ్చినను గరుణరసమే. పుండరీక మహాశ్వేతా వృత్తాంతమందుఁ గూడ నాకాశవాణి దుఃఖించుచున్న మహాశ్వేతతో నీ భర్త తిరిగి జీవించునని చెప్పెను. ఆవిధముగా నాకాశవాణి చెప్పినపిమ్మటనే యామెకు మరలఁ బుండరీకునియందు సంగమప్రత్యాశచే 'రతి' యుద్భవించును. కాన నప్పుడే కరుణ విప్రలంభము. ఆకాశవాణి శ్రవణమునకు ముందు సంగమప్రత్యాశలేమిఁ గరుణరసమే యని యభియుక్తు లందురు.

ఈవిధముగా విప్రలంభము చతుర్విధమగుటచే సంభోగ శృంగారముగూడఁ జతుర్విధమని కొందఱి మతము. "న వినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే" (విప్రలంభము లేనిచో సంభోగమునకుఁ బుష్టిలేదు) అని యుంటచే నీ చతుర్విధ విప్రలంభములయు ననంతరమునఁ గలిగిన సంభోగముగూడ నాలుగువిధములు. ఎట్లనఁ బూర్వరాగానంతర సంభోగము, మానానంతర సంభోగము, ప్రవాసానంతర సంభోగము, కరుణ విప్రలంభానంతర సంభోగము.

వెనుక మానవిప్రలంభము ప్రణయ, ఈర్ష్యాభేదములచే ద్వివిధమని చెప్పితిమి. మానానంతర సంభోగమన మానము శాంతించిన పిమ్మట నగు సంభోగము. కొన్ని యెడల మానము శాంతింపకున్నను సంభోగము గలుగుచున్నది.

గీ. మరుని తూపులపిండు దగ్గఱకుఁ దార్ప
వదలకయు మానదీక్షను మదనకేళిఁ
దేలుచుండిరి దంపతుల్; త్రెస్సిపోక
ప్రిదులకయు మానపుంగ్రంధి పొదలునట్లె.

ఇట మానగ్రంథి యెప్పటివలెనే బిగువుగానే యున్నది. సంభోగము జరిగినది. ఇది యొక విచిత్రము. ఇట్టి వసంతభేదములు గలవు.

ఉత్తరరామచరిత్రలోఁ గరుణరసమా? కరుణ విప్రలంభమా? అను నొకచర్చ గలదు. భవభూతి "ఏకో రసః కరుణ ఏవ" అని చెప్పుటచేఁ గరుణమే కవి కభిప్రేతమగు రసమని కొందఱు. ఉత్తరరామచరిత్ర వ్యాఖ్యాత యగు వీరరాఘవ పండితుఁడుగూడ నీ యభిప్రాయమునే తెలిపెను. ఉత్తరరామచరిత్రలోఁ దుదిని నాయికా నాయకులగు సీతారాములు రామాయణమునందువలెఁ గాక కలియుదురు. శ్రీరాముఁడు వాల్మీక్యాదుల యుపదేశానుసారముగా సీతను స్వీకరించును. కావున సీతారాములకుఁ గాలాంతరమునఁ బునస్సంగమము కలుగుటచే శృంగారభేదమగు కరుణ విప్రలంభమే యని మఱికొందఱందురు. మరియు నాటకమున శృంగార వీరములే ప్రధానములుగా నుండవలెనను నాలంకారికుల ప్రమాణమునుబట్టి కరుణరసమునకు నాటకమునఁ బ్రాధాన్యము లేనేలేదు. కావున నిట శృంగారభేదమగు కరుణ విప్రలంభమే యనియును వారు నొడువుదురు. శ్రీనివాస వ్యాఖ్యలో "బీభత్స భయానకయోః ప్రతినాయకాశ్రితత్వేన వర్ణనీయత్వాత్ హాస్య రౌద్ర కరుణాద్భుతానాం మహాప్రబంధ రసత్వే చమత్కారాభావాత్" (బీభత్స భయానకములు ప్రతినాయకాశ్రితములుగా వర్ణింపవలసియుంటచేతను, హాస్య, రౌద్ర, కరుణ, అద్భుతములు మహాప్రబంధ రసములుగాఁ జమత్కారముఁ గలిగింపవు కావునను శృంగార వీరములే ప్రబంధ రసములుగా నిబంధింపవలయును) అనియుఁ గలదు. కావున శ్రీనివాసవ్యాఖ్య కరుణవిప్రలంభమునే సమర్థించుచున్నది. ఈవిధముగా నాలంకారికులెల్లరును గరుణ విప్రలంభమనియే సిద్ధాంతీకరించిరి. కాని రామునికి సీతావిషయక ప్రత్యాశ లేకపోవుటచే రతి పుట్టదు. పునస్సంగమము గలిగినంతమాత్రమున శృంగరభేదమని నొడువరాదు. సాపేక్షభావము(ప్రత్యాశ)న్నచో శృంగార భేదమగు కరుణ విప్రలంభమును, నిరపేక్షభావమున్నచోఁ గరుణమనియు సిద్ధాంతము. సీతారాములు దాము పరస్పరమును దిరిగి కలియుదుమని యనుకొనలేదు. కాన నిరపేక్షభావముతోనే యుండిరి. ఆ నిరపేక్షభావమును బురస్కరించుకొని ప్రవృత్తమైన శోకస్థాయికమగు కరుణము పరిపూర్ణతను బొందినది. తుదికిఁ దలవని తలంపుగా సీతారాములు గలిసిరి. అంతమాత్రమున నంతకుమున్ను పరిపూర్ణ స్థితినిఁ బొందిన కరుణము రతిస్థాయిక శృంగారభేదమగు కరుణవిప్రలంభ మెట్లగును ? కాన శృంగారభేదమగు కరుణ విప్రలంభము గాదనియుఁ గరుణమే యనియును మహావిద్వాంసులు వచింతురు. సాహిత్యదర్పణవ్యాఖ్యయగు రుచిరలో నిట్లు గలదు. "ఇదమవధేయం । ఏక ఏవేత్యభిధానముత్కర్షాధానాయ । శృంగారో వీర ఏవేతి పునః హాస్య బీభత్స భయానక రౌద్రమాత్ర వ్యవచ్ఛేదాయ । తేన ప్రబోధ

చంద్రోదయే శాంతస్య ఉత్తరచరితే కరుణస్య చ ప్రాధాన్యం సంగచ్ఛతే" (ఈవిష యము దెలియవలెను. ఒక్కటే యని చెప్పుట యుత్కర్షముకొఱకే. శృంగారమే కానీ వీరమే కానీ యని చెప్పుట హాస్య, బీభత్స, భయానక, రౌద్రములనుమాత్రమే వ్యవచ్ఛేదించుటకు. కావున దీనిచేఁ బ్రబోధచంద్రోదయమున శాంతమును, ఉత్తర చరితమునఁ గరుణమును బ్రాధాన్యము వహించుట పొసగును.) ఇట్లే దుర్గాప్రసాద పండితుఁడును "శృంగారో వీర ఏ వేతి కథనం సముచిత రససూచకం । తేన ఉత్తర రామచరితే కరుణస్య ప్రబోధచంద్రోదయే శాంతస్య చ అంగిత్వ మవ్యాహతం" (శృంగారముగానీ వీరముగానీ యని నొడువుట సముచిత రససూచకము. కాన నుత్తరరామచరిత్రమునఁ గరుణమును, ప్రబోధచంద్రోదయమున శాంతమును, అంగి రసములనుటలో విప్రతిపత్తిలేదు) అని కరుణరసమునే స్వీకరించెను. మరియు

రామాయణము నాశ్రయించి యుత్తరరామచరిత్రము వ్రాయఁబడుటవలన రామాయణము నందలి కరుణరసమే యుత్తరరామచరిత్రమున నుండవలెను. ఏలనఁ గవి రసాననుకూలఘట్టములను రసానుకూలముగా మార్చుకొనవలెను. కాని రసమునే మార్చుకొనరాదు. ధ్వన్యాలోకమున

"సంతి సిద్ధరసప్రఖ్యాయే చ రామాయణాదయః।
కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛారస విరోధినీ"

(ప్రసిద్ధరస ప్రఖ్యాతములగు రామాయణాదులు గలవు. వానిలో రసవిరోధి యగు స్వేచ్ఛను జూపరాదు) అని కలదు. కాన రామాయణరసమే యుత్తరరామ చరిత్రమునను నుండవలెను.

దీనినిఁబట్టి కరుణవిప్రలంభమనునది లేనేలేదనియుఁ గేవల కరుణమో కేవల విప్రలంభమో యుండును. కాని కరుణవిప్రలంభమనునదియే యుండదని సిద్ధాంతము. లోచనమునఁగల *'కరుణ విప్రలంభాది' పదము నొక్కటిగా గ్రహించి పండితు లీ పొరపాటుపడిరి. అట కరుణ, విప్రలంభాది, అని పదవిభాగమును జేసికొన వలెను. ధ్వన్యాలోకమున శృంగారభేదములలోఁ గరుణవిప్రలంభమును జెప్పనే లేదు. సాహిత్యదర్పణకారుఁడే దీనిని లేవఁదీసెను.

---

*లోచనమునఁ దాపసవత్సరాజ మను నాటకమున రసవిచారణము చేయు ఘట్టమున "కరుణ విప్రలంభాది భూమికాం గృహ్ణాక" అని యున్నది. ఆ నాట కమున యౌగంధరాయణుఁడు వత్సరాజునకుఁ జక్రవర్తిత్వము నాకాంక్షించి వాసవదత్తతో నాలోచించియే యామెనుదాఁచి యగ్నిదగ్ధయైనదని వత్సరాజునకు నమ్మకమును బుట్టించి పద్మావతిని బెండ్లిచేయించెను. అట వత్సరాజునకు వాసవ

## రసాభాసము

సాహిత్యదర్పణమున నీ లక్షణము గలదు. "అనౌచిత్య ప్రవృత్తత్వే త్వాభాసో రసభావయోః (రసభావము లనౌచిత్యమునఁ బ్రవర్తిల్లినచోఁ గ్రమముగా రసాభాసము, భావాభాసము, అగును.) అనౌచిత్యమన లోకమర్యాదాతిక్రమణము. అనఁగా లోకమర్యాద నతిక్రమించి ప్రవర్తిల్లిన నాయికానాయకాదుల రసము.

రసగంగాధరమున "అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వం" (అనుచితమైన విభావమాలంబనగాఁ గలిగియుంట రసాభాసము) అనిలక్షణము చేయఁబడినది. మరియుదీనినిఁ బరిష్కరించి "ఏ విభావమున ననుచితరత్యాదులు గలుగునో యది రసాభాస"మని సిద్ధాంతీకరించెను. ఇటఁగేవలము శృంగారరసాభాసమే యుదాహరింపఁబడును. ఆయా రసములక్రింద నాయారసాభాసములుగూడ చూపఁబడును.

క. పలువురకొక భామినిపైఁ
దలఁపును, నొక వారసతికిఁ దగ బలువురిపై
వలపును, మృగవిహగాదుల
కెలవు రసాభాసమయ్యె క్షితినెట్లన్నన్. ౧౪.౨

తా. పెక్కుమంది పురుషులకొక యువతిపైఁ బ్రేమయుంటయు, నొకవారాంగనకుఁ బలువురిమీఁదఁ బ్రేమయుండుటయును, మృగవిహగాదుల ప్రేమయును రసాభాసమగును.

ఈలక్షణమసమగ్రము 'పలువురకొక భామినిపై దలఁపును' అనుమాటదోషజుష్టమునుగా నున్నది. కావునఁ బ్రతాపరుద్రీయ లక్షణమును మరొకప్రాచీన లక్షణమును జూపింతును. దాన నీలక్షణమునందలి దోషములు దెలియఁగలవు.

---

దత్త మరణించినదనియే నమ్మకముంటచే నాతనికిఁ బ్రత్యాశలేదు. ఆమెకు వత్సరాజు పొత్తు మరలఁ దనకు లభించుననియే నమ్మకముంటచేఁ బ్రత్యాశ గలదు. కావున నాయకునియందుఁ గరుణమును, నాయికయందు విప్రలంభమును గలవు. అటఁ గరుణమునకు విప్రలంభ మంగమైనది. ఉత్తరరామచరిత్రమున నిరువురికిని సంగమ ప్రత్యాశ లేకుంటచేఁ గరుణమే కాని యట విప్రలంభమునకుఁ దావేలేదు. తాపస వత్సరాజమునఁగూడఁ గరుణమే. దానికి విప్రలంభ మంగము. ఉత్తరరామచరిత్రలోఁ గేవల కరుణమే.

ఏకత్రైవానురాగశ్చేత్తిర్యజ్మ్లేచ్ఛగతోఽపివా
యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాసస్త్రిధామతః.

నాయికానాయకులలో నొక్కరికిమాత్రమే యనురాగమున్నను, పశు, పక్షి, మ్లేచ్ఛ గతమై (అనురాగము) యున్నను, బహునాయకానురాగమున్నను దానిని రసాభాస మందురు. ఇట్లిది ముత్త్రివిధములు.

మనుచరిత్రలో వరూధినీ ప్రవరులలో వరూథినికి మాత్రమే యనురాగ మున్నది. కానవాశృంగారము రసాభాసము. పశు, పక్షి, మ్లేచ్ఛాదుల శృంగారము రసాభాస మననేల? అదిరసమే యనఁగూడదా? అటనను రాగముభయనిష్ఠమే. కదా! ఇచ్చటననౌచిత్య మేమిగలదు? అని ప్రశ్న వచ్చుచున్నది. విద్యావివేకములు తుల్యానురాగమును గల నాయికా నాయకులందెట్లు శృంగారము రాణించునో యుక్తాయుక్త వివేకములేని పశుపక్షులు, అనాగరకులగు మ్లేచ్ఛులు మొదలగువారి శృంగారము రాణింపదు. శృంగారము త్రివ ప్రకృతిప్రాయమనియు, ధర్మానుబద్ధమైన చో లోకాభ్యుదయ హేతువగుననియుఁ దెలిపితిమి. అట్టి శృంగార ముపదేశకముగా నుండఁగలదు. తిర్యగాదులందంతగా నుచితముగా నుండదు. అయినను దిర్యగాదుల శృంగారమనుచితము గాదు గాన నుపాదేయమేయగునని యాలంకారికులు కావ్యమున గొంత స్థానమునిచ్చిరి. స్త్రీ కొకరిమీఁదఁ బ్రేమయుంటయుచితము. అట్లుగాక పెక్కండ్రపై ననురాగముంట రసాభాసమేయగును. సాహిత్య దర్పణలక్షణమును గనుఁడు.

"ఉపనాయక సంస్థాయాం మునిగురుపత్నీగతాయాంచ
బహునాయక విషయాయాం రతౌతథానుభయనిష్ఠాయాం"
ప్రతినాయక నిష్ఠాయాం తద్వదధమపాత్ర తిర్యగాదిగతా
శృంగారేఽనౌచిత్యం..."

తా. ఉపపతివిషయకమగు రతియు, ముని, గురుపత్నీగతమగు రతియు, బహు నాయక విషయకమగు రతియు, ననుభయనిష్ఠమగు రతియుఁ, బ్రతినాయకనిష్ఠమగు రతియు, నధమపాత్రగత రతియుఁ, బశుపక్ష్యాది రతియు ననుచితము. కాన శృంగార రసాభాసము.

ప్రతాపరుద్రీయ లక్షణమున నుపపతివిషయక రతియు, ప్రతినాయక రతియు గ్రహింపఁబడలేదు. కాన నీ లక్షణమే సమగ్రమైనది.

## ఉపనాయకరతి

మ. పనిమీఁదంజనె నామగండు; సవతాల్ ప్రాంతానికేఁగా రాదు; బై
ట ననుఁగా ముట్టుతయంచు వీడి గురులింటందూఱి; రాభానిసల్

నను సేవింపక కూర్చుండిరి యలంతేల? రేయి; శయ్యాసహా
యిని నన్నాగమలాలనీయ! యిటరావే కావ లక్ష్మీపతీ!

(ఆగమలాలనీయ = రాకచే లాలింపఁదగినవాఁడా!) ఇట నాయిక లక్ష్మీపతి యను నుపనాయకునియం దనురక్తయై యున్నది. ఇది రసాభాసము.

ముని గురుపత్నీగత రతి:— ఉపలక్షణచే నగమ్యలగు నెల్లకాంతల రతియు గ్రహింపవలెను. తారాశశాంకమునందుఁ జంద్రునికి గురుపత్నియైన తారయందుఁ గలిగిన యనురాగము రసాభాసము.

## బహునాయక రతి

కులకాంతకుఁ బెక్కండ్రు నాయకులమీఁదఁ బ్రీతి యుండదు. అట్టి నాయిక కులట లేక వేశ్య. వేశ్యగూడ నొక్కచో ననురక్తగా నుండును. ఎట్లన, వసంతసేన. కాన ననురక్తురాలగు వేశ్యయుఁ గులటయు బహునాయకులందు రక్తిఁ గనఁబఱతురు.

ఉ. ఒక్కని చెట్టవట్టి, మఱియొక్కనికిన్ విడెమిచ్చి ముద్దు వే
ఱొక్కనికిచ్చి చల్లనిమృదూక్తుల వేఱొకనిన్ నగించి యిం
కొక్కని చెక్కుగొట్టి పొలంపొందఁ నొకచ్చరలేమ; యొక్కనిం
జిక్కట నున్నగాఁద నెలచేడెలు స్వర్గముపొంత పోయినన్.

ఇట నొకయువతికిఁ బెక్కండ్రమీఁద ననురాగము చూపఁబడినది.

వ్యాసక్రా శ్చలితాశ్చైవ స్ఫారితాః పరమాకులాః
పాండుపుత్త్రేషు పాంచాల్యాః పతంతి ప్రథమాదృశః.

తా. విశేషించి నమ్రములును, జలించుచున్నవియు, విచ్చుకొన్నవియు, వ్యాకులములయినవియు నగు ద్రౌపదియొక్క తొలిచూపులు క్రమముగా ధర్మజ, భీమ, అర్జున, నకుల, సహదేవులందుఁ బడుచున్నవి.

యుధిష్ఠిరుఁడు ధర్మపరుఁడుగాన వానియందు నమ్రమలై పడుచున్నవి. ఈ నమ్రతచే భక్తి వ్యంగ్యమగుచున్నది. భీముని స్థూలాకారమునుగాంచి వానియందుఁ జలించుచున్నవి. చలనముచేఁ ద్రాసము వ్యంగ్యము. అర్జునుని లోకోత్తర వీరత్వమును వినియుంటచే వానియందు విచ్చుకొనిపడుచున్నవి. విచ్చుకొనుటచే హర్షము వ్యంగ్యము. నకులసహదేవుల సౌందర్యమునుగాంచి వారియందు వ్యాకులములై పడుచున్నవి. వ్యాకులత్వ మౌత్సుక్యమును వ్యంగ్యమొనర్చుచున్నది. కానఁ బాంచాలికి యైదుగురియందును ననురాగము గలిగినది. ఇటఁగూడ నొకతెకుఁ బెక్కురునాయ

షులపై రతిగలిగినది. కాన రసాభాసమేయని నవ్యులు చెప్పుదురు. ప్రాచీనులు వివాహమాడని బహునాయకులందలి రతియే రసాభాసము. ఇది వివాహిత బహునాయకవిషయకరతిగాన రసమేయని వచింతురు. ఈశ్లోకమువంటిదే శ్లోకమును రుచిరవ్యాఖ్యాత యుదాహరించెను.

"యుధిష్ఠిరం మోదయతిస్మ సుస్మితైః । కలేనభీమం, పరిరంభతేఽర్జునం
భ్రువా ప్రణీతైర్నకులంచ సాంత్వనైః । పదోక్ష్చతైస్సాసహదేవమంచితైః
ఇత్యత్ర ద్రౌపద్యా అనురాగః పతివిషయకోఽపి న శృంగారవ్యపదేశార్హః"

పతివిషయక మయినను నేకకాలమున నిందఱియందుఁ బ్రేమను జూపుట రసాభాసమే. ఇట్లేకకాలమునఁగాక ద్రౌపది యొక్కొక్కరితో నొక్కొక్కయేడు కాపురము సేసెనుగదా! అప్పుడితరభర్తలతో నామె సంభోగమును బొందలేదు. అట్టిచో నొక్కరితోడనే యామె పొందిన సంభోగము రసాభాసముగాక రసమే యగును.

ఇటనొకశంక పొడముచున్నది. బహునాయక విషయకరతి రసాభాసమైనట్లే బహునాయికారతియు రసాభాసమేలకాదు? ఈవిషయమును బ్రతాపరుద్రీయ వ్యాఖ్యాత యీవిధముగాఁ దెలిపెను.

"పుంసోఽప్యనేకనాయికానురాగే రసాభాసత్వ మితికేచిత్" తన్నతన్మతే దక్షిణనాయకానురాగస్య సర్వసంప్రతిపన్న రసభావస్య ఆభాసత్వప్రసంగ ఇతిచేన్నైవం । తస్యాప్యేకస్యామేవ గాఢానురాగత్వాత్ । అన్యత్రతుక్వచిన్మధ్యత్వం క్వచిన్మందత్వమితి నిశ్చితం । "తుల్యోఽనేకత్రదక్షిణః" ఇతిలక్షణం పునరనేకాను అనువృత్తి మాత్రపరత్వేన తుల్యత్వపరమితిద్రష్టవ్యం" (కొందఱు పురుషుని యొక్కయు బహునాయికా విషయకరతిని రసాభాసమని చెప్పుదురు. అట్లేని నెల్ల యాలంకారికులును రసమని సమ్మతించిన దక్షిణనాయకానురాగము రసాభాసమగుచున్నది. లోకపూజ్యుఁడగు శ్రీకృష్ణుఁడు దక్షిణ నాయకుఁడుగదా! అన్నచో దక్షిణనాయకానురాగము రసాభాసముగాదు. ఏలన దక్షిణనాయకునికిఁ గూడ నొకతెయందే గాఢానురాగమును, ఒకతెపై మధ్యమానురాగమును, మఱొకతెపై మందానురాగమును నుండును. అట్లయినచో "అనేక నాయికలందుఁ దుల్యుఁడు దక్షిణుఁడు" అను లక్షణ మసంగతముగాదా? అన్నచో ననేకనాయికల యందనువృత్తితుల్యత్వమే కాని యనురాగతుల్యత్వము గాదు") సారాంశమేమనఁగా స్త్రీయొక్క బహునాయకవిషయక రతి రసాభాసమగును; కాని పురు-

షునియొక్క బహునాయికావిషయక రతి రసాభాసము గాదనియు రసమేయనియు నాలంకారిక మతము.

అనుభయనిష్ఠ రతి కుదాహరణముగా వరూధినీ ప్రవరుల శృంగారమును దెలిపితిమి. పిమ్మట నుభయనిష్ఠమైనను మొదట నేకతరనిష్ఠముగానే రతియున్నచో నదియు రసాభాసమనియే సిద్ధాంతము. ఎట్లన, వివాహమునకు ముందు పరస్పర సందర్శనాదులకు ముందు నాయికానాయకులలో నేయొక్కరేని దద్గుణ శ్రవణ మాత్రమున మోహించియున్నచో నా శృంగార మేకతరనిష్ఠమేకదా! పరస్పర సందర్శనానంతర ముభయులకును మోహము గలుగును. కాన నది రసమగును. పరస్పర సందర్శనమునకుఁ, బరస్పర గుణశ్రవణమునకును ముందేయొకరికేని నేదో కారణమున రతి గలిగినచో నది యేకతరనిష్ఠమగుటచేఁ బిమ్మట నుభయనిష్ఠమైనను నంతవఱకు రసాభాసమే. ఎట్లన, రత్నావళిలో సాగరికా వత్సరాజులకుఁ బరస్పర సందర్శనము గలుగకమున్నే సాగరికకు వత్సరాజుపైఁ బ్రేమ గలిగినది. ఇట సాగరిక మాత్రమే వత్సరాజును జూచినది. కాని వత్సరాజు సాగరికను జూడలేదు. పిమ్మట వేరొక ప్రకరణమున వత్సరాజు సాగరికను జూచి ప్రేమించును. కావునఁ బిమ్మట నుభయనిష్ఠమయ్యును మొదట నేకతరనిష్ఠము. కాన నది రసాభాసము. "పశ్చాదుభయనిష్ఠత్వేఽపి ప్రథమమేకనిష్ఠత్వే రతేరాభాసత్వ మితిలోచనకారాః" అని సాహిత్యదర్పణము.

ప్రతినాయకనిష్ఠమగు రతి కుదాహరణము :— హయగ్రీవ వధ మనుమహాకావ్యమున నాయక ప్రతినాయకులు విష్ణు హయగ్రీవులు. అందుఁ బ్రతినాయకుఁడగు హయగ్రీవుఁడు శ్రీ మహావిష్ణువు తన్నుఁ జంపరాఁగా రౌద్రమును బ్రదర్శింపవలసిన సమయమున సుందరీబృందముతో జలక్రీడలాడుచున్నట్లు కవి వర్ణించెను. ఇచ్చటి ప్రతినాయకనిష్ఠ రతి రసాభాసము. ఇట వర్ణింపఁబడినను లలనారతి శృంగారముకాదు.

అధమపాత్రగత రతి:—

గీ. పిన్నలేఁగౌను నాఁకుఁదీవియ బిగించి
కొండమల్లియ క్రొవ్విరుల్ కోసితెచ్చి
కోయజవరాలు కూర్చుండి కొండపైనిఁ
గురులు ముడిపించుకొనెఁ దన తరుణుచేత.

ఇట కోయపడుచువారు అధమపాత్రలు.

## తిర్యగ్గతి

చ. అలఘు విశీర్ణపక్షయుగమై యమితోన్నమితోర్ధ్వకాయమై
గళరవముల్ దలిర్పఁ బ్రియకాంతకు ముద్దులువెట్టి యుబ్బునం
బలుమఱు మేడపైకెగసి పక్షముఁద్రిప్పుచుఁ గుంచితాస్యమై
పొలఁతుకఁబిల్చు విభ్రమకపోతము హుంకృతనాద మాధురిన్.

ఇటఁ గపోతదంపతుల శృంగారము వర్ణింపఁబడినది. కాన రసాభాసము. ఈ క్రింది మనుచరిత్ర పద్యమునందును గల రసాభాసమును గనుఁడు.

చ. మనుజగురాకు మేయుతతి నోరికెలంకులఁ దేఁటిపట్టినన్
వనతరుశాఖలం గువకువధ్వనిఁబాఱు పికాంగనంబికం
బనునయ మొప్ప మాన్పగతి నాత్మముఖంబు ముఖంబుఁజేర్చి చుం
బన మొనరించె సందునడిమాయలు గా! మగవారి కృత్యముల్.

ఏకావళీకారుఁడగు విద్యాధరుఁ డీ తిర్యగ్గతిని రసమనియే వచించెను. "విభావాదిసంభవోఽపి రసం ప్రతిప్రయోజకః । న విభావాది జ్ఞానం । తతశ్చ తిరశ్చామప్యేవ రసః" (తిర్యగాదులకుఁ గలాకౌశలము లేమిచే వాని శృంగారము విభావాది పరిపూర్ణముగాదు; కాన రసాభాసమని యనుట యుక్తముగాదు. విభావాదులుంటయే రసమునకుఁ బ్రయోజకము. పాత్రలకు విభావాదిజ్ఞాన మక్కఱలేదు. కలాకౌశల మక్కఱలేదు. కావునఁ తిర్యగ్గతియు రసమే.)

'తిర్యగాది రతేః' అనుచోట నున్న 'ఆది' పదముచేఁ దాపసులు మొదలయిన పూజ్యపాదులయొక్కయు రతి రసాభాసమే యగును. ఇదియే కావ్యప్రకాశములో "ఉత్తమ దేవతావిషయకత్వేన వర్ణ్యమానా రతిరనుచితా । తద్వర్ణనం హి మాతాపిత్రోః రతివర్ణనమివ అత్యంతమనుచితం" అని మమ్మటాచార్యుఁడు వచించెను.

ప్రప్రథమమున రసాభాసము రసమగునా? కాదా? అను ప్రశ్న యొకటి వచ్చుచున్నది. ఏలన, నిట రసముయొక్క యాభాసమే కాని రసముండదుకదా! రసము, రసాభాసమును నొక్కచో నుండునా? అనౌచిత్యమున్నచోఁగదా రసాభాసమగును. "అనౌచిత్యాదృతేనాన్య ద్రసభంగస్యకారణం" అనుటచే రసాభాసమన రసభంగమేకదా! రసమును, రసభంగమును నొక్కచో నుండవు. అన్నచో నట్లుగాదు! దోషయుక్తమైనంతమాత్రమునఁ గావ్యత్వమునకు భంగమురానివిధమునఁ గీటానువిద్ధత్వమున్నంతమాత్రమున రత్నత్వమునకు భంగమురానివిధమున ననౌచిత్య

మను దోషమున్నంతమాత్రమున రసము గాకపోదు. రసత్వమును, రసాభాసత్వము నుంటలో దొసఁగు లేదు. మరియు రసాభాసము వర్ణింపరాదను దోషమును గానరాదు.

ఈ శృంగారాభాసము(రసాభాసము) సంభోగాభాసము, విప్రలంభాభాసము ననిద్వివిధము.

## సంభోగాభాసము

మ. మగఁడా మోటుమనుష్యుఁ; డీవనము నిర్మానుష్య; మేబాల; నొ
టిగనుంటిఁ; బహుళాంధ కారములు నిండెఁ; నద్దెసల్ మూసికొ
న్నగరిఁ, గావున దారివీడు వెసఁ గృష్ణా! మోహనాకార! యం
చోగిఁ బల్కుఁడు వ్రజాంగనం గలియు శ్రీయుక్తుండు మిమ్మోముతఁ.

ఇటనాయిక పరకీయ; శ్రీకృష్ణుఁడుపపతి కాన సంభోగాభాసము.

ఆ.వె. తడికసందునుండి తమినిచ్చవూఁబోఁడి
యధర బింబమానునట్టి నన్ను
వేయికనులవేల్పు వేడుకపడిచూచు
నమృతరసముఁ గ్రోలుచవలఁబెట్టి.

ఇటనాయిక పరకీయ; 'నన్ను' పదముచే నుద్దిష్టుఁడుపపతి. ఇదియు సంభోగాభాసమే.

## విప్రలంభాభాసము

సీ. ఘనసార పంక మొక్కలతాంగి దెచ్చిన మట్టి వ్రేలనె చుక్కబొట్టుపెట్టి
ఇంతి యొక్కతె పూవు బెత్తులెత్తినఁ జూచివిసువుతో నొకకొన్ని విరులుందుటెమి
పడఁతి యొక్కతె రత్నపాదుకలిడ నిల్చితొడుగక వ్యాలికిఁ బో నడుగుపెట్టి
బాగాలు వెసనొక పద్మాక్షి యొసఁగిన వెగ్గలంబని కొన్ని వెడల నుమిసి

గీ. సగముగొరికిన యాకులుం, సఖులు పిలువ
సగ మొసఁగు నుత్తరముఁ; దెవ్విసగము, మఱపు
సగమునయి చింతచే సగమగుచు నరిగె
నవ్వరూధిని యంతికోద్యానమునకు.

ఇటవరూధిని ప్రవరునిపై మరులుగొనియున్నది. ఇది విప్రలంభాభాసము. ఇంతవఱకు రసాభాసము తెలుపఁబడినది. ఇఁకననౌచిత్యమునఁ బ్రవర్తిల్లిన భావము భావాభాసమని చెప్పితిమి. దాని యుదాహరణము:—

ఆ. వె. కౌఁగిలించినట్లు కొంచుచునున్నట్లు
ముద్దులాడునట్లు ముట్టునట్లు
సలుపుచున్నయట్లు చక్కిలిగింతలు
కలికికటినిఁ గలల గాంతురేల.

ఇట నాయిక పరకీయ. నాయకుఁడుపపతి. ఇట స్వప్నమనునది వ్యభిచారి భావము. కావున భావాభాసము. ఇట్లెల్ల సంచారిభావముల యొక్కయు నాభాసములను గ్రహింపవలెను.

క. భావింపభావశాంతియు
భావోదయ భావసంధి భావశబలతల్
భావంబడఁగుట పుట్టుట,
ద్వైవిధ్యము, బహుత,యనఁగఁ దగునెట్లన్నన్. ౧౪౪

తా. భావమడఁగుట, భావశాంతి; భావముపుట్టుట భావోదయము; పరస్పరోపమర్దకముగా భావద్వయముండుట భావసంధి; పెక్కుభావము లొక్కచో సమకూర్చుట భావశబలత యనఁబడును. ఇటభావములన వ్యభిచారి భావములనియే గ్రహింపవలెను.

## భావశాంతి

చ. తలఁపఁగ రాజశేఖరుఁ డతండు; తలోదరి! సర్వమంగళా
కలితవు నీవు; మీర లోకగాత్రిముకై వడిఁ గూడి యాడుచుం
జెలఁగుటయొప్పుఁగా కలుగఁజెల్లునె మీకని బోటి మ్రొక్కఁగా
లలనకుఁదోఁచె బాష్పసలిలంబు నివారితమానపంకమై. ౧౪౫

ఇట నాయికకు సఖీ ప్రార్థనముచే మానశాంతి గలిగినది. నాయక ప్రార్థనముచే మానశాంతి గలిగినట్లు వర్ణించినచో లెస్సగా నుండును. మానమన రోషము. అది నిర్వేదాదిభావములలో నొకటి. 'బాష్పసలిలము' అను ననుభావమే మానశాంతిని వ్యంగ్యమొనర్చుచుండ "నివారిత మానపంకమై" అని చెప్పుటచే నది వాచ్యమగుచున్నది. ఇది దోషము. అనుభావాదులచే రసభావాదులు వ్యజ్యమానములు గావలయును. కాని స్వశబ్దవాచ్యములు గాఁగూడదు. ఈ క్రింది పద్యముదాహరణార్హము.

గీ. నెమ్మొగముఁ దమ్మివాంచి నానీదమాత్రిఁ
దగిలి కనుచుండియును ధైర్యమెగయఁజేసి

యుల్లమును జించివేసెను యువకుఁడొక్కఁడు
అమ్మెగచి క్రీడి మీనయంత్రమ్మువోలె.

ఇట ధృతి యను వ్యభిచారిభావము శాంతిల్లినది. భావశాంతివలనే రస
శాంతియు నగుచుండు. ఎట్లన

"ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతో
రన్యోన్యస్య హృది స్థితేఽప్యనునయే సంరక్షతోర్గౌరవమ్
దంపత్యోః శనకైరపాంగవలనాన్మిశ్రీభవచ్చక్షుషో
ర్భగ్నో మానకలిస్సహాసరభసవ్యాసక్తకంఠగ్రహః."

(ఏకశయ్యయందుఁ బ్రణయకోపముతో దంపతులిరువురును బరాఙ్ముఖులయి
పరుండిరి. ఒకరినొక రనునయింపవలెనను నిచ్ఛ హృదయమునందున్నను వా రాత్మ
గౌరవమునకై పెనఁగులాడుచుండిరి. కొంతతడవునకు పరస్పరదృష్టులు గలియుట
వలన వారి మానము భగ్నమయ్యెను. సహాసముగా వా రొండొరులఁ గౌఁగిలించు
కొనిరి.) ఇట వ్యభిచారి యగు మానమునకుఁ బ్రశమావస్థ చెప్పఁబడినది. కాన
భావశాంతి. కానీ యభినవగుప్తుఁ డిట నీర్ష్యావిప్రలంభరసమునకుఁ బ్రశమమనియుఁ
జెప్పవచ్చునని చెప్పుచున్నాఁడు. (అత్ర చ ఈర్ష్యా విప్రలంభస్య రసస్యాపి
ప్రశమః ఇతి శక్యం యోజయితుం—లోచనము.)

## భావోదయము

ఉ. మేలములాడు వేళల సమేలములై చెలులెల్లఁగూడి యో
బాలిక! శ్రీ నృసింహనరపాలు వరించెదవే యటన్న నీ
లాలకయంగవల్లిఁ బులకాంకురముల్ ననలొత్తె నేమనం
జాలక యూరకుండె ననిశంబు త్రపావృతయైన కైవడిన్. ౧౮౭

ఇట నాయికకు లజ్జ యుదయించినది. ఇదియుఁ 'త్రపావృత' అనుటచే
వాచ్యమైనది. ఈ క్రింది పద్య ముదాహరణీయము.

గీ. కుంచెఁగొని వ్రాయఁగాఁ బూనిగోడలపయిఁ
బెక్కు చిత్తరు బొమ్మలాపొలఁతిమిన్న
చిత్తమక్కాలమునఁ బరాయత్తమగుడు
వ్రాసియున్నది నీదు రూపములెయెల్ల.

ఇట నాయికకు 'భ్రమ'యను భావముదయించినది.

## భావసంధి

మ. హరికానంగ శరాళియై, యరికవేలాభీలదివ్యాశుగో
త్కరమై, శౌరికిఁ బాటలాబ్జకళికాదామంబులై వైరికిన్
నిరతాగ్ని ప్రభలై వెలుంగు నరకానీకాధికోల్లాసభా
సుర సత్యారమణీ కటాక్షములు ప్రోచున్ శ్రీనృసింహాధిపున్.

సత్యభామా కటాక్షములు హరికి శృంగారకృతమగు హర్షమును, నరకాసురునకు వీరరసకృతమగు హర్షమును గలిగించుచున్నవి. కాన భావసంధి యని గ్రంథకర్తయొక్క యాశయము. కానియిది గాదు. భావద్వయమును బరస్పరోపమర్దకముగా నొక్కరికే కలుగవలయును. ఎట్లన

క. 'చనుడు'నని 'చన' ననియున్
మనఃప్రియుండాడ రెండుమాటలపుడు జా
ఱెనుమును ముంగటిగాజులు;
వెనుకటి వటగుత్తమగుట వ్రీలె వెలఁదికిన్.

ఇటఁ గార్శ్య హర్షములసంధి. ఈరెండును నిచట నొక్కనాయికకే కలిగినవి. పై పద్యమున నట్లుగానరాదు.

క. కనఁబడకుండిన నిన్నుం
గనఁగానువ్విళ్ళు గొందుఁ; గనిపించినచోఁ
జనుదువని వెఱతు; నిన్నుం
గనకున్నను గన్న నాకుఁ గలుగవు సుఖముల్

ఇట నౌత్సుక్య శంకలయొక్క సంధి.

ఈ పై యుదాహరణములలో భావసంధియందు మొదటిభావ ముపమర్ద్యముగా రెండవది యుపమర్దకముగా నున్నది. అట్లున్ననే యనఁగా విరుద్ధభావములకు సమావేశమున్ననే సుందరముగా నుండును. ఈ క్రింది ప్రతాపరుద్రీయ శ్లోకమును గనుఁడు.

ప్రతాపరుద్రస్య దిగంత జైత్రయాత్రా ప్రభూతైః పటహ ప్రణాదైః
ప్రియానులాపైశ్చ తథాభటానాం రోమాంచ వర్మావృత మంగమాసీత్.

ప్రతాపరుద్రుని జైత్రయాత్రాసమయ భేరీభాంకారములను వినియుఁ బ్రియురాండ్ర ప్రియభాషణములను వినియు వీరభటుల గాత్రము రోమాంచితమయ్యెను.

ఇట వ్యాఖ్యాత "అత్ర పరస్పరవిరుద్ధ వీర శృంగారాశ్రితయోః హర్షయోః స్పర్ధయా సంబంధకథనాత్ భావసంధిః" ఇటఁ బరస్పర విరుద్ధములగు వీర శృంగారములయొక్క వ్యభిచారులగు హర్షములకు స్పర్ధచే సంబంధము చెప్పుటవలన భావ సంధి" అనెను. అనఁగా వీరులను వీరాశ్రితమగు హర్షమును, శృంగారాశ్రితమగు హర్షమును బరస్పర స్పర్ధతో (పోటీతో) నాశ్రయించినవి.

పరస్పర స్పర్ధతో నాశ్రయించినను రెండవదానిచే మొదటిది యుపమర్ద్యము గాలేదు. పరస్పర స్పర్ధతోనున్న రెంటికిని ననుభావములు భిన్నముగా నుండవలెను. రెండిటికిని నొకటే యనుభావము (రోమాంచము) చెప్పఁబడినది. 'చనుదునని చన ననియుఁ, కనఁబడకుండిన నిన్నుఁ' అను పద్యములలో వ్యభిచారుల యనుభావ ములు భిన్నభిన్నములుగా నున్నవి. కావున భిన్నవ్యభిచారుల సంధియే యుపమర్ద్య, ఉపమర్దక భావము గలిగియున్నచో రమణీయముగా నుండును.

## భావశబలత

మ. చెలులేమందురొ? భావవీథినకటా! శ్రీనారసింహేంద్రుకౌ
గిలినాకెన్నఁడు గల్గునో! నృపతితోఁ గ్రీడింపగాఁ బోవుచం
చలపుంజిత్తము నేమిసేయుదు; గురున్ సద్భక్తిఁ బ్రార్థింతునో
యలప్రాణేశ్వరుఁజూడకున్నఁ బరితాపాటోపముల్ మానునే?

'చెలులేమందురొ భావవీథి' అన్నచో శంకయు, శ్రీనారసింహేంద్రు కౌఁగిలినాకెన్నఁడు గల్గునో' యనుచోట నాతుసక్యమును, 'నృపతితోఁ గ్రీడిం పఁగాఁ బోవు చంచలపుంజిత్తము నేమిసేయుదు" అనుచో విషాదమును, 'గురుఁ సద్భక్తిఁ బ్రార్థింతునో అనుచో దైన్యమును. "అలప్రాణేశ్వరు... మానునే" అనుచో వితర్కమును గలవు. ఇట్లు పెక్కుభావములా నాయికకుంటచే భావశబ లత యగును.

భావశబలతలో నుపమర్ద్యోపమర్దక భావము నియతముగాదు. కామచారము.

ఈ తెలుపఁబడిన రస, భావ, రసాభాస, భావాభాస, భావశాంతి, భావో దయ, భావసంధి, భావశబలతలు కావ్యమునఁ బ్రధానములుగాక యన్యాంగము లుగా నయ్యేనేని రసవదాద్యలంకారములగును. ఎట్లన, నొక భావమునకుఁగాని రసమునకుఁగాని మరొకరస మంగమయ్యేనేని రసవదలంకారము.

మునిర్జయతి యోగీంద్రో మహాత్మా కుంభసంభవః ।
యేనైకచులుకే దృష్టౌ దివ్యౌతౌ మత్స్యకచ్ఛపౌ.

తా. ఎవని పుడిసిటియందు దాదివ్య మత్స్యకచ్ఛపములు గానఁబడెనో యాయోగీంద్రుఁడును, మహాత్ముఁడునగు నగస్త్యముని సర్వోత్కర్షముగా వర్తిల్లును.

ఇట మునివర్ణనము ప్రకృతము. కానఁ గవియొక్క మునివిషయకరతి రూపభావమునకు నద్భుతరస మంగము. ఇట భావమునకు రస మంగము. ఈక్రిందిపద్యము గూడ నుదాహరణీయము.

చ. జలనిధిరాజకన్య కనుసన్న మెలంగుచునుండు; వాణియుక్
మెలఁగును మాటలోన; నెలమిం జెయిసన్నఁజరించుఁ గీర్తి; నీ
లలితభుజోపగూహన విలాసము మానదు ధాత్రి; సద్గుణో
జ్జ్వల నరసింహ! మంత్రిబలవంతుల కింతులు చిక్క రబ్రిమే!

నరసభూపాలవిషయక కవి రతిరూపభావమునకు శృంగారరస మంగము.

అయం స రశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః
నాభ్యూరు జఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః.

యుద్ధభూమియందుఁ జచ్చిపడియున్న భూరిశ్రవసుని హస్తమును గాంచి యతని భార్య విలపించుచున్నది.

"ఈ హస్తము నా మొలనూలిని లాఁగివేసెడిది. ఇది నా బలిసిన చన్నులు పిసుకునది. ఇది నానాభినిఁ దొడలను, జఘనమును దడుముచుండెడిది. ఇది నాపోఁక ముడిని విప్పుచుండెడిది"

ఇటఁ గరుణమునకు శృంగారమంగము. (రసదోష ప్రకరణమున దీనినిఁ జూచునది.) అనఁగా నొక రసమునకు వేఱొరస మంగము. ఈరెంటను రసవదలంకారము. దీనినే ధ్వనికారుఁడు

ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాంగం తు రసాదయః
కావ్యే తస్మిన్నలంకారో రసాది రితి మే మతిః.

"ఏ కావ్యమున రస, భావాదులు ప్రధానములో నఁగా నంగిభూతములో నచ్చట రస, భావాదినామములచేతనే వ్యవహారము; ఏ కావ్యమున రస భావాదు లప్రధానములో యనఁగా నంగభూతములో నవి రసవదాద్యలంకారములని నాయాశయము" అని వచించెను. కాన రసాదులకును, రసవదాద్యలంకారములకును భేదమును లెస్సగాఁ దెలియవలెను.

ఒక రసమునకు భావముగానీ యొక భావమునకు మరొకభావముగానీ యంగమయ్యేనేని ప్రేయోఽలంకారము. దీనికి భావాలంకారమనియు నామాంతరము.

కదా వారాణస్యా మమరతటినీరోధసి వసన్
వసానః కౌపీనం శిరసి నిదధానోఽంజలిపుటం
అయే! గౌరీనాథ! త్రిపురహర! శంభో! త్రినయన!
ప్రసీదేత్యాక్రోశన్ నిమిషమివ నేష్యామి దివసాన్.

ఎప్పుడు నేను గంగాతీరమున వసించుచుఁ గౌపీనమును దాల్చి శిరస్సున నంజలిని వహించి "ఓ, గౌరీనాథ! ఓ శంభో! ఓ త్రినేత్ర! అనుగ్రహింపుము" అని యఱచుచు దినములను నిమిషముగాఁ గడపఁగలను?

ఇచ్చట శాంతరసమునకు కదా (ఎప్పుడు) అను పదముచే వ్యక్తమైన 'చింత' యను వ్యభిచారిభావ మంగము. అనఁగా రసమునకు భావ మంగము.

రసగంగాధరకారుఁ డిట భావమునకే రస మంగమని చెప్పెను.

అత్యుచ్చాః పరితః స్ఫురంతిగిరయః స్ఫారా స్తథాంభోధయః
తానేతానపి బిభ్రతీ కిమపి నః శ్రాంతాసి తుభ్యం నమః
ఆశ్చర్యేణ ముహుర్ముహుస్తుతిమితి ప్రస్తౌమి యావద్భువ
స్తావద్బిభ్రదిమాంస్మృత స్తవ భుజో వాచ స్తతో ముద్రితాః.

"ఓ భూదేవీ! మిక్కిలి యెత్తైన పర్వతము లంతటను వ్యాపించియున్నవి. విశాలమైన సముద్రములు నిండియున్నవి. వీని నన్నింటిని వహించుచు నెంతమాత్రమును నలసట వహింపకున్నావు. నీకు నమస్కారము" అని యాశ్చర్యముతో తిరిగితిరిగి భూమిని స్తోత్రము చేయుచుండఁగా నోరాజా! ఆభూమిని వహించు నీభుజము నాస్మృతికి వచ్చినది. అంతటిలో నామాటలు కట్టువడినవి. ఇటఁ గవి నేయు ప్రభువర్ణనము ప్రకృతము. కానఁ బ్రభువిషయకకవిరతిరూపభావమునకు భూవిషయక రతి రూపభావమంగము. అనఁగా నొకభావమునకు వేఱొకభావ మంగమయ్యెను.

భావమునకు రసాభాస భావాభాసము లంగమయ్యెనేని ఊర్జస్విదలంకారము

త్వత్ప్రత్యర్థి వసుంధరేశతరుణీః సంత్రాసతస్సత్వరం
యాంతీర్వీర! విలుంఠితుంసరభసం యాతాఃకిరాతావనే
తిష్ఠంతి స్తిమితాః ప్రరూఢపులకాస్తే విస్మృతోపక్రమా
స్తాసాముత్తరలైః స్తనైరతితరాం లోలై రపాంగై రపి.

ఓ వీరుఁడా! నీభయమున వేవేగఁ బరుగిడుచున్న నీశత్రురాజకాంతలను వనమునందలి కిరాతులు దోఁచుకొనుటకై పోయినవారై యాకాంతల యుబుకు

చున్న చన్నులను గాంచియు వారి లోలాపాంగములను జూచియు గగ్గురుపాటుగొని తమపూనికిని మఱచి స్తిమితులై నిలిచిరి.

ఇటఁ గవినేయవర్ణనము ప్రకృతము. కావున రాజవిషయకరతిరూపభావము నకు శృంగార రసాభాసము (కిరాతులు రాజకాంతలను మోహించుట యనుచితము గాన రసాభాసము) అంగము. ఈక్రిందిదిగూడ నుదాహరణీయము.

చం. అలకలుముట్టిముట్టి జఘనాంబర పంక్తికిఁ గిట్టికిట్టి గు
బ్బలురతిఁ బట్టిపట్టి కరపల్లవముల్ నులివెట్టి పెట్టియుం
జెలువగు తారహారముల చిక్కులువెట్టు నృసింహ! నీద్విష
ల్లలన వనాళికేఁగ విటలక్షణలక్ష్యములై మహీజముల్.

నరసభూపాల విషయకరతిరూపభావమునకు శృంగారరసాభాసమంగము.

త్వయి లోచన గోచరంగతే సఫలం జన్మ నృసింహభూపతే!
అజనిష్ట మమేతిసాదరం యుధి విజ్ఞాపయితి ద్విషాంగణః

ఓ నృసింహభూపతీ! నీవుమాకన్నులఁ బడఁగానే మాజన్మ సఫలమయ్యెను. అనిశత్రుగణము సాదరముగా యుద్ధమున విజ్ఞాపనము చేయుచున్నది.

ఇట శత్రువులు తమశత్రురాజును గుఱించి యీవిధముగా స్తోత్రముచేయుట యనుచితము. రాజవిషయక శత్రుస్తుతి కాన భావము.

ఇది యనౌచిత్యదోషగ్రస్తమగుటచే భావాభాసము. ఇది కవినేయవర్ణన మగుట రాజవిషయకరతి కంగమయ్యెను.

రసమునకు భావశాంతి యంగమగునేని సమాహితాలంకారము.

పశ్యామః కిమియంప్రపద్యత ఇతిస్థైర్యం మయాలంబితం
కింమాంనాలపతీత్యయంఖలు శఠఃకోప స్తయాప్యాశ్రితః
ఇత్యన్యోన్య విలక్ష్యదృష్టిచతురే తస్మిన్నవస్థాంతరే
సవ్యాజం హసితం మయా ధృతిహరో ముక్తస్తు బాష్పస్తయా.

ఒకనాయకుఁడు తనమిత్రునితో ననుచున్నాఁడు. "ఈమెయేమిచేయునో చూతము" అనినేనును ధైర్యమవలంబించితిని. ఈతఁడు తానైనాతోనేల మాట లాడఁడు? అన్నయామెయు శఠించియున్నది. ఇట్లుండఁ బరధ్యానములో నెటు వైపో చూచుకొనుచున్న యాసమయమున నేను మిషపెట్టినవ్వితిని. ఆమెయు నా ధైర్యమును హరించుబాష్పమును విడిచినది."

ఇట శృంగారరసమునకు నంగమగు శోపరూపమగు భావమునకుశాంతి గలి గినది. భావోదయ, భావసంధి, భావశబలత లిట్లన్యాంగములయినచో వీనికి నామాంతరములులేవు. భావోదయాలంకారము, భావసంధ్యలంకారము, భావశబల తాలంకారము, అనివర్యేవహారము. ఈ రసవదాద్య లంకారరూపమగు కావ్యమప రాంగ రూపమగు గుణీభూతవ్యంగ్యములోఁజేరును. అదియుఁ బండిత రాయమతాను సారముగా నుత్తమ కావ్యములోనే చేరును.

## నవరస సంకరము

మ. జయలక్ష్మీ రతమై, ప్రతాపయుతమై, శత్రుచ్ఛిదాధుర్యమై,
ప్రయతార్త్తావనమై, కపీంద్రగతియై, రక్తార్ద్రమై, నిర్ఘనో
దయవిద్యున్నిభమై సకంపమయి వందారుస్పృహాశూన్యమై
నయమొప్పన్నరసింహుఖడ్గమమరున్ నానారసప్రక్రియన్.

నరసభూపాలుని ఖడ్గము జయలక్ష్మియందు రతిగలదై, శౌర్యముగలదై, శత్రువులను ఛేదించుటయందు సమర్థమై, ఆర్తులను రక్షించునదై, చంచలమై, రక్త ముతోఁ దడిసినదై మేఘములేకయే వచ్చిన మెఱపువంటిదై, కంపముగలదై, ప్రణ తులను సంహరించుకోర్కె లేనిదై నానారసప్రకారములలో విలసిల్లుచున్నది.

ఇందుఁ గ్రమముగా నరసభూపాలుని ఖడ్గము శృంగార, వీర, రౌద్ర, కరుణ, హాస్య, బీభత్స, అద్భుత, భయానక, శాంతరసములకు నాశ్రయమయినది. కావున నవరస సంకరమని భావము.

ఇటనచేతనమగు ఖడ్గము రసాశ్రయ మెట్లగును? తిర్యగాదులకు విభావాది జ్ఞానములేమి వానిశృంగారమే రసాభాసమగుచుండ నచేతనమగు ఖడ్గమునకు విభా వాది జ్ఞానమెట్లుండును? రసాశ్రయమెట్లగును? 'శృంగారీ గిరిజాననే' అనుచోట జేతనుఁడగు హరుఁడు నవరసాశ్రయుఁడై నటించుటఁగాఁడు కాన నీపద్యమున నవ రస సంకరము పొసఁగదు. మరియు శోకస్థాయిభావకమగురసముకరుణము. కరుణము (అకారాంత పుంలింగము) కరుణ (ఆకారాంత స్త్రీలింగము). రసపరమైన కరుణ శబ్దమునకును దయాపరమైన 'కరుణా' శబ్దమునకును భేదముదెలియక 'ప్రయ తార్తావనమై' అనిప్రయోగించుట దోషము. మరియుఁ జెప్పకయే నానారస సంకర మని తెలియుచుండగా "నానారసప్రక్రియన్" అనివాచ్యముగాఁ జెప్పుటయు ననుచితమే. ఇట్టిసంకరము నేయాలంకారికులును నుదాహరింపలేదు.

## రసాధిదేవతా నిరూపణము

సీ. హరికి శృంగార లీలాధిపత్య మొనర్చు
గణనాథు హాస్యసంగతునిఁ జేయు
నలికలోచనునిపై నధికరౌద్రమునిల్పు
శక్రుపై వీరరసంబు నెఱపు
యమునిపైని దయామయత్వంబు ఘటియించు
జగతి మహాకాలు సభయుఁ జేయు
శర్వరీంద్రుని జుగుప్సారసాన్వితుఁ జేయు
శతధృతి నద్భుతాన్వితు నొనర్చు

గీ. శాంతి బ్రహ్మంబుఁ జేర్చు నిచ్చలు నృసింహు
భవనభరణంబు, వరవిఘ్న నివహహరణ,
మీశతయు, భోగము, ననేక నృపతి హృతియు,
ననియు, యశమును, మదియు, బోధాతిశయము. ౧౪౬

తా॥ నరసభూపాలుని భూభరణము హరిని శృంగారాస్పదునిఁ జేయును. అతని విఘ్నహరణశక్తి విఘ్నేశ్వరుని నవ్వులపాలుఁ జేయును. అతని యీశత్వము ఫాలాక్షుని రౌద్రయుక్తునిఁ జేయును. అతనిభోగ మింద్రునికి వీరత్వము గలిగించును. అతని శత్రురాజ సంహారము యముని దయావంతునిఁ జేయును. అతని యుద్ధము కాలరుద్రుని భయాస్పదునిఁజేయును. అతనికీర్తి చంద్రుని జుగుప్సావంతునిఁ (రోఁత పుట్టించువానిని) గావించును. అతని బుద్ధి బ్రహ్మదేవుని నద్భుతవంతునిఁ జేయును. అతని జ్ఞానము బ్రహ్మమును శాంతినిఁ బొందించును.

ఇందు శ్రీ మహావిష్ణువు శృంగార రసాధిదేవత; గణపతి హాస్యరసాధిదేవత; ఫాలాక్షుఁడు రౌద్రరసాధిదేవత; ఇంద్రుఁడు వీరరసాధిదేవత; యముఁడు కరుణ రసాధిదేవత; కాలరుద్రుఁడు భయానక రసాధిదేవత; చంద్రుఁడు బీభత్స రసాధి దేవత, బ్రహ్మ యద్భుతరసాధిదేవత; పరబ్రహ్మము శాంతరసాధిదేవత యని చెప్పఁ బడినది. సాహిత్యదర్పణమున నీ యధిదేవతలు భిన్నముగాఁ జెప్పఁబడియున్నారు. రసగంగాధరమున నీ విషయమే లేదు.

ఇందు "యమునిపై దయామయత్వంబు ఘటియించు" అనుచోటఁ గరుణ రసమునకు దయాపదమును వాడుట చింత్యము.

సీ. మరకతానీకదంభమున శృంగారంబు,
హాస్యంబు ముక్తాఫలౌఘరుచులఁ
గరుణ విద్రుమవర్ణ గౌరవచ్ఛలమున
రౌద్రంబు కురువింద రత్నకలన
వీరంబు గోమేధికారోపితస్ఫూర్తి
భయము వైదూర్యశోభామిషమున
బీభత్స మింద్రనీలాభాగుణంబున
శాంతి నిర్మల హీరశాంతిగతుల

గీ. నద్భుతము పుష్యరాగ రాగాపదేశ
విలసితంబున సాకారవృత్తిఁ గాంచి
నవరసంబులువొల్చు నీ భవనవీథిఁ
బ్రబల సుబల! నృసింహ! యోబయనృసింహ! ౧౫౦

కవిసమయములందుఁ గీర్తి తెల్లనిదని వర్ణించువిధముననే నవరసములును గవిసమయమున నీ క్రింది వర్ణములు గలిగియుండును. శృంగారమునకు మరకతవర్ణము. హాస్యమునకు ముక్తాఫలవర్ణము. కరుణమునకు విద్రుమవర్ణము. రౌద్రమునకు గురువిందరత్నవర్ణము. వీరమునకు గోమేధికవర్ణము. భయానకమునకు వైడూర్యవర్ణము. బీభత్సమునకు నింద్రనీలవర్ణము. శాంతమునకు వజ్రవర్ణము. అద్భుతమునకుఁ బుష్యరాగవర్ణము.

కం. కరుణా భయ బీభత్సము
ఖరసంబులు శోక భీతి గాఢ జుగుప్సా
కరములు గాన రసములై
తిరమగు నెట్లన్న దీనిఁ దెలిపెద వరుసన్. ౧౫౧

ఉ. భావమలంక్రియాగుణవిభాసితమై వికసద్రసోదయ
శ్రీ వినివారితేతరవిశేషనివేదనమై యెలర్ప నీ
వావిరి దుఃఖమైన సుఖమై భయమైన విటీవిటాళియం
దావలఁ బూర్ణమై సహృదయాత్మలఁ గేవలహార్దమైతగున్. ౧౫౨

భావము (రత్యాది స్థాయిభావము) అలంకార గుణములచే (ఇది యుపలక్షణము కాన వృత్తి, రీతి, శయ్యా, పాకములచేతను, అనియును జెప్పుకొనవలెను.)

విభాసితమై యనఁగాఁ గావ్యమునందుఁ బ్రతిపాదింపఁబడిన విభావాదులచే నభివ్యక్తమై (విభావాదులను గుణాలంకారాదులేకదా రమణీయముగా శోభింపఁ జేయును. అట్టి రమణీయములయిన విభావములచే రసము వ్యక్తమగును.) రసముగానగుచున్నది. ఆ రసశ్రీచేత సహృదయుల హృదయమునను జ్ఞానాంతరములు నివర్తిల్లుచున్నవి. ఈక్రమమునఁ బ్రప్రథమమున ననుకార్యులగు విటీవిటులయందు దుఃఖమైనను సుఖమైనను సహృదయులకుఁ బూర్ణమగు నానందమే కలుగును.

'విటీవిటు' లనరాదు. ఏలన, నెల్లరసములందును విటీవిటు లుండరుగదా. శృంగారమునందయినను దక్షిణాదిరుణులు నాయికానాయకులుగా నుందురు. కాని విటీవిటులు గారుగదా! కాన విటీవిటులనుట తప్పు.

ఇట గ్రంథకర్తయుద్దేశ మేమనఁగా ననుకార్యమునందు దుఃఖమున్నను సుఖమున్నను దానిని దృశ్య శ్రవ్య కావ్యములలోఁ జూచుచున్నట్టియు వినుచున్నట్టియు సహృదయుల కానందమే కలుగుచున్నది. ఈరసచర్చ విపులముగాఁ జేసియుంటిమి.

గీ. అల పదార్థంబులగు విభావానుభావ
సాత్త్వికాదులఁ గూడి రసత్వమొందు
నవని భావంబు వాక్యార్థమనఁగ నెగడి
తంతువులుగూడి పటమనఁ దనరుకరణి.

రత్యాది స్థాయిభావము పదార్థభూతములగు విభావాదులఁగూడి తంతువులు దమలోఁదాము గూడి పటమగువిధమున వాక్యార్థరూపమగు రసముగాఁ బరిణమించును. విభావాదులు పదార్థములనియు, రసము వాక్యార్థమనియు సిద్ధాంతము. పదార్థములకు వాక్యార్థమందేకదా విశ్రాంతి! విభావాదులకు రసమునందే విశ్రాంతి. స్థాయిభావము లా విభావాదులను గూడి వానిచేఁ బుష్టమై రసమగును.

దీని కాకర మిది:—

యథా హి తంతవో వేమతుర్యాది క్రియయాన్వితాః
పటాత్మతా పరిణతాః పటవాచ్యా భవంతి తే
తథైవ స్థాయినో భావా విభావాదిభిరన్వితాః
రసాత్మతా పరిణతా రసవాచ్యా భవంతి తే.

మ. రమణీయోల్బణతాసమేతమగు నీరత్యాది భావాబ్ధిలో
నమరం బుట్టుచు మునుచుందగుఁ దరంగారూఢి సంచారి ...

ఘము లేశస్పృశితిసన్నమౌ రసము తత్కాలంబునందైన స
త్యము రామాదులయందు; నాట్యమున సభ్యావాసమై భాసిలున్.

నిర్వేదాది సంచారి భావబృందము లీరత్యాది స్థాయిభావములనుసముద్ర ములోఁదరంగములవలెఁ బుట్టుచు నడఁగుచునుండును. వీనిచేఁ బరిపుష్టమైన రసము ప్రప్రథమమున రామాద్యనుకార్యమునందే యున్నను గావ్యనాట్యము లందారసము సామాజికాశ్రయమైయుండును. ఇదియ లౌకికరసము. దీనికాకరమిది.

ఉన్మజ్జంతో నిమజ్జంతః కల్లోలాస్తే యథార్ణవే
తస్యోత్కర్షం వితన్వంతి యాంతి తద్రూపతామపి
తథాస్థాయిని నిర్మగ్నాహ్యున్మగ్నా వ్యభిచారిణః
పుష్ణంతిస్థాయినంస్వాంశ్చతన్న యంతిరసాత్మతాం.

శా. లేఖేశప్రతిమాన వైభవ! భవాశ్లిష్టస్రవంతీమరు
చ్ఛాఖిస్పర్ధియశః పరంపర! పరక్ష్మాపాలకప్రాజ్యరా
జ్యాఖర్వస్మయపుంజభంజనకృపాణాకల్ప! కల్పాంతవే
లాఖేలత్ప్రబలార్కకర్కశమహాహేలాంఘ్రిపతాపోదయా!

కం. భోగాంబువాహవి
భాగేహాభావుకాంగభావభవమహా
భాగమహీభాగమహా
భోగావహబాహు భోగిపుంగవ భోగా! ౧౫౫

కవిరాజ విరాజితము

నిరుపమ రూప దిలీప! మనూపమనీతికలాప! కలాపధర
స్మరణభవానుభవానిశమానితమానసపద్మసపద్మరట
త్కరివర ఘోటకకోటికరంభిత కాంతనిశాంత నిశాంతమహా
హరిహయదిక్తరణి స్ఫురదైక విభాధికలాభ కలాభివనా!

## గద్యము.

ఇది శ్రీ హనుమత్ప్రసాదలబ్ధ కవితాసారసారస్వతాలంకార నిరంకుశ ప్రతిభా
బంధురప్రబంధ పఠనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ
సుపుత్త్రి తిమ్మరాజపౌత్ర సకలభాషావిశేష నిరుపమావధానశారదా
మూర్తి మూర్తి ప్రణీతంబైన కావ్యాలంకార సంగ్రహంబను
మహాప్రబంధంబునందు రస, స్థాయి సామాన్యలక్షణంబును
దద్వ్యూహాకరణంబును, విభావానుభావ సంచారిభావ
ప్రపంచంబును, శృంగార చేష్టా పరికరణంబును
నవస్థా నిర్ణయంబును, సంభోగ విప్రలంభ
భేదంబును, రసాభాస, భావశాంతి, భావో
దయ, భావసంధి, భావ శబలతా
సంకరతలును రసవర్ణాధిదేవతా
విశేషంబును నన్నది
తృతీయాశ్వాసము.

---

# అనుబంధము

ప్రప్రథమమునఁ దొమ్మిది రసములకును గ్రంథకర్త స్థాయిభావములను మాత్రిముఁ జూపి శృంగారరసమును మాత్రమే విభావానుభావసంచారి సామగ్రితో వివరించెను. గ్రింథవిస్తరభీతిచే మిగిలిన రసములను వదలితిననెను. మిగిలిన రసములను వాని విభావాది సామగ్రిని నిటఁ జూపుదుము.

### హాస్యరసము

వికృతాకార, వా,గ్వేష, చేష్టాదేః, కుహకాద్భవేత్
హాస్యోహాస స్థాయిభావశ్శ్వేతః ప్రమథదైవతః
వికృతాకార వాగ్వేషం యమాలోక్య హసేజ్జనం
తదత్రాలంబనం ప్రోక్తం తచ్చేష్టోద్దీపనం మతం
అనుభావోఽక్షిసంకోచ వదనస్మేరతాదికః
హర్షావహిత్థ చాపల్యావేగాశ్చ వ్యభిచారిణః.

వికృతమైన యాకారము, వికృతమైన భావ, వికృతమైన వేషము, వికృతమైన చేష్టలు మొదలగునవిగలన రకుని(కుహకాత్)వలనహాసముస్థాయిభావముగాఁగల

హాస్యరసము గలుగును. దీని వర్ణము శ్వేతము. దీని కధిదేవత ప్రమథుఁడు. (నరస భూపాలీయకర్త గణనాథుఁడని చెప్పెను.) జనుఁడు (సామాజికుఁడు) వికృతాకార వాగ్వేష చేష్టాదులు గల యెవనినిఁజూచి నవ్వునో యతఁ డాలంబనవిభావము. వాని చేష్ట యుద్దీపనవిభావము. అక్షిసంకోచము, వదనస్మేరత మొదలగునవి యను భావములు. హర్షము, అవహిత్థ, చాపల్యము, ఆవేగము, వ్యభిచారిభావములు.

ఈ హాస్యరస మనుభావభేదమునుబట్టి యాఱువిధములు. ఎట్లన,

జ్యేష్ఠానాం స్మితహసితే । మధ్యానాం విహసితావహసితే చ
నీచానా మపహసితం । తథాతిహసితం తదేష షడ్భేదః

ఉత్తములకు స్మితహసితములు, మధ్యములకు విహసిత, అవహసితములు, నీచులకు అపహసిత, అతిహసితములు, అనునవి గలుగును.

"ఈషత్ఫుల్లకపోలాభ్యాం కటాక్షై రప్యనుల్బణైః
అదృశ్యదశనో హాసో మధురః స్మిత ముచ్యతే
వక్త్ర నేత్ర కపోలైశ్చ దుత్ఫుల్లైరుపలక్షితః
కించిల్లక్షిత దంతశ్చ తదా హసిత మిష్యతే
సశబ్దం మధురం కంఠగతం వదనరాగవత్
ఆకంపితాక్షిమంద్రం చ విదుర్విహసితం బుధాః
వికుంచితాంసశీర్షశ్చ జిహ్మదృష్టి విలోకనః
ఉత్ఫుల్లనాసికో హాసో నామ్నావహసితం మతం
అస్థానజః సాశ్రుదృష్టి రాకంప స్కంధమూర్ధజః
శార్ఙ్గదేవేన గదితో హాసోఽపహసితాహ్వయః
స్థూలకర్ణకటుధ్వానో బాష్పపూరప్లుతేక్షణః
కరోపగూఢపార్శ్వశ్చ హాసోఽతిహసితం మతం."

కొలఁదిగాఁ జెక్కిళ్లు వికసింపఁజేసి, మృదువుగాఁ గటాక్షములను నిగుడ్చుచు, దంతములు వెలికిఁ గనరానిచందమున నవ్విన నది మధురమైన హాసము. దీనికి స్మిత మనిపేరు. లెస్సగా మొగము, కన్నులు, చెక్కిళ్లును, వికసింపఁజేసి కొలఁదిగాఁ దంతములు గనవచ్చునట్లు నవ్విన నది హసిత మనఁబడును. కంఠగతముగానే (వెలు పలికి రానీయక) మధురస్వరమును జేయుచు, ముఖరాగమును జూపుచు నోరగంటఁ జూచుచు మంద్రముగా నవ్విన నది విహసిత మనఁబడును. బుజములును, శిరస్సును గదలునట్లును, నోరచూపుఁజూచుచు, ముకుపుటమును లెస్సగా వికసింపఁజేయుచు నవ్విన నది యవహసిత మనఁబడును. తగినంత కారణములేకయుఁ గలిగినదియు,

గన్నీరు వెలువరించుచు, భుజములును, వెండ్రుకలును నదిరిపోవునట్లు చేయునదియు నగు నవ్వపహసిత మనఁబడును. స్థూలమైనదియుఁ, గన్నులనుండి బాష్పపూరమును బ్రవహింపఁజేయునదియు డొక్క లదరునట్లు చేయునదియు నగు న వ్వతిహసిత మనఁబడును.

## ఉదాహరణము

గురోర్గిరః పంచదినాన్యధీత్య వేదాంతశాస్త్రాణి దినత్రయం చ
అమీ సమాఘ్రాయ చ తర్కవాదాన్ సమాగతాః కుక్కుటమిశ్రపాదాః

అయిదు దినాలలో మీమాంసాశాస్త్రమును మిడికి, మూఁడు దినాలలో వేదాంతశాస్త్రమును వెలిఁగించి తర్కవాదములను మూచూచి కుక్కుటమిశ్రపాదుల వారు దయచేసినారు.

ఆ.వె. చాకివానితోడ జగడాలు పడలేక
సిరిగలాఁడు పట్టుచీరగట్టె;
శివుఁడు తోలుగప్పె; సీయని మదిరోసి
భైరవుండు చీర పాఱవైచె.

ఈ హాస్యరసము ప్రహసనములలో నంగిగా నుండును. అందు మనమీ యాఱు భేదములను జూడఁగలము.

ఇట నొక శంక గలుగుచున్నది. సామాజికుఁడు నాయకునితో నభేదమును బొందినపుడుగదా రసోదయమగుచున్నది. ఇందులకే సాధారణీకరణమను వ్యాపార ముండుననియు నది నాయకసామాజికులకు విభావాదులను సాధారణముగాఁ జేయు ననియును రసచర్చావసరమునఁ దెలిపితిమి. అట్టియెడఁ నాయకుఁడు గావ్యములందు సాక్షాత్తుగా నిబద్ధుఁడై యుండవలెను. కానిచో రసాస్వాదము గలుగదు. ఎట్లు సామాజికుఁడు శకుంతలా దుష్యంతాదుల శృంగారమును సాక్షాత్తుగాఁ జూచి తదభేదముతో రసాస్వాదమును జేయుచున్నాఁడో హాస్యరసమునను నట్లే నవ్వు చున్న నాయకునిఁజూచి తదభేదముతో హాస్యరసాస్వాదమును జేయవలసియున్నది. కాని హాస్యాదులగు కొన్ని రసములలో నట్టి నాయకాదులు నిబంధింపఁబడుట లేదు. అట్టిచో రసోదయ మెట్లగును?

యస్యహాసః సచేత్క్వాపి సాక్షాన్నైవ నిబధ్యతే
తథాప్యేష విభావాది సామర్థ్యా దుపలభ్యతే
అభేదేన విభావాది సాధారణ్యాత్ప్రతీయతే
సామాజికే సతో హాస్య రసోఽయ మనుభూయతే

నాటకాదులందు నవ్వుచున్న నాయకుఁడు సాక్షాత్తుగా నిబంధింపఁబడుట లేదు. అయినను నా నాయకుఁడు విభావాదుల సామర్థ్యముచేఁ దోఁచును. అనఁగాఁ బ్రత్యక్షముగాఁ గానరాకున్నను సామాజికుల యాంతరదృష్టికి నవ్వుచున్న నాయకుఁడు గానఁబడును. వానితో సామాజికు లభేదమునుబొంది రసాస్వాదమును జేయుదురు. బీభత్సమునందుఁగూడ నిదేవిధముగా సామాజికులు రస మనుభవింతురు.

## హాస్యాభాసము

అపహసింపఁదగని గురువులు మొదలగు పెద్దల, నాలంబనముగాఁ జేసికొని ప్రవృత్తమైన హాసము హాస్యాభాసము. ఉత్తరరామచరిత్రమున వాల్మీక్యాశ్రమమునకు వసిష్ఠమహర్షి వచ్చినపుడు శిష్యుల సంభాషణమును గనుఁడు.

సౌధాతకి:— ఏమి ? వసిష్ఠుఁడా! నే నేదో వ్యాఘ్రమనుకొంటిని. ఏలన, నతఁడురాగాఁనే పాప మావుపెయ్యను నంత మొనర్చిరి.

ఇటుఁ బూజ్యపాదుఁడగు వసిష్ఠమహర్షినిఁ బరిహసించుట హాస్యాభాసము.

## కరుణరసము

ఇష్టనాశాదనిష్టాప్తేః కరుణాఖ్యో రసోభవేత్
ధీరైః కపోతవర్ణోఽయం కథితో యమదైవతః
శోకోఽత్ర స్థాయిభావఃస్యాచ్ఛోచ్యమాలంబనం మతం
తస్య దాహాదికావస్థా భవేదుద్దీపనం పునః
అనుభావా దైవనిందా భూపాతక్రందితాదయః
వైవర్ణ్యోచ్ఛ్వాసనిశ్వాస స్తంభప్రలపనాని చ
నిర్వేద మోహాపస్మారవ్యాధి గ్లాని స్మృతిశ్రమాః
విషాద జడతోన్మాద చింతాద్యా వ్యభిచారిణః.

ఇష్టబంధువులు మొదలగువారి నాశమువలనను, అనిష్టము ప్రాప్తించుటవలనను, గరుణరసము గలుగును. 'ఇష్టనాశము' అన ఇష్టులగువారి మరణమనియే యర్థముగాదు. మరణముగావచ్చును. లేక వారి వార్త బొత్తుగాఁ దెలియకపోవుటచే మరణించిరనియు, వారి సంగమము దిరిగి తటస్థింపనే తటస్థింపదనియు నమ్మకము గలుగుటచే సంభవించిన నిరపేక్షభావము. దీని వర్ణము కపోతవర్ణము. (నరసభూపాలీయమున విద్రుమవర్ణమని చెప్పఁబడియున్నది.) దీని కధిదేవత యముఁడు. స్థాయిభావము శోకము. శోచ్యులగు బంధుమిత్రాదు లాలంబనము. ఆ శోచ్యులగువారి దాహావస్థయుఁ, దత్సంబంధి గృహ భూషణాభరణ దర్శనాదులును నుద్దీపనవిభావ

ములు. దైవనింద, భూపాతము, ఆక్రందనము, మొదలగునవి యనుభావములు. వైవర్ణ్యము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, స్తంభము, ప్రలాపము, నిర్వేదము, మోహము, అపస్మారము, వ్యాధి, గ్లాని, స్మృతి, శ్రమ, విషాదము, జడత, ఉన్మాదము, చింత మొదలగునవి వ్యభిచారిభావములు.

## ఉదాహరణము

ఆ. వె. లోకదీపమాఱె; లోకేశ్వరుఁడడంగెఁ;
గల్పవృక్షకంబు కాలిపోయెఁ;
బాలకదలి యెండె; భాండారము హరించె;
వ్యర్థమైన బ్రిదుకు బ్రిదుకవలసె.

ఈ పద్యము నా జాతక కథాగుచ్ఛములోనిది. ఇట వ్యాఘ్రముచేఁ భక్షితుఁడైన బోధిసత్త్వునిఁగాంచి యతనిశిష్యులురుదించుచున్నారు. బోధిసత్త్వుఁ డాలంబనము. అతని యెముకలప్రోవు ద్దీపనవిభావము. రోదనము అనుభావము. నిర్వేద విషాదములు వ్యభిచారులు. వీనిచే స్థాయిభావమగు శోకము పుష్టమై కరుణరస మయ్యెను. ఈ కరుణరసము నా ద్వంద్వయుద్ధమున లెస్సగాఁ బుష్టమైయున్నది.

భట్టలోల్లటుఁడు కరుణరసమున 'ధృతి'గూడ వ్యభిచారిగా నుండునని చెప్పిన ట్లేదో సందర్భములో నొకానొక వ్యాఖ్యానమున నొకరు వ్రాసిరఁట. దానికిఁ దగినట్లు పాండురంగ మాహాత్మ్యములోని నిగమశర్మోపాఖ్యానమున నీ క్రిందిపద్యమున 'ధృతి' యను వ్యభిచారిభావము గనుపట్టుచున్నది.

ఉ. ఎల్లరు నెల్లచో ధనములిచ్చి మృగాక్షులఁగొంద్రు గాని యో
పల్లవపాణి! యేఁ బరమపావనవంశమునిచ్చి కొంటి నీ
నల్లనిరూపు నిక్కమని నమ్మి; ధ్రువంబదిగాక నేఁడు వి
ద్యుల్లతికాధికాభినయ ధూర్వహమాట యెఱుంగ నింతయుక్.

'నీ నల్లనిరూపు నిక్కమని నమ్మట' ధృతిచేతనేకదా (ధైర్యముచేతనే) కరుణరసమునకును, గరుణవిప్రలంభమునకును గల భేదమేమి?

"శోకస్థాయితయాభిన్నో విప్రలంభాదయం రసః
విప్రలంభే రతిః స్థాయీ పునస్సంభోగహేతుకః."

కరుణరసమునకు స్థాయిభావము శోకము. కరుణవిప్రలంభమునకుఁ బునస్సంభోగకారణమగు రతి స్థాయిభావము. కరుణరసమునఁ బునస్సంభోగముండదు.

అసలు కేవలకరుణమో కేవల విప్రలంభమో యుండును; కాని కరుణవిప్రలంభ మనునది లేనేలేదని వెనుకఁ దెలిపితిమి.

సాపేక్షభావమున్నచో విప్రలంభమనియు, నిరపేక్షభావమున్నచోఁ గరుణ మనియు సిద్ధాంతము. అంతేకాని నాయికానాయకులలో నొకరు మరణించి తిరిగి జీవించినచోఁగాని, శరీరాంతరములో వచ్చినఁగాని కరుణవిప్రలంభమనియు మర ణించినచోఁ గరుణమనియు సాహిత్యదర్పణకారుఁడు దెలిపిన సిద్ధాంతము సరిగాదు. మరణించినను జీవించినను నిరపేక్షభావమున్నచోఁ గరుణమనియు, సాపేక్షభావ మున్నచో విప్రలంభమనియు సిద్ధాంతము. దీనినిఁబట్టి కరుణ విప్రలంభమనునది లేనేలేదు.

## కరుణాభాసము

ధీరోద్ధతుఁడు తనచేఁ జంపఁబడిన శత్రువును గుఱించి చేయు రోదనము కరుణాభాసమగును.

కం. గదచే దుర్యోధను తొడ
లదయ స్వాంతమున విఱిచి హతుఁడగు నతనిం
బదపడి కని భీముండం
గదగొని బిట్టేడ్చెనంచు గథకుఁడు దెలిపెన్.

## రౌద్రరసము

రౌద్రః క్రోధ స్థాయిభావో రక్తో రక్తాధిదైవతః
ఆలంబనమరిస్తత్ర తచ్చేష్టోద్దీపనం మతం
ముష్టిప్రహారపాతన వికృతచ్ఛేదావదారణైశ్చైవం
సంగ్రామ సంభ్రమాద్యై రస్యోద్దీప్తి ర్భవేత్ప్రౌఢా
భ్రూవిభంగౌష్ఠనిర్దంశ బాహుస్ఫోటనతర్జనాః
ఆత్మావదాన కథనమాయుధోత్క్షేపణాని చ
ఉగ్రతావేగరోమాంచ స్వేదవేపథవో మదః
అనుభావా స్తథాక్షేప క్రూరసందర్శనాదయః
మోహామర్షాదయ స్తత్ర భావాఃస్యుర్వ్యభిచారిణః.

రౌద్రమనగ, గోధము స్థాయిభావము, రక్తవర్ణము. రక్తమధిదేవత.(నరస భూపాలీయమున ఘాలాక్షుఁడనెను.) ఆలంబనవిభావము శత్రువు. వాని యపకా రాదిచేష్ట లుద్దీపనవిభావములు. పిడికిటఁ బొడుచుట, నేలమీఁదఁ బడవేయుట,

వికృతముగాఁ జీల్చుట, సంగ్రామమున సంభ్రమించుట మొదలగువానిచే నీరౌద్రము లెస్సగా నుద్దీప్తమగును. భ్రూభంగము, ఓష్ఠనిర్దంశము, బాహుస్ఫోటనము, తర్జనము ఆత్మావదానకథనము, ఆయుధోత్క్షేపణము, ఉగ్రత్వము, ఆవేగము, రోమాంచము, స్వేదము, వేపథువు, మదము, ఆక్షేపము, క్రూరసందర్శనము, అనునవి యనుభావములు. మోహము, అమర్షము, ఉగ్రత, ఆవేగము, మొదలగునవి వ్యభిచారి భావములు.

శా. చిందుల్ త్రొక్కుచు రక్తపూర్ మదుఁగులంజెండాడుచున్ శత్రురా
ట్సందోహంబును, సింహనాదములతోడన్ మాఱుమ్రోఁగందెసల్,
అంపన్నింటను నెందుఁజూచినను నేనై, యుద్ధరంగంబు నె
ల్లం దర్పంబున గుత్తగొని లీలం బెద్ద క్రీడించితిన్.

ఇందు రుస్తుము నాయకుఁడు. సొహ్రాబు ప్రతినాయకుఁడు. సొహ్రాబుయొక్క ప్రతాపశ్రవణ ముద్దీపనవిభావము. భ్రూభంగము, ఓష్ఠనిర్దంశనము, ఆత్మావదాన కథనము, అనునవి యనుభావములు. అమర్షము, ఉగ్రత్వము, అనునవి వ్యభిచారులు.

రౌద్రరసమునకును, వీరరసభేదమగు యుద్ధవీరమునకును భేదమేమి?

"రక్తాస్య నేత్రతా చాత్ర భేదినీ యుద్ధవీరతః."

రౌద్రరసమున కనుభావములు రక్తాస్యత్వము, రక్తనేత్రత్వమును. యుద్ధవీర మున కివి యనుభావములు గావు. ఈ రెంటికిని నాలంబనోద్దీపనవిభావములు సాధారణములే. మరియు ననుభావ వ్యభిచారులంగూడఁ బెక్కు సాధారణములే. అయినను రౌద్రమునకు స్థాయిభావము క్రోధము. రక్తాస్యత్వ రక్తనేత్రత్వము లనుభావములు. యుద్ధవీరమునకు స్థాయిభావ ముత్సాహము. మరియు రౌద్రరసనాయకుఁడు ధీరోద్ధతుఁడు. వీరరసనాయకుఁడు ధీరోదాత్తుఁడు.

## రౌద్రాభాసము

'రౌద్రే గుర్వాదిగతకోపే' గురువులగు పితృ, భ్రాతృ, ముని, సుర, ఆచార్యాదులపైఁ గోపము చూపించినచో రౌద్రాభాసమగును.

మ. కనులన్ నిప్పులురాల, గాత్రముపడంకం దద్దయున్, వీడి క
ర్ణుని, సంకోచముఁబాసి, వింట ములికిన్ మోపెట్టి, వీక్షించు కృ
ష్ణుని లెక్కింపక, వాని ప్రల్లదములన్ రోషించి పెద్దన్నఁ జం
పనిగో! కవ్వడి కాలరుద్రునిగతిం బైపెక్కి నేతెంచెడిన్.

## వీరరసము

ఉత్తమప్రకృతిర్వీర ఉత్సాహ స్థాయిభావకః
మహేంద్రదైవతో హేమవర్ణోఽయం సముదాహృతః
ప్రతినేతృ తదుత్కర్షాలంబనోద్దీపనాన్వితః
చాతుర్యామంత్రణస్థైర్య ప్రసాదాద్యనుభావభూః
క్రోధాభిమానహాస ప్రముఖవ్యభిచారిభిః పుష్టః
స చ దానధర్మయుద్ధైర్దయయా చ సమన్వితశ్చతుర్థాస్యాత్.

వీరరస ముత్తమనాయకము. దీనికి స్థాయిభావ ముత్సాహము. దీని కధిదేవత యింద్రుఁడు. వర్ణము హేమవర్ణము. (గోమేధికవర్ణమని నరసభూపాలీయము.) ప్రతినాయకుఁ డాలంబనవిభావము. వాని యుత్కర్ష యుద్దీపనవిభావము. చాతుర్యము, ఆమంత్రణము (మిత్రులతో నాలోచించుట) స్థైర్యము, ప్రసాదము (ప్రసన్నత యనఁగా నలజడినిఁ బొందకుండుట) మొదలగునవి యనుభావములు. క్రోధము, అభిమానము, హాసః మొదలగునవి వ్యభిచారిభావములు. (ఈ వీరమున రౌద్రస్థాయి యగు క్రోధము, హాస్యస్థాయి యగు హాసమును వ్యభిచారులగును.) ఈ వీరము దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము, దయావీరము, అని నాలుగు విధములు.

### దానవీరము

కం. అనవుడు భూవరుఁ డిట్లనె;
మునులారా! నా శరీరమునఁ గల్గునెడఁ గా
జనములకు మేలు, గావల
సినదున్నదె? యింతకన్న శ్రేయముగలదే?

కం. మున్ను దధీచి యొసంగెను
వెన్నెముక నటంచు నేను విన్నది మొదలా
తెన్నునఁ బోనుంటిని నా
పున్నెము ఫలియించె మనసుమునీఁగొం బ్రీతిఁగా.

కం. అని యపుడు పిలిచి వైద్యులఁ
దనమొదలినిఁ గోసి రక్తధారలు, మాంసం
బును, వలసినంత యిమ్మని
యనవద్యచరిత్రుఁడాతఁ డాభాషించెన్,

మైత్రీబలుఁడను రాజు దన యొడలినిఁ గోసి మాంసమును దానము చేసెను. ఇట స్థాయిభావము దానమున కుత్సాహము. దధీచ్యాదుల దానము లుద్దీపనవిభావములు. స్థైర్యము, ప్రసాదము మొదలగునవి యనుభావములు. వీనిచే నుత్సాహము పుష్టమై దానవీరమయ్యెను.

## ధర్మవీరము

స్నేహం దయాం చ కీర్తిం చ యదివా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా.

స్నేహముగానీ దయనుగానీ కీర్తినిఁగానీ యవసరపడినచో జానకినిఁగాని లోకారాధనకై విడుచుటకు వెనుదీయను. ఇట శ్రీరాముఁడు ధర్మవీరుఁడు.

## యుద్ధవీరము

శా. మీరల్ విప్రుల; రేము శూద్రులము స్వామీ! మీ పవిత్రాంఘ్రులన్
నీరంధ్రమ్మగు భక్తిఁగొల్తుముగదా నిత్యంబు; చాలింపుఁడీ
పోరాటంబును మాకుఁ జుట్టుకొనునేమో? బ్రహ్మహత్యాఘ; మీ
వీరుల్ కొండలఁబిండిఁగొట్టఁగను బృథ్వింజుట్టఁగా దిట్టరల్.

ఇది నా 'ఖడ్గతిక్కన'లోని పద్యము. ఇందుఁ బిన్నమనాయఁడు యుద్ధవీరుఁడు.

## దయావీరము

కం. తనివోంది నా కృశాంగం
బున నాఁకలిదీతి శాబములఁ బులి తినమా
నునో? లేదో యని పొగులును
ముని తనబాధకులవంబుఁ బొగులఁడెదందన్.

కం. తన యొక్కొక్కవయవమును
దినఁ బులికందించుచుండెఁ దిని యదియును ద్రే
న్చెను లెస్సగ నదివిని యమి
యును గన్నులుమూసెఁ బెద్దయూర్చుచు నెలమిన్.

ఇందు బోధిసత్త్వుఁడు దయావీరుఁడు.

రసగంగాధరకారుఁడు శృంగారమునకువలెనే వీరరసమునకును బెక్కు భేదములు నిరూపింపవచ్చునని 'సత్యవీరము' (హరిశ్చంద్ర నాటకము) అను మరొక భేదమును జూపెను. సత్యము ధర్మభేదముగాదా? ధర్మవీరములోనే సత్యవీరము చేరదా? అని శంకించుకొని యట్లేని దానదయావీరములుగూడ ధర్మవీరాంతర్గతములే

యగును. వానికిఁ బృథగ్గణనమేల? అని సత్యవీరమును స్థాపించెను. ఇట్లే పాండిత్య వీరుఁడు, క్షమావీరుఁడు, బలవీరుఁడు మొదలగువారును గలరు. అనియును దెలిపెను.

## వీరాభాసము

"బ్రహ్మవధాద్యుత్సాహేఽధమపాత్రగతే తథా వీరే"

బ్రహ్మహత్యాదులగు మహాపాతకములను జేయుటయం దుత్సాహమును జూపుటయు, నధమపాత్రగతముగా వీరమును జూపించుటయు వీరాభాసమగును.

గీ. దైవతారాధనంబుల ధ్వంసపఱచి
సరవి విప్రుల దుంపనాశంబొనర్తు
కాలు దండంబునకు రుద్రు శూలమునకు
నింద్రు వజ్రాయుధమునకు నేను వెఱవ.

ఇందు దేవబ్రాహ్మణ వధోత్సాహము గాన వీరాభాసము.

## భయానకరసము

భయానకో భయ స్థాయిభావః కాలాధిదైవతః
స్త్రీ నీచప్రకృతిః కృష్ణో మత స్తత్త్వవిశారదైః
యస్మా దుత్పద్యతే భీతి స్తదత్రాలంబనం మతం
చేష్టా ఘోరతరా స్తస్య భవే దుద్దీపనం పునః
అనుభావాస్తు వైవర్ణ్య గద్గదస్వర భాషణం
ప్రళయస్వేద రోమాంచ కంపదిక్ప్రేక్షణాదయః
జుగుప్సావేగసమ్మోహ సంత్రాస గ్లాని దీనతాః
శంకాపస్మారసంభ్రాంతి మృత్య్వాద్యా వ్యభిచారిణః

భయానకమునకు భయము స్థాయిభావము. కాలుఁ డధిదేవత. స్త్రీలును, నీచపాత్రులును దీనికి నాయకులు. దీనివర్ణము కృష్ణము (వైడూర్యవర్ణమని నరస భూపాలీయము) దేనివలన భయ ముత్పన్నమగునో యది యాలంబన విభావము. దానియొక్క ఘోరతరమగు చేష్ట లుద్దీపన విభావములు. వైవర్ణ్యము, స్వేదము, రోమాంచము, కంపము, దిక్కులు చూచుట, అనునవి యనుభావములు. జుగుప్స, ఆవేగము, సమ్మోహము, సంత్రాసము, గ్లాని, దీనత, శంక, అపస్మారము, భ్రాంతి, మృత్యువు, మొదలయినవి వ్యభిచారిభావములు.

సీ॥ వీడిన మొలనూలు పెనుకాలి బందమై, పఱచుచుం బఱచుచుం బడెడివారు
చంకలో [illegible] చిన్న చంటిబిడ్డలతో [illegible] [illegible] భ్రాంతి [illegible] [illegible] తిరుగువారు

ఎదు రైనతఱి నెట్లొ యెగిరి గోడలుదాఁటి, పరులయిండులఁ జొరంబడెడువారు దవ్వులఁ గాంచియుఁ గెవ్వున నఱచుచుఁ, బడుచు జాఱుచుఁ జెట్లఁ బ్రాఁకువారు

గీ. సగము సడలిన చీరలు సరుదుకొనుచు
నొకట నాఁగుచు నాఁగుచు నూర్పుకొనుచు
బలమఱుట గాళ్ళు మెలమెల్లఁ బఱచువారు
నయిరి పురకాంత లత్తఱి నాత్మఁగలఁగి

ఇది నా వాసవదత్తులోని పద్యము. నడగిరి యను నేనుఁగు మదించి పట్ట ణముపైఁబడినది. అప్పటి ప్రజల యలజడి యిది. ఇట నడగిరి యాలంబనవిభావము. దానిచేష్ట లుద్దీపన విభావములు. వైవర్ణ్యము, స్వేదము, రోమాంచము, కంపము మొదలగు ననుభావము లాక్షేప్యములు. సంత్రాసము, శంక, భ్రాంతి, ఆవేగము మొదలగునవి వ్యభిచారులు. వీనిచే భయానకము పుష్టమై రస మయినది.

## భయానకాభాసము.

'ఉత్తమపాత్రగతత్వే భయానకే'

భయానకమునకు స్త్రీలును నీచపాత్రలును నాయకులని తెలిపితిమి. అట్లుగాక యా భయానక ముత్తమపాత్రగతమగుచో భయానకాభాసము.

గీ. క్షత్త్రవంశాటవిం గాల్చి కారుచిచ్చు
దండిమగడైన పరశురాముండు రాఁగ
గుండెచెదరంగఁ దడఁబాటుగొనుచుఁ గాళ్ళ
దశరథుఁడు చొచ్చె వెఱచి యంతఃపురంబు

ఇట నుత్తమనాయకుఁడగు దశరథుఁ డంతఃపురమునఁ జొచ్చె ననుటచేఁ బన్నిబద్ధమగు భయానకము భయానకాభాసమగును.

## బీభత్సరసము

జుగుప్సా స్థాయిభావశ్చ బీభత్సః కథ్యతే రసః
నీలవర్ణో మహాకాలదైవతోఽయముదాహృతః
దుర్గంధ మాంస రుధిర మేదాంస్యాలంబనం మతం
తత్రైవకృమిపాతాద్య ముద్దీపన ముదాహృతం
నిష్ఠీవనాస్యవలననేత్ర సంకోచనాదయః
అనుభావాశ్చ మోహాద్యాస్తథా స్యుర్వ్యభిచారిణః

బీభత్సమునకు స్థాయిభావము జుగుప్స. నీలవర్ణము. (ఇందర్నీలవర్ణమని నరస భూపాలీయము) ఆ[illegible] (ఇం[illegible] భూపాలీయము.)

దుర్గంధము, మాంసము, రక్తము, క్రొవ్వు మొదలగునవి యాలంబనవిభావము. అచ్చటి క్రిములుద్దీపనవిభావము. నిష్ఠీవనము, ముఖసంకోచము, కనులు మూసుకొనుట మొదలగునవి యనుభావములు. మోహము, అపస్మారము, ఆవేగము, వ్యాధి, మరణము, మొదలయినవి వ్యభిచారులు.

కం. విఱిగినఁ కాళులఁ, బగిలిన
శిరములఁ, దెగిపడినయట్టి చేతుల, బహుధా
తరిగిన యొడళ్ల నా సం
గరభువి సూనాంగణంబు కరణిం బొలిచెన్.

విఱిగిన కాళులు, పగిలిన శిరములు, దెగిన చేతులు, తరిగిన యొడళ్లు విభావము. ఉద్దీపన విభావములును, నిష్ఠీవనాద్యనుభావములును నాక్షేప్యములు. దీనిచే బీభత్సము పుష్టమై రసమయ్యెను.

## బీభత్సాభాసము

సుందరవస్తువులను గుఱించియు జుగుప్స వహించుట బీభత్సాభాసమగును.

ఆ. వె. ఆవకాయయూట నాతండు నెత్రంచుఁ
బాయసమును జీముగద యటంచుఁ
బులును మూత్రమంచుఁ బొరిపప్పుఁ గ్రొవ్వంచు
మూతిముడిచి యతఁడు పోవుచుండు.

## అద్భుతరసము

అద్భుతో విస్మయ స్థాయిభావో గంధర్వదైవతః
పీతవర్ణో వస్తులోకాతిగమాలంబనం మతం
గుణానాం తస్య మహిమా భవేదుద్దీపనం పునః
స్తంభః స్వేదోఽథరోమాంచ గద్గదస్వర సంభ్రమాః
తథా నేత్రవికాసాద్యా అనుభావాః ప్రకీర్తితాః
వితర్కావేగ సంభ్రాంతి హర్షాద్యా వ్యభిచారిణః.

అద్భుతరసమునకు విస్మయము స్థాయిభావము. గంధర్వుఁ డధిదేవత. (బ్రహ్మ యని నరసభూపాలీయము.) పీతవర్ణము. (పుష్యరాగమని నరసభూపాలీయము.) లోకోత్తరమైన లేక లోకవిలక్షణమైన వస్తువాలంబనవిభావము. దాని గుణము లుద్దీపనవిభావము. స్తంభము, స్వేదము, రోమాంచము, గాద్గద్యము, త్వరపాటు, నేత్రవికాసము మొదలయిన వనుభావములు. వితర్కము, ఆవేగము, ఉన్మాదము, (సంభ్రాంతి) హర్షము, ఔత్సుక్యము మొదలయినవి వ్యభిచారులు.

శా. ఇంతింతై వటుఁడింతయై మరియుఁ దానింతై నభోవీధిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రునికంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు, ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై, సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

లోకవిలక్షణుఁడగు వటువు ఆలంబనవిభావము. దానిగుణము లుద్దీనములు. రోమాంచ గద్గద్యాదు లనుభావము లాక్షేప్యములు. వీనిచే నద్భుతరసము పుష్ట మగుచున్నది.

## అద్భుతాభాసము

అలోకోత్తర వస్తువులను జూచియు విస్మయపడుట యద్భుతాభాసము.

గీ. అతివ బిడ్డఁగనియెనన్న నెట్టులంగనె?
నంచుఁ జెట్టుపండె నన్న నెట్లు
పండెనంచు వాఁడు పరమాద్భుతము నొందుఁ
గనులు పెద్దవిప్పి గగులుగొనును

స్త్రీ శిశువును గనుటయుఁ, జెట్టు పండుటయు లోకోత్తరవిషయములు గావు వానినిఁగాంచి పెద్దగాఁగనులువిప్పి గగుబుపాటునుగొని యెక్కుఁడక్కజపడినాఁడు.

## శాంతరసము

శాంతశ్శమ స్థాయిభావ ఉత్తమప్రకృతిర్మతః
కుందేందుసుందరచ్ఛాయ శ్రీనారాయణ దైవతః
అనిత్యత్వాదినాశేష వస్తునిస్సారతా తుయా
పరమాత్మ స్వరూపం వా తస్యాలంబన మిష్యతే.
పుణ్యాశ్రమ, హరిక్షేత్ర తీర్థరమ్య వనాదయః
మహాపురుషసంగాద్యా స్తథోద్దీపన రూపిణః
అనుభావాశ్చ రోమాంచతోషభూత దయాదయః
నిర్వేదహర్ష స్మృతయ స్తథా వ్యభిచారిణః

శాంతమునకు శమము స్థాయిభావము. అది యుత్తమ నాయకము. శ్వేతవర్ణము, అధిదేవత శ్రీమన్నారాయణుఁడు (బ్రహ్మమని పరిపక్వాలోచనము) జగత్తనిత్య

మని తెలియుటచే సంభవించిన యశేషవస్తునిస్సారత కానీ "సర్వంఖల్విదం బ్రహ్మ" "సత్యజ్ఞానమనంతం బ్రహ్మ" ఇత్యాదికమగు బ్రహ్మస్వరూపముగానీ దీని కాలంబన విభావము. పుణ్యాశ్రమ, హరిక్షేత్ర, తీర్థ, రమ్యవనాదులును, మహాపురుష సాంగత్యాదులును నుద్దీపనవిభావములు. రోమాంచ, సంతోష, భూతదయాదు లనుభావములు. నిర్వేద, హర్ష, స్మృతి, మతి, మొదలయినవి వ్యభిచారిభావములు.

కం॥ విడిది నికుంజాంతరములఁ
బడకశిలాతలములందుఁ, బ్రాశముబిసముల్
మడుఁగులు నారలుకోఁగఁ
గడఁగిరి తపమునకు నియతగతి నాభ్రాతల్

అశేషవస్తు నిస్సారత యాలంబనవిభావము. పుణ్యాశ్రమవన ముద్దీపనవిభావము. రోమాంచాదు లనుభావము లాక్షేప్యములు. వీనిచే నిట స్థాయిభావమగు నిర్వేదము పుష్టమై శాంతరస మగుచున్నది.

## శాంతాభాసము

'శాంతే చ హీననిష్ఠే' హీననిష్ఠమగు శాంతము శాంతాభాసము. శాంత ముత్తమనాయకమని చెప్పితిమి. అట్టిది కానిచో శాంతాభాసము.

కం॥ అనుఁ డిచ్చవచ్చినట్టులు
ననునంత్యజుఁడంచుఁ జూచి నాదేహంబుల్
వినుఁ;డే వచింతు శుద్ధుఁడ
ననుపముఁడను; నొకఁడ; సచ్చిదానందుండన్.

ఇట శాంతము చండాలనిష్ఠమగుట శాంతాభాసము.

---

# కావ్యాలంకార సంగ్రహము

## చతుర్థాశ్వాసము

కం. శ్రీకర ! గభీరగుణ ర
త్నాకర ! కటకాధిరాజహయతతిసేనా
భీకర ! భుజపరితాప
స్వీకృత జయసాంద్ర ! నారసింహ నరేంద్రా !

## దోష ప్రకరణము

గీ. అవధరింపుము దోషంబులను వచింతు
నవియు శబ్దార్థగతములై ద్వివిధములగు
నందుఁ బదవాక్యగతములౌ నరయ శబ్ద
దోషములు; వీనిలోఁ బదదోషతతులు. 2

దోషములు శబ్దదోషములనియు, అర్థదోషములనియు రెండువిధములు. ఇందు శబ్దదోషములు పదగతములు, వాక్యగతములు అని ద్వివిధము. అందుఁ బద దోషము లెవ్వనిన,

సీ. అప్రియుక్తం, బపుష్టార్థంబు, నేయార్థ
మసమర్థకంబు, నిరర్థకంబు,
గ్రామ్యంబు, విగతసంస్కారంబు, గూఢార్థ,
మన్యార్థ, మశ్లీల, మప్రతీత,
మప్రయోజకము, క్లిష్టార్థబంధంబు, సం
దిగ్ధంబు, విపరీత ధీప్రదాయి,
యవిమృష్టతర విధేయాంశంబు, పరుషంబు,
ననఁగఁ గావ్యంబులం దరసిచూడఁ

గీ. పదగతంబులు వెలయు సప్తదశసంఖ్య
గడలుకొన వీని లక్ష్యలక్షణములెల్ల
విస్తరించెదఁ గవితాప్రవీణ సుకవి
నివహ నిరతోపకార నిర్నిద్రభణితి. 3

1. అప్రయుక్తము, 2. అపుష్టము, 3. నేయార్థము, 4. అసమర్థము, 5. నిరర్థకము, 6. గ్రామ్యము, 7. చ్యుతసంస్కారము, 8. గూఢార్థము, 9. అన్యార్థము, 10. అశ్లీలము, 11. అప్రతీతికము, 12. అప్రయోజకము, 13. క్లిష్టము, 14. సందిగ్ధము, 15. విరుద్ధమతికృత్తు, 16. అవిమృష్ట విధేయాంశము, 17. పరుషము (శ్రుతికటువు) అని పదునేడు.

ఈగ్రంథకర్త ప్రపథమమున దోషమన నేమో తెలుపలేదు. సాహిత్యదర్పణమున 'రసాపకర్షకా దోషాః' (రసమును దగ్గించునవి దోషములు) అని దోషలక్షణము గలదు. గ్రుడ్డితనము, కుంటితనము మొదలగునవి శరీరమును వికృతముగాఁ

జేసి దానిమూలమున సౌందర్యమున కపకర్షము గలిగించువిధమున నెల్లవిధములగు దోషములును, గావ్యశరీరమును వికృతముగాఁ జేసి దానిద్వారమున నాత్మభూతమగు రసమును న్యూనపఱచును.

దండి కావ్యాదర్శమున నీదోషమునుగూర్చి చాలఁగఠోరముగా విమర్శించెను.

"తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన ।
స్యాద్వపుస్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగం"

(కావ్యమున నల్పమగుదోషమునుగూడ నుపేక్షింపరాదు. శరీర మెంత సుందరముగా నున్నను చిన్న బొల్లిమచ్చ ( శ్వేతకుష్ఠము ) యున్నచో నసహ్యముగా నుండును) ఇది చాలఁ గఠోరమగు విమర్శయే. ఏలన నేస్వల్పమగు దోషముగూడ లేని కావ్యము వాఙ్మయమున లేదు. మహాకవియగు కాళిదాస గ్రంథములందును దోషములు గలవు. ఈదోషప్రకరణమును ముందుంచుకొని గ్రంథములను విమర్శింపఁ బూనినచో లోకములో నిర్దుష్టమగు కావ్య ముండనేయుండదు. కాళిదాసాది మహాకవుల కావ్యములందు దోషములున్నను దోషములను మించిన గుణములున్నవి. దోషములను మఱపించు రససంపద గలదు. "ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" చంద్రకిరణములలోఁ గళంకము నిమగ్నమైన విధమున నొక దోషము గుణబృందమున నిమగ్నమగును" అని కాళిదాసమహాకవియే చెప్పెను. అతఁడొకవేళఁ దనకావ్యములలో నెవరేని దోషములు చూపింపఁగా నీసూక్తిని వ్యంగ్యముగాఁదెలిపెనేమో?యని నాకు శంక గలుగుచున్నది. కావున ముఖ్యముగా రసభంజకములయిన దోషములను విడనాడవలయును. అలఁతిదోషము లున్నను నా దోషములను పరకుసేయనీయని రసవత్త్వమున్నచోఁ గావ్యము రమణీయముగా నుపాదేయముగానే యుండును.'న్యక్కారో హ్యయమేవ' అనుశ్లోకమున నవిమృష్టవిధేయాంశరూపమగు దోషమున్నను వందలి ధ్వనినిఁబట్టి యది యుత్తమకావ్యమని వెనుకఁ దెలిపియుంటిమిగదా!

వామనుఁడు "గుణవిపర్యయాత్మానో దోషాః" (గుణములుగానివి దోషములు) అని లక్షణమును జెప్పెను. మొదట నతఁడు గుణములను దెలిపి వానికన్న భిన్నములు దోషములని తెలిపెను. కాని గుణవిరుద్ధములే కాక కేవలదోషములును గలవు. అప్రయుక్తాదులు గుణవిపర్యయరూపములు గావుగదా! కావ సాహిత్యదర్పణ లక్షణమే యుక్తమైనది.

వైపద్యమున దోషములు శబ్దదోషములనియు నర్థదోషములనియు ద్వివిధముగాఁ జెప్పఁబడినవి. శబ్దదోషమున శబ్దపరివృత్తిని సహింపని దోషము. అనఁగా

నిందు శబ్దమే దుష్టము. తదర్థబోధకమగు మరియొక శబ్దము నుంచినచో నాదోషము దొలఁగును. అర్థదోషమన శబ్దపరివృత్తిని సహించినదోషము. అనఁగా నాశబ్దమునుదీసి తదర్థబోధకమగు శబ్దాంతరమునుంచినను నాదోషము దొలఁగదు. ఇట నర్థమేదుష్టము.

పైపద్యమున శబ్దదోషములు పదగతములు, వాక్యగతములు, అని విభజించెను. ఈవిధముగా పద, వాక్య, అర్థగతములని దోషములు మూఁడువిధములుగా నీగ్రంథకర్త తెలిపెను. సాహిత్యదర్పణమున "పదే, తదంశే, వాక్యే,ఽర్థే, సంభవంతి రసేఽపియత్" (పదమునఁ, బదాంశమున, వాక్యమున, నర్థమున, రసమునను నాదోషములు సంభవించును) అని విభజింపఁబడి యున్నవి. ప్రతాపరుద్రీయకర్తయు పదాంశ, రస దోషములను దెలుపలేదు. వానినిఁబట్టి నరసభూపాలీయకర్తయుఁ దెలుపలేదు.

ఇవిగాక యెల్లదోషములును నిత్యదోషములనియు, ననిత్యదోషములనియును ద్వివిధము. నిత్యదోషములన నెల్లపుడును దోషములుగానే యుండును. అనిత్యదోషములనఁ గొన్నియెడల నే దోషములు. కొన్నియెడల నవి గుణములే యగును. ఎట్లనఁ 'బరుషము' అను దోషము శృంగారాది రసములలోనే దోషము. రౌద్రాది రసములలో గుణమే యగును. ఈవిషయమునే కావ్యప్రకాశకారుఁ డిట్లు తెలిపెను. "వక్త్రాద్యౌచిత్యవశాద్దోషోఽపి గుణఃక్వచిత్; క్వచిన్నోభౌ" (వక్త, వాచ్య, ప్రబంధములయొక్క యౌచిత్యము ననుసరించి యొకచో దోషము గుణమే యగును; ఒకచో దోషమును గాదు గుణమును గాదు.) దీనినిఁ బట్టియే నిత్యానిత్యవ్యవస్థ యేర్పడుచున్నది. ఈ దోషములలోఁ జాలదోషము లనిత్యదోషములే యగును. ముఖ్యములయిన యనిత్యదోషములు చూపఁబడును.

కం. ఈ కవితా దోషోత్కర
మేకడ నీవొసఁగుమాడ్కి నియ్యక ఖలులౌ
నాకఃఅకుఅదాతలకును
నాకుకవులొనర్చు కృతులయందు వసించుశ్.

స్పష్టము.

౧. అప్రయుక్తము

కం. కవులు ప్రయోగింపని పద
మవనిం దగ నప్రయుక్తమగు నెట్లనన్

ద్రవిణేశైలబిలుం, డలదు
శ్చ్యవనమహాభోగి, ఖేటసంస్తుతుఁ డనఁగన్.　　౫౭

సుప్రసిద్ధములగు పదములనే వాడవలయును. ఎవ్వరును బ్రయోగింపనివియుఁ బ్రయోగించినను ఝటిత్యర్థస్ఫూర్తినిఁ గలిగింపనివియు నగు పదములను గావ్యముల వాడరాదు. ఏలన నట్టిపదములు విలంబముగాఁగాని యర్థస్ఫూర్తినిఁ గలిగింపవు. ఆ యాలస్యము రసప్రతిబంధక మగును. కావ్యమునకు రసము ప్రధానము గావున రసప్రతిబంధకములగు దోషములను బరిత్యజింపవలెను. ఈ యప్రయుక్తదోషములు 'ఆముక్తమాల్యద' యందుఁ బెక్కుగలవు. కావుననే యాగ్రంథ మితరగ్రంథముల వలెఁ ద్వరగా బోధపడదు.

ఈపద్యమున బిలబిల, దుశ్చ్యవన, ఖేట, శబ్దము లప్రయుక్తదోషములుగాఁ జెప్పఁబడినవి. ఇట్లే 'లక్ష్మ్య'మను నర్థమున 'లక్ష్మ' శబ్ద మప్రయుక్తమే. కాన 'లక్ష్మీభూత' మనవలెఁగాని లక్ష్మీభూత మనరాదు.

ఇది యనిత్యదోషము. ఎట్లన శ్లేషాదులం దప్రయుక్తదోషము దోషముగాదు.

## ౨. అపుష్టార్థము

కం. ఎనయఁ బ్రకృతోపయోగం
బును జెందకయున్న పద మపుష్టార్థంబౌఁ;
దునిమెను వింశత్యర్థా
ననుఁ, వింశత్యర్థరథుని నందనుఁడనఁగన్.　　౬౮

ప్రకృతమున కుపయోగింపని పద మపుష్టము. "దశాననుఁ" డనుటకు 'వింశత్యర్ధాననుఁడనియు, 'దశరథుఁడ'నుటకు 'వింశత్యర్ధరథుఁడు' అనుటయు నపుష్టదోషములు. అర్థపుష్టిలేని పదము లపుష్టార్థములు.

దర్పణకార, ప్రకాశకారులు దీని నర్థదోషముగాఁ బరిగణించిరి. అదియే న్యాయ్యము.

## ౩. నేయార్థము

కం. ఇలఁ దన సంకేతంబున
నిలిపినపద మెంచిచూడ నేయార్థంబౌఁ;
బలుదేనెదిండిగమినగు
నలసాగరశర యూన యాలకలనంగన్.　　౬౯

సుప్రసిద్ధమగు సంకేతార్థమునందుఁగాక కవి కల్పించుకొన్న సంకేతమునందుఁ బ్రయుక్తమైన శబ్దము నేయార్థకము. 'సాగరకర్ణయాన' అనునెడ (సాగర=(ఏనుఁగు చెవియందలి) మదము; కర్ణ=చెవులలోఁగల యనఁగా గజముయొక్క యానమువంటి యానముగల స్త్రీ) "సాగరకర్ణ" శబ్దమునకుఁ గవి 'గజ' మని సంకేతము గల్పించుకొనెను. ఇది సుప్రసిద్ధముగాదు. కావున నేయార్థకము అని గ్రంథకర్తయుద్దేశము.

ఇట లక్ష్య లక్షణములు రెండును సరిగావు. ఏలన నేయార్థమన "రూఢి ప్రయోజనములులేకయుఁ గవి స్వేచ్ఛగాఁ గల్పించుకొన్న లక్ష్యార్థము" రూఢియో ప్రయోజనమో యున్నఁగాని లక్షణ వర్తిల్లదని మున్ను దెలిపితిమి. అట్టి రూఢి ప్రయోజనములను లెక్కింపక కవి స్వతంత్రముగాఁ గల్పించుకొన్న లక్ష్యార్థము నేయార్థము. ఎట్లన " చందమామఁదన్ను సతిమొంగంబు " అనునెడఁ 'దన్ను' నన జయించునని లక్ష్యార్థము. మొగము ఎట్లు తన్నును? కావున ముఖ్యార్థబాధ గలిగినది. అప్పుడు లక్షణ చెప్పుకొనవలెను. లక్షణ చెప్పుకొనవలయునన్న రూఢి ప్రయోజనము లుండవలెను. 'తన్ను' ధాతువు 'జయించు' నను నర్థమున రూఢముగాదు. ఇఁకఁ బ్రయోజనమును గానరాదు. (లెస్సగా జయించునని ప్రయోజనము చెప్పుకొనఁ గూడదా? అందురేని నుపమాన మగుటవలన నుత్తమగుణములు గల చంద్రుని, నుపమేయ మగుటచే న్యూనగుణములుగల మొగము దన్ను ననుటచే మర్యాద యొఱుఁగనిదని యర్థమువచ్చి వర్ణ్యమగు మొగమున కపకర్షమే గలుగును.) కాన రూఢి ప్రయోజనములు లేవు. కాన నిది నేయార్థకము. 'సాగరకర్ణయాన' అనుచో 'సాగరకర్ణ' పదము నేయార్థము గాదు. 'సాగరము కర్ణమున గలది' అను వ్యుత్పత్త్యర్థముచే గజమను నర్థమున నాపదము రూఢమే యగుచున్నదిగదా. అయితే యిది సుప్రయుక్తము గాదు. కావున నప్రయుక్తదోషమగును. కావున లక్ష్య లక్షణములు రెండును దుష్టములే.

### ౪. అసమర్థము

కం. ధర నప్రసిద్ధయోగం
బరసి ప్రయోగించుపదమ యసమర్థంబౌ;
శరధర రాజనికేతను
గురుపంకజచక్రహస్తుఁ గొలుతునటన్నన్. ౮

యౌగికార్థమును ననఁగా వ్యుత్పత్త్యర్థమునుబట్టి రెండర్థము లున్నను నిదమును బ్రసిద్ధార్థమునందే యుపయోగింపవలెను. అట్లుగాక యప్రసిద్ధార్థమునఁ బ్రయోగించుట యసమర్థ[illegible] చెప్పితిమి. యౌగి

కార్థమున్నను బద్మరూపార్థమునందే రూఢి. కావున నాయర్థమునఁగాక యితరార్థమునఁ బ్రయోగించినచో నసమర్థదోష మగును. ఈ పద్యమున "శరధర" పదము సముద్రార్థమునను, బంకజపదము శంఖరూపార్థమునను బ్రయోగింపఁబడినవి. ఇవి దోషములు. ఇది నిత్యదోషము.

## ౫. నిరర్థకము లేక అనర్థకము

కం. ఇలఁబదపూరణమాత్రం
బలవడినపదంబు కృతి నిరర్థకమయ్యెన్
దలఁపఁగ, వెలయుచు, లలి, ను
జ్జ్వలమగు నీతనివిలాస సౌష్ఠవమనఁగన్. ౯

పాదపూరణార్థము ప్రయోగింపఁబడు పదము నిరర్థకము. వెలయుచు, లలి, ఉజ్జ్వలము మొదలగునవి నిరర్థకములు. ఆంధ్ర ప్రబంధములలో యతిప్రాసల స్థలమందుఁ బెద్దపెద్దకవులుగూడ నీ నిరర్థకపదదోషములను జేయుదురు.

వామనుఁడు వాక్యాలంకారార్థము ప్రయుక్తమైనచో నీ నిరర్థకపదము దోషము గాదనెను. ఎట్లన

చ. తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాస్థలంబులం
బలుకకరాకురోరి! పలుమాలు పిశాచపుఁబాడకట్టె! నీ
పలికిననోట దుమ్ముపడ! భావ్యమెఱుంగక పెద్దలైనవా
రల నిరసింతురా! ప్రగడరాణ్ణరసా! విరసా! తుసా! బుసా!

ఇట తుసా, బుసా, శబ్దములు నిరర్థకములేయయినను వాక్యాలంకారమునకై ప్రయుక్తము లయినవి. కాన దోషము గాదు. గుణమే యగును.

"భూతేంద్ర భారతేశాద్యామహచ్ఛబ్దో నిరర్థకః
దురర్థో బ్రాహ్మణే వృష్టిభోజ్యాపథ పథాదిషు"

మహాభూతము, మహేంద్రుఁడు, మహాభారతము, మహేశుఁడు అను శబ్దములలో నున్న మొదటి మహచ్ఛబ్దము నిరర్థకము. (గొప్పయను నర్థములేదు) మహాబ్రాహ్మణ, మహావృష్టి, మహాభోజ్య, మహాపథ ప్రభృతులలోనున్న మహచ్ఛబ్దము దురర్థకము. అనఁగా నింద్యార్థకము. (మహాబ్రాహ్మణుఁడు=నింద్యుఁడగు బ్రాహ్మణుఁడు మొ) అని యుంటవలన మహాభూతాదులలోని మహచ్ఛబ్దము నిరర్థకదోష దూషిత మగు  మూలైననే నిరర్థ

కము లగును. ఇది యట్టిది గాదు. ఇది వాక్యాలంకారమువలెఁ బదాలంకారముగా గ్రహింపవచ్చును.

ఇట్లే భీమసేన, బలదేవ శబ్దములలోని సేన, దేవ పదములు వ్యర్థములే. వసుంధరా, ధరాధరాది పదములలోని మొదటిపదములును వ్యర్థములే. చూతవృక్షాది శబ్దములలో ద్వితీయపదములును వ్యర్థములే. ఇవన్నియు నిరర్థకదోషములుగా గణింపరాదు. ఇవియుఁ బదాలంకారములుగా గ్రహింపవచ్చును. కాన నిది యనిత్య దోషమే.

## ౬. గ్రామ్యము

కం. పామరులభాష గ్రామ్యము
భామిని కటిగల్లములు విభాసిల్లుననన్
గోమలి చన్నులుఁ, గన్నులుఁ
గామునిపండువు లొనర్చెఁ గడువడిననఁగన్. ౧౦

నాగరకవ్యవహారము దెలియక వినువారికి వైరస్యముగలుగునట్లు మాటలాడు భాష గ్రామ్యము. అసభ్యభాషయని తాత్పర్యము. నాటకాదులందు విదూషకాదులీ భాషను బ్రయోగించినను దగును. అట నది యౌచిత్యమునే కూర్చును. పాత్రౌచిత్యమెఱుఁగక దీనినిఁ బ్రయోగించినచో దోషమే యగును. అధమప్రకృతులు నాయికానాయకు లగుచో నది గుణమే యగును. కాన ననిత్యదోషము. కటి, గల్ల, శబ్దములు ప్రాచీనకాలమున విద్వద్గోష్ఠులందు వ్యవహరింపఁబడెడివి కావు. వానిని పట్టి పామరులే వాడెడివారు. చన్నులు, కన్నులుగూడ నిట్టివేయని గ్రంథకర్త చెప్పెను. అప్పకవి 'కాళ్లు' పదము గ్రామ్యమనెను. కాని సామాన్యముగా నెల్ల కవులును గావ్యములందుఁ గటి, గల్లాదిశబ్దములును, చన్నులు, కన్నులు, కాళ్ళు మొదలయిన శబ్దములను బ్రయోగించుచునేయున్నారు.

## ౭. చ్యుతసంస్కారము

కం. వ్యాకరణదుష్టమగుపద
మేకడఁజ్యుతసంస్కృతాఖ్య; మిదియెట్లన్నన్
శ్రీకమలకాంతపదసే
వాకర్మఠుడనఁగఁ గరుణవారిధియనఁగన్. ౧౧

వ్యాకరణ సంస్కారహీనమైనది చ్యుతసంస్కారము. 'కమలాకాంత' 'కరుణావారిధి' యనియే యనవలెనని యన్నది. వాముసుడు దీని నసాధుదోషమనెను.

“చిరసమేళనకాంక్షావిచిత్రరక్తి” సమ్మేళన మనవలయును, “పావనదీవసాచయము” అచ్ఛికమైన ‘దీవసా’ పదమును సిద్ధసమాసమధ్యమునందుంచుట దోషము. ఒక్క ‘యౌవనుఁడు’ యువకుఁ డనవలెను. “సాంధ్యకాంతావియోగబాష్పములు” ‘సంధ్యాకాంత’ అని యుండవలెను. ఇవన్నియు కవిభూషణ, సాహిత్యస్థాపక, ఉస్మానియా విశ్వవిద్యాలయ, ప్రధానాంధ్రాచార్యులు రాయప్రోలు సుబ్బారావు గారివి. వ్యాకరణశిరోమణి చలమచర్ల రంగాచార్యులవారు అధ్వర్యము, నాయకీ అని ప్రయోగించిరి. ఆధ్వర్యవము, నాయికా అనవలయునుగదా!

౮. గూఢార్థము (నిహతార్థము-అని దర్పణకారాదులు)

౯. అన్యార్థము (అవాచకము)

కం. కృతినఖ్యాతము గూఢం
బతిశయరూఢివ్యపేత మన్యార్థంబై
క్షితిఁదగు; శోణితనయునుం
డతఁడనఁగ సమానుఁడితఁడహిధ్వజుఁడనఁగన్. ౧౨

గూఢార్థమనఁ గావ్యములం దప్రసిద్ధమగు నర్థముగల పదము. రెండర్థములు గల పదమున కప్రసిద్ధమగు నర్థమునఁ బ్రయోగము గూఢార్థము లేక నిహతార్థము. అసమర్థమునకును దీనికిని భేదమేమన యోగరూఢపదములలో యోగికార్థమునుబట్టి పెక్కర్థములు వచ్చుచున్నను బొత్తిగా నప్రసిద్ధమైన యర్థమునఁ బ్రయోగించుట యసమర్థము. అటఁ బదమునకుఁ బ్రసిద్ధార్థమునుదప్ప నప్రసిద్ధార్థమును బోధింప సామర్థ్యమేలేదు. ఇట ‘శోణితనయనుఁడు’ అనుచో శోణితపదము పంకజాదిపదములవలె యోగరూఢపదము గాదు. ఇది వాచకపదమే. దీనికి నెత్తురు, ఎఱుపు, అను రెండర్థములు బోధించుటకు సామర్థ్య మున్నది. ఉన్నదిగదాయని ‘ఎఱుపు’ అమనర్థమునఁ బ్రయోగింపరాదు. ఏలన నాయర్థ మప్రసిద్ధము. ఇదియే గూఢార్థము లేక నిహతార్థము. ఇది యనిత్యదోషము. శ్లేషాదులం దిది దోషముగాదు. అసమర్థ దోషము. నిత్యదోషము.

అన్యార్థమన రూఢిచ్యుతము. అనఁగా రూఢిలేనిది. ఇదియే అవాచక దోషమనియుఁ జెప్పఁబడును. పైపద్యమున ‘సమానుడు’ అన మానసహితుఁడు అని యర్థము. ఈయర్థమున ‘సమాన’ పద మవాచకము. లేక రూఢిచ్యుతము. అసమర్థమునకును దీనికి [illegible] “సమాన”

పద మట్లు యోగరూఢముగాదు. అది తుల్యార్థమునందే రూఢము. మాపసహితుఁడు అనునర్థమున రూఢముగాదు.

కవిభూషణ రాయప్రోలు సుబ్బారావుగారు "తారాసహస్రమండిత। నారాచము పగిది" అని యాకాశార్థమున నారాచపదమును బ్రయోగించిరి. ఇది యవాచక దోషము.

## ౧౦. అశ్లీలము

కం. వ్రీడ, జుగుప్సా౽మంగళ
శీలములగు పదము లొకటఁ జేర్చిన యవియ
శ్లీలములగుఁ గృతి నేతి
న్మూర్మ్యలములగు త్రివిధభేదముల నెఱిఁగింతున్. ౧౩

వ్రీడాకరము, జుగుప్సాకరము, అమంగళశంకాకరము, అని యశ్లీలము త్రివిధము. అయితే యశ్లీలమన నేమో లక్షణము చెప్పఁబడలేదు. వామనుఁడు "అసభ్యార్థాంతర మసభ్యస్మృతి హేతుశ్చాశ్లీలం" ఒకపదమున కనేకార్థములుండ నొక యర్థ మసభ్యముగా నుండినను, సభ్యార్థవాచకమైనను నేకదేశద్వారమున నసభ్యార్థమును స్మరింపఁజేయుచున్నను, అట్టిదోష మశ్లీలమనెను. "శ్రీః అస్య అస్తి" (దీనికి వినఁగా దీనిని వినుటచే శ్రీ లేక యశోభనము గలుగును) అను వ్యుత్పత్త్యర్థమున "కండూరస్య అస్తీతి కండూలః" అన్నచోటనువలె మత్వర్థీయ "ల" ప్రత్యయమును బృషోదరాది పాఠమున 'శ్రీ' యొక్క రేఫమునకు 'ల' కారమునువచ్చి 'అశ్లీల' పద మేర్పడినది.

'వర్చః' అనుపదమునకుఁ 'దేజము', 'విష్ఠ', (మలము) అనియు నర్థద్వయము గలదు. ఇందొక యర్థ మసభ్యము. ఇట్లే 'బుల్లి' పదమున కాంధ్రభాషలో చిన్న అను నర్థమును, పురుషచిహ్నము అనునర్థమును గలవు. ఇందు రెండవయర్థ మసభ్యము. 'కృకాటికా' ఇం దేకదేశమగు 'కాటి' పదము శ్మశానార్థమును బోధించుచు నసభ్యస్మృతిహేతు వగుచున్నది. ఇట్లే 'గుద్దలి' పదములోని 'గుద్ద' పద మసభ్యస్మృతిహేతువగుచున్నది.

కం. వసుదేవ యోషిగోపీ
విసరమహాపీనకుచనవీనాశ్లేషో
ల్లసితుండనఁ గాలిందీ
రసవిహారణకరణనిత్యరసికుఁడనఁగన్. ౧౪

ఇట యోని, మహాపీన, కాలింది, అను పదములు క్రమముగా వ్రీడా, జుగుప్సా, అమంగళశంకాకరములు. మరియు నిట 'పీవి, అను వర్ణద్వయము 'పీయి, అను జుగుప్సార్థమును స్మరింపఁజేయుచున్నది. కాన నిదియు నశ్లీలదోషమే. ఇట్టిచో 'పీయి, అనుపదమే యుండనక్కఱలేదు, శబ్దములు తత్సజాతీయ వర్ణములుగల శబ్దాంతరమును స్మరింపఁజేయుచుఁ దన్మూలమున నర్థాంతరమును వ్యంగ్యమొనర్చునని చెప్పియుంటిమిగదా! ఇట్లే 'చకాసేపనస్రపాఠ్యైః, అనుచో 'సేప, అను నక్షర ద్వయము 'శేఫ, అనుపదమును స్మరింపఁజేసి వ్రీడాకర మగుచున్నదిగదా! మరియుఁ గొన్నియెడల సంధివశమున నశ్లీలార్థము దోఁచును. ఎట్లన నీచుల్లిపాయ (నీచు + ఉల్లిపాయ) మోమడ్డంబు గదల్చె (మోము + అడ్డము). ఇవియును వ్రీడాకరములే. కాన నివియును త్యాజ్యములే.

వామనుఁడు అశ్లీలదోషమున కపవాదముగా "నగుప్తలక్షిత సంవృతాని" (గుప్తము, లక్షితము, సంవృతము నగునది యశ్లీలమయినను దోషముగాదు) అని చెప్పెను. గుప్తమనఁగా నసభ్యార్థము దోఁచుచున్నను నది యప్రసిద్ధముగా నున్నచో దోషముగానేరదు. ఎట్లన "సంబాధ" పదమునకు సంకటము, స్త్రీయోని అను నర్థ ద్వయ మున్నను నసభ్యార్థమునఁ బ్రసిద్ధిలేదు. ఇట్లే 'బెల్లము, పదమునకుఁ బురుష చిహ్నము, గుడము, అను నర్థద్వయమున్నను నసభ్యార్థమునఁ బ్రసిద్ధిలేదు. కాన నిది దోషజుష్టము గాదు. లక్షితమన నొకపదమునకు ముఖ్యార్థముచేఁగాక లక్ష్యార్థముచే నశ్లీలత దోఁచినను నది దోషముగాదు. 'జన్మభూమి, పదము లక్షణచే గుహ్యార్థ మును బోధించునుగాని ముఖ్యార్థముచేఁ గాదు. అట్లే యబ్జయోని కమలయోన్యాది పదములును నశ్లీలములుగావు. (కేవల యోనిపద మశ్లీలమే) కాన నిదియు దోష జుష్టముగాదు. సంవృతమన లోకముచే నాదృతమైనది. అనఁగా స్వీకృతమైనది. సుభగా, భగినీ, భగవతీ, ఉపస్థానము, అభిప్రేతము, కుమారీ, దోహదము, శివలిం గము, పుంలింగము, స్త్రీలింగము, త్రికోణము, ప్రజాపతి, చాముండ, కమలము, విమలము, అమలము, పూఁబోఁడి, (విరిబోఁడి మొ.) మొదలగు పదములు లోకా దృతములగుటచే నిందశ్లీల శంకాలేశమును గానరాదు. కావున లోకాదృతమైన శబ్ద మసభ్యముగాదు.

> సంవీతస్య హి లోకేన నదోషాన్వేషణం క్షమం
> శివలింగస్య సంస్థానే కస్యాఽసభ్యత్వవాసనా ?

లోకసమ్మతమగు పదము దుష్టముగాదు. 'శివలింగము, అను పదమున నెవని కసభ్యత్వభావన గలుగును ?

కొన్ని పదము లొకకాలమున నశ్లీలార్థమును బోధించును. మరొకకాలమున బోధింపవు. పూర్వకాలమున 'కుడుచు' పద మశ్లీలార్థమున లేదు. ఇక్కాలమునఁ గలదు. కాన నిది పరిత్యాజ్యమే. కేవలమగు 'కుడుచు' పద మశ్లీలము. కాని 'విందు గుడుచు' మొదలగునెడఁ బదాంతర సంయోగమున నశ్లీలార్థము దోఁచదు. అట్లే బొక్క, తెడ్డు, నాకు, పీఁకు, చీఁకు, పానము మొదలగునవియుఁ బదాంతరసంయోగమున నశ్లీలార్థకములు గాలేవు. ఎట్లన, నక్కలు బొక్కలు వెదకును. కుండకుఁ దగిన తెడ్డు; పండు నాకెను; చెట్టు పీఁకెను; పిల్లవాఁడు తిత్తిఁ జీఁకుచున్నాఁడు ; వాఁడు సురాపానము చేసెను. ఇత్యాదులు లోకాదృతములై యున్నవి. కాన నీ యశ్లీలవిషయమున ముఖ్యముగా లోకాదృతత్వమును గమనింపవలెను.

అశ్లీల మనిత్యదోషము. సురతారంభాదులందును, శాంతరస కథలయందును నది దోషముగాదు. గుణమే యగును.

కం. భగము వికసింపఁజేయుచు
బిగఁబట్టుచు లోనఁజొర నభేద్యంబుగఁ, ద
ప్పగఁద్రోయుచు బెణికించుచు
బిగి లోడలం జుట్టిపట్టి బిట్టలరించెన్.

ఇది సురతగోష్ఠిలో గుణమే యగును.

కం. బలిసిన, నడిమికిఁ జీలిన,
వెలికిలఁబడు కప్పకడుపు వితమునఁ దడియై
యలరెడు సుపస్థఁ గనుఁగొన
నలరుసెరి కృమిదక్క నన్యమగు జంతువిలన్.

కం. తగ మేహనంబుపై స
వ్యగుల్భమిడి దానిపైఁ దడస్యంబిడి గ
ట్టిగఁ గూర్చుండుట యో భ
వ్యగుణా! ముక్తాసనాఖ్యమై పెంపొందున్.

ఇది శాంతకథ కావున నిట్టియెడ గుణమే యగును.

## ౧౧. అప్రతీతికము

కం. అల శాస్త్రపురాణములనె
కల శబ్దం బప్రతీతికంబగుఁ గృతులన్;

దలఁతు వృషాకపిఁ ద్రిజగము
నెలమి నజావృతముఁ జేయు నీశ్వరుఁడనఁగన్. ౧౫

శాస్త్రపురాణములలో మాత్రమే ప్రసిద్ధమై లోకవ్యవహారమునఁ గానిపింపని శబ్ద మప్రతీతికము. వృషాకపి, (శివుడు-విష్ణువు) అజా (మాయ - అజామేకాం లోహిత కృష్ణశుక్లాం బహ్వీం ప్రజాం జనయంతీ సరూపాం) అను శబ్దములు వైదిక శబ్దములు. ఇవి లోకవ్యవహారమునఁ గానరావు. శాస్త్ర పురాణ ప్రసిద్ధములనిచెప్పి వైదికపదముల నేల యుదాహరించె ననవచ్చును. వేదముగూడ శాస్త్రమువంటిదే. రెండును బ్రభుసమ్మితములే. కాన రెండును దుల్యములే. ఇఁకఁ బురాణ ప్రసిద్ధము లనుగూడ నప్రతీతికములనుట యుక్తముగాదు. ఏలన, భాషలో గల శబ్దములలో ముక్కాలుమువ్వీసము మువ్వరక యన్నియుఁ బురాణ ప్రసిద్ధములేకదా ! అవి యప్ర తీతికములగుచో గత్యంతరమేమి? కావ్యప్రకాశ, సాహిత్యదర్పణ, కావ్యాలంకార సూత్రాది గ్రంథములలో శాస్త్రమాత్ర ప్రసిద్ధమగు పదమునే యప్రతీతికముగాఁ దద్గ్రంథకర్తలు పేర్కొనిరి. వారి యుద్దేశము శాస్త్రపారిభాషికపదమే యప్రతీతిక మని. “యత్కించిచ్ఛాస్త్ర పారిభాషిక మిత్యర్థః - ఇతి సారబోధిన్యాం స్పష్టం” అని వామనాచార్యపండితుఁడు తెలిపెను. మరియు వారిచ్చిన యుదాహరణములలో రూపస్కంధ, సాంతరీయక, ప్రభృతి పారిభాషిక పదములేకలవు. కావున వృషాకపి, అజా శబ్దములు రెండునుగూడఁ బారిభాషికపదములు గావు. కాన నవి యప్రతీతిక దోషములు గావు. వృషాకపి, అజా శబ్దములప్రయుక్తములనుట లెస్సను. ప్రతాప రుద్రీయ కర్త ‘మను’ శబ్దమును నప్రతీతికదోషముగా నుదాహరించెను. అదియును బారిభాషికము గాదు. కావున దానినిఁగూడ నప్రయుక్తమనుటయే లెస్స. రూప స్కంధపదము బౌద్ధుల తత్త్వశాస్త్రమునందును, సాంతరీయకపదము తర్కశాస్త్రము నందును బ్రసిద్ధములు.

ఇది యనిత్యదోషము. వక్తయు, బోద్ధయుఁ (ఇరువురును) దత్తచ్ఛాస్త్ర విషయజ్ఞాతలగుచో నప్రతీతికము దోషముగాదు. ఎట్లన,

శా. ప్రాతఃకాలము వాయసంబు ఫణినాపల్యోక్త శాస్త్రంబులోఁ
దాతిజ్ స్థానులు చెప్పఁ జెవ్వియను చందంబొప్పఁ గాకాయనం
జాతుర్యంబలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతంబిచ్చెఁ దుహీ తుహీ యని గృహారామ ప్రదేశంబునన్.

‘తుహాూర్యస్త్రాత జ్ఞస్యతరస్యాం’ అను సూత్రమును దెలిసినవారు వక్తయు బోద్ధయు నగుచో నిట దోషము లేదు. కేవల వక్తయే వైయాకరణుఁ డగుచో

దోషమే. ఇట్లే యితర శాస్త్రములందలి యిట్టి విషయముల కుదాహరణములను దెలిసికొనవలెను.

## ౧౨. అప్రయోజకము

కం. అవిశేషవిధాయకమై
కవిసినపద మప్రయోజకము; భూతివిభా
ధవళితహారసుతుఁ గొలుతును
నవనళినహార ద్విపాస్యు నయముగ ననఁగన్. ౧౬

ప్రయోజనములేని విశేషణ మప్రయోజకమగును. ఇట 'హార' శబ్దమునకు 'భూతివిభాధవళిత' అను విశేషణమును, 'ద్విప' శబ్దమునకు 'నవనళినహార' అను విశేషణమును బ్రయోజన రహితములు. ఇవి యప్రయోజక దోషములు. దర్పణ కార, కావ్యప్రకాశ కారులు దీనిని 'అపుష్టార్థము' అను నర్థదోషముగానే పరిగ ణించిరి. ఈ విశేషణములవలన నర్థపుష్టిలేదు. కాన నపుష్టార్థమనుటయే లెస్స. వెను కటి 'వింశత్యర్థాననుఁడు' మొదలయిన విశేషణములు గూడ నపుష్టార్థములే యని తెలిపితిమి.

## ౧౩. క్లిష్టము

కం. దూరార్థము క్లిష్టంబగు
ధారుణిఁ బవనాశనేంద్ర ధరమకుటాలం
కారమణిజనకవరపు
త్త్రీరమణకుమారరూప దీపితుఁడనఁగన్. ౧౭

క్లిష్టమనఁ గ్లేశయుక్తము. తాత్పర్యము నిర్ణయించు సామగ్రిలేమి విలంబముగా నర్థము ప్రతీతమగుటచేఁ గ్లేశయుక్తము. పవనాశనేంద్రధర = శివునియొక్క మకు టాలంకారమణి = మకుట భూషణమగు చంద్రునియొక్క, జనక = తండ్రి యగు సముద్రునియొక్క; వరపుత్త్రి = శ్రేష్ఠపుత్త్రిక యగు లక్ష్మియొక్క; రమణ = భర్త యగు విష్ణువుయొక్క; కుమార = పుత్త్రుఁడగు మన్మథునియొక్క; రూప = రూపము వంటి రూపముతో; దీపితుఁడు = శోభిల్లువాఁడు.

ఈ యర్థమెంతయుఁ గ్లిష్టముగా నున్నది. ఈ దోషము సమాసగతమే యగు పదదోషము.

## ౧౪. సందిగ్ధము

కం. సందిగ్ధమనఁగఁ జెలఁగును
సందేహాస్పదపదంబు సమరధరిత్రీ
సందీపిత జయశాలివు
రందరనుత విక్రముండు రాముఁడనఁగఁ. ౧౮

అర్థ నిర్ణయమున సందేహమునకుఁ దావిచ్చు పదము సందిగ్ధము. రాముఁడనఁగా శ్రీరాముఁడా? పరశురాముఁడా? యను సందేహము గలుగుచున్నది. కాన సందిగ్ధము.

ఇది యొక ప్రకరణాంతర్గతమగుచో నా ప్రకరణమునుబట్టి నిస్సందిగ్ధముగా నర్థనిర్ణయమగును. కాన నట్టిచో దోషము గానేరదు. ఇట్టిదిగాక ప్రకరణ మధ్యమాననున్నను నర్థనిర్ణయమున సందేహమునకుఁ దావిచ్చినచో నది సందిగ్ధము. ఎట్లన, నీక్రింది ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధానాంధ్రాచార్యుల పద్యరత్నమునుగనుఁడు.

గీ. నిమ్మచెట్టులేఁగొమ్మ పందిళ్ళక్రిందఁ
బుస్తకపుఁ బేటికలను నాహస్తగదిత
చిత్రసూత్రమునందు వసించియున్న
దోయి యిందాఁక మనప్రేమయును సఖుండ!

పుస్తకపుఁబేటి యనఁగాఁ 'బుస్తకముల పెట్టె' యనియా? లేక పుస్తకమను పెట్టె యని రూపకమా? హస్తగదితసూత్ర మనఁగా హస్తముచేత వ్రాసిన చిత్తరువనియా? లేక చిత్రమైన త్రాఁడనియా? లేక చిత్రమగు సూత్రమని రూపకమా? అని సందేహము. ఇటఁ బ్రకరణముగూడ నీ సందిగ్ధార్థమును నిర్ణయింపఁజాలదు.

## ౧౫. విపరీత ధీప్రదము. ('విరుద్ధమతికృత్తు' అని దర్పణకార కావ్యప్రకాశకారాదులు,)

కం. జగతిఁ విరుద్ధమతికర
మగునది విపరీతధీప్రదాఖ్యంబనఁగాఁ
దగుఁగృతుల; నకులహీనుం
దగు నితఁడన నంబికా విటాసక్తుఁడనన్. ౧౯

విరుద్ధాభిప్రాయమును అనఁగా ననుకొన్న యర్థమునకు విరుద్ధమైన యర్థమును గలిగించు పదము విపరీతధీప్రదము. అకులహీనుఁడు (కులహీనుఁడు గానివాఁడు)

అంబికా విటాసక్తుఁడు (అంబికకు విటుఁడగు (పతియగు) శివునియందాసక్తుఁడు) అను పదములు క్రమముగా కులము లేనివాఁడనియు (నవిద్యతే కులం యస్యసః అకులః సచాసౌహీనః అను విగ్రహముచే నీ యర్థము వచ్చును.) తల్లికి మిండఁడగు వానియం దాసక్తుఁడనియు విరుద్ధార్థముల నిచ్చుచున్నవి. ఇది సమాసగతమే యగు పదదోషము.

### ౧౬. అవిమృష్ట విధేయాంశము

కం. అవిమృష్ట విధేయంబగుఁ<br>
    డవిలిన వర్ణ్యాంశ మప్రధానంబైనన్<br>
    నవనవ సంఫుల్లలతాం<br>
    తవసంతము వచ్చె నిపుడు ధరణికనంగన్. ౨౦

“అనువాద్యమనుక్త్వైవ నవిధేయ ముదీరయేత్” (అనువాద్యాంశమును జెప్పకయే విధేయాంశమును జెప్పరాదు.) అని న్యాయము. ప్రధానభూతమగు వర్ణ్యాంశ మప్రధానముగా వర్ణింపఁబడినచో నవిమృష్టవిధేయము. (అవిమృష్టము = ప్రధానముగా నపేక్షింపఁబడని లేక ప్రధానముగా విమర్శింపఁబడని విధేయము = విధేయాంశము గలది. అని వ్యుత్పత్త్యర్థము.) ‘వాఁడు మూర్ఖుఁడు’ అనుచో ‘వాఁడు’ అనువాద్యము లేక ఉద్దేశ్యము; ‘మూర్ఖుఁడు’ విధేయాంశము. ఇట మొదట ననువాద్యమును పిమ్మట విధేయమును గలదు. అట్లుగాక ‘మూర్ఖుఁడువాఁడు’ అన్నచో విధేయాంశము మొదటను, అనువాద్యాంశము తరువాతను వచ్చినవి. ఇది యవిమృష్టవిధేయాంశము. అట్లే “వసంతము నవనవ సంఫుల్లలతాంతము” అన్నచో వసంత మనువాద్యమును నవ ... లతాంతము విధేయము నగును. ఇట నట్లుగాక “నవనవ... లతాంతము వసంతము” అని యున్నది. విధేయము ముందును ననువాద్యము తరువాతను వచ్చినవి. కాన నవిమృష్ట విధేయాంశము.

“స్వర్గగ్రామటికావిలుంఠన వృథోచ్ఛూనైః కిమేభిర్భుజైః” (స్వర్గమను నొక చిన్నపల్లెను గొల్లఁగొట్టుటయందు వృథగా బలిసిన యీ చేతులచే నేమి ప్రయోజనము?) అనుచో ‘భుజముల బలుపు వ్యర్థము.’ అని తేలినది. ఇట పైయర్థము విధేయము. ‘బలుపు, అనువాద్యము లేక ఉద్దేశ్యము. అనువాద్యము ముందును విధేయము పిమ్మటను నుండవలసియుండఁగాఁ గవి తారుమారుగా బ్రయోగించెను. ఇది దోషము.

ఇట్లే ‘వారుపాపులు, అనవలసియుండ ‘బాపులువారు, అన్నచో నీదోషమే. ఇది వాక్యగతము గాదనియుఁ బదగతమే కాని సమాసగతమనియుఁ గొందఱి యభి

ప్రాయము. సమాసగతమే యన్నచో 'పాపులువారు, 'మూర్ఖుడువాడు, మొద లగు తావులలో సమాసములేదు. కావున సమాసగతమేయని నియమింపవీలులేదు.

## ౧౭. పరుషము (దుశ్శ్రవము లేక శ్రుతికటువు)

క०. శ్రుతికటువులైన పదములు
కృతిఁబరుషములనఁగఁ జెలఁగు నిలఁగృధ్రేడ్జా
పతిమూర్ధధృతార్ధోడ్వధి
పతిఁగొల్తు నభీష్టసిద్ధి ఫలమునకనఁగన్.　　౨౧

చెవులకుఁ గఠినముగాఁ దాఁకు పదము పరుషము. 'గృధ్రేడ్జా' ఇత్యాది కము పరుషము.

శ్రుతిదుష్టాదయోదోషా అనిత్యా యేచ దర్శితాః
ధ్వన్యాత్మన్యేవ శృంగారే । తేహేయా ఇత్యుదాహృతాః

'అనిత్యములగు శ్రుతిదుష్టాదిదోషములు ధ్వన్యాత్మభూతమగు శృంగారముననే హేయములు' అని ధ్వనికారుఁడు చెప్పుటచే నీ పరుషరూపదోష మనిత్యము. కోమలపదరచన గల శృంగార, కరుణ, శాంతములలో నిది దోషమగును. కాని రౌద్ర, వీర, భయానక, అద్భుతరసములలో నిది దోషముగాదు. మరియు నట గుణమే యగును.

ఈ గ్రంథకర్త దర్పణకార, ప్రకాశకారాదులు తెలిపిన 'అనుచితార్థ' దోషమును దెలుపలేదు. దాని నిటఁ జూపుదము.

"శూరా అమరతాంయాంతి పశుభూతా రణాధ్వరే" (రణయజ్ఞమునఁ బశు వులై శూరులు దేవత్వమును బొందుచున్నారు.) అనుచో "పశు" శబ్దము పిఱికితన మును వ్యక్తపఱచుచున్నది. ఏలనఁ బశువు(మేఁక)యజ్ఞమున బలాత్కారముగాఁ గట్టి వధింపఁబడుచున్నది. అవి కట్టఁబడునపుడు కాని వధింపఁబడునపుడు గాని తన శక్తి మాదులను బ్రదర్శించుటలేదు. పైఁగాఁ బాఱిపోవ యత్నించును. శూరులు శత్రు వులు దమ్ముఁ బట్టవచ్చినపుడు తుదివఱకును బోరాడి వీరమరణము నొందవలెను. అట్లుగాక పాఱిపోవుట వీరధర్మముగాదు. ఇటఁ బశుత్వారోపణముచే శూరులు పిఱికిపంద లను ననుచితమగు నర్థము వచ్చుచున్నది. కాన నిది యనుచితార్థ రూపదోషము.

దర్పణకార, కావ్యప్రకాశకారులు 'అపుష్టము'ను అర్థదోషముగాఁ బరిగ ణించిరి. ఇతఁడు పదదోషముగా గణించెను. వారప్రయోజక దోషమును దెలుప లేదు. అది అపుష్టార్థమునందే చేరు గణించిరి.

దర్పణకార ప్రకాశకారులు పదదోషములు పదునాఱే తెలిపిరి. ప్రతాప రుద్రీయ కర్తయు భట్టుమూర్తియుఁ బదునేఁడు దెలిపిరి. ఈ పదునేఁడింటిలో వారిచ్చిన 'అనుచితదోషము' లేదు. వారీయని 'అపుష్టదోషమును' వీరిచ్చిరి. మరియు నధికముగా 'అప్రయోజకదోషము' నిచ్చిరి.

దర్పణకారుఁడు నిరర్థకము, అసమర్థము, చ్యుతసంస్కారము, అను మూఁడును గేవల పదదోషములనియు, దుశ్శ్రవ, త్రివిధాశ్లీల, అనుచితార్థ, అప్రయుక్త, గ్రామ్య, అప్రతీతి, సందిగ్ధ, నేయార్థ, నిహతార్థ, అవాచక, క్లిష్ట, విరుద్ధమతి కృత్తు, అవిమృష్ట విధేయాంశము, లను పదుమూఁడును బదవాక్యోభయదోషము లనియు, మరల వీనిలో దుశ్శ్రవ, త్రివిధాశ్లీల, నేయార్థ, నిహతార్థ అవాచకదోష ములు పదాంశమునఁ గూడ సంభవించుననియును జెప్పెను. క్లిష్ట, అవిమృష్టవిధే యాంశ, విరుద్ధమతి కృద్దోషములు సమాసమునందే సంభవించునని కావ్యప్రకాశకా రాదులు దెలిపిరి.

దర్పణకారుఁడిచ్చిన పదాంశదోషముల కుదాహరణములను జూపుదము.

## ౧. పదాంశ దుశ్శ్రవ దోషము

"తద్గచ్ఛ సిద్ధ్యై కురు దేవకార్యం" ఇట 'సిద్ధ్యై' పదముయొక్క యంశమైన 'ద్ధ్యై' వర్ణము శ్రుతి కటువుగా నున్నది.

పద, పదాంశ రూప దుశ్శ్రవ దోషములకు భేదమేమి ? యన్నచో వర్ణ ద్వయము దుశ్శ్రవముగా నున్నచోఁ బదదోషమనియు నేకవర్ణము దుశ్శ్రవముగా నున్నచోఁ బదాంశదోషమనియును బండితుల యభిప్రాయము.

## ౨. పదాంశాశ్లీల దోషము

"పాణిః పల్లవపేలవః" అనుచో 'పేలవ, పదాంశమగు 'పేల' అను వర్ణ ద్వయము 'లాట, భాషయందు వృషణార్థకమై యశ్లీలరూపదోష మగుచున్నది. 'లాట, భాష తెలిసినవారికే యిందలి యశ్లీలత గోచరించును. ఇతరులకుఁ గాదు. ఒక భాషలోని యొకపదము మరొక భాషలో నశ్లీలార్థక మయినంత మాత్రమున దానినిఁ బ్రయోగింపరాదనుట యెట్లు పొసఁగును. అరవభాషలో 'ఆతు, అన గృహ మని యర్థము. ఆంధ్రభాషలో నాపద మశ్లీలార్థకము. కావున నరవభాషలో నీపద మును బ్రయోగింపరాదనుట యెట్లు? అరవవారి కందలి యశ్లీలత యెట్లు గోచరిం చును? కావున సంస్కృతభాషలోనే యీ పదాంశము అశ్లీలార్థమును దెలుపుచు న్నచో నది దోషమగును. కాన నిట "పేలవ" పదములోని పదాంశమగు 'పేల,

యనునది యశ్లీలార్థకముగా మనము గ్రహింపనక్కఱలేదు. ఇఁక దీని కుదాహరణము ‹గుద్దలి› అను పదములోని పదాంశమగు ‹గుద్ద› అనునది. ఇది యాంధ్రభాషలో నశ్లీలార్థకమే. "గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి" ఇత్యాది ప్రయోగములును గలవు. బహుశః ఆకాలమున నది యశ్లీలార్థమున లోకవ్యవహారమునఁ గానరాక యుండవచ్చును. ఈ కాలమున నది యశ్లీలమే.

## 3. పదాంశ నేయార్థక దోషము

"సంగ్రామే నిహతాశ్శూరా వచోవాణత్వమాగతాః" (సంగ్రామమున మరణించిన శూరులు వచోవాణత్వమును (గీర్వాణత్వమును – దేవత్వమును) బొందిరి. ఇట ‹వచోవాణ› శబ్దము గీర్వాణార్థకముగా గల్పింపఁబడినది. కాని యీ యర్థమును బోధింప నాశబ్దమునకు సామర్థ్యములేదు. ఏలన సమస్తమగు ‹గీర్వాణ› శబ్దద్వయమే యాయర్థమునందు రూఢము. వవాచోణ శబ్దమునందలి యేకదేశమగు వచశ్శబ్దముచే ‹గీ› శ్శబ్దమును లక్షింపఁజేయుట నేయార్థము. రూఢిప్రయోజనములలో నేదేని నొకదానినిఁబట్టి లక్ష్యార్థము వచ్చును. ఇట వచోవాణైకదేశనుగు వచశ్శబ్దము ‹గీ›శ్శబ్దమును బోధింప రూఢిప్రయోజనములు రెండును లేవు. నేయార్థమునఁ గవికల్పితార్థము గదా!

## ౪. పదాంశ నిహతార్థదోషము

'ధాతుమత్తాంగిరి ర్ధత్తే', (పర్వతము రజతాదిధాతువులను గలిగియుంటను వహించుచున్నది.) 'మత్తా' శబ్దము 'మదిరాపానమత్తురాలు' అను నర్థముననే ప్రసిద్ధము కాని 'ధాతువులను గలిగియుండుట' "ధాతవః అస్మిన్ సంతీతి ధాతుమాన్ తస్యభావః ధాతుమత్తా" అను నర్థమున నప్రసిద్ధము. ఇటఁ బదైకదేశమగు 'మత్తా' యను వర్ణద్వయమును అప్రసిద్ధమైన యర్థమునఁ బ్రయుక్తమైనది.

## ౫. పదాంశావాచక దోషము

"వర్ణ్యతే కిం మహాసేనో విజేయో యస్య తారకః" (ఎవనిచేఁ దారకాసురుఁడు విజితుఁడయ్యెనో యా మహాసేనుని వర్ణింపవలసిన పని యేమున్నది?) అనునెడ 'విజిత' అనుభూతకాలిక 'క్త' ప్రత్యయార్థమున నర్హాశక్యాద్యర్థ బోధకమగు 'య' ప్రత్యయము(జేయ)ప్రయోగింపఁబడినది. 'య' ప్రత్యయము 'క్త' ప్రత్యయార్థవాచకము గాదు.

## వాక్యదోషములు

సీ. అక్రమంబు, విసంధి, ప్రక్రమభంగంబు,
పునరుక్తియుత, మసంపూర్ణతరము;
వాక్యసంకీర్ణంబు, వ్యాకీర్ణ, మధికప
దంబు, వాచ్యవివర్జితం, బరీతి,
న్యూనోపమం, బధికోపమంబు, సమాప్త
పునరాత్త, మస్థాన ఘనసమాస,
మనియతచ్ఛందంబు, యతిభంగము, పతత్ప్రి
కర్షంబు, భిన్నలింగంబు, భిన్న
గీ. వచన, మక్రియ, సంబంధ వర్జితములు
వాక్యగర్భితమును, నన వాక్యదోష
వితతు లిరువదిరెండయి వినుతిఁగాంచు
వీని లక్షణలక్ష్యముల్ విస్తరింతు. ౨౨

౧. అక్రమము, ౨. విసంధి, 3. ప్రక్రమభంగము, ४. పునరుక్తి, ५. అసంపూర్ణము, ౬. వాక్యసంకీర్ణము, ౭. వ్యాకీర్ణము, ౮. అధికపదము, ౯. వాచ్యవివర్జితము, ౧౦. అరీతికము, ౧౧. న్యూనోపమము, ౧౨. అధికోపమము, ౧౩. సమాప్త పునరాత్తము, ౧४. అస్థానసమాసము, ౧५. అనియతచ్ఛందము, ౧౬. యతిభంగము, ౧౭. పతత్ప్రికర్షము, ౧౮. భిన్నలింగము, ౧౯. భిన్నవచనము, ౨౦. అక్రియము, ౨౧. సంబంధవర్జితము, ౨౨. వాక్యగర్భితము అని వాక్యదోషము లిరువదిరెండు. ప్రతాపరుద్రీయకారుఁడు 'శబ్దహీనము, విసర్గలుప్తము' అను మరి రెండు దోషములను గలిపి యిరువదినాల్గు గణించెను.

దర్పణకారుఁడు దుశ్శ్రవత్వాదులగు పదుమూఁడు దోషములు పదవాక్యోభయ సాధారణములని చెప్పినట్లు తెలిపియుంటిమి. ఈ దోషములు కేవల వాక్యమునందే సంభవించును.

### ౧. అక్రమము

దీనిని విద్యానాథుఁడు క్రమభ్రష్టమనియు, వామనుఁ డపక్రమమనియుఁ వ్యవహరించెను.

కం. క్రమహీన మక్రమంబగు,
సమధికగుణ ... కీర్తి ... వ్యాఖ్యా...

సముదయమునకున్ దినకర
హిమకర కిరణోత్కరంబు లెనయే? యనఁగన్. ౨౩

క్రమమును విడుచుట యక్రమదోషము. "వీని కీర్తి శౌర్యకాంతులకు సూర్య చంద్ర కిరణములు పాటియా?" అనుచోఁ గీర్తికాంతి చంద్రకాంతితో, శౌర్య కాంతి సూర్యకాంతితో సాటియా? యని చెప్పవలసియున్నది. చంద్ర సూర్య కిరణము లనవలసియుండ సూర్య చంద్ర కిరణము లనుట యక్రమ దోషము. ఈ యక్రమదోషము శబ్దార్థభేదములచే ద్వివిధము. ఇది శబ్దాక్రమము.

"తురంగ మథ మాతంగం ప్రయచ్ఛాస్మై మదాలసం" (మదోల్లసిత మగు తురంగమును గానీ మాతంగమును గానీ వీని కిమ్ము.) అనుచోఁ బ్రథానార్థమైన మాతంగమును బ్రథమమునను దురంగమును బిమ్మటను నిర్దేశింపవలసి యుండ నా క్రమము విడువఁబడినది. ఇది యర్థాక్రమము.

దర్పణకార, ప్రకాశకారాదు లీ యక్రమదోషము నీవిధముగా శబ్దాక్రమ, అర్థాక్రమరూపమునఁ దెలుపక "శబ్దము సముచితస్థానమునఁ బ్రయోగింపఁబడక భిన్నస్థానమునఁ బ్రయోగింపఁబడుట" యక్రమదోషమని తెలిపిరి. ఎట్లన,

ద్వయం గతం సంప్రతి శోచనీయతాం సమాగమ ప్రార్థనయా కపాలినః
కలా చ సా కాంతిమతీ కలావత స్త్వ మస్య లోకస్య చ నేత్రకౌముదీ.

అవ:- ఇది కుమారసంభవములోనిది. వటువు పార్వతీదేవితో ననుచున్నాఁడు.

"శివసమాగమమును బ్రార్థించుటవలన రెండు వస్తువులు శోచనీయ స్థితినిఁ బొందుచున్నవి. కలావంతుఁడగు చంద్రుని కాంతిమంతమగు కళయు, లోకనేత్రములకు జంద్రికవగు నీవును. (శోచనీయము లగుచున్నారు.)

ఇట శ్లోకమున "కలా చ త్వం చ" అని 'త్వం' పిమ్మటనే యుంచవలసిన 'చ'కారము 'లోకస్య' పిమ్మట నుంచుట యక్రమదోషము.

## ౨. విసంధి

కం. అవగత లక్షణమును, గ్రా
మ్యపు సంధియుఁ దగ విసంధి యనఁదగు "నరిగె
న్నపరగిరికినిఁ డనంగా
నృపులొప్పుదు రధికగుణ విదితతనంగన్. ౨౪

లక్షణహీనమగు సంధియు ననఁగా విరుద్ధ సంధియు, అపండితులు ప్రయోగించిన సంధియు విసంధి. 'అరిగన్ + అపరగిరి = అరిగన్నపరగిరి' అని నకారమునకు ద్విత్వము వచ్చుటకు లక్షణము గానరాదు. సంస్కృతమున నిట్టి సంధి "సన్నచ్యుతః" అనుచోట్ల సాధువే. కాని యాంధ్రమున "లుక్సంశ్లేషౌ వాచి దుశ్రితస్య" అని యాంధ్ర శబ్దచింతామణి సంశ్లేషమును నిషేధించెను. కాన నిది దోషము. కాని నన్నయభట్టారకుఁడే "అన్నిష్టసఖి" (అన్ + ఇష్టసఖి) అనియు, "సర్వమున్నతని" అని పోతనగారును, పింగళి సూరనాదులును నీ సంధినిఁ బ్రయోగించిరి.

వినిద్రతన్ + అనంగన్ వినిద్రతనంగన్ అని సంధిచేయుటదోషము. ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదని శాస్త్రము. దాన నిది గ్రామ్యపుసంధి. గ్రామ్యులనఁ బామరులు. పామరులు చేయు సంధి యని యర్థము.

ఇట గ్రంథకర్త "అపగతలక్షణమును, గ్రామ్యపుసంధియు" అని విసంధి దోషమును ద్వివిధముగాఁ జెప్పిన ట్లుదాహరణద్వయమువలనఁ గాననగును. కాని గ్రామ్యపుసంధియన్నను నపగతలక్షణసంధియన్నను విరుద్ధసంధియేగదా! "విసంధి యన విరుద్ధసంధి" (వ్యాకరణవిరుద్ధసంధి) యన్నఁ జాలునుగదా! పైఁజూపిన రెండుసంధులును విరుద్ధసంధులేకదా! కావున నీలక్షణము బాగుగాలేదు.

ప్రతాపరుద్రీయమునందలి 'విసంహితో విరూపో వా సంధిర్యస్య విసంధియత్' (సంధిచేయకుంటగాని విరుద్ధసంధ (కర్ణకఠోరమగు సంధి) చేయుటగాని విసంధి) అనులక్షణము దీనికన్న మేలైనది. ఏలన నిట విరుద్ధసంధియన్నఁ గర్ణకఠోరముగాఁ జేయుసంధి అని యర్థము నాతఁడిచ్చెను. ప్రతాపరుద్రీయలక్షణమున కుదాహరణము లివి. 'శార్యాణి ఈనృశాన్యాసన్' ఇట సంధిచేయఁబడలేదు. "పృథ్వ్యైశ్వర్యం క్వ వా గతం" ఇట పృథ్వ్యైశ్వర్యమనుచోటఁ గర్ణకఠోరమగు సంధి చేయఁబడినది.

వామనుఁడు "పదసంధేర్వైరూప్యం, విశ్లేషో, ఽశ్లీలత్వం, కష్టత్వాచ" (సంధియొక్క వైరూప్యమనఁగా (విసంధియనఁగా) విశ్లేషము, అశ్లీలత్వము, కష్టత్వము) అని లక్షణము నుడివెను. విశ్లేషమన సంధిచేయకుంటయే. ఉదా: 'రాముఁడు ఏగుదెంచె; అశ్లీలసంధియన నశ్లీలార్థమును సూచించు సంధి. ఉదా: నీచు + ఉల్లిపాయ=నీచుల్లిపాయ. కష్టత్వమన దుశ్శ్రవత్వము. అదియే కర్ణకఠోరముగా నుండు సంధి. ఉదా: పృథ్వ్యైశ్వర్యము మొ॥ సాహిత్యదర్పణ, కావ్యప్రకాశకారాదు లీ వామనుని భేదములనే స్వీకరించిరి.

## 3. ప్రక్రమ భంగము

ఆ. వె. ప్రక్రమంబువిడువఁ బ్రక్రమభంగంబు
శౌరి, దానవారిఁ, జక్రధారి,
నభవు, నమితవిభవు, ననవద్యచారిత్రు,
విష్ణుఁగొల్తు జిష్ణుఁ, గృష్ణు,ననఁగ.   ౨౫

ప్రారంభించిన మార్గమును విడిచినచోఁ బ్రక్రమభంగము. రెండవపాదమున 'శౌరి దానవారిఁ జక్రధారి' అని 'రి' వర్ణాంతముగా మూఁడు పదములను జెప్పి మూఁడవపాదమున అభవు, అమితవిభవు, అని 'వు, వర్ణాంతములో నారంభించి రెండుపదములనుమాత్రమే చెప్పి నాలవపాదమున 'విష్ణుఁగొల్తుఁ జిష్ణుఁ గృష్ణుననఁగ' అని విశేషణములనడుమఁ 'గొల్తు, పదమునఁ జేర్చుటచే రెండవపాదమున నారంభించిన మార్గము విడువఁబడినది. ఇవ్విధము ప్రక్రమభంగము.

'ఏవ ముక్తో మంత్రిముఖ్యై రావణః ప్రత్యభాషత' (మంత్రులచే నీవిధముగాఁ చెప్పఁబడిన రావణుఁడు ప్రత్యుత్తరించెను.) 'ఉక్తః' అని వచధాతువులో నారంభింపఁబడినపుడు ప్రతివచనముగూడ నా ధాతువులోనే చెప్పవలెను. ఎట్లన'రావణః ప్రత్యవోచత' అని యుండవలెను.

కాని యిట్టి ప్రక్రమభంగదోషములు చేయని కవియే యుండఁడు. కావునఁ బై పద్యమునున్నట్టి దోషములవంటి దోషములు చేయరాదు.

## ४. పునరుక్తి

కం. ఎనయఁగ శబ్దార్థంబులు
పునరుక్తములైన నదియె పునరుక్తియుతం
బనఁదగుఁ; జక్రాంచలమున
దనుజావళిఁ ద్రుంచుఁ జక్రధరుఁ డితఁడనఁగన్.   ౨౬

శబ్దము, అర్థమును మరల నదేవిధమునఁ బ్రయోగింపఁబడినచోఁ బునరుక్తి దోషము. దీనిని దర్పణకారాదులు 'కథితపదము' అనిరి. "చక్రాంచలమునఁ జక్రధరుఁడు దనుజావళినిఁ ద్రుంచును" అన్నచోట 'చక్ర' పద మదే యర్థమునఁ బునరుక్తమైనది.

ఒకానొకచో నీ పునరుక్తిదోషము గుణమే యగును. ఎట్లన,

ఉదేతి సవితా తామ్ర స్తామ్ర ఏవా స్తమేతి చ (తామ్రరూపుఁడై సూర్యుఁడుదయించును తామ్రరూపుఁడై అస్తమించును). ఇట నొకే

యర్థముగల తామ్రశబ్దము పునరుక్తమైనది. అయినను దోషముగాదు. ఏలన, నిట నుద్దేశ్య ప్రతినిర్దేశ్యములు గాన దోషములేదు. ఇట్టిచో 'రక్త ఏవాస్తమేతి చ' అని రెండవపాదమును మార్చితిమేని నర్థాంతరము గాకున్నను నర్థాంతరమువలె భాసించుచుఁ బ్రతినిర్దేశ్య ప్రతీతినిఁ గప్పివేయును. కావున నుద్దేశ్య ప్రతినిర్దేశ్య విషయమునఁ బునరుక్తి దోషము గాదు. గుణమే యగును. మరియు నర్థాంతర సంక్రమిత వాచ్యమునను (కమలాక్షు నర్చించు కరములు కరములు.) బునరుక్తిదోషము గాదు. మరియు,

విషాదే, విస్మయే, హర్షే, దైన్యే, కోపేఽవధారణే
ప్రసాదనేఽనుకంపాయాం ద్విస్త్రిరుక్తం న దుష్యతి.

విషాద, విస్మయ, హర్ష, దైన్య, కోప, అవధారణ, ప్రసాదన, అనుకంపల యందుఁ బునరుక్తి దోషము గాదు. గుణమే యగును.

అయ్యో! అయ్యో! (విషాదము) ఔరౌర (విస్మయము) బళిబళీ (హర్షము) కటకటా (దైన్యము) పో పో (కోపము) వాఁడే వాఁడే (అవధారణము) రమ్ము రమ్ము (ప్రసాదనము) పాపము! పాపము (అనుకంప). ఇట్టియెడఁ బునరుక్తి దోషముగాదు. ఏలన, నాపునరుక్తి విషాదాదివ్యంజక మగుచున్నది. కాన గుణమే యగును.

## ౫. అపూర్ణము

కం. ధరలోఁ గ్రియాన్వయంబుల
సరిపోని దపూర్ణమనఁగ సన్నుతికెక్కున్
నరపతియొసంగ ద్రవ్యముఁ
బరగఁగ నౌదార్యశాలి బహుళము ననఁగన్. ౨౭

సంపూర్ణమగు క్రియాన్వయములు లేనిది 'అపూర్ణము' "నరపతి ద్రవ్యమొసఁగఁగా బహుళముగా నౌదార్యశాలి" అన్నచోఁ గ్రియలేదు. 'అనఁబడును' అని క్రియాపద ముండవలయును. అది లేకున్నచో వాక్య మసంపూర్ణము. ప్రతాపరుద్రీయోదాహరణ మింగిలన్న మేలుగానున్నది. దీనిని దర్పణకార ప్రకాశకారులు దెలుపలేదు.

శైలేష్వస్మాకమావాసో వన్యైస్స్వాచ్ఛ్వసితా వయం
మృగైర్బంధుమతశ్చాస్మాక పశ్యక ధాతా ప్రమోదతాం.

"మా నివాసములు శైలములు; వన్యాహారములో మే మూపిరిగొనియున్నాము. మృగబాంధవులము [illegible]"

ఇట శైలవాసులమును, వన్యవృత్తులమును, మృగబాంధవులమును నగు మమ్ముఁ జూచి విధి ప్రమోదమొందదనియ్యు. అని యుద్దిష్టార్థము. 'చూచుచు' అను శత్రంతము పై శ్లోకవాక్యములో నీవిధముగా నన్వయించుటలేదు. 'మృగైస్సంబంధు మతశ్చాస్మాన్' అనుదానితోనే యాన్వయించుచున్నది. మిగిలిన రెండు వాక్యములలో నన్వయింప కున్నది. కాన నసంపూర్ణము. ఈ నరసభూపాలీయోదాహరణమున నిట్టి యసంపూర్ణత కానరాదు.

## ౬. వాక్యసంకీర్ణము

కం. ఏకడ వాక్యాంతరిత ప
దాకీర్ణము వాక్యకీర్ణమగుఁ "బొగడుదు రీ
భూకాంతుఁడు జనులెల్ల న
నేకగుణాన్వితుఁడటంచు నిలలో" ననఁగన్. ౨౮

వాక్యాంతరపదములతో వాక్యాంతరపదములు సంకీర్ణములగుట వాక్యసంకీర్ణము. ఈభూకాంతుఁ డనేకగుణాన్వితుఁడనుచు నిలలోఁ జనులెల్లఁ బొగడుదురు. ఇట నీ రెండు వాక్యములలోని పదములును సంకీర్ణత నొందినవి. దీనిని దర్పణకారాదులు 'సంకీర్ణ' మనిరి.

## ౭. వ్యాకీర్ణము

కం. భ్రాంతికరంబగు నన్వయ
మెంతయు వ్యాకీర్ణమయ్యె "నిడుఁడు తిలకముం
గుంతలములఁ గాంతలును ల
తాంతంబులు సెనువుఁడివ్వ డలరుననంగన్. ౨౯

'తిలకమును గుంతలముల నిడుఁడు.' అను భ్రాంతికరమగు నన్వయము గలుగు చున్నది. దర్పణకారాదులు దీనిని 'అస్థానపదదోషము' అని పేర్కొనిరి. (స్థానము గాని స్థానమునఁ బదము నుంచుట.)

## ౮. అధికపదము

కం. తలఁపఁగ మిక్కిలి పదములు
గలిగిన యది యధికపదము "కమలారి కళా
కలితవిలాస సముల్లస
దలఘుయశోవిభవ[illegible]ననఁగన్. 30

అర్థమును బోధింపవలసిన పదములకన్న నధికపదములుండుట యధికపద దోషము. ఇందు ''కమలారి కలావిలాసయశశ్శాలి,, అన్నఁ జాలును. బోధింపవలసిన యర్థము వచ్చును. కలితవిలాస, అలఘు, విభవ పదము లధికములు.

'అమృదుశీలపాణి, ఇట శీలపద మధికము, 'పల్లవాకృతి రక్తోష్ఠి' ఇట వాకృతిపద మధికము. 'పల్లవ రక్తోష్ఠి' అన్నఁజాలును. 'వాఁడొకపలుకుఁ బలికెను' ఇటఁ 'బలికెను, అను క్రియాపదముచేతనే గతార్థమగుచుండ మరల 'పలుకు, అని వాడుట యధికము. ఒకానొకచో విశేషణము నుపయోగించుటకై యట్లు ప్రయోగింపవచ్చును. ఎట్లన "వాఁడొక మధురమగు పలుకును పలికెను" ఇట 'మధురము' అను విశేషణము పలుకునకు సేయఁబడినది. ఇది దోషముగాదు. విశేషణములేక యిట్లు ప్రయోగించుట దోషమే. మరియుఁ బ్రబంధములయందుఁ జెప్పఁదగిన విషయమును సంగ్రహముగాఁ జెప్పవలయును. దీని నాంగ్లమున bravity అందురు. కానీ యతివిస్తారముగాఁ జెప్పుటయు నీ యధికపదదోషమే యగును. కొలఁది పదములతో నధికమగు నర్థమును దెలుపవలయును. అట్లు తెలుపుట యొక ప్రతిభాలక్షణము. దాననే రమణీయత్వము గలుగును. తిక్కనయందీ సంగ్రహరూప ప్రతిభ కానవచ్చును. "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం" అను లక్షణమునందలి రమణీయ పదముచేతనే యీయర్థమా స్ఫురించును. కొలఁది పదములతో నధికార్థమును జెప్పుట రమణీయముకాని యతివిస్తారముగాఁ జెప్పుట రమణీయముగాదు గదా! భోజుఁడిద్దానిని 'సంక్షేపము' అను గుణమని చెప్పెను. బట్టుమూర్తి పీఠికాపద్యములలోని ౭౧వ పద్యమున " చోరుని యర్థసంగ్రహమ్ము " అని యీగుణము చోరునియందు గలదని నుడివెను.

విషాదే, విస్మయే, హర్షే, దైన్యే, కోపేఽవధారణే,
ప్రసాదేఽనుకంపాయాం ద్విస్త్రిరుక్తం న దుష్యతి

విషాదమున, విస్మయమున, హర్షమున, దైన్యమునఁ, గోపమున, అవధారణమునఁ, బ్రసాదనమున, అనుకంపయందును, అధికపదము దోషముగాదు. గుణమే యగును. అనఁగా వక్త విషాదాదులతో మాటలాడునపు డధికపదము దోషముగాదు.

విషాదమున 'అయ్యో! అక్కటా! కటకటా!' అని ప్రయోగించును. ఇందు విషాదమును సూచింప నొక్కటే చాలును. మిగిలిన వధికపదములే. కాని యిట దోషముగాదు. ఇట్లే మిగిలిన విస్మయాదులందును గ్రహింపవలెను. మరియు నీవిషాదాదులందుఁ ద్విరుక్తమును దోషముగాదని చెప్పెను.

## ౯. వాచ్యవివర్జితము

ఆ. వె. వాచ్యమూజ్జగింప వాచ్యవివర్దితం
బనఁగ నెగడు "నాజి నభవునైనఁ
దెగడు నతని బాహుదీప్తాసి" యనునెడ
నాజినభవుఁ దెగడు ననుచుఁ బలుక. ౩౧

తప్పక చెప్పవలసినదానిని విడిచివేయుట వాచ్యవివర్జితదోషము. "ఇతని బాహుదీప్తాసి యాజినభవునైనఁ దెగడు" అనవలసియుండ "ఇన" అనుదానిని విడిచి "ఆజి నభవుఁ దెగడు" అని చెప్పినచో దోషము. తప్పక 'ఇన' అనుదానినిఁ జెప్పవలయును. ఈ దోషమును వాచ్యానభిధానమని దర్పణకారుఁడును, అనభిహిత వాచ్యమని ప్రకాశకారుఁడును వాకొనిరి.

## ౧౦. అరీతి

కం. రసమున కనుచితమగు పద
విసర 'మరీతి' యనఁబొల్చు; విటజనహృదయ
గ్రసనాగ్రహగ్రహిళ దృ
ష్టిసమగ్రోదగ్ర మతివ శృంగారమనన్. ౩౨

రసమున కనుచితమగు రీతియున్నచో నరీతిదోషమగును. ఆయువతి యందము విటజన హృదయములను గ్రసించుటయందుఁ బట్టుదలగల చూపులతో సమగ్రమైనది.

ఇట నీ రీతి శృంగారరసమున కనుకూలముగాదు. శృంగారమునకుఁ గోమల పదబంధమును, అసమాసగాని యల్పసమాసగాని యగు రచనయును ననుకూలములు.

మ. తనకున్ నేర్పుచు వీణపాఠమును జెంతన్నొజ్జఁ గూర్చుండి దీ
నిని వాయింపుము! దీనిమీటుము! ననున్ మెచ్చెంతు వేన్ నీకుపా
యని మిత్తున్నని మీటుచున్న తను ముద్దాడంగ మేల్ మేల్; లభిం
చెను మాదొడ్డగురుండు నాకనుచు మించెన్ శిష్య చిన్నవ్వులన్.

ఇట్టి యసమాసమును గోమలబంధమును నగు రచన శృంగారమున కనుకూలము. దీర్ఘసమాసమువలన నర్థము స్ఫుటముగా నవిలంబముగా గోచరింపక రసానుభవమునకుఁ బ్రతిబంధకము గలుగును. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శృంగార వీథిలో ముప్పాతిక మువ్వీసము పద్యము లీదోషదూషితములగును. అందలి పద్యము

లన్నియు దీర్ఘసమాసభూయిష్ఠములై శృంగారరసమునకుఁ బ్రతిబంధకములైయున్నవి. ఇట్లే రౌద్రరసమునకు దీర్ఘసమాసత్వమును, వికటవర్ణత్వమును సముచితములు. ఎట్లన,

శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథన విద్యాపారగుల్ మత్ప్రభుల్
గీర్వాణాకృతు లేవురిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముంగొనుట తథ్యంబెమ్మెయిం గీచకా!

ఈరీతి రౌద్రరసానుకూలము. అసమాసమగు రచన దీని కనుచితము.

చ. ఖలులయి నాఁడు లక్కయిలుగాల్చి, విషాన్నముఁబెట్టి జూదపుం
గొలువుఁ బ్రవేశపెట్టి మహాక్రూరత జీవధనంబులందుఁ జే
దల నొనరించి చాలకది ద్రౌపదిఁగొప్పునుబట్టి యీడ్చి చీ
రల సభనొల్చినట్టి ధృతరాష్ట్రజులేఁ గలంగంగ స్వస్థులే?

ఇట్టి శిథిలమగు రచన రౌద్రమునకుఁ దగదు. మిగిలిన రసములయందుఁగూడఁ బ్రతికూల రచన నూహింపవలెను. ఈ దోషమును దర్పణకారాదులు వర్ణ ప్రతికూలతాదోష మనిరి.

## ౧౧. న్యూనోపమము - ౧౨. అధికోపమము

ఆ. వె. ఉపమ చాలకున్న న్యూనోపమం; బధి
కోపమాఖ్య మధిక ముపమయైన;
హైమవసనుఁడైన హరి మేఘనిభుఁడన
నతివ పల్లవితలతాభయనఁగ. 33

ఉపమానకోటిలోఁ గొఱఁతయున్నచో న్యూనోపమము. అధికమున్నచో నధికోపమము అను దోషములు. "బంగారుచేల గట్టిన కృష్ణుఁడు మెఱుఁగుదీఁగతోఁ గూడిన మేఘునితోఁ దుల్యుఁడు" అన్నచో నుపమానము సరిపడును. కేవలము మేఘనిభుఁడన్నచో నుపమేయకోటిలోని 'బంగారుచేల'కుఁ దగినట్లుపమానకోటిలోఁ బదములేమిఁ గొఱఁత యేర్పడును. కావున న్యూనోపమమగును. "అతివ చిగిరించిన తీఁగవలె నున్నది" అనుచోట 'భూషణములు ధరించిన యతివ' అని యున్నచో నుపమానము సరిపడును. అదిలేమి నుపమానకోటిలోని 'పల్లవిత'పద మధికము. కాన నధికోపమము. దర్పణకారాదు లీ రెంటిని నధికపదత్వ, న్యూనపదత్వ దోషములలోనే చేర్చిరి. 

## ౧౩. సమాప్త పునరాత్తము

కం. క్రమముడిగి మగుడఁబూనిన
సమాప్త పునరాత్తమయ్యె; శాశ్వతు వభవుం
గమలాక్షుఁ, గమలనాభుం,
గమలాపతిఁగొల్తు ముక్తికై విభునఁగఁ. ౩౪

సమాప్తమయిన దానినిఁ దిరిగి పూనుట సమాప్త పునరాత్త దోషము. 'కమలాక్షు...ముక్తికై' అనుచోట వాక్యము సమాప్తమైనది. మరల 'విభునిఁ' అని పేరొకటి దానికి విశేషణాంతరము వేయఁబడినది. ఇది దోషము. ఈవిధముగా వాక్యము సమాప్తమైన పిమ్మట విశేషణాంతరము ప్రయుక్తమైనచోటనే సమాప్త పునరాత్తదోషము. భిన్నమగు వాక్యాంతరమును బ్రయోగించినచో దోషములేదు. దీని కుదాహరణమును బతత్ప్రకర్ష దోషమునఁ జూపుదుము.

## ౧౪. అస్థాన సమాసము

కం. అపద సమాసం బస్థా
నపటుసమాసంబు; "రిపుల ననిఁ దునిమెద నే
నివు"డని వికటభ్రుకుటీ
విపుల క్రోధాంధుఁడయ్యె వీరుండనఁగన్. ౩౫

'రిపులఁ దునిమెద నేను' అనునది వీరుని భాషణము. వాని మాటలయందుఁ గ్రోధము వ్యక్తము గావలయును. (శత్రులను గాలను నేలనురాచెదను. వారిని ఖండించి కాకులకును గ్రద్దలకును వేసెదను' అను నభిప్రాయమును దెలుపు సమాసము నుపయోగింపవలెను.) కాన సమాస మనుచితము. అట సమాసమును వాడక కవి యొక్క భాషణమున (వికట భ్రుకుటీవిపులక్రోధాంధుఁడు) సమాసము ప్రయుక్తమైనది. ఇది యస్థానసమాసము. స్థానముగాని స్థానమున సమాసమును వేయుట. ఈ దోష మొకానొకచో గుణమే యగును.

రక్తాశోక! కృశోదరీ క్వనుగతా త్యక్త్వానురక్తం జనం?
నోదృష్టేతి ముధైవ చాలయసి కిం వాతావధూతం శిరః
ఉత్కంఠా ఘటమానషట్పద ఘటాసంఘట్ట దష్టచ్ఛద
స్తత్పాదాహతిమంతరేణ భవతః పుష్పోద్గమో౽యం కుతః.

రక్తాశోకమా! అనురక్తుఁడగు నన్ను విడిచి నా ప్రియురా లెటుపోయెను? నేను జూడలేదని యేల యూరక (తెలిసియు) వాతావధూతమగు శిరస్సు నాడిం

తువు? ఔత్సుక్యముచే (నీకడకు) వచ్చిన తేంట్ల మొత్తముయొక్క నలుగుడులచేఁ గొట్టఁబడిన చిగురాకులుఁ గలదానవై దాని (నాప్రియురాలి) పాదతాడనము లేక నీవెట్లు చిగురువెట్టుదువు ?

ఇట విప్రలంభమున విరహివాక్యమున దీర్ఘసమాస మనుచితము. కాని తానడిగిన దానినిఁ దెలిసియుఁ జెప్పక యా రక్తాశోకము తల నాడించుచున్నదని విరహి కుపితుఁడైనాఁడు. కావున నా కోపమును వ్యక్తముసేయుటకు దీర్ఘసమాసత్వమును గష్టత్వమును గుణములే యగును. ఈ దీర్ఘసమాసముచే వ్యక్తమైన యంగభూతమగు కోపప్రకర్షముచే నంగి యగు విప్రలంభమున కుత్కర్షమే కలుగును.

మరియు నదీ పర్వతాది వర్ణనములందు సమాస మౌచితముగానే యుండును. ఎట్లన,

శా. ఆ కాంచీనగరంబు వెల్వడి సముద్యత్పూగపున్నాగ రం
భాళం కేళి రసాలసాల సుమనఃపాళీజధూళీ మధూ
ళీకేళీ వరగంధవాహ పృథుకాళీ చంక్రమాలంకృత
క్ష్మాకప్రాంగణ చోళమండల మహాగ్రామంబు లీక్షించుచున్.

శా. ఆవీణాధరుఁ డేఁగి కన్గొనియెఁ బుణ్యఖ్యాత దరోల్లస
ద్దైవ ద్వీపవతీసమత్సర వివాదప్రౌఢిమాసర్గళ
వ్యావల్గత్కర భావభఙ్గలహరికావర్గావృతవ్యోమమున్
గావేరీతటినీలలామము నఘౌఘక్షాళనోద్దామమున్.

మ. బహురత్నద్యుత మేదురోదరదరీ భాగంబులంబొల్చు ని
మ్మహికాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమన్నభోవాహినీ
లహరీ శీతలగంధవాహపరిఖేలన్మంజరీసౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మత్కాంతార సంతానముల్.

ఈ సమాస రచనను గూర్చి చతుర్థాశ్వాసములోని గుణప్రకరణముయొక్క తుదియందుఁ జూడవలెను.

## ౧౫. ఛందోభంగము – ౧౬. యతిభంగము

కం. ఛందము యతియుం దప్పిన
ఛందోయతి భంగములగు సంగతి నితఁడు
కుందేందువిశద యశుఁడై
ముందు [illegible] నరమోదిననన్.

ఇట రెండవపాదమున ఛందోభంగము. కందమున ద్వితీయ పాదాంతవర్ణము గురువై యుండవలెను. ఇట లఘువుగానే యున్నది. నాల్గవపాదమున యతిభంగము, దీనిని దర్పణకార ప్రకాశకారులు దెలుపలేదు. వామనుఁడు దెలిపెను.

సామాన్యముగాఁ గవులు ఛందోభంగదోషమును జేయరు. వ్యాకరణ శిరోమణి చలమచర్ల రంగాచార్యులవారు ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణమున నీ క్రింది పద్యమున ఛందోభంగమును జేసిరి.

గీ. విశ్వవిఖ్యాత కాకతి వీరరుద్ర
నిరతిశయమైన భూమి పాణిగ్రహోత్స
వంబు విని బొటనవ్రేళ్ళఁ బాదపీఠి
ధరణిపతులెల్ల గీఁటిరి తలలువాల్చి.

ఇట మూఁడవపాదమున ఛందోభంగమయినది.

సీ. వాల్మీకి వ్యాసుల వన్నెలుదలుగవే రామభారతసభారామసీమ ? ఇట వాల్మీకి వ్యాసులన్నచో 'కి' గురువై ఛందోభంగమయినది. ఇట్టి దోషము లనఁగాఁ దెలుఁగుపదములలో సంయుక్తాక్షరమునకుఁ బూర్వాక్షరమును గురువు సేయుటయు సంస్కృత పదములలో సంయుక్తాక్షరమునకుఁ బూర్వాక్షరమును లఘువు సేయుటయు వీరి కవిత్వమునఁ దండోపతండములుగాఁ గానవచ్చును.

సంస్కృతభాషలో వ్యస్తపదములలో రేఫ సంయోగమునకుఁ బూర్వాక్షరము క్వాచిత్కముగా లఘువుగా గనఁబడుచున్నది. ఏకపదమునమాత్రము గాదు. ఎట్లన, 'అనువ్రజ్య' చక్రము మొదలగుచోట్ల 'ను చ' వర్ణములు గురువులే. 'అల్పవ్యయేన సుందరి ! గ్రామ్యజనో మృష్టమశ్నాతి' అనుచో 'గ్రా'కుఁ బూర్వాక్షరమగు 'రి' వర్ణము లఘువు. ఇట్టి లఘుత్వము క్వాచిత్కము. అంతేకాని యీయాచార్యులవారివలె నాంధ్రపదములలో సంయుక్తాక్షరమునకుఁ బూర్వాక్షరమును గురువును, సంస్కృతపదములలో లఘువును జేసినవారు గానరారు.

## ౧౬. పతత్ప్రకర్షము

కం. క్షితి నుత్కర్షము తక్కిన
బతత్ప్రకర్షంబు; గవయ భల్లూకమృగీ
వితతవిభేదన గర్వా
యతిసింహాళీల నీ మహాటవి యొప్పెఁగన్. 33

ప్రారంభము నందలి యొత్తుగడ క్రమముగాఁ బడిపోవుట. ఈ పద్యమునఁ బతత్ప్రకర్షదోషములేదు. ఈ క్రింద పద్య ముదాహరణము.

సీ. మంగాల సింగారమంగ్రాల మేలు బంగారు రంగారు లంగాధరించి
దబ్బకాయలఁజూచి యబ్బగారనిపించు గబ్బిగుబ్బలఁ గంచుకంబుఁ దొడిగి
... ... ... ... ... ... ... ... ...

సీ. కమనీయ కింకిణీ ఘంటికా సాహస్ర ఘణఘణ ధ్వనిచేత గగనతగల
దన్యజనాలోకనాభీల తరళోగ్ర కాంచన ధ్వజపతాకలు వెలుంగఁ
బృథునేమి ఘట్టనఁ బృథివిఁ గంపింపంగ వలనొప్పఁ బటుజవాశ్వములఁబూన్చి
నట్టి యున్నతరథం బత్యుగ్రగతి నెక్కి కరసహస్రమున భీకరతరాసి

ఈపద్యములలోని మొదటి పద్యములోని మొదటి పాదమునందలి యెత్తుగడ రెండవపాదమున లేదు. రెండవపద్యమునఁ గ్రమక్రమముగా మూఁడు నాలుగు పాదములలో మరియును బడిపోయినది. కొన్నియెడలఁ బతత్ప్రకర్షము గుణమే యగును. ఎట్లన,

> ప్రాగప్రాప్త నిశుంభశాంభవ ధనుర్ద్వేధావిధావిర్భవ
> త్క్రోధప్రేరిత భీమభార్గవ భుజస్తంభాపవిద్ధః క్షణాత్
> ఉజ్జ్వాలః పరశుర్భవత్వశిథిలస్త్వత్కంఠ పీఠాతిథిః
> యేనానేన జగత్సు ఖండపరశుర్దేవో హరః ఖ్యాప్యతే. (మహావీరచరిత్రము)

శివధనుర్భంగముఁజేసిన శ్రీరామునితోఁ బరశురాముఁడు క్రుద్ధుఁడై యిట్లను చున్నాఁడు. పూర్వ మెప్పుడును భంగమునొందని శివధనుస్సును (నీవు) రెండు తునియలు గావించుటచేఁ బైకుబికిన కోపముచేతఁ బ్రేరితమైన భయంకరుఁడగు భార్గవుని భుజాస్తంభమునుండి చలించిన యీ పరశువు మంటలుగ్రక్కుచు నీ కంఠపీఠమున కతిథియగుఁ గాక. ఈ పరశువుచేత హరుఁడు లోకములలో 'ఖండపరశుఁడు' అను పేరు వహించెను. (హరుఁడు తన పరశువుయొక్క ఖండమును (అవయవమును) దన శిష్యుఁడగు పరశురామునికిచ్చెనని పురాణ ప్రసిద్ధి.)

ఇటఁ గుపితుఁడగు పరశురాముని వచనమున దీర్ఘసమాసమును పరుషవర్ణాడంబరత్వమును దగియున్నవి. ఇందు మొదటి మూఁడుపాదములందును మొదటి యెత్తుగడకు భంగమురాలేదు. నాలవపాదమున నాదీర్ఘసమాస పరుషవర్ణాడంబరత్వములు లేమినిఁ బతత్ప్రకర్షము సంభవించినది. అయితే నాలవపాదమునకు వచ్చునప్పటికిఁ బరశురామునికిఁ దనగురువగు హరునిస్మృతి గలుగుటచేఁ గ్రోధము శాంతిల్లినది. కాన నట మసృణవర్ణబంధమే ప్రయుక్తమైనది. ఈవిధము దోషముగాక గుణమే యగును.

ఇట నాల్గవపాదమున సమాప్తపునరాత్తరూపమగు దోషము లేదా ? యని శంకింపఁ బనిలేదు. వాక్యము సమాప్తమైన పిమ్మట విశేషణాంతరము మాత్రము వేయఁబడినచో సమాప్తపునరాత్తదోషమగును. భిన్నవాక్యమే ప్రయుక్తమగుచో

నీదోషము లేదు. ఇట నాలవపాదమున భిన్నవాక్యమే ప్రయుక్తమైనది కదా! కాన దోషముగాదు.

## ౧౫. భిన్నలింగము. ౧౬. భిన్నవచనము

ఆ. వె. ఉవిదఁబురుషుఁబోల్ప, నొకనిఁ బల్వురఁబోల్ప
భిన్నలింగమనఁగ భిన్నవచన
మనఁగఁజెలఁగు; పింతి వనజారివలె నన
ఖడ్గ మురగవరులకరణి ననఁగ. ३०

స్త్రీనిఁ బురుషునితోఁబోల్చినచో భిన్నలింగదోషము. ఒకరినిఁ బలుమందితో బోల్చినచో భిన్నవచన దోషము. ఇట్లుగాదు చెప్పవలసిన విధము. ఉపమానోపమేయములు భిన్నలింగములలోనున్న భిన్నలింగదోషము. భిన్నవచనములలోనున్న భిన్నవచనదోషమును సంభవించునని చెప్పవలయును. ఎట్లన "తరుణి చంద్రునివలె నున్నది" ఇట నుపమేయమగు తరుణి స్త్రీలింగము. ఉపమానమగు చంద్రుఁడు పుంలింగము. ఇది దోషము. 'తరుణి చంద్రకళవలె నున్నది' అన్నచో దోషము నివృత్తమగును. "ఖడ్గము సర్పములవలె నున్నది" ఉపమేయమగు ,ఖడ్గము, ఏకవచనమున నున్నది. ఉపమానమగు ,సర్పములు, అనుపదము బహువచనమున నున్నది. (ఖడ్గము సర్పమువలె నున్నదన్నచో దోషము తొలఁగును) ఇది దోషము.

కొన్నియెడల నీదోషములు దోషములుగావు. ఈ విషయమున దండి యిట్లు చెప్పుచున్నాఁడు.

"న లింగవచనే భిన్నే న హీనాధికతే అపి ।
ఉపమాదూషణాయాలం యత్రోద్వేగో న ధీమతాం
స్త్రీవ గచ్ఛతి షండోఽయం వక్త్యేషా స్త్రీ పుమానివ।
ప్రాణా ఇవప్రియోఽయంమే విద్యా ధన మివార్జితా
భవానివ మహీపాల! దేవరాజో విరాజతే ।
అలమంశుమతః కక్షామారోఢుం తేజసా నృపః
ఇత్యేవమాది సౌభాగ్యం న జహాత్యేవ జాతుచిత్ ।
అస్తి చ క్వచిదుద్వేగః ప్రయోగే వాగ్విదాంయథా
హంసీవ ధవళశ్చంద్రస్సరాంసీవామలం నభః ।
భర్తృభక్తో భటశ్శ్వేవ ఖద్యోతో భాతి భానువత్
ఈదృశం వర్జ్యతే సద్భిః కారణం తత్ర చింత్యతాం"

ఏ యుపమానము విన్నచోఁ బండితులకు వెగటు గలుఁగదో యట లింగవచన భేదమున్నను న్యూనత్వాధిక్యాదు లున్నను దోషముగాదు. ఎట్లన "ఈకొజ్జావాఁడు స్త్రీవలె నడచును (లింగభేదము) ఈ స్త్రీ పురుషునివలె మాటలాడును. (లింగభేదము) వాకిటఁడు ప్రాణములవలెఁ బ్రియుఁడు (వచనభేదము. సంస్కృతమునఁ బ్రాణశబ్దము నిత్యబహువచనము) విద్య ధనమువలె నార్జింపఁబడినది. (లింగభేదము) ఓరాజా! నీవలె నింద్రుఁడు వెలుఁగును. (ఉపమానగత న్యూనత్వము. అనఁగా న్యూనోపమానము) ఈరాజు తన తేజస్సుచే సూర్యుని చంకలోని కెక్కుట కర్హుఁడు - అనఁగా సూర్యునితోఁ దుల్యుఁడు (ఉపమానగతాధిక్యము) ఇత్యాదులందు సౌభాగ్య మావంతయుఁ దగ్గకున్నది. కొన్నియెడల నున్న యుపమానములు విన్నచోఁ బండితులకు వెగటు దోఁచుచున్నది. ఎట్లనఁ జంద్రుఁడు హంసివలెఁ దెల్లనివాఁడు (లింగభేదము) ఆకాశము సరస్సులవలె నిర్మలము (వచనభేదము) భటుఁడు శ్వానమువలె భర్తృభక్తుఁడు (ఉపమానగత న్యూనత్వము) మిడుఁగురుపుర్వు సూర్యునివలె వెలుఁగును. (ఉపమానగతాధిక్యము) ఇట్టిచో సౌభాగ్య మావంతయును లేదు. కావున లోకప్రసిద్ధియున్నచో లింగవచనాదిభేద మున్నను దోషము లేదు. కావుననే యశస్సును గాంతిగా నుపమించినను బండితుల కుద్వేగము గలుగకున్నది. లోకప్రసిద్ధిలేకున్నచో దోషమేయగును.

## ౨౦. అక్రియము లేక అశరీరము

కం. తుదలఁ గ్రియాశూన్యములగు
పదంబు లశరీరమనఁగ బరగుఁ [?]విభవా
స్పదమగు మధుమాసంబున
బొదలు తరూత్కరము కుసుమపూర్ణమయి యనన్. ౩౯

క్రియాపదములేని వాక్య మశరీరము. 'పొదలు' అను పద మిటఁ గ్రియ కాదు. తద్ధర్మాత్మక విశేషణము. 'పొదలుచున్న తరూత్కరము' అని యర్థము. 'భాసిలును' అను సమాపకక్రియ లుప్తమైనది. దీనిని దర్పణకారాదులు "సాకాంక్షము" అనిరి.

గ్రంథకర్త వెనుకటి 'అపూర్ణము' అను దోషమును, ఈ యశరీరదోషమును దుల్యముగానే యుదాహరించెను. అపూర్ణదోషమునకుఁ బ్రితాపరుద్రీయోదాహరణమే సరియైనదని చూపితిమి.

## ౨౧. సంబంధ వర్జితము

కం. సంబంధ వర్జితంబగు
సంబంధము [illegible]

గంబులు భంగంబులు, సమ
రాంబుధివరతరణి యితని యసిలతయునఁగన్. ४०

ఇష్టమైన సంబంధము లేనిది సంబంధవర్జితము. 'సమరాంబుధివరతరణి' అను సమాసమున గుణీభూతమైన 'సమరాంబుధి'తో కరులు శైలములు, తురంగములు అనువానికి సంబంధముండవలెను. అనఁగా సమరమను నంబుధిలోఁ గరులు శైలములు, తురగములు తరంగములు అసిలతతరణి, అను నన్వయ మిష్టము. ఇట సమరాంబుధి వరతరణి అను సమాసములో 'సమరాంబుధి' గుణీభూతమగుటచే వానితో సంబంధము సంభవింపకున్నది. దీనినే దర్పణకారాదులు 'అభవన్మతయోగము' అనిరి. 'ఇష్టసంబంధము లేనిది' అని యీ పేరికర్థము.

'సమరాంబుధివరతరణి' అని సమాసముఁజేయక 'సమరాంబుధిన్' అని సప్తమ్యంతమును జేసినచో నీ దోషము రాదు.

### ౨౨. వాక్యగర్భితము

కం. నడుమ నొక వాక్యపద్ధతి
తొడరిన నది వాక్యగర్భదోషము "ఖలులౌ
వెడమతులతోడి సంగతి
"కడుహిత మిది నీ" కొనర్పఁగావలదనఁగన్. ४१

ఒక వాక్యమున వేరొకవాక్యమును దూర్చి చెప్పుట వాక్యగర్భిత దోషము. ఇట "ఖలులగు వెడమతులతోడి సంగతి నొనర్పఁగావలదు" అను వాక్యమధ్యమున 'నీకిది కడు హితము' అను వాక్యాంతరము ప్రవేశించినది. ఇది దోషము. దీనిని దర్పణకార ప్రకాశకారాదులు గర్భితమనిరి.

ఈ వాక్యగర్భితదోష మొకానొకచో గుణమే యగును. ఎట్లన,

"భవామ్యపహస్తితరేఖో నిరంకుశోఽథ వివేకరహితోఽపి
స్వప్నేఽపి త్వయి పునః "ప్రతీహి" భక్తిం నప్రస్మరామి"

ఇది యొక భక్తుని ప్రార్థనము. ఓ స్వామీ! నేనపహస్తితరేఖుఁడను (మర్యాదను ద్యజించినవాఁడను) నిరంకుశుఁడను (ఉచ్ఛృంఖలుఁడను) వివేకరహితుఁడను (ధర్మాధర్మ శూన్యుఁడను) స్వప్నమునఁగూడ నీయందు "సత్యముగా నమ్ముము" భక్తిని మఱువను.

ఇటఁగూడ 'ప్రతీహి' (సత్యముగా నమ్ముము) అను వాక్యము "స్వప్నమునఁ గూడ నీయందు భక్తిని మఱవను" అను వాక్యమునఁ జొచ్చినది. అయినను నిట

దోషముగాదు. ఏలన, శపథముచేసి చెప్పుచున్నట్లు దృఢమైన నమ్మకము గలుగుటకై యీ వాక్యాంతర ముద్దేశింపఁబడినది. అంతకుమున్ను మర్యాదలేక యుచ్ఛృంఖలుఁడై వివేకరహితుఁడై ప్రవర్తించినవాఁడు భగవంతునికి దృఢప్రత్యయము గలిగింపవలసి యున్నదిగదా! కావున శపథముచేసి చెప్పుచున్నట్లు తనమాట యెమ్మాటికిని సత్యమని నమ్మించుటకు 'ప్రతీహి' అను వాక్యాంతరమును నడుమఁ బ్రియోగించెను. కావున నిది యిట గుణమే కాని దోషముగాదు. అయితే పై నరసభూపాలీయోదాహరణమగు "ఖలులా। వెడమతుల తోడి సంగతి। కదు హితమిది నీకొనర్పఁగావలదనఁగఁ" అనుచోటమాత్ర మిట్లే సమాధాన మేల చెప్పుకొనరాదు? అని శంకింపవచ్చును. ఇట నట్లు పొసఁగదు. ఏలన, నిటఁ బ్రసిద్ధమగు నర్థమునే యుపదేశించుచున్నాఁడు. ప్రసిద్ధార్థము నుపదేశించునపుడు దాని కుపపత్తులతోఁ బనిలేదు. 'భవామ్యపహస్తిత రేఖః' అను శ్లోకమున నుచ్ఛృంఖలుఁడుగాఁ బ్రవర్తిల్లినవాఁ "డిఁకముందు నీ భక్తిని విస్మరింపను" అని చెప్పునపుడు స్వామికి నమ్మకము పుట్టించుటకై చెప్పవలసిన విధమున నిటఁ జెప్పఁబనిలేదుగదా! కాన నరసభూపాలీయ పద్యమున దోషమే. ఇట్లే

> ఆతఁడు వెంన్ను నున్నతమదాంధత మాపురికేగుదెంచి యా
> పోతరమేమిచెప్ప? ననుఁబూరికిఁ గైకొనకప్సరోవధూ
> వ్రాత నిశాతపాణిరుహవారసలాలన నవ్యపల్లవం
> బై తనరారు నందనమహావనిలో విడియించె నేనలకా.
>
> — ప్రభావతీ ప్రద్యుమ్నము.

మాపురికేగుదెంచి ననుఁ బూరికిఁగైకొనక – అను వాక్యమధ్యమున "ఆపోతరమేమిచెప్ప?" అను వాక్యము చొచ్చినది. ఇది గుణమే. ఏలనఁ దెలియని కృష్ణునికి వజ్రనాభుని దర్పాతిశయమును నింద్రుఁడు బోధించుచున్నాఁడు.

వాక్యసంకీర్ణదోషమున వాక్యమున వాక్యాంతర పదములు ప్రవేశించినవి. ఇట వాక్యమున వాక్యాంతరమే ప్రవేశించును.

ప్రతాపరుద్రీయమున 'శబ్దహీనము, విసర్గలుప్తము' అని మరి రెండు దోషములు గలవు. ఆంధ్రమున వాక్యమున విసర్గలుప్త దోషము సంభవింపదు. కాన దానిని విడువవచ్చును. శబ్దహీనమన శబ్దశాస్త్ర విరుద్ధమైనది. చ్యుతసంస్కారము పదదోషము. శబ్దహీనదోషము వాక్యదోషము. "ఈ రాజసింహుఁడు శూరుఁడు" ఉపమితసమాసమున సామాన్యధర్మ వాచకపదమును బ్రయోగింపరాదు. 'రాజా సింహ ఇవ (శూరః) [illegible] సమాసము.

‘ఈ రాజసింహుఁడు శూరుఁడు’ అనుచో సాధారణధర్మవాచక మగు ‘శూర’ పదము ప్రయోగింపఁబడినది. సాధారణ ధర్మవాచకమును బ్రయోగించినచో సమాసమును జేయక వ్యస్తముగానే యుంచవలెను. ఎట్లన, “ఈ రాజు సింహమువలె శూరుఁడు” కానఁ బైవాక్యము (రాజసింహుఁడు శూరుఁడు) శబ్దహీనదోషగ్రస్తము.

ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణమున వ్యాకరణ శిరోమణి వలపుచర్ల రంగాచార్యులవారీ శబ్దహీనదోషమునకు ‘మేము అడవులపాలై చెడిరి’ అను దాని నుదాహరించిరి. ‘మేము చెడిరి’ అని చిన్నపిల్లలు గూడ మాటలాడరు. ఆచార్యులవారికీ దోషత్త్వ మర్థము కాలేదు. సంస్కృత ప్రతాపరుద్రీయమున ‘న సంశృణుమహే హంత హితమాప్తై ర్నిమంత్రితం’ అని ‘సం’ పూర్వక ‘శ్రు’ ధాతు వాత్మనే పద మగుననియు నత్తతి కర్మవాచకము నుపయోగింపరాదనియు దానినిఁ దెలియక ‘హితం’ అను కర్మవాచక ముపయోగింపఁబడుటచే దోషమనియు నుదాహరింపఁబడినవి. దీనివలన నిది సామాన్య జ్ఞానమునకు గోచరించు దోషముగాదనియు విశేష జ్ఞానమునకు గోచరించు దోషమనియు గుర్తెఱుంగవలెను. కాన ‘న సంశృణుమహే’ ఇత్యాదివంటిది గాదు ‘మేము చెడిరి’ అనునది. కావున వ్యాకరణ శిరోమణిగారి ప్రయోగము ప్రామాదికము.

సాహిత్యదర్పణమున ౨౩ దోషములును, కావ్యప్రకాశమున ౨౧ దోషములును నీయఁబడినవి. సాహిత్యదర్పణమున విసంధిదోష భేదములను మూఁటినిఁ బ్రత్యేకముగాఁ గణించెను. ప్రకాశకారుఁ డొక్కటిగానే గణించెను.

ఇందు లేనివియు దర్పణ, ప్రకాశములలో నున్నవియు నగు మఱి మూఁడు వాక్యదోషములను గూడఁ జూపుదుము.

## ౧. హతవృత్తము

రసానుకూలముగాని వృత్తమును స్వీకరించుట. ఎట్లన,

హా నృప! హా బుధ! హా కవిబంధో! విప్రసహస్ర సమాశ్రయ! దేవ!
ముగ్ధవిదగ్ధ సబాంధవరత్న! క్వాసి గతః క్వవయం చ తవైతే! —

అయ్యో! రాజా! హా పండితా! హా కవిబాంధవ! హా దేవ! నీ వెటనున్నావు? నీ వారమగు మే మెటనున్నారము?

ఒక రాజు మరణింపఁగా నాతని బంధుజాలము దుఃఖించుచున్న ఘట్టము. ఇటఁ గరుణరసము. ఈ దోధకవృత్తము హాస్యరస వ్యంజకము. కరుణముకుఁ దగిన వృత్తములు వియోగినీ మందాక్రాంతా పుష్పితాగ్రాదులు. శృంగారమునకుఁ బృథ్వీ శిఖరిణ్యాదులు. [illegible]

ఆంధ్రమునఁ బూర్వకవు లెవ్వరును నీ వృత్తములకును రసములకు సంబంధమును గలుపలేదు. సామాన్యముగా వీర రౌద్రములకు మత్తేభ శార్దూలములు వాడిరి. కాని శృంగారాదులకుఁ గూడ నావృత్తములను వాడిరి. మొత్తముమీఁద నాంధ్రమున రసనియమము లేకుండనే వృత్తములను వాడిరి. కాని పై యుదాహరణమునవలెఁ గరుణాదులలో హాస్యాది విరుద్ధ రసవ్యంజకములగు వృత్తములను వాడి రసదోషమును జేయులేదు. ఏలనఁ గవులెల్లరును గ్వాచిత్కముగా భుజంగప్రయాతము, పృథ్వీవృత్తము మొదలగువానిని వాడినను నత్యధికముగా ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము, కందము, గీతము, ఆటవెలఁది, సీసము, అను నీ యెనిమిది వృత్తములనే వాడిరి. వీనిలో రసభంగ మొనర్చు వృత్తములు లేవు.

## ౨. ప్రసిద్ధి త్యాగము (ప్రసిద్ధి హతము)

"మంజీరాదిషు రణితప్రాయం పక్షిషు చ కూజిత ప్రభృతి
స్తనితమణితాది సురతే మేఘాదిషు చ గర్జిత ప్రముఖం"

మంజీర వలయాది భూషణ ధ్వనికి రణితమునియు, పక్షులధ్వనికిఁ గూజితమనియు, సురతధ్వనికి స్తనిత మణితములనియు, మేఘ సింహధ్వనికి గర్జితమనియును లోకప్రసిద్ధి. ఇట్లే రశనా వీణాది ధ్వనికిఁ గ్వణితము, ఘంటా నూపురాది ధ్వనికి శింజితము, భ్రమరధ్వనికి గుంజితము, మండూకధ్వనికి రవము, సముద్రధ్వనికి ఘోషము, మృదంగాదులధ్వనికి ధ్వనితము, గజధ్వనికి ఘీంకారము, బృంహితము, తురగధ్వనికి హేషితము, పటహధ్వనికారవము, వృషభధ్వనికి డేత్కారము, సర్పధ్వనికి ఫూత్కారము, కపిధ్వనికి బూత్కారము, ఘూకధ్వనికి ఘూత్కారము, అగ్నిస్ఫులింగధ్వనికి చటత్కారము, భంగధ్వనికి (చెట్లు మొదలగువాని విఱుగునప్పటి చప్పుడు) కటత్కారము, బాణధ్వనికి సూత్కారము, ఘుర్ఘురధ్వనికి ఘుమఘుమారవము, భేరీధ్వనికి భాంకారము, మయూరధ్వనికి గేకారవము, క్రేంకారము, కామినీధ్వనికి సీత్కారము, కింకిణీధ్వనికి ఝుంకారము, మౌర్వీధ్వనికి టంకారము, నదీతరంగధ్వనికి ఘోషము అని ప్రసిద్ధి. ఈ ప్రసిద్ధినిఁ బరిత్యజించుట ప్రసిద్ధి త్యాగము.

కాని లోకమునఁ గోకిలారవము, నూపురరవము మొదలగుచోట మండూకధ్వనియందుఁ బ్రసిద్ధమగు రవ శబ్దము ప్రయుక్తమై యున్నది. స్తనిత శబ్దము "స్తనితం గర్జితం మేఘనిర్ఘోషో రసితాది చ" అనుచో మేఘధ్వనిగాఁ బ్రయుక్తమై యున్నది. అట్లే భ్రమరధ్వనికి ఝుంకారమునియు [illegible] గలదు. ఈ ప్రసిద్ధి

త్యాగరూపమగు దోషము సార్వత్రికముగాఁ గవులు గణింపలేదు. మణిత, గర్జిత గుంజితాదులను మాత్రము ప్రసిద్ధమగు నర్థముననే వాడిరి.

ఇట్లే యాంధ్రభాషలోఁగూడఁ బశుపక్ష్యాది ధ్వనులకుఁ బ్రసిద్ధమగు ననుకరణ శబ్దములు గలవు. వానినిఁగూడ నిటఁ జూపుదును.

౧. గప్పలు బెకబెకలాడును; గరరవరట్, కురరవరరగట్ అనును.

౨. పంది గుఱ్ఱువెట్టును; ఘుర్ఘురించును.

౩. సింహము బొబ్బరించును; గర్జించును.

౪. పులి గాండ్రించును.

౫. గుఱ్ఱము సకిలించును.

౬. ఏనుగు ఘీంకరించును; గీవెట్టును.

౭. ఎద్దు ఱంకెవేయును.

౮. గాడిద యోండ్రవెట్టును.

౯. పిల్లి మ్యావుమనును.

౧౦. కుక్క మొఱుగును.

౧౧. కోళ్ళు కేరును; కొక్కొరోకో యనును.

౧౨. కొంగలు కొంగొంగురనును.

౧౩. పాములు బుసకొట్టును.

౧౪. మేక ఱఱచును.

౧౫. ఎలుకలు కిచకిచలాడును; గురగురలాడును.

౧౬. తుమ్మెదలు ఝుమ్మనును.

౧౭. చీమ చిటుక్కుమనును.

౧౮. కోయిల కో కో యనును.

౧౯. చిలుకలు కూయును.

౨౦. గుడ్లగూబ కుహూ కుహూ మనును.

ఇంకను గొన్ని క్రియలకుఁగూడ ననుకరణశబ్దములు గలవు. చూడుఁడు.

నవ్వుట – కికాకిక నవ్వుట, కవకవ నవ్వుట, పకపక నవ్వుట, కిలకిల నవ్వుట, కలకల నవ్వుట, ముసిముసి నవ్వుట, కిచకిచ నవ్వుట, వికవిక, వికావిక నవ్వుట. (విరుద్ధముగా నవ్వుటకు)

అల్లుట – అల్లిబిల్లిగ నల్లుకొనుట, చీకిలిమాకిలిగా నల్లుట.

ఆడుట – అల్లలనాడుట, అలలాడుట, జవజవలాడుట, చెండి చెకపికలాడుట.

గ్రుక్కుట - సురసుర గ్రుక్కుట.

మాఁడుట - మలమల మాడుట.

వేఁగుట - చిటపిట వేఁగుట, పెటపెట వేఁగుట.

మండుట - బగ్గున మండుట.

మ్రోఁగుట - గల్లున మ్రోఁగుట, గలగల మ్రోఁగుట, గుభగుభ మ్రోఁగుట, గణగణ మ్రోఁగుట.

ఏడ్చుట - హోరున నేడ్చుట, కావురని యేడ్చుట, కావుకావురని యేడ్చుట, గొల్లున నేడ్చుట, వలవల యేడ్చుట.

చొచ్చుట - దురదురని చొచ్చుట, దడదడ చొచ్చుట.

పొక్కుట - పురపుర పొక్కుట.

కాలుట - జోటజోట కాలుట.

చినుకు పడుట - చిటచిట చినుకులు వడుట.

రాలుట - జలజల రాలుట, గులగుల రాలుట.

ఉడుకుట - తుకతుక, కుతకుత, తెకతెక యుడుకుట.

కూయుట - కిలకిల, కొలకొల కూయుట.

తెల్లవాఱుట - బల్లున తెల్లవాఱుట, బలబల మని తెల్లవాఱుట.

కొఱుకుట - పటపట కొఱుకుట, పెటపెట కొఱుకుట.

పడుట - గుభాలున పడుట.

చూచుట - చురచుర చూచుట.

చుట్టుకొనుట - ముసముస మని చుట్టుకొనుట.

కొట్టుకొనుట-కటకట కొట్టుకొనుట, పటపట కొట్టుకొనుట, పెటపెటకొట్టుకొనుట.

మెఱయుట - ధగధగ మెఱయుట.

జల్లుమనుట - గుండెలు జల్లుమనుట.

త్రిప్పుట - గిరగిర త్రిప్పుట.

మరుగుట - నీరు కళపెళ మరుగుట.

పొంగుట - బుసబుస పొంగుట.

క్రాఁగుట - సలసల క్రాఁగుట.

జాఱుట - జరజర జాఱుట మొ.

మరికొన్ని శబ్దము లనుకరణములవలె నుండి యర్థవిశేషమును బోధించును. ఎట్లన,

సొంపు సొటసొట [illegible]

చిత్తము వకావకలగు = మనస్సు చెదరు.
మేను నకనకలాడు = మేను కృశించు.
మాటలు తొకతొకలై వెడలుట – మాటలు ఆగిఆగి వచ్చుట.

కొన్నియెడల నా యా వస్తువ్యాపారము లనుకరణముచేఁ జెప్పఁబడును.
కస్తూరి ఘుమఘుమలు; బంగారు నిగనిగలు; మెఱుపుల తళతళలు;
గర్వపు మిటమిటలు; మేని చకచకలు; మొ.

### 3. అమతపరార్థము

ప్రకృత విరుద్ధమగు పరార్థము గల దోషము.

రామ మన్మథశరేణ తాడితా । దుస్సహేన హృదయే నిశాచరీ
గంధవద్రుధిర చందనోక్షితా । జీవితేశ వసతిం జగామ సా.

ఆ నిశాచరి (తాటక) దుస్సహమైన శ్రీరాముఁడను మన్మథునియొక్క బాణముచే హృదయమునఁ గొట్టఁబడినదై వాసనగల చందనమువంటి రక్తముచేఁ దడిసినదై జీవితేశ వసతికి (యమసదనమునకు – ప్రియుని గృహమునకు) వెళ్ళెను.

'తాటక రామబాణముచేఁ గొట్టఁబడినదై యమలోకమునకుఁ బోయెను' అనునది ప్రాకరణికార్థము. అభిసారికా రూపార్థ మప్రాకరణికము. ఇందుఁ బ్రకృతరసమగు బీభత్సమునకు విరుద్ధమగు శృంగారముతో సమావేశము చేయఁబడినది. ఇది దోషము. (విరుద్ధరస సమావేశఘట్టమున నున్న దీని వివరణమును జూడవలెను.)

శృంగార బీభత్సములు, వీర భయానకములు, రౌద్రాద్భుతములు, హాస్య కరుణములును విరుద్ధరసములు. వీనికి సమావేశము గూడదు.

### అర్థ దోషములు.

కం. క్రమమున నిఁక నర్థ దో
షముల నెఱింగింతు సుకవిజనులకు హీనో
పమ, మధికోపమ, మసమో
పమ, మఖ్యాలోపమంబు, పరుషము, మరియున్. ౮౨

గీ. వ్యర్థ, మేకార్థము, ససంశయం, బప్రక
మము, విరుద్ధంబు, విరసా, తిమాత్ర, హేతు
రహిత, నిరలంకృ, తాశ్లీల, సహచరచ్యు
తములును, భిన్నంబు, నన వీని క్రమమునన్ ర్థ. ౮౩

౧. హీనోపమము, ౨. అధికోపమము, ౩. అసమోపమము, ౪. అఖ్యాతోపమము, ౫. పరుషము, ౬. వ్యర్థము, ౭. ఏకార్థము, ౮. ససంశయము, ౯. అపక్రమము, ౧౦. విరుద్ధము, ౧౧. విరసము, ౧౨. అతిమాత్రము, ౧౩. హేతురహితము, ౧౪. నిరలంకృతము, ౧౫. అశ్లీలము, ౧౬. సహచరచ్యుతము, ౧౭. భిన్నము – అని అర్థదోషములు పదునేడు.

## ౧. హీనోపమము – ౨. అధికోపమము

గీ. ఉర్వి ఘను నల్పుఁ బోల్ప హీనోపమంబు
శ్వానమునుబోలె నితఁడు విశ్వాసి యనఁగ;
నరయ నధికోపమంబల్పు నధికుఁబోల్పఁ
బునుకపట్టినపే నీశుఁబోలు ననఁగ. ౪౪

ఘనుని నల్పునితోఁ బోల్చిన హీనోపమము. అల్పుని నధికునితోఁ బోల్చిన నధికోపమము. అంతేకాదు. అనల్పవస్తువు నల్పవస్తువుతోఁ బోల్చిన హీనోపమము. అల్పవస్తువు ననల్పవస్తువుతోఁ బోల్చిన నధికోపమము. అని చెప్పుకొనవలెను.

'ఇతఁడు శ్వానమువలె విశ్వాసి.' శ్వాన మల్పవస్తువు 'ఇతఁడు' అనల్పవస్తువు. ఇది హీనోపమము. "పునుకపట్టిన పేను ఈశ్వరునిఁ బోలును." అనుచో 'పేను' అల్పవస్తువు. 'ఈశ్వరుఁడు' అనల్పవస్తువు. ఇది యధికోపమము.

## ౩. అసమోపమము – ౪. అఖ్యాతోపమము.

గీ. ఉపమ సరివోని దిల నసమోపమంబు
హలధరుఁడు మేరుగిరివోలె నలరుననఁగ
వినుప్రసిద్ధంబుగాని డవిశ్రుతోప
మంబు వదనంబు కుముదంబుమాడ్కి యనఁగ. ౪౫

బొత్తిగాఁ బోలిక కుదరని దసమోపమము. హలధరునకు (బలరామునకు) మేరుగిరితో సామ్యము బొత్తుగా లేదు. ఏలన, బలరాముఁడు తెల్లనివాఁడు. నల్లని వలువలు దాల్చువాఁడు. మేరుపర్వతము బంగారపుఁ గొండ. పచ్చనిరంగు గలది. కావునఁ బోలికయే లేదు. కాన నిది యసమోపమము. అప్రసిద్ధమైన యుపమ యఖ్యాతోపమము. "మొగము కుముదమువలె నున్నది." ముఖకమలములకు సామ్యము గలదు. అది ప్రసిద్ధము. ముఖకుముదములకప్రసిద్ధము. ఇది యఖ్యాతోపమము. ఇట్టిదే "గ్రథ్నామి కావ్యశశినం వితతార్థరశ్మిం" (అర్థములను కిరణములు

గల కావ్య మను చంద్రునిఁ గూర్తును.) అనుచోటఁ గావ్యచంద్రులకును, అర్థకిరణములకును సామ్య మప్రసిద్ధము.

### ౫. పరుషార్థము

కం. పరుషార్థంబులు గల యది
పరుషం బను దోషమయ్యెఁ; బరగెడు నీ భూ
వరు సౌందర్యమునకుఁ వే
మఱు సరియౌ మంటఁబడ్డ మదనుండనఁగన్. ౫౬

అతి పరుషమైన యనఁగా రూక్షమైన యర్థము గలది పరుషదోష మనఁబడును. ఈ రాజుయొక్క సౌందర్యమునకు మదనుఁడు వేమాఱులు మంటఁబడినచో సరియగును. బంగారమును బుటము పెట్టినకొలఁదియు దానికి వన్నె హెచ్చువిధమున వేమాఱులు మంటఁబడినచో మన్మథుఁడు మిక్కిలి సౌందర్యమును వహించును. అప్పు డీ రాజును బోలును. అని భావము. ఇట భావము బాగుగా నున్నను 'మంటఁబడ్డ' అను పదము రూక్షముగా ననఁగా శ్రుతికటువుగా నున్నది. ఇట శబ్దమే శ్రుతికటువుగా నున్నది. ఇది శబ్దదోషమే యనుట లెస్స.

### ౬. వ్యర్థము. ౭. ఏకార్థము

ఆ. వె. అప్రయోజనంబు వ్యర్థమౌ; ఫేనిలం
బైన జలధిదాఁటె ననిలతనయుఁ
డన; నభిన్నవాక్యమరయ నేకార్థమౌ
సుగుణఖనిచరిత్రశోభియనఁగ. ౫౭

ప్రయోజనములేని యర్థము వ్యర్థము. "అనిలతనయుఁడు ఫేనిలమగు (నురుగుగల) జలధిని దాఁటెను" అనుచో 'ఫేనిలము' అను విశేషణము వ్యర్థము. ఇట్లే

గీ. క్రిక్కిఱియకొమ్మ లాశలకెక్కి చలువ । దట్టమగు నీడపందిళ్లు గట్టుచుండ.

చలువపందిళ్ళనఁ జాలును. మిగిలినది వ్యర్థమౌ. ఇది రాయప్రోలు సుబ్బారావుగారి ప్రయోగరత్నము.

ఒకే యర్థముగల వాక్యమునుగానీ పదమునుగానీ మరలఁ బ్రయోగించుట యేకార్థము, 'సుగుణఖని' అన్నను 'చరిత్రశోభి' అన్నను నేకార్థకమే.

గీ. పదియు నాల్గు వసంతముల్ వదలనట్టి

బాల్యమెడలిన గదియు జవ్వనపుఁబసలు
ఒడలియం దందముగ నుట్టిపడుచునుండె.

ఇటఁ బూర్వోత్తరార్థము లేకార్థములే. ఇదియు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారిదే. ఈ వ్యర్థదోషమును దర్పణకార ప్రకాశకారాదు లపుష్టమనియును, ఏకార్థమును బునరుక్తమనియును వ్యవహరించిరి.

వామనుఁ డీ క్రిందిస్థలములం దీ యేకార్థ వ్యర్థదోషములు దోషములుగావని తెలుపుచున్నాఁడు. దీని నెల్లరును స్వీకరించిరి. ఎట్లన,

'ధనుర్జ్యాధ్వని' అనుచోట 'జ్యా' శబ్దముచేతనే 'ధను'శ్శబ్దార్థము గతార్థ మగుచుండ మరల ధనుశ్శబ్దము ప్రయోగించుటవలన "ధనుస్సున నెక్కిడిన నల్లెత్రాడు" అని యర్థవిశేషము దోఁచును.

కర్ణావతంస, శ్రవణకుండల, శిరశ్శేఖరాది పదములలో "అవతం"సాది పదములచేతనే తత్తదలంకారములని యర్థము దోఁచుచుండఁగాఁ గర్ణాది శబ్దప్రయోగము తత్సాన్నిధ్యరూపవిశేషార్థమును దెలుపును. అనఁగాఁ గర్ణాదులందు నిబద్ధములై యున్న యవతంసాదులని యర్థమగును.

'ముక్తాహార' శబ్దమున హారశబ్దముచేతనే గతార్థ మగుచుండఁగా 'ముక్తా' శబ్దము 'శుద్ధములైన ముత్యములు' అను నర్థవిశేషమును దోఁపించును.

'పుష్పమాలా' పదమున 'మాలా' పదముచేతనే గతార్థమగుచుండఁ బుష్ప శబ్దము 'శ్రేష్ఠములైన పుష్పములు' అని యర్థవిశేషమును దెలుపుచున్నది.

'కరికలభ' శబ్దమునఁ గలభ శబ్దముచేతనే గతార్థమగుచుండఁ గరి శబ్దము 'తన రూపమువంటి రూపము గల' అను విశేషార్థమును బోధించును. (కరి = ప్రౌఢకుంజరము; తద్రూపమగు కలభము కరికలభము). అయితే యీవిధముగా నెల్లయెడలను యత్కించిద్విశేషమును జెప్పుకొనవచ్చునుగదా! అప్పుడేదియు దోషమే కాదవలసివచ్చుచున్నది. కానఁ గావ్యప్రకాశకారుఁడు " స్థితే ష్వేతత్సమర్థనం " (పూర్వప్రయోగము లుండఁగా నిట్లు సమర్థింతుము. కాని యెల్లయెడల నిట్లు చెప్పుకొనరాదు.) " న ఖలు కర్ణావతంసాదివత్ జఘన కాంచీ ఇత్యాది క్రియతే " (కర్ణావతంసమన్నట్లు జఘనకాంచీ ఇత్యాది ప్రయోగములు ప్రయోగింపరాదు.) అని నూతన ప్రయోగములకు ననుజ్ఞనీయత తిరస్కరించెను.

## ౮. ససంశయము.

కం. క్రమమతిపదములు సంది
గ్ధములైన ససంశయంబు; ధరణీవరు డై

ర్యము నగము గెల్చుననఁగా
నమరెడు సతిమేను మించు హసియించుననగా. ౪౮

వాక్యము నందలి కర్తృకర్మములయందు సంశయము గలిగి తన్మూలమున నర్థమున సంశయముగలుగుట దోషము. "ధరణీవరు ధైర్యము నగముగెల్చు" "సతిమేను మించు హసియించు" అను వాక్యములలో 'ధైర్యనగములు' అనుచోటను, 'మేను మించులు' అనుచోటను గర్తయేదో, కర్మయేదో నిర్ణయింపరాకున్నది. కాన సంశయము. దీనిని దర్పణకార, ప్రకాశకారులు సందిగ్ధమనిరి.

కాని యిట్టియెడలఁ బ్రకరణమువలన సంశయము దొలఁగును. రాజవర్ణన ప్రకరణమున "ధరణీవరు ధైర్యము నగముగెల్చు" అని యున్నచో ధైర్యము కర్తయు 'నగము' కర్మ యని తేలును. స్త్రీవర్ణన ప్రకరణమున 'సతిమేను' కర్త యనియు 'మించు' కర్మ యనియును నిస్సంశయముగాఁ దేలును. ప్రకరణము లేనపుడే యిది దోషము. ప్రకరణమున్నచో దోషముగాదు.

## ౯. అపక్రమము.

వాక్యదోషములలో 'అక్రమ' దోషము శబ్దార్థ భేదముచే ద్వివిధమనిచెప్పి యర్థాక్రమమును నుదాహరించియుంటిమి. "తురంగ మథ మాతంగం ప్రయచ్ఛాస్మై మదాలసం" అనుదానినిఁ జూచుకొనవలెను.

ఈ యపక్రమ దోషము శాస్త్ర విరుద్ధరూపముగాఁ గూడ నుండును. ఎట్లన,

"కారయిత్వా క్షౌరం గ్రామవృద్ధో మంక్త్వా భుక్త్వా చ
నక్షత్రం తిథివారౌ జ్యౌతిషికం ప్రష్టుం చలితః"

గ్రామవృద్ధుఁడు క్షౌరమును జేయించుకొని స్నానమాడి భుజించి తిథి వార నక్షత్రములు దెలిసికొనుటకై జ్యౌతిషికునికడకు బయలువెడలెను.

ఇటఁ దిథివారాదులు దెలిసికొని క్షౌరమును జేయించుకొనుట శాస్త్ర సంప్రదాయము. విపరీతముగాఁ జేయుట యపక్రమము.

## ౧౦. విరుద్ధము.

కం. క్రమమెడలి దేశకాలా
సముచితము విరుద్ధమయ్యె; "సమదవిలోల
భ్రమరము చంపకవన" మన
'సముదంచిత [illegible] ౪౯

దేశకాలాదుల కుచితముగానిది యనఁగా లోకవిరుద్ధమైనది విరుద్ధదోషము. దర్పణకార ప్రకాశకారులు దీనినిఁ బ్రసిద్ధి విరుద్ధమనిరి. చంపకమునకును భ్రమరమునకును విరోధము ప్రసిద్ధము. కానఁ జంపకవనమున భ్రమరము చరించుచున్నదన్నచో దోషము. ఇది కవిసమయ విరుద్ధము. కైతకము (మొగిలి) చైత్రమాసమున నుండదు. ఇది కాలవిరుద్ధము. దేశవిరుద్ధమన "దక్షిణదేశమున హస్తినాపుర మను పట్టణము గలదు" అనునది. "వయసు మొగ్గలుదొడిగిన వయసుటనఁటి" ఇది స్వభావవిరుద్ధము. (ఇది కవిభూషణ గాయప్రోలు సుబ్బారావుగారి ప్రయోగము.) అరఁటి మొగ్గలువోదఁగదు. 'అరఁటి పువ్వువేసె' ననవలెను. ఇట్లే ధర్మ, అర్థ, కామ, మోక్ష, శాస్త్రవిరుద్ధములగు నర్థములను దెలిసికొనవలెను.

లోకవిరుద్ధములయినను గవిసమయ ప్రసిద్ధములయినచో నుపాదేయములే యగును. ఎట్లనఁ గీర్తి తెల్లగా నుండుట లోకప్రసిద్ధము గాకున్నను గవిసమయ ప్రసిద్ధము. కాన నుపాదేయమే యగును. * కవి సమయముల నీ క్రింద నుదాహరింతుము. చూచుకొనుఁడు.

---

## * కవి సమయములు

సమయ మనఁగా సంప్రదాయము. అనగా నాచారము లేక మర్యాద. ఈ సంప్రదాయములు దేశాచారములవలె నెప్పుడో యేర్పడినవి. సంఘముతో సంబంధమున్నంతవఱకు దేశాచారములను జనులు పాటింపవలసినవిధమునఁ గవులును నౌచిత్యముతో సంబంధము గలిగియుండవలసినపుడు వీనిని బాటింపవలసినదే. నేఁడు వీనిని మార్పవీలులేదు. మార్చినచో భావమే తలక్రిందులగును. ఔచిత్య దృష్టితోఁ గ్రొత్తవి సృష్టించుకొనవచ్చును.

ఈ సమయములు మూఁడు విధములు. ౧. ఉన్న ధర్మమును నిబంధింపకుండుట, ౨. లేని ధర్మమును నిబంధించుట, 3. నియతముగాఁ గొన్నింటికిఁ గొన్నియెడలనే యునికిని నిబంధించుట.

ఈ క్రింది వస్తువులందున్నను నాయాధర్మములను నిబంధింపరాదు.

౧. మాలతీలత వసంతమున బుష్పించుచున్నట్లు వర్ణింపరాదు.
౨. చందనద్రుమములకు ఫలపుష్పములున్నట్లు ,,
3. అశోకమునకు ఫలములున్నట్లు ,,
४. కృష్ణపక్షమున వెన్నెల యున్నట్లు ,,
౫. శుక్లపక్షమున నంధకారమున్నట్లు ,,

౬. మల్లెమొగ్గలకును గామునుల దంతములకును (తాంబూల చర్వణముచే నెఱ్ఱగా నున్నను) నెఱ్ఱదనమున్నను వర్ణింపరాదు.
౭. కమల ముకుళములకుఁ బచ్చదనమున్నను ,,
౮. ప్రియంగు పుష్పములకుఁ ,, ,,
౯. పగటిపూట నీలోత్పలవికాసమును ,,
౧౦. పగటిపూట వావిలిచెట్టు పూలు రాలిపోయినట్లు ,,
౧౧. స్త్రీలకు నల్లదనమును, స్తనపాకమును ,,

ఈ క్రింది వస్తువులందు లేని ధర్మమును నిబంధింపవచ్చును.

౧. నదులయందుఁ బంకజ నీలోత్పలాదులు లేకున్నను వర్ణింపవచ్చును.
౨. ప్రతి తటాకమునందును హంసలు లేకున్నను ,,
౩. ప్రతి పర్వతమునందును బంగారము, రత్నములు, గజములు లేకున్నను వర్ణింపవచ్చును.
౪. చీఁకటిని ముష్టిగ్రాహ్యమనియు, (పిడికిటితోఁ బట్టఁదగినది) సూచీభేద్యమనియు (సూదులచేఁ భేదింపఁదగినది) వర్ణింపవచ్చును.
౫. ఆకాశగంగలో దిగ్గజములు స్నానమాడుచున్నట్లు ,,
౬. ప్రతాపమున రక్తత్వము, ఉష్ణత్వమును ,,
౭. వెన్నెలను నంజలిగ్రాహ్యముగాఁ (దోసిళ్ళతోఁదీసి యెత్తఁదగినది) గుంభోపవాహ్యముగా (కడవలతోఁ ముంచికొని పోఁదగినది) వర్ణింపవచ్చును.
౮. పురాతనుఁడైనను శివుని శిరశ్చంద్రుని బాలునిగా ,,
౯. కీర్తిని, పుణ్యమును. హాసమును దెల్లఁగా ,,
౧౦. అపకీర్తిని, పాపమును నల్లగా ,,
౧౧. కోపమును, అనురాగమును నెఱ్ఱఁగా ,,
౧౨. స్త్రీకి రోమావళి, త్రివళులు (లేకున్నను) ,,
౧౩. చక్రవాక దంపతులకు రాత్రి వియోగము గలుగునట్లు ,,
౧౪. చంపక భ్రమరములకు విరోధమున్నట్లు ,,

ఈ క్రిందియెడల నాయా ధర్మములు నియతములుగా నుండును.

౧. సముద్రమునందే మొసళ్ళను వర్ణింపవలెను.
౨. తామ్రపర్ణీనదియందే ముత్యములు లభించునట్లు వర్ణింపవలెను.
౩. హేమంత శిశిరములను విడిచి సర్వదా కమలము లుండునట్లు వర్ణింపవలెను.
౪. ధ్వజ[illegible] ,,

౫. శైల, వృక్షాది, మేఘ, సముద్ర, ఉలూకము, రాక్షస, ధూమ, పంక, కేశము లకును నల్లదనమే వర్ణింపవలెను.

౬. మలయ పర్వతమునందే చందనవృక్షముల యుత్పత్తిని వర్ణింపవలెను.

౭. హిమవత్పర్వతమునందే భూర్జవృక్షముల యుత్పత్తిని వర్ణింపవలెను.

౮. వసంతముననే కోకిల ధ్వనిని ,,

౯. వర్షాకాలమునందే మయూర నృత్యమును, వాని కేకలును ,,

౧౦. విశేషించి చెప్పకున్నచోఁ బుష్పములకును, జలములకు, ఛత్రిమునకు, వస్త్రములకును దెల్లదనమే వర్ణింపవలెను.

౧౧. శాలి, మండూక, వల్కల, పరాగములకుఁ బీతత్వమునే వర్ణింపవలెను.

౧౨. విశేషించి చెప్పకున్నచో మాణిక్య, జపాపుష్ప, రత్న, సూర్య, పద్మ, పల్లవ, బంధూక (మంకెన) దాడిమ, నఖములకు శోణవర్ణమే వర్ణింపవలెను.

ఈక్రిందివాని నైక్యమును వర్ణింపవచ్చును (భేదమును పాటింప నక్కఱలేదు)

౧. కృష్ణ (నలుపు) నీల (ఆకాశవర్ణము) హరిత (ఆకుపచ్చ) శ్యామ (ముదురుపచ్చ) వర్ణముల నైక్యము చెప్పవచ్చును. భేదమును పాటింప నక్కఱలేదు.

౨. స్వర్ణ, పరాగ, అగ్నిశిఖాదులందున్న పీత (పసుపుపచ్చన) రక్త (ఎఱుపు)ములకు నైక్యము వర్ణింపవచ్చును.

౩. శుక్ల (అచ్చతెలుపు) గౌరములకు (బూడిదరంగు) నైక్యము వర్ణింపవచ్చును.

౪. చంద్రునియందు శశ, మృగముల నైక్యమును ,,

౫. మదనకేతనమున మకర మత్స్యముల నైక్యమును ,,

౬. సముద్రమునుండియు నత్రినేత్రమునుండియుఁ బుట్టిన చంద్రుల నైక్యము ,,

౭. ద్వాదశాదిత్యులకు నైక్యమును ,,

౮. క్షీర లవణ సముద్రముల నైక్యమును ,,

౯. నాగసర్పముల నైక్యమును ,,

౧౦. దైత్య, దానవ, అసురులకు నైక్యమును ,,

౧౧. మన్మథుని మూర్తత్వ (శరీరముండుట) అమూర్తత్వములకు నైక్యము ,,

౧౨. నేత్రమునకుఁ దెలుపు, నలుపు, ఎఱుపులు ప్రత్యేకముగాను, గలిసియున్నట్లు వర్ణింపవచ్చును.

౧౩. కమలాసంపదల నైక్యము వర్ణింపవచ్చును.

౧౪. శబ్దముచేఁ బర్వతములు బ్రద్దలగునట్లు వర్ణింపవచ్చును.

౧౫. వెన్నెలను [illegible] ,,

౧౬. వర్షాకాలమున హంసలు మానససరస్సునకుఁ బోవునట్లు వర్ణింపవచ్చును.

౧౭. మానవులను శిరస్సు మొదలుకొనియు, దేవతలను పాదములు మొదలుకొనియు వర్ణింపవచ్చును. (దేవతలు పూజ్యులుగానఁ బాదములనుండి వర్ణింపవలెను)

౧౮. భువనములను ౩, ౭, ౧౪ అనియును వర్ణింపవచ్చును.

౧౯. దిక్కులు, ౪, ౮, ౧౦, అనియును వర్ణింపవచ్చును.

౨౦. సముద్రములు ౪, ౭, అనియును వర్ణింపవచ్చును.

౨౧. విద్యలు ౪, ౧౪, ౧౮, అనియును ,,

౨౨. స్థలమునందున్న జీవులు జలమునందును గలవని వర్ణింపవచ్చును.

౨౩. రణహతులు సూర్యమండలమును భేదించుకొని పోవుదురని వర్ణింపవచ్చును.

౨౪. శివుని శూలి యనవచ్చును. (శూలముగలవాఁడు) సర్పి (సర్పములుగలవాఁడు) అనరాదు.

౨౫. చంద్రుని 'శశి' (శశము గలవాఁడు) అనవచ్చును. కాని మృగి, హరిణి, అనరాదు.

౨౬. శంకరుని వృషభవాహనుఁడు, వృషాంకుఁడు, వృషధ్వజుఁడు, అని యా యా యుపాధినిఁబట్టి చెప్పవచ్చును.

౨౭. శివుని 'ఇందుమౌళి' యనవచ్చును. కాని 'గంగామౌళి' యనరాదు.

౨౮. పద్మినీజాతి స్త్రీల తాఁకులవలనఁ బ్రియంగువృక్షము, వారి పుక్కిటి మద్యముమియుటచేఁ బొగడచెట్టు, వారి కౌఁగిలిచే గోరంట, వారి కాలితన్నులచే నశోకవృక్షము, వారి చూపులచే బొట్టుగుచెట్టు, వారి నర్మవాక్యములచే మందారము, వారి హాసముచే సంపెంగ, వారి ముఖానిలముచే మామిడిచెట్టు, వారి సంగీతముచే సురపొన్న, వారి నర్తనముచేఁ గొండగోఁగుచెట్టును, వికసించును. (ఇది మల్లినాథుని యుదాహరణముల ననుసరించి వ్రాయఁబడినది. వసుచరిత్ర వ్యాఖ్యాత యీపద్భేదముతో నుదాహరించెను. భేదించినవి మాత్రము చూపుదుము.) మాకందము కరస్పర్శచేతను, సంపెంగ ముఖరాగముచేతను, గొండగోఁగు సల్లాపముచేతను, వావిలి ముఖానిలముచేతను, ప్రియాళువు సంగీతముచేతను వికసించును.

కావ్యమార్గమున నేయేవస్తువు లేయేవర్ణములుగా వర్ణింపఁబడునో తెలుపుదుము.

చంద్ర, ఉచ్చైశ్శ్రవ, శంకర, నారద, భార్గవ, బలరామ, శేషసర్ప, ఐరావత, సింహ, సౌధ, శారదమేఘ, ఇందుకాంత, నిర్మోక (కుబుసము) మందార, హిమాద్రి, హిమ, హాస, మృణాళ, స్వర్గంగా, గజదంత, అభ్రక, సికతా (శకల ఖండ) అమృత, [illegible], [illegible], కైరవ, కర్పూరములు, శ్వేతములు.

కృష్ణ–చంద్రాంక–వ్యాస–రామ–ధనంజయ–శని–ద్రౌపదీ–కాళీ–విష–ఆకాశ–అమావాస్యా–శస్త్ర–అగురు–పాప–అంధకార–నిశలును, మద–తమాల, రాహువులును–అద్భుత శృంగారములును నీలములు.

క్షాత్రధర్మము–త్రేతాయుగము–రౌద్రరసము-చకోర–కోకిలా–పారావత నేత్రములును, వానరముఖము – తేజస్సు – అంగారకుఁడు – కుంకుమము – శక్షకుఁడును, జిహ్వా– ఇంద్రగోప– ఖద్యోత– విద్యుత్– కుంజర బిందువులును (ఏనుఁగు నొసలి మీఁది బిందువులు) శోణములు.

దీప– జీవ– ఇంద్రి– గరుడ – హరలోచనములును, హర జటాజూటమును, బ్రహ్మయును- వీరరసమును – స్వర్ణము– కపి – ద్వాపరయుగము – గోరోచనలును, కింజల్కము– చక్రివాకి– హరితాళము– మనశ్శిల యివి పీతములు

రజస్సు– సాలెపురుగు– ఒంటె- బల్లి– కపోతము– మూషకము– దుర్గ – కాళకంఠస్వరము మొ. ధూసరములు.

సూర్య తురగములు హరితములు.

## ఋతు వర్ణనము

కవులు కాలౌచిత్యమును పాటింపవలెను. వారు దమ కావ్యములయందా యా ఋతువులను వర్ణింపవలయును. ఆ వర్ణనములందు వారు ప్రమాదపడకుంటకై ఋతు వర్ణనమును జూపుదుము. జ్యోతిషికులు, సంవత్సరము చైత్రమాసముతో నారంభించుననియు, లోకయాత్రావేత్తలు శ్రావణమాసముతో నారంభించుననియును జెప్పుదురు.

## వర్షర్తువు

శ్రావణ భాద్రపద మాసములు వర్షర్తువు. ఈ ఋతువున, అందుగు, వరి, పుట్టగొడుగు, అడవిమొల్లలు, తటిగొట్టి, గిరిమల్లిక, కడిమి, మద్ది, ఏఱుమద్ది, మొగలి మొదలగు చెట్లు పుష్పించును. ఆర్ద్రపురుగులు–వెన్నెలపులుఁగులు–చాతకములు–లేళ్లు–గోదురుకప్పలు–నెమిళ్లు–నీరుకాకులు–గద్దలు వీనికి క్రొవ్వు పట్టును. బలాకాపక్షులు (బెగ్గురుపిట్టలు) గర్భము ధరించును. (గర్భాధానక్షణ పరిచయాత్ఖే భవంతం బలాకాః అని మేఘసందేశము). రజస్సు (ధూళి) శమించును. రాజులు యాత్రలనుండి నివర్తిల్లుదురు. వనభూములు శ్యామలములై యుండును. జలాసారములవలనఁ బర్వతములు గడఁగఁబడినట్లు రమ్యముగా నుండును. నదు లొడ్డులొరసి

ప్రవహించుచు నొక్కొక్కచో గట్లు దాటుట లోకోపద్రవము గలిగించును. యతులును, చారులును దిరిగి వత్తురు. ప్రోషితభర్తృకలు భర్తలకై దారులు చూచుచుందురు. పాంథులు గృహములకు మఱలుదురు. మేఘబృందముచే నాకాశము చీఁకట్లు గ్రమ్మును. దిఙ్ముఖముల మెఱుఁగుఁదీఁగలు పరుగిడుచుండును. మేఘగర్జనములచే వైడూర్యభూములందు రత్నాంకురములు పొటమరించును. కామినీకాముకులుద్యానయాత్రను జేయుదురు. సౌధోపరిభాగముల శయ్యలఁ గల్పింతురు. కస్తూరీ మిశ్రమగు చతుస్సమవిలేపనమును (చందన, కుంకుమ, కర్పూర, అగురు మిశ్రితమగు మైపూఁత) బూసికొందురు. కృషీవల కుటుంబినీ బృందములు రాసక్రీడలాడుదురు. కడిమిపూల వాసనగల పడమటిగాలి గాని తూరుపుగాలి గాని వీచును.

## శరదృతువు

ఆశ్వయుజ కార్తిక మాసములు శరదృతువు. ఈ ఋతువున లకుముకిపిట్టలకు, దుమ్మెదలకు – కన్నెలేళ్ళకు – హంసలకు – కాటుకపిట్టలకు – చక్రవాకములకు – బెగ్గురుపిట్టలకు – కొక్కెరలకు – వృషభములకు – ఏనుగులకు – తాఁబేళ్లకు – కొంగలకు – బేడిసచేఁపలకును గ్రొవ్వువట్టును. తామరలు – తెల్లకలువలు – నల్లకలువలు – ఎఱ్ఱకలువలు – మంకెనలు – కుంకుమ వృక్షములు – వావిలి – ఏఁడాకులరఁటి – రెల్లు – మాలతీ లతలును బుష్పించును. మయూరముల క్రొవ్వడఁగును. హంసలు మానససరస్సునుండి మరలివచ్చును. అగస్త్యోదయముచే జలములు కలఁకఁదేఱును. ముత్తెపుఁజిప్పలు గర్భముఁ దాల్చును. మింటఁ దెల్లని మబ్బులుండును. మహానవమియందు శస్త్రాస్త్రపూజలు జరుగును. గుఱ్ఱములకును, ఏనుఁగులకును నీరాజనములు సేయుదురు. రాజులు యుద్ధయాత్రకు వెడలుదురు. బాటలయందు బురద యెండును. సూర్యకిరణములు దుస్సహములుగా నుండును. శ్రీ మహావిష్ణువు నిద్రనుండి మేలుకొనును. పొలములలో వరి పండును. గోపికలు గీతములు పాడుదురు. ఈ ఋతువున నియతముగా వాయు వొకదిక్కునుండి వెడలక యన్ని దిక్కులనుండియును వీచును.

## హేమంతర్తువు

మార్గశీర్ష పౌష మాసములు హేమంతర్తువు. ఈ ఋతువున మల్లె – మచుకుందము – లవలి – ప్రేంకణము – లొద్దుగ – సురపొన్నలు పుష్పించును. తుమ్మెదలకుఁ – బాములకు – మయూరములకును గ్రొవ్వడఁగును. కామినులు కుంకుమపువ్వును – గంధతైలములను సేవింతురు. పెరుగు రుచ్యముగా నుండును. కామినీకుచములు నులివెచ్చగా నుండును. జనులు నులివెచ్చని జలముల స్నానమాడుదురు.

స్త్రీలకు గాఢాలింగన సౌఖ్యమబ్బును. ఆడుపులులు ప్రసవించును. కూపజలములు గోరువెచ్చగా నుండును. రేగులు, నారింజలును బాగుగా ఫలించును. చెఱకున రసము చిప్పిలుచుండును. మందిరగర్భములందు శయనము; సరసులు గబ్బిగుబ్బలుగల ప్రియురాండ్ర భుజపంజరముల శయనింతురు. పగటిప్రమాణము తగ్గును. ఈ ఋతువునఁ బడమటిగాలి గాని యుత్తరపుగాలి గాని వీచును.

## శిశిరర్తువు

మాఘ ఫాల్గునములు శిశిరర్తువు. ఈ ఋతువు హేమంతమువలెనే యుండును. విశేషించి యేనుఁగులకు, తేళ్ళకు, పందులకు, దున్నలకుఁ గ్రొవ్వుపట్టును. కామినులు విచిత్ర సురతోపభోగ యోగ్యులుగా నుందురు. చందనమునం దరుచి గలుగును. జలములకు మిక్కిలి శైత్యము గలుగును. మరువకములును గుందములును బుష్పించును. కేళాకూళులయం దనాదర మేర్పడును. ఎల్లరును వెచ్చవెచ్చగాఁ గుంపట్లవద్దఁ గూర్చుండనభిలషింతురు. ప్రచండ వాయువు వీచును. కుంకుమపూఁతను బూసికొని యీ చలినిఁ గామినులు సహింతురు.

## వసంతర్తువు

చైత్ర వైశాఖమాసములు వసంతర్తువు. ఈ ఋతువునఁ జిలుకలు, గోరువంకలు, తుమ్మెదలు, గండుగోయిలలును లెస్సగాఁ గ్రొవ్వును. దాదాఁ పన్నివృక్షములును, జిగిరించును. ఎల్ల యుద్యానములందును, నుయ్యాలలూఁగుట పుష్పాపచయము, మధుపానము, మన్మథపూజ, గౌరీచరిత్ర గానము, చంపక పుష్పాభరణము, కోకిలనాదములును బిక్కటిల్లుచుండును. దక్షిణవాయువు వీచును.

## గ్రీష్మర్తువు

జ్యేష్ఠాషాఢములు గ్రీష్మర్తువు. ఈ ఋతువున నవమాలికలు, శిరీషములు, చంపకములు, గేదంగులును బుష్పించును. ఖర్జూరములు, నేరేళ్ళు, పనసలు, మామిళ్లు, పోఁకలును బండును. ఒంటెలు, శరభమృగములు, కంచరగాడిదలును గ్రొవ్వును. నదీసరఃకూపాదు లెండిపోవును. చలిపందిరులందు బాటసారులు మూఁగియుందురు. పందిళ్ళలో మధ్యాహ్ననిద్ర నేయుదురు. దివసావసానమున స్నానము నేయుదురు. వేకువజామున సురతక్రీడలు నేయుదురు. చందనాది శీతలద్రవ్యములను సేవింతురు. రాత్రులందుఁ జంద్రికాసేవనము నేయుదురు. శరీరములకుఁ జందన మలఁదికొని భోగింతురు. భూతము లుడుకుచున్నట్లు, జలముల సెగలు లేచుచున్నట్లు, దుమ్ము కాలుచున్నట్లు, [illegible]

## సంఖ్యానియమము

ఏ యే వస్తువుల కేసంఖ్యనియతమో యా సంఖ్యానియమమును దెలుపుదము.

ఏకసంఖ్యాకములు:— ఇంద్రగజము, ఇంద్రాశ్వము, గజాననదంతము, శుక్రాచార్యుని నేత్రము.

ద్విసంఖ్యాకములు:— పక్షములు, నదీతీరములు, నరుని కర్ణములు, భుజములు, నేత్రములును.

త్రిసంఖ్యాకములు:— కాలములు, అగ్నులు, భువనములు, గంగామార్గములు, హరుని నేత్రములు, గుణములు, కంఠరేఖలు, మహీకోణములు, శూలముయొక్క శిఖలు, సంధ్యలు, పురములు, రాములు (బలరామ, పరశురామ, శ్రీరాములు) విష్ణుజ్వరముయొక్క పాదములు.

చతుస్సంఖ్యాకములు:— వేదములు, బ్రహ్మముఖములు, వర్ణములు (జాతులు) సముద్రములు, విష్ణుహస్తములు, ఐరావత దంతములు, సేనాంగములు, ఉపాయములు, జాములు, యుగములు, ఆశ్రమములు.

పంచసంఖ్యాకములు:— పాండవులు, హరుని ముఖములు, ఇంద్రియములు, దేవతరువులు, పంచవ్రతములు, పంచాగ్నులు, పంచభూతములు, పంచమహాపాపములు, పంచకావ్యములు, పంచయజ్ఞములు, పంచప్రాణములు.

షట్సంఖ్యాకములు:— వజ్రకోణములు, షట్తర్కములు, షడంగములు, షడ్దర్శనములు, అరిషడ్వర్గము, షట్చక్రవర్తులు, షడ్గుణములు, షడ్రసములు, షట్కృత్తికలు.

సప్తసంఖ్యాకములు:— సప్తపాతాళములు, సప్తభువనములు, సప్తమునులు, సప్తద్వీపములు, సప్తాశ్వములు (సూర్యునివి) సప్తవారములు, సప్తస్వరములు, సప్తరాజ్యాంగములు, సప్తజిహ్వలు, (అగ్నివి) కులపర్వతములు.

అష్టసంఖ్యాకములు:— యోగాంగములు, వసువులు, అష్టమూర్తులు, దిక్కులు, సిద్ధులు, అష్టదిక్పాలురు.

నవసంఖ్యాకములు:— నవరంధ్రములు, నవఖండములు, వ్యాఘ్రీస్తనములు, సుధాఖండములు, నవనిధులు, నవరసములు, నవాంకములు (పుట్టుమచ్చలు), నవగ్రహములు.

దశసంఖ్యాకములు:— హస్తాంగుళులు – శివహస్తములు–రావణశిరస్సులు – అవతారములు – దశదిక్కులు – [illegible] – [illegible]స్థలం.

## ౧౧. విరసము

కం. ధరననుచిత రసభావము
విరసంబగు; నితని సమదవిద్వేషితలో
దరులు డరులందుఁ గుండఁగ
సరసములాడుదురు ప్రేమ శబరులటన్నన్. ౫౦

అనుచితమగు రసభావము గల యర్థము విరసము. ఇతని శత్రుకాంతలు గుహలలోఁ గుండుచుండఁగాఁ గిరాతులు వారితో సరసము లాడుచున్నారు. 'మగఁడు చచ్చి యేడ్చుచుండ రంకుమగఁడు చల్లపిసికె' నన్నట్లు కిరాతులు రాజకాంతలతో వందును వారు దుఃఖించుచుండ సరసములాడుట యనౌచిత్యగ్రస్తము. ఔచిత్యము లేకుంటయే యిట దోషము. ధ్వనికారుఁడు

'అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణం
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా'

---

ఏకాదశసంఖ్యాకములు:— ఏకాదశరుద్రులు - ఏకాదశాక్షౌహిణులు.

ద్వాదశసంఖ్యాకములు:— సూర్యులు - రాసులు - మాసములు - కుమారస్వామి హస్తములు, నేత్రములును.

త్రయోదశసంఖ్యాకములు:— తాంబూల గుణములు.

చతుర్దశసంఖ్యాకములు:— విద్యలు - అప్సరల వంశములు - మనువులు - చతుర్దశభువనములు - ధ్రువతారలు.

పంచదశసంఖ్యాకములు:— తిథులు.

షోడశసంఖ్యాకములు:— ఇందుకళలు - ఆంబికలు.

అష్టాదశసంఖ్యాకములు:— ద్వీపములు-విద్యలు - పురాణములు-స్మృతులు-ధాన్యములు.

వింశతిసంఖ్యాకములు:—రావణభుజములు - రావణనేత్రములు.

శతసంఖ్యాకములు:— ధార్తరాష్ట్రులు- శతభిషక్తారలు- పురుషాయుషము-రావణాంగుళులు- శతపత్త్రిదళములు- శతయజ్ఞములు- సముద్రమయొక్క యోజనములు. (హనుమంతుఁడు నూరామడలుగల సముద్రమును దాఁటెను)

సహస్ర సంఖ్యాకములు:— గంగాముఖములు- శేషుని శీర్షములు- సహస్రపత్త్రపత్త్రములు - సూర్య కిరణములు - బాణాసుర కార్తవీర్యార్జునుల హస్తములు-వేదశాఖలు- ఇంద్రనేత్రములు.

'అనౌచిత్యముకన్న రసభంగకారణము మరొకటి లేదు. ఔచిత్యబంధముగల కావ్యము రసోపనిషత్తే' అని నుడివెను.

ఈ విరసదోషము రసాభాసముననే చేరును. రాజకాంతలన నెల్లరకును దల్లులవంటివారు. అట్టి యగమ్యలగు కాంతలలో సరసములాడుట యనుచితముగదా!

## ౧౨. అతిమాత్రము - ౧౩. హేతురహితము

కం. క్షితిలో లోకాతీతం
బతిమాత్రము; నింగినిండె నబ్జాక్షికుచ
ద్వితయమన; హేతుశూన్యము
సతిఁ గనుఁగొని భృంగపంక్తి చనుదెంచెననన్. ౫౧

లోకాతీతమగు నర్థము 'అతిమాత్రదోషము'. ఆ యువతి స్తనద్వయము నింగి నిండెను. ఇట్టిదే యీక్రింది శ్లోకము

పాతాలమివ నాభిస్తే పర్వతా వివ చ స్తనౌ
వేణీదండః పునరయం కాలిందీపాత సన్నిభః

నీనాభి పాతాళమువలె నున్నది నీ స్తనములు పర్వతములవలె నున్నవి. నీవేణీదండము కాళిందీ ప్రవాహమువలె నున్నది. (ఆంధ్రప్రబంధములలో 'చనుగొండలు' అని పెక్కండ్రు ప్రయోగించిరి)

దీని ననుచితదోషమని దర్పణకార ప్రకాశకారులు దెలిపిరి.

హేతువును జెప్పకుండుట హేతుశూన్యము. దీనినే యితరులు నిర్హేతువనిరి. భృంగపంక్తి వచ్చుటకు హేతువు "తదానన పరిమళాభిలాష" అని చెప్పఁబడలేదు.

ప్రఖ్యాతార్థమున హేతురహితదోషము లేదు. ఎట్లన

శ్లో॥ చంద్రం గతా పద్మగుణాన్నభుంక్తే పద్మాశ్రితా చాంద్రమసీ మభిఖ్యాం
ఉమాముఖంతు ప్రతిపద్య లోలా ద్విసంశ్రయాం ప్రీతి మవాప లక్ష్మీః

చంచలురాలగు లక్ష్మి చంద్రుని నాశ్రయించి పద్మగుణములను (సౌరభాదులను) ననుభవింపదయ్యెను. పద్మము నాశ్రయించి చంద్రశోభను ననుభవింపదయ్యెను. కాని యుమాముఖము నాశ్రయించి చంద్రపద్మోభయగతమగు శోభ ననుభవించి ప్రీతినిఁ బొందెను.

ఇట లక్ష్మి 'చంద్రుని నాశ్రయించి పద్మగుణముల ననుభవింపదయ్యెను' అన్నపు డేల యనుభవింపదయ్యెనో హేతువు చెప్పఁబడలేదు. కాన దోషమన వచ్చును. కాని యిట హేతువు ప్రసిద్ధము. రాత్రి పద్మము ముకుళించును. కావునఁ

బద్మగుణములగు సౌరభాదుల ననుభవింపదయ్యెను. రాత్రియందుఁ బద్మముకుళనము ప్రసిద్ధము కావున గవి యాహేతువును జేర్కొనలేదు. "పద్మము నాశ్రయించి పగటఁ జంద్రశోభ ననుభవింపదయ్యెను" అనుచో నేల చంద్రశోభ ననుభవింప దయ్యెనో హేతువు చెప్పఁబడలేదు. ఇట హేతువగు చంద్రుని నిష్ప్రభత్వము ప్రసిద్ధము. పగటఁ జంద్రుఁడు వెలవెలఁ బోవుచుండునుగదా!

ఇట్లే 'సతిఁగనుగొని భృంగపంక్తి చనుదెంచె ననన్' అనుచోఁగూడ సమాధానమును జెప్పవచ్చును. భృంగములం పరిమళార్థ మేగుదెంచుట ప్రసిద్ధముగదా! కాన నిట దోషము లేదు.

## ౧౪. నిరలంకృతి – ౧౫. అశ్లీలము

కం. ధర జాతిమాత్రశూన్యము
నిరలంకృతి; బాహుయుతుఁడు నృపుఁ డన; లజ్జా
కరమశ్లీలము ;పద్మిని
సరసాంగజగృహము పద్మసౌరభమనఁగన్. ౫౭

నిరలంకృతి యనఁగా నలంకార రహితము. రమణీయతాశూన్యమని భావము. జాతిమాత్రశూన్యమన స్వభావోక్త్యలంకారముకూడ లేనిది. (స్వభావోక్తికి జాత్యలంకార మని పేరు) 'ఈరాజు బాహుయుతుఁడు' ఇందేయలంకారమును లేదు. ఇది స్వభావోక్తిగాదా? అన్నచో శ్లాఘ్యమగు విశేషణము లున్ననే స్వభావోక్తి యగును. ఈక్రిందిది స్వభావోక్తి గాదు.

దీర్ఘపుచ్ఛశ్చతుష్పాదః కకుద్మాన్ లంబకంబలః
గోరపత్యం బలీవర్ద స్తృణమత్తి ముఖేన సః

"పొడవైన తోఁకయు. నాలుగుకాళ్లును, మూఁపురమును గంగడోలును గల యావుబిడ్డయగు నెద్దు మూఁతితో గడ్డి తినుచున్నది" ఇందు శ్లాఘ్యమగు విశేషణములుగాని, శ్లాఘ్యమగు క్రియావిశేషణముగాని లేదు. శ్లాఘ్యమగు విశేషణమున కీక్రింది పద్యమును గనుఁడు.

సీ. యమదండములఁబోని మా స్తదండము ల భీతినిఁగొల్పు జగజెట్టి "తిప్పరాజు"
ప్రణకిణాంకంబైన వక్షశ్శిలా వేదిఁ గత్తులనాటు "శ్రీకంఠరాజు"
భుజవిక్రమమునఁపైకిఁ బొంగినచందాన నిక్కుమూఁపుల "పెద్దచొక్కరాజు"
బడుగుమేనికి జిల్గువలుపయే కవచంబుగాఁదాల్చు "గయికొండ గంగరాజు"
గీ. తినదుడాచేతినింగెడెమునఁగఁజేసి | యాలములయందుమార్కొను "అచ్చిరాజు"
వాఁడిగోరులఁ [illegible] "[illegible]" బవరమునకు.

'హస్తదండములు గల తిప్పరాజు' అన్నచో స్వభావోక్తిగాదు. 'యమదండములంబోని' అను శ్లాఘ్యమగు విశేషణము వేయఁబడియున్నది. మిగిలిన రెండింటి నిట్లే యూహించుకొనవలెను.

శ్లాఘ్యమగు క్రియావిశేషణమైన కీక్రింది పద్య ముదాహరణము.

కం. కలియఁబడ రదనకాంతులు,
మెలివడఁ గ్రేఁగనులు, పెనయ మెయిదోయియు, మో
ములు క్రిందుమీఁదులంబడ,
విలాసిమిథునంబు వెలసె విరిపాన్పుపయిన్.

అశ్లీలమన లజ్జాకరమగు నర్థము. పద్మినియొక్క (తామరతూఁటియొక్క) సరసాంగజగృహము (తన సరసమైన యంగము పుట్టినచోటు – అనఁగా సరస్సు) పద్మసౌరభము (పద్మములయొక్క పరిమళము గలది). తామరతూఁటియొక్క జన్మస్థానమగు సరస్సు పద్మపరిమళము గలది అని తాత్పర్యము. "పద్మినీజాతిస్త్రీయొక్క సరసమైన మన్మథగృహము తామరపూవు పరిమళమువంటి పరిమళముగలది" అనియు నశ్లీలార్థము తోఁచుచున్నది. ఇది దోషము.

౧౮. సహచరచ్యుతము

కం. సరిగా సరిగానిది యు
ర్వర పైఁ బొందింప సహచరభ్రష్టంబౌఁ;
బరగు నెలచేత గగనం,
బరుదుగ ఫేనంబుచేత నంబుధియునఁగన్. ౫౩

అతుల్యములగువాని నిబంధించినచో సహచరచ్యుతము లేక సహచరభ్రష్టము. చంద్రునిచే నాకాశము, ఫేనముచే సముద్రుఁడును వెలుఁగును.

ఆకాశము చంద్రునిచే శోభిల్లువిధమున ఫేనముచే సముద్రుఁడు శోభిల్లఁడు. ఇట నీ వాక్యద్వయమునకును సాహచర్యము బాగుగాలేదు.

౧౯. భిన్నము

కం. భిన్నంబగు సంబంధ వి
భిన్నం; బీతని విరోధి పృథివీశ్వరుఁ డా
పన్నుండై తన నుదురున
నన్నలినజుఁ డాతఁ డావ్యసనపఙ్క్తిని సనన్. ౫౪

సంబంధ వర్జితమైన యర్థము భిన్నము. ఇతని శత్రురాజాపన్నుఁడై తన యెదుట బ్రహ్మహత్య లేదని తలఁచును. బ్రహ్మహత్య లేమికిని నాపన్నత్వము నకును సంబంధము లేదు. (బ్రహ్మయొక్క చెడుహత్యకును నాపన్నతకును సంబంధ ముండును.)

ప్రతాపరుద్రీయమున 'అపార్థము' అను దోష మీయఁబడినది. "సముదా యార్థశూన్యం యదపార్థం తదుచ్యతే" సముదాయార్థములేని దపార్థము.

కుతః శుష్కదపోనద్యః? కా వార్తా చోళమండలే?
ఫణాసహస్రం శేషస్య భారః; కతి కులాచలాః?

ఎడలలో నీరేల యెండెను? చోళమండల విశేషములేమి? శేషునికి వేయి తలలు భారము. కులశైలము లెన్ని?

ఇట వాక్యార్థము స్ఫురింపదు.

నరసభూపాలీయమునఁ జెప్పఁబడనివియు, దర్పణకార, ప్రతాపరుద్రీయకారులు పేర్కొన్నవియునగు పదుమూఁడు దోషములుగలవు. వానినిఁగూడ నుదాహరింతుము.

## ౧. వ్యాహతము

ఉత్కర్షో వాపకర్షో వా ప్రాక్యస్యైవ నిగద్యతే
తస్యైవాథ తదన్యశ్చే ద్వ్యాహతోఽర్థ స్తదా భవేత్

ప్రథమమున నొకదాని కుత్కర్షముగాని యపకర్షముగాని చెప్పి మరల దానికి భిన్నముగాఁ జెప్పినచో వ్యాహతార్థమను దోషమగును.

కం. ... ... ... కుందనపుటొడల్

కసుగందిన కందుకమన । పసివాడ్చెడెన్ నిదాఘ పరిపీడనచేన్॥ అనిచెప్పి

గీ. కన్నె గేదంగిచెందు నాఁగ ళుకులొలయు । నా వెలందిమొదల్ ...అని వర్ణించెను

మొదటఁ గసిగందిన కందుకమన వసివాడిన శరీరము (అపకర్షము) కన్నె గేదంగిచెందునాఁ గళుకులొలయుచున్నదఁట. (ఉత్కర్షము) ఇట వ్యాహతార్థము స్పష్టము. ఇది మహాకవి రాయప్రోలు సుబ్బారావుగారిది.

## ౨. గ్రామ్యము

"స గ్రామ్యోఽర్థో రిరంసాదిః పామరైర్యత్ర కథ్యతే
వైదగ్ధ్య వక్రిమబలం హిత్వైవ వనితాదిషు"

పామరులాడు రిరంసాద్యర్థము గ్రామ్యము. వైదగ్ధ్యముగల వక్రోక్తులతో వనితలతో మాటలాడవలయును. వారలును నట్లే నుచ్చరింపవలయును. అట్లుగాక గ్రామ్యోక్తులతో ... సంభాషించుట గ్రామ్యము.

కం. సుదతీ! నీ కుచగిరులిటు
గదిసివడిం గూలినట్టి కారణమేమే!
చెదరి గిరులైనఁగూలవె?
కదిసి వడిం గ్రిందఁద్రవ్వఁగాఁ జెలువుండా!

ఇట నాయికా నాయకు లిరువురును విదగ్ధులు. ఇది సురతగోష్ఠిలో గుణమే యగును.

కం. కలకలపుగ నలువెలుపులు
వెలయఁగఁ గ్రొమ్మావిచిగురు వెలువడి టెంకన్
గొలుపునిది కనులు పండువు
వెలదీ! తామేటిచిప్ప వెడలు తలవలెన్.

ఇట నాయకుఁడు వ్యంగ్యముగా గుహ్యాంగవర్ణనము సేయుచున్నాఁడు. వీఁడు విదగ్ధుఁడు. కాన నిది గ్రామ్యముగాదు.

## 3. అనవీకృతము

ప్రకారాంతముచే నూతనత్వము వహింపని యర్థము.

ప్రాప్తాః శ్రియస్సకలకామదుఘాస్తతః కిం।
దత్తం పదం శిరసి విద్విషతాం తతః కిమ్?
సంతర్పితాః ప్రణయినో విభవైస్తతః కిం।
కల్పం స్థితం తనుభృతాం తనుభిస్తతః కిం?

ఎల్లకామములను బిండు సిరులు లభించినవి. దాన నేమగును? శత్రుశిరస్సులపైఁ గాలు మోపితిని. దాన నేమగును? యాచకులు ధనములచేఁ దృప్తులయిరి. దాన నేమగును? ప్రాణులు కల్పాంతముదాఁక జీవింతురు. దాన నేమగును?

ఇట 'తతఃకిం' అనువానినిఁ బ్రకారాంతమునఁ జెప్పక దానినే పలుసారులు చెప్పినాఁడు. ఇది పునరుక్తి కాఁజాలదు. ఏలన నిట 'తతఃకిం' అనుశబ్దమును గూర్చి తదర్థమును బోధించు నితరశబ్దములను ననఁగా 'కిం తస్మాత్' 'ఏతస్మాత్ కిం' 'ఇతః కిం' అని చెప్పినను దోషము దొలఁగదు. అనఁగా నర్థమునఁ గ్రొత్తదనము లేదు. ఇట్లే

గీ. చక్కఁదనమున కొకవింత చక్కఁదనము
జవ్వనంబున కొకవింత జవ్వనంబు
విభ్రమంబున కొకవింత విభ్రమంబు
[illegible] ([illegible]పహరణము)

ఇట 'ఒక వింత' అను పదము నవీకృతముగా లేదు. కాన ననవీకృత దోష ప్రాప్తము. పునరుక్తిదోషమున నా శబ్దమును దొలఁగించినచో దోషమును దొలఁగును. కావున నీక్రింది శ్లోకమున సున్నవిధమున నవీకృతత్వ ముండవలెను.

యది దహత్యనలోఽత్ర కిమద్భుతం । యది చ గౌరవమద్రిషు కిం తతః
లవణమంబు సదైవ మహోదధేః । ప్రకృతిరేవ సతామవికారితా ॥

అగ్ని కాల్చుచున్న నద్భుతమేమి? పర్వతములు బరువుగా నుండుచున్న విశేషమేమి? సముద్రోదక మెప్పుడును లవణమే. సజ్జనుల కెప్పుడును నవికారిత్వమే (సంకటములలో దుఃఖింపకుండుటయే) ప్రకృతి. (అగ్నియుఁ బర్వతములును సముద్రమును నెప్పుడును వికారమును బొందనివిధమున సజ్జనులును వికారమును బొందరు.)

ఈ శ్లోకమున కిమద్భుతం, కిం తతః, సదైవ, అనువానిచే నర్థము నవీకృతమైనది. ఇట్లే

చ. సురపతినోంచితిన్; జముని చొప్పడఁగించితి; శ్రీదు మాఁపితిన్;
వరుణునిగెల్చితిన్; శశిదివాకరులం బనిగొంటి; నాకు నీ
నరుఁడొకలెక్కయే? యొకయనంగుని కోపఁపుఁజూల నింక నీ
చరణములాన యింతదయసల్పఁగరాదె? త్రిలోకసుందరీ!

ఇట నోంచితిన్, చొప్పడఁగించితిని, మాఁపితిన్, గెల్చితిన్, పనిఁగొంటిన్ అనువానిచే నర్థము నవీకృతమైనది.

## ౮. సనియమ పరివృత్తము

సనియమముగాఁ జెప్పవలసినచోట ననియమముగాఁ జెప్పుట

"ఆపాతసరసే భోగే నిమగ్నాః కిన్న కుర్వతే?" ఆపాతముగానే సరసమైన భోగమున మగ్నులగువా రేమి సేయరు?

ఇట 'ఆపాతసరసే' అనుచో 'ఆపాతమేవసరసే' అను నియమమును జెప్పవలెను. ఆపాతముగానే సరసముగాని పరిణామమున 'విరసము' అనునర్థము రావలయును. అప్పుడు నియమమును జెప్పకొనవలయును.

## ౯. అనియమ పరివృత్తము

అనియమమును జెప్పకొనవలసియుండఁగా నియమముఁ జెప్పుట దోషము.

ఆవర్త ఏవనాభిస్తే । నేత్రే నీలసరోరుహే
భంగాశ్చవళయస్తేన । త్వం లావణ్యాంబువాపికా

నీనాభి యావర్తమే, నీ నేత్రములు నల్లవలువలు, నీవళులు తరంగములు, నీవు లావణ్యనదివి.

ఇట నీనాభి యావర్తము! అను నియమము గూడదు.

చ. ...తన్మయయోగ్యమైన మా।
సుపదళయే కృతార్థమయిసన్.

ఇట 'కృతార్థమ' అను నవధారణవాచకప్రయుక్తమగు నియమము గూడదు.
ఇది కవిభూషణ రాయప్రోలు సుబ్బారావుగారి పద్యము.

## ౬. సవిశేష పరివృత్తము

సవిశేషముగాఁ జెప్పవలసియుండఁగా నవిశేషముగాఁ జెప్పుట దోషము.

"యాంతి నీలనిచోలిన్యో రజనీష్వభిసారికాః" రాత్రులయం దభిసారికలు నల్లని తొడుగులు దాల్చి పోవుచున్నారు.

ఇట 'రజనీషు' అని యవిశేషముగాక 'తమిస్రాసు' (చీఁకటిరాత్రులందు) అని చెప్పవలెను. అప్పుడు నల్లదొడవులకుఁ బ్రయోజనము సంఘటిల్లును.

## ౭. అవిశేష పరివృత్తము

అవిశేషముగాఁ జెప్పవలసినయెడల సవిశేషముగాఁ జెప్పుట.

"హీరకాణాం నిధే రస్య సింధోః కిం వర్ణయామహే?" వజ్రములకు నిధియగు నీ సముద్రమును నేమి వర్ణింపఁగలము?

ఇట సముద్రము రత్నాకరము. కాన 'రత్ననిధి' యని "రత్నానాం నిధేః" యని యవిశిష్టముగాఁ జెప్పవలెను. కాని రత్నవిశేషమగు "వజ్రముల నిధి" అని చెప్పరాదు.

## ౮. సాంకాంక్షము

ఆకాంక్షలోఁ గూడినది.

చ. క్రమమని యక్రమంబని పరస్పరభిన్న మనోవికార సం
భ్రమములఁ గొన్నినాళ్ళు వలవంతలఁ జిక్కితి; దేశకాలపా
త్రములని కొన్నినాళ్లు నిశితవ్యథనొందియుఁ దాఁటుకొంటి నా
కమలదళాక్షిపై మమత... (కవిభూషణ రాయప్రోలు సుబ్బారావుగారిది)

"దేశకాలపాత్రములు" అనునది యాకాంక్షను గోరుచున్నది. దేశకాలముల యానుకూల్యమునకై యనునర్థము గావలయును. మరియు నిటఁ బాత్రపద మనవసరము.

## ౯. అపదయుక్తము

అస్థానసంబద్ధమైన యర్థము. ప్రకృతార్థమునకు విరుద్ధమైన యర్థముగలిగి యుండుట యపదయుక్తము.

సీ. ఎవని యాజ్ఞాపనం బెల్లవేల్పుల నేలు దేవేంద్రు తలమీఁది పూవుదండ;
ఎవ్వాని కాపురం బివ్వసుంధర సాటిచూపఁగారాని లంకాపురంబు;
ఎవనిభక్తిపరత్వ మీశ్వరేశ్వరునందుఁ బార్వతీపతియందుఁ బాయకుండు
ఎవనికొంగున్నలు వివిధశాస్త్రంబు; లుత్పత్తి వేనికి బ్రహ్మవంశమందు;

గీ. వాఁడు వరుఁడౌట మెచ్చఁగావలయు; నదియు
కాని రావణుఁ డనుమాట కానిమాట;
యుర్విలో నెందు నేఁగాని సర్వగుణము
లొక్కచోఁ గూడియుండుట చిక్కదుగద. (బాలరామాయణనాటకము)

సీతాస్వయంవరమునకు రావణుఁడుగూడ వచ్చుచున్నాఁడని తెలిసి జనక శతానందులు మాటలాడుకొనుచున్నారు.

శతానందుఁడు:—"ఆహాహా! ఆశ్చర్యము! ఒక్కటైనను గొప్పతప్పిదము గుణసముదాయమును బాడుచేయును. అంతేకదా!" అని నుడివి యీ పై సీసపద్యమును జదువుచున్నాఁడు. ఆతఁడు "కాని రావణుఁడనుమాట కానిమాట" (స్యాచ్చేదేవ న రావణః) అన్నంతవఱకే సమాప్తిచేసియుండవలసినది. 'ఉర్విలో నెందు నేకాని' ఇత్యాది వచనము సమాధానముగాఁ బర్యవసించుచు రావణోపేక్షా ప్రతీతినిఁ గప్పివేయుచున్నది. 'ఇతఁడు రావణుఁడుమాత్రము గాకున్నచో బాగుగా నుండెడిది. మిగిలిన వరణీయగుణము లన్నియును గలవు' అన్నఁ జాలును. 'ఎవనికి లోకములో సర్వగుణములును నుండును?' అనువచనము రావణున కీ కన్య నీయవచ్చు ననియే తోఁపింపఁజేయుచున్నది. అంతవఱకే సమాప్తిచేసినచో నీ గుణము లున్నను వీఁడు రావణుఁడుగానఁ గన్యనీయఁగూడదు' అనునర్థము వచ్చును.

## ౧౦. ప్రకాశిత విరుద్ధము

ఏవాక్యముచేఁ బ్రతిపాదింపఁబడినట్టియు వివక్షితమైనట్టియు నర్థమునకుఁ బ్రతికూలమగు నర్థము గోచరించునో యది ప్రకాశిత విరుద్ధము.

"కుమారస్తే నరాధీశ! శ్రియం సమధిగచ్ఛతు" ఓరాజా! నీ పుత్త్రుఁడు నీ సిరినిఁ బొందుఁగాక.

ఇట 'నీవు మరణింపుము' అను విరుద్ధార్థము ప్రకాశించుటవలనఁ బ్రకాశిత విరుద్ధము.

## ౧౧. విధ్యయుక్తము

విధింపవలసినదానిని విధింపకుండుట. అయుక్తమగు విధినిఁ జేయుట.

"ఆనందితస్వపక్షోఽసౌ పరపక్షాన్ హనిష్యతి" ఆనందింపఁ జేయఁబడిన స్వపక్షముగల యితఁడు పరపక్షములను జంపును.

ఇట 'పరపక్షములను జంపి స్వపక్షమును నానందపఱచును' అనివిధింపవలయును.

## ౧౨. అనువాదాయుక్తము

విధి కననుగుణమగు ననువాద్యమును జెప్పుట. అయుక్తమగు ననువాదమునేయుట.

అరే! రామాహస్తాభరణ! భసలశ్రేణి శరణ!
స్మరక్రీడా వ్రీడాశమన! విరహిప్రాణదమన!
సరోహంసోత్తంస! ప్రచలదల! నీలోత్పల! సఖే!
సఖేఽహం మోహం శ్లథయ! కథయ క్వేందువదనా!

ఓమిత్రమా! నీలోత్పలమా! నేను ఖిన్నుఁడనైయున్నాను. నా మోహమును వదలింపుము. నాప్రియురా లెటనున్నది?

విరహియగువాఁడు స్వమోహశ్లథనమునకై చేయు ప్రార్థనారూప విధిలో విరహిప్రాణదమనత్వరూపానువాదము యుక్తముగాదు. ఏలన విరహిప్రాణ దమనము జేయునది విరహిమోహశ్లథన మెట్లు చేయఁగలదు?

## ౧౩. త్యక్తపునస్స్వీకృతము (నిర్ముక్తపునరుక్తము)

లగ్నం రాగావృతాంగ్యా సుదృఢమిహ యయైవాసియష్ట్యాఽరికంఠే
మాతంగానామపీహోపరి పరపురుషైర్యా చ దృష్టా పతంతీ
తత్సక్తోఽయం నకించిద్గణయతి విదితం తేఽస్తు తేనాస్మి దత్తా
భృత్యేభ్యః శ్రీనియోగాద్గదితుమితి గతే వాంబుధిం యస్య కీర్తిః.

రాజలక్ష్మి తన తండ్రియగు సముద్రునితోఁ దన జామాతయొక్క కథను దెలుపుమని కీర్తినిఁబంపుచున్నది. "ఖడ్గలత రాగావృతాంగియై యరికంఠముల నాలింగనము నేసికొనుచున్నది. పిమ్మట నది మాతంగతతిమీఁదఁ బడుచుండఁగా నెల్ల పరపురుషులును జూచుచునే యున్నారు. అట్టి (యసతియగు) దానియందాసక్తుఁడై యుక్తాయుక్తవిచారములేక వర్తిల్లుచున్నాఁడు. నీకీ సంగతి తెలియనిమ్ము. మరియు నాతఁడు నన్నుఁ దన భృత్యుల కిచ్చివేసెను" అని లక్ష్మి చెప్పిన సందేశమును గొని కీర్తి సముద్రుని కడకు వెళ్లెను.

ఇట 'విదితంతేఽస్తు' అనుచోటనే వాక్యము నిరాకాంక్షముగా సమాప్తమైనది. మరల 'తేనాస్మిదత్తా' అని కారకాంతరముచేఁ జెప్పుట దోషము.

## రస దోషములు

క౦. రసములు వాచ్యములైనను
వెస నదియును దోషమయ్యె; విపులోగ్రరణం
బసదృశబీభత్సరసో
ల్లసితము; శృంగారసహిత లలన యనంగన్. ౫౫

రసములు విభావానుభావ వ్యభిచారిభావములచే వ్యంగ్యములు గావలయును. కేవలము శృంగారాది శబ్దములు వాడినమాత్రమున నాస్వాద్యత్వము గలుగదు. రణరంగము బీభత్సరసోల్లసితము; తరుణి శృంగారసహితురాలు; అన్నచో బీభత్స, శృంగార పదములనుమాత్రము ప్రయోగించిన నారసములు స్ఫురింపకున్నవిగదా! కాన నీవిధము దోషము. దీనిని స్వశబ్దవాచ్యదోష మందురు.

ఇటుఁ బెక్కువిధములైన రసదోషములను జూపుదుము.

వ్యభిచారి, రస, స్థాయిభావానాం, శబ్దవాచ్యతా;
కష్ట కల్పనయా వ్యక్తి రనుభావ విభావయోః;
ప్రతికూల విభావాదిగ్రహో; దీప్తిః పునః పునః;
అకాండే ప్రథనచ్ఛేదౌ; వంగస్యాప్యతివిస్తృతిః
అంగినోఽననుసంధానం ప్రకృతీనాం విపర్యయః
అనంగస్యాభిధానం చ రసే దోషాస్స్యురీదృశాః.

వ్యభిచారి భావములను, రసములను, స్థాయిభావములను స్వశబ్దములోఁ దెలుపుటయు, అనుభావ విభావములు కష్టముగా గుర్తింపఁబడుటయుఁ, బ్రకృత రసవిరుద్ధములయిన విభావాదులను గ్రహించుటయుఁ, దిరిగి తిరిగి రసమునకు దీప్తి గలిగించుటయు, అసమయమున రసము వర్ణించుటయు, నసమయమున రసవిచ్ఛేదము సేయుటయు, అంగిభూతముగానున్న రసమును మిక్కిలియు విస్తరించుటయు, అంగిరసమును బోషింపకుంటయు, స్వభావమును సముచితముగా వర్ణింపకుంటయు, రసానుపకారకమైనదానిని వర్ణించుటయు నీ మొదలయినవి రసదోషములు. వీనినిఁ గ్రమముగా నుదాహరింతుము.

౧. వ్యభిచారి భావమును స్వశబ్దములోఁ దెలుపుట.

సవ్రీడా దయితాననే, సకరుణా మాతంగచర్మాంబరే,

సత్రాసా భుజగే, సవిస్మయరసా, చంద్రేఽమృతస్యందిని,
సేర్ష్యా జహ్నుసుతావలోకనవిధౌ, దీనా కపాలోదరే
పార్వత్యా నవసంగమప్రణయినీ దృష్టిః శివా యాస్తు వః॥

భర్తృముఖమును గాంచి (తన్నతఁడు గాంచుటచే) సిగ్గుగొన్నట్టియు, గజ చర్మాంబరమును గాంచి (విభవము లేనివాఁడని) జాలిఁగొన్నట్టియు, సర్పమును గాంచి భయపడినట్టియు, అమృతము జాలువాఱు చంద్రునిఁ గాంచి (ఆకాశమున నుండువాఁ డిట నెట్లున్నాఁడని) విస్మయపడినట్టియు, శిరసునందున్న గంగను గాంచి (అన్యాంగనాసక్తుఁడని) యీర్ష్యను వహించినట్టియు, (మణిహారస్థానమున) కపాలములను గాంచి చిన్నఁబుచ్చుకొన్నట్టియు పార్వతీదేవి నవసంగమకాలము నందలి ప్రణయదృష్టి మీకు మంగళములిడుఁగాక.

ఇట వ్రీడా, కరుణ, త్రాస, విస్మయ, ఈర్ష్యా, దైన్యములు తమతమ యను భావములచే వ్యంగ్యములు గావలయును. ఎట్లన, నట వ్రీడ వ్రీడాశబ్దముచేతనే వాచ్యమైనది. అనఁగా స్వశబ్దముచేత వాచ్యమైనది. అట్లుగాక వ్రీడయొక్క యను భావములైన (కార్యములయిన) 'తలను వాంచుట'ను బ్రయోగించి దానిచే సిగ్గును వ్యక్తము సేయవలెను. అనఁగా 'నామె సిగ్గుపడినది' అని చెప్పవలసినయెడ 'ఆమె తల వంచుకొన్నది' అని ప్రయోగింపవలెను. తల వంచుకొనుట సిగుయొక్క కార్యము లేక యనుభావము. 'తల వంచుకొన్నది' అను ననుభావముచే సిగ్గు వ్యక్తమగు చున్నది. 'ఆమె సిగ్గుపడినది', 'ఆమె తల వంచుకొన్నది' అను వాక్యములలో నేది సుందరముగా నుండునో చూడుఁడు. మొందటిచోట 'సిగ్గు' స్వశబ్దముచే గ్రహింపఁ బడుటచే సుందరముగా లేదు. ఎప్పుడును జెప్పవలసినదానిని విస్పష్టముగా విప్పి చెప్పక దానిని వ్యంగ్యముగా బోధించిన యెడలనే రమణీయముగా నుండును. కావున రెండవచోట హృద్యముగానున్నది. ఇట్లే కరుణ, త్రాస. విస్మయ, ఈర్ష్యా, దైన్యములను, వానివాని యనుభావములచేతనే వ్యక్తము చేయవలెను. ఎట్లన

వ్యావృత్తా దయితాననే, ముకుళితా మాతంగచర్మాంబరే,
సోత్కంపా భుజగే, నిమేషరహితా, చంద్రేఽమృతస్యందిని
మీలద్భ్రూస్సురసింధుదర్శనవిధౌ మ్లానా కపాలోదరే
పార్వత్యా నవసంగమప్రణయినీ దృష్టిశ్శివాయాస్తు వః

ఇట వ్రీడా, కరుణ, త్రాస, విస్మయ, ఈర్ష్యా, దైన్య, రూప వ్యభిచారులు స్వశబ్దముచే గ్రహింపఁబడక వానివాని యనుభావములగు వ్యావృత్తత, ముకుళనము, ఉత్కంపము, నిమేషరహితత్వము, భ్రూవిమీలనము, మ్లానత, అనువానిచే వ్యక్తము

సేయఁబడుచున్నవి; ఇట్లనుభావములచే వ్యక్తపఱుపక వ్రీడాదిపదములచేతనే యనఁగా స్వశబ్దముచేతనే వ్రీడాదులను జెప్పుట స్వశబ్దవాచ్యత యను రసదోషము. కాని

"వ దోష స్స్వపదేనోక్తా వపి సంచారిణః క్వచిత్"

ఒకానొకచో సంచారిభావమును స్వశబ్దముతో గ్రహించినను దోషము గాదు. చూడుఁడు.

> ఔత్సుక్యేన కృతత్వరా, సహభువా వ్యావర్తమానా హ్రియా
> తైస్తైర్బంధువధూజనస్య వచనై ర్నీతాభిముఖ్యం పునః
> దృష్ట్వాఽగ్రే వరమాత్తసాధ్వసరసా గౌరీ నవే సంగమే
> సంరోహత్పులకా హరేణ హసతా శ్లిష్టా శివాయాస్తు వః

ఔత్సుక్యముచేఁ దొరపడియు, సిగ్గుచే వెనుకకు వచ్చుచు, నాయా బంధు వధూజనవచనములచే మరల నభిముఖియై యెదుటఁ దన ప్రియునిఁ గాంచి సాధ్వసమును బొందుచుఁ బార్వతీదేవి నవసంగమకాలమున గగ్గుఱుపాటును బొందఁగా హరుఁడు నవ్వుచు నామె నాలింగనము జేసికొనెను. అట్టి పార్వతి మీకు శుభ మిడుఁగాక.

ఇట నౌత్సుక్యము, సిగ్గు అను వ్యభిచారిభావములు స్వశబ్దోపాత్తము లయి నవి; అయినను దోషముగాదు. ఏలన నెచ్చట స్వశబ్దముచేత నయినంత ప్రతీతి తదనుభావముచేతఁ గాదో యచ్చట వ్యభిచారిభావమును స్వశబ్దముచేఁ జెప్పుట దోషముగాదు. ఇట ఔత్సుక్యమను వ్యభిచారిభావమున కనుభావము సహసాప్రసరణము. అదియే 'కృతత్వరా' యని గ్రహింపఁబడినది. 'కృతత్వరా' అను ననుభావముచే నౌత్సుక్యము స్పష్టముగా వ్యక్తము గానందున 'ఔత్సుక్య' మను వ్యభిచారిభావము స్వశబ్దోపాత్తమై ప్రయోగింపఁబడినది. అట్లే సిగ్గునకనుభావముగా 'వ్యావర్తమానా' అనియున్నది. కాని యీవ్యావర్తమానత్వముచేత సిగ్గు విస్పష్టముగా వ్యక్తముగానందున 'హ్రియా' యని ప్రయోగింపఁబడినది. కావున నెచ్చట ననుభావముచే వ్యభిచారిభావము తెస్సగా వ్యక్తమగునో యచ్చట స్వశబ్దమును గ్రహించుట దోషము. ఎచ్చట ననుభావముచే వ్యభిచారిభావము తెస్సగా వ్యక్తముగాదో యట స్వశబ్దమును బ్రయోగించుట దోషముగాదు.

ఒకప్పుడు వ్యభిచారిభావము స్వశబ్దోపాత్తమయినను విభావాది ప్రతిపాదనము గూడ నున్నచో ననఁగా నావ్యభిచారిభావము విభావాదులచే వ్యక్తము సేయఁబడు చున్నచో నది దోషముగాదు. అట వ్యభిచారిభావము విభావాదులచేతనే వ్యక్త మగును. అట్టిచో స్వశబ్దోపాదానము కేవల మనువాదమాత్ర పరమని గ్రహింప వలెను.

యాతే ద్వారవతీం తదా మధురిపౌ తద్దత్తఝంపానతాం
కాళిందీతటరూఢవంజులలతా మాలింగ్య సోత్కంఠయా
తద్గీతం గురుబాష్పగద్గదలసత్తారస్వరం రాధయా
యేనాంతర్జలచారిభిర్జలచరై రప్యుత్కముత్కూజితమ్.

తన్ను విడిచి శ్రీకృష్ణుఁడు ద్వారవతికి వెళ్ళఁగానే యాతనిచే వంపఁబడిన (కోతికొమ్మచ్చి మొదలగు నాటలయందు వంపఁబడిన) కాళిందీ తీరమునందలి వంజులలత నాలింగనము సేసికొని రాధ సోత్కంఠయై యా యమునాజలము నందలి జలచరములు గూడ జాలిపడి రుదించునట్లు బాష్పగద్గదయై బిగ్గరగా నేడ్చెను.

ఇట విభావానుభావ బలము చేతనే రాధయొక్క యుత్కంఠ వ్యక్తమగుచున్నది. అట్లయ్యు 'సోత్కంఠయా' యని యుత్కంఠ స్వశబ్దోపాత్తమైనది. అయినను దోషముగాదు. ఉత్కంఠాశబ్దము విభావాదులచే వ్యంగ్యమైన తన్నే యనువదించుకొనుచున్నది.

౨. రసమును స్వశబ్దముచేతఁ గాని (రసశబ్దముచేఁ గాని) శృంగారాది శబ్దముచేఁ గాని (శృంగార, కరుణాది పదములచేఁ గాని) తెలుపుట యనఁగా నా యా పదములను బ్రయోగించుట దోషము. రసము విభావానుభావ వ్యభిచారులచే వ్యక్తము గావలెను. కాని రస, శృంగారాది పదములను వాడినమాత్రమున రసస్ఫూర్తి గలుగదు.

తామనంగ జయమంగళ శ్రియం
కించిదుచ్చ భుజమూలలోకితామ్
నేత్రయోః కృతవతోఽస్య గోచరే
కోఽప్యజాయత రసో నిరంతరః.

"జనులచేఁ జూడఁబడుచున్న కక్షమూలములు గల యా మన్మథుని జయలక్ష్మి నేత్రములకు గోచరింపఁగా నతని కొకానొక రసము పుట్టెను."

ఇట 'రసము పుట్టెను' అని రసపదమే ప్రయోగింపఁబడినది.

విభావాదులచే రసము వ్యక్తము గావలయును. వానిచే రసము వ్యక్తమైనట్లు రసపదమును బ్రయోగించిన మాత్రమున వ్యక్తము గాదు.

ఆలోక్య కోమల కపోలతలాభిషిక్త
వ్యక్తానురాగసుభగా మభిరామరూపామ్
పశ్యైష బాల్య మతివృత్త్య వివర్తమానః
శృంగారసీమని తరంగిత మాతనోతి.

కోమల కపోలతలము పులకించుటచేఁ దనయం దనురాగమున్నట్లు వ్యక్తము సేయుచున్న యాసుందరిఁ గాంచి యా యువకుఁడు శృంగారమున నోలలాడు చున్నాఁడు.

ఇట శృంగారపదము సాక్షాత్తుగాఁ బ్రయోగింపఁబడినది. పైశ్లోకమునందును దీనియందును రసము వ్యక్తము గాక వాచ్యమైనది. ఇట్లే

శృంగారీ గిరిజాననే, సకరుణో రత్యాం, ప్రవీరః స్మరే
బీభత్సోఽస్థిభిరుత్ఫణీ చ భయకృ న్మూర్త్యాఽద్భుతస్తుంగయా
రౌద్రో దక్షవిమర్దనే, చ హాసకృన్నగ్నః ప్రశాంతశ్చిరా
దిత్థం సర్వరసాత్మకః పశుపతి ర్భూయాత్సతాం భూతయే.

శివుఁడు పార్వతీముఖమును గాంచి శృంగారి యయ్యెను. రతినిఁగాంచి కరుణ రసము (జాలి) గలవాఁడయ్యెను. మన్మథుని యెడల వీరరసాస్పదుఁడయ్యెను. అస్థులను దాల్చి బీభత్సరసాశ్రయుఁడయ్యెను. పాములను వహించి భయానకరసమునకుఁ బట్టయ్యెను. పెద్దమూర్తినిఁ దాల్చి యద్భుతరసమును ధరించెను. దక్షధ్వంసనావసరమున రౌద్రరసమును వహించెను. దిగంబరవేషమును బూని హాస్యరసమునకు నెలవయ్యెను. బహుకాలానంతరమునఁ బ్రశాంత రసాశ్రయుఁడయ్యెను. ఇట్టి సర్వరసాశ్రయుఁడగు పశుపతి సత్పురుషులకు సంపదలను గూర్చుఁగాక.

ఇచ్చటఁగూడ 'శృంగారీ, సకరుణః' ఇత్యాది పదములచే రసము వాచ్యమే యైనది. ఇందలి 'రసము వాచ్యములైనను' అను పద్యమున 'రణరంగము బీభత్స రసోల్లసితము, తరుణి శృంగారసహితురాలు' అను దోషములు నిట్టివియే. కావున నివి దోషములు.

ఒకానొకచో రసపదము గాని, శృంగారాదిపదము గాని ప్రయోగింపఁబడినను విభావాదులచేఁగూడ నది యభివ్యక్తమగుచున్నచో నట రసస్ఫూర్తి గలుగును. కాన నట్టిచో దోషముగాదు. ఎట్లన,

" నయననలినీలీలాకృష్టం పిబంతి రసం ప్రియాః " ప్రియురాండ్రయొక్క చూపులను తామరతూండ్లనుండి విలాసముగాఁ బీల్పఁబడిన రసమును బ్రియులు త్రాగుచున్నారు.

'శృంగారస్యోపనత మధునా రాజ్య మేకాతపత్రం' ఇపుడు శృంగారరసమున కేకచ్ఛత్రాధిపత్యము లభించినది.

ఈ లక్ష్యములందుఁ గ్రమముగా రస, శృంగార శబ్దములు ప్రయోగింపఁబడినను విభావాదులచే లెస్సగా నభివ్యక్తములయి యున్నవానికే కేవల మనువాదము సేయఁబడినది. కాన నియ్యెడల స్వశబ్దవాచ్యత దోషముగాదు.

౩. స్వశబ్దముచే స్థాయినిఁ దెలుపుటయు స్వశబ్దవాచ్యదోషమే.

సంప్రహారే ప్రహరణైః ప్రహారాణాం పరస్పరం
ఠణత్కారైః శ్రుతిగతై రుత్సాహ స్తస్య కోఽప్యభూత్.

యుద్ధమందు భటుల పరస్పర ప్రహారముల ఠణఠణ ధ్వనులచే వాని కుత్సాహము పుట్టెను.

ఇట వీరరస స్థాయిభావమగు నుత్సాహము స్వశబ్దోపాత్తమైనది. ఇది దోషము.

రూపనిర్జిత కందర్పే నయనానందదాయిని
అభూత్తస్యా రతిః క్వాఽపి ప్రియే చాటువిధాయిని.

రూపముచే మన్మథుని జయించినట్టియు నయనానందము గలిగించుచున్నట్టియుఁ బ్రియుఁడు చాటూక్తులు పలుకుచుండగా నామెకు రతి జనించెను.

ఇట 'రతి' యను స్థాయిభావము స్వశబ్దోపాత్తమైనది. ఈవిధముగా వ్యభిచారి, రస, స్థాయిభావములను స్వశబ్దోపాత్తములు సేయుట స్వశబ్దవాచ్య మను దోషము.

౪. అనుభావ విభావములు కష్టముగా గుర్తింపఁబడుటయు దోషము.

కష్టముగా గుర్తింపఁబడుట యనఁగా నొకప్పుడు బొత్తిగా గుర్తింపఁబడకుండుటయు, నొకప్పుడు గష్టముగా గుర్తింపఁబడుటయు నగును.

కర్పూర ధూళి ధవళద్యుతి పూరధౌత
దిఙ్మండలే శిశిరరోచిషి తస్య యూనః
లీలా శిరోఽంశుక నివేశ విశేషక్లృప్తి
వ్యక్తస్తనోన్నతి రభూన్నయనావనౌ సా.

చంద్రుఁడు కర్పూరధూళివలెఁ దెల్లనైన కాంతిపూరమును దిఙ్మండలమున వ్యాపింపఁజేయఁగా నాయువకుని కాయువతి మేలిముసుఁగు సర్దుకొను నెపమునఁ దన స్తనోన్నతిని వ్యక్తము సేయుచుఁ గనఁబడెను.

ఇట యువతీయువకు లాలంబన విభావములు. శశికాంతి యుద్దీపన విభావము. ఈశ్లోకమున యువకనిష్ఠమైన శృంగారమే కవి కుద్దిష్టమైనది. ఏలన "తస్య యూనః నయనావనౌ సా అభూత్" ఆయువకుని నేత్రభూమియందామె గోచరించెను అని యున్నది. ఆమె యతనికిఁ గనఁబడిన స్నపు డాతనియం దనుభావమును గవి చెప్పియుండవలయును. కాని యట్టి అనుభావము చెప్పఁబడలేదు. పోనిమ్ము. విభావముచే దాని నాక్షేపించుటకును వీలులేదు. కావున నిట విభావము లనుభావముఁ బర్యవసింపక నిలిచిపోయినవి. కావున నిట శృంగారము పరిపుష్టముగాలేదు.

స్త్రీనిష్ఠమగు శృంగారమన్ననో పరిపుష్టముగానే యున్నది. ఎట్లన నాయువతి యువకునిఁ జూడఁగానే తన లీలాశిరోంశుకమును సర్దుకొనుచుఁ దన స్తనోన్నతిఁ జూపుచున్నది. అనునర్థమువలన వానినిఁ జూడఁగానే యాపె శిరోంశుకనివేశము, స్తనోన్నతి ప్రకటనము, అను ననుభావములు గలిగినవి. వీనిచే నాపె రతి పరిపుష్టమై రసముగాఁ బరిణమించుచున్నది. కాని యీశ్లోకమునఁ గవికిఁ బురుషనిష్ఠ శృంగారమే యుద్దిష్టమని తెలుపఁబడెను. అది యపరిపుష్టముగానే యున్నది.

పరిహరతి రతిం, మతిం లునీతే, । స్ఖలతిభృశం, పరివర్తతే చ భూయః,
ఇతి బత విషమా దశాస్య దేహం । పరిభవతి ప్రసభం కి మత్రకుర్మః

రతినిఁ బరిహరించుచున్నాఁడు; మతినిఁ గోల్పోవుచున్నాఁడు; మిక్కిలి తొట్రుపడుచున్నాఁడు; మిక్కిలియుఁ బొరలాడుచున్నాఁడు; అకటా! వీని దేహమును విషమదశ పరిభవించుచున్నది.

ఇటనున్న రతిపరిహారాద్యనుభావములు కరుణమునందును సంభవించును. ఇట విప్రలంభశృంగారము కవి కుద్దిష్టము. ఈ యువకునికిఁ గలిగిన యీ యనుభావములు శృంగారకావ్యములో కరుణకావ్యములో తెలిసికొనుట కష్టముగా నున్నది. ఇందనుభావములు మాత్రమే కలవు గాని విభావములు చెప్పఁబడలేదు. కామినీరూపవిభావమును జెప్పవలెను. అట్లు చెప్పఁబడకపోవుటచేఁ గష్టముమీఁద దానినూహింపవలసి వచ్చుచున్నది. ఈ విళంబమువలన నాస్వాదమున కంతరాయము గలుగుచున్నది.

౫. ప్రతికూలరసముయొక్క విభావ, అనుభావ, వ్యభిచారులను గ్రహించుట దోషము.

ఏ యే రసమున కేయే విభావానుభావ వ్యభిచారు లుండవలెనో తెలిపితిమి. మఱియు నే యే రసములు విరుద్ధములో యేవి యవిరుద్ధములో ముందు తెలియును. అట్టిచోఁ బ్రతికూలరసముయొక్క విభావాదులను గ్రహించుట దోషమే కదా! దాని వలన రసభంగ మగును.

### (క) ప్రతికూలరసముయొక్క విభావగ్రహణము.

ప్రసాదే వర్తస్వ! ప్రకటయ ముదం; సంత్యజ రుషం;
ప్రియే! శుష్యంత్యంగా; న్యమృతమివ తే సించతు వచః;
నిధానం సౌఖ్యానాం క్షణమభిముఖం స్థాపయ ముఖం;
న ముగ్ధే! ప్రత్యేతుం ప్రభవతి గతః కాలహరిణః.

ఓ ప్రియురాలా ! ప్రసన్నురాలవు గమ్మ! సమ్మోదముఁ బ్రకటింపుము. పాలయలుకను వదలుము. నా యవయవములు శుష్కించుచున్నవి. నీ యమృత వచనములచేఁ దడుపుము. సుఖములకు నిధియైన నీముఖము నభిముఖముగా నుంచుము. ఓ ముద్దరాలా ! లేడిపిల్లవలెఁ గాలము పరువెత్తిపోవును. తిరిగి రాదుసుమా !

"మానం మాకురు తన్వంగి! జ్ఞాత్వా యౌవనమస్థిరం" ఓ తన్వంగి! యౌవన మస్థిరమని యెఱిఁగి ప్రణయకోపమును మానుము.

ఇటఁ బ్రియుఁడు పాలయలుక వహించిన ప్రియురాలి ననునయించుచున్నాఁడు. కావున శృంగారరసము. దీనికి సర్వథా శాంతరసము ప్రతికూలమైనది. కావున శృంగారమున శాంతమును గాని దాని విభావాదులను గాని ప్రవేశపెట్టరాదు. ఇటఁ బ్రథమశ్లోకమున నాల్గవపాదమునఁ బోయినకాలము తిరిగిరాదనియుఁ గ్రిందిశ్లోకమున యౌవన మస్థిరమనియును వైరాగ్యకథ లుపదేశింపఁబడినవి. కాలముయొక్కయు, యౌవనముయొక్కయు నస్థిరత్వము లు శాంతరస విభావములు. శృంగారమున వానికిఁ బ్రవేశ మనుచితము. కావున నిది దోషము.

## (ఖ) ప్రతికూలరసముయొక్క యనుభావగ్రహణము.

నిభృతరమణే లోచనపథే పతితే గురుజనమధ్యే
సకలపరిహారహృదయా వనగమన మేవేచ్ఛతి వధూః.

తాను బెద్దలలోఁ గూర్చుండియుండఁగాఁ దన మిండఁడు గంటఁబడఁగానే సకలమును బరిహరించి యా తరుణి వనగమనమును నిచ్ఛయించుచున్నది.

సకల పరిహారము, వనగమనము, అనునవి శాంతరసానుభావములు. ఇవి శృంగారరస ప్రతికూలములు. ఇంధనాదులను దెచ్చు నెపమున నామె సకల పరిహారమును, వనగమనమును నేయఁగోరుచున్నదన్నచో దోషములేదు.

ప్రతికూల రసముయొక్క యనుభావములను గ్రహించుట దోషమని చెప్పితిమి. కాని

పాండుక్షామం వదనం । హృదయం సరసం తవాలసం చ వపుః
ఆవేదయతి నితాంతం । క్షేత్రియరోగం సఖి! హృదంతః

ఓసఖీ! నీమొగము పాలిపోయినది; కృశించినది; నీ హృదయము ద్రవించినది; నీశరీర మలసమై యున్నది; నీకేదో కుదరని రోగము వచ్చినట్లున్నది.

ఇందలి పాండిమము, క్షామత్వము, సరసత్వము, అలసత్వము అను ననుభావములు కరుణరసము నుబోధించునవి. ఇట విప్రలంభర సము కరుణ, విప్రలంభశృంగా

రములు విరుద్ధములు. కరుణరసోచితములగు పాండుత్వవ్యాధ్యనుభావములు విప్ర లంభ శృంగారమున సమావేశపఱుపఁబడినవి. కావున దోషమన్నచోఁ గాదు. ఏలన నిటఁ గరుణరసానుభావములు విప్రలంభమున నారోపింపఁబడినవి. అనఁగా నిట విప్రలంభశృంగారమున కంగములుగానే తద్విరోధికరుణాంగములగు పాండుత్వాదులు నారోపింపఁబడినవి. కాన దోషములేదు. కరుణమునవలెనే విప్రలంభమునను వ్యాధ్యాదు లుచితములే కాన నిట దోషమేలేదని కొందఱు. ఇట్లే

కోపాత్కించిదుపాగతోఽపి రభసాదాకృష్య కేశేష్వలం
నీత్వా మోహనమందిరం దయితయా హారేణ బద్ధ్వా దృఢం
భూయో యాస్యసి తద్గృహానితి ముహుః కంఠార్ధరుద్ధాక్షరం
జల్పంత్యా శ్రుతకర్ణోల్లభేన (?) సుకృతీ కశ్చిద్రహస్తాడ్యతే

ఒక యువతి కినుకతోఁ దనకడకు వచ్చిన ప్రియునిఁ గేశములఁబట్టి లాఁగి పడకగదిలోనికిఁ గొంపోయి హారముతో రెక్కలు గట్టి "దాని యింటికి మరలఁ బోవుగదా!" యనుచు గొంతులో మాట లడ్డుపడుచుండఁగా నదరుచుఁ గన్నీళ్ళు గీఱుచు రహస్యముగాఁ గొట్టుచుండెను. వాఁడెంత ధన్యుఁడో కదా!"

ఇటఁ గేశాకర్షణము, బంధనము, తాడనము, మొదలగునవి రౌద్రరసానుభావములు. అయినను శృంగారమున నారోపింపఁబడినవి. రౌద్ర శృంగారములు ప్రతికూలరసము లయినను రౌద్రరసానుభావములు రూపకబలమువలన శృంగారాంగములుగా నారోపింపఁబడినవి. కావున విరుద్ధరసానుభావము లెచ్చట నారోపింపఁబడునో యనఁగా దదంగములుగాఁ జేయఁబడునో యచ్చట దోషముగాదు. ఇట్లే

గీ. కోట అక్కుచుఁ, గడుఁబంటికొనలనొక్కు
చూఁపుచు బుజంబులంబట్టి, సైపరాని
కౌఁగిలింతల నలుపుచుఁ, గాంత్రు కాంతి
రమణు నపరాధముం జూపి రాగవతులు

రౌద్రరసానుభావములు శృంగారమున నారోపింపఁబడినవి. కొన్నియెడలఁ ప్రతికూలరసముయొక్క వ్యభిచారిభావములను గ్రహించినను దోషములేదు. ఎట్లన,

'సంచార్యాదేర్విరుద్ధస్య బాధ్యస్యోక్తిర్గుణావహా' ప్రతికూలరసముయొక్క సంచారిభావములను బాధ్యబాధకభావముతో నిరూపించినచో నది గుణమే యగును. కాని దోషముగాదు. ఎట్లన,

క్వాకార్యం శశలక్ష్మణః? క్వ చ కులం? భూయోఽపి దృశ్యేత సా;
దోషాణాం ప్రశమాయ మే శ్రుతమహో, కోపేఽపి కాంతం ముఖం;

కిం వక్ష్యంత్యపకల్మషాః కృతధియః? స్వప్నేఽపి సా దుర్లభా;
చేతః స్వాస్థ్యముపైహి! కః ఖలు యువా ధన్యోఽధరం పాస్యతి?

అకార్యమెక్కడ? చంద్రవంశమెక్కడ? మరల నా ప్రియురాలు (ఊర్వశి) కనఁబడునా? నా చదువు దోషప్రశమమునకుఁ గాని దోషకరణమునకుఁ గాదు. ఓహో! దాని మొగము కోపమునందును మనోహరమే. కలుషదూరులగు విజ్ఞులు నన్నుఁజూచి యేమందురో? స్వప్నమందును నాపె నాకిఁక దుర్లభము. ఓ మనసా! స్వస్థతను బొందుము. ఏ ధన్యుఁడగు యువకుఁడా యధరమును గ్రోలునో!

ఇది విక్రమోర్వశీయము నందలి పురూరవుని వచనము. ఇందు 'అకార్య మెక్కడ? చంద్రవంశ మెక్కడ?' అనుచో వితర్కమను శాంతరస వ్యభిచారి భావము గలదు. 'మరల నా ప్రియురాలు కనఁబడునా?' అనుచోట శృంగారరస వ్యభిచారి యగు నౌత్సుక్యము; "నా చదువు దోషప్రశమమునకుఁ గాని దోషకర ణమునకుఁ గాదు" అనుచో శాంతరస వ్యభిచారి యగు మతి; "దాని మొగము కోపమునందును మనోహరమే" యనుచో శృంగారరస వ్యభిచారి యగు దైన్యము; "ఓ మనసా! స్వస్థతనుబొందుము" అనుచో శాంతరస వ్యభిచారి యగు ధృతి. "ఏ ధన్యుఁడగు యువకుఁడా యధరమును గ్రోలునో" అనుచో శృంగార వ్యభి చారి యగు చింతయుఁ గలవు.

ఇందు వితర్కమును నౌత్సుక్యము బాధించుచున్నది. కాన వితర్కము బాధ్యము. ఔత్సుక్యము బాధకము. మరల నౌత్సుక్యము బాధ్యము. మతి బాధ కము. తిరిగి మతి బాధ్యము. స్మరణము బాధకము. పిమ్మట స్మరణము బాధ్యము. శంక బాధకము. తరువాత శంక బాధ్యము. దైన్యము బాధకము. క్రమ్మఱ దైన్యము బాధ్యము. ధృతి బాధకము. అంతమున ధృతి బాధ్యము. చింత బాధకము – ఈవిధ ముగా పరస్పర విరుద్ధములగు శాంత శృంగార రసములయొక్క వ్యభిచారులు బాధ్య బాధక భావములతో నిరూపింపఁబడినవి. శాంత శృంగారములు పరస్పర విరుద్ధము లయినను వాని వ్యభిచారు లీ విధముగా బాధ్యబాధక భావములతో నుండి శృంగా రమును బోషించుచునే యున్నవి. అనఁగాఁ దుదికి శృంగార వ్యభిచారియగు చింత యందే పర్యవసించును. ఇట్లే

స్నిగ్ధశ్యామలకాంతిలిప్తవియతో వేల్లద్బలాకా ఘనాః
వాతాశ్శీకరిణః పయోదసుహృదా మానందకేకాః కలాః
కామం సంతు దృఢం కఠోరహృదయో రామోఽస్మి సర్వంసహే
వైదేహీ తు కథం భవిష్యతి? హాహా హా దేవి! ధీరా భవ!

మేఘములు దమ చక్కని నల్లని కాంతులచే నాకాశము నలికినవి. బలాకలు వానినిఁ జుట్టుకొనియున్నవి. వాయువులు చల్లఁగా వీఁచుచున్నవి. ఆ మబ్బులకు మిత్రములయిన నెమిళ్ళు కేఁకరించుచున్నవి. మంచిది. ఇవన్నియును నుండనిమ్ము! నేను రాముఁడనుగదా! సర్వమును సహించుకొందును. కాని నా సీత యెట్లు భరించును? అయ్యో! దేవీ! ధైర్యము వహింపుము.

ఇట 'రామోఽస్మి సర్వంసహే' అనుచోట వీరరస వ్యభిచారి యగు ధైర్యము, 'హా హా దేవి' అనుచో విప్రలంభ వ్యభిచారి యగు నపస్మారమును బాధ్యబాధక భావముతో నిరూపింపఁబడినవి. వీర శృంగారవిప్రలంభములు విరుద్ధములయినను వాని వ్యభిచారులు బాధ్యబాధకములుగా నిరూపింపఁబడి విప్రలంభమును లెస్సగా బోషించుచున్నవి.

౬. రసముయొక్క పునఃపునర్దీప్తి.

నిరూపింపఁదగినదానికన్న నధికముగా రసమునకు దీప్తినిఁ గలిగించి నిరూపించుట. మితి దాఁటినచో వెక్కసమగును. కుమారసంభవమున రతివిలాపమునఁ గవి తిరిగి తిరిగి కరుణమునకు దీప్తిఁ గలిగించెను. ఇది వెక్కసముగా నున్నది.

౭. అసమయమున రసమును బ్రకాశింపఁజేయుట.

మహాభయంకరముగా యుద్ధము జరుగుచుండఁగా నాయకుఁ డటకుఁ బోక యంతఃపురములో శృంగారమున నోలలాడుచున్నట్లు వర్ణించుట మొదలగునది దోషము. ఇట ననవసరమగుచోట శృంగారరసము వర్ణింపఁబడుట దోషము. ఇట్టి యెడల నాయకుఁడు దైవవ్యామోహితుఁడై యట్లు ప్రవర్తించెననుట యుచితము గాదు. ఏలన, నితివృత్తమున నిట్టి దోషములున్నచో గవి వానినిఁ దొలఁగించి యితివృత్తమును రసవ్యంజకముగాఁ జేయవలెను. కావున వేణీసంహారమున ననేక వీర సంక్షయము గల మహాయుద్ధము జరుగుచుండఁగా భానుమతితో దుర్యోధనుఁడు శృంగారరసమున నోలలాడుచుంట దోషము.

౮. అసమయమున రసమును విరమించుట.

ఒక నాయిక పొత్తు నభిలషించి పరస్పరానురాగము పరాకాష్ఠను బొంది యుండఁగా నాయకుఁడు సమాగమోపాయమును జింతింపక వ్యాపారాంతర నిమగ్నుఁడై యున్నట్లు వర్ణించుట మొదలగునది. వ్యాపారాంతర నిమగ్నతచే రసము విచ్ఛిన్న మగును.

౯. అంగభూతమగు రసమును విస్తరించుట.

హయగ్రీవవధమను నాటకమున నాయకుఁడు శ్రీమహావిష్ణువు. ప్రతినాయకుఁడు హయగ్రీవుఁడు. ఇం దంగిభూతమగు రసము వీరము. అంగభూతమగు రసము రౌద్రము. ఇం దంగికన్న నంగ మధికముగా వర్ణింపఁబడినది. కాన నిది దోషము. కాని యొకవిధముగా నిది దోషముగాదు. ఏలన

అథవా ప్రతిపక్షస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్
తజ్జయా న్నాయకోత్కర్ష వర్ణనం చ మతం క్వచిత్

ప్రతినాయకుని గుణముల నధికముగా వర్ణించి నాయకుఁడు వానిని జయించినట్లు వర్ణించుటయు సమ్మతమే. కావునఁ బ్రతినాయకుఁడైన హయగ్రీవునియందు రౌద్రరసమును విస్తరించి వర్ణించుట దోషముగాదు. ఇట్టిచో నీయుదాహరణము దగదు. శిశుపాలవధయందు నాయక ప్రతినాయకులు శ్రీకృష్ణ శిశుపాలురు. ఇందుఁ బ్రధానరసము వీరము. శృంగార రౌద్రాదు లంగరసములు. అందు శృంగారాంగభూతమగు ఋతు, వనవిహార, పుష్పాపచయ, జలకేళ్యాది వర్ణనము సేయఁబడినది. ప్రధానరసముకన్న నంగభూతమగు రసము విస్తరింపఁబడినది. కాన దోషము. ఇట్లే కిరాతార్జునీయమునను గలదు.

౧౦. అంగిరసము ననుసంధింపకుండుట.

కావ్య నాటకాదులందు నంగభూతముగా నితరరసములు వర్ణింపఁబడుచున్నను గవి ప్రధానరసము ననుసంధింపవలసినచోట్ల ననుసంధింపవలయును. తాపసవత్సరాజమున నాలంకములందును వాసవదత్తా విషయకమగు ప్రేమసంబంధము కథావశమున విచ్ఛిన్నమగుచున్నట్లు శంకింపఁబడుచున్నను ననుసంధింపఁబడినది.

౧౧. ప్రకృతి విపర్యయము.—స్వభావమును సముచితముగా వర్ణింపకుండుట. ఈ ప్రకృతి దివ్యప్రకృతి, అదివ్యప్రకృతి, దివ్యాదివ్యప్రకృతి యని మువ్విధములు. ఈ ప్రకృతులను జిత్రించుటలోఁ గవి చాల జాగరూకుఁడై యుండవలెను. లేకున్న ననౌచిత్య దోషముగలిగి రసభంగమగును. ఎట్లన

క్రోధం ప్రభో! సంహర సంహరేతి యావద్గిరః ఖే మరుతాం చరంతి
తావత్సవహ్నిర్భవనేత్ర జన్మా భస్మావశేషం మదనం చకార

'ఓ ప్రభూ! కోప ముపసంహరింపుము.' అను దేవతల నోటిమాట నోటియందుండఁగనే హరనేత్రాగ్ని యా మదనుని భస్మావశేషము సేసెను.

ఇట్టి కోపము దివ్యులకే యుచితము గాని యదివ్యులకుఁ గాదు. అట్లే స్వర్గ, పాతాళ, గమన, సముద్రోల్లంఘనాదులు దివ్యులకే యుచితము గాని యదివ్యులకుఁ గాదు. అదివ్యుల కెంతవఱ కుచితమో యంతవఱకు నిబంధింపవచ్చును. దివ్యాదివ్య ప్రకృతులయందు రెంటిని నుపనిబంధింపవచ్చును. వీర, రౌద్ర, శృంగార, శాంత రసప్రధానులగు ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతులను వర్ణించునపు డదివ్యులనువలెనే దివ్యులను వర్ణింపవచ్చును. అదివ్యులందలి ధీరోదాత్తాదులును దివ్యులందలి ధీరోదాత్తాదులును సములుగానే యుందురు. కాని యొక విశేషము గలదు. అదివ్యులగు నుత్తమనాయకుల రతి వర్ణనముసేయు విధమున దివ్యనాయకుల రతి వర్ణనముసేయరాదు. ఆ వర్ణనము తలిదండ్రుల రతి వర్ణనమువలె మిక్కిలి యను చితమై యుండును. కాళిదాసమహాకవి కుమారసంభవమునఁ బార్వతీపరమేశ్వరుల రతి వర్ణించెనని విమర్శకులెల్లరును దూసిపోసిరి. మరియు నాటకాదు లెందెవరెవ రెవరి నెట్లు సంబోధింపవలయునో యా మర్యాదను దప్పుటయు ననౌచిత్యమే. ఇట్లే దేశ, కాల, వయో, జాత్యాదులకు సముచిత వ్యవహారము నుపనిబంధింప వలయును.

## ౧౨. రసానుపకారకమైనదానిని వర్ణించుట.

ప్రధానభూతమగు రసమునకు నుపకారకముగాని విషయమును వర్ణించుట. కర్పూరమంజరి యను నాటికయందు రాజనాయికలు మొదట వసంతవర్ణనము సేయుదురు. పిమ్మట వందిమాగధులు సేయుదురు. రాజు తన నాయికలు సేసిన వర్ణనము ననాదరించి వందిమాగధులు సేసినదానినిఁ బ్రశంసించును. ఇట వంది మాగధుల ప్రశంస రసానుపకారకము.

ఇంకను నిట్టివి గలవు. అనఁగా నాయికా పాదప్రహరణముచే నాయకునికిఁ గోపము వచ్చినట్లు వర్ణించుట మొదలగునవి రసదోషములే. సహృదయులగు కవులు వానిని స్వయముగా నూహించుకొనవలెను. ఇట్లే యితర రసములలోని దోషములను గూడ నూహించుకొనవలెను.

ఈ రసదోషములలో నటనట విరుద్ధరసములనుగూర్చి ముచ్చటించియుంటిమి. విరుద్ధరసము లేవియో వానికిఁ గావ్యములలో సమావేశము నెట్లు చేయవలెనో ప్రసక్తానుప్రసక్తిచే నిట చూపఁబడును.

## పరస్పర విరుద్ధరసములు.

శృంగారమునకుఁ గరుణ, వీర, రౌద్ర, బీభత్స, భయానకములు విరుద్ధములు; హాస్యమునకుఁ గరుణ భయానకములు విరుద్ధములు; కరుణమునకు హాస్య శృంగారములు

విరుద్ధములు; రౌద్రమునకు హాస్య శృంగార భయానకములు విరుద్ధములు; వీరమునకు భయానక శాంతములు విరుద్ధములు; భయానకమునకు శృంగార, వీర, రౌద్ర, హాస్య, శాంతములు విరుద్ధములు; శాంతమునకు వీర, శృంగార, రౌద్ర, హాస్య, భయానకములు విరుద్ధములు; బీభత్సమునకు శృంగారము విరుద్ధము. వీనికి సమావేశ విధము చెప్పఁబడుచున్నది.

ఆశ్రయైక్యే విరుద్ధో య స్స కార్యో భిన్నసంశ్రయః
రసాంతరేణాంతరితో నైరంతర్యేణ యో రసః.

ఈ పరస్పర విరుద్ధరసములను నేకనాయకాశ్రయములుగాఁ జేసినచో విరోధము. కాని భిన్ననాయకాశ్రయములను జేసినచో దోషమురాదు. ఎట్లన, వీర భయానకములును, బీభత్స, హాస్యాదులును నేకనాయకునియం దుండరాదు. అట్టిచో నా రెండురసములను నాయక ప్రతినాయకులయందు నివేశపఱుపవలెను.

ఈ క్రింది శ్లోకమున బీభత్స హాస్యములు భిన్ననాయకాశ్రయములై యున్నవి. చూడుఁడు.

స్నాయువ్యాసనిబద్ధకీకసతనుం నృత్యంత మాలోక్య మాం
చాముండాకరతాలఘట్టితలయం వృత్తే వివాహోత్సవే
హ్రీముద్రామపనుద్య యద్విహసితం చిత్రం సమం శంభునా
తేనాద్యాపి మయి ప్రభుస్సజగతా మాస్తే ప్రసాదోన్ముఖః.

“చిన్ననరములచే విరివిగాఁ జుట్టఁబడిన యెముకలమేను గలిగి చాముండాకర తాళములచే లయవేయ, నృత్యమాడుచున్న నన్నుఁ జూచి వివాహమహోత్సవమున లజ్జాముద్రను బోనాడి శంభుఁడు చిత్రముగా నవ్వెను. దానిచే నా జగత్ప్రభువు నాయం దిప్పటికినిఁ బ్రసాదోన్ముఖుఁడై యున్నాఁడు”

ఇట బీభత్సరసము నాట్యమాడుచున్న సేవకునియందును హాస్యరసము శంభుని యందును గలదు.

మరియు నొకప్పుడు విరుద్ధరసములను నేకనాయకాశ్రయములుగానే నిబంధింప వచ్చును. ఎట్లన, నా విరుద్ధరసముల నడుమ వేరొకరసమును సమావేశపఱుపవలయును. ఎట్లన, శాంత శృంగారములు పరస్పర విరుద్ధములు. ఏకనాయకాశ్రయములుగాఁ జేయవలసివచ్చినపుడు నడుమ నద్భుతరసమును బ్రవేశపెట్టవలయును. నాగానందమునఁ బ్రథమమున జీమూతవాహనుఁడను నాయకుఁడు శాంతరసాశ్రయుఁడా నిబంధింపఁబడెను. ఆతఁడే పిమ్మట మలయవతి యను నాయికను జూచి వరించి శృంగారాశ్రయుఁడయ్యెను. అట్టియెడలఁ గవి జీమూతవాహనుఁడు మలయ

వలీ గానము నాలకించి “ అహో గీతము; అహో వాదిత్రము ” అని యద్భుత మొందినట్లు వర్ణించి నాయకుని నద్భుతరసాశ్రయునిఁ జేసెను. పిమ్మట మలయవత్యనురాగాదులను వర్ణించి యాతనిని శృంగార నాయకునిగా వర్ణించెను. ఇట శాంత శృంగారరసముల నడుమ నద్భుతము ప్రవేశపెట్టఁబడినది. కావున నేకనాయకాశ్రయములుగా విరుద్ధరసములను సమావేశపఱుపవలసినచోట్ల నడుమ రసాంతరమును బ్రవేశపెట్టవలెను. అట్లయినచో దోషము నివర్తిల్లును. ఇట్లు రసాంతర సమావేశము ప్రబంధమునందే కాదు. ఏకవాక్యమునందును రసాంతర వ్యవధానముచే దోషము నివర్తిల్లును. ప్రబంధమన సంఘటిత నానావాక్య సముదాయము. అది గ్రంథరూపముగాఁ గాని తదవాంతర ప్రకరణరూపముగాఁగాని యుండవచ్చును. కనుఁడు.

> భూరేణుదిగ్ధా న్నవపారిజాతమాలా రజోవాసిత బాహుమధ్యాః
> గాఢం శివాభిః పరిరభ్యమాణాన్ సురాంగనాశ్లిష్ట భుజాంతరాళాః
> సశోణితైః క్రవ్యభుజాంస్ఫురద్భిః పక్షైః ఖగానాముపవీజ్యమానాన్
> సంవీజితాశ్చందనవారిసేకైః సుగంధిభిః పుష్పలతాదుకూలైః
> విమానపర్యంకతలే నిషణ్ణాః కుతూహలావిష్టతయా తదానీం
> నిర్దిశ్యమానాన్ లలనాంగుళీభి ర్వీరాః స్వదేహాన్ పతితా నపశ్యన్.

యుద్ధమున వీరులు మరణించి వీరస్వర్గమునకుఁ బోవుచున్నారు. వారికి దివ్యదేహములు వచ్చినవి. ఆ దివ్యదేహములతో విమానములందుఁ గూర్చుండి యుద్ధభూమియందుఁ బడియున్న పూర్వదేహములను జూచుచున్నారని వర్ణింపఁబడినది. ఎట్లనఁ, దామిపుడు నవపారిజాతమాలలయొక్క పుప్పొడిలోఁ బరిమళించు వక్షఃప్రదేశము గలవారై, యుద్ధభూమియందు దుమ్ములోఁ బొరలాడుచున్నట్టియు, వేలుపు పూబోండ్ల కౌఁగిలింతలఁ జొక్కుచున్నవారై యాఁడునక్కల కౌఁగులఁ బొందుచున్నట్టియుఁ, జందనోదకములచేఁ బరిమళించు నా వేల్పుఁబోండ్ల కల్పలతాదుకూలములచే విసరఁబడుచున్నవారై మాంసమును భక్షించుచున్న పక్షులయొక్క రక్తసిక్తపక్షములచే నదరుచున్నట్టియు నేలఁబడిన స్వదేహములను వీరులు విమానములందుఁ గూర్చుండి సురాంగనలు వ్రేలితో నిర్దేశించి చూపుచుండఁగాఁ గుతూహలావిష్టులై చూచిరి.

ఇట బీభత్స శృంగారరసములు గలవు. ఇవి రెండును విరుద్ధరసములు. కాని నడుమ “వీరాస్స్వదేహాన్” అని వీరరసమును గవి ప్రవేశపెట్టినాఁడు. ‘వీరాః’ అను పదముచేతనే యిట వీరరస మెట్లు సమావిష్టమైనదని యడుగవచ్చును.

ఈ 'వీర' పదముచేత దాని స్థాయి యగు నుత్సాహ మభివ్యక్తమగును. పూర్ణరస మండదు. దాని స్పర్శ యల్పెిగానున్నను జాలును.

"స్మర్యమాణో విరుద్ధోఽపి సామ్యేనాథ వివక్షితః
అంగిన్యంగత్వమాప్తౌ యౌ తౌ న దుష్టౌ పరస్పరమ్"

౧. విరుద్ధరసమైనను స్మర్యమాణముగా నిబద్ధమగుచో (జ్ఞప్తికిఁ దెచ్చుకొని విచారపడుచున్నపుడు) దోషముగాదు. ౨. మరియు విరుద్ధరసములు సామ్యముచే వివక్షింపఁబడినపుడును దోషములేదు. 3. మరియొక ప్రధానరసమునకు (అంగి) గాని భావమునకుఁగాని యంగములుగా విరుద్ధరసముల నిబంధించినను దోషములేదు.

౧. విరుద్ధరసమైనను స్మర్యమాణముగా నిబద్ధమగుచో దోషములేదు.

అయం స రశనోత్కర్షీ పీన స్తన విమర్దనః
నాభ్యూరుజఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః.

ఈ హస్తము నా మొలనూలి నూడఁదీసి వేసెడిది. నా బలిసిన చన్నులను బిసుకుచుండెడిది. నా నాభిని, తొడలను, జఘనమును దడిమెడిది. నా పోఁక ముడిని విప్పెడిది.

ఇది యుద్ధభూమియందుఁ దెగిపడిన భూరిశ్రవసుని హస్తమును గాంచి యతని భార్య విలపించిన విధము. అతని భార్య యా హస్తమును గాంచి పూర్వావస్థను స్మరించినది. ఇది కరుణరస ఘట్టము. దీనికి శృంగారము విరుద్ధము. అయినను శృంగారము స్మర్యమాణముగా నిబంధింపఁబడి కరుణమును బోషించుచున్నది. ప్రకృతిరమణీయములగు పదార్థములు శోచనీయములై తొల్లింటివాని యందచంద ములును విలాసములును దలఁపునకురాఁగా మిక్కిలి శోకావేగమును గలిగించును. ఈవిధముగ శృంగారము కరుణమును బోషించును. కాన నిట దోషాశంక లేదు.

౨. విరుద్ధరసములు సామ్యముచే వివక్షింపఁబడినపుడును దోషములేదు.

దంతక్షతాని కరజైశ్చ విపాటితాని
ప్రోద్భిన్నసాంద్రపులకే భవతశ్శరీరే
దత్తాని రక్తమనసా మృగరాజవధ్వా
జాతస్పృహైర్మునిభి రప్యవలోకితాని.

రక్తమనస్క యగు సింహిక నీపులకితగాత్రమున నొనర్చిన దంతక్షతములను, నఖక్షతములను గాంచి మునులును జాతస్పృహులయిరి.

బుద్ధుఁ డొక జన్మమున మునియై శిష్యులతోడ నరణ్యమునఁ దిరుగుచుండ నొక్కెడ నొక ... యాఁకటికిఁ దాళఁ

జాలక తన కన్నబిడ్డలనే తాను భక్షించుచుండెను. దానిని గాంచి యా బుద్ధుఁడు కరుణాళువు గాన భక్షింపఁబడుచున్న యా శిశువును లాఁగి తన దేహము నా పులికి సమర్పించి మరణించెను. ఈ కథను బోధించుచున్న దీ శ్లోకము. (ఈ కథను నేను వ్యాఘ్రజాతక మను పేరితోఁ బద్యరూపమున వ్రాసితిని. జాతక కథాగుచ్ఛములోఁ గలదు.)

ఇందు శృంగార దయా వీరములకు సామ్యము వివక్షితమై యున్నది. ఇట రెండు విధములగు వ్యాఖ్యానములు గలవు. మొదటిది యిది:—

"తన ప్రియురాలొసఁగిన దంతక్షతములను, నఖక్షతములను ప్రియుఁడెట్లను రాగాతిశయముతో స్వీకరించునో యట్లే వ్యాఘ్రీదత్తములయిన దంతక్షత నఖక్షతములను జినుఁడును (బుద్ధుఁడు) స్వీకరించెను." అను నర్థము వచ్చుటవలన దంతక్షతాది ధారణరూపమగు ననుభావములకు సామ్యము వివక్షింపఁబడినది. అనుభావములు రసమున కంగములుగదా! కావున నిట నంగములకు సామ్యము వివక్షింపఁబడినది. అంగసామ్యముచే నంగిభూతములగు జినన్నిష్ఠ కాముకనిష్ఠములగు దయావీర శృంగారములకు సామ్యము వివక్షింపఁబడెను. ఇట నంగి దయావీరము. అంగము శృంగారము. పైనిఁగల 'తన ప్రియురాలొసఁగిన' ఇత్యాదికమందు "ఎట్లు స్వీకరించునో యట్లు" ఇత్యాదికము గలదు. అందు మొదటిదగు శృంగారముపమానముగా గ్రహింపఁబడినది. కాన నది దయావీరమున కంగము.

రెండవ వ్యాఖ్యానము:— "ఒకానొక శృంగారి యొకానొక కాముకుని యొక్క ప్రియాదత్తదంతక్షతాదులను గాంచి నేనుగూడ నీవిధముగాఁ బ్రియాదత్త దంతక్షతాది యుక్తుఁడ నగుదునా? యని యభిలషించునట్లు జినుని శరీరమందలి వ్యాఘ్రీదత్తదంతక్షతాదులను విలోకించి మునులు మేముగూడ నిట్లు దయాళువుల మగుదుమా? యని యభిలషించిరి" అను నర్థము వచ్చును. ఇందు జినశరీరస్థములగు దంతక్షతాదులు మునుల కుద్దీపనవిభావములు గానయ్యెను. వ్యాఘ్రీదత్తదంతక్షతాదులు ప్రియాదత్తదంతక్షతములవలె నున్నవనుటచే సామ్యము వివక్షితమైనది. కావుననిట నుద్దీపన విభావములకు ననఁగా నంగములకు సామ్యము పేర్కొనఁబడినది. అంగముల యొక్క సామ్యముచే నంగిభూతములగు మునినిష్ఠ పరశృంగారినిష్ఠ దయావీరశృంగారములకుఁగూడ సామ్యము వివక్షింపఁబడినది.

పూర్వవ్యాఖ్యానమున దంతక్షతాదిరూపమగు ననుభావములకు సామ్యవివక్ష. ఉత్తరవ్యాఖ్యానమున దంతక్షతాదిరూపమగు నుద్దీపన విభావములకు సామ్యవివక్ష. మొత్తముమీఁద రెండును నంగములే. అంగసామ్యమునుబట్టి యంగిసామ్యము వివక్షింపఁబడినది.

విరుద్ధరసములకు సామ్యమున్నను నెచ్చట నంగరసముచే నంగిరసమునకుఁ బుష్టి గలుగదో యట దోషమే; అనఁగా సామ్యము వివక్షింపఁబడినపు డంగరసముచే నంగిరసమునకుఁ బుష్టి గలుగవలయును. పైని శృంగారముచే దయావీరమునకుఁ బుష్టి గలిగినది. అట్టి పుష్టిలేనిచో దోషమే. చూడుఁడు.

> రామమన్మథ శరేణ తాడితా దుస్సహేన హృదయే నిశాచరీ
> గంధవద్రుధిర చందనోక్షితా జీవితేశ వసతిం జగామ సా

ఆ రాక్షసి (తాటక) మన్మథునివంటి రామునియొక్క బాణముచే హృదయమునఁ గొట్టఁబడినదై గంధముగల చందనమువంటి రక్తమునఁ దోఁగుచు యముని యింటికిఁ బోయెను.

ఆ నిశాచరి (అభిసారిక) రాముఁడను మన్మథునియొక్క బాణముచేఁ గొట్టఁబడినదై గంధముగల రక్తచందనమునఁ (ఎఱ్ఱచందనమున) దోఁగుచుఁ బ్రియుని యింటి కేఁగెను.

ఇట బీభత్స శృంగారములకు సామ్యము వివక్షితమైననిం అభిసారిక జీవితేశుని గృహమునకుఁ బోయినట్లు తాటకయు జీవితేశుని గృహమునకుఁ బోయెనని సామ్యము వివక్షింపఁబడినది. కాని పైని శృంగారము దయావీరమును బోషించుచున్న ట్లిచ్చట శృంగారము బీభత్సమును బోషించుటలేదు. కాన నిట సామ్యమున్నను రసపోషకత్వము లేమి నిది దోషమే. కావుననే యిది యమతపరార్థమను దోషముగా నర్థదోషములలో గణింపఁబడినది.

౩. విరుద్ధములయినను బ్రధానభూతమగు భావమునకుఁగాని మరొకరసమునకుఁగాని యంగములుగా వివక్షితములయినచో దోషములేదు.

> క్రామంత్యః క్షతకోమలాంగులి గళద్రక్తైః సదర్భాస్థలీః
> పాదైః పాతిత యావకైరివ పతద్బాష్పాంబు ధౌతాననాః
> భీతా భర్తృ కరావలంబిత కరా స్త్వ చ్ఛత్రునార్యోఽధునా
> దావాగ్నిం పరితో భ్రమంతి పునరప్యుద్య ద్వివాహా ఇవ.

లత్తుక జాతిపోవుచున్నట్లు కంటకక్షతులచేఁ గోమలాంగుళులనుండి రక్తము స్రవించుచుండఁగా, దర్భాంకురములుగల ప్రదేశములందు సంచరించుచుఁ, గన్నుల నీరు గాఱుచుండఁగా భయపడుచు భర్తలచేయి పట్టుకొని నీశత్రుస్త్రీలు మరల వివాహప్రవృత్తలయిరో యన్నట్లు దావాగ్ని చుట్టును దిరుగుచున్నారు.

ఈచాటుశ్లోకమున రాజవిషయకమగు రతికిఁ బ్రాధాన్యము. అనఁగాఁ గవి రాజుయొక్క ప్రతాపాతిశయమును వర్ణింపఁబూనెను. కావ రాజవిషయక కవిరతి

ప్రధానము. కాళ్లనుండి రక్తము స్రవించుచుండఁగాఁ గన్నీరు విడుచుచు భీతులై దావాగ్ని చుట్టును బరిభ్రమించుచున్నారని చెప్పుటచేఁ గరుణరసము వ్యక్తమగు చున్నది. అటనే "ఉద్యద్వివాహా ఇవ" అనియు నుంటచే శృంగారమును వ్యక్త మగుచున్నది. మరియును గరుణరసవ్యంజకములగు విశేషణములే శృంగారరస వ్యంజకములుగా నిలిచినవి. కావునఁ బ్రధానమగు రాజవిషయకకవిరతికిఁ గరుణమును శృంగారమును నంగములై యున్నవి. శృంగార కరుణములు పరస్పర విరుద్ధరసములే. అయినను నంగియగు రాజరతికి నివి రెండును నంగములై యున్నవి. పరస్పర విరోధు లగు నిరువురు సేనాధిపతు లొక రాజువద్ద నడఁగి తాము విరోధులయ్యును రాజున కిరువురు ననుకూలభావముతో వర్తిల్లన ట్లిచ్చటను రాజరతికి సాక్షాదంగములై తత్పోషణమున జాగరూకములై యున్నవి. ఇట్లే

క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోంఽశుకాంతం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితస్సంభ్రమేణ
ఆలింగన్ యోఽవధూతస్త్రిపురయువతిభిస్సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధ స్సదహతు దురితం శాంభవో వశ్శరాగ్నిః

ఆర్ద్రాపరాధుఁడగు (నూతనముగా నపరాధమొనర్చిన) కాముకుఁడు తన ప్రియురాలి ననునయింపఁదలఁచి యామె హస్తమును బట్టుకొనెను. ఆమె పాల యలుకగలదగుటచే వానిని విదిలించెను. ఆతఁడును మరల నామె చీరచెఱఁగును బట్టెను. ఆమె బలిమిలోఁ గొట్టెను. ఆతఁడును నామె కేశములను గ్రహించెను. ఆమె వానినిఁ దొలఁగఁద్రోసెను. వాఁడును జరణములమీఁద వ్రాలెను. ఆమె తొట్రుపాటున (నిర్లక్ష్యభావముతో) వానినిఁ జూడలేదు. అతఁడు తుదికి నామెను గౌఁగిలించెను. ఆమెయు వానిని నెట్టివేసెను.

శంభుశరాగ్నియు నిట్టి యార్ద్రాపరాధుఁడగు కాముకునివలె నా త్రిపుర యువతులచేతి నంటెను. వారు విదిలించిరి. చీరకొంగులను దాఁకెను. వారు దానినిఁ గొట్టిరి (కొట్టి యార్పుకొనిరి.) శిరోజములను ముట్టెను. వారును దొలఁగించుకొనిరి. కాళ్ళపయిఁబడెను. తడఁబాటున వారు దానినిఁ జూడకపోయిరి. వారి శరీరముల నంటెను. వారును నెట్టివైచిరి.

ఇటఁ ద్రిపురరిపువైన శంభుని గుఱించిన కవిరతి ప్రధానము. దీనికిఁ గరుణ మంగము. కరుణమునకు శృంగార మంగము. ఏలన, "ఆర్ద్రాపరాధుఁడగు కాముకుని వలె" అని శృంగారము కరుణమున కంగముగానే గ్రహింపఁబడినది. కరుణ శృంగార ములు పరస్పర విరుద్ధములే. అయినను త్రిపుర విషయకకవిరతికి రెండును నంగ

ములే. వెనుకటి శ్లోకమున రాజవిషయకరతికి రెండును సాక్షాదంగములు. ఇటఁ త్రిపురరిపువిషయకరతికిఁ గరుణమును, దానికి శృంగారమును నంగములు. ఇదియే భేదము. ఈ భేదప్రదర్శనార్థమే యీ యుదాహరణము స్వీకరింపఁబడినది. ఇందు శృంగారాపేక్షచేఁ గరుణము ప్రధానమయినను త్రిపురరిపువిషయకరతిలో నంగమే.

లేక "తొల్లి కాముకుఁడగు తమ ప్రియుఁ డెట్లు వ్యవహరించెనో నేఁడు శరాగ్నియు నావిధముగానే వ్యవహరించుచున్నది" అని తొల్లింటి శృంగారము స్మర్యమాణమై ప్రధానమగు కరుణరసమును బోషించుచున్నది. అనియును జెప్ప వచ్చునని కొందఱి మతము.

"వినేయానున్ముఖీకర్తుం కావ్యశోభార్థ మేవ వా
తద్విరుద్ధరసస్పర్శ స్తదంగానాం న దుష్యతి."

వినేయులనఁ బామరులు. వారిని సుముఖులనుగాఁ జేసికొనుటకును, గావ్య శోభకును విరుద్ధరసస్పర్శ దోషముగాదు. ఎట్లన,

"సత్యం మనోరమా రామా స్సత్యం రమ్యా విభూతయః
కిం తు మత్తాంగనాపాంగభంగలోలం హి జీవితం"

నిజముగాఁ గాంతలు మనోహారిణులు. సంపదలును రమ్యములే. కాని యీ జీవితము మదించిన యువతుల కటాక్షవలెనే చంచలము.

ఇట "జీవితము చంచలము" అనుచోఁ శాంతరసము గలదు. శాంతరసము పరిపక్వబుద్ధులకే కాని పామరుల కాస్వాద్యముగాదు. కానఁ బామరులను గూడ శాంతరసమునకు సుముఖులనుగాఁ జేయుటకై శృంగారాంగమగు మత్తాంగనాకటాక్ష ముపమానముగా గ్రహింపఁబడినది. శృంగార మెల్లరికిని ననుభూతమే కాన దాని యుపమానమునఁ బామరులుంగూడ శాంతరసమును సులభముగా నాస్వాదింపఁగలుగుదురు. ఇట్టి యెడల నీ విరుద్ధరస సమావేశము దోషముగాదు.

వెనుక 'ప్రసాదే వర్తస్వ' అనుచోటఁ బ్రతికూల విభావాది గ్రహణము దోషమని చెప్పితిమి. కాని యిట్టిచోట్ల దోషముగాదు.

దోషప్రకరణము సమాప్తము.

---

## గుణ ప్రకరణము

గీ ఇంక గుణములు వివరింతు నివియుఁ గృతుల
దొరసి శ్లేష, ప్రసాద, మాధుర్య, సౌకు
మార్య, సమతా,ర్థదీప, నౌదార్య, కాంతు
లనఁగ నోజ,స్సమాధులు, ననఁ జెలంగు. ౫౬

శ్లేష, ప్రసాద, మాధుర్య, సౌకుమార్య, సమతా, అర్థదీపన (అర్థవ్యక్తి) ఉదారతా, కాంతి, ఓజస్సమాధు లనునవి పది గుణములు. మనుష్యునికి గుణము లెట్టివో కావ్యమునకు గుణములట్టివి. "నీతిలేనివాని నిందింత్రు లోకులు । లేమ నేఁగి లాఁతిలేకయున్న" అన్నట్లు మనుష్యుని నీతికి సంబంధించిన గుణములవంటి గుణములు కావ్యమున లేనిచోఁ గావ్యము నీరసమే యగును. అలంకారములు లేకున్నను లోపములేదు. కాని గుణములు సముచితముగా నిబంధింపఁబడకున్నచోఁ గావ్యమునకు లోపము గలుగును. కావుననే వామనుఁడు కావ్యశోభాయాః కర్తారో గుణాః। తదతిశయ హేతవస్త్వలంకారాః । పూర్వే నిత్యాః । (గుణములు కావ్యశోభను గూర్చునవి. అలంకారములు తదతిశయమును గలిగించును. ఇందు మొదటివి (గుణములు) నిత్యములు.) అని చెప్పెను. గుణములు నిత్యమనుటచే నలంకారము లనిత్యములని సారాంశము. మరియు నాతఁడే యిట్లు తెలిపెను.

"యువతే రివ రూపమంగ । కావ్యం స్వదతే శుద్ధగుణం తదప్యతీవ
విహితప్రణయం నిరంతరాభిస్సదలంకార వికల్పకల్పనాభిః
యది భవతి వచశ్చ్యుతం గుణేభ్యో వపురివ యౌవనవంధ్య మంగనాయాః
అపి జనదయితాని దుర్భగత్వం నియతమలంకరణాని సంశ్రయంతే."

యువతియొక్క రూపమువలెనే శుద్ధగుణములు గల (సముచితగుణములు గల) కావ్య మలంకారములచే మిక్కిలియు నాస్వాద్యమాన మగును. గుణహీనమైన కావ్యము యౌవనహీనమైన యువతియొక్క శరీరమువలెనే యలంకారము లున్నను దుర్భగముగానే యుండును.

### ౧. శ్లేషము.

కం. ఇల సంధిఁగూడి పదములు
నెలకొన నొకపదమురీతి నిలిచిన శ్లేషం । బలరు ౫౭

సంధినిఁగూడి పదము లొక్క పదమువలె భాసిల్లినచో నది శ్లేషము. మరి యాను కేవలము సంధినిఁగూడి పదము లేకపదాకారముగాఁ గానిపించుటయే కాక

యేకస్థానీయములగు వర్ణములు బహుళముగా నుండుటవలనను నేకాకారముగా భాసిల్లినచో శ్లేషము. దీనినే మసృణత్వమని వామనుఁ డనెను.

శా. ఆ లావణ్య మగణ్య; మా గుణగణం బవ్యాజ; మా తేజము
ద్వేలం; భావినయం బమేయతర; మావీర్యం బనిర్వాచ్య; మా
యాలాపం బతిసత్య; మా వితరణం బాశాంతవిశ్రాంత; మా
శీలం బార్జవమూల మెన్నఁదరమే శ్రీనారసింహాధిపున్. ౫౧౮

ఇట సంధి (ఉకారసంధి) వశమున నేకపదాకారముగాఁ బదములు భాసిల్లినవి. అ, ఇ, ఉ, కారాంత శబ్దములకు అచ్చుతోడి నిత్యసంధి వచ్చినపుడే యీ యేకాకారత గోచరించును. ఈ క్రింది పద్యము లుదాహరణములు గావు.

కం. భీకర దానవుఁడొక్కఁడు
నా కొమరుం డాడుకొనుచు న్నాశమముకడన్
భూకాంతా! యుండం గని
కైకొనిపోయెన్ వచింపఁగలదే యింకన్?

గీ. సత్పురాణాళి కావ్యము ల్సరసరీతి.

ఇందలి మొదటిపద్యమున నేకాకారత గొంత గోచరించినను 'డొక్కఁడు', 'రుండాడు', 'యుండం' ఇత్యాదులచే నా యందము తిరోహిత మగుచున్నది.

## ౨. ప్రసాదము.

కం. ......ప్రసిద్ధ పదంబుల
నలఘూక్తి ప్రసాదమయ్యె నది యెట్లన్నన్.

ప్రసిద్ధపదములను వాడుట ప్రసాదము.

ఉ. ముంగిటి పెన్నధాన; మిలుముందటి కల్పక; మర్థికోటిముం
గొంగుఁబసిండి; చెంగటనకూడిన బంగరుకొండ; దొడ్డిలో
నంగల కామధేను; వదనం బెరయీఁగలులేని చొక్కపుం
దంగెటి జున్ను నీ వితరణంబు నృసింహ నృపాలశేఖరా! ౫౧౯

ఇందన్నియుఁ బ్రసిద్ధపదములే! వామనుఁడు "శైథిల్యం ప్రసాదః" (బంధము యొక్క శిథిలత్వము ప్రసాదము) అని లక్షణము చెప్పి "ఇది యోజోగుణమునకు విపర్యయరూపమనియు, గుణ విపర్యయములు దోషములు గాన ప్రసాదము దోష మగునుగదా! యని శంకించి కేవల బంధశైథిల్యము దోషమే యనియు నోజోగుణ

మిశ్రిత మగు ప్రసాదమే గుణమనియు సిద్ధాంతించెను. ఓజోగుణమన ముందుఁ దెలుపఁబడును.

తేజస్తిమిరములవలెఁ బరస్పరవిరుద్ధములగు నోజఃప్రసాదములకుఁ గలయిక యెట్లు సిద్ధించునన్న నది యనుభవైకవేద్యము. ఎట్లు కరుణరస ప్రధానములగు నాటకములలోఁ బరస్పర విరుద్ధములగు సుఖదుఃఖములు గలుగుచున్నవో యట్లది యనుభవైకవేద్యమో యోజఃప్రసాదముల కలయికయు ననుభవసిద్ధమే. ఈ యోజఃప్రసాదముల కలయిక త్రివిధముగా నుండును. ఒక్కచో నోజఃప్రసాదములు సమానముగా నుండును. ఒకచో నోజస్సధికముగా నుండును. వేఱొకచోఁ బ్రసాద మధికముగా నుండును. ఈ క్రింది లక్ష్యములయందీ మువ్విధములను గనుఁడు.

౧. ఓజఃప్రసాద సామ్యము

శా. కామోత్కంఠత గోపికల్, భయమునన్ గంసుండు, వైరిక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులున్.
ప్రేమన్ మీరలు, భక్తినేము, నిదె చక్రింగంటి; మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁడైన, హరిఁ జెందఁగావచ్చు ధాత్రీశ్వరా!

౨. ప్రసాదముకన్ననోజస్సుయొక్క యాధిక్యము

ఉ. ధారుణి రాజ్యసంపదమదంబునఁ గోమలిఁ గృష్ణఁజూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగ బంచిన యిద్దురాత్ము దు
ర్వార మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁజేసెద సుయోధను నుగ్రరణాంతరంబునన్

౩. ఓజస్సుకన్నఁ బ్రసాద మధికముగా నుండుట

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండఁగ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు చేసినఖలున్ దుశ్శాసనుం గాలోక భీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

## ౪. మాధుర్యము

క. సరసములగు వాక్యంబులు
వరుసను వేర్వేఱమించు వగ మాధుర్యంబు.

విడివిడిగా ననఁగా దీర్ఘ సమాసములు లేక సరసములగు పదములుగూర్చుచో నది మాధుర్యగుణము. 'పృథక్పదత్వం మాధుర్యం' అను వామనుని లక్షణమున

కిడియే యర్థము. "సరసములగు వాక్యంబులు" అనుచో వాక్యమనఁబడమనియే లక్ష్యార్థమును జెప్పుకొనవలెను.

చ. అనయము మత్స్యయంత్రము నొకమ్మున శ్రీనరసింహుఁ డేయఁగా
వెనుకకుఁ బాఱె, పుల్లఱచి, వేషముమార్చి, బిలంబుదూఱె, కా
ననమున కేఁగి, సిగ్గున నణంగి ధరంబడి, వీఁగి తా విషం
బెవసి, నతిఁ భజించి, నడులీఁడి భ్రమించెను రాసులన్నియున్.

నరసభూపాలుఁడు మత్స్యయంత్రమును గొట్టఁగా మిగిలిన రాసులలో నున్న మేషము వెనుకకుఁ బరుగిడెను; వృషభము గడ్డి కఱచెను; మిథునము వేషము మార్చుకొనెను; కర్కాటకము బిలము దూఱెను; సింహము కాననమున కేఁగెను; కన్య సిగ్గు పడెను. తుల బరువెక్కి వంగెను; వృశ్చికము విషము బొందెను; (తినెను) ధనుస్సు నతిని బొందెను; (వంగెను) మకరము నదులలోబడి యీఁదెను; కుంభము భ్రమించెను. ఇట్లు మిగిలిన రాసులన్నియు నలజడి వహించెనని భావము.

మనుచరిత్రము నందలి "తరుణీ! రేపునుమాపు" మొదలగు సమాసములు లేనివియు దీర్ఘసమాసములు లేనివియు నగు పెక్కు పద్యము లీ మాధుర్యగుణమున కుదాహరణము లగును. ఈ క్రింది పద్యము దీర్ఘసమాసముగలదగుట మాధుర్యోదాహరణము కాఁజాలదు.

చ. కలఁడుల్లోక మహోమహోగ్రహుతభుగ్జ్వాలావళీ నిర్జల
స్థలదంభోనిధిలక్ష్మ్యహైనువత పక్షక్షోదదక్షోరు ది
గ్వలభీ దుర్భరభేరికా భయదభాంకారైక సంప్రాణితా
చల వైరిన్నత కీర్తిసాంద్రుఁడు వసుక్ష్మాపాలచంద్రుం డిలన్.

వెనుకటి "అనయము మత్స్యయంత్రమును" "తరుణీ! రేపునుమాపు" మొదలగు పద్యములందలి మాధుర్యము శబ్దగతము. అర్థగతమాధుర్యమన నుక్తివైచిత్ర్యము. "తెలిసిన మూర్ఖుఁడు" "లంజెలలోఁ బతివ్రత" మొదలగునవి యుదాహరణములు. దీని నాంగ్లమున Oxymoron అందురు.

## ౮. సౌకుమార్యము.

కం. అరయఁగ బొట్లు పిఱుఁదల
నరుదగు నది సౌకుమార్యమగు నెట్లన్నన్. ౬౧

సున్నలు మెండుగల యక్షరములు గలిగియున్న బంధము సౌకుమార్యము.

ఉ. చెందొవవిందు మందువలెఁ జిందు రుచిం దగఁ; జందనంబు వె
చ్చందన మొందు; నిందుముఖి చందము డెందమునం దలంప నీ
యందమునందె పందనమునందు మిళిందము పొందు పొందికం
జెందె నృసింహ! కౌఁగిటను జేర్పుము! సుందరగ మందగామినిన్.

ఇందు బిందుపూర్వక 'ద'కార బంధము బహుళముగా నున్నది. కాని వామనుఁడు "అపారుష్యం సౌకుమార్యం" అని లక్షణము చెప్పెను. కావున బిందుపూర్వాక్షరబంధమే యని నియమము లేదు. పరుషత్వము లేని బంధము సౌకుమార్యము. కావున

ఎక్కడి యూరు కాల్నిలువ కింటికిఁ బోయెదనంచుఁ బల్కెదీ
వక్కట! మీకు తీరనిలయంబులకున్ సరిరాకపోయెనే?
ఇక్కడి రత్నకందరము; లిక్కడి వందన చందనోత్కరం
బిక్కడి గాంగ సైకతము లిక్కడి యాలవలీనికుంజముల్

అను బంధము సౌకుమార్యమే యగును. ఈ క్రిందిది విపరీతోదాహరణమగును.

మం. కలఁ డత్యుత్కట ధాటి కాతుంగ రింఖా జాతి భూక్షోద క
జ్జల చిహ్నప్త మహః ప్రదీపహృత తీక్ష్ణధ్వాంత వేలాకుభృ
ద్బల గేహ ప్రతిమాయితా మితసమిద్వైరీకులధ్వాన మం
డల నిర్విణ్ణ రిపుక్షితీంద్రుఁడు సుచంద్రక్ష్మాపచంద్రుండిలన్

అర్థమునఁ జారుష్యము లేకుండుటయు సౌకుమార్యమే. మృతునిఁగూర్చి కీర్తిశేషుఁడనుట మొదలగునవి. దీని నాంగ్లమున 'Euphemism' అందురు. దీనిని మన యాలంకారికులు గుణమనిరి. ఆంగ్లేయు లలంకారముగా గణించిరి.

## ౫. సమత

కం. లలితార్థభంగిఁ బాదం
బులు నాల్గిట నేకసరణిఁ బొదువ సమతయౌ. ౬౨

లలితమగు నర్థము నాలుగుపాదములలో నొకేవిధముగా నిబంధించుట సమత. ఇట 'అర్థభంగి' అని చెప్పఁబడినది. కేవల మర్థమే కాదు. శబ్దబంధము యొక్క సమతయు గ్రాహ్యమే. వామనుఁడు "మార్గాభేదస్సమతా" ఏమార్గమున నుప క్రమింపఁబడునో యామార్గమును విడువకుండుట సమత అని లక్షణమును నుడివెను. కావ్యముయొక్క ఆది, మధ్య, అవసానములం దొకేవిధమగు మార్గము సమత యనఁబడును.

సీ. శరవేగములు లేవె ? చలయంత్రపాత్రన
పాటనక్రియకు నేర్పడవుగాక
చాతుర్యములు లేవె ? శారదాభాండార
చోరకారశ్రీకిఁ జోరవుగాక
వితరణంబులు లేవె ? వివిధయాచకనృపా
లక కంఠదఘ్నముల్ కావుగాక
సామర్థ్యములు లేవె ? సరిదన్యపథయాన
శాసనప్రౌఢికిఁ జనవుగాక

గీ. తొలుత గడిదుర్గములనున్న దొరలు లేరె ?
మహిమనీమాడ్కిఁ గడన దుర్మద సపాద
సారసప్తాంగహరణులు లేరుగాక
వరనుతాటోప ! రొబయనరసభూప ! ౬౩

ఇట 'శరమార్గములు లేవె ?' అని ప్రారంభింపఁబడినమార్గమే నాలుగుపాద ములందును గలదు. ఈ సమత యొకపద్యమునందును బ్రబంధమునందునుగూడ నుండ వలయును. ఇది పలువిధములుగా నుండును. అంత్యానుప్రాసము మొదలిడినచో నామార్గము తుదిదాఁక నిర్వహింపవలెను. ఇట్టివే యూహించుకొనవలెను. దీనికి విపర్యయ మీక్రిందివిధమున నుండును.

కం. శ్రీకంఠ చాపఖండన !
పాకారి ప్రముఖవినుత భండన ! విలస
త్కాకుత్స్థవంశభూషణ !
రాకేందు యశోవిశాల ! రామమహీపా !

'వంశమండన'కు 'వంశభూషణ' అనియు 'రామనృపాలా' అనుటకు 'రామ మహీపా !' అనియుఁ జెప్పినచో మొదలు నేసిన యంత్యప్రాస నియమ మంతర్థాన మైపోయినది.

## ౬. అర్థవ్యక్తి (అర్థదీపనము)

కం. ఇల నర్థము వ్యక్తంబై
నలువొందిన నర్థదీపనం బెట్లన్నన్.

అర్థము స్ఫుటముగా గోచరించినచో నర్థవ్యక్తి.

సీ. నలువొందు నమరేంద్రు నాగంబుసాటిగా
సామజంబుల నెల్ల సంతరించి
విఖ్యాతికెక్కిన వెలిమావుసాటిగా
సైంధవముల నెల్ల సవరణించి
మహిమమించిన మంత్రిమాకులసాటిగాఁ
బాదపంబుల నెల్లఁ బాదుకొలిపి
వన్నెకెక్కిన దేవవాహినిసాటిగా
నిలనెల్ల యేఱుల నిరవుకొలిపి

గీ. స్వర్గసృష్టికిఁ బ్రతిసృష్టి సలుపుకీర్తి
వసుధఁ గౌశికగోత్ర పావనుఁడ వైన
నీక తగుఁగాక మఱియన్యనృపులకగునె?
సరసగుణహార! యోబయ నరసధీర. ౬౮

ఈ పద్యమున నర్థస్ఫురణము గలదు. అనఁగా నర్థము స్ఫుటముగా గోచరించును. దీనికి విపరీతోదాహరణము గనుఁడు.

మ. కలఁడుల్లోక......వసుష్మాపాలచంద్రుండిలన్

౭. ఔదార్యము

కం. కతిపయ సంయుక్తాక్షర
వితతం బౌదార్యమయ్యె... ౫౭

కొన్ని సంయుక్తాక్షరములు గల బంధ మౌదార్యము.

చ. ఎదిరిన యోబశౌరి నరసేంద్రునికీర్తి నిజాంశుపంక్తికిఁ
మదనవిరోధి భీతుఁడయి మార్కొన కేఁగినఁ జంద్రధంబుఁ, ద
త్సదనము నాక్రమించి రభసంబున నావృషబాధివధ్వజున్
వెదకఁజుమీ! యజాండములు వేవెడలెం గడిలేని యాసునన్.

ఇందుఁ గొన్ని సంయుక్తాక్షరములు గలవు. వామనుఁడు 'వికటత్వ ముదారతా' కూర్పునందలి వికటత్వ మౌదారత (ఔదార్యము) యని లక్షణము చెప్పెను. ఏకూర్పునందు వర్ణములు నర్తించునట్లు వినువారికి గోచరించునో యాకూర్పు ఔదార్యము. నరసభూపాలీయ లక్షణముకన్న నిది మేలైనది. ఎట్లన.

చ. అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుటనటనానురూప పరిఫుల్ల కలాపి కలాపజాలమున్
గటకచరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్.

ఇటఁ జుంబనవ్యాపారమున కనుకూలముగా బిందుపూర్వక బకారబంధము, మృదంగధ్వనికి స్ఫోరకముగా బిందుపూర్వ గకారబంధము, నటనానురూపముగా టకారబంధమును గలదు. ఇదియే వికటత్వము. ఇటఁ గేవలము వర్ణములు నర్తించుచున్నట్లే కాక యా యా యర్థములను స్ఫురింపఁజేయుచున్నట్లును గూర్పఁబడినవి. ఇట్టి బంధమే వికటత్వము. ఈ వికటత్వము గల కూర్పు ఔదార్యము.

ఈ పద్యముఁ గొలఁదిగా నీ క్రింది విధమున మార్చినచో వికటత్వము గూడ భ్రష్టమగును. ఎట్లన,

అటఁజని కాంచె భూమిసురుఁ డాకసమంటు శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదవారిత వీచి మృదంగ నిస్వన
స్ఫుట రమణానురూప పరిమూర్ఛితబర్హి మయూరజాలమున్
గటక ... ... ... ... శీతశైలమున్.

పై పద్యములోని యందమిందు లేదని సుగమముగాఁ దెలియును. దీని నాంగ్లమున Onomatopocia అందురు. దీని నిట్లు వారు వివరించిరి. The sound must seem an echo to the sence. (శబ్దము అర్థమునకుఁ బ్రతిధ్వనిగా నుండవలెను.) దీనిని మన యాలంకారికులు కావ్యగుణముగా గణించిరి. ఆంగ్లేయు లలంకారముగా నుడివిరి.

### ౮. కాంతి.

కం. ... ... విమల విచిత్రా
యతవర్ణావృత్తులు గల
యతిమృదుబంధంబు కాంతి యగు నెట్లన్నన్.

విచిత్రముగా నక్షరావృత్తులు (అనఁగా వచ్చిన వర్ణమే మరల వచ్చుట) గల బంధము కాంతి.

సీ. నెలవంక తోడి వెన్నెలవంక గల మేటి
నెలవంక రహితాంశు నియతిఁ దెగడి

ననయమ్ము వానిఁగన్ననయమ్ముగల యింతి
ననయమ్ముఁ దాల్చువానన్నఁజెనకి
కడలేక తరిగొండ కడలేకడలఁద్రోయు
కడలేకమైన మీఁగడల గెలిచి
కపురాలవన్నె చొక్కపురాలనగు మేని
కపురాలపోతు బింకంబు నణఁచి

గీ. తన రుచులు లోకములునిండఁ దనరుచుండు
లాట కరహాట లలనా లలాటఫలక
ములయుజములైన నీదు నిర్మలయశంబు
లమిత గుణసాంద్ర! నారసింహక్షితీంద్ర! ౬౭

ఇట నాలుగుపాదములందును వర్ణావృత్తులు స్పష్టము. ఈ పద్యమును జదువునపుడు ముక్తాయింపు స్ఫురించును. అట్లు స్ఫురించినచే కాంతియగును.

ఇది యనుప్రాసము గాదు. రెండక్షరములు దగ్గఱగానుండి యావృత్తి యేర్పడినచో ననుప్రాసము. సమానములగు నచ్చులు సముచితస్థలమున వినఁబడినచో నేర్పడునది కాంతి. ఇది యమకభేదమగును.

ఈక్రింది పద్యము విపరీతోదాహరణ మగును.

శా. జ్యాఘోషంబతిభీషణంబయి దిశాచక్రంబునిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికలస్వాంతుండుగా నారద
శ్లాఘాపాత్రముగా నిరర్గళభుజాసంరంభతన్ రాద శే
ఖాఘోరాకృతి యేన చూపెదఁ గడంకంజూడుఁడీ! యేర్పడన్.

ఇందు, ఓజస్సు, ప్రసాదము, కొంతశ్లేషము గలవు. కాని కాంతిలేదు.

## ౯. ఓజస్సు

కం. విలసిత సమాసభరితో
జ్జ్వలబంధంబోజమయ్యె సరి ...... ౬౮

దీర్ఘసమాసమగు బంధ మోజము. వామనుఁడు 'గాఢబంధత్వమోజః' (గాఢబంధము గలిగియుంట యోజస్సు) అని లక్షణము చెప్పెను. ఈగాఢత్వ మెట్లు గలుగును? సంయుక్తాక్షరములు గలిగియుండుట, రేఫయుక్తమయిన వర్గప్రథమ ద్వితీయాక్షరములయొక్క సంయోగము, (ర్క, ర్ఖ, క్ర, ఖ్ర) వర్గముల తృతీయ,

చతుర్థ వర్ణముల సంయోగము. (గ్ఘ, జ్ఝ మొ॥) వర్గ ప్రథమ వర్ణసంయోగము (క్క-చ్చ మొ.) వర్గతృతీయ వర్ణసంయోగము (గ్గ మొ.) విసర్జనీయ, జిహ్వామూలీయ, ఉపధ్మానీయముల ప్రయోగము, తుదియందు గురువుండుట, సమాసములు గలిగి యుండుట, వీనిచే గాఢత్వము గలుగును. కాని కేవలసమాసములు గలిగియుంటయే యోజస్సు గాదు.

సీ. మందారబిసకంద కుందాదినిధిబృంద
బృందారకా ప్తశోభితయశుండు
హేలావిజితహాలహాలాకనోత్తాల
తాలాంకభుజదండతాండవుండు
దీనావననిదాన దానాంబుజనదీన
దీనాధపరిణయస్థితివిధాయి
భీమాసురవిరామ రామాతిశయధామ
ధామాంబకనిభాసిదారితారి
గీ. రాజమాతుండె వసుధాధిరాజమకుట
నికట వికటమహానీలనికరసుకర
మధుకరకరంబితాంఘ్రిపద్మద్వయుండు
సరసగుణహారి యోబయనరసశౌరి. ౬౬

ఈ పద్యమున సమాసభూయిష్ఠత్వము గలదు. కాని బంధమందలి గాఢత్వము లేదు.

ఈ క్రింది పద్యమున గాఢబంధత్వము గలదు.

శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవురిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముంగొనుట తథ్యంబెమ్మెయిం గీచకా!

## ౧౦. సమాధి

కం....... అన్యగుణం
బులు మఱివేఱొక్కటిపై
నలరింప సమాధియయ్యె నదిమెట్లన్నన్.

ఒకదాని ధర్మములు మరొక్కదాని కంటఁగట్టుట యనఁగా నారోపించుట సమాధి.

సీ. అల బలీంద్రునిచేత నడుగవెట్టఁగ నేర్చి
ధారాధరముచేత నీరు మోసి
కానీనుచేఁ గంచుకముఁ బూనఁగా నేర్చి
యెలమి దధీచిచే నెమ్ము బలిసి
క్షీరాంబురాశి తెచ్చినవెన్న నీడేఱి
నైలింపగవి చన్నుఁబాలఁ బెరిగి
కల్పపాదపఫలోత్కరములఁ జవిఁగాంచి
వనజారి నెమ్మేన ననఁగి పెనఁగి

గీ. ధరణిఁ బ్రోదివహించిన దానకన్య
సకలయాచక బాంధవుల్ సంతసిల్ల
నీకరగ్రహణావాప్తి నెరసె నౌర!
వైరిగజసింహ! రామబయనారసింహ! ౨౦

ఇందలి యడుగువెట్టుట, నీరుమోయుట, కంచుకముఁబూనుట, ఎమ్ము బలియుట, అను ధర్మములు బలి, ధారాధర, కానీన దధీచిమునులకు సంబంధించినవి. దానకన్యయం దారోపింపఁబడినవి.

వామనుఁడు "ఆరోహావరోహక్రమస్సమాధిః" అని లక్షణము నుడివెను. దీర్ఘాది గుర్వక్షరము అధికముగా నుండుట యారోహము; లఘ్వక్షరము అధికముగా నుండుట యవరోహము. క్రమముగా నారోహమును గ్రమముగా నవరోహమును గలబంధము సమాధి.

కం. కరుణించియిందు నాకుఁ
బురోహితునిఁగాఁగ మీను పుత్రుఁ బవిత్రుం
బరమతపోనైష్ఠిక భా
సురయమనియమాభిరాము సోమశ్రవసున్

పూర్వార్థమునఁ గ్రమముగా నారోహమును ద్వితీయార్థమునఁ గ్రమముగా నవరోహమును గలవు.

## గుణవిమర్శము

భరతుఁడు నాట్యశాస్త్రమున నీదశగుణములను చెప్పి వాని లక్షణములను దెలిపెను, కాని యీ గుణములయొక్క యుపయోగ మేమియో తెలుపఁడయ్యెను.

పిమ్మట భామహుఁడీ దశగుణములను జూపి వీనిలో మాధుర్య, ఓజః, ప్రసాదము లను మూఁడుగుణములే ముఖ్యములనియు వచించెను. దండి యీ దశగుణములను జూపి కొన్నింటితో వైదర్భీరీతియుఁ గొన్నింటిలో గౌడీరీతియు, నేర్పడునని చెప్పెను. వామనుఁడీ దశగుణములనే శబ్దగుణములు, అర్థగుణములు. అని రెండువిధ ములుగా విభజించి వానికిఁ బ్రత్యేకముగా లక్షణ నిర్వచనము సేసెను. అతఁడును గుణములతో రీతి యేర్పడునని వచించెను. భరత, దండి, వామనులు గ్రహించిన గుణము లొకటేకాని లక్షణనిర్వచనమున నెల్లరును భేదించిరి. ఒకరి మతమున నొక గుణము మరొకరిమతమున వేరొకగుణముగా నయ్యెను. ఆనందవర్ధనుఁడు భామహుని వలెనే మాధుర్య, ఓజః, ప్రసాదములు అను మూఁడుగుణములే గ్రహించెను. అతఁడీ గుణములను రసధర్మములుగా నిర్ణయించెను. అతని పిమ్మటివారగు మమ్మటాదు లందఱును నా మూఁడు గుణములనే గ్రహించిరి. ఈ విషయమున మమ్మటుని నిర్వ చన మిది.

> "మాధుర్యౌజః ప్రసాదాఖ్యాస్త్రయస్తే న పునర్దశ
> కేచి దంతర్భవంత్యేషు దోషత్యాగా త్పరే శ్రితాః
> అన్యే భజంతి దోషత్వం కుత్రచి న్న తతో దశ"

మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము, అనునవి మూఁడే గుణములు. కాని పది కావు. ఇతరగుణములు కొన్ని వీనిలోనే యంతర్భవించును. కొన్ని తత్తద్దోషము లను బరిహరించుటవలననే సరిపడును. కొన్ని (గుణములు) దోషములే యగును. కానఁ బదిగుణము లుండవు.

మరియుఁ బైదశగుణములకు వామనుఁ డిచ్చిన లక్షణములను ఖండించుచుఁ బదిగుణము లెట్లు లేవో చూపుచున్నాఁడు.

"పెక్కుపదము లేకపదాకారముగా భాసిల్లుట" యను శ్లేషగుణమును, ఆరో హావరోహక్రమరూపమగు సమాధియు, వికటత్వరూపమగు నుదారతయు, ఓజ స్సులోఁ గూడిన శైథిల్యమను ధర్మముగల ప్రసాదమును, ఓజస్సులో నంతర్భవిం చును. పృథక్పదత్వమను పేరుగల మాధుర్యగుణము వామనలక్షణముకన్న భిన్నలక్ష ణముతో నదే సాక్షాత్తుగా స్వీకృతమై యున్నది. అర్థదీపనము (అర్థవ్యక్తి) ప్రసాద గుణమున నంతర్భవించును. మార్గాభేదరూపమగు సమత యొకానొకచో దోషమే. ఎట్లన

> శా. సింగంబాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమైనుండి మా
> తంగస్ఫూరిత యూధదర్శన సముద్యత్[illegible] వచ్చెనో

జంగాంలొరనివాసభిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.

ఇట రెండవపాదమున మసృణమార్గత్యాగము గుణమే.

చ. కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల, నంగముల్
దనరఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ, నితాంతదంతపీ
డనరటదాస్యరంగవికటభ్రుకుటీచటులప్రవృత్తి వ
ర్తన ఘటనాప్రకార భయదస్ఫురణాపరిణద్ధమూర్తియై.

ఇటను మూఁడు నాలుగుపాదములలో మసృణమార్గత్యాగము గుణమే.

కష్టత్వ, గ్రామ్యత్వములు దోషము లగుటవలన వానిని నిరాకరించినచో అపారుష్యరూపమగు సౌకుమార్యము, ఔజ్జ్వల్యరూపమగు కాంతియును గ్రహింపఁ బడవలసిన పనియుండదు. కావునఁ ఇవి శబ్దగుణములు లేవు"

ఇట మాధుర్యౌజః ప్రసాదములలో నితరగుణముల నంతర్భవింపఁ జేసి చూపెను. మరియును దత్తద్దోషపరిహారమును జూపి కొన్నిగుణము లక్కఱలేదని యును జూపెను.

నరసభూపాలీయ కర్త యర్థగుణవిభాగమును జూపలేదు. మమ్మటుఁ డర్థగుణ విభాగమునుగూడఁ బైవిధముగనే ఖండించెను. ఇందర్థగుణప్రసంగము లేదు. కావున నాఖండనము చూపఁబడలేదు.

జగన్నాథుఁడును వామనమతానుసారముగా శబ్దగుణ, అర్థగుణ విభాగములను జర్చించి చూపి తుదికి మమ్మటునివలెనే మాధుర్యౌజఃప్రసాదములను మూఁడుగుణ ములనే యంగీకరించెను. సామాజికుని చిత్తమందుఁ గలుగు ద్రుతి, దీప్తి, వికాస ములు, అను ధర్మములను బట్టి క్రమముగా మాధుర్యౌజఃప్రసాదములనే గుణముల నుగా స్వీకరించెను. అతని నిర్వచన మిది:—

"గుణానాంచైషాం ద్రుతిదీప్తి వికాసాఖ్యా స్త్రిస్రశ్చిత్తవృత్తయః క్రమేణ ప్రయోజ్యాః । తత్తద్గుణ విశిష్టరస చర్వణాజన్యా ఇతియావత్" ఈగుణములవలన ద్రుతి, దీప్తి, వికాసము అను మూఁడు చిత్తవృత్తులు గలుగును. అనఁగా నాయా గుణములలోఁగూడిన రసమును జర్వణము చేయుటవలన నాచిత్తవృత్తులు గలుగును.

మూఁడుగుణములే స్థిరపడినను బ్రతాపరుద్రీయకర్త సామాన్యముగా నెల్లవిష యములలో మమ్మటుని ననుసరించినను గుణములలో భోజుని, అలంకారములలో

రయ్యకుని ననుసరించి భోజమతానుసారముగా * ౨౪ గుణముల నిచ్చెను. బట్టు మూర్తి|సర్వథా ప్రతాపరుద్రీయము ననుసరించినను గుణములలో దాని ననుసరింపక వామను ననుసరించెను. కాని లక్షణనిర్వచనమునమాత్రము వామనుని ననుసరింప లేదు. ఏలక్షణముగూడ సమగ్రముగా నిర్దుష్టముగా లేదు.

ప్రథమాశ్వాసములోని పీఠికాపద్యములలో పదునైదవదియగు 'సీ. బాణువేగం బును భవభూతి సుకుమారతయు' అను పద్యమున వేగము, సుకుమారత, సువర్ణకలన, అర్థసంగ్రహము, శయ్యనేర్పు, ప్రసాదము, నియమము, సన్మార్గఘటన, ధారాశుద్ధి సమగ్రముఖసృష్టి, అను తత్తత్కవుల గుణములును నిచ్చటి గుణములును జాల భిన్నములు. సుకుమారత, ప్రసాదము అను రెండుమాత్రమే యీ దశగుణములలో నున్నవి. ఈగుణములు భోజరాజోదాహృతగుణములును గావు. ఇవి శాస్త్రదృష్టితోఁ జెప్పఁబడినవికాక లోకదృష్టితోఁ జెప్పఁబడినవి.

ఈ గుణములు రసధర్మములనియు ననఁగా "రస మెచ్చటనుండునో గుణము లచ్చటనుండును. గుణము లెచ్చటనుండునో రస మచ్చట నుండును" అనియును స్పష్ట ముగా నింతకుముందే నిర్వచింపఁబడియున్నది. ఇదియే సిద్ధాంతము. ఈసిద్ధాంతమునే యానందవర్ధన, అభినవగుప్త, మమ్మట, జగన్నాథాదులగు నాలంకారిక సార్వభౌము లందఱును సమ్మతించిరి.

ఈ మాధుర్య, ఓజః, ప్రసాదగుణముల లక్ష్యలక్షణముల నిట్లు మమ్మటుఁడు నిర్వచించెను.

మూర్ధ్ని వర్గాంత్యగాః స్పర్శా అటవర్గా రణౌలఘూ
అవృత్తి ర్మధ్యవృత్తిర్వా మాధుర్యే రచనా తథా.

ట, ఠ, డ, ఢ తక్క మిగిలిన కకారాది మకారాంతవర్ణములును, దమతమ యసనాసికాక్షరములతోఁగూడిన వర్గాక్షరములును, హ్రస్వములగు ర, ణ, వర్ణము లును, అసమాసమును, మధ్యమసమాసమును (అల్పసమాసము) గలిగియున్న రచనయు మాధుర్యగుణమును దెలుపును. ఎట్లన

---

* భోజుని గుణము లివి:— శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము; సుకు మారత, అర్థవ్యక్తి, ఉదారత్వము, కాంతి, ఉదాత్తత, ఓజస్సు, సుశబ్దత, ప్రేయము ఔర్జిత్యము, విస్తరము, సమాధి, సౌక్ష్మ్యము, గాంభీర్యము, సంక్షేపము, భావికము, సమ్మితత్వము, ప్రౌఢి, రీతి, ఉక్తి, గతి, అనునవి. భోజుఁడీ యిరువదివాల్గింటి శబ్ద గుణములుగా, అర్థగుణములుగా మొత్తము ౪౮ గుణములుగా విభాగించి యుదాహ రించెను.

అనంగరంగ ప్రతిమం తదంగం భంగీభిరంగీకృతమానతాంగ్యాః
కుర్వంతి యూనాం సహసా యథైతాః స్వాంతాని శాంతాపరచింతితాని.

ఆ యువతియొక్క విలాసములు గలిగి మన్మథరంగమువలెనున్న శరీరము యువకుల మానసములను సమస్తములగు నితరచింతలను మానివేసినవానినిఁగాఁజేయుచున్నది.

ఈ శ్లోకము ంగ, ంత, వర్ణములు గలిగియున్నది. ఈ గుణప్రకరణమున సౌకుమార్యమున కిచ్చిన వరసభూపాలీయోదాహరణమగు "చెందొవవిందు" అనుపద్యము గూడ మాధుర్యవ్యంజకమే. (మమ్మట మతానుసారముగా నందలి గుణము మాధుర్యమే కాని సౌకుమార్యము గాదు)

మరియు టవర్గహీనమగు కకారాది మకారాంతవర్ణములుగల రచన కుదాహరణము.

సీ. బంగరుగొలుసులుఁ, బవడంపుఁ దరవణికోళ్ళును, వింతశాగులబొగడలు,
రత్నంపుఁజిలుకలు, రాయంచపతిమలఁ, బసిడిపువ్వులవ్రాఁతపనుల సొబగు,
వివిధంబులగు చిత్రవిరచనలును, దసిలీనూలిపట్టయల్లిక బెడంగుఁ,
బలుతెలుంగుల పట్టుతలగడబిల్లలు, మవ్వంపుఁ గుంకుమపువ్వు పలుపు
గీ. గలిగి మెఱుఁగులు దిక్కులఁ గడలుకొనఁగ
మించు దంతపుటుయ్యెల మంచమునను
బొలుపుమీఱుచుఁ దన యంతిపురమున సతుల
యూడిగంబులుగైకొంచు నున్న శౌరి.

ఈమాధుర్యము సంభోగశృంగారమునందును, గరుణమునందును, విప్రలంభమునందును, శాంతమునందును దరతమాధిక్యముతోఁ బ్రయోగింపవలయును. ఈ రసమునందు సమాసరచనము దగదు. ఏలన సమాసము త్వరగా నర్థముగాని నర్థబోధమున కాటంకము గలుగును. అర్థము లెస్సగా దెలిసినఁగాని రసానుభవము గలుగదు. కావున నీరసములందు మాధుర్యగుణమునే కవి యుపయోగింపవలయును. ఏలన మాధుర్యము చిత్తద్రుతికిఁ గారణమని చెప్పితిమి.

యోగ ఆద్యతృతీయాభ్యా మంత్యయో రేణ తుల్యయోః
టాది శ్శషా వృత్తిదైర్ఘ్యం గుంఫ ఉద్ధత ఓజసి.

వర్గములలోని ప్రథమ తృతీయ వర్ణములకుఁ గ్రమముగా ద్వితీయ చతుర్థములతో యోగమున్నయెడలను (అనఁగా చ్ఛ, ట్ఠ, త్థ, ప్ఫ, జ్ఝ, ఇత్యాదికము) రేఫ

రేఫసంయోగమున్నను. (క్ర, ర్క, ఇత్యాది రూపము) తుల్యాక్షర సంయోగమున్నను, (క్క, చ్చ, ట్ట, త్త, ప్ప ఇత్యాదిరూపము) టవర్గము, శ, ష, వర్ణములున్నను, దీర్ఘసమాసములున్నను నా రచన యోజోగుణమును దెలుపును. ఇదియే గాఢబంధము.

మూర్ధ్నాముద్వృత్త కృత్తావిరళగళ గళద్రక్త సంసక్తధారా
ధౌతేశాంఘ్రిప్రసాదోపనత జయజగజ్జాత మిథ్యామహిమ్నామ్
కైలాసోల్లాసనేచ్ఛా వ్యతికర పిశునోత్సర్పిదర్పోద్ధురాణాం
దోష్ణాంచైషాం కిమేతత్ఫలమిహ నగరీరక్షణే యత్ప్రయాసః.

ఉద్ధతవృత్తిచే ఖండింపఁబడిన కంఠములనుండి యవిచ్ఛిన్నముగా జాలువాఱు రక్తధారలచే నీశ్వరుని పాదములు కడిగి యాతని ప్రసాదమున లభించిన జయ పరంపరలచే జగజ్జాలమున మిథ్యామహిమనుగొన్న నాశిరస్సులకును, కైలాసమును నెత్తుటచేత దర్పోద్ధురములయిన నా హస్తములకును, నీ నగరీరక్షణమునకుఁ బ్రయాస పడుటయా ఫలము ? (రావణుఁడు వానరసేన లంకాపట్టణమును ముట్టడించినదని తెలిసికొని యనుకొన్న వచనము.)

ఇందు ర్ధ్నా, త్త. ద్ర, క్త, ఙ్ఘ్రి, జ్జా, మ్నా, చ్ఛా, ర్పి, ర్పో, ష్ణాం, ఇత్యాద్యక్షరము లోజస్సును వ్యక్తముఁ జేయుచున్నవి.

వెనుక నిచ్చిన 'దుర్వారోద్యమ' పద్యమునందు గూడ నిట్టే సంయుక్తాక్షరములు గలవు. దానిని నట నోజస్సునకే యుదాహరించితిమి.

ఈ యోజస్సు వీర, బీభత్స, రౌద్రములందుఁ గ్రమక్రమముగా నధికముగా నుండవలయును. మాధుర్యము చిత్తద్రుతి కారణమైన ట్లోజస్సు చిత్తదీప్తి కారణము. రౌద్రమునను బీభత్సమునను దీర్ఘసమాసరచన యుక్తమే యగును. కాని యొకానొకచో నసమాసయు, నల్పసమాసయు నగు రచనయు నుండవచ్చును. "రౌద్రాదౌ మధ్యమ సమాసా సంఘటనా, కదాచిద్ధీరోద్ధత నాయక సంబంధ వ్యాపారాశ్రయేణ దీర్ఘసమాసాపి వా" రౌద్రాదులం దొక్కొక్కపుడు మధ్యమ సమాసము గల యనఁగా నల్పసమాసము గల రచనయు, ధీరోద్ధత నాయక సంబంధ వ్యాపారమునుబట్టి దీర్ఘసమాస గల రచనయు నుండును. అని ధ్వన్యాలోక కర్త తెలుపుచున్నాఁడు.

శ్రుతిమాత్రేణ శబ్దాత్తు యేనార్థప్రత్యయో భవేత్
సాధారణ స్సమగ్రాణాం స ప్రసాదో గుణో మతః.

వినినంతమాత్రముననే సామాజికునికే రచనవలన నర్థము దెలియునో యారచన ప్రసాదగుణమును దెలుపును. ఈప్రసాదము సర్వరససాధారణము.

పరిమ్లానం పీనస్తనజఘనసంగాదుభయతః
తనోర్మధ్యస్యాంతఃపరిమిళన మప్రాప్య హరితం
ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజలతాక్షేపవలనైః
కృశాంగ్యాస్సంతాపం వదతి బిసినీపత్రశయనం.

బలిసిన చనులయొక్కయు, జఘనముయొక్కయు నొత్తిడులచే నిరువైపుల వాడినట్టియు, సన్నని నడుముయొక్క యొత్తిడిలేమి నడుమ పచ్చగానున్నట్టియు, (వాడకుంటచే) శిథిలములైన భుజలత లటునిటు వేసికొనుటచే దార్మారుగాఁ జెదరినట్టియు, నీ తామరాకుసెజ్జ యాకృశాంగియొక్క సంతాపమును దెలుపుచున్నది.

ఇందలి పదములు మిక్కిలి మృదువుగానుండి వినఁబడఁగానే యర్థప్రతీతినిఁ గలిగించుచున్నవి. కాన నిందలి వర్ణములు ప్రసాదవ్యంజకములు. ఇట్లే

శా. ఆనాకంబున నప్సరశ్శతములో నానందనోద్యానమం
దానర్తించుచుఁ బుష్పకుంజ మృదుపర్యంకంబులన్ సీధుపా
నానందంబున సంప్రవర్ధిత రతి వ్యామోహ ముగ్ధాత్మతన్
నానాక్రీడలఁ దేలుచుంట బుధగణ్యంబైన కార్యంబొకో ?

అనుచోఁగూడఁ బ్రసాదము గలదు.

శుష్కేంధనాగ్నివలెను, స్వచ్ఛజలమువలెను చిత్తమును వెంటనే వ్యాపించునది ప్రసాదము. ఇది సర్వరసములందును నుండును.

వెంత్తమమీఁద వర్ణములు గుణవ్యంజకములు. గుణములవలన రీతులేర్పడును. గుణములు రసధర్మములు గాన గుణములవలన నేర్పడిన రీతులును రసధర్మములే యగును. మాధుర్యగుణము వైదర్భీరీతియందును, ఓజస్సు గౌడీరీతియందును, ప్రసాదము పాంచాలీరీతియందును నుండును.

వెనుక నే రసమున కెట్టి రచన యుండవలయునో తెలిపితిమి. కాని కొన్ని యెడల నీ నియమమునకు నన్యథాత్వము గానిపించుచున్నది. ఎట్లన,

వక్తృ, వాచ్య, ప్రబంధానా మౌచిత్యేన క్వచిత్క్వచిత్
రచనావృత్తి వర్ణానా మన్యథాత్వ మపీష్యతే.

వక్తృ, వాచ్య, (వర్ణనీయ విషయము) ప్రబంధములయొక్క యౌచిత్యమును బట్టి రచనా, వృత్తి, వర్ణముల కన్యథాత్వము గూడ నొక్కొక్కచో సమ్మతమే యగును. వక్తయనఁ గావ్యమందలి నాయకుఁడు. నాయకునిఁబట్టి రచన యుండ

వలెను. * నాయకుఁడేరసాశ్రయుఁడైన రచన తదనుకూలముగా నుండవలెను. అతఁడు శృంగారరసాశ్రయుఁడగుచో వైదర్భీరీతియు, రౌద్రాశ్రయుఁడగుచో గౌడీరీతియు నుండవలెను. ఇట్లే మిగిలిన రసములనుబట్టియు రచనను జేయవలెను.

అట్లే 'వాచ్యము' అనఁగా వర్ణనీయమగు విషయమునుబట్టియు రచన సాఁగవలెను. వర్ణనీయవిషయ మొక పుష్పోద్యానమగుచో మృదురచనయు యుద్ధాది భయంకర ఘట్టములగుచో దీర్ఘసమాస రచనయు నుండవలెను. అనఁగా రచనను బట్టియే యా యా విషయములు స్ఫురింపవలెను. మరియుఁ 'ప్రబంధము' అనఁగాఁ గావ్యభేదమునుబట్టియు రచన యుండవలెను. కావ్యభేదములను వెనుకఁ దెలిపి యుంటిమిగదా!

అయితే యొకచో వాచ్యమునుబట్టియుఁ బ్రబంధమునుబట్టియుఁగాక కేవలము వక్తను (కావ్యనాయకుని) బట్టియే రచన సాఁగును. ఎట్లన,

మంథాయస్తార్ణవాంభః ప్లుతి కుహరచలన్మందరధ్వానధీరః
కోణాఘాతేషు గర్జత్ప్రళయఘనఘటాన్యోన్య సంఘట్ట చండః
కృష్ణాక్రోధాగ్రదూతః కురుకులనిధనోత్పాత నిర్ఘాతవాతః
కేనాస్మత్సింహనాదప్రతిరసితసఖో దుందుభిస్తాడితోఽయమ్

మ. తత ఘూర్ణద్ఘటవార్థిమధ్యవిలుఠన్మంథాచలధ్వాన ధీ
రతఁ గోణాహతమై జగత్ప్రళయ గర్జన్మేఘసంఘట్ట చం
డతఁ గృష్ణోగ్రరుషాగ్రదూత కురురాణ్ణాశంకరోత్పాతమై
సతి! మత్సింహరవానుకారి రణనిస్సాణంబిదే! మ్రోఁగెడిన్.

— (వేణీసంహారము.)

ఇట వక్త భీమసేనుఁడు. విషయము రౌద్రవ్యంజకము గాకున్నను ప్రబంధము నాటకమైనను దీర్ఘసమాసరచన చేయఁబడినది.

---

వెనుక రసప్రకరణమున రసము సామాజికనిష్ఠమనికదా చెప్పితిమి. ఇట నాయకుఁడేరసాశ్రయుఁడైన... ఇత్యాదికమగు వ్రాఁత యెట్లు పొసఁగును? అన్నచో లౌకికరసము నాయకాశ్రయమే. సామాజికుఁ డాస్వాదకుఁడు. భట్టలోల్లటాదు లందరును లౌకికరసము నాయకాశ్రయమే యని నొడివి నాయకాశ్రయరసమును సామాజికుఁడెట్లాస్వాదించునో యా విధానమును దెలిపిరి. కాన రసము సామాజిక నిష్ఠమన నలౌకికరసము సామాజికనిష్ఠమని భావము. లౌకికరసము నాయకాశ్రయము. అలౌకికరసము సామాజికాశ్రయము అని సిద్ధాంతము.

ఒక్కెడ నాయకునిఁబట్టియుఁ బ్రబంధముఁబట్టియుఁ గాక కేవలము వాచ్యమునుబట్టియే రచన యుండును. వాచ్యమన వర్ణనీయవిషయము.

> ప్రౌఢచ్ఛేదానురూపోచ్చలనరయభవత్సైంహికేయోపఘాత
> త్రాసాకృష్టాశ్వతిర్యగ్వలితరవిరథేనారుణేనేక్ష్యమాణం
> కుర్వత్కాకుత్స్థవీర్యస్తుతిమివ మరుతాం కంధరారంధ్రభాజాం
> భాంకారైర్భీమమేతన్నిపతతి వియతః కుంభకర్ణోత్తమాంగమ్

బలిష్ఠమైన ఖడ్గాఘాతమునకుఁ దగినట్లు పై కెగురుటచే రాహువు దమ్ముఁ బట్టవచ్చుచున్నాఁడని భయపడి యరుణుఁడు సూర్యాశ్వములఁ గుదించి తేరు ప్రక్కకుఁ ద్రిప్పి చూచుచుండఁగా, వాయుపూర్ణములయిన కంధరా రంధ్రముల భాంకారములు శ్రీరాముని వీర్యమును స్తోత్రించుచున్నట్లుండఁగా నాకాశమునుండి కుంభకర్ణుని భయంకరమైన శిరస్సు నేలమీఁదఁ బడుచున్నది.

ఇట విషయము భయంకరమగు దృశ్యము (కుంభకర్ణ శిరము). కాన దీర్ఘ సమాసరచన సేయఁబడినది. ఒక్కెడ వక్తృవాచ్యమునుబట్టి గాక కేవల ప్రబంధమును బట్టియే రచన సాగును. ఎట్లన, ఆఖ్యాయికయందు శృంగారరసమునఁ గూడ నాయకుఁ డుద్ధతుఁడు గాకున్నను మృదురచన గూడదు. సమాసభూయిష్ఠమగు రచనయే కాదంబరియందువలె నుండవలెను. నాటకాదులందు రౌద్రమునందును నతిగా దీర్ఘసమాసము గూడదు. ఏలన సామాజికుల కర్థప్రతీతి గామి రసానుభవము గలుగదు. కాన నల్పసమాసముగా నుండవలెను. ముక్తకాదులు రసప్రధానములగుటఁ దత్తద్రసానుకూలముగా రచన యుండవలెను. అనఁగా శృంగారరసమయినఁ గోమలవర్ణ బంధము. రౌద్రమయినచో సమాసజటిలతయు నుండవలెను: రసదృష్టియే లేనిచో నిచ్చవచ్చిన రచన సేయవచ్చును. సందానితకాదులందు సమీపసంబంధ ముండదు గాన దీర్ఘసమాసరచనయే యుండవలెను. పర్యాయబంధమున నసమాస, మధ్యమ సమాసములు గల రచన యుండవలెను. పరికథలో నితివృత్తమాత్రోపన్యాసమే యుండును. కానఁ గామచారము. సర్గబంధమగు కావ్యమునఁ దాను నిబంధింపఁదలఁచిన రసానుకూలముగానే రచన యుండును.

ఆంధ్ర ప్రబంధములలో నదీ, పర్వత, పత్తన, రాజాది వర్ణనఘట్టములందుఁ జాలభాగము సమాసభూయిష్ఠమగు రచనయే యున్నది. ఇట వక్తృ, వాచ్య, ప్రబంధౌచిత్యములు దేదియుఁ గానరాదు.

| | |
|---|---|
| ఆకాంచీనగరంబుఁ గాంచె... | పత్తనవర్ణనము |
| ఆసీతాద్రుఁ డేఁగి. | దేశవర్ణనము |

ఈ రెండు పద్యములను దోషప్రకరణమునందలి 'అస్థానసమాసము' అను దోషముక్రింద నుదాహరించితిమి.

ఉ. ఆపురిబాయకుండు... నాయకవర్ణనము (మనుచరిత్రము)
మ. కలఁడుల్లోక... ,, (వసుచరిత్రము)

ఇట్లే మిగిలినవాని నూహించునది.

కొన్నిచోటుల విషయము రౌద్రరసాశ్రయమైనను నసమాసరచనయే కలదు.

సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁజేసి యేపునరేఁగి వాయించియాడఁ
కులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ దాఁకంగవీఁకమైఁ దన్నియాడ
నేఁడుసాగరములు నిక్కడక్కడఁజెట్టి పలుచనిరొంపిమై నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁదెచ్చి పిసికి పిండలినేసి పిడుచకొనఁగ

గీ. మిగిలి బ్రహ్మాండభాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించినరూపంబుకరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె

ఇట ద్రౌపదీపరాభవమును (కీచకకృతము) గాంచిన భీమసేనుని వర్ణనము. ఇట సమాసభూయిష్ఠమగు రచన ముండవలెను. కాని లేదు. ఇట్లులేకుంట దోషమే. ఈక్రిందిపద్యమున విషయౌచిత్యము పాటింపఁబడినది. చూడుఁడు.

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రంబు దగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిదియేఁ జేరంగశక్యుండనే ?

ఉత్తరుఁ డర్జునునితోఁ గౌరవసైన్యమును జూపి యన్న పలుకులు. ఇందలి విషయమును బట్టి దీర్ఘసమాసము యుక్తమే.

ఆంధ్ర ప్రబంధములందు వక్తృ వాచ్య ప్రబంధౌచిత్యము లంత లెస్సగాఁ బాటింపఁబడలేదు.

గుణ ప్రకరణము సమాప్తము.

---

## శబ్దాలంకార ప్రకరణము

గీ. ఇఁక నలంకార నికరంబు లేర్పఱింతు
నవియుఁ గవితాలతాంగికి హారకటక
కంకణాదులక్రియ నలంకరణకరణ
పరిణతులచే నలంకారభావమొందు. ౭౧

కావ్యకన్యకు హారకటక కంకణాదులవంటివగుటను నలంకారపదము సార్థకము. వాని నిట వివరింతుము.

కం. అవియును శబ్దార్థంబుల
ద్వివిధములై క్రమముతోడ వెలయు ననుప్రా
స విశేషంబుల, నుపమా
దివిశేషమ్ములను గావ్యదీపిత సరణిన్. ౭౨

ఆ యలంకారములు శబ్దార్థభేదములచే ద్వివిధము. అం దనుప్రాసాదులు శబ్దాలంకారములు; ఉపమాదు లర్థాలంకారములు.

శబ్దార్థాలంకార విభాగ మెట్లన, నర్థము నపేక్షింపక శబ్దమాత్రము నాశ్రయించిన శబ్దాలంకారమనియు, శబ్దము నపేక్షింపక యర్థమాత్రము నాశ్రయించిన నర్థాలంకారమనియు రుయ్యకుఁడు లక్షణము నుడివెను. మమ్మటుఁడు శబ్దపరివృత్తిని సహింపనిచో శబ్దాలంకారమనియు, సహించినచో నర్థాలంకారమనియును లక్షణము సేసెను. పరిణతిలో రెంటికిని నొకటే యర్థము. మరియుఁ గొందఱు శబ్ద, అర్థ, ఉభయాలంకారములని యలంకారములు ముత్రివిధములుగా విభజించిరి. పునరుక్తవదాభాస, పరంపరితరూపక, లాటానుప్రాసము లుభయాలంకారములనియు, అనుప్రాసాదులు శబ్దాలంకారములనియు, నుపమాదు లర్థాలంకారములనియు వారు విభజించిరి.

### అనుప్రాసము - ఛేకానుప్రాసము

గీ. అందనుప్రాస భేదంబులైన శబ్ద
భవదలంకారములు మున్ను ప్రస్తుతింతు
నడర నెడలేక రెండు రెండక్షరంబు
లెనయునియమంబు ఛేకమా నెట్టటన్న. ౭౩

అస లనుప్రాసమనఁగా "ప్రకృష్టో వర్ణవిన్యాసో రసాద్యనుగతో హి యః। సోఽనుప్రాస స్స చ చ్ఛేకవృత్త్యుపాధిగతో ద్విధా(రసానుగతమగు ప్రకృష్టమగు వర్ణ విన్యాసము 'అనుప్రాసము'. రసము విభావాదులచేతనే వ్యజ్యమానమగుచున్నను గొన్ని వర్ణములు గొన్నిరసములను వ్యక్తము సేయుననియుఁ దెలిపితిమి. కాన నట్టి యా యా రసస్ఫోరకములయిన వర్ణముల విన్యాసము' అని యభిప్రాయము.) ఈ యనుప్రాసము ఛేకానుప్రాసమనియు వృత్త్యనుప్రాసమనియు ద్వివిధము. ఛేకుఁ డన విదగ్ధుఁడు. విదగ్ధులగువారు వ్యవహరించు ననుప్రాసము ఛేకానుప్రాసము. ఛేకానుప్రాసమన నవ్యవధానముగా రెండు రెండక్షరములు నొడువుట. రెండక్షరము లన రెండు హల్లులని యర్థము. అవ్యవధానముగా రెండేసి హల్లుల జంటలను, అనేక పర్యాయములు (ఒకసారికన్న నధికముగా) పద్యమున నొడువుట ఛేకానుప్రాసము. ఈ రెండేసి హల్లుల జంటలలో స్వరసాదృశ్యనియమము లేదు. అది యానుషంగికము.

> స్ఫురత్కృపా బలప్రతాప భూతిధైర్యభూభరా
> ర్భిరంగదానబుద్ధివైఖరిన్ హరిన్ హరిన్, సుధా
> హరున్ హరున్, గిరిన్ గిరిన్, మహానలున్ నలున్, రమా
> గురున్ గురున్, జయింతువోఁ దగున్ నృసింహభూవరా! ౨౪

హరిన్ హరిన్, హరున్ హరున్, గిరిన్ గిరిన్, నలున్ నలున్, గురున్ గురున్ అను పెక్కు రెండేసి హల్లుల జంటలు వచ్చినవి. ఇట స్వరసాదృశ్యనియమము లేక పోయినను స్వరసాదృశ్యముగూడఁ గవి కనఁబఱచెను. దీనికిఁ బదానుప్రాసమనియుఁ బేరు.

నరసభూపాలీయ లక్షణము "భవేదవ్యవధానేన ద్వయోర్వ్యంజన యుగ్మ యోరావృత్తిః" అను ప్రతాపరుద్రీయ లక్షణము ననుసరించి యున్నది. సాహిత్య దర్పణమున దీని లక్షణము భిన్నముగా నున్నది. ఎట్లన

"ఛేకో వ్యంజనసంఘస్య సకృత్సామ్యమనేకధా" స్వరూపముతోడను, క్రమముతోడను వ్యంజనసంఘము నొకతూరిమాత్రమే యావృత్తిసేయుట ఛేకాను ప్రాసము. ప్రతాపరుద్రీయ లక్షణమున రెండేసి యక్షరములకుమాత్రమే యావృత్తి చెప్పఁబడినది. ఇట వ్యంజనసంఘమున కావృత్తి. అదియు స్వరూపమును క్రమమును విడనాడకుండవలెను. అనఁగా 'సర' అనుదానిని 'రస' అని యావృత్తి చేసినను స్వరూపము తొలఁగదు. కాని 'సర' అను నక్షరక్రమము తప్పును. కావున స్వరూప క్రమము లుభయమునుండవలెను.

> ఆదాయ కమలగంధా నంధీకుర్వన్ పదేపదే భ్రమరాన్
> అయమేతి మందమందం కావేరీవారిపావనః పవనః

'గంధా నంధీన్' అనుచో 'ంధ' అను సంయుక్తాక్షర ద్వయమునకును, 'మంద మందం' అనుచోఁగూడ 'ంద' అను సంయుక్తాక్షర ద్వయమునకును 'వేరీ వారి, అనుచో నసంయుక్తాక్షరద్వయమునకును, 'పావనః పవనః, అనుచో బహువ్యంజనములకును నొక్కొక్క యావృత్తిమాత్రమే చేయఁబడినది. ంధాన్ ంధీన్; వేరీ వారి; 'పావనః పవనః, అనునెడల వ్యంజనసాదృశ్యమేకాని స్వరసాదృశ్యములేదు. స్వర సాదృశ్య నియమము లేదనియు నది యానుషంగికమనియును జెప్పితిమి.

## వృత్త్యనుప్రాసము

గీ. ఒక్కవర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ
  బరగుజృంభణ వృత్త్యనుప్రాసమయ్యెఁ ౭౫

ఒక్కవర్ణమునే తుదదాఁక ననఁగాఁ బెక్కుపర్యాయము లావృత్తిసేసినచో వృత్త్యనుప్రాసమగును. ప్రతాపరుద్రీయమున

ఏక, ద్వి, ప్రభృతీనాం తు వ్యంజనానాం యదా భవేత్
పునరుక్తి రసౌ నామ వృత్త్యనుప్రాస ఇష్యతే

(ఒకటి, రెండు, మూఁడు, నాలుగు మొదలయిన వ్యంజనములను బెక్కు పర్యాయము లావృత్తిసేయుట వృత్త్యనుప్రాసము) అని చెప్పెను.

ఇందేకవ్యంజనము నొకసారిమాత్ర మావృత్తిసేసిన వైచిత్ర్యములేమినిఁ బెక్కు పర్యాయము లావృత్తినిఁ జేయవలెను. వ్యంజనద్వయమున నొకతూరియే యావృత్తి సేయవలెను. దీనినిఁగూడఁ బెక్కుపర్యాయము లావృత్తిసేసితిమేని ఛేకానుప్రాసమే యగును. వ్యంజన త్రయమును వ్యంజన చతుష్టయమును నొకతూరి గాని పెక్కు తూరులు గాని వ్యవధానముగాఁ గానీ యవ్యవధానముగాఁ గాని యావృత్తి సేయ వచ్చును. అని సోమపీథి వ్యాఖ్యానమునఁ గలదు.

## వృత్త్యనుప్రాసోదాహరణము

చ. సమదవిపక్షశిక్షణ విచక్షణ దక్షిణ దోరనుక్షణ
  ప్రభమదసి దుర్నిరీక్ష సమరక్షపితక్షితిపక్షతక్షర
  త్సమధికశోణితక్షర కృతక్షణరక్షిత పక్షిలోక! నిక
  గమలదశాక్షుఁడేబు బలగౌరవసింహ! నృసింహభూవరా! ౭౬

ఇందు 'క్ష'కారము పెక్కుపర్యాయము లావృత్తి సేయఁబడినది. కాన వృత్త్యనుప్రాసము. ఇట్లే ద్వి, త్రి, చతురాద్యక్షరావృత్తు లూహ్యములు.

## లాటానుప్రాసము

గీ. తలఁపఁ బునరుక్తియయ్యుఁ దాత్పర్యభేద
మెనయు నియమంబు లాటమౌ నెట్లటన్న.

"శబ్దార్థయోః పౌనరుక్త్యం యత్ర తాత్పర్యభేదవత్
స కావ్య తాత్పర్యవిదాం లాటానుప్రాస ఇష్యతే."

శబ్దార్థములయొక్క పౌనరుక్త్యమున్నను దాత్పర్యభేదమున్నచో నది లాటానుప్రాసము.

చ. ఘనత నృసింహుఁజూడఁగల కన్నులు కన్నులు; వాని కౌఁగిటం
జనువున నేపునూపఁగల చన్నులు చన్నులు; వాని మోవికిం
జొనిపిన పాటలాధరము జున్నులు జున్నులు; వానిమేనఁ జే
ర్చిన సరసాంగవల్లికల చెన్నులు చెన్నులువో! తలోదరి! ౨౨

కన్నులు కన్నులు, చన్నులు చన్నులు, జున్నులు జున్నులు, చెన్నులు చెన్నులు అనుచో శబ్దమును, అర్థమును సమానమే. కానఁ బౌనరుక్త్యము సంభవించుచున్నది. కాని తాత్పర్యము మాత్రము భిన్నము. ఎట్లన, నృసింహుఁ జూడఁగల కన్నులు శ్రేష్ఠములైన కన్నులు. చన్నులు శ్రేష్ఠములైన చన్నులు. ఇట్లే మిగిలినవియును. ఈ విధముగాఁ దాత్పర్యమునుబట్టి మొదటి పదములకన్న రెండవ పదములు భిన్నములు. ఇట్టిది లాటానుప్రాసము.

ఈ లాటానుప్రాసము నుభయాలంకారముగా మమ్మటాదులు తెలిపిరని వచించితిమి.

సాహిత్యదర్పణకారుని మతమున ననుప్రాసము ఛేక, వృత్తి, శ్రుతి, అంత్య, లాటానుప్రాస భేదములచే నైదువిధములు. సరస్వతీ కంఠాభరణకారుని మతమున శ్రుతి, వృత్తి, వర్ణ, పద, నామ (ప్రాతిపదిక) లాటభేదములచే నాఱువిధములు. ఈలాటానుప్రాసమును మమ్మటాదులు పదావృత్త్యనుప్రాసమనియుఁ, బ్రాదిపదికావృత్త్యనుప్రాసమనియుఁ, బ్రథమమున రెండువిధములుగా విభజించిరి. మరలఁ బదావృత్త్యనుప్రాసమును బహుపదావృత్త్యనుప్రాసము, ఏకపదావృత్త్యనుప్రాసము, అని ద్వివిధముగా విభాగించిరి. ప్రాదిపదికావృత్త్యనుప్రాసమును ఏకసమాసవృత్త్యనుప్రాసము (రెండుపదములును నేకసమాసమందుండుట) భిన్నసమాసవృత్త్యనుప్రాసము (పదద్వయమును భిన్నభిన్నసమాసములం దుండుట) సమాసాసమాసవృత్త్యనుప్రాసము (ఒకపదము సమాసమునందును మరొకపద మసమాసమునను నుండును) అని మూఁడుగులుగా విభజించిరి. మొత్తె మైదు విధములు.

## యమకము

కం. సమవర్ణ యుగాధికమై
యమరిన నియమంబు యమకమగుఁ గృతులందా
యమకం బనేకవిధమగుఁ
గ్రమమున నొక రెండుమూఁడు గతు లెఱిఁగింతున్. ౭౮

సమానమైన వర్ణములయొక్క జంటనుగానీ సమూహమును (అధికము)గానీ యావృత్తి సేయుట యమకము. ఇది యనేకవిధము. రెండు మూఁడు విధములు మాత్ర మెఱిఁగింతును. ఒకేవిధమైన క్రమమున నసమానమగు నర్థముగల (సమానార్థకములు గాని) సమానవర్ణములయొక్క జంటయొక్క కానీ పెక్కింటియొక్కగాని యావృత్తి యమకము. (సమానార్థకత్వాభావ వత్సమానానుపూర్వికానేకవర్ణావృత్తి ర్యమకం) ఇట సమానవర్ణములు స్వరవ్యంజనోభయ సాదృశ్యముగలవిగానే యుండవలెను. "యమ ఏవ ప్రకృతి ర్యస్యతత్ యమకం" జంటయే యనఁగా స్వరవ్యంజనములయొక్క జంటయే ప్రకృతిగాఁగలది యమకమని వ్యుత్పత్తి.

అయితే ఛేకానుప్రాసమున వెనుకటి నరపభూపాలీయ పద్యమున 'హరిన్, హరిన్' ప్రభృతులందు యమకమని యేల చెప్పఁగొనఁగూడదు? సమానార్థకత్వాభావ వత్సమానానుపూర్వికానేకావృత్తి గలదుగదా? అన్నచో నిజమే. 'హరిన్ హరిన్' అను నుదాహరణము యమకోదాహరణమే యనఁజెల్లును. ఛేకానుప్రాసమున కది యుదాహరింపఁదగదు. 'గంధానంధీ కుర్వన్' అను సాహిత్యదర్పణోదాహరణమే యర్హము. 'ఛేకానుప్రాసమున స్వరావృత్తి యానుషంగికము' అనుట దోషమే. ఏలన, స్వరావృత్తి యున్నచోట్లనెల్ల నిదేవిధముగా యమకమా? ఛేకమా? అను శంక యుత్థితమగుచునే యుండును. కాన స్వరవ్యంజన పౌనరుక్త్యమున్నచోట యమకమనియుఁ గేవల వ్యంజనయుగ్మమున కావృత్తి యున్నచో ఛేకానుప్రాసమనియుఁ జెప్పుట లెస్స. కావున సాహిత్యదర్పణ ఛేకానుప్రాసమే యుచితమైనది.

ఈ యమకము పాదయమకమనియుఁ బాదభాగయమకమనియును ద్వివిధము. పాదయమకము మరలఁ బదునొకండు విధములు. ౧. ప్రథమపాద ద్వితీయపాదములు తుల్యములయిన ముఖయమకము. ౨. ప్రథమ తృతీయ పాదములు తుల్యములయిన సందంశయమకము. 3. ప్రథమ చతుర్థపాదములు తుల్యములయిన నావృత్తియమకము. ౪. ద్వితీయ తృతీయములు తుల్యములయిన గర్భయమకము. ౫. ద్వితీయ చతుర్థములు తుల్యములయిన సందష్టయమకము. ౬. తృతీయ చతుర్థములు తుల్యములయిన

పుచ్ఛయమకము. ౭. నాలుగు పాదములు తుల్యముగానున్నచోఁ బంక్తియమకము. ౮. ప్రథమ చతుర్థములును, ద్వితీయ తృతీయములును దుల్యములయినచోఁ బరివృత్తియమకము. ౯. ప్రథమ ద్వితీయములును, తృతీయ చతుర్థములును దుల్యములయినచో యుగ్మకయమకము. ౧౦. అర్ధావృత్తి యనఁగాఁ బూర్వార్ధమును నుత్తరార్ధమును దుల్యముగా నున్నచో సముద్గకము లేక సంపుటము. ౧౧. శ్లోకావృత్తి యనఁగా శ్లోకద్వయము తుల్యముగా నున్నచో మహాయమకము.

ఇఁకఁ బాదభాగయమకము లసంఖ్యాకములు. ఎట్లనఁ, బాదమును రెండు భాగములుగా భాగింతము. పాదయమకమునఁ జూపఁబడిన విధమున నీ పాద ప్రథమ భాగములు దుల్యముగా నుండెనేని, ద్వితీయభాగములును దుల్యముగా నుండెనేని నిరువది భేదములు వచ్చును. (పాదభాగ యమకములలో శ్లోకావృత్తి యమక ముండదు. కానఁ బాదభాగయమక భేదములు పది మాత్రమే. ఈ పదిభేదములును రెండు భాగములలో నుండును గాన నిరువది భేదములగును.) పాదమును మూఁడు భాగములుగా భాగించినచోఁ బై విధమున యమకములు గూర్చినచో ముప్పది భేదములగును. పాదమును నాలుగు ఖండములుగాఁ జేసినచో నలువది భేదములు వచ్చును. మరియును బ్రథమపాదాదులయొక్క యంతభాగమును ద్వితీయాది పాదాదులయొక్క యాదియందుఁ గూర్చినచో నంతాదికయమకము. ప్రథమపాదాదుల యాదిభాగమును ద్వితీయాది పాదాదుల యంతమందుఁ గూర్చినచో నాద్యంతిక యమకము. ఇట్లే మధ్యాదికయమకము, ఆదిమధ్యయమకము, అంతమధ్యయమకము, మధ్యాంతికయమకము, వీనికిఁ బరస్పర సముచ్చయము. మరియు నా యా భాగము లనియతస్థానమునఁ గూర్చుచున్నచో ననంతమగు భేదము లేర్పడును. ఈవిధమునఁ బాదభాగయమకము లనంతములు.

మరియుఁ బ్రతిలోమయమక మను మరొక భేదముగూడఁ గలదు. వీని నన్నింటిని దండి కావ్యాదర్శమున మూఁడవ పరిచ్ఛేదమున వివరించి చూపెను. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆంధ్ర కావ్యాదర్శమునను జూపఁబడి యున్నవి. ఇవి కావ్యమున గుణభూతములగుటచే నంగా నీరసములగుటచే విస్తరింపలేదు. ఇవిగాక యప్పకవీయమున (చతుర్థాశ్వాసమున) అనులోమ, విలోమాది శబ్దాలంకారములును గలవు. వలసినవారు వానిని నట స్వీకరింపవలెను.

### పాదయమకము

క౦. మేలిమి రెండవపాదము
నాలవపాదంబు నొక్కయనువునఁ దనరం

జాలిన యమకము కృతులం
దాలింపఁగఁ బాదయమకమగు నెట్లన్నన్. ౮౯

కం. ఔరా! ఓబనృపాలకు
మారా! మను! మదనసమ! రమాధుర్యుఁడవై;
ధీరా! నృసింహా! కూడితి
మారామను మదనసమరమాధుర్యుఁడవై. ౯౦

ఇందు ద్వితీయ చతుర్థ పాదములు తుల్యములు. దీనిని సందష్టయమకమందురు.

### ముక్తపదగ్రస్తము

కం. ప్రస్తుతమగు ముక్తపద
గ్రస్తంబన; నదియుఁ గృతులఁబరగుఁ బదాంతో
దస్తము పాదాద్యంత సు
విస్తృతము; పదాంత సింహవీక్షణమనఁగన్. ౯౧

ఇది పాదభాగ యమకభేదము. ఇది ద్వివిధము. వీనిని దండి సందష్టయమకమనెను. ప్రకాశకారాదులు 'అంతాదియమకము, ఆద్యంతయమకము' అనిరి. వీనిని గ్రంథకర్త పాదాంతపాదాది ముక్తపదగ్రస్తమనియు, సింహావలోకన ముక్తపదగ్రస్తమనియును చేరిచెను.

### పాదాంతపాదాది ముక్తపదగ్రస్తము (అంతాదికము.)

కం. సుదతీ నూతనమదనా!
మదనాగతురంగ పూర్ణమణిమయసదనా!
సదనామయ గజరదనా!
రదనాగేంద్రనిభకీర్తిరసనరసింహా! ౯౨

ప్రథమపాదాంతస్థమగు 'మదనా' అను పదమే ద్వితీయ పాదాదియందును, ద్వితీయపాదాంతస్థమగు 'సదనా' అను పదమే తృతీయపాదాదియందును, తృతీయ పాదాంతస్థమగు 'రదనా' అను పదము చతుర్థపాదాదియందును గూర్పఁబడియున్నవి.

### సింహావలోకన ముక్తపదగ్రస్తము

కం. మనవేటికి నూతనమా!
తన మా[illegible]!

నను మానక దయదనరం
దనరంతులు మాని నరసథవు రమ్మనవే! ౮౩

ఇందు వెనుకటి పద్యమునందువలెనే అంతాదియమక మంటయే గాక ఆద్యంత యమకముగూడఁ గలదు. ఎట్లనఁ, బ్రథమ పాదాదిస్థమగు 'మనవే' అను పదమే 'రమ్మనవే!' అని పద్యాంతమునను వచ్చినది. దీనిని సింహావలోకన ముక్తపదగ్రస్త మనియు నందురు.

యమకాదౌ భవే దైక్యం డలయో రలయోర్బవోః
శషయోర్నణయోశ్చాంతే సవిసర్గావిసర్గయోః
సబిందుకాబిందుకయో స్స్యాదభేద ప్రకల్పనం॥

యమకాదులందు (యమకము, శ్లేషము) డకార లకారములకును, రేఫ లకారములకును, బకార వకారములకును, శకార షకారములకును, నకార ణకారములకును, సవిసర్గ, అవిసర్గ పదములకును, సబిందుకాబిందుక పదములకును నైక్యము సేయవచ్చును. ఎట్లన "భుజలతాం జడతా మబలాజనః" ఇట డకార లకారములకు భేదమున్నను యమకమే.

'యమకంతు విధాతవ్యం న కదాచిదపి త్రిపాత్' యమక మొక పద్యమున నొకపాదమునఁ గానీ పాదద్వయమునఁ గానీ పాద చతుష్టయమునఁ గానీ కూర్పవచ్చును. పాదత్రయమునఁ గూర్పరాదు. ఎట్లన,

భుజంగమస్యేవ మణిస్సదంభా। గ్రాహావకీర్ణేవ నదీసదంభాః
దురంతతాం నిర్ణయిలో౽పి జంతోః। కర్షంతిచేతః ప్రసభం సదంభాః॥

ఈ శ్లోకమున 'సదంభాః' అను పదము మూఁడు పాదములలో సావృత్తమయినది. ఇట్లుండుట దోషము. కాన నిట్టి పాదత్రయ యమకమును రచింపరాదు. కాని కావ్యాలంకార చూడామణి కర్త త్రిపాద్యమకము నుదాహరించెను.

శా. శస్త్రోద్దంచితుఁడైన యవ్విభు విపక్షశ్రేణికిన్ విభ్రమ
త్వ స్త్రీ తస్ఫుటకంకణధ్వని రణస్థానంబునన్, విభ్రమ
త్వ స్త్రీ తస్ఫుటకంకణధ్వని మరుత్సైన్యంబులన్, విభ్రమ
త్వ స్త్రీ తస్ఫుటకంకణధ్వని సరిత్సంగంబులన్ జేకుఱున్.

## పునరుక్తవదాభాసము

యత్రార్థః ప్రమఖే కించిద్భాసతే పునరుక్తవత్

పునరుక్తవదాభాసో౽లంకార స్స సతాం మతః॥

ఆపాతముగా నెందర్థము పునరుక్తమువలె నాభాసించునో (పరమార్థము విచారింపఁగాఁ బునరుక్తము గాదు) యది పునరుక్తవదాభాసము. ఇది యర్థాలంకార మైనను శబ్దపౌనరుక్త్యమునుబట్టి శబ్దాలంకారమే.

> జిష్ణురింద్రః క్షితిభుజాం । శ్రీపతిః పురుషోత్తమః
> భాస్వాన్ సూర్యఃస్ఫురత్తేజాః । కాకతీంద్రో విరాజతే.

ఈ కాకతీంద్రుఁడు జిష్ణువు; (జయశీలుఁడు) రాజులకింద్రుఁడు; శ్రీపతి; పురుషోత్తముఁడు (పురుష శ్రేష్ఠుఁడు); ప్రకాశమానుఁడు; సూర్యునివలె స్ఫురత్తేజస్కుఁడు.

ఇట జిష్ణు, ఇంద్రపదములు, శ్రీపతి, పురుషోత్తమపదములు, భాస్వాన్ సూర్యపదములును పునరుక్తములవలె నున్నవి. పరమార్థమున భిన్నార్థకములే.

ఇందలి యనుప్రాస, యమకాదులను గావ్యమునఁ బ్రయోగించువిషయంబున ధ్వనికారుఁ డీ క్రిందివిధమునఁ దెలుపుచున్నాఁడు.

> శృంగారస్యాంగినో యత్నా దేకరూపానుబంధనాత్
> సర్వేష్వేవ ప్రభేదేషు నానుప్రాసః ప్రకాశకః
> ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాది నిబంధనం
> శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః.

అంగిరసమగు శృంగారమున నేకప్రకారానుబద్ధమగు ననుప్రాసము గూడదు. అంగిరసమగు శృంగారమున యమకాది నిబంధనము గూడదు. (కోపాది మిశ్రితమగు శృంగారమున ననుప్రాస యమకములు వాడవచ్చును.)

మరియు విద్యాధరుఁడు "ప్రాయశో యమకే చిత్రే రసపుష్టిర్నదృశ్యతే" తెలుచుగా యమకమున రసపుష్టి లేదని తెలిపెను.

## బంధకవిత్వము, (పద్మబంధము)

చ. కనుఁగొన రేకులెన్మిదియుఁ గర్ణిక చుట్టెడి స్రగ్ధరాంఘ్రులన్
మునుపటి యేడువర్ణములునుం గడ యేడుఁ బ్రవేశనిర్గతుల్
పనుపడ నాల్గుదిగ్దళములన్ లిఖియించి విదిగ్దళంబులం
దెనయఁగఁ బాదమధ్యగము లేడును వ్రాయఁగఁ బద్మబంధమా.

ప్రథమమునఁ గర్ణికనువ్రాసి దాని కెనిమిది దిక్కులందును నెనిమిదిదళము



లనువుపఱచి యందలి నాలుగు దిగ్దళములందును స్రగ్ధరావృత్తముయొక్క పాదాదు

లందున్న యేడువర్ణములును పాదాంతములందున్న యేడువర్ణములను బ్రవేశ నిర్గమవిధ మున వ్రాయవలెను. విదిగ్దళములందుఁ బాదమధ్యమున నున్న యేడు వర్ణములను లిఖింపవలెను.

ప్రవేశమనఁ బాదాంతమందలి యేడు వర్ణములను దళాగ్రభాగమునుండి మొద లిడి కర్ణికలోని యక్షరముతో ముగియునట్లును, నిర్గమమనఁ దరువాతి పాదమునందలి మొదటి యేఁడు వర్ణములను గర్ణికలోని యక్షరముతో మొదలిడి దళాగ్రము నందలి యక్షరముతో ముగియునట్లును వ్రాయువిధము. ఇది దిగ్దళములందుమాత్రమే యుం డును. ఉత్తరదిగ్దళమున మాత్రము బ్రథమపాదాది వర్ణసప్తకమునే వ్రాయవలెను. మొత్తము మీఁద దిగ్దళములందలి వర్ణసప్తకమును ననులోమ విలోమములఁ జదువ వలయును.

ఇట్లు లిఖించి పటములోని యుత్తర దిగ్దళమునందున్న పాదాది యందలి యేడు వర్ణములను గర్ణికనుండి చదివి (ఇదియే నిర్గమము) దాని వెంటనే విదిగ్దళము నందలి (ఈశాన్యమ) వర్ణసప్తకమును గ్రిందినుండియే చదివి మరలఁ బ్రాగ్దిగ్దళము నందలి పాదాంతవర్ణసప్తకమును దళాగ్రము మొదలిడి కర్ణికాక్షరముతో ముగియునట్లు జదువవలెను (ఇదియే ప్రవేశము.)ఇట్లే దక్షిణ, పశ్చిమదిగ్విదిగ్దళము లందలి వర్ణము లను నిర్గమ ప్రవేశములతోఁ జదువవలెను. ఇది పద్మబంధము. ప్రకాశకార దర్పణకారుల పద్మబంధ లక్షణములు భిన్నములుగా నున్నవి. అప్పకవీయమున మరొకవిధముగా నున్నది. స్రగ్ధరావృత్తమే పద్మబంధమున నుండవలెనన్న నియమము లేదు. వానిలో ననుష్టుబ్వృత్తమునే పద్మబంధమున నిబంధించి చూపిరి. వివరముల కా గ్రంథములను జూచుకొనవలెను.

చక్రబంధము

కం. పదిచుట్లు, నాలు రేకులుఁ,
బదిలపఱచి సుకవి పేరుఁ బతిపేరును లోఁ
బొదలఁగ నేవంవిధగుణ
విదితంబగు చక్రబంధవిధమా నెటనన్. ౮౬

ఒక పెద్దసున్నయు దానిలో మరొకటి యందులో నింకొకటి యిట్లు పది సున్నలు చుట్టి యన్నింటికన్న చిన్నదగు సున్ననుండి పెద్దసున్న రేఖవఱకు నాలు రేకలు వ్రాసి నడుమ కవిపేరును రచించినఁ జక్రబంధము. ఇది విస్పష్టముగాలేదు.

ఒక దానిలో [illegible] రేకులు రచించి యా రేకులలో స్రగ్ధరాది వృత్తములలో మూఁడు పాదములు వ్రాసి నాలవ పాద

# పద్మబంధము

రామాకశ్రీ సమగ్రాగారణకృత భయముద్రాససక్తారమారా
రామాసక్తాస సద్రాష్ట్రిభరణ పటిమాత్రాస కుంతీకుమారా!
రామాకుంతీకుసత్రా ప్రకటతరవిచిత్రా పవిత్రాసమారా!
రామాసత్రావిపత్రాశ్రయ నరసరుచిగ్రామసశ్రీకమారా! ౮౫

ఉత్తరదిగ్దళము




దక్షిణదిగ్దళము

మును పెద్ద సున్న (చక్రము)లోఁ వాని రేకులలోని మూఁడవయక్షరములును నాలవ యక్షరములను గలిపినచోఁ గవి కృతిపతుల నామములు వచ్చునట్లు రచించినచోఁ జక్రబంధ మగును. (అప్పకవీయ లక్షణము.) ఈ యుదాహరణ పద్యము నందలి మొదటి మూఁడుపాదములలో మూఁడవ యక్షరములును, నా పాదాంత మందలి యక్షరత్రయములో మొదటి యక్షరములును గలిపి చదివిన 'నారసింహాంకితం'అని వచ్చును. మరల మొదటి మూఁడు పాదములలోని యాలవ యక్షరములును నా పాదాంతమందలి యారక్షరములలో మొదటి యక్షరములును గలిపి చదివినచో 'మూర్తి (తి) కవి కృతి' అనియును వచ్చును.

## చక్రబంధము

శా. రక్షానాకపమూర్తి భాసుర గభీరా విక్రమోహాస్పదా!
దక్షారమ్యమతిస్థిరాభరణ విద్యాకృత్యశంకిస్వనా!
వక్షస్సింధుపకన్యకా నరసభవ్యాతిగ్మదీతంత్రదా!
దాక్షిణ్యారతనాదవైభవ వినోదా హేమనాగాశ్వదా!



ఇవి గాక గోమూత్రికా, ఛత్ర, గుచ్ఛ, కుండలి, నాగ, కంకణ, మురజ, ఖడ్గ, సర్వతోభద్ర, మాలికా, క్షురికా, శరయంత్ర, వ్యోమ, వివిడిత, ద్విశృంగాటక, అర్ధభ్రమక, బాణ, ముసల, శూల, అంకుశ, శక్తి, హల, ఉరశ్చక్ర, స్వస్తిక, నంది, ఆవర్త, భృంగార, చామర, ఘంటా, సప్తచక్రిక ప్రభృతులగు బంధములు గలవు.

పద్మబంధములలో అష్టదళ, ద్వాదశదళ, షోడశదళ, భేదములు గలవు.

ఈ బంధములలోఁ గొన్ని గిడుగు వెంకటరామమూర్తిగారిచేఁ బ్రకటింపఁబడిన యప్పకవీయములో ౨౮౧ పుట మొదలుకొని యున్న పుటలలోఁ జిత్రింపఁబడియున్నవి. వానినిఁ జూచుకొనవలెను.

## గర్భకవిత్వము

ఒకవృత్తమునఁ గొన్నియక్షరములను విడిచి చదివినచో మఱొకవృత్త మేర్పడును. ఇట్లొకవృత్తమనసే రెండు, మూఁడితరవృత్తములు గర్భితములై యుండును. ఎట్లన

సీ. మహిత విద్వజ్జన మండలీవినుత సా
హిత్యప్రియంభావుకోత్త్యుదార !
వితత భీమాహవ విక్రమక్రమ సము
ద్యద్వైరి నిర్భేదనాభిరామ !
వినుత విశ్రాణన విభవాపహాసితా
నూనామరద్రుమోరుహా ! నృపేంద్ర !
వినత భూపాలక విస్ఫురన్ముకుట ర
త్నద్యోతితాంచత్పదా ! మహాత్మ !

---

పాశ్చాత్య సాహిత్యమునఁ గూడ నొకానొక కాలమున బంధవిలోమాది కావ్యములున్నట్లు 'బెరిడెల్ కీత్' పండితుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు.

"Nodoubt, we hear in the Alexandrian age as in the latter Roman Poetry (Martial ii86) of such things as Sotadean Verses to be read back wards of simmias making poems, technopaignia, in the form of an axe, or a nightingale's egg of Dosiada's similar feet with an altar so on. It may be that these tricks arose from the practice of writing inscriptions on swords and leaves.

History of Sanskrit literature page 127.

గీ. 'నిరుపమదయాపయోనిధి నిరతభరిత
చారుచరిత ! నిర్మలతర ! సత్యరుచిర !
తరణికులమణీ ! నరసింహ ! ధరణిరమణ !
ఘనతర గుణనిధీ!' యను జనులఁ బొగడ. ౮౮

ఈ సీసపద్యమున నాల్గు పాదములందలి ప్రథమ వర్ణములను బాహ్యాంతము నందలి మూఁడువర్ణములను దొలఁగించి చదివినచో మత్తేభవృత్తము వచ్చును. మరియు గీతపద్యమున నాలవపాదమునందలి గుణనిధీ!' అన్నంతదనుక గందము వచ్చును. ఇట్టిది గర్భకవిత్వము. ఈభేదములు 'అప్పకవీయము'నందలి చతుర్థాశ్వాసమునఁ దుదిభాగమునఁ గలవు. చూచుకొనునది.

ఈశబ్దాలంకార, బంధ, గర్భకావ్యములు చిత్రకావ్యములనియుఁ జిత్రకవిత్వ మనియును వ్యవహరింపఁబడును. ఈకావ్యములు రసహీనములగుట నధమకావ్యము లుగాఁ జెప్పఁబడినవి. ఇంకను వీనివిషయమును గూలంకషముగాఁ దెలిసికొనఁ దలఁచినవారు సాహిత్యదర్పణమునకు 'రుచిర' యను వ్యాఖ్యను వ్రాసిన శివదత్త పండితుని 'చిత్రరహస్యము' అను గ్రంథమును జూచునది.

## ప్రహేళికలు

"ప్రహేళయతి సూచయతి భావం నతు స్వరూపార్థమితి ప్రహేళికా"

స్వరూపార్థము నవఁగా నర్థస్వరూపమును దెలుపక భావమును మాత్రమును సూచించునది ప్రహేళిక. ఇది పొడుపుకథ వంటిది. "రసస్యపరిపంథిత్వాన్నాలంకారః ప్రహేళికా" ఇది కావ్యజీవితభూతమగు రసమునకు శత్రువగుటవలన నలంకారము గాదు. క్రీడాగోష్ఠీ వినోదములందును రహస్యసంభాషణములందును (పెక్కండ్రున్నచోట) బరవ్యామోహమునకై యివి యుపయోగపడును. ఇవి పదునాఱు భేదములని దండి చెప్పెను. వీని లక్షణలక్ష్యసంజ్ఞాభేదము లాంధ్రకావ్యాదర్శమునఁ జూచునది. సాహిత్యదర్పణమున చ్యుతాక్షరా, దత్తాక్షరా, చ్యుతదత్తాక్షరా, అక్షరముష్టి, బిందుమతి, అర్థమతి అని యాఱుభేదములు దెలిపెను.

సాహిత్యదర్పణమున చ్యుతాక్షరా, దత్తాక్షరా, చ్యుతదత్తాక్షరా అను ప్రహేళికల కుదాహరణ మిచ్చెను. వాని నిటఁ జూపుదుము.

"కూజంతి కోకిలాస్సాలే" సాలమునఁ గోకిలలు కూయుచున్నవి, ఇట 'ర', అనునక్షరము చ్యుతము చేయఁబడినది. రసాలమని యభిప్రాయము. (చ్యుతాక్షరా ప్రహేళికా)

"యావనే ఫుల్లమంబుజం,, యావనమునఁ దామరపువ్వు వికసించినది. ఇట 'యా, అను నక్షర మధికముగా నీయఁబడినది. (దత్తాక్షరా ప్రహేళికా)

'కిం కరోతు కురంగాక్షీ వదనేన నిపీడితా' వదనముచే మిక్కిలి పీడితురాల యిన యువతి యేమిచేయును? ఇట 'మ' వర్ణమును జ్యుతమునేసి 'వ' వర్ణము నొసంగెను. 'మదనేన' అని భావము. (చ్యుత దత్తాక్షరా ప్రహేళికా)

ఇందొకచో నొకవర్ణమును దీసివేసియు నొకచో నధికముగా నిచ్చియు నొకచో నొకవర్ణమును దీసివేసి మరొకవర్ణమును బెట్టియు నుంటచే నర్థము పొసగకున్నది. ఆయా వర్ణములు దెలిసికొని యర్థమును బొసగునట్లు చేయవలెను.

'బిందుమతి' యను ప్రహేళిక కాదంబరీ వ్యాఖ్యాత చూపినదాని నిట నుదాహరింతును. ఈ క్రింది విధమున బిందువులు (సున్నలు) ఇచ్చినచో నాపద్యమును గనుఁగొనవలెను. అది బిందుమతి.

○్రి ○ు ○ ○ ○ూ ○ా ○ ○్నం ।
○ి○్రం ○ి○ం○ోః ○ు○ు○్వ○ీ ○ం○ుః
○ ○ ○ు ○ ○ ○ి ○ు○ృ○ా○ు○ ।
○ ○ ○ీ ○ ○ ○ో ○ ○ ○్చం○్రః

త్రిభువనచూడారత్నం
మిత్రం సింధోః కుముద్వతీ బంధుః
అయముదయతి ఘుసృణారుణ
రమణీ వదనోపమశ్చంద్రః

ఇతరముల లక్ష్యలక్షణములు ఆంధ్ర సాహిత్యదర్పణమునఁ గలవు. గ్రంథ విస్తరభీతిచే వానిని వదలితిని.

బంధ, గర్భకావ్యములును బ్రహేళికలును గావ్యాంతర్గతభూతములే కాన విస్తరించి తెలుపఁ దలఁపలేదు.

శా. భూనాథోత్తమ! జంభభంజన మహాభోగాభిరామక్రియా
దానోజ్జృంభిత [illegible]

మానామేయ! సుధాబ్ధినిర్మలగుణా! మాద్యన్మహాయాధవ
శ్రీనూత్నప్రథమానభాగ్యవర! వైరివ్రాతభేదివ్రతా! ౭౯

కం. నీహారశిఖరిశిఖర
వ్యూహామితతుహినకణ మహామహిమమహా
మోహావహావిమతవరా
రోహామణిహారనయ నిరూఢవిహారా! ౮౦

లయగ్రాహి

మిత్రకులభూషణ! యమిత్రకులభీషణ! విచిత్రమృదుభాషణ!
చరిత్రమణిహారా!
చైత్రవిశిఖాసన! బలిత్రిపురశాసన! పవిత్రగుణభావన!
సగోత్రభృతిధీరా!
క్షాత్రశుభలక్షణ! సుపాత్రజనరక్షణ! కుశాత్రయవిచక్షణ!
యకృత్రిమవిహారా!
గోత్రసమసింధుర! కళత్రితవసుంధర! పత్రిరథబంధుర!
తనుత్రభుజసారా!

గద్యము

ఇది శ్రీ హనుమత్ప్రసాదలబ్ధ కవితాసార సారస్వతాలంకార, నిరంకుశ ప్రతిభా
బంధుర, ప్రబంధపఠన రచనాధురంధర, ప్రబంధాంక వేంకటరాయభూషణ
సుపుత్త్ర, తిమ్మరాజపౌత్ర, సకల భాషావిశేష నిరుపమావధాన
శారదామూర్తి మూర్తిప్రణీతంబైన కావ్యాలంకార సంగ్రహం
బను మహాప్రబంధంబునందుఁ ద్రివిధదోషనిర్ణయంబును
గుణప్రకరణంబును, శబ్దాలంకార సంగ్రహంబు
నన్నది చతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము

కం. శ్రీనందన సౌందర్య ! బు
ధానందన ! కీర్తి విజితహారిచందన ! మే
ధానయనిధాన ! దానే
దానీంతనకర్ణ! నరసధరణీశమణీ ! ౧

గీ. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల
ననఘ ! భవదీయ నామధేయాంకితముగ
బహువిభక్తుల నొనరింతుఁ బద్యవితతి
నింకఁ జతురార్థభవదలంకృతులు వరుస. ౨

ఉపమా–అనన్వయ – ఉపమేయోపమా– స్మరణ–రూపక–పరిణామ–సందేహ–భ్రాంతిమత్ –అపహ్నవ – ఉల్లేఖ–ఉత్ప్రేక్షా–అతిశయోక్తి–సహోక్తి– వినోక్తి–సమాసోక్తి– వక్రోక్తి– స్వభావోక్తి–వ్యాజోక్తి–మీలన–సామాన్య – తద్గుణ – అతద్గుణ – విరోధాభాస–విశేష–అధిక–విభావనా – విశేషోక్తి–అసంగత – విచిత్ర–అన్యోన్య–విషమ–సమ–తుల్యయోగితా–దీపక – ప్రతివస్తూపమా – దృష్టాంత–నిదర్శనా–వ్యతిరేక–శ్లేష–పరికర – ఆక్షేప – వ్యాజస్తుతి – అప్రస్తుతప్రశంసా–పర్యాయోక్తి–ప్రతీప – అనుమాన–కావ్యలింగ – అర్థాంతరన్యాస–యథాసంఖ్య–అర్థాపత్తి–పరిసంఖ్యా – ఉత్తర – వికల్ప–సముచ్చయ–సమాధి–భావిక–ప్రత్యనీక – వ్యాఘాత–పర్యాయ–సూక్ష్మ–ఉదాత్త–పరివృత్తి–కారణమాలా – ఏకావళీ – మాలాదీపక– సార–రసవత్ –ప్రేయ–ఊర్జస్వి–సమాహితంబులన డెబ్బది యలంకారంబులు.

అందు రూపక–పరిణామ – సందేహ – భ్రాంతిమత్ – ఉల్లేఖ–అపహ్నవ–ఉత్ప్రేక్షా–స్మరణ–తుల్యయోగితా – దీపక – ప్రతివస్తూపమా–దృష్టాంత – సహోక్తి – వ్యతిరేక – నిదర్శనా–శ్లేషంబులు పదియాఱును ప్రతీయమానోపమంబులు.

సమాసోక్తి-పర్యాయోక్తి- ఆక్షేప-వ్యాజస్తుతి-ఉపమేయోపమా-అనన్వయ-అతిశయోక్తి-పరికర-అప్రస్తుతప్రశంసా - అనుక్త నిమిత్త విశేషోక్తులు పదియును ప్రతీయమానవస్తుకంబులు.

రసవత్-ప్రేయ-ఊర్జస్వి-సమాహితములు నాలుగును ప్రతీయమాన రసభావంబులగు.

కడమ యుక్తనిమిత్త విశేషోక్తిసహితంబులగు నుపమాద్యలంకారంబులు (అనఁగా ఉపమా-వినోక్తి - అర్థాంతరన్యాస- విరోధ - విభావనా-ఉక్తనిమిత్తవిశేషోక్తి - విషమ-సమ - చిత్ర - అధిక - అన్యోన్య - కారణమాలా - ఏకావళీ - వ్యాఘాత - మాలాదీపక - కావ్యలింగ-అనుమాన-సార-యథాసంఖ్య - అర్థాపత్తి- పర్యాయ-పరివృత్తి-పరిసంఖ్యా-వికల్ప -సముచ్చయ - సమాధి - ప్రత్యనీక-ప్రతీప-విశేష- మీలన-సామాన్య-అసంగతి - తద్గుణ - అతద్గుణ-వ్యాజోక్తి-వక్రోక్తి- స్వభావోక్తి- భావిక- ఉదాత్త-సారములు.) నలువదియు నస్ఫుట ప్రతీయమానౌపమ్య రసభావంబులగు. (అనఁగా వీనియందేదియుఁ బ్రతీయమానము గాదు.) 3

ప్రతీయమానౌపమ్యములు ౧౬; ప్రతీయమానవస్తుకములు ౧౦; కడమ యుపమాదులు ౪౦; రసవత్, ప్రేయస్, ఊర్జస్వి, సమాహితములు ౪ ; మొత్తము ౭౦ అలంకారములు.

రసవదాద్యలంకారములు వినాగా ౬౬ అలంకారములు. ప్రతాపరుద్రీయ పాఠానుసారము రసవదాదులు ౭. (రసవత్, ప్రేయస్, ఊర్జస్వి, సమాహిత, భావోదయ, భావసంధి, భావశబలతలు.) మొత్తము ౭౩ అలంకారములు నరస భూపాలీయమున డెబ్బది.

సీ. అవని సాధర్మ్యంబు త్రివిధమా భేదప్ర
ధాన, మభేదప్రధాన, మరయ
నుభయప్రధానమై; యొగి దీపకము, తుల్య
యోగితయుఁ, బ్రతివస్తూపమయును,
దృష్టాంతము.ను, సహోక్తియు, నిదర్శన,
ప్రతీపము, వ్యతిరేకంబుఁ, బ్రబలు భిన్న

సామ్యముల్; రూపక సందేహ పరిణామ
ములు భ్రాంతిమదపహ్నుతులు నభిన్న
గీ. సామ్యధర్మంబు లుల్లేఖసంగతముగ;
నుపమ యుపమేయకోపమయును, ననన్వ
యంబు, స్మరణంబుఁ దలఁప భేదావిభేద
సహిత సాధర్మ్యగుణవిశిష్టములు మరియు. ౪

భేదప్రధానము, అభేదప్రధానము, భేదాభేదప్రధానము, అని సాధర్మ్యము (సాదృశ్యము) మూఁడువిధములు. దీపకము, తుల్యయోగిత, ప్రతివస్తూపమ, దృష్టాంతము, సహోక్తి, నిదర్శన, ప్రతీపము, వ్యతిరేకము అను నెనిమిదియు భేదప్రధానమగు సాదృశ్యముగల యలంకారములు. రూపక, సందేహ, పరిణామ, భ్రాంతిమత్, అపహ్నవ, ఉల్లేఖాలంకారములభేదప్రధానమగు సాదృశ్యముగల యలంకారములు. ఉపమ, ఉపమేయోపమ, అనన్వయము, స్మరణము, అనునవి భేదాభేదప్రధానమగు సాదృశ్యముగల యలంకారములు.

సీ. అతిశయోక్త్యుత్ప్రేక్ష లధ్యవసితమూల;
లాగి విభావన, విశేషోక్తి, విషమ
ములు, నసంగతి చిత్రము, లతద్గుణాన్యోన్య
ములు, భావికవిశేషములు విరోధ
జన్యముల్ వ్యాఘాత సహితంబుగాఁగ; స
ముచ్చయంబు, వికల్పముఁ, బరిసంఖ్య
మల యథాసంఖ్య, మర్థాపత్తియును వాక్య
భవములు; పరివృత్తి, ప్రత్యనీక
గీ. తద్గుణసమాధులు, వినోక్త్యుదాత్తసమము
లును, స్వభావోక్తి, లోకవర్తవభవములు ;
గరిమ ననుమానకావ్యలింగములు తర్క
జంబు లర్థాంతరన్యాస సంగతముగ. ౫

అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, ఈరెండును నధ్యవసాయమూలకములు. విభావన, విశేషోక్తి, విషమ, అసంగతి, చిత్ర, అతద్గుణ, అన్యోన్య, భావిక, విశేష, వ్యాఘాతములు విరోధమూలకములు. సముచ్చయ, వికల్ప, పరిసంఖ్యా, యథాసంఖ్య, అర్థా

పత్త్యలంకారములు వాక్యన్యాయమూలకములు. పరివృత్తి, ప్రత్యనీక, తద్గుణ, సమాధి, వినోక్తి, ఉదాత్త, సమ, స్వభావోక్తులు లోకవ్యవహారమూలకములు. అనుమాన, కావ్యలింగ, అర్థాంతరన్యాసములు తర్కన్యాయమూలకములు.

సీ. కారణమాలి కైకావళీసారమా
లాదీపకంబు లుల్లసితశృంఖ
లావిచిత్రత్వమూలములు; వ్యాజోక్తి వ
క్రోక్తి మీలన మపహ్నుతిభవములు;
పరగు సమాసోక్తిపరికరంబులు విశే
షణజాత చాతుర్యసంభవములు;
కడమ శ్లేషాద్యలంకారముల్ పూర్వోదిత
న్యాయనిరపేక్షతాయుతంబు

గీ. లీయలంకారములకెల్ల నేఁ ప్రధాన
మైన యుపమయ ముందుగా ననువుగొలిపి
యొకటికొకటికి భేదముల్ ప్రకటములుగ
సరవి నెఱిఁగింతు లక్ష్యలక్ష్యమ్ము లెలమి. ౬

కారణమాలా, ఏకావళీ, సార, మాలాదీపకాలంకారములు శృంఖలా వైచిత్ర్యమూలములు. వ్యాజోక్తి, వక్రోక్తి, మీలనము లపహ్నవమూలకములు. సమాసోక్తి పరికరములు విశేషణవైచిత్ర్యమూలకములు. మిగిలిన శ్లేషాద్యలంకారములు కేవలములు. అనఁగా నెట్టిన్యాయమును నపేక్షింపనివి. ఈయలంకారములలోఁ బ్రధానమైనది యుపమాలంకారము. దానిని ముందుగాఁ దెలిపెదను. మరియుఁ బరస్పరభేదము స్పష్టముగాఁ దెలియునట్లు మిగిలిన యలంకారములకు లక్ష్యలక్షణము లను దెలిపెదను.

## ౧. ఉపమాలంకారము

"ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః."

'ఉపమ' (అలంకారము) ఒక నటి. అది చిత్రవిచిత్రములయిన వేషభేదము లను ధరించి కావ్యరంగమున లాస్యమాడుచు నా కావ్యవేత్తల మనసులను రంజిల్లఁ

జేయుచున్నది. అనఁగా నీ యుపమాలంకార మలఁతిగా మార్చినచో మఱొక యలంకారమగును. ఎట్లన,

'ముఖము చంద్రునివలె నున్నది' అని సాదృశ్యము వర్ణించినచో నుపమ. అదియు నుక్తిభేదముచే ననేకాలంకారము లగుచున్నది. "ముఖము చంద్రునివలె నున్నది ; చంద్రుఁడు ముఖమువలె నున్నాఁడు" అన్నచో నుపమేయోపమ. "ముఖము ముఖమువలె నున్నది" అన్నచో ననన్వయము. "చంద్రుఁడు ముఖమువలె నున్నాఁడు" అన్నచోఁ బ్రతీపము. "చంద్రునిఁ జూచి ప్రియాముఖమును స్మరింతును" అన్నచో స్మరణాలంకారము. "ముఖమే చంద్రుఁడు" అన్నచో రూపకము. "ముఖచంద్రునిచేఁ దాపము శమించును" అన్నచోఁ బరిణామాలంకారము. "ఇది ముఖమా? చంద్రుఁడా?" అన్నచో సందేహము. "చంద్రుఁడని చకోరములు నీ ముఖముగూర్చి పరుగిడుచున్నవి" అన్నచో భ్రాంతిమంతము. "చంద్రుఁడని చకోరములును, కమలమని తేంట్లును నీముఖమునుజూచి మోదించుచున్నవి" అన్నచో నుల్లేఖము. "ఇది ముఖముగాదు. చంద్రుఁడు" అన్నచో నపహ్నవము. "ఇది చంద్రుఁడు కాఁబోలు" అన్నచో నుత్ప్రేక్ష. 'ఇది చంద్రుఁడే' అన్నచో నతిశయోక్తి. "ముఖము చంద్రపద్మములను జయించినది" అన్నచోఁ దుల్యయోగిత. "చంద్రుఁడును నీ ముఖమును రాత్రిపూట శోభిల్లును" అన్నచో దీపకము. "నీ ముఖమునందే నేను బ్రమోద మనుభవింతును. చంద్రునియందే చకోరములు ప్రమోదపడును" అన్నచోఁ బ్రతివస్తూపమ. "ఆకాశమునఁ జంద్రుఁడు; భూమియందు నీముఖము" అన్నచో దృష్టాంతము. "ముఖము చంద్రశ్రీని ధరించుచున్నది" అన్నచో నిదర్శన. "నిష్కళంకమగు ముఖము చంద్రు నతిక్రమించుచున్నది" అన్నచో వ్యతిరేకము. "నీముఖముతోఁగూడఁ జంద్రుఁడు రాత్రి శోభిల్లుచున్నాఁడు" అన్నచో సహోక్తి. "ముఖము స్మితచంద్రికలతోఁ దిలక కళంకముతో శోభిల్లుచున్నది" అన్నచో సమాసోక్తి. "అబ్జేన సదృశం వక్త్రం హారిణాహితశక్తినా" అన్నచో శ్లేష. "ముఖముముందు చంద్రుఁడు నిష్ప్రభుఁడు" అన్నచో నప్రస్తుతప్రశంస. ఇట్లనేకాలంకార రూపములను గ్రహించును. బ్రహ్మజ్ఞానమువలన సమస్తవిశ్వము దెలియఁబడిన విధమున నుపమాజ్ఞానమువలన సమస్తాలంకార జ్ఞానమును లభించును. కావున దానినే మొదటఁ జెప్పుచున్నాఁడు.

ఉపమ సర్వాలంకార బీజభూతమని నామనమతము. అతఁ డన్నియు నౌపమ్యగర్భముగల యలంకారములనే యుదాహరించెను. అతిశయోక్తి సర్వాలంకార బీజభూతమని మమ్మట మతము.

## ఉపమాలంకార లక్షణము

* సీ. ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమకాఁ, కన
న్వయము కై వడి నభిన్నంబు గాక,
హీనోపమయుఁబోలె పిల నహృద్యము గాక,
యుపమాన మనఘమై యుండెనేని,
శ్లేషంబువలెఁ బదశ్లిష్టమాత్రము గాక,
సార్థమై యల రూపకాదులక్రియ
వ్యంగ్యంబుగాక సామ్యము వాచ్యమగునేని,
నౌపమ్యము ప్రతీపమట్లు తలఁపఁ
గీ. క్రమవిపర్యాససహితంబు గాకయున్న,
నలరు నుపమేయకోపమ యట్లు సామ్య
ధర్మ మినుమాఱువరుసలఁ డడవకున్న,
నుపమ యగు; దీని భేదంబు లుగ్గడింతు. ౭

---

* ఇది ప్రతాపరుద్రీయలక్షణమున కనువాదము. ఆ లక్షణ మిది.

"స్వతస్సిద్ధేన, భిన్నేన, సమ్మతేన చ ధర్మతః
సామ్యమన్యేన వర్ణ్యస్య వాచ్యంచే దేకదోపమా"

వర్ణ్యమునకు (ప్రకృతమగు నుపమేయమునకు) స్వతస్సిద్ధమైనట్టియు ననఁగాఁ బ్రసిద్ధమైనట్టియు, నుపమేయముకన్న భిన్నమైనట్టియు, సమ్మతమైనట్టియు ననఁగా హృద్యమైనట్టియు నప్రకృతముతో ధర్మమునుబట్టి సాదృశ్యము వాచ్యముగాఁ జెప్పినచో నుపమాలంకారమగును. 'స్వతస్సిద్ధేన' అనుదానిచే హీనోపమావ్యావృత్తియు, 'ధర్మతః' అనుటచే శ్లేషవ్యావృత్తియు, 'వాచ్యం' అనుటచే రూపకాదివ్యావృత్తియు 'ఏకదా' అనుటచే నుపమేయోపమా వ్యావృత్తియుఁ జేయఁబడినది. ఈ శ్లోకమునకుఁ బై పద్యము వివరణముగా నున్నది.

ఈ విద్యానాథ లక్షణమును అప్పయ్యదీక్షితులవారు చిత్రమీమాంసలోఁ బలి పదమును ఖండించి యవ్యాప్త్యతివ్యాప్తులం జూపి

"వ్యాపార ఉపమానాఖ్యో భవేద్యది వివక్షితః
ఉపమానివృత్తిపర్యంత ముపమాలంకృతి స్తుసః"

ఉపమానవ్యాపార మనఁగా సాదృశ్యవర్ణన ముపమితిక్రియానివృత్తిపర్యంతము అనఁగా నుపమానము సిద్ధింపవలయు నని వివక్షింపఁబడినచో నుపమాలంకారము' అని

ఉత్ప్రేక్షయం దుపమానము ప్రసిద్ధముగా నుండదు. ఉపమాలంకారమునఁ బ్రసిద్ధము. అనన్వయాలంకారమున నుపమానోపమేయము లభిన్నములు. ఇందు భిన్నములు. ఉపమేయముకన్న నుపమాన ముత్కృష్టముగా నుండవలయును. అప్పుడే యది హృద్యము. హీనోపమయం దది హృద్యముగా నుండదు. (హీనోపమా పదముచే నెల్ల దుష్టోపమలను గ్రహింపవలెను.) శ్లేషయందు శబ్దసామ్యమే కాని యర్థసామ్య ముండదు. ఉపమయం దర్థసామ్యముండును. (శబ్దసామ్యమున్నను ఉపమాలంకారమేయని మమ్మట మతము. ఎట్లన, "సకలకలం పుర మేతజ్జాతం సంప్రతి సుధాంశు బింబమివ" (ఈ పురము చంద్రబింబమువలె సకలకలమయ్యెను) అనుచోఁ జంద్రమండలమునకును బురమునకును 'సకలకలత్వము' అను శబ్దముచేతనే సామ్యము. అలంకార సర్వస్వకారుఁ డీ శబ్దసామ్యము నంగీకరింపలేదు. శబ్దసామ్య మున్నచో శ్లేషయేయని యతనిమతము. విద్యాసాధుఁడును వాని ననుసరించెను)రూపక,సందేహ, భ్రాంతిమత్, ఉల్లేఖ, అపహ్నవ, తుల్యయోగితా, దీపక, ప్రతివస్తూపమా, దృష్టాంత, సహోక్తి, వ్యతిరేక, నిదర్శనలలో సామ్యము వ్యంగ్యముగా భాసించును. ఉపమయందు వాచ్యముగా భాసిల్లును. ప్రతీపమునఁ గ్రమవిపర్యాసమగు నౌపమ్యముండును. అనఁగా నుపమానము నుపమేయముతోఁ బోల్తురు. ఉపమాలంకారమున నుపమేయము నుపమానముతోఁ బోల్తురు. ఉపమేయోపమయందు సామ్యము రెండుతూగులు వచ్చును. (ధర్మ మర్థమువలెను, నర్థము ధర్మమువలెను నీయందుఁ గలవు.) ఉపమాలంకారమున నొక్కతడవ మాత్రమే యుండును. కాఁబట్టి యుపమాలంకార ముత్ప్రేక్షాదులకన్న విలక్షణము.

వర్ణ్యము, ప్రకృతము, విషయము, ఉపమేయము ఇవి పర్యాయపదములు. అప్రకృతము, అవర్ణ్యము, విషయి, ఉపమానము, ఇవి పర్యాయపదములు.

గీ. ఒనరునది పూర్ణయును లుప్తయును ననంగ
నందు నుపమాన, ముపమేయ మలరు సమత
సామ్యవాచకమును గూర్పఁజాలుఁ బూర్ణ;
కొన్ని కడమైనలుప్తయె కొమరు మిగులు.

ఈ యుపమాలంకారము పూర్ణోపమా, లుప్తోపమా భేదములచే ద్వివిధము. పూర్ణోపమ యనఁగా, ఉపమానము, ఉపమేయము, సామాన్యధర్మము (సమత)-

సిద్ధాంతించెను. ఆ ఖండనము నిచ్చట గ్రంథవిస్తరభీతిచే వదలితిని. అందుఁ గావలసినవారు చూచుకొనవలెను.

సామ్యవాచకము, అను నాలుగంశములు గలది. ఈ నాల్గింటిలో నేది లోపించినను లుప్తోపమ.

గీ. అందు నుభయాఖ్య యగుఁ బూర్ణ యార్థి, శ్రౌతి,
యనఁగ; రఘురామసన్నిభుఁడనెడి చోట
నార్థి; కందర్పుఁడునుబోలె నలరుచుండు
నధిపుఁడనుచోట శ్రౌతియై యతిశయిల్లు.

పూర్ణోపమ ఆర్థీ, శ్రౌతీ, భేదములచే ద్వివిధము. ఆంధ్రమున సాక్షాత్సాదృశ్యమును దెలుపు (సంస్కృతమున యథా, ఇవాది శబ్దములవలె) వలెన్, పోలెన్, ఓయనన్, ఓయన్నట్లు, అనఁగన్, అనువాని ప్రయోగమున శ్రౌతి యనియు, నీపద్వ్యవధానముచే సాదృశ్యమును దెలుపు * సదృశ, సంకాశ, నీకాశ, ప్రతీకాశ,

---

* ఈసాదృశ్యమును దెలుపు పదముల నీక్రిందఁ దెలుపుచున్నాను. ఈపద్యము కీ. శే. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారిది. వా రాంధ్రకావ్యాదర్శమున నిచ్చిరి.

సీ. మాదిరి-కైవడి-మాడ్కిఁ-బగిదిఁ-బోల్కిఁ-దెఱఁగున-విధమునఁ-దీరునఁ-గ్రియ,
గతి-భాతి-చందముగా-రీతి-రహి-తేవ-కరణి-జాడ-ఠీవి-డంబు,
వలె-నట్టు-లటు-లట్లు-బలె-పోలె-వరుసను-బోటి-వంటి-యొరయు-పోని-యట్టి,
పోలు మున్నగు శబ్దములు; పరి-ప్రతి-యుద్ది-యొన-జోడు-పోటియు-నీడు-నూడు,
సవతు-తరము-దీటు-సాటువ-సాటియు-పురు-డచ్చునన్-సరిపోవును-సరి
తూఁగుచునుండు-వంతులకు వచ్చుచునుండుఁ-బ్రతి-మాఱు-తరబడి-బదులు-సాటి
నిభ-సన్నిభ-సమాన-నీకాశ-సంకాశ-తుల్య-ప్రతీకాశ-తులిత-సదృశ,
సంవాది-సమ్మిత-సమ-సదృక్ష-ప్రతిపక్ష-సపక్ష-సలక్ష-ణోప,
మోపమి-కాభ-సరూప-సజాతీయ-వైరి-సవర్ణానువాది-ప్రఖ్య,
ప్రతినిధి-ప్రతిబింబ-ప్రత్యనీక-ప్రతిద్వంద్వి ప్రతిచ్ఛందపదములు-ప్రతి
రూపపద-ంబనురూపపదంబు-నన్యార్థకపదసమూహ-దేశ్య
కల్ప-దేశీయాదిక ప్రత్యయంబులు-నబ్జాననాది శబ్దాళియందు
వెలయుచుండెడి బహువ్రీహి సమాసంబు-స్పర్ధఁబూనె-జయించె-వైరమూనె,
ద్రోహమొనర్చె-నాక్రోశించె-నెదిరించె-గర్జించెఁ-బీడించె-గర్వ సలిపె
నవ్వె-ననూయఁ గనంబఱచెను-సంధిసేసె-నీసువహించెఁ జిన్నచూపు
చూచె-విడంబించె-శోభగొల్లగొనియె-దాని సౌభాగ్యసంతతి హరించె

గీ. దానితో విరోధించెను, దానితోడఁ దులనుసరితూఁగెఁ; దత్పదవులఁ బదమిడెఁ;
దదనుబంధి, తచ్ఛీలంబు, దానినను కరించె నను నిట్టి నుడులు సదృశతఁ దెల్పు.

సన్నిభ, ఉపమా, ప్రభృతి శబ్దముల ప్రయోగముచే నార్థి యనియుఁ జెప్పఁబడును. ‹‹అతఁడు రఘురామసన్నిభుఁడు›› అనుచో ‘సన్నిభ’పద ప్రయోగముచే నార్థియు, ‹‹అధిపుఁడు కందర్పుఁడుపోలె వలరుచుండు›› అనుచోఁ ‘బోలెఁ’ పద ప్రయోగముచే శ్రౌతియు నగును.

కం. ధరయం దార్థియుఁ ద్రివిధాం
తరమయ్యె సమాస, వాక్య, తద్ధితగతయై;
తిరముగ వాచ్యసమాసా
చరణంబుల ద్వివిధయగుచు శ్రౌతియుఁ దనరున్. ౧౦

ఆర్థి సమాసగత, వాక్యగత, తద్ధితగత, యని త్రివిధములు. శ్రౌతి వాక్యగత, సమాసగత, యని యాంధ్రమున ద్వివిధమే. (సంస్కృతమున నార్థివలెనే శ్రౌతియు త్రివిధమే.) తద్ధితగత శ్రౌతి యేల యాంధ్రమునలేదో తెలుపుచున్నాఁడు.

కం. అల తద్ధితములయందుం
దెలియ ‘వతి’ ప్రత్యయంబు తెలుఁగున లేమిం
గలిగిన కల్పప్రత్యయ
మలరుచు నయ్యార్థియంద యది గనుపట్టున్. ౧౧

తద్ధితములందున్న ‘వతి’ ప్రత్యయము (హరివత్) ఆంధ్రమునఁ బ్రయుక్తము గామిఁ దద్ధితగత శ్రౌతి యాంధ్రమున లేదు. (సంస్కృతమున ‘హరిరివహరివత్’ అని ఇవార్థమున ‘వత్’ వచ్చును. తత్ప్రయోగమున శ్రౌతి గలదు.) ‘మృతకల్పుఁడు’ ఇత్యాదులందున్న తద్ధిత ‘కల్ప’ప్రత్యయ ప్రయోగమున నార్థియే యగును. కాని శ్రౌతి గాదు. (కల్పబాది ప్రయోగేత్వార్థ్యేవ) కల్పబాది ప్రత్యయములు ప్రయోగించినచో నార్థియే. కానఁ దద్ధితగతశ్రౌతి యాంధ్రమున లేదు.

ఉ. కావునఁ బూర్ణపంచవిధ; కన్గొన లుప్తయు సామ్యధర్మ మి
చ్ఛావిధిఁగూర్పకున్నయెడ శ్రౌతియు నార్థియునై యథోక్త సం
భావన వాక్యయుక్తయు, సమస్తయు, వాక్యసమాస తద్ధిత
శ్రీవివశాత్మయై ధరణిఁజెన్నగు సాయకసంఖ్య నెట్లనన్. ౧౨

---

కావ్యాదర్శమున శ్రౌతీ, ఆర్థీ భేదములేమి ‘బలె, పోలె’ అనునవి గూడా నీ జాబితాలో గలవు. ఈ రెంటినిఁ దీసివేసిన మిగిలినవి ప్రయోగించినచో నార్థి యని గ్రహింపవలెను.

వెనుక నుడివినవిధమునఁ బూర్ణోపమ యైదువిధములు. లుప్తోపమయు సాధారణ ధర్మమును బ్రయోగింపనపుడు (అనఁగా 'ధర్మలుప్త'లో) శ్రౌతీ, ఆర్థీ భేదములచే ద్వివిధమై తగును. అందు శ్రౌతి వాక్యగత, సమాసగత భేదములచే నిటు తెఱఁగులు. ఆర్థి వాక్యగత, సమాసగత, తద్ధితగత భేదములచేఁ ద్రివిధము. మొత్తము లుప్తోపమయు నైదువిధములు (పాయకసంఖ్య).

## సమాసగత - పూర్ణ - ఆర్థి

కం. ఈవియుఁ జల్లదనంబును
గేవల సౌందర్యగుణము గిటికొనఁగఁ గళా
భావుకుఁడైన నృసింహ
క్ష్మావల్లభుఁడమరుఁ బూర్ణచంద్రోపముఁడై. ౯౩

నృసింహభూపాలుఁ డుపమేయము; పూర్ణచంద్రుఁ డుపమానము; 'ఉపమ' యనుపద ముపమావాచకము; 'కళాభావుకత్వము' సాధారణధర్మము; ఈ నాలుగంశములును బ్రయుక్తములైయుంటఁ బూర్ణోపమ. అందు నిది యార్థి. ఏలన, సాక్షాత్సాదృశ్య ప్రతిపాదకములగు వలెన్, పోలెన్, ప్రభృతిపదములుగాక 'ఉపమ' అను పదము ప్రయుక్తమై యున్నది. మరియు నుపమానమగు పూర్ణచంద్రపదము "పూర్ణచంద్రోపముఁడై" అను సమాసమున నున్నది. కాన సమాసగత.

## వాక్యగత - పూర్ణ - ఆర్థి

కం. కలయఁజవరాండ్రి తలఁపుల
వలపును నిలుపంగఁజాలు వరరూపమునం
జెలఁగుచు నృసింహుఁడలరుల
విలుకానికి సాటియయ్యె విశ్రుతలీలన్. ౯౪

నృసింహుఁడు రూపమున "అలరులవిలుకానికి సాటియయ్యె,, అను వాక్యమున నుపమాన, ఉపమేయ, సాధారణధర్మ (జవరాండ్ర...రూపము) ఉపమావాచకములు గలవు. కానఁ బూర్ణోపమ. ఇది వాక్యగతము. 'సాటి'పదముంట నార్థి.

## తద్ధితగత - పూర్ణ - ఆర్థి

కం. ఏయెడల నియ్యనియ్యం
గాయలుగాచిన నృసింహు కరమర్థులకుం

బాయని వేడ్క ఫలించుచు
నాయతగతిఁ గల్పకల్పమై విలసిల్లున్. ౧౫

నృసింహునికర ముపమేయము; కల్పము (కల్పవృక్షము) పమానము; కల్ప ప్రత్యయ ముపమావాచకము. 'ఏయెడల నియ్యనియ్యం గాయలు గాయుట' సాధారణ ధర్మము. ఇటఁ 'గల్పకల్పము, అనుచో "కల్పేవ ఈషదూనః కల్పకల్పః,, అని యగును. ఇటఁ దద్ధితగతపూర్ణార్థి.

అయితే యిట నొక దోషముగలదు. ఉపమాలంకారమున శబ్దసామ్యముగాక యర్థసామ్యమే యుండవలెనని మున్ను గ్రంథకర్తయే తెలిపెను. కాని యిట "ఇయ్యనియ్యం గాయలు గాయుట,, అను సాధారణధర్మము హస్తముతో నన్వయించినపుడు "నియ్యగా నియ్యఁగాఁ గాయలు (కిణములు) కాచె,,ననియుఁ, గల్పవృక్షముతో నన్వయించినపుడు 'ఇచ్చుటకై యిచ్చుటకై యనఁగా మిక్కిలిగా నిచ్చుటకై కాయలు (పండ్లు) కాచె, ననియును భిన్నార్థములను వహించుచున్నది. కాన నిట శబ్దసామ్యమేకాని యర్థసామ్యములేదు. మఱి మతానుసారముగా నిట్టియెడలఁగూడ 'సకలకలం పుర మేతజ్జాతం సుధాంశుబింబ మివ, అనుచోటియందు వలె నుపమాలంకారమే యగును. (శబ్దసామ్యమున్నను) ప్రతాపరుద్రీయ మతానుసారముగా (శ్లేషంబువలెఁ బదశ్లిష్టమాత్రముగాక)నరసభూపాలీయకర్తయు శబ్దసామ్యము గూడదని తెలిపి తాను శబ్దసామ్యమునే యుదాహరించెను.

## వాక్యగత - పూర్ణ - శ్రౌతి

కం. దివియును భువియు భుజంగమ
భువనంబును నిండ విమలభూరిప్రభతో
దివిజేంద్రతటిని యోయన
నవిరళగతిఁబొల్చు నీదు యశము నృసింహా! ౧౬

కీర్తి యుపమేయము. దివిజేంద్రతటిని యుపమానము. 'దివియు...నిండుటయు, భూరిప్రభగలిగియుంటయు సాధారణ ధర్మము. తటినియోయన,, అనుచో 'ఓయన, ఉపమావాచకము. కానఁ బూర్ణోపమ. ఇది వాక్యగతము. 'ఓయనన్, అనునుపమావాచకము వలెన్, పోలెన్, శబ్దములవలె సాక్షాత్సాదృశ్యమును బోధింపదు. కాని యీ గ్రంథకర్త ఓయన్-అనఁగన్ అనువాని ప్రయోగమునందును శ్రౌతీ-ఉపమనే యంగీకరించెను.

న్యాయముగా 'ఓయనన్' అనునది యుత్ప్రేక్షావాచకము. తటిని వోలెన్ అని యున్నచో శ్రౌతి యగును.

## ♦ సమాసగత పూర్ణశ్రౌతి

కం. కరముల శంఖము, చక్రము,
నిరవుగ నురమందుఁ జెంది యిందిర దనరన్
హరివలె వెలయుదువౌరా!
నరసాహస! యోబరాజ నరసింహనృపా! ౧౭

నరసింహుఁ డుపమేయము. హరి యుపమానము. పూర్వార్థము సాధారణ ధర్మము. (ఇటఁగూడ శబ్దసామ్యమే. ఏలన హరిదాల్చిన శంఖ, చక్ర, ఇందిరలు వేఱు. నరసభూపాలుఁడు ధరించిన శంఖ, చక్ర (రేఖలు) ఇందిర (శోభ)లు వేఱు.) 'హరివలె' అనునది సమాసము. కాన సమాసగతపూర్ణ.

## పంచవిధానుప్తధర్మ లుప్తలు

ధర్మము లోపించిన యుపమలు శ్రౌతియందు రెండును, ఆర్థియందు మూఁడును నుండును.

శా. నీదోః ఖడ్గమహీంద్రుఁడో యనఁదగున్; నీ దివ్య తేజోభరం
బాదిత్యుండునుబోలెఁ బొల్చు; భవదీయాలాపముల్ వల్లకీ
నాదబ్రహ్మమునాటె; నీకరము మందారోపమానంబు; నీ
ప్రాదుర్భావము మాధవాభ్యుదయ కల్పంబౌ నృసింహాధిపా!

---

♦ సంస్కృతమున 'ఇవ' శబ్దముతో "ఇవేన సమాసో విభక్త్యలోపః పూర్వపద ప్రకృతిస్వరత్వం చ" అను సూత్రముచే సమాసము గానవచ్చుచున్నది. అట నీసమాసమున విభక్తి లోపింపకపోవుటచే "జీమూతస్యేవ భవతి ప్రతీకం" వెందలగు స్థలములందు వ్యస్త సమస్త ప్రయోగములకు భేదమేమి? అని శంక గలుగుచున్నది. వేదమందయినచో సమాసమగుచో నొకస్వరమును, సమాసము గాకున్నచో మరొక స్వరమును వచ్చును. ఇక లోకప్రయోగమున నేమిప్రయోజనము? అన్నచో "అగ్నిరివ రాజః" (అగ్నివంటి రాజు) అనుచోట 'అగ్నిరివ' అనునది సమస్త పదము అది 'రాజన్' శబ్దముతో సమసించి "రాజాహస్సఖిభ్యష్టచ్" అను సూత్రముచే 'అగ్నిరివ రాజః' అని 'అ'కారాంతమగును. 'అగ్నిరివ' అన్నది వ్యస్తమగుచో 'అగ్నిరివ రాజా' అనియే యుండును. లోకప్రయోగమున స్వరములేదు. కాన నిట్టి 'ఇవ' శబ్దముతో నేర్పడిన సమాసముతో మరొక పదము సమసించి సమసాంత కార్యమును బొందును." ఆంధ్రమున 'హరివలె' ఇత్యాదులు వ్యస్తసమస్తము లొకవిధము గానే యుండును. ఇట్లు సమ సమముగా గ్రహింపవలెను.

## ౧. వాక్యగత - శ్రౌతీ - అనుపాత్తధర్మ - లుప్త

దోఃఖడ్గ మపమేయము; అహీంద్రుఁ డుపమానము; 'ఓయనన్' ఉపమావాచకము. సాధారణధర్మము (భయంకరత్వాదులు) లుప్తము.

## ౨. సమాసగత - శ్రౌతీ - అనుపాత్తధర్మ - లుప్త

తేజస్సు ఉపమేయము; 'ఆదిత్యుండునుబోలె, అనునెడ వెనుకటి 'హరివలె, అనునెడవలెనే సమాసము. అందలి 'ఆదిత్యుండును, అను పద ముపమానమగుట సమాసగతమగు నుపమానము. ఇందుఁగూడ ధర్మవాచకము లేదు.

## 3. వాక్యగత - ఆర్థీ - అనుపాత్తధర్మ - లుప్త

ఆలాప ముపమేయము; వల్లకీనాదబ్రహ్మ ముపమానము. 'సాటి, యుపమావాచకము. ఇందును సాధారణధర్మము లేదు. ఇది వాక్యగత యని గ్రంథకర్త నుడివెను. కాని యది ప్రమాదము. ఏలన 'నాదబ్రహ్మము సాటి, అనునెడ నుపమానము వాక్యగతముగా లేదు. 'నాదబ్రహ్మము సాటి, అనునది సమాసమే. 'బ్రహ్మముతోడ లేక యొక్క సాటి, యని తృతీయ, షష్ఠీసమాసములలో నొకటి. కావున 'నాదబ్రహ్మముతోడ సాటి, అన్నచో వాక్యగత యగును.

## ౪. సమాసగత - ఆర్థీ - అనుపాత్తధర్మ - లుప్త

కరము ఉపమేయము; మందార ముపమానము; ఉపమానపద ముపమావాచకము; సాధారణధర్మము లేదు. 'మందారోపమానంబు, అనుచో 'మందార,పదము సమాసగతమై యున్నది.

## ౫. తద్ధితగత - ఆర్థీ - అనుపాత్తధర్మ - లుప్త

'ప్రాదుర్భావ, ముపమేయము; 'అభ్యుదయ, ముపమానము; 'కల్ప,ప్రత్యయ ముపమావాచకము. ఇటను ధర్మము గ్రహింపఁబడలేదు.

## ఉపమానలుప్త

సీ. జలదంబుగతి నిచ్చి వెలవెలఁబాఱక
కలశాంబునిధిరీతిఁ గసరుకొనక
ఈఁగిమ్రానువలె ఫలంబిడి జిగిదప్పక
సురభికై వడిఁ గొలువరసి యాక
కమలారివలె నిచ్చి క్రమ్మఱఁ గ్రుంకక

బలిమాడ్కి నర్థిచే భంగపడక
చండాంశుసుతుపోల్కిఁ గుండమార్పులు గాక
వాసవమణిభాతిఁ ద్రాసమంద

గీ. కోసఁగనేర్తువు యాచక వ్యూహమునకు
భూసుతానూన దానవిద్యా నిరూఢిఁ
బోసఁగ నీతోడ నెవ్వానిఁ బోల్పవచ్చు?
సరసగుణహార! యోబయనరస ధీర! ౧౯

కుండమార్పులు = వినిమయము; నరసభూపాలుఁ డుపమేయము. ‘ఒసఁగ నేర్చు’, సాధారణధర్మము. ‘పోల్పవచ్చు’, ఉపమావాచకము. ‘ఎవ్వానిఁ బోల్ప వచ్చును?’, అను ప్రశ్నచేఁ బోల్పఁదగినవాఁడు లేఁడని తేలినది. కాన నుపమానము లుప్తమైనది.

వాచకలుప్త

సీ. దర్పితాహిత నృపోత్తములు నిన్నెదిరింపఁ
గలరె? ధీరోత్తమగండ బిరుద!
వినుతకీర్తి ప్రతాపములు నీచే సమ
కట్టునే? యుభయరగండ బిరుద!
అరి వధూతాటంకగరిమంబు నీచేతఁ
గలుగునే? గండరగండ బిరుద!
పరిపంథి గంధసింధురపంక్తి నీ ప్రోల
నుండునే? గండభేరుండ బిరుద!

గీ. అరుణపరిణతధామ! రామాభిరామ!
రామణీయక నిర్జిత ప్రసవబాణ!
బాణసాహిత్య పరిపాక! పాకవైరి!
విభవసౌభాగ్య! యోబభూవిభునృసింహ! ౨౦

నరసభూపాలుఁ డుపమేయము. ‘అరుణపరిణతధామ’, ‘రామాభిరామ’, అను చోట్ల నున్న అరుణుఁడు, రాముఁడు, ఉపమానములు. పరిణతధామత్వము, అభిరామత్వము, అనునవి రెండుపమానములకును బ్రత్యేకములయిన సాధారణధర్మములు.

అరుణ ఇవ పరిణత, అనియు రామ ఇవ అభిరామ, అనియును విగ్రహవాక్యము లుండును. ఇందలి ఇవ, ఉపమావాచకము లుప్తమైనది కాన వాచకలుప్త. ఈ యభిప్రాయమునే గ్రంథకర్త యీ క్రింది పద్యమునఁ జెప్పుచున్నాడు.

గీ. అరుణపరిణతధామ! రామాభిరామ!
అనెడుచో భానుకైవడి నలరుకాంతి
పంక్తిగలవాఁడు, రాముని పగిదిఁబొల్పు
వాఁడు ననువాచకంబు వివక్షితంబు. ౨౧

ఈ సీసపద్యము పరికరాలంకారమునకుఁగూడ నుదాహరింపఁబడినది. ఆపరికరము పెద్దపాదములం దున్నది.

## ధర్మోపమానలుప్త

సీ. ఇటు చేసి తేజీలనెనయు మిన్నులతేరి
జోదుపుట్టినకొండఁ జూచినాఁడ
ఇటు నేలజేజేల కెలుకైన చెంగావి
నుదసంజదగుకొండఁ జూచినాఁడ
ఇటు కోడరాతు మైనిడ్డసొమ్ములమేఁత
సొంపులీనెడుకొండఁ జూచినాఁడ
ఇటు నల్లదేవరయింటనంటిన తెల్ల
జోటివాయనికొండఁ జూచినాఁడ

గీ. నిందునందును నీతోడి యీడువానిఁ
గడఁకతోఁగాన; గానను; గాన; ననుచు
నిక్కమే బాసకైనను నిలుచువాఁడ!
నరనుతాటోప! యోబయనరసభూప! ౨౨

వరుసగా నుదయాద్రినిఁ, బశ్చిమాద్రిని, మలయాద్రిని, హిమాద్రినిఁ జూచితిని. నీతో సమానులు లేరు.

నరసభూపాలుఁ డుపమేయము. ఉపమానము లుప్తము. ధర్మవాచకము లుప్తము. 'సమానులు, ఉపమావాచకము. ధర్మోపమానములులేమిని ధర్మోపమానలుప్త.

## ధర్మోపమానవాచకలుప్త

మ. మహితప్రాభవమానధుర్య! మితవాఙ్మర్యాద! మీనాంకవి
గ్రహ! ముఖ్యాన్వయమార్తశౌర్యరస! మేఘత్యాగ! మైత్రీరఘూ
ద్వహ! మేధాన్విత! సూక్తికాభరణ! మంత్రప్రౌఢ! మస్తాంగ స
క్తహరిశ్రీచరణాబ్జ! వర్ధిలు గుణాధారా! నృసింహాధిపా! ౨౩

మీనాంకవిగ్రహుఁడనుచో మీనాంకునియొక్క విగ్రహమువంటి విగ్రహము గలవాఁడు. అని యర్థము. విగ్రహవాక్యమునందలి ఉపమానవాచకమగు రెండవ విగ్రహపదమును, వంటి అను నుపమావాచక పదమును, సాధారణ ధర్మమును లోపించి యున్నవి.

వ్యధికరణ బహువ్రీహియందుఁ బూర్వపదమైన యుపమానపదమునకు నుత్తరపదమైన యుపమేయపదము పరమైనపుడు ఉపమానపదమునకును లోపము వచ్చును.

గీ. అలర మీనాంకవిగ్రహుం డనెడిచోట
నిందు మీనాంకుమైవలె నింపుమీఱు
విగ్రహముగల్గువాఁడన వెలయుసామ్య
వాచకోపమానంబులసూచితములు. ౨౪

పై యర్థమే. ఈలుప్తావిభాగమును జిత్రమీమాంసాకర్తయుఁ గావ్యప్రకాశ కారుఁడును బెక్కువిధములఁజూపిరి. ఈ లుప్తావిభాగము వ్యాకరణపాండిత్యముపై నాధారపడియున్నది. ఇంతఁ జారుత్వమేమియుఁ గానరాదు. ఈవిషయమునుద్యోత కారుఁ డిట్లుతెలిపెను. ''వస్తుతోఽయం పూర్ణాలుప్తావిభాగో వాక్యసమాస క్యచ్ క్యఙాదిప్రత్యయ విశేషగోచరతయా శబ్దశాస్త్ర వ్యుత్పత్తి కౌశలపరత్వాత్ అత్ర శాస్త్రే న వ్యుత్పాద్యతా మర్హతీత్యాహుః,,

కం. ద్వివిధంబగు సాధర్మ్యము
భువి నుపమానోపమేయముల కొక్కటియై
తవుటయు, రెంటికి ద్వివిధం
బవుటయన; ద్వితీయగతియు నలరు ద్వివిధమై. ౨౫

ఈ యుపమాలంకారమున సాధారణధర్మ ముపమానోపమేయముల కొక్కటే యుండుట, ఉపమానోపమేయములకు రెంటికిని రెండుండుట యని ద్వివిధము. రెండవవిధము ద్వివిధము.

కం. క్షితి నేకార్థము శబ్ద
ద్వితయంబున సంఘటింప వెలయును వస్తు
ప్రతివస్తుత; యగు బింబ
ప్రతిబింబత యర్థశబ్దపార్థక్యమునన్. ౨౬

ఆ సాధారణధర్మము శబ్దద్వయముచే నేకార్థరూపముగానే చెప్పఁబడినచో వస్తుప్రతివస్తు భావమనియును, అర్థ, శబ్ద భేదముచేఁ జెప్పఁబడినచో బింబప్రతిబింబ భావమనియును జెప్పఁబడును.

"వస్తుతః భిన్నయోరపి ఉపమానోపమేయ ధర్మయోః పరస్పర సాదృశ్యా దభిన్నయోః పృథగుపాదానం బింబప్రతిబింబభావ ఇత్యాలంకారిక సమయః" వస్తుస్థితిచే భిన్నములయ్యును ఉపమానోపమేయ ధర్మములు పరస్పర సాదృశ్యముచే నభిన్నముగా నధ్యవసింపఁబడి (అభేదముగా నిశ్చయింపఁబడి) భిన్నభిన్న శబ్దములచేఁ జెప్పఁబడుట బింబప్రతిబింబభావమని యాలంకారికుల సంప్రదాయము.

వస్తు ప్రతివస్తూపమ

కం. అవనిఁ బరిష్కృతమయ్యెన్
రవివంశం బోబశౌరి నరసింహునిచే;
దివి సురతరు భూషితమై
నవనవగతిఁ బొల్చు నందనవనంబనఁగన్. ౨౭

రవివంశ ముపమేయము. నందనవన ముపమానము. పరిష్కృతము, భూషితము అను నేకార్థకమగు శబ్దద్వయముచే సామాన్యధర్మము చెప్పఁబడినది. "ముఖము చంద్రునివలె మనోహరముగా నున్నది" ఇత్యాదికమగు పూర్ణోపమలలో 'మనోహరము' అను సాధారణధర్మవాచక మొకటియే గ్రహింపఁబడినది. ఇట రెండు గ్రహింపఁబడి యున్నవి.

వస్తు ప్రతివస్తూపమాలంకారమునకును బ్రతివస్తూపమాలంకారమునకును భేదమేమన, వస్తుప్రతివస్తూపమాలంకార మేకవాక్యగతమై యుండును. ప్రతివస్తూపమాలంకారము వాక్యద్వయగతమై యుండును. ఇదియే భేదము.

బింబప్రతిబింబోపమ

కం. గురుశౌర్యయుతము; లాయత
కరవాలము ... నృసింహ ...

దరళఫణామణి కిరణ
స్ఫురణము, జిహ్వాగ్రమైన భోగియుఁబోలెన్. ౨౮

శౌర్యయుతము, ఆయతకరవాలమును నగు నృసింహుని హస్తము ఫణామణి కాంతియుతమును, దీర్ఘజిహ్వాయుతమును నగు సర్పమువలె నున్నది. ఇట నుపమేయమునకు గురుశౌర్యయుతత్వము, ఆయతకరవాలత్వము అను ధర్మములును, ఉపమానమునకు ఫణామణికిరణస్ఫురణము, జిహ్వాలత్వము, అను ధర్మములును భిన్నశబ్దములచే భిన్నార్థకములుగా గ్రహింపఁబడినవి. శౌర్యమునకును ఫణామణి కిరణములకును, కరవాలమునకు జిహ్వకును సాదృశ్యము గలదు. ఈ ధర్మములకుఁ బరస్పర సాదృశ్యముచే నభేదాధ్యవసాయము చేయవలెను. అభేదాధ్యవసాయమన నభేదమని నిశ్చయపఱచుకొనుట. ఇట్టిది బింబప్రతిబింబోపమ. దృష్టాంతమునను బింబప్రతిభావ ముండును. కాని యట వాక్యద్వయముండును. ఇట నొకవాక్యమే.

ఈభేదములేకాక మరికొన్నివిధములగు నుపమాభేదములును గలవు. వానిలోఁ గొన్నింటి నుదాహరింతును.

## సమస్తవస్తువిషయోపమ

ఆ. వె. తమ్మితీవభాతిఁ దనరు సాజవరాలి
తమ్మిఁబోని సెమ్మొగమ్ముఁ గ్రమ్మి
గండుతేఁటికరణిఁ గన్నని తేనియల్
గ్రోలిగ్రోలి తనివిఁగొంటి రెప్ప

ఇట 'జవరాలు తమ్మితీవవలె, దాని మొంగము దమ్మివలెను' దానిప్రియుఁడు గండుతేఁటివలెనుండె' నని చెప్పుటచే నుపమాలంకారము సర్వావయవవ్యాప్తమై యున్నది.

## ఏకదేశవివర్తినీ-ఉపమ

గీ. క్రొల్లనులఁబోని నల్లనికలువపిండు,
మోముగమిఁబోలు నెత్తమ్మి పూలచాలు,
గబ్బిగుబ్బలకరణిఁ జక్కవలు గ్రాల,
నలసరశ్రీలు పదపదంబందు నలరు

మొందటి మూఁడుపాదములందలి యుపమలచే సరస్సులు స్త్రీలవలెనున్నవి, యను నుపమ స్ఫురించును. సరస్సులను స్త్రీలుగా నుపమించి చెప్పకపోవుటచే నుపమాలంకారము సర్వావయవవ్యాప్తము గాదు.

## మాలోపము

కం॥ కలిగించుచుండు వెన్నెల
వలెఁగన్నులకెలమిఁ; గల్లువలె మత్తునిడుః ;
గెలనికి నాకర్షించును
బలువుర నాపువ్వుఁబోఁడి ప్రభుతవడుఃపునన్;

ఇటఁ ''బువ్వుఁబోఁడి, అను నొక యుపమేయమునకు మూఁడుపమానములు గలవు. ఉపమానమాలగలదు. కాన మాలోపము.

## రశనోపము

గీ॥ సతతకాంచనవితరణ జలలవముల
నర్థికరములఁ దడుపుచున్నట్టిపతికి
భణితివలెమతి, యమ్మతిభాతిఁజేఁత,
చేఁతవలెఁగీర్తి, స్వచ్ఛమై చెలఁగుచుండు

రశనయన నొడ్డాణము. ఇఁక నొడ్డాణమున గజ్జెలువలెనే యొకదానిలో నొకటి సంబంధించిన యుపమానములు గలవు. ఒక యుపమలోని యుపమానము రెండవ యుపమలో నుపమేయ మగును. దానిలోని యుపమానము మరొకయుపమలో నుపమేయ మగును. ఇదేవిధముగా సాఁగిన యుపమ రశనోపమ.

ఉపమాలంకారమున నుపమానము సుప్రసిద్ధముగా నుండవలెనని యున్న లక్షణమున నిర్వచింపఁబడినది. కాని 'అభూతోపమ'లోఁ గవి కల్పితమగు నుపమానముగలదు. ఎట్లన,

---

మరియు దండికావ్యాదర్శమున ధర్మోపమ, వస్తూపమ, విపర్యాసోపమ, అన్యోన్యోపమ, నియమోపమ, అనియమోపమ, సముచ్చయోపమ, అతిశయోపమ, ఉత్ప్రేక్షితోపమ, అద్భుతోపమ, మోహోపమ, సంశయోపమ, నిర్ణయోపమ, శ్లేషోపమ, సమానోపమ, నిందోపమ, ప్రశంసోపమ, ఆచిఖ్యాసోపమ, విరోధోపమ, ప్రతిషేధోపమ, చటూపమ, తత్త్వాఖ్యానోపమ, అసాధారణోపమ, అభూతోపమ, అసంభావితోపమ, బహూపమ, విక్రియోపమ, మాలోపమ, వాక్యార్థోపమ, ప్రతివస్తూపమ, తుల్యయోగితోపమ, హేతూపమ, అను ముప్పదిరెండు భేదములను జూపెను. వీని లక్షణలక్ష్యములను నాంధ్రకావ్యాదర్శమునఁగాని ఆంధ్రవిజ్ఞానసర్వస్వములోని 'అలంకారములు, అను శబ్దముక్రిందఁగాని చూడవలెను. ఈభేదములను దరువాతివారు దెలుపరైరి.

గీ. 'ఒక్కచోఁ బ్రోవుగాఁ జేసి యుంచఁబడిన
నిఖిల నీరజప్రభలోని నిగ్గవోలె
నీదు సౌమ్మ్యమెంతయు సొగడెడి'నన
నిది యభూతోపమగఁ దెలియఁగఁబడును.

నిఖిల నీరజప్రభలోని నిగ్గు ప్రోగుసేసియుంట ప్రసిద్ధముగాదు. ఇది కవికల్పితము.

ఉ॥ యది వ్యోమ్ని పృథక్ప్రవాహావాకాశగంగాపయసః పతేతాం
తేనోపమీయేత తమాలనీల మాముక్త ముక్తాలత మస్య వక్షః.

ఆకాశమునందు రెండు వ్యోమగంగాప్రవాహములు విడివిడిగాఁ బడినయెడల దానితోఁ దమాలనీలమును ముత్యాలహారములచే నలంకృతమునగు హరి వక్షమును బోల్పవచ్చును.

రెండు వ్యోమగంగాప్రవాహములు ప్రవహించుట కవి కల్పితమే.

ఆంగ్లమున నుపమాలంకారమును 'Simile' అందురు. ఆ సాహిత్యమున మన యాలంకారికులు చేసినంత విమర్శను పాశ్చాత్యులు చేయలేదు. పైఁగా మన వారు చూపినన్ని యలంకారములను వారు చూపలేదు.

## ఉపమా దోషములు

న్యూనత్వము, అధికత్వము, లింగభేదము, వచనభేదము, అసాదృశ్యము, అసంభవము అని యుపమాదోషము లాఱువిధములు. దోషప్రకరణమున హీనోపమ, అధికోపమ, లింగభేదము, వచనభేదము, అను నాలుగుదోషములు చెప్పఁబడి యున్నవి. ఇట వానిలోని యవాంతర భేదములను, నితర భేదములను దెలుపుదుము.

న్యూనత్వమన నుపమేయముకన్న నుపమానమున నపకృష్టత్వము; అనఁగాఁ దక్కువతనము; అధికత్వమన నుపమేయముకన్న నుపమానమున నుత్కృష్టత్వము; అనఁగా నెక్కువతనము. ఈ న్యూనత్వాధిక్యములు జాతి, ప్రమాణ, ధర్మములంబట్టి ప్రత్యేకముగా ముత్త్రివిధములు.

## ౧. జాతిగత న్యూనత్వము

"చండాలై రివ యుష్మాభిస్సాహసం పరమంకృతం" మీరు చండాలురవలె బహు సాహసమొనర్చితిరి. ఇట 'మీరు' ఉపమేయము, 'చండాలురు' ఉపమానము. చండాలురధమజాతీయులు. కాన నుత్తమజాతీయుల నధమజాతీయులతోఁ బోల్చుట యుచితము గాదు. 'చండాల' పదము జాతివాచకము. కాన నిట జాతిగత న్యూనత్వము గలదు.

## ౨. జాతిగతాధిక్యము

"అయం పద్మాసనాసీనశ్చక్రవాకో విరాజతే
యుగాదౌ భగవాన్వేధా వినిర్మితు రివ ప్రజాః"

యుగాదియందుఁ బ్రజలను సృజించు బ్రహ్మదేవునివలెఁ బద్మాసనమున నాసీనమైయున్న చక్రవాకము విరాజిల్లెను.

ఇటఁ 'జక్రవాక' ముపమేయము; 'బ్రహ్మదేవుఁ' డుపమానము; అల్పమగు నొక పక్షికి జగత్కర్త యగు బ్రహ్మ నుపమానముగాఁ జేయుట యనుచితమగు నాధిక్యము. బ్రహ్మ జాతివాచకము. ఇది జాతిగతాధిక్యము.

## 3. ప్రమాణగత న్యూనత్వము

"వహ్నిస్ఫులింగ ఇవ భానురయం చ కాస్తి"

ఈ సూర్యుఁడు నిప్పుకణమువలె వెలుఁగుచున్నాఁడు. ప్రమాణమనఁగాఁ బరిమాణము. పరిమాణమునుబట్టి సూర్యుఁడు పెద్దవాఁడు. నిప్పుకణము చిన్నది. ఇట నుపమేయమగు సూర్యునియందుకన్న నుపమానమగు వహ్నిస్ఫులింగమునఁ బ్రమాణగత న్యూనత్వము గోచరించుచున్నది.

## ర. ప్రమాణగతాధిక్యము

పాతాళ మివ నాభిస్తే పర్వతా వివ చ స్తనౌ
వేణీదండః పునరయం కాళిందీపాత సన్నిభః.

నీ నాభి పాతాళమువలె నున్నది. నీ స్తనములు కొండలవలె నున్నవి. నీ వేణీదండము కాళిందీప్రవాహమువలె నున్నది.

ఇట నాభి, చనుఁగవ, జడ, అనునవి యుపమేయములు. వరుసగా వీనికిఁ బాతాళము, కొండలు, కాళిందీ ప్రవాహము, అనునవి యుపమానములు. ఉపమేయ పదార్థములకన్న నీ యుపమాన పదార్థములు పరిమాణమును బట్టి పెద్దవి. ఇట సాదృశ్య ముచితముగాలేదు. దోషప్రకరణములో ననుచితమను దోషము గలదు. ఈ న్యూనత్వాధిక్యదోషములందే చేరును. స్పష్టప్రతీతికై యిటఁ జూపితిని.

కవిసమయప్రసిద్ధి యున్నచో జాతి, ప్రమాణగత న్యూనత్వాధిక్యములు దోషములు గావు. ఎట్లన,

"తవాననసమశ్చంద్ర శ్చంద్రతుల్యం త్వదాననం
ద్వ్యణుకం మధ్యసదృశం మధ్యం ద్వ్యణుకసన్నిభం"

చంద్రుఁడు నీ ముఖసదృశుఁడు. నీ ముఖము చంద్రతుల్యము. ద్వణుకము నీ నడిమితో సమానము. నీ నడుము ద్వణుకసమము.

ఇటఁ "జంద్రుఁడు నీ ముఖసదృశుఁడు" అనుచోట వాస్తవముగా నుపమానమున జాతిగతన్యూనత్వము, "నీ ముఖము చంద్రతుల్యము" అనుచో నుపమానమున జాతిగతాధిక్యములును గలవు. అట్లే 'ద్వ్యణుకము నీ నడిమితో సమానము' అనుచో నుపమానమునఁ బ్రమాణగత న్యూనత్వమును, "నీ నడుము ద్వ్యణుకసమము" అనుచో నుపమానమునఁ బ్రమాణగతాధిక్యమును గలవు. అయినను ముఖచంద్రులకును, ద్వ్యణుకమధ్యములకును సామ్యము కవిసమయప్రసిద్ధము. కాన నిట దోషములు గావు.

## ౫. ధర్మగత న్యూనత్వము

స ముని ర్లాంఛితో మౌంజ్యా కృష్ణాజినపటం వహన్
వ్యరాజన్నీలజీమూత భాగాశ్లిష్ట ఇవాంశుమాన్.

ముంజత్రాటిని ధరించి కృష్ణాజినమును వహించియున్న యాముని నల్లని మబ్బును దాఁకుచున్న సూర్యునివలె భాసిల్లెను.

ఇట ముని యుపమేయము; సూర్యుఁ డుపమానము; "ముంజత్రాటిని ధరించి కృష్ణాజినమును వహించియున్న" యనునది బింబప్రతిబింబభావరూప సాధారణ ధర్మమున బింబముగా గ్రహింపఁబడినది. 'నల్లని మబ్బును దాఁకుచున్న' అనునది ప్రతిబింబముగాఁ గ్రహింపఁబడిన సాధారణ ధర్మము. బింబమునఁ గల 'ముంజత్రాటిని' అను దానికిఁ బ్రతిబింబమున నేదియును లేదు. ప్రతిబింబము కూడ బింబమంత యుండునుగదా! ఇట బింబ మధికముగను ప్రతిబింబము న్యూనముగను నున్నది. కాన బింబ ప్రతిబింబ భావరూప సాధారణ ధర్మగత న్యూనత్వదోషము. ఇది 'న్యూనోపమ' యని దోషప్రకరణమున నుదాహృతమై యున్నది. 'మెఱుపుతోఁ గూడిన నల్లనిమబ్బును దాఁకుచున్న' అని ప్రతిబింబమున్నచో సరిపడును.

## ౬. ధర్మగతాధిక్య దోషము

స పీతవాసాః ప్రగృహీతశార్ఙ్గో మనోజ్ఞభీమం వపు రాప కృష్ణః
శతహ్రదేంద్రాయుధవాన్నిశాయాం సంస్పృజ్యమాన శ్శశినేవ మేఘః.

మెఱుఁగుఁదీఁగయు, నింద్రచాపమును, జంద్రబింబమును గల మేఘునివలెఁ బచ్చవలువయు, శార్ఙ్గధనుస్సును గల శ్రీకృష్ణుఁడు మనోజ్ఞమును, భయంకరము నగు రూపమును బొందెను.

ఇటఁ గృష్ణుఁ డుపమేయము; మేఘుఁ డుపమానము. బింబ ప్రతిబింబ భావ రూప సాధారణధర్మమున బింబరూపముగా స్వీకరింపఁబడిన 'పచ్చవలువయు శార్ఙ్గ ధనుస్సు' ననుదానికన్నఁ బ్రతిబింబముగా గ్రహింపఁబడిన "మెఱుఁగుఁదీఁగయు, నింద్రచాపమును, జంద్రబింబము"ను ననుదానిలోఁ 'జంద్రబింబము' అధికము. కాన నిది ధర్మగతాధిక్యదోషము. దీనినే 'యధికోపమ' యను పేరితో దోష ప్రకరణమున గ్రంథకర్త యుదాహరించెను.

## ౭. లింగభేదము

"భాగ్యాభావాత్కరస్థోఽపి చింతారత్న మివచ్యుతః" దురదృష్టమువలన నాచేతఁజిక్కియుఁ (చిక్కినదయ్యు) జింతారత్నమువలె జాఱిపోయినది.

ఇట నాంధ్రభావలో నెట్టి దోషమును గానరాదు. కాని సంస్కృతమున 'చింతారత్నం' నపుంసకము. 'చ్యుతః' అనునది పుంలింగము. విశేషణ వాచకమైన 'చ్యుతః' పదము విశేష్యమైన 'చింతారత్నం' పదముతో నెట్లన్వయించును ? కాన నిట లింగభేద దోషము. ఇది చూపఁబడినది.

## ౮. వచనభేదము

సక్తవో భక్షితాః దేవ! శుద్ధా కులవధూ రివ.

ఓ దేవ ! సక్తువులు శుద్ధమగు కుల వధువువలె భక్షింపఁబడినవి. (అనుభ వింపఁబడినవి.)

ఇట సక్తువు లుపమేయము. కులవధు వుపమానము. ఉపమేయము బహువచ నమునను ఉపమాన మేకవచనమునను గలవు. ఇది వచనభేద దోషము.

## ౯. అసాదృశ్య దోషము

"గ్రథ్నామి కావ్యశశినం వితతార్థరశ్మిం" విపులమగు నర్థములనుకిరణములు గల కావ్యమను చంద్రునిఁ గూర్తును.

లోకమున నర్థములకును గిరణములకును సాదృశ్య మప్రసిద్ధము. అట్లే కావ్య శశిబింబములకును సామ్య మప్రసిద్ధమే. దీనిఁ గవికల్పితోపమగా నేల గణింప రాదు ? అనవచ్చును. రామణీయక మున్నయెడలనే కవికల్పితోపమ స్వీకరింపఁ బడును. ఇట రామణీయకములేమిఁ గవికల్పితోపమ గాదు.

కాని కవిసమయప్రసిద్ధి యున్నచో నసాదృశ్యము దోషముగాదు. ఎట్లన,

'చంద్ర ఇవ ... కీర్తిః' 'కీర్తి ... ' [illegible]

ఇటఁ గీర్తికిఁ దెల్లఁదనము కవిసమయప్రసిద్ధము. దోష ప్రకరణమునఁ గవిసమయములను జూపితిమి. చంద్రునికినిఁ గీర్తికిని సాదృశ్యము లేకున్నను గవిసమయప్రసిద్ధమగుట దోషము గాదు.

### ౧౦. అసంభవదోషము

నిపేతు రాస్యాదివ తస్య దీప్తాశ్శరా ధనుర్మండల మధ్యభాజః
జాజ్వల్యమానా ఇవ వారిధారా దినార్ధభాజః పరివేషిణోఽర్కాత్.

నట్టమధ్యాహ్నమునఁ బరివేషము చుట్టుకొనియున్న సూర్యునినుండి వేఁడినీటి ధారలవలె ధనుర్మండలమధ్యగతుఁడగు నతనినుండి బాణములు వడెను.

ఇట సూర్యమండలమునుండి వేఁడినీటిధారలు పడుట యసంభవము.

ఉపమేయగతమగు 'నసంభావితత్వము'ను వివక్షించునపుడు అసంభవము దోషముగాదు. ఎట్లన,

చంద్రబింబాదివ విషం చందనాదివచానలః
పరుషా వాగితో వక్త్రాత్.........

చంద్రబింబమునుండి విషమువలెఁ జందనమునుండి యగ్నివలె నతని మొగమునుండి పరుషవాక్కు (బొత్తిగా వెలువడదు.) ఇట నుపమేయమగు పరుషవాక్కునకు "చంద్రబింబమునుండి విషమెట్లసంభవమో, చందనమునుండి యగ్ని యెట్లసంభవమో" యని యసంభావితములగు నుపమానములు గ్రహింపఁబడినవి. వీనిచే నుపమేయగతమగు నసంభావితత్వము వ్యక్తమగును. కాన దోషముగాదు.

కాలపురుష భేదమును గూడ దోషముగాఁ గొందఱు గణించిరి. కాని భాషలోఁ బెక్కుదాహరణములు గలవు. దోషప్రకరణము నందలి భిన్నలింగ, భిన్నవచన దోషమునఁ గల "నలింగ వచనే భిన్నే" ఇత్యాదికమును జూచునది.

### ౨. అనన్వయము

కం. సరసంబగు నొక్కటికే
ధరనుపమానోపమేయ ధర్మము థిరమై
పరగిన ననన్వయంబగు
నరయంగా దీనిలక్ష్య మాపాదింతున్. అ.

ఒకేవస్తు వుపమానముగను, ఉపమేయముగను జెప్పినచో ననన్వయాలంకారము.

కం. నీదయకు నీడుజోడగు
నీదయ; నీజయముసాటి నీజయమిలలో;

నీదానమునకు నెనయగు
నీదానము; నీకుసాటి నీవె; నృసింహా! ౩౦

నీ దయ నీ దయవంటిది; నీ జయము నీ జయమువంటిది; నీ దానము నీ దానమువంటిది. నీకు సాటి నీవే.

ఇట నొకేవస్తు వుపమానముగను నుపమేయముగను నున్నది. ఇట్లే

గగనం గగనాకారం సాగరస్సాగరోపమః
రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ

గగనము గగనాకారము; సాగరము సాగరమువలె నున్నది. రామరావణ యుద్ధము రామరావణయుద్ధమువలె నున్నది.

దీనివలన సదృశమైన ద్వితీయవస్తువు లేదని స్ఫురించును.

ఈ యనన్వయాలంకారమున శబ్ద, అర్థ పౌనరుక్త్యము గలదు. కాన లాటానుప్రాసము (కరములు కరములు) గాదా? యని శంక పొడముచున్నది. అయితే యనన్వయాలంకారమున నర్థపౌనరుక్త్యమే ప్రధానము గాని శబ్దపౌనరుక్త్యము ప్రధానముగాదు. 'గగనము గగనమువలె నున్నది' అనియే చెప్పనక్కఱలేదు. గగనమాకాశమువలె నున్నదన్నను ననన్వయాలంకారమే. కాని యుద్దేశ్యప్రతినిర్దేశ్యములందైకరూప్యము లేకున్నచోఁ బ్రక్రమదోషభంగము వచ్చును. కాన శబ్దపౌనరుక్త్యమానుషంగికమే. లాటానుప్రాసమున శబ్దార్థోభయ పౌనరుక్త్య మవశ్యము.

## 3. ఉపమేయోపమ

కం. నిపుణస్థితి నుపమేయం
బుపమానముఁబోల, మఱియు నుపమానంబా
యుపమేయముఁ బోలఁగఁదగు
నుపమేయోపమయనంగ; నొగి నెట్లన్నన్. ౩౧

ఉపమేయ ముపమానమును, ఉపమాన ముపమేయమును బోలినట్లు పర్యాయమునఁ జెప్పినచో నుపమేయోపమ యగును. దీనిచే సదృశమైన తృతీయ వస్తువు లేదని సారాంశము తెలియును. దీని కన్యోన్యోపమ యనియుఁ, బర్యాయోపమ యనియును నామాంతరములు.

కం. శరణాగత భరణంబున
నరసింహునిసాటివచ్చు నరసాహసుఁడీ

నరసింహులు, డితనికెనయా
నరసింహుఁడె కాక యితరనరులకుపళమే? 3౨

ఈ నరసింహుఁడా నరసింహుని సాటి; ఈ నరసింహున కా నరసింహుఁడు సాటి. ఇటఁ దృతీయమగు సదృశవస్తువు లేదని నిష్కర్షము.

## ౮. స్మరణము

కం. ధర నొకవస్తువుఁ గనుఁగొని
వరుసం దత్సదృశమైన వస్తువుఁ దలఁపన్
స్మరణంబని పాటింపుదు
రరయ నలంకారవేత్త లదియెట్లన్నన్. 33

ఒక వస్తువును గాంచి దానివంటి మరొక వస్తువును స్మరించినచో స్మరణాలంకారము.

కం. ఇల నుత్స్యాయంత్రమేయను
విలుపూనిన శ్రీనృసింహవిభుఁగాంచి జనుల్
దలఁపుదురు ద్రుపదకన్యా
కలితకరగ్రహణ నమితకార్ముకుఁ బార్థున్. 3౪

మత్స్యయంత్రము నేయుటకై విల్లెత్తిన నరసభూపాలునిఁ జూచి ద్రౌపదినిఁ బెండ్లాడుటకై మత్స్యయంత్రమేయఁబూనిన యర్జునుని దలంతురు.

ఇట విషయము స్పష్టము.

కేవల సదృశవస్తుస్మరణమే కాక వస్తుసంబంధిస్మరణముగూడ స్మరణాలంకారమే. ఎట్లన

సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే;
చండాంశోర్నిశి కా కథా? రఘుపతే! చంద్రోఽయ మున్మీలతి
వత్సైతద్విదితం కథం ను భవతా? ధత్తే కురంగం యతః
క్వాసి ప్రేయసి! హా కురంగనయనే! చంద్రాననే జానకి!

శ్రీరాముఁడు లక్ష్మణునితో ననుచున్నాఁడు. "లక్ష్మణా! ఎండ గాయుచున్నది. చెట్టునీడకుఁ బద! (లక్ష్మణుఁడు) శ్రీరామా! రాత్రి సూర్యుఁ డెక్కడ? చంద్రుఁడు వెన్నెలగాయుచున్నాఁడు. (రాముఁడు) నీకు చంద్రుఁడని యెట్లు తెలిసి

నదికి (లక్ష్మణుఁడు) అందుఁ గురంగమున్నది. (రాముఁడు) హా కురంగనయనా! సీతా! ఎటనుంటివి.

ఇటఁ గురంగపదశ్రవణముచేఁ దత్సంబంధి నయనస్మరణము దానిచే సీతాస్మరణమును గలిగినది.

## ౭. రూపకము

మం. అలసందేహముమాడ్కిఁ గాక యుపమేయం బెన్న నచ్ఛన్నమై
యలఘూత్ప్రేక్షయు నా నభిన్నమతి జంబై యుండ, కారోప మిం
పలరంగాఁ బ్రకృతోపయోగి పరిణామారోపతుల్యంబుగా,
కలయారోపితమందు రంజనము సేయన్ రూపకంబై తగున్, ౩౭

అన్యత్ర అన్యధర్మారోపమారోప మనఁబడును. ఎట్లనఁ జంద్రత్వము చంద్రధర్మము. దానిని ముఖమునం దారోపించుట యారోపము. సందేహాలంకారమున నుపమేయము ఛన్నమై యనఁగాఁ దిరోహితమై యుండును. ఎట్లన "ఇది ముఖమా? చంద్రుఁడా?" అనుచో నుపమేయమగు ముఖము సందేహవిషయ మగుటవలన నుపమానమగు చంద్రునిచేఁ దిరోహితమగును. రూపకమున నట్లుపమానముచేఁ దిరోహితము గాదు. ఉత్ప్రేక్ష యధ్యవసాయగర్భము. అనఁగాఁ బైకి భేదము దోఁపకున్నను లోపల నభేద మిమిడియే యున్నది. రూపకమున నభేదమే కాని యధ్యవసాయము లేదు. అధ్యవసాయమన నభేదప్రతిపత్తి. ప్రకృతాప్రకృతముల కభేదజ్ఞానము. పరిణామమున నారోపము ప్రకృతోపయోగి యగును. అనఁగా నప్రకృతము ప్రకృతస్వరూపములో నుపయోగపడును. రూపకమున నట్లు ప్రకృతాత్మముగాఁ బరిణమింపదు. రూపకమున నారోపము రంజనమాత్రమే. రంజనమన రంగువేయుట యని వ్యుత్పత్త్యర్థము. రంగు వేసినపుడు మొదటిదగు తెల్లరంగుమాత్రమే రెండవరంగుచేఁ గప్పివేయఁబడును. వస్తువే కప్పివేయఁబడదు. అట్లే రూపకమునఁ బ్రకృతవస్తువునం దప్రకృతవస్తువుయొక్క ధర్మారోపము చేయఁబడును. ఆ యా యలంకారములు వచ్చినపుడు దృష్టాంతములమీఁదఁ జూపఁబడిన భేదము విస్పష్టముగాఁ దెలియును.

రూప ఏవ రూపకం. రూపముయొక్క యారోపణమే రూపకము. దీని కాంగ్లమున Metaphor అని వ్యవహారము.

కం. అరయ రసజ్ఞులమతమున
నరుదగు నీరూపకంబు సావయవంబున్

నిరవయవవంబును వరుసం
బరంపరితమనఁగఁ ద్రివిధభావమునొందున్, ౩౬

ఈ రూపకము సావయవము (అవయవములు గలది) నిరవయవము (అవ యవములు లేనిది) పరంపరితము, అని మూవ్విధములు.

చ. అరయ సమస్తవస్తువిషయంబును, నేకతలప్రవర్తియై
యరుదుగఁబొల్చు సావయవ; మవ్వలఁ గేవల, మాలికాఖ్యమౌ
నిరవయవంబు; శ్లిష్టమును, నేర్పున శ్లేషవిహీనమౌఁ, బరం
పరితము; తత్ప్రభేదములఁ బాయక కేవలమాలికాఖ్యయౌన్. ౩౭

సావయవరూపకము సమస్తవస్తువిషయరూపకము, ఏకదేశవివర్తిరూపకము అనియు, నిరవయవము కేవలరూపకము, మాలారూపకమనియుఁ, బరంపరితము, కేవల శ్లిష్టపరంపరితము కేవలాశ్లిష్టపరంపరితము, శ్లిష్టమాలాపరంపరితము, అశ్లిష్ట మాలాపరంపరితము, అనియు నెంత్తెనిమిదివిధములు.

కం. కావున రూపక మష్టవి
ధావహమగు; లక్షణంబు లలలక్ష్యంబుల్
వావిరి నొనర్తు వీనికి
భావజధనురసమరసవిభాసితభరణిన్. ౩౮

స్పష్టము.

కం. అవయవియు నవయవంబులు
వివరింప సమస్తవస్తు విషయం; బిలలో
నవయవి యవయవ గమ్యం
బవునది యేకతలవర్తియగు నెట్లన్నఁ. ౩౯

అవయవియు దాని యవయవములును సమగ్రముగా నిరూపింపఁబడినచో సమస్తవస్తువిషయ సావయవరూపకము. అవయవ నిరూపణచే నవయవి గమ్యమాన మగుచో నేకదేశవివర్తిరూపకము.

## ౧. సమస్త వస్తువిషయ సావయవరూపకము

హిమశైలద్వీపదీప్తం, బినమణిమహితం, బిందుశంఖాభిరామం,
బమరాంభోమత్స్యయుక్తం, బహిపలహరికం, బభ్రశైవాలజాలం

బమితాశాకుంభి నక్రం, బజహాదుకుకణం, బాత్తసంధ్యాప్రవాళం
బమరుక శ్రీనారసింహాబాద్యుతవిశద యశోహారి దుగ్ధాబ్ధి వేడ్కన్.

హిమపంతమను ద్వీపములో, సూర్యుఁడను మణిలోఁ, జంద్రుఁడను శంఖములో, గంగానది యను మత్స్యములో, నాదిశేషుఁ డను తరంగములో, మేఘమను శైవాలములో, దిగ్గజము లను నక్రములలో, నక్షత్రము లను కణములలో, సంధ్యాకాలమను పగడములో, నరసభూపాలుని కీర్తి యను పాలసముద్రమమరును. పాలసంద్ర మవయవి. దాని సమస్తావయవములను నిరూపింపఁబడినవి. ఇట రూపకము సమస్తావయవ వ్యాప్తమైయున్నది.

౨. ఏక దేశవివర్తి సావయవరూపకము

కం. ధర నొఱయను వల్మీకము
సరభసగతి వెడలి నీదు చటులాసి మదో
ద్ధురచరదరిధరణిధురం
ధరజీవానిలముఁ గ్రోలు నరసింహనృపా! ౪౧

నీ ఖడ్గ 'ఒఱ' యను పుట్టనుండి వెడలి మదమత్తులగు శత్రురాజుల ప్రాణానిలములను గ్రోలును.

అవయవి యగు ఖడ్గము సర్పరూపమని యవయవములచేఁ గమ్యమగుచున్నది. ఎట్లన, నిట ఖడ్గము సర్పముగా వాగ్రూపమున రూపింపఁబడలేదు. ఒఱ యను పుట్ట, జీవానిలములు, అను నవయవ రూపకములచే నవయవి యగు ఖడ్గము సర్పరూపమని గమ్యమగుచున్నది.

కం. అవయవి మాత్రంబుననే
కవిమతివిశ్రాంతమైనఁ గన నిరవయవం;
బవని సిది కేవలంబును
ద్వివిధత మాలికయునయ్యె వినుమెట్లన్నన్. ౪౨

అవయవ నిరూపణము చేయక యవయవిమాత్రమునే కవి నిరూపించినచో నిరవయవరూపకము. అది కేవలనిరవయవము, మాలానిరవయవము అని ద్వివిధము.

౩. కేవల నిరవయవము

కం. ఇల నీదు కీర్తి చంద్రిక
యలఘుతరస్ఫూర్తి నళినజాండకరండ

బులు నిండి వెల్లివిరిసె
న్నలనహుష సమానశీల! నరసనృపాలా! ౪౩

కీర్తి యనునది యవయవి. అదిమాత్రమే చంద్రికగా నారోపింపఁబడినది. కానఁ గేవల నిరవయవరూపకము.

## ౪. మాలా నిరవయవరూపకము.

కం. హరశిఖరిదరుల, భాషా
తరుణీ కుచగిరుల, నమరతరులం జెలఁగున్
ఝరులై, సరులై, విరులై,
నరనుతమగు నీదుకీర్తి నరసింహనృపా! ౪౪

కైలాసగుహలందు, సరస్వతీదేవి స్తనములందుఁ, గల్పవృక్షములందుఁ నీ కీర్తి ప్రవాహములై, ముత్యాలసరులై, పువ్వులై చెలఁగును.

ఇటఁ గీర్తి యను నవయవి ఝరులుగా, సరులుగా, విరులుగా నారోపింపఁబడినది. వెనుకటి పద్యమున నొక్కటే నిరవయవరూపకము. ఇటఁ బెక్కు నిరవయవరూపకములు. ఇదే మాలా నిరవయవరూపకము లేక మాలారూపకము.

ఇట 'యథాసంఖ్యము లేక క్రమము' అను నలంకారము గూడఁ గలదు. "ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి" అను న్యాయముచే నిట రూపకముచేతనే విచ్ఛిత్తివిశేషము. కాన రూపకమనియే వ్యవహారము.

## ౫. శ్లిష్ట కేవల పరంపరితరూపకము

కం. రూపక కారణమై తగు
రూపకము పరంపరితము; రూపింపఁగ నిం
దేపగు నాల్గువిభేదము
లాపాది చెద నుదంచితాయత భుజశాలిన్. ౪౫

ఒక రూపకమునకుఁ గారణముగా మరొక రూపకము నిబద్ధమయ్యెనేని నది పరంపరిత రూపకము. (పరంపరా + ఇతే = పరంపరితము; పరంపర గలది - తారకలు గలవి 'తారకితము' అను విగ్రహమున సిద్ధము.) ఇది నాలుగుభేదములు గలది.

కం. నిరతంబు రాజహంసలఁ
బరు[illegible]

త్కరకరవాలకరాళ
స్ఫురితాంభోదము నృసింహభూపాలమణీ! ౭౬

నీచేతి ఖడ్గమను మేఘము రాజశ్రేష్ఠులనురాజహంసలను బరుగెత్తించును. ఇట రాజహంసపదము శ్లిష్టరూపకము. 'రాజహంసలు' అను శ్లిష్టరూపకమునకుఁ గారణముగాఁ "కరవాల కరాళస్ఫురితాంభోదము" అను రూపకము నిబద్ధమై యున్నది. ఇది నిరవయవము. 'రాజహంస' పదము శ్లిష్టము. కాన నిరవయవ శ్లిష్ట పరంపరితము.

## ౬. శ్లిష్టమాలా పరంపరితము

కం. కువలయ విలసన హిమకరుఁ
డవిరళ దానాంబు దిగ్గజాగ్రణిః పద్మో
త్సవ సౌభాగ్య దివాకరుఁ
డవనిని నరసింహుఁ డితని కన్యులు సరియే? ౭౭

నరసభూపాలుఁడు కువలయ (భూవలయము) మను కువలయమును (కలువను) వికసిల్లఁజేయు చంద్రుఁడు. దాన (ఈవి) జలమను దాన (మద) జలమునకు దిగ్గజము. పద్మోత్సవ ( పద్మా + ఉత్సవ ) మను పద్మోత్సవమునకు (పద్మ + ఉత్సవ) సూర్యుఁడు.

నరసభూపాలుఁడు 'హిమకరుఁడు' అన్నచో 'హిమకరుఁడు' అను రూపక మునకుఁ గారణము 'కువలయమను కువలయము' అను శ్లిష్టరూపకము. 'నరసభూపా లుఁడు దిగ్గజాగ్రణి' అన్న రూపకమునకుఁ గారణము 'దానాంబువులు అను దానాం బువులు' అను శ్లిష్టరూపకము. 'నరసభూపాలుఁడు దివాకరుఁడు' అను రూపకము నకుఁ గారణము 'పద్మోత్సవ మను పద్మోత్సవము' అను శ్లిష్టరూపకము. ఇవి పెక్కు రూపకములు. కాన శ్లిష్టమాలా పరంపరితము.

## ౭. అశ్లిష్ట కేవలపరంపరితరూపకము

కం. కాతరతరవిమతధ్వజి
నీతతకాంతారతతికి నీచేతిమహా
హేతి దవజ్వలనోజ్జ్వల
హేతిసుమీ! మాధవనృసింహావనిపా! ౭౮

పితికిపందలైన నీశత్రుసేనయను కాంతారమునకు నీచేతిఖడ్గము దావాగ్నిశిఖ. ఇట 'ఖడ్గ మగ్నిశిఖ' అను రూపకమునకు 'సేనాకాంతారము' అను రూపకము హేతువు. వెనుకటివానియందువలె నిందు శ్లేషలేదు. కాన నశ్లిష్టము.

## ౮. అశ్లిష్టమాలావరంపరితరూపకము

మ. వనితానేత్రచకోరచంద్రిక; యశోవల్లీ వసంతోదయం;
బనిదంపూర్వకథాసుధాబ్ధి; భుజగర్వాదిత్య పూర్వాచలం,
బనఘోద్యద్గుణరత్నరోహణము; నీయాకారమె వ్వారికిన్
వినుతింపన్ వశమే! నృసింహ! కరుణావిన్యాస! ధన్యాత్మకా! ౮౯

నీ 'యాకారము చంద్రిక' అను రూపకమునకు 'నేత్రచకోరము' అను రూపకము హేతువు. ఇట్లే మిగిలిన గీటులుంచినయెడలను దెలిసికొనవలెను.

ఇవియేకాక రశనారూపకాది పెక్కుభేదములును గలవు.

కిశలయకరైర్లతానాం కరకమలై ర్మృగదృశాం జగజ్జయతి
నళినీనాం కమలముఖై ర్ముఖేందుభిర్యోషితాం మదనః

లతలయొక్క చిగురాకులను హస్తములచేతను, యువతుల కరములను కమలములచేతను, తామరతీగలయొక్క కమలములను ముఖములచేతను, తరుణుల ముఖములను చంద్రులచేతను మన్మథుఁడు జగమును జయించుచున్నాఁడు.

ఇటఁ గిసలయములు కరములుగాఁ గరములు కమలములుగాఁ గమలములు ముఖములుగా ముఖములు చంద్రులుగా నారోపింపఁబడిరి. ఇది రశనారూపకము. రశనాకారముగ రూపకములు గూర్పఁబడినవగుట నామము సార్థకము.

మరియు సమస్తరూపకము, వ్యస్తరూపకము, అని రూపకమెల్ల ద్వివిధము. 'ముఖచంద్రుఁడు' సమస్తరూపకము (సమాసమందున్న రూపకము) 'ముఖము చంద్రుఁడు' వ్యస్తరూపము. (విడిగానున్న రూపకము.)

సిద్ధాంతమున వ్యస్తరూపకమేకానీ సమస్త రూపకమనునది లేదు. సమస్తరూపక మనినప్పుడు చెప్పకొను నలంకారము 'ఉపమాలంకారమే.' "ముఖచంద్రాదీనాంతు ఉపమాసమాసాత్ న రూపకత్వం యుక్తం" అని వామనుఁడు. అనఁగా ముఖచంద్రాది పదములందు 'చంద్ర ఇవ ముఖం' అని యుపమాసమాసమునే చేయవలెను. రూపకము చేసినచో నుత్తరపదార్థప్రాధాన్యముచే వర్ణనీయమగు ముఖాదులకు గౌణత్వము వచ్చును. కాన నుపమాసమాసమునేచేసి యుపమాలంకారమునేచెప్పకొనవలెను. ఇ[illegible] పరంపరితరూపక

మాను నుపమారూపకమనియు వామనుఁ డుదాహరించెను. 'చతుర్దశలోకవల్లికందః' 'వల్లులవంటి పదునాలుగులోకములకును గంధభూతుఁడు, అని యర్థము. అంతేకాని "చతుర్దశలోకములం అను వల్లులకుఁ గందము,, అనికాదు. శ్లిష్టపరంపరితమునఁ దక్క అశ్లిష్టపరంపరితమున నెల్లెడ నుపమాసమాసమునే చెప్పవలెను. మొదట నుపమయుఁ బిమ్మట రూపకమును నుంట నుపమారూపకము.

## ౬. పరిణామము

౪౦. ధరలో నుపమేయమునను
నరుమగ నారోప్యమాణమగు నుపమానం
బరయుఁ బ్రకృతోపయోగా
కరముగఁ బరిణామమయ్యెఁ గనుమెట్లన్నన్. ౫౦

ఉపమేయమం దారోపింపఁబడిన యుపమానము ప్రకృతరూపమున ననఁగా నుపమేయరూపము గానే పరిణమించి యుపయోగించుచోఁ బరిణామాలంకారము.

౪౦. నైలింపసతులకౌఁగిట
దేలుటకై దివికినేగు దృప్తారులకున్
నీలాలనిచ్చెనాయెను
నీలాలితహేతి యోబనృపనరసింహా! ౫౧

దేవతాస్త్రీల ననుభవించుటకై దివికేగు నీ శత్రురాజులకు నీ ఖడ్గము నీలమణిమయమైన 'నిచ్చెన' యయ్యెను.

ఇట నుపమేయమగు ఖడ్గము మొదట నిచ్చెనగా నారోపింపఁబడినది. ఆ యారోప్యమాణమగు 'నిచ్చెన' స్వతంత్రముగా స్వర్గారోహణ సాధనము కాఁజాలదు. ఏలన, స్వర్గమునకు నిచ్చెనతో వెళ్ళుటెట్లు? కానఁ బ్రకృతస్వరూపమున ననఁగా ఖడ్గాభిన్నస్వరూపముననే సాధనమగును. ఖడ్గహతులయినవారు స్వర్గమునకుఁ బోవుదురుగదా! కాన నిచ్చెన ఖడ్గరూపమునఁ బరిణమించినచో నపుడు స్వర్గారోహణ సాధన మగుచున్నది. ఇట నారోప్యమాణము ప్రకృతాత్మకముగఁ బరిణమించుటచేఁ బరిణామాలంకారము.

ఈ యలంకారము సామానాధికరణ్య వైయధికరణ్య భేదములచే ద్వివిధము. సామానాధికరణ్యమన నుపమానోపమేయములు సమానవిభక్తియుందుండుట, 'నీహేతి నీలాలనిచ్చెన' అనుచో నుపమానోపమేయములు సమాన విభక్తికములు. కాన సామానాధికరణ్యము గలదు. వైయధికరణ్యోదాహరణమును గనుఁడు.

పున్నాగజాలకై ర్హారాన్ కాంచీః కేసరదామభిః
కర్ణికాః కర్ణికారైశ్చ విహర్తుం విదధుర్వనే.

ఆ యువతులు (వనదేవతలవలె) వనమున విహరించుటకుఁ బున్నాగజాలకము లచే (సురపొన్న మొగ్గలు) హారములను, కేసరదామకములచే (పొగడదండలు) మొల నూలుఁను, కర్ణికారములచే (కొండగోఁగుపూలు) కర్ణికలను (చెవికమ్మలు)జేసికొనిరి.

ఇట హారాదులు స్వతంత్రముగా వనవిహరణోపయోగులుగాక పున్నాగజాల కాది రూపమున నుపయోగపడుచున్నవి. హారాదు లేల స్వతంత్రముగా విహరణోప యోగులుగావు ? అన్నచో నవి రతికేళియం దుపయోగపడును. కాని యిట యువ తుల వనదేవతాస్వరూపముతోఁడి వనవిహరణమున కవి యుపయోగపడవు. కాన నిట నారోప్యమాణములగు హారాదులు జాలకాదిరూపమునఁబరిణమించి యుపయో గించుచున్నవి. పున్నాగజాలకాద్యుపమేయములును హారాద్యుపమానములును భిన్నవి భక్తికములు. కాన వైయధికరణ్యపరిణామము.

రూపకమునందును వైయధికరణ్యము గలదు.

తారానాయకశేఖరాయ, జగదాధారాయ, ధారాధర
చ్ఛాయాధారికకంధరాయ, గిరిజాసంగైక శృంగారిణే
నద్యాశేఖరిణే, దృశా తిలకినే, నారాయణేనాస్త్రిణే,
నాగైః కంకణినే, నగేన గృహిణే, నాథాయ నేయం నతిః.

చంద్రశేఖరుఁడును, జగదాధారుఁడును, నీలకంఠుఁడును, గిరిజాసంగతిచే శృంగారియు, నదిచే శేఖరియు (శేఖరముగలవాఁడు) కంటిచేఁ దిలకియు (తిలకము గలవాఁడు) నారాయణునిచే నస్త్రియు (అస్త్రముగలవాఁడు) సర్పములచేఁ గంక ణియు (కంకణములుగలవాఁడు) నగముచే గృహియు (గృహముగలవాఁడు) నగు నాథునకు నమస్కారము.

ఇట నుత్తరార్ధమున 'నద్యాశేఖరిణే' ఇత్యాదులు నదీరూపశేఖరముగలవాఁడు; నేత్రరూపతిలకముగలవాఁడు, నారాయణరూపాస్త్రముగలవాఁడు, నాగరూపకంకణ ములుగలవాఁడు, నగరూపగృహముగలవాఁడు" అని రూపకములు. నదీ, దృక్, నారాయణ, నాగ, నగశబ్దము లుపమేయములు. శేఖర, తిలక, అస్త్ర, కంకణ, గృహశబ్దము లుపమానములు. ఇవి భిన్నవిభక్తికములు. కాన వైయధికరణ్యరూపకము.

ఈ పరిణామాలంకారమును మమ్మటుఁ డుదాహరింపలేదు. దీనిని రూపకము నందే యంతర్భావము నొనర్చినట్లగపడును.

## ౭. సందేహము

గీ. విషయి, విషయంబుఁ, గవినుతి విహితసామ్య
దీప్తసందేహ మొంద సందేహ; మదియు
గరిమ శుద్ధంబు, నిశ్చయగర్భితంబు,
నిశ్చయాంతంబు నగు; దీని నిశ్చయింతు. ౫౨

ఉపమానోపమేయంబులు రెండును గవి ప్రతిభోత్థాపితమగు సాదృశ్యముచే సందేహింపఁబడినచో సందేహాలంకారము. వర్ణ్యమానమగు నుపమేయముయొక్క యుత్కర్షార్థమే యీ సందేహము పర్యవసన్నమగును. ఈ కనఁబడునది స్థాణువా ? పురుషుఁడా ? అనుచోటనున్న సందేహము వర్ణ్యోత్కర్షార్థము పర్యవసింపలేదు. కాన నిది సందేహాలంకారము గాదు.

ఈ సందేహాలంకారము శుద్ధము, నిశ్చయగర్భము, నిశ్చయాంతము, అని ముత్తెఱఁగులుగా నుండును.

### ౧. శుద్ధసందేహము

ఉ. ఇంద్రుఁడో ? యా యుపేంద్రుఁడో ? బలీంద్రుఁడో ?
పార్వణచంద్రుఁడో ? హరి
శ్చంద్రుఁడో? రామచంద్రుఁడో? రసాభరణప్రవణాత్ముఁడైన నా
గేంద్రుఁడో ? యానగేంద్రుఁడో ? మృగేంద్రుఁడో ? యంచు
దలంతురార్యు లీ
సాంద్రభుజప్రతాప రణసాహసు నోబయనారసింహునిన్. ౫౩

పై సందేహాలంకార లక్షణమునఁ గవి ప్రతిభోత్థాపితమగు సాదృశ్యముచే నుపమానోపమేయములు సందేహింపఁబడవలెనని చెప్పితిమి. నరసభూపాలునిఁ జూచి "ఇంద్రుఁడా? ఉపేంద్రుఁడా? యిందలగువిధముగఁ జేయఁబడిన సందేహమున సాదృశ్యము చెప్పఁబడలేదు. కొన్నియెడలఁ జెప్పఁబడినది. (నాగేంద్రుఁడో? ఇత్యాదులందు రసాభరణప్రవణత్వాదులు సాదృశ్యము) కాన వేనికి సాదృశ్యము చెప్పఁబడలేదో వానికి సాదృశ్యమూహ్యము. ఎట్లన, భోగమున నింద్రుఁడో ? కరుణయం దుపేంద్రుఁడో ? ఇట్లు మిగిలిన వూహ్యములు. ఇది శుద్ధసందేహము.

### ౨. నిశ్చయగర్భ సందేహము

మ. హరుఁడో యీఘనుఁ?డైన నహాళి ధృతతోయంబెద్ది?దైతేయ సం
హరుఁడో యీనృపుఁ?డైన నవ్విహగవాహంబెద్ది? వాణీమనో

హరుఁడో? యివ్విభుఁ డైన సారసనివాసాధ్యాసనం బెద్ది? యం
చు రసజ్ఞుల్ వినుతింతు రాత్మ నరసక్ష్మోణీశు వీక్షించుచున్. ౫౪

ఈ నంసభూపాలుఁడు హరుఁడా? అయినచో శిరస్సున గంగయేది? శ్రీమహా విష్ణువా? అగుచో గరుడవాహనమేది? బ్రహ్మయా? పద్మాసనమేది? అనుచోట్ల నరసభూపాలుఁడు హరాదిరూపమున మొదట సందేహింపఁబడి గంగాదులు లేమిఁ గాఁడని నిశ్చయింపఁబడినను నరసభూపాలుఁడే యనియును వాగ్రూపమున నిశ్చయింపఁబడలేదు. కాన నిది నిశ్చయగర్భసందేహము.

### 3. నిశ్చయాంతసందేహము

సీ. తలపోయ వల్లీమతల్లి కేగతిఁ గల్గె
నలసాలసానూన యానకలన ?
భావింప మణి సాలభంజిక కెటులబ్బె
లాలితాలాప లీలాకలాప ?
మూహింప విమలవిద్యుల్లేఖ కేలీల
నొదవె ధాత్రీభాగయోగగరిమ ?
మరయంగ మదనమంత్రాధిదేవతకు నే
గతిఁ గల్గె నంగసంగప్రసంగ ?
గీ. మనుచు శబరులు సందియంబందియుంది
తెలియుదురు తోన నీధాటి కలికితలఁకి
యహితవనితలు వనధాటి నడలుచునికి
నరనుతాటోప! యోబయనరసభూప! ౫౫

శబరులు శత్రుకాంతలను గాంచి "లత యెట్లు నడవనేర్చినది? సాలభంజిక యెట్లు మాటలాడుచున్నది? మెఱపుఁదీఁగ యెట్లు నేలపైకి వచ్చినది? మదనమంత్రాధిదేవత శరీరము నెట్లు ధరించినది? అని సంశయించి నీ ధాటికి భయపడి తిరుగుచున్న శత్రుకాంతలని నిశ్చయించిరి. మొదట సందేహింపఁబడిన విషయము తుదికి నిశ్చయింపఁబడినది. కాన నిశ్చయాంతసందేహము.



ఈ సందేహాలంకారమునకు ససందేహమనియు నామాంతరము.

## ౮. భ్రాంతిమంతము

కం. అల యుపమేయము ఛన్నత
నలరఁగ, నారోప్యమాణమగు నుపమానం
బిల నెఱుకపడఁగ భ్రాంతిమ
దలంకరణమయ్యె; దీని నాపాదింతుఁ. ౫౬

కవిసమ్మతమగు సాదృశ్యముచే నుపమేయము ఛన్నమై యుపమానముయొక్క యనుభవము గలిగినచో (ఉపమానంబిల నెఱుకపడఁగ)నది భ్రాంతిమంతము.

శా. చూడంజూడ నృసింహకీర్తిచయ మిాక్షోణీనభోమధ్యమం
దేడంజూచినఁ దానయై నెగడఁగా నీక్షించి మిన్నేట నీ
రాడంబోయిన బేసితాపసులు మేలా; మ్రోల సిద్ధించెఁగా
నాడంబోయిన తీర్థమంచు మదిలో హర్షింతు రశ్రాంతమున్. ౫౭

నరసభూపాలుని కీర్తినిఁ జూచి యాకాశగంగలో స్నానమాడఁబోవుచున్న సత్పురుషులు ఆకాశగంగగానే తలంచి హర్షపడిరి. ఇటఁ గీర్తి యుపమేయము; ఆకాశగంగ యుపమానము. దానిఁగాంచి హర్షపడుట యుపమానానుభవము.

స్మరణాలంకారమున స్మరణమే కాని యనుభవములేదు. ఇందు భ్రాంతిచేఁ గలుగు ననుభవముగూడ నిబద్ధమై యుండవలెను.

"ఉ. అంకముఁజేరి శైలతనయా స్తనదుగ్ధము" అనుచోటఁగూడ భ్రాంతిమంతమే. అన్యోన్యవిషయకభ్రాంతిమదలంకారము, ఉత్తరోత్తరభ్రాంతిమదలంకారము అని దీనిలో నవాంతరభేదములు గలవు.

పలాశముకుళభ్రాంత్యా శుకతుండే పతత్యలిః
సోఽపి జంబూఫలభ్రాంత్యా తమలిం ధర్తు మిచ్ఛతి.

తేఁటి మోదుగుపువ్వని భ్రమించి చిలుకముక్కుమీఁదఁ బడుచున్నది. అదియు నేరేడుపండని భ్రమించి యా తేఁటిని పట్ట నుంకించుచున్నది. ఇటఁ బరస్పరభ్రాంతి.

చ. వదనసరోజవాసనకు వచ్చిన తేఁటి నదల్చిచూడఁగా
నది యసితోత్పలంబులని యక్షులఁ ద్రాలఁగఁ, జేవిదుర్పఁగా
నది మరలంబయోజమని హస్తయుగంబున వ్రాల నవ్వెన
మ్మదవతి యేమిసేసినను మానదిదేమియటంచు నెంతయుఁ.

ఒక జవరాలు తన ముఖగంధమునకై వచ్చిన తేఁటి నదలించి చూచెను. ఆ తేఁటి యా పూవులు నల్లగలువలని కన్నులమీఁద వ్రాలెను. మఱల నామె చేయి

విదిలింపఁగా నది యా చేతినిఁ దామరపువ్వని భ్రమసి దానిపై వ్రాలెను. అంత నామె యేమిచేసినను నది మానదని వచ్చెను.

ఇట నుత్తరోత్తర భ్రాంతి నిబద్ధము. ఈ రెంటనుగూడ భ్రాంతిచేఁ గలిగిన యనుభవము నిబద్ధమైయున్నది.

## ౯. అపహ్నుతి

కం. ఉపమేయము గా దని యిది
యుపమానమె యనఁగ నెంతయు నపహ్నవమౌ;
నపుడది ప్రాగారోపము,
నపహ్నవారోపమును, ఛలాదియు, నయ్యెన్. ౫౮

ఇది యుపమేయము (ముఖాదులు) గాదు. ఉపమానమే (చంద్రాదులే) అని చెప్పినచో నది యపహ్నవాలంకారము. అది ప్రాగారోపము – అనఁగా నారోపించి యపహ్నవించుట; అపహ్నవారోపము – అనఁగా నపహ్నవించి యారోపించుట; ఆకృతి, ఛల, మిష, కైతవాది పదప్రయోగము సేయుట; అని యీవిధముగాఁ ద్రివిధము.

మ. గురుచక్రప్రభగాని శౌర్యనువమాంకూరంబుగా; డిందుభా
స్వరకీర్తిద్యుతిపంక్తిగాదు నిబిడాంచత్పాంచజన్యప్రభా
భరమౌఁగా; నటుగాన విశ్వభరణప్రారంభముంగోరి యీ
నరసేంద్రాకృతినుద్భవించెఁ గమలానాథుండు విశ్వంభరన్. ౫౯

శౌర్యనువమాంకూరమును గాంచి "యిది చక్రప్రభగాని శౌర్యనువమాంకూరంబుగాదు" అని శౌర్యనువమాంకూరమునందు మొదటఁ జక్రప్రభ నారోపించి పిమ్మట "శౌర్యనువమాంకూరంబు గాదు" అని యపహ్నవింపఁబడినది. ఇది ప్రాగారోపము.

'ఇది కీర్తిద్యుతి గాదు. పాంచజన్యప్రభ' అనుచో ముందపహ్నవమును, పిమ్మట నారోపమును జెప్పఁబడినది. ఇది యపహ్నవారోపము.

'నరసేంద్రాకృతి' ఆకృతి పదము ప్రయుక్తమై యున్నది. ఈ త్రివిధములందును నుపమేయ మపహ్నవింపఁబడి యది యుపమానమే యని తెలుపఁబడినది.

## ౧౦. ఉల్లేఖము

కం. అలరఁగ గ్రహీతృభేదం
బులనొకటియె పెక్కురూపముల నెడనెడలం

దలసోయఁగ సుల్లేఖుం
బలంకరణరాజమయ్యె నదియెట్లన్నన్. ౬౦

గ్రహీతృభేదముచే నొకే వస్తువు పెక్కు రూపములతో గ్రహింపఁబడినచో నుల్లేఖము.

కం. బాణుఁడని కవులు; మురజి
ద్బాణుండని విమతభూమిపాలురు, సుమనో
బాణుఁడని సతులు, దలఁపుదు
రేణాంకసమాను నోబళేంద్రునృసింహున్. ౬౧

ఒకే నరసభూపాలుఁ డిటఁ బెక్కండ్రచేఁ బెక్కువిధముల గ్రహింపఁబడెను.

"గ్రహీతృభేదాభావేఽపి విషయాశ్రయ భేదతః
ఏకస్యానేకధోల్లేఖ మప్యుల్లేఖం ప్రచక్షతే"

గ్రహీతృభేదము లేకున్నను విషయభేదమునుబట్టి యొకవస్తు వనేకవిధములుగా వర్ణింపఁబడినను నుల్లేఖమే.

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై, గళాభరణమై, సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమూర్తి నిండుచోన్.

ఇట గ్రహీతృభేదము లేదు. ఒకే సూర్యుఁడు విషయము నాశ్రయించిన భేదముచే నానావిధములుగ వర్ణింపఁబడెను.

## ౧౧. ఉత్ప్రేక్ష

కం. ఉపమేయమునకుఁగలిగిన
యుపమానగుణక్రియాదియోగముచే నా
యుపమానమెయుని తలఁచిన
నపుడది యుత్ప్రేక్షయయ్యెఁ; నదియును ధరణిన్. ౬౨

"యత్రాఽన్యధర్మసంబంధా దన్యత్వేనోపతర్కితం
ప్రకృతం హి భవేత్ప్రాజ్ఞాస్తాముత్ప్రేక్షాం ప్రచక్షతే."

అనుదానికిఁ బై పద్య మాంధ్రీకరణము. ఉపమానముయొక్క (అప్రకృతము లేక అన్యము) గుణము, క్రియ మొదలగువాని సంబంధముచే నుపమేయము (ప్రకృ

తము) ఉపమానముగానే (అప్రకృతముగానే లేక యన్యముగానే) తర్కింపఁబడి నచో నది యుత్ప్రేక్ష యనఁబడును. ఉత్ప్రేక్ష యధ్యవసాయగర్భము. అధ్యవసాయమన నభేదప్రతిపత్తి. అనఁగాఁ బ్రకృతాప్రకృతములకు నభేదజ్ఞానము. కాఁబట్టి యిటఁ బ్రకృతమున కప్రకృతతాదాత్మ్యసంభావన (ఊహ) సేయఁబడును. అనఁగాఁ బ్రకృత మప్రకృతముగానే తర్కింపఁబడును. ఉత్ప్రేక్షయందుఁ బ్రకృతమున కప్రకృతాదాత్మ్యసంభావన యందున్న మాట స్మృతియందుంచుకొనవలెను. తాదాత్మ్యమన్నను నధ్యవసాయమన్న నొకటియే.

కం. క్రమమున వాచ్యయునుప్రతీ
యమానయునునగుచు ద్వివిధయగు; వాచక శ
బ్దముగలుగ వాచ్యయనఁదగు;
నమరఁగ లేనియెడ గమ్యయనఁదగువరుసన్. ౬౩

ఆ యుత్ప్రేక్ష వాచ్య, గమ్య, అని ద్వివిధము. సంభావనా ప్రతిపాదకము లైన (ఊహను లేక వితర్కమును దెలుపు పదములు) నూనము, ధ్రువము, ప్రాయము, అనక, శంకించు, కాఁబోలు, ఊహించు, భావించు, అనుమానించు, మొదలగు పదములను బ్రయోగించుటచే వాచ్య యనియు, నట్టి పదములు లేనిచో గమ్య యనియుఁ జెప్పఁబడును.

సీ. అలరెడు నీరెంటియందు జాతిగుణక్రి
యాద్రవ్యములవాచ్య యబ్ధిసంఖ్య;
అవినాల్గు వరుస భావాభావములఁజెంద
నిల వసుసంఖ్య; యామెనిమిదియును
నిఱువదినాలుగౌ హేతు, ఫల, స్వరూ
పముల వేర్వేఱఁ ద్రిభంగిఁజెంద;
నందునెన్మిదియెన్మిదగు హేతువు, ఫలంబు,
నలరువాచ్య గుణక్రియానిమిత్త

గీ. ములఁ బదాఱుపదాఱునౌ; నలస్వరూప
గతనిమిత్తంబులకు వాచ్యగమ్యగతులు
గానఁ బదియాఱునగు వాచ్యగస్వరూప;
మరయ గమ్యస్వరూప మష్టాఖ్యమయ్యె. ౬౪

ఈ వాచ్యా, గమ్యా భేదములలో వాచ్య, ఉపమానపదము జాతివాచకమని గుణవాచకమని క్రియావాచకమని ద్రవ్యవాచకమనియు భేదములు వహించియుంట నాలుగువిధములు. (అనఁగా జాత్యుత్ప్రేక్ష, గుణోత్ప్రేక్ష, క్రియోత్ప్రేక్ష, ద్రవ్యోత్ప్రేక్ష). శబ్దము జాతి గుణ క్రియా ద్రవ్య వాచకభేదముచేఁ జతుర్విధమని తెలిపితిమి. ఈ చతుర్విధోత్ప్రేక్షయు భావము, అభావము, అను భేదములనుబట్టి యెనిమిది భేదములు. (జాతిభావోత్ప్రేక్ష, జాత్యభావోత్ప్రేక్ష మొ.) ఈయెనిమిది భేదములలో నొక్కొక్కటియు హేతువుగా, ఫలముగా, స్వరూపముగా నుత్ప్రేక్షింపఁబడినచో నిఱువదినాలుగు భేదములగును. (జాతిహేతూత్ప్రేక్ష, జాత్యభావహేతూత్ప్రేక్ష మొ.) ఇందు హేతూత్ప్రేక్ష లెనిమిదియు, ఫలోత్ప్రేక్ష లెనిమిదియు గుణ, క్రియా, నిమిత్తభేదములనుబట్టి యొక్కొక్కటియుఁ బదునాఱు భేదములు గావ మొత్తము ముప్పదిరెండు భేదములగును. ఇఁక స్వరూపోత్ప్రేక్షలో నిమిత్తములు (గుణ, క్రియలు) వాచ్యమనియును, గమ్యమనియును ద్వివిధము. అనఁగా స్వరూపోత్ప్రేక్ష యుపాత్తనిమిత్తయనియు, ననుపాత్తనిమిత్తయనియును ద్వివిధము. ఉపాత్తనిమిత్త యగు నష్టవిధస్వరూపోత్ప్రేక్ష గుణ, క్రియా నిమిత్త ద్వయభేదమునుబట్టి పదునాఱు భేదములగును. అనుపాత్తనిమిత్త యెనిమిది భేదములే యగును. ఏలన, ననుపాత్తనిమిత్తలో గుణ క్రియా భేదము లుండవు. అనఁగా ననుపాత్తగుణనిమిత్త, అనుపాత్తక్రియానిమిత్త, అను భేదము లుండవు. అట్లు భేదము చూపుట పుట్టనివానికిఁ బేరుపెట్టుటవంటిది. మొత్తము వాచ్యోత్ప్రేక్ష ౫౬ విధములు (హేతూత్ప్రేక్ష ౧౬ విధములు; ఫలోత్ప్రేక్ష ౧౬ విధములు; ఉపాత్త నిమిత్త స్వరూపోత్ప్రేక్ష ౧౬ విధములు; అనుపాత్త నిమిత్త స్వరూపోత్ప్రేక్ష ౮ విధములు.)

కం. అల హేతు, ఫల, నిమిత్తం
బులకుఁ గమ్యత్వమైన భువి హేతుఫల
బులు లేకరుచిరమగునని
యలవడ గమ్యత్వమిందు నగదితమయ్యెన్. ౬౫

(లేక + అరుచిరము). పై వివరణమున స్వరూపోత్ప్రేక్షకే యనుపాత్త నిమిత్త (గమ్యనిమిత్త), ఉపాత్తనిమిత్త (వాచ్యనిమిత్త) యను భేదములు దెలిపితిమి. కాని హేతుఫలోత్ప్రేక్షలకీ భేదములు దెలుపలేదు. ఏలయన, హేతూత్ప్రేక్షలో నిమిత్తము ఫలోత్ప్రేక్షలో నిమిత్తము గమ్యములు, ఇవి చెప్పఁబడకున్నచో

నుత్ప్రేక్ష యసుందరము. కాన హేతుఫలోత్ప్రేక్షలలో ననుపాత్తనిమిత్తభేదము లేదు. కాఁ జెప్పఁబడలేదు.

కం. కావున నేఁబదియాఱగు
నావాచ్యోత్ప్రేక్ష; గమ్యయటువలెనే భే
దావహమగును; నిమిత్త
ద్వైవిధ్యమునందు గమ్యతాస్థితిలేమిన్. ౬౬

కం. హేతుస్వరూపఫలములు
నాతతగతి నెన్మదెన్మిదయి యవియు నిమి
త్తాతివ్యాప్తిఁబడాఱుగ
నేతఱిగమ్యయును నల్వదెనిమిదియయ్యెన్. ౬౭

కావున వాచ్యోత్ప్రేక్ష యేఁబదియాఱు భేదములు గలది. గమ్యోత్ప్రేక్ష నలుబదెనిమిది భేదములుమాత్రమే గలది. ఎట్లన, వాచ్యోత్ప్రేక్షవలెనే గమ్యోత్ప్రేక్షయు జాతి, గుణ, క్రియా, ద్రవ్య, భేదములచేఁ దొలుత నాలుగు భేదములు. అవి భావాభావములచే నెనిమిది భేదములు. వానిని హేతువుగా, ఫలముగా, స్వరూపముగా నుత్ప్రేక్షించినచో మూఁడెనిమిదు లిరువదినాలుగు భేదములగును. అవియు గుణ క్రియా నిమిత్త ద్వైవిధ్యముచే నలువదెనిమిది భేదములగును.

వాచ్యమగు స్వరూపోత్ప్రేక్షలోనే కాని గమ్యమగు స్వరూపోత్ప్రేక్షలో ననుపాత్తనిమిత్త యుండదు. ఏలన, గమ్యోత్ప్రేక్షయందు సంభావనాప్రతిపాదక పదము ప్రయోగింపఁబడదని చెప్పియుంటిమి. సంభావనావాచకమును బ్రయోగింపకయు నిమిత్తమును బ్రయోగింపకయు నున్నచో నుత్ప్రేక్షయే యసంభవము. కాన గమ్యోత్ప్రేక్షలో ననుపాత్తనిమిత్త యుండదు.

వాచ్యోత్ప్రేక్షా గమ్యోత్ప్రేక్షలు వెరసి నూటనాలుగు.

వ. ఇందు నేఁబదియాఱుభేదంబులంబొల్చు వాచ్యోత్ప్రేక్షకుం గొన్ని నామధేయంబు లెఱింగించెద.

౧. ఉపాత్తగుణనిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్షయు ౨. ఉపాత్తక్రియానిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్షయు, 3 ఉపాత్తగుణనిమిత్తజాత్యభావస్వరూపోత్ప్రేక్షయు, ౪. ఉపాత్తక్రియానిమిత్తజాత్యభావస్వరూపోత్ప్రేక్షయు, ౫. అనుపాత్తనిమిత్తజాతిభావస్వరూ

పోత్ప్రేక్షయు, ౬. అనుపాత్తనిమిత్తజాత్యస్వభావస్వరూపోత్ప్రేక్షయు ౭. ఉపాత్తగుణనిమిత్తజాతిభావహేతూత్ప్రేక్షయు, ౮. ఉపాత్తక్రియానిమిత్తజాతిభావహేతూత్ప్రేక్షయు, ౯. ఉపాత్తగుణనిమిత్తజాత్యభావహేతూత్ప్రేక్షయు, ౧౦. ఉపాత్తక్రియానిమిత్తజాత్యభావహేతూత్ప్రేక్షయు, ౧౧. ఉపాత్తగుణనిమిత్తజాతిభావఫలోత్ప్రేక్షయు, ౧౨. ఉపాత్తక్రియానిమిత్తజాతిభావఫలోత్ప్రేక్షయు, ౧౩. ఉపాత్తగుణనిమిత్తజాత్యభావఫలోత్ప్రేక్షయు, ౧౪. ఉపాత్తక్రియానిమిత్తజాత్యభావఫలోత్ప్రేక్షయు, ననఁ జతుర్దశభేదంబులఁ బొల్చు జాత్యుత్ప్రేక్ష. ఇట్లు గుణోత్ప్రేక్షయుఁ, గ్రియోత్ప్రేక్షయు, ద్రవ్యోత్ప్రేక్షయుఁ బరస్పర చతుర్దశభేదంబులంబొంద వాచ్యోత్ప్రేక్ష యేఁబదియాఱగు. జాతియనఁగ సముదాయంబును, గ్రియయనఁగఁ గృత్యంబును, గుణంబనఁగ రూపాదియు. ద్రవ్యంబనఁగ నొకవస్తువు నగు. (జాతి,గుణ,క్రియా, ద్రవ్య, వాచకములనుగూర్చి వెనుక వివరింపఁబడినది) ఏతదవధికాధ్యవసాయమూలంబు లగు నేఁబదియాఱు భేదంబులకు నుదాహరణంబులొనరించినఁ జాలనగుననుభయంబున దిఙ్మాత్రంబుగ లక్ష్యంబులు నిరూపించెద. ఎట్లనిన ౬౮

## ఉపాత్తగుణనిమిత్త జాతిభావస్వరూపోత్ప్రేక్ష

౪౦. భవదీయబాహుపీఠిం
దవిలినభూదేవి యుచితధవలాభమహో
త్సవకృతకుంకుమరుచివై
భవమన నీశౌర్యశోభ పరగు నృసింహా! ౬౯

శౌర్యమనఁ బ్రతాపము. అది యెఱ్ఱగా నుండునని కవి సంప్రదాయము. నీ శౌర్యశోభ నీ బాహుపీఠమునఁ దవిలిన భూదేవి తన కుచితుఁడగు పతి లభించుట యను మహోత్సవముచేఁ (సంతోషముచే) దాల్చిన కుంకుమకాంత్యతిశయ మనఁ బరగును. శౌర్యశోభ యుపమేయము. కుంకుమకాంత్యతిశయ ముపమానము. రుచి పదము జాతివాచకము. అదియు భావరూపము. ఇట నుపమేయ ముపమానముగాఁ దర్కింపఁబడినది. నిమిత్తము సంతోషము. (మహోత్సవము) ఇది గుణము. 'అనన్' ఉత్ప్రేక్షా

'శౌర్యము కుంకుమమనఁబరగును' అన్నఁ జాలును. ఉపమేయమున 'శోభా' పదము, ఉపమానమున 'వైభవము' అనునవి వ్యర్థములే.

౨. ఉపాత్తక్రియానిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష

కం. నిరుపమరణదీక్షావ్రత
విరచితమగు విజయలక్ష్మి వేణియుఁబోలెన్
బరగుఁగ రాళభవత్కర
కరవాలమతల్లి రామబఘునరసింహా! ౭౦

నరసభూపాలా! నీచేతి భయంకరఖడ్గము రణదీక్షావ్రతాచరణమున విప్పకొనిన వేణియనఁ బరగుచున్నది.

ఉపమేయము ఖడ్గము; ఉపమానము వేణి; ఇది జాతివాచకము. మరియు భావరూపము; ఉపమేయ ముపమానముగాఁ దర్కింపఁబడుచున్నది. నిమిత్తము 'వ్రతాచరణము' అను క్రియారూపము.

3. అనుపాత్తనిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష

కం. నీచరణకమలనఖరుచి
వీచికలు నతారివీరవిభవము మగుడం
బ్రోచు సమీచీనసుధా
వీచికలనఁబొల్చు రామవిభునరసింహా! ౭౧

నరసభూపాలా! నీ కాలిగోళ్ళకాంతితరంగములు ప్రణతులగు శత్రువీరులను దిరిగిప్రోచు నమృతతరంగములనఁ బొలుచును.

నఖరుచివీచి యుపమేయము; సుధా వీచి యుపమానము; ఇది జాతివాచకము. భావరూపము. ఇందు నిమిత్తము చెప్పఁబడలేదు.

౪. అనుపాత్తనిమిత్తజాత్యభావ స్వరూపోత్ప్రేక్ష

కం. ఇల నసముద్రమువలె నీ
బలధూళిమొనర్చు సమదపరిపంథివధూ
విలులిత బాష్పోదకముల
జలనిధిశతకము ఘటించు జగతి నృసింహా! ౭౨

నరసభూపాలా! నీ సైన్యధూళి మొదట భూమిని వసముద్రముగాఁ (సము ద్రము లేనిదిగా) జేసి పిమ్మట శత్రురాజుల భార్యల బాష్పోదకములచేఁ బెక్కు సముద్రములను దానియందు ఘటించుచున్నది.

ఇల యుపమేయము; 'అసముద్రము' ఉపమానము. సముద్రశబ్దము జాతివాచకము. 'అసముద్రము' అనుటచే నది యభావరూపమున నున్నది. ఇట గుణక్రియారూపనిమిత్తము చెప్పఁబడలేదు.

ఇట 'అసముద్రమువలె' అనుచోటను, బూర్వపద్యమున 'వేణియుఁబోలెన్' అనుచోటను వలెన్, పోలెన్ పదములుంటవలన నుపమాలంకారముగాదా ? యని భ్రమింపరాదు. ఏలన,

> యదాఽయ ముపమానాంశో లోకత స్సిద్ధి మృచ్ఛతి
> తదోపమైవ యేనేవ శబ్దః సాధర్మ్యసూచకః
> యదా పునరయం లోకా దసిద్ధః కవికల్పితః
> తదోత్ప్రేక్షైవ యేనేవ శబ్దస్సంభావనా పరః.

ఎచ్చట ఉపమానము లోకసిద్ధమో యది యుపమాలంకారము. అచ్చటి 'ఇవ' (వలెన్, పోలెన్ ప్రభృతులు) శబ్దము సాదృశ్యవాచకము. ఎచ్చటి యుపమానము లోకసిద్ధముగాక కవికల్పితమో యది యుత్ప్రేక్షయే. అచ్చటి 'ఇవ' శబ్దము (వలెన్, పోలెన్ ప్రభృతులు) సంభావనాపరము" అని యున్నది.

ఇట 'అసముద్రమువలె' అనునది (ఉపమానము) లోకసిద్ధముగాదు. ఇల సముద్రములు లేనిదెట్లగును ? కానఁ గవికల్పితము. కాన నిచ్చటి 'వలె' పదము వెనుకటి 'పోలెన్' పదమును సంభావనావాచకములే.

## ౫. జాతిహేతూత్ప్రేక్ష

కం. పొందిన నృసింహనృప సం
క్రందను సత్కీర్తిచేతఁ గడఁగి త్రిలోకీ
మందస్మితంబు చేఁబలె
జెందొవ చెలి యంకరుచి విశేషమడంగెన్. ౭౩

నరసభూపాలుని కీర్తిచేఁ ద్రిలోకీమందస్మితంబుచేతవలెఁ జంద్రునియొక్క కళంక మడఁగెను.

హేతువుగానిదానిని హేతువుగా నుత్ప్రేక్షించుట హేతూత్ప్రేక్ష. నరస రాజు కీర్తిచేఁ గళంకమడఁగఁగా దానికి హేతువుగాని త్రిలోకీమందస్మితమును హేతువుగాఁ గవి యుత్ప్రేక్షించినాఁడు. స్మితము జాతివాచకము. అదియు భావ రూపము. ఇట నిమిత్తము కళంకమడఁగుట యను క్రియారూపము. ఇది ఫలము. హేతూత్ప్రేక్షలో నిమిత్తము ఫలము. ఫలోత్ప్రేక్షలో నిమిత్తము హేతువు.

### ౬. జాత్యభావహేతూత్ప్రేక్ష

కం. రేల రవిలేమి నిరులోఁ
త్రైలోక్యంబనియుఁబోలె ధాతసృజించెన్
లాలితనిరుపమతేజో
నాళీకవనాప్తుఁడైన నరసింహేంద్రున్. ౭౪

"రాత్రులందు సూర్యుఁడు లేమిచే ముల్లోకములును నంధకారమయమగును" అని కాఁబోలును బ్రహ్మ తేజస్సూర్యుఁడగు నరసభూపాలుని సృజించెను. బ్రహ్మ తేజస్సూర్యుఁడగు నరసభూపాలుని సృజించుటకు హేతువుగాని రవిలేమిని హేతువుగాఁ జెప్పుటచే హేతూత్ప్రేక్ష. రవి జాతివాచకము. 'రవిలేమి' జాత్యభావ రూపము. జాత్యభావమే యిట హేతువుగాఁ దర్కింపఁబడినది. నరసభూపాల సృష్టి ఫలము.

### ౭. జాతిభావఫలోత్ప్రేక్ష

కం. ప్రమదమునఁ జెలఁగుజలమయ
కమలకు రంగస్థలంబు గావలసిసుమీ!
క్రమమున నరసింహేంద్రుని
సమధికభుజమధ్య మతివిశాలంబయ్యెన్. ౭౫

సంతోషమునఁజెలఁగు జయలక్ష్మికి రంగస్థలము కావలసి నరసభూపాలుని భుజమధ్యము విశాలమయ్యెను.

ఇట భుజమధ్యము విశాలమగుటకు ఫలము 'జయలక్ష్మికి రంగస్థలముగావలసి సుమీ' అని ఫలముగాని రంగస్థలమును ఫలమునుగా నుత్ప్రేక్షించుటచే నిది ఫలోత్ప్రేక్ష. రంగస్థలము జాతివాచకము. ఇది భావరూపము. ఈ జాతివాచకమే యిట ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది.

## ౮. జాత్యభావఫలోత్ప్రేక్ష

కం. తగవరులు జగతి మగువలఁ
దెగటార్పరు; కాన నీదు దృప్తారాతుల్
మగఁటిమిడిగవలసినుమీ
తగభీరువులగుట యోబధరణిపునరసా! ౭౬

ఉత్తములగు వీరులు స్త్రీలను జంపరు. కాఁబట్టి నీ శాత్రవులు తమ మగతనమును దించుకొనుటకునుమీ భీరువులగుచున్నారు.

ఇట భీరువులగుటకు ఫలముగాని 'మగతనమును దించుకొనుట' ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది. 'మగఁటిమి డిగవలసినుమీ' అన 'అపురుషత్వము సిద్ధించుటకై' అని యర్థము. 'అపురుష' అనునది జాత్యభావరూపము. ఇదియే యిట ఫలము. 'అపురుషత్వము' అని ప్రయోగించుటయే లెస్స. 'జాత్యభావము' స్పష్టముగా గోచరించును.

## ౯. క్రియాస్వరూపోత్ప్రేక్ష

చ. అనఘ! నృసింహ! నీఘనజయానకజాత భయానకాధిక
ధ్వనులు గుహాగృహాగ్రములఁ బ్రాలఁ బ్రతిధ్వనిమేదురంబులై
తనరె దిగంతశైలములు తమ్మెనెదుర్కొను వైరికోటికిన్
నిను శరణంబు వేఁడుమని నేర్పున బుద్ధులు నేర్పుకైవడిన్. ౭౭

ఓ నరసభూపాలా! నీ జయదుందుభులయొక్క భయంకర ధ్వనులు తమ గుహాలయందుఁ బ్రతిధ్వనింపఁగా దిగంతపర్వతములు తమలో డాఁగవచ్చు శత్రుకోటినిఁగని మీరు నరసభూపాలునే శరణు వేఁడుఁడని బుద్ధులు నేర్పువిధమునఁదనరెను.

దిగంతశైలము లుపమేయము; 'బుద్ధులు నేర్పుచున్నవోయన' అను క్రియాస్వరూప ముపమానముగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇది భావరూపము. నిమిత్తము ప్రతిధ్వని.

## ౧౦. క్రియాఽభావస్వరూపోత్ప్రేక్ష

చ. భవదరిభూమిపాలకులపాలిక చెంచెతకాత్మ దుర్దశల్
వివరముగా వచింప వనవీథి దయామతిఁబల్కనీనియు

ట్లవిరళ మందమారుత చలాచలచారుపలాశహస్తముల్
తవిలివిదుర్చు శౌర్యగుణధామ! నృసింహనృపాలశేఖరా. ౭౭

నరసభూపాలా! నీ శత్రుకాంత యడవిలోఁ జెంచెతఁ దన దుర్దశను దెలుపుచుండఁ (తెలిపి వాపోవుచుండ) గా విని వనవీథి కనికరించి 'పలుకకుండఁజేయుటకో' యనఁ దన చిగురాకుచేతులను విదిలించుచున్నది. (పలుకవలదని యోదార్చుచున్నది.)

ఇట వనవీథి యుపమేయము; 'పలుకకుండఁజేయుటకోయన' నను క్రియాఽభావరూపమగు నుపమాన ముత్ప్రేక్షింపఁబడినది. పలాశచాలనము నిమిత్తము.

## ౧౧. క్రియాహేతూత్ప్రేక్ష

చ. మొగముముడించెఁగచ్ఛపము; మోమునఱవాంచె భుజంగపుంగవుం
డగము చలింపఁగావెఱచె; నాదివరాహము మోరత్రోపునం
దెగువఁబయోధిఁజొచ్చె; సుదతీమకరాంక! నృసింహభూప! నీ
జగదభినంద్యభూభరణశక్తికృతాభిభవంబుచేబలెన్. ౭౮

నీ భూభరణశక్తిచేఁ గలిగిన పరాభవముచేఁ గాఁబోలు నాదికూర్మము మొగము ముడుఁచుకొనెను; ఆదిశేషుఁడు మోము నలఁతిగా వంచెను. కులపర్వతము కదలలేకపోయెను. ఆదివరాహము ముట్టెతోఁ ద్రోసికొనుచు సముద్రమునఁ దూఱెను.

ఇట నాదికూర్మాదులు ముఖసంకోచాదులు పొందుటకు హేతువుగాని పరాభవక్రియ హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినది.

## ౧౨. క్రియాఽభావ హేతూత్ప్రేక్ష

చ. సరసనృసింహ! నీయశముఁ జంద్రునిఁద్రాసున ధాత దూఁచినన్
సరభసవృత్తినెత్తుడిగి సామ్యనిరూఢి వహింపలేమినో
యరయ గురుత్వహేతుమలినాంకనిరంకుశ లోహటంక సం
కరమును జెందెఁజంద్రుఁడు జగంబుమృగంబని చూచుచుండఁగన్.

బ్రహ్మ నీ కీర్తినిఁ జంద్రునిఁ ద్రాసునఁబెట్టి తూఁచఁగాఁ జంద్రుఁడు సామ్యము హింపలేమిఁ గాఁబోలు నెత్తుడిగి యనఁగాఁ ద్రాసునుండి క్రిందికి దిగి (ఆకాశమునుండి దిగి) బరువువహించి సరివచ్చుటకై, తన యంకరూపమగు నినుపగుండును దాల్చియుండెను. దీనిని లోకము మృగమని తలంచును.

చంద్రుఁ డంకమును ధరించుటకు హేతువుగాని 'సామ్యనిరూఢి వహింప లేమినో' అను క్రియాఽభావము హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇది 'అంక టంకి' అను రూపకానుప్రాణితమై యున్నది.

౧౩. క్రియాఫలోత్ప్రేక్ష

చ. నరనుతశౌర్యవైభవసనాథ! నృసింహధరాధినాథ! నీ
వరజయభేరిభాంకృతిరవంబు దివింబరిపూర్ణమయ్యె నా
సురగణికాపరంపరకుఁ జోద్యముగాననురూపనాయక
స్థిరపరిరంభసంభ్రమవిశేషముఁ దెల్పఁగ నేగుకై వడిన్. ౬౧

నీ జయభేరీధ్వని దేవతాస్త్రీలకనురూపనాయకపరిరంభవిశేషముఁ దెల్పుటకు నేగుచున్నదో యన్నట్లాకాశమున నిండెను.

భేరీధ్వని యాకాశమున నిండుటకు ఫలముగాని 'యనురూప...విశేషమును దెల్పుటకు నేగుట' ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది. అనఁగాఁ గ్రియయే ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది.

౧౪. క్రియాఽభావఫలోత్ప్రేక్ష

ఉ. గంధపుఁగొండపై నివముఁగ్రమ్మెడి మాకీర్తికనిర్ఝరీతటీ
చందనవాటిలోఁ గనకసైకతసాంద్రగుహాగృహావళిం
జెంది ఫణీంద్రకన్యలు నృసింహునమందయశోమరంద ని
ష్యందముఁ గ్రోలుచుందురు విషాగ్ని వహింపఁగలేమికింబలెన్. ౬౨

నాగకన్యలు మలయపర్వతము నందలి తామ్రపర్ణీనదీతీర చందనవాటికలోఁ గనకసైకతసాంద్ర గుహాలయందు విషాగ్ని వహింపకుంటకై కాఁబోలు నరసభూపాలుని కీర్తిమరందమును గ్రోలుచుందురు. యశోమరందపానమునకు ఫలముగాని 'విషాగ్నిని దప్పించుకొనుట' ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది. 'విషాగ్ని వహింప లేమి' అనునది క్రియాఽభావరూపము.

౧౫. గుణస్వరూపోత్ప్రేక్ష

కం. నరసింహుభాగ్యసూచక
సురుచిరదృక్కోణశోణశోభ చెలంగెన్

శరణాగతభరణాయతి
శరదుగ సాకారమగుదయారస మనఁగన్. ౮౩

నరసభూపాలుని దృక్కోణశోణశోభ యుపమేయము. అది సాకారమగు దయారసము అను గుణస్వరూపమగు నుపమానముగా నుత్ప్రేక్షింపఁబడినది. శరణాగతభరణ మను క్రియ నిమిత్తము.

౧౬. గుణాభావస్వరూపోత్ప్రేక్ష

కం. బలశశిహరభామలకును
బోలుపుగ మితిలేనిమాడ్కి మొలబంటై యో
మ్ములబంటై, మెడబంటై
తలమునకలునయ్యె నరసధరణిపుకీర్తుల్. ౮౪

నరసభూపాలుని కీర్తులు బలరామునకు మొలబంటిగాఁ (వాని నల్లని వస్త్రమును గప్పుచున్నది.) జంద్రునికి రొమ్ములబంటిగా (వాని కళంకమును మాపుచున్నది.) హరునకు మెడబంటిగాఁ (కంఠమునందలి నలుపును నడఁచుచున్నది.) భారతికిఁ దలమునకలుగా నయ్యెను.

కీర్తులు మితిలేనివి. ఇటఁ గీర్తు లుపమేయము. 'మితిలేనివి' అని మితిరూప గుణాభావ ముపమానముగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇట నిమిత్తమనుపాత్తము.

౧౭. గుణహేతూత్ప్రేక్ష

మ. అరయన్ శ్రీనరసింహుకీర్తిచయ ముద్యన్ముఖ్యవర్ణోదయా
కరసామ్యంబున ధాతపైఁగినిసియేకాఁబోలుఁ దత్తైన్యంధవో
త్కరసౌభాగ్యముఁ, దన్మహాసనరుచిం గారించి భాషావర
స్థిరరూపంబయి తా సృజించె నరులన్ శ్రీకంఠసంకాశులన్. ౮౫

నరసభూపాలుని కీర్తి ముఖ్యవర్ణోదయాకరసామ్యముచేఁ (ముఖమునఁ బుట్టిన వర్ణము బ్రాహ్మణవర్ణము - బ్రాహ్మణవర్ణముయొక్క పుట్టుకకుఁ గారణమైనవాఁడు బ్రహ్మ. 'ముఖ్యవర్ణము' అనఁ దెలుపు. కీర్తి శ్వేతవర్ణోదయమునకుఁ గారణమైనది. కాన బ్రహ్మయుఁ గీర్తియు ముఖ్యవర్ణోదయాకరములు.) గాఁబోలు బ్రహ్మపైఁ గినిసి యాతని వాహనములగు హంసల సౌభాగ్యమును, అతని యాసనమగు శ్వేతపద్మముయొక్క కాంతిని బాధించి బ్రహ్మత్వమును వహించి శివసన్నిభులగు నరులను సృజించెను. అనఁగా నెల్లరను దెల్లఁగాఁ జేసెను.

ఇటఁ గీర్తి హంసల సౌభాగ్యమును, శ్వేతపద్మద్యుతినిఁ గారించుటను నరు లను శివసన్నిభులను జేయుటకును హేతువుగాని 'ముఖ్యవర్ణోదయము' అను గుణము హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినది.

### ౧౮. గుణాభావహేతూత్ప్రేక్ష

కం. హరిగిరిఁ దెగడి సత్పథ
పరిచయలంఘన మొనర్చి భ్రమియించుఁజుమీ!
నరసింహభూమిపాలుని
యరుదగు సత్కీర్తి యవినయంబునఁబోలెన్. ౮౬

నరసభూపాలుని కీర్తి యవినయముచేతఁ గాఁబోలు విష్ణుదేవుని గౌరవమును దెగడి సత్పథము (ఆకాశము - సన్మార్గము) నతిక్రమించి తిరుగును.

ఇటఁ గీర్తి హరిగిరిని దెగడుటకును, సత్పథ లంఘనమునకును హేతువుగాని 'అవినయము హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినది.' అవినయము అన వినయాభావము. కాన గుణాభావహేతూత్ప్రేక్ష.

### ౧౯. గుణఫలోత్ప్రేక్ష

కం. వడి నీకీర్తులఁబోలెడి
కడిమిం దనకందు దెలుపుగావలసిచుమీ!
కడకడలి యెడలఁగ్రుంకును
వెడవిల్తునిమామ యోబవిభునరసింహా! ౮౭

చంద్రుఁడు నీ కీర్తినిఁ బోలవలయునని తన మచ్చను దెలుపుఁజేసికొనుటకు సుమీ పడమటిసముద్రమున మునుఁగుచున్నాఁడు.

చంద్రుఁడు పడమటి సముద్రమునఁ బడుటకు ఫలముగాని 'తన మచ్చను దెలుపుఁ జేసికొనుట' ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇట 'తెలుపు' గుణము. అది ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది.

### ౨౦. గుణాభావఫలోత్ప్రేక్ష

చ. తెగువరియై చెలంగు భవదీయకృపాణము వైరికోటియం
దగణితదానకేళిరతమయ్యెను జీవనమీఁదటన్నలో
భగుణము లేమికింబలె విపక్షనృపాలురకెల్ల జీవనం
బొగిఁద్రుణవు లిచ్చు విజయోన్నత! శ్రీనరసింహభూవరా! ౮౮

సాహసి యగు నీ ఖడ్గము వైరులయెడ దానకేళి (వితరణకేళి – ఖండనక్రియ) రతమయ్యెను, జీవనమును (తన ప్రాణమును) నీయదన్న లోభగుణము లేకుంటకుఁ (ఈతని ఖడ్గము దానకేళిరతమే కాని జీవనమునుమాత్ర మీయదు. దీనికి లోభ గుణము కలదు. అని లోకులనుచున్నారు. ఆ యప్రతిష్ఠ లేకుంటకు) గాఁబోలు శత్రురాజులకుఁ దృణరూపమున జీవనము నిచ్చుచున్నది.

ఇట శత్రురాజులకుఁ దృణవృత్తితో జీవనమిచ్చుటకు ఫలముగాని లోభ గుణాభావము ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది.

## ౨౧. ద్రవ్యస్వరూపోత్ప్రేక్ష

సీ. సటలెకానొకకొంత చాలదుపౌరుషం;
బాయుధప్రౌఢి యింతైనలేదు;
జననమొందినఁ బ్రదోషంబుపాలౌట; మా
టికిఁబుట్టినట్టి చోటికినిఁ జేటు
నెఱఁజిన్నవాని కెన్నికగానితనబల్మి;
ద్వేషిగన్నను నోఱుదెఱచికొనుట;
పాటింప నోరి బొబ్బాటమేవడిగాని
ఘోరాజిలో బుసకొట్టుచుంట;
గీ. కొదవ దనకంచుఁ గ్రమ్మఱ నుదితుఁడైన
యల్ల నరసింహుఁడునుబోలె నసమసమర
నృమరఘోరప్రతాపుఁడై చెలఁగుదార
సరసగుణహార ! మోబయనరస ధీర ! ౮౯

"తొంటి నరసింహావతారమునఁ దనకుఁ గలిగిన పై కొదవలను దీర్చుకొనుట కుదయించిన యా నరసింహుఁడవో యన్నట్లున్నావు."

ఇట నరసభూపాలుఁడు నరసింహుఁడో యన్నట్లు" అనుచోట ద్రవ్య స్వరూపోత్ప్రేక్ష. నరసింహపదము ద్రవ్యవాచకము. నిమిత్తము ప్రతాపగుణము.

## ౨౨. ద్రవ్యాభావస్వరూపోత్ప్రేక్ష

సీ. పొగడొందుచదలేటి పొందామరలఁ గోసి
శిరసుల నొఱప్పుఁగా జెరువువారు

చవిదేఱు కల్పకాసవరసంబులకుఁ ద
త్కోరకంబులతావిఁ గూర్చువారు
వేల్పుఁగన్నియల నేవేళ దేలీయంపు
బిట్టుచేఁతల గాసిపెట్టువారు
అమరునే జాజల్లులగుననిఁ జేసితా
పసుల కూర్చము లూడ్వఁబఱచువారు
గీ. నగుచు భవదసివిదళితయవనన్రుపతు
లహరహము రాయిడినొసర్ప నమరపురము
వాసవుఁడు లేనికై వడి వరలుచుండు
నరసుతాటోప! యోబయనరసభూప! ౯౦

'స్వర్గము అవాసవముగా (వాసవుఁడు లేనిదిగా) నున్నది' అనుచోట ద్రవ్యాభావస్వరూపోత్ప్రేక్ష. 'రాయిడి' అను క్రియ నిమిత్తము.

౨౩. ద్రవ్యహేతూత్ప్రేక్ష

కం. నరసింహ! యోబభూవరు
నరసింహ! భవద్భుజాగ్రనటదసిచే భూ
పరిచితరాహువుచేఁబలె
నరితేజోభానుబింబ మపహృతమయ్యెన్. ౯౧

నరసభూపాలా! నీ చేతికత్తిచే భూమికిదిగిన రాహువుచేతవలె శత్రుతేజోరూపమగు సూర్యబింబ మపహృతమైనది.

ఇట శత్రుతేజోరూపమగు సూర్యబింబాపహరణమునకు హేతువుగాని రాహువు హేతువుగా నుత్ప్రేక్షింపఁబడెను. తేజోఽపహరణము నిమిత్తము. రాహువు ద్రవ్యవాచకము.

౨౪. ద్రవ్యాభావహేతూత్ప్రేక్ష

చ. స్థిరబల! యోబభూవరునృసింహ! భవన్నవకీర్తి భూనభోం
తరములనిండఁ జద్రుచివితానములోన విలీనమౌ సుధా
కరనిధిలేమిచేఁబలెఁ బ్రశాంత నిరంతరతావకాశయాం
తరసుఖవాసమందె మురదానవభంజను డెల్లకాలమున్. ౯౨

నరసభూపాలా! నీకీర్తి భూమ్యాకాశముల నిండఁగా నీ కాంతిసమూహములో దాఁగినదగుటచే నమృతసముద్రము లేకుంటచేఁ గాఁబోలు శ్రీ మహావిష్ణువు నీ హృదయమున వసించెను.

శ్రీ మహావిష్ణువు నరసభూపాలుని హృదయమున వసించుటకు హేతువుగాని యమృతసముద్రాభావము హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినది. అమృతసముద్రము ద్రవ్యము.

## ౨౫. ద్రవ్యఫలోత్ప్రేక్ష

ఉ. రాజపురందరుండవయి రంజిలు నీ కుచితంబుగాఁగ నీ
రాజితకీర్తి యభ్రగజరాజయి యున్కికిఁగాదె తారకా
రాజ కరాంబుశీకర పరంపరలుం దెలిమబ్బుజల్లులుం
దేజములో ధరించె సుదతీమకరాంక! నృసింహభూవరా! ౯౩

నీవు రాజేంద్రుఁడవు. నీ కీర్తి నీ యింద్రత్వమున కుచితముగా నైరావతమగుటకుఁ గాఁబోలు నక్షత్రరూపశీకర సమూహమును దెల్లమబ్బులరూపమగు చామరములను ధరించెను.

కీర్తి తారకాశీకర సమూహమును, దెలిమబ్బుజల్లులను వహించుటకు ఫలముగాని 'యైరావతమగుట' ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది. ఐరావతము ద్రవ్యము.

## ౨౬. ద్రవ్యాభావ ఫలోత్ప్రేక్ష

చ. తనరు నసంఖ్యవాజి గజదారుణమై తగు నాదుమ్రోల నే
డెనిమిది సైంధవేభముల నీడుగఁదాల్చుట యెట్లటంచు నా
కినుక నభంబు లేకునికికిన్ బలె శ్రీ నరసింహు జైత్రవా
హిని యనిలోన నింగికెగయించు నుదంచిత రేణుపుంజమున్. ౯౪

నరసభూపాలుని సైన్య మసంఖ్యవాజిగణములు గలిగియుంటచే నాకాశము నాముందేడు గుఱ్ఱములను, (సూర్యాశ్వములు) ఎనిమిది యేనుఁగులను (దిగ్గజములు) దాల్చుట యెట్లు? అని యా యాకాశమును లేకుండఁజేయుటకుఁగాఁబోలు ధూళిని నింగికి విసరుచున్నది.

ఇట సైన్యము ధూళిని నాకాశమున కెగయఁజేయుటకు ఫలముగాని నభోఽభావము ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇది ద్రవ్యాభావము.

ఇచ్చట నీ విమర్శమును దెలియవలెను:—ఉత్ప్రేక్షయందుఁ బ్రకృతమప్రకృత ధర్మసంబంధమును బట్టి యప్రకృతముగాఁ దాదాత్మ్యసంభావన చేయఁబడునని చెప్పితిమి. స్వరూపోత్ప్రేక్షయందు మాత్రమే ప్రకృతాప్రకృతములు వివిక్తముగా నగపడును. ఎట్లన, 'నీవానరసింహుఁడవో' అన్నట్లున్నావు. నీవు ప్రకృతము; నర సింహుఁడు అప్రకృతము. కాని హేతుఫలోత్ప్రేక్షలలో హేతువు గానిదానిని హేతువుగా, ఫలముగానిదానిని ఫలముగా, నుత్ప్రేక్షించుచున్నాము. అట నప్రకృత మనఁగా నుపమానముండ నేయుండదు. ఎట్లనఁ బైలక్ష్యములలోని జాతిహేతూత్ప్రేక్షోదాహరణమున "కళంక కాంతి నరసభూపాలుని కీర్తిచే నడఁగఁగాఁ ద్రిలోకీ మందస్మితమును హేతువుగాఁ జెప్పినాఁడు."

ఇటఁ బ్రకృతము కళంకమడఁగుట; అప్రకృతములేదు. అనఁగా నుపమానము లేదు. జాతిఫలోత్ప్రేక్షోదాహరణమగు భుజమధ్యము విశాలమగుటకు ఫలము జయ లక్ష్మికి రంగస్థలము కానుండుటగా ననఁగా ఫలముగానిదాని ఫలమునుగాఁ జెప్పెను. భుజమధ్యము విశాలమగుట ప్రకృతము. అప్రకృతము చెప్పఁబడలేదు. కాన "ప్రకృత మున కప్రకృతతాదాత్మ్యసంభావన ముత్ప్రేక్ష" అను లక్షణ మెట్లు సరిపోవును? అన్నచో వినుఁడు. హేతుఫలధర్మోత్ప్రేక్షోదాహరణములలోఁగూడఁ దాదాత్మ్య సంభావనమే యుండవలెను. ఎట్లన, "నరసభూపాలుని కీర్తిచే నడఁగిన కళంకమును త్రిలోకీమందస్మితముచే నడఁగిన కళంకముగాఁ దాతాత్మ్యసంభావన చేయవలెను. ఇట్లే స్వభావసిద్ధముగా విశాలతనుబొందిన భుజమధ్యమును జయలక్ష్మి రంగస్థలార్థ ముగా విశాలతనుబొందినభుజమధ్యముగాఁ దాదాత్మ్యసంభావన సేయవలెను. ఈ హేతు ఫలోత్ప్రేక్షోదాహరణములలోఁ గూడఁ బైవిధమున రెండువిధములగు కళంకము లకును, రెండువిధములగు విశాలతలకును దప్పక దాదాత్మ్యము చెప్పుకొనవలయును.

'లింపతీవ తమోఽఙ్గాని వర్షతీవాంజనం నభః' (తమస్సు శరీరములను బూయుచున్నట్లున్నది; ఆకాశము చీఁకటిని వర్షించుచున్నట్లున్నది)

ఇటఁ దమోవ్యాపనరూపమగు ధర్మము తమోలేపనముగా నుత్ప్రేక్షింపఁ బడుచున్నది. ఇట్లే

> పినష్టీవ తరంగాగ్రై స్సముద్రః ఫేనచందనం
> తదాదాయ కరైరిందు ర్లింపతీవ దిగంగనాః.

సముద్రుఁడు ఫేనచందనమును దరంగాగ్రములచే నూఱుచున్నట్లున్నాఁడు. చంద్రుఁడు దానినిఁగొని దిగంగనలకుఁ బూయుచున్నట్లున్నాఁడు.

ఇటఁ బ్రేరణమే (ఫేనప్రేరణము) పేషణముగాఁ గరవ్యాపనమే దిగంగనా లేపనముగా నుత్ప్రేక్షింపఁబడుచున్నది. అయితే వ్యాపన ప్రేరణాదిపదములు లేవే

యనవచ్చును. ఉత్ప్రేక్ష యధ్యవసాయగర్భము గాన నతిశయోక్తియందువలెనే విషయనిగరణము (ఉపమేయము గానరాకుంట) సంభవించునని గ్రహింపవలెను.

మరియు నుత్ప్రేక్షాలక్షణపద్యమున "గుణక్రియాది యోగముచే" అని ప్రకృతమున కప్రకృత తాదాత్మ్యసంభావన సేయుటలో గుణక్రియాది నిమిత్తము లుండవలెనని చెప్పితిమి. ఉదాహరణములందు గుణ క్రియా నిమిత్తములు మాత్రమే చూపితిమి. ఆదిశబ్దముచే గ్రాహ్యమగునదేమి? అని శంక గలుగుచున్నదిగదా! గుణక్రియానిమిత్తము మాత్రమేకాక గుణాభావనిమిత్తము, క్రియాఽభావనిమిత్తము గూడ నొక్కొక్కచో నుండును. ఎట్లన,

మనసి సంతమివ ప్రియమీక్షితుం నయనయోః స్పృహయాంతరుపేతయోః
గ్రహణశక్తిరభూదిదమీయయోరపి న సమ్ముఖవాస్తుని వస్తుని

(ఒక యువతికి) తన హృదయగతప్రియునిఁ జూచుటకోయన్నట్లు మనస్సునఁ బ్రవేశించిన కన్నులకు సమ్ముఖమునందలి వస్తువుయొక్క గ్రహణశక్తి నశించెను.

ఇట హృదయగతప్రియునిఁ జూచుటకు నేత్రములు లోపలఁ బ్రవేశించినట్లుత్ప్రేక్షించుటకు బాహ్యవస్తుగ్రహణశక్త్యభావము నిమిత్తము (గుణాభావము నిమిత్తము.)

వతంసనీలాంబురుహేణ కిం దృశా విలోకమానే విమనీబభూవతుః
అపి శ్రుతీ దర్శనసక్తచేతసాం న తేన తే శుశ్రువతు ర్మృగీదృశాం.

కర్ణావతంసమగు నల్లకలువ యను కంటితోఁ జూచుచున్నవేమో! చెవులుగూడా విమనస్కములు (మనస్సులేనివి) అయినవి. కావుననే దర్శనాసక్తలగు నా యువతులకు నేమియు వినఁబడలేదు.

ఇట శ్రోత్రేంద్రియగతమగు విలోకనైకాగ్రతను నుత్ప్రేక్షించుటయందు శ్రవణక్రియాఽభావము నిమిత్తము.

ఇంకను నీ నిమిత్త మొక్కొక్కటియేకాక సముచ్చయముగాఁగూడా ననఁగాఁ బెక్కునిమిత్తము లొక్కయెడలనే కానఁబడును. ఎట్లన,

అవైమి హంసావళయో వలక్షా స్త్వత్కీర్తి మూర్తే శ్చపలాః పులాకాః
ఉడ్డీయ యుక్తం పతితాస్స్రవంతీశశంతపూరం పరితః ప్లవంతే.

తెల్లని హంసలను నీ కీర్తిపులాకలుగాఁ (శకలములు) దలఁతును, ఏలన, నవి గిరినదులందుఁబడి తేలియాడుచున్నవి.

హంసలను గీర్తిపులాకలుఁగాఁ దలఁచుటలో ధావళ్యగుణమును, నీటిపైఁ దేలి యాడుట యను క్రియయును, (గుణ క్రియలు రెండును) నిమిత్తములయ్యెను. ఇట్లే గుణాభావ, క్రియాభావములును నొక్కొక్కచో నిమిత్తములు గావచ్చును.

ఒక్కొక్కచో జాతి ద్రవ్యములును గూడ నిమిత్తములగును. ఎట్లన,

ద్రోణ స్స తత్ర విశరిష్యతి భాగ్యలభ్యసౌభాగ్యకార్మణమయీ ముపదాం గిరిస్తే
తద్ద్వీపదీప ఇవ దీప్తిభి రోషధీనాం చూడామణిర్జలదకజ్జలదర్శనీయః.

ఇట ద్రోణాచలమును దీపముగా నుత్ప్రేక్షించుటలోఁ దత్పరిరూఢములైన యోషధిదీప్తులును, దానిపైఁగల జలదకజ్జలమును నిమిత్తము. దీప్తికజ్జలపదములు జాతివాచకములు. కావున జాతివాచకముగూడ నిమిత్తము గావచ్చును.

నిశాసు మూర్ధ్ని స్ఫురతా యత్సౌధో రాజతీందునా
శ్రీకంఠో భక్తరక్షార్థం సన్నిధానం భజన్నివ.

రాత్రులందు శిరస్సున వెలుఁగుచున్న చంద్రునితో నా (బాణాసురుని) సౌధము భక్తరక్షణార్థము శ్రీకంఠుఁడు సన్నిధియం దున్నట్లున్నది.

ఇట బాణాసురసౌధమును శివుఁడుగా నుత్ప్రేక్షించుటకు శిరస్సున వెలుఁగు చున్న 'చంద్రుఁడు' నిమిత్తము. చంద్రుఁడు ద్రవ్యవాచకము.

కావున గుణ క్రియలేకాక గుణాభావ, క్రియాభావములును, నిమిత్తములుగా నుండవచ్చును. అవి సముచ్చయరూపమునఁగూడ నుండవచ్చును. మరియు నిమిత్తము గుణ క్రియా రూపముననేకాక జాతి ద్రవ్య రూపమునఁ గూడ నుండవచ్చును.

ఇదంతయు 'ఆది' పదముచే గ్రాహ్యము.

కం. ధర వాచ్యోత్ప్రేక్షకు నుదా
హరణము లివి గొన్ని కడమ యన్యోక్తులుం
దరయఁగఁదగు; గమ్యోత్ప్రే
క్ష రచింపఁగలేదు నేర్పుచాలమి నిందున్. ౯౨

గమ్యోత్ప్రేక్షకు నుదాహరణము నిత్తును; కనుఁడు.

కం. చెలికాఁడ! నీదు డెందము
నెలవగుటం బెక్కుచుంది నెలఁతలకందా
చెలి తన్నిముడ్చుకొన ని
చ్చలుఁ దనలేమిని సతికృశింబొనరించున్.

'తన్నిముడ్చుటకోయని' అని యున్నచో వాచ్యయగును. అదిలేమిని గమ్య. కావ్యప్రకాశకారుఁడు దీనిని వ్యంగ్యోత్ప్రేక్షగానే యుదాహరించెను.

గమ్యోత్ప్రేక్ష, వ్యంగ్యోత్ప్రేక్షల భేదమును జిత్రమీమాంసాకారుఁడు దెలిపినదానిని ద్వితీయాశ్వాసమున ౧౭౮ పద్యముక్రింద వ్రాయఁబడినది. చూచు కొనవలెను.

## ౨౭. అతిశయోక్తి

కం. ఉపమేయ మింత తడవక
యుపమానమె నుడువ నతిశయోక్తి మహా
నిపుణోక్తి మూలమై తగు
నపరిమితప్రౌఢి నదియు నైదువిధములై. ౯౬

ఉపమేయము నధఃకరించి యనఁగా విషయనిగరణమునేసి యుపమానమును మాత్రమే చెప్పుట యతిశయోక్తి. అది కవిప్రౌఢోక్తి ప్రధానము (మహానిపుణోక్తి మూలము) అది పంచవిధము.

విషయనిగరణమన విషయమును జెప్పకుండుటగాదు. విషయమును నధఃకరించుట మాత్రమే. "విషయస్యానుపాదానేఽప్యుపాదానేఽపి సూరయః। అధఃకరణమాత్రేణ నిగీర్ణత్వం ప్రచక్షతే" (విషయమును జెప్పినను జెప్పకున్నను ననఁగాఁ బ్రయోగించినను బ్రయోగింపకున్నను నధఃకరించుటవలననే నిగీర్ణత్వము (నిగరణము) సిద్ధించును. అనఁగా విషయనిగరణమన విషయమునకు (ఉపమేయమునకు) విషయిచే (ఉపమానముచే) అపకర్షమును దోఁపఁజేయుట. ఇట్టి విషయనిగరణ ముత్ప్రేక్షయందును, నతిశయోక్తియందునుగూడ నుండును. ఎట్లన, "నీ ముఖమును జంద్రుఁడని శంకించుచున్నాను" అనుచో విషయమగు ముఖమునకు విషయియగు చంద్రునిచే న్యూనత్వము తోఁచుచున్నది. ఈ న్యూనత్వము 'శంకించుచున్నాను' అనుదానిచేఁ గలుగుచున్నది. 'చంద్రుఁడితఁడు' అన్నపు డతిశయోక్తిలోఁ గూడ విషయమగు ముఖమునకు విషయి యగు చంద్రునిచే న్యూనత్వము తోఁచుచున్నది. ఎట్లన, విషయిని మాత్రమే గ్రహించి విషయమును గ్రహింపకధఃకరించెను. పైని విషయము గ్రహింపఁబడినను 'శంకించుచున్నాను' అను పదముచే న్యూనత్వము సంభవించుచున్నది.

కావున నుత్ప్రేక్షయందును, నతిశయోక్తియందును విషయాధఃకరణము సమానమే. రెండును నధ్యవసాయగర్భములే. ప్రకృతముతో నప్రకృతమున కభేదప్రతిపత్తియే రెంటియందును గలుగును. అయినచో భేద మేమనవచ్చును? వినుఁడు! ఉత్ప్రేక్షలో నధ్యవసాయము సాధ్యము. అతిశయోక్తిలో నధ్యవసాయము సిద్ధము. అనఁగా నుత్ప్రేక్షయందు 'నూనంచంద్రః' అనుచో విషయి(ఉపమానము)అనిశ్చిత

ముగా నిర్దేశింపఁబడుటచే నధ్యవసాయము సాధ్యము. అనఁగా నిట విషయము విషయిగా నిశ్చయింపఁబడలేదు. అతిశయోక్తిలో (చంద్రోదయం) విషయము విషయిగా నిశ్చయింపఁబడుటవలన నధ్యవసాయము సిద్ధము.

గీ. పరఁగ సంబంధమం దసంబంధమనఁగ
మఱి నసంబంధమందు సంబంధమనఁగ
భేదమందు నభేద; మభేదభేద
భావమును; గార్యహేతువిపర్యయమన. ౯౭

సంబంధమున్నను లేకున్నట్లు చెప్పుట, సంబంధములేకున్న నున్నట్లు చెప్పుట; భేదమున్నను లేనట్లు చెప్పుట; భేదములేకున్నను నున్నట్లు చెప్పుట; కార్యకారణ భావముయొక్క విపర్యయము. (తలక్రిందులు) చెప్పుటయని యతిశయోక్తి పంచ విధము.

౧. సంబధాసంబంధాతిశయోక్తి

మ. అలఘుప్రౌఢిమ నీదు దానవిభవం బాలించి యాలించి ని
చ్చలు దానస్ఫురణంబడంగె సురభూజశ్రేణికిం; గల్గినా
బలభిద్వారణ గండశాఖకలన ప్రత్యగ్రలగ్నాధికో
జ్జ్వలదానంబొక వేళఁగల్గు; నరసత్క్ష్మాపాలచూడామణీ! ౯౮

నీదానవైభవమును విని కల్పవృక్షములకు దానవైభవ మడఁగెను. ఒకవేళఁ గలిగినను నైరావతము దన గండస్థలమును రాచుకొనుటచే నంటుకొన్న దానమే (మదము) కలుగును.

కల్పవృక్షములకు దానసంబంధమున్నను (దానము గలిగియున్నను) నసంబంధము వర్ణింపఁబడినది.

కం. సుదతీ! అనుక్షణంబును
నెదుగుకొనుచువచ్చు నీదు నీచన్నవకె
య్యదిచాలినంతదేశము?
త్వదీయకరిలతల నడిమిభాగమునందున్

చనుఁగవకు వలసినంతప్రదేశమున్నను లేనట్లు వర్ణింపఁబడినది. ఇదియు సంబంధాసంబంధాతిశయోక్తియే.

## ౨. అసంబంధసంబంధాతిశయోక్తి

ఉ. చందనశైలసానువులఁ జాలఁజెలంగు భుజంగబాలికా
బృందము శ్రీనృసింహవిభుఁ బేర్కొని పాడఁ దదీయగానని
ష్యందములాను వేడ్కఁ జెరయంగఁ గురంగతురంగ మేగమిన్
మందగతిప్రసంగములుమానవు దక్షిణగంధవాహముల్. ౯౯

మలయపర్వతసానువులందు నాగకన్యలు నరసభూపాలునిఁ గూర్చి పాడుచుండఁగా నా గానరసమును ద్రాగు కోరికతోఁ దన వాహనమైన కురంగము నడవకుంటవలన దక్షిణ మారుతము మెల్లఁగా నడచుచుండెను.

కురంగములకు నాగకన్యల గానరససంబంధము లేకున్నను నున్నట్లు చెప్పఁబడినది. కాన నసంబంధసంబంధాతిశయోక్తి.

## 3. భేదాభేదాతిశయోక్తి

కం. అగునొకటి కర్ణభూషణ;
మగునొక్కటి కర్ణవైరి; హరిచందనపుం
జిగురును నీచేఁజిగురును
బొగడొందుట కిదియె భేదము; నృసింహనృపా! ౧౦౦

హరిచందనపల్లవము కర్ణభూషణము. నీ హస్తపల్లవము కర్ణవైరి. ఇదియే భేదము. అని భావము. భేదమున్నను నభేదము చెప్పవలసియుండఁగా 'నిదియే భేదము' అని భేదమే యిటఁ జెప్పఁబడుచున్నది. ఇది యుదాహరణార్హము గాదు.

పల్లవతః కల్పతరో రేవ విశేషః కరస్య తే వీర!
భూషయతి కర్ణమేకం పరస్తు కర్ణం తిరస్కురుతే.

అను శ్లోకమునకుఁ దైపద్య మనువాదము. ఈ శ్లోకమును వ్యతిరేకాలంకారమున కుదాహరణముగాఁ గువలయానందకర్త యిచ్చియున్నాఁడు. ఈ క్రిందిపద్య ముదాహరణీయము.

చ. విలసిలు శాఖియొండు వినువీధిని; నాపయిఁ దైఁడిమెట్లలో
మలఁచిన యింద్రనీలమయ మార్గముగాలుఁ; దదగ్రమందు వ
ర్తిలును గిరిద్వయం; బది సుకృజ్జనగమ్యము; చందనాంక; మా
స్థలమున నేగ లభ్య మమృతంబు సుధానిధియుంటఁ జెంగటన్.

మధ్యభాగమందలి నాభి, వళులలోనున్న నూఁగారు, స్తనములు, చందన లేపము, అధరామృతము, ముఖము, అను ప్రకృతములు చెప్పఁబడక వానితో సంబంధించిన యప్రకృతములు మాత్రమే చెప్పఁబడినవి. వాస్తవముగాఁ బ్రకృతాప్రకృతములకు భేదమున్నను గవిప్రౌఢోక్తిచేఁ బ్రకృతము చెప్పఁబడక తదభేదముగా నప్రకృతమే చెప్పఁబడినది. దీనినిఁ గువలయానందకారుఁడు రూపకాతిశయోక్తి యనెను. ఈ భేదమున విషయ నిగరణము చేయఁబడును. దీని నాంగ్లమున 'Antonomasia' అందురు.

## ౪. అభేదభేదాతిశయోక్తి

సీ. అమృతమూర్తికిఁ గళంకావాప్తి యెట్లని
మిహికాంశునిఁ గళంకరహితుఁ జేయ
లోకబాంధవున కుగ్రాకారమెట్లని
భానుఁ బార్వణశీత భానుఁ జేయ
మృత్యుంజయునకేల మెడచుట్టు విసమని
గరళకంఠుని సితకంఠుఁ జేయఁ
దలఁపోయు, నుజ్జ్వైన దాతకీమాలిన్య
మనుచితంబని ఘను నమలుఁ జేయ

గీ. మహిత భవదీయసత్కీర్తి మధురవిధుర
వక్రిమగు బ్రహ్మసృష్టి నతిక్రమించి
కమలజాండ కరండంబుఁ గడచివెడలె
వైరిగజసింహ! మోబయనారసింహ! ౧౦౧

అభేదమున్నను భేదము చెప్పినచో నది అభేదభేదాతిశయోక్తి యనఁబడును. ఈ పద్య ముదాహరణార్హము గాదు. ఏలన, నీ లక్షణ మిటఁ బట్టదు. ఈక్రింది పద్య ముదాహరణీయము.

కం. ఆయందం, బాచందం
బా యా నెఱజాణతనము, లామాటతెనం
బేయెడఁగన; మాసుందరి
యాయజు సామాన్యసృష్టి యగునే తలఁపఁగా ?

లోకములోని యితర స్త్రీల సృష్టికిని నా యువతి సృష్టికిని భేదము లేకున్నను భేదమున్నట్లు చెప్పఁబడినది.

మనము లోకములోఁ గొంచెము విలక్షణముగా నున్నవానినిఁ గూర్చి 'వాని తరహా వేఱు. వాని కథ వేఱు' అని యీవిధముగా వేఱు, వేఱు, అని చెప్పుదుము. ఈ భేదములో నావిధముగాఁ జెప్పవలెను. ప్రకాశకారుఁడు 'ప్రకృతస్య యదన్యత్వం' అని యీ భేదమునకు లక్షణము చెప్పెను.

## ౫. కార్యకారణవిపర్యయ రూపాతిశయోక్తి

సీ. వెస నీప్రతాపాగ్ని దెసలఁబర్వకమున్నె
పొరయు శాత్రవరాజపురవరంబు
లలపురంబుల ధూమమగ్గలింపకమున్నె
ప్రబలు వైరికళత్రబాష్పవితతు
లలజలంబులు ధాత్రినవఘులింపకమున్నె
క్రేళ్ళుబ్బు వారి యకీర్తిపంక
మాపంకసంకరం బంకురింపకమున్నె
పొడమునసత్కీర్తిపుండరీక

గీ. మపుర! కవిబుధశుకపికనివహనిరత
ఫలితసురుచిరసురతరుపటిమఘటన
కలితకరతలకుసుమిత కరజనికర
గరిమ మనుపోచి రాజోబభునృసింహ! ౧౦౨

నీప్రతాపాగ్ని దెసలఁ బ్రాఁకకమున్నె శత్రురాజ పట్టనములు పొగలెత్తును. ఆ ధూమ మతిశయింపకమున్నె శత్రురాజుల భార్యలకుఁ గన్నీళ్లూరును. ఆ నీరు నేలపైఁ బడకముందే నేల (వారి) యపకీర్తి బురదతో నిండును. బురద యేర్పడకముందే నీ కీర్తి పుండరీకము మొలచును.

అగ్న్యాదులు కారణములు; ధూమాదులు కార్యములు. కారణము పూర్వభావి. కార్య ముత్తరభావి. కాని యిటఁ గారణములకన్నఁ గార్యములు ముందుజరిగినట్లు కవిప్రౌఢోక్తిచే వర్ణింపఁబడినది.

అతిశయోక్త్యలంకారమునకు 'వక్రోక్తి' యనియు వేరొక పేరు. ఇది లేని యలంకార ముండదు. ఉపమాలంకారమునఁ గూడ నతిశయోక్తియే యుండును. "ముఖము చంద్రునివలె నున్నది" అన్నపుడు చంద్రునివలె నిజముగా నున్నదా? లేదు. అతిశయమునని చెప్పుచున్నాము. కాని నతిశయోక్తిగర్భితమై యున్నది.

ఎల్ల యలంకారములకును నతిశయోక్తి మూలమని మమ్మటాదులును, ఉపమాలంకారము మూలమని వామనాదులును చెప్పుదురు. ఇది సర్వాలంకార బీజభూతము. మరియును 'శ్లేషః పుష్ణాతిసౌభాగ్యం ప్రాయో వక్రోక్తిషు స్థితం' 'తఱచుగా సర్వాలంకారములందును నున్న సౌభాగ్యమును శ్లేష పోషించును' అని యున్నది. కాన శ్లేష స్పర్శచే సర్వాలంకారములకును సౌందర్యము హెచ్చును. దీని కాంగ్లమున 'Hyperbole' అని పేరు.

## ౧౩. సహోక్తి

క౦. నిపుణత ముఖ్యాన్వితమా
నుపమేయంబును, సహార్థయోగాన్వితమా
నుపమానంబును బెరసినఁ
బ్రపంచితంబగు సహోక్తి రహి నెట్లన్నఁ. ౧౦౩

ఉపమేయమునకు (క్రియతో) ముఖ్యాన్వయమును (శాబ్దాన్వయము) ఉపమానమునకు సహార్థసంబంధముతో నముఖ్యాన్వయమును ( ఆర్థాన్వయము ) గలిగిన యెడల సహోక్తి. మరియు నుపమాలంకారమున నుపమానోపమేయములు ప్రాకరణికాప్రాకరణికములు. మరియు నందలి యౌపమ్యము ప్రసిద్ధము. సహోక్త్యలంకారమున నుపమానోపమేయములు రెండును బ్రాకరణికములే. ఇందలి యౌపమ్యము కల్పితము. ఈ సహోక్తి కార్యకారణ విపర్యయరూపమగు నతిశయోక్తియే మూలముగాఁ గలది. అప్పుడే అది చారుత్వహేతువు.

సీ. నానారిభూనాథ సేనాతతులతోనె
కటకముల్ దూఱు నీపటహరవము
భీతారిజాతాసువాతావళులతోనె
దివి కేగు నీచమూభవరజంబు
ధీరాతివీరారి ఘోరాంగములతోనె
వడఁకు నీకరతలోజ్జ్వలకృపాణ
మస్త్రారిమస్త్రాగ్ర విస్తారములతోనె
నతిఁజెందుఁ దావకోన్నతశరాస

గీ. మహితనృపరాజ్యలక్ష్మిమృగాక్షితోనె
వేడ్కనినుఁజెందు సంగ్రామవిజయలక్ష్మి

అనఘుతర పోచిరాజవంశాబ్ధిచంద్ర!
నరనుతాటోప! యోబయనరసభూప!

పటహరవము కారణము. సేనాపతులు కటకముల దూలుట కార్యము; చమూరజము కారణము; అనువాతము దివికేగుట కార్యము. కృపాణము కారణము; శాత్రవాంగములు కంపించుట కార్యము. శరాసనము కారణము; అరిమస్తకనతి కార్యము. కారణకార్యములకుఁ బౌర్వాపర్యము లోకమునఁ బ్రసిద్ధము. అయినను విట నతిశయోక్తిచే సమకాలికత్వము చెప్పఁబడినది. ఇటఁ బ్రథమాంతములగు పటహరవాదులు క్రియలతో ముఖ్యాన్వయమును (సాక్షాచ్ఛాబ్దాన్వయము) సేనాపతులు మొదలగు పదములు (తృతీయాంతములు) సహార్థసంబంధములో సార్థాన్వయమును బొందుచున్నవి.

శ్లేష భిత్తికాభేదాధ్యవసాయమూలకమగు సహోక్తియుఁ గలదు. ఎట్లన, "కుముదదలైః సహ విఘటంతే చక్రవాక మిథునాని." చక్రవాక మిథునములు కుముదదళములతో విఘటనమును (వియోగము–విచ్చుటను) బొందుచున్నవి. ఇట 'విఘటనము' అను పదము శ్లిష్టము. రెండర్థములకును నభేదాధ్యవసాయము శ్లేషభిత్తిక యన శ్లేష మూలముగా గలది.

ఈ సహోక్తి మాలారూపముగఁ గూడఁ గలదు.

ఉత్క్షిప్తం సహకౌశికస్య పులకైః; సార్ధం ముఖైర్నామితం
భూపానాం; జనకస్య సంశయధియా సార్ధం సమాస్ఫాలితం
వైదేహ్యా మనసా సమం తదధునా కృష్టం తతో భార్గవ
ప్రౌఢాహంకృతికందళేన చ సమం భగ్నం తదైశం ధనుః.

విశ్వామిత్రుని పులకలతోఁగూడ నెత్తఁబడినట్టియు, రాజుల ముఖములతోఁ గూడ వంపఁబడినట్టియు, జనకుని సంశయబుద్ధితోఁగూడ నాస్ఫాలితమైనట్టియు, సీతాదేవి మనస్సుతోఁగూడ లాఁగఁబడినట్టియు, పరశురాముని యహంకారాంకుర ములోఁగూడ నా శివధనుస్సు భగ్నమయ్యెను.

## ౧౮. వినోక్తి

కం. సంబంధిఁ బాసి మఱియొక
సంబంధికిఁ జారుతయు, నచారుతయుం, బ్రా
ప్తంబుగఁ బ్రజ్ఞాధిపుల మ
తంబున నదియగు వినోక్తి ధరనెట్లన్నన్. ౧౦౫

ఒకదానిని వ్యతిరేకించుటవలన వేఱొకటి సుందరముగాఁగాని యసుందరముగాఁ గాని యుండునట్లు చెప్పినచో వినోక్తి.

ఉ. క్రూరతలేనిచూపు, నెలకొన్న వికారములేనిరూ, పహం
కారములేనియేపు, కలకాలము వేసటలేనిప్రాపు, సం
ప్రేరితమీనయంత్ర తనుభేదముసన్ సరిలేని తూవు, ని
ద్ధారుణినీకెపొల్చు గుణధామ! నృసింహనృపాలశేఖరా! ౧౦౬

క్రూరత్వాదులులేని చూపు మొదలగునవి సుందరములుగా వర్ణింపఁబడినవి.

కం. కవిలేని రాజుకీర్తియు,
రవిలేనినభంబు, రూపరసభావములం
జవిలేని భామపొందును,
రవలేని విభూషణంబురహి నరసింహా! ౧౦౭

కవి మొదలగువారు లేని రాజు కీర్తి మొదలగునవి యసుందరములు.
ఈ వినోక్తి సహోక్తికిఁ బ్రతిద్వంద్వి.

## ౧౫. సమాసోక్తి

కం. ప్రకృతము విశేషణంబులు
సకలంబును సామ్యధర్మసహితములై య
ప్రకృతము దలఁపింపఁగనది
యకృతిసమాసోక్తియయ్యె నదియెట్లన్నన్. ౧౦౮

ప్రకృతముయొక్క విశేషణముల సామ్యమునుబట్టి యప్రకృతార్థము దోఁచు నేని నది సమాసోక్తి.

కం. కలకంఠ రుతులఁబిలుచును,
ఫలములఁ జవిఁజూడుఁడనుచుఁ బదములఁబెనఁగున్
బలమఱిపఱచుభవద్రిపు
లలనాతతిఁగాంచి వింధ్యలతలు నృసింహా! ౧౦౯

వింధ్యపర్వతమునందున్న లతలు పరుగిడుచున్న నీ శత్రుకాంతలను జూచి కలకంఠరుతులఁ బిలుచును. (తమపైఁ గూర్చున్న కలకంఠములయొక్క రుతములతో) తమ ఫలములను జవిఁజూడుఁడనుచుఁ బదముల కడ్డముపడి పెనఁగులాడును."

ఇట "కలకంఠరుతులఁ బిలుచును । ఫలములఁ జవిఁజూడుఁడనుచుఁ బదములఁ బెనఁగున్" అనునెడ నచేతనములగు లతలయందుఁ జేతనధర్మ మారోపింపఁబడినది. దానిచే నప్రకృతమగు పుణ్యస్త్రీజనము లాతిథ్యమిచ్చుటకై ప్రతిపాలించున్న వృత్తాంతము దోఁచుచున్నది.

ఈ సమాసోక్తిలో నప్రస్తుత వృత్తాంత (వ్యవహార) సమారోప ముండును. అదియే జీవితము. అనఁగాఁ జారుతాహేతువు. అది లేకున్న సమాసోక్తియే లేదు.

సమాసోక్తియం దప్రస్తుతవ్యవహార సమారోపమును, రూపకమున నప్రస్తుత రూప సమారోపమును నుండును. ఎట్లన, 'కలకంఠరుతుల' అను పై పద్యమున నప్రస్తుత వ్యవహార సమారోపమును జూపితిమి. ఇది సమాసోక్తి. 'ముఖము చంద్రబింబము' అను రూపకమున ముఖమునఁ జంద్రబింబత్వమే యారోపింపఁబడుచున్నది. పైదానియందువలె వ్యవహారసమారోపము లేదు. అప్రస్తుతరూపమే యారోపింపఁబడినది.

ఈ విశేషణము శ్లిష్టముగా, సాధారణముగా (ప్రస్తుతాప్రస్తుత సాధారణము) నుండవచ్చును. 'కలకంఠరుతుల' ఇత్యాది స్థలమున శ్లిష్టము. సాధారణమున నీ క్రింది యుదాహరణము.

> చ. చనుఁగవ తాండవింప, జడ సళ్లఁగ, నూఁగఁగ ముత్తెపుఁ గాసరుల్,
> కనకపుఁగమ్మలాడఁ జెవులన్ మిఱుమిట్లుగఁ, జెమ్మగిల్ల నా
> ననముఁ, గరప్రహారము లొనర్చుచు మిక్కిలి యార్చుకొంచు ని
> వ్వనిత కరంగుఁగందుకమ! భాగ్యమనంగను నీదెపో! భువిన్.

ఇట విశేషణములచేఁ బురుషాయితప్రసక్తయగు నాయికా వృత్తాంతము దోఁచుచున్నది.

ఈ సమారోపము నాలుగువిధములు. ౧. లౌకికవస్తువునందు లౌకికవస్తు సమారోపము. ౨. లౌకికవస్తువునందు శాస్త్రీయవస్తు సమారోపము. ౩. శాస్త్రీయవస్తువునందు శాస్త్రీయవస్తు సమారోపము. ౪. శాస్త్రీయవస్తువునందు లౌకికవస్తు సమారోపము. కావ్యములందు లౌకికవస్తువునందు లౌకికవస్తు సమారోపమే హృద్యమగుట మిగిలినవి కామి నవి యుదాహరింపఁబడవయ్యెను. వలసినచోఁ బ్రతాపరుద్రీయమునఁ జూచుకొనవలెను.

## సమాసోక్తి దోషము

సమాసోక్తియందు శ్లిష్ట, సాధారణ, విశేషణములవలననే వాగ్రూపముగాఁ జెప్పఁబడకున్నను నౌపమ్యము స్ఫురించును. అట్టిచో వాగ్రూపముగా నౌపమ్యమును వచించుట యపుష్టి లేక పునరుక్తి యను దోషమగును. ఎట్లన,

స్పృశతి తిగ్మరుచౌ కకుభః కరై ర్దయితయేవ విజృంభితతాపయా
అతనుమానపరిగ్రహయా స్థితం రుచిరయా చిరయాయిదినశ్రియా.

సూర్యుఁడు దన కరములచే దిక్కులను స్పృశింపఁగా గ్రీష్మదివసశ్రీ తాపము విజృంభింప నధికమైన మానమును గ్రహించిన దయితవలె నయ్యెను.

ఇట 'తిగ్మరుచి' శబ్దముచే నాయకత్వమును 'దిక్కులు' అను శబ్దముచే నాయికాత్వమును గోచరించినట్లు 'గ్రీష్మదివసశ్రీ' శబ్దముచేఁ బ్రతినాయికాత్వము గోచరించుచునే యున్నది. అనఁగా గ్రీష్మదివసశ్రీ ప్రతినాయికవలె నున్నదని వ్యక్తమగుచున్నది. అట్టిచో 'దయితయేవ' అని వాగ్రూపముగా నౌపమ్యమునువచించుట యపుష్టి లేక పునరుక్తి.

## ౧౬. వక్రోక్తి

కం. వేఱొకవిధముఁబలికిన
చారూక్తికి శ్లేషకాకు సంబంధముచే
వేఱొకయోజనదెచ్చిన
నారయ వక్రోక్తియయ్యె నదియెట్లన్నన్. ౧౧౦

ఒక యభిప్రాయములోఁ బలికిన వాక్యమునకు శ్లేష సంబంధముచేఁ గానీ కాకుస్వరసంబంధముచేఁ గానీ మరొక యభిప్రాయమును గలిగించుట వక్రోక్తి. వక్రోక్తియన నుక్తివక్రత. వక్రత యన వైచిత్ర్యము. ఉక్తివైచిత్ర్యము వక్రోక్తి. ఎల్ల యలంకారములందును నుక్తివైచిత్ర్యముండునుగదా! దీనియందుఁ గల విశేష మేమి? అన్నచో మిగిలిన యలంకారములలో నిట్టి వైచిత్ర్యములేదు. ఇది విలక్షణము. ఈ వక్రోక్తి శ్లేషవక్రోక్తి, కాకువక్రోక్తి యని యిఱుదెఱఁగులు.

### శ్లేషవక్రోక్తి

ఉ. ఇంతి! భవన్మనోజ్జగతుఁడెవ్వఁ? డినుం; డినుఁడైనఁబద్మినీ
కాంతుఁడొ? రాజశేఖరుఁడుగా నితఁడాతఁడుగాఁడు; రుద్రుఁడో?
కాంత! లలాటలోచనుఁడుగాఁడు నృసింహుఁడు; మాధవుండొ? ని
న్నింతట మెచ్చితిం జెలి! నిజేశుఁడు మాధవుఁడౌ శుభాకృతిన్.

చెలికత్తె నాయికను "ఇంతి...ఎవ్వఁడు?" అని ప్రశ్నించినది. నాయిక "ఇనుఁడు" అని ప్రత్యుత్తరించినది. 'రాజు' అని నాయిక యభిప్రాయము. చెలికత్తె 'ఇన' శబ్దమునకు శ్లేషముదని 'సూర్యుఁడా?' అని యడిగినది. ఇట్లే రాజశేఖర

(రాజేంద్రుఁడు-శివుఁడు) నరసింహ (నరసభూపాలుఁడు-శ్రీవిష్ణువు) పదములకును భిన్నార్థయోజనము దెలియవలెను.

ఈ శ్లేషవక్రోక్తి ప్రశ్నోత్తరరూపముగా నుంటయే సౌందర్యావహము. ఇట్లే

చ. అపరిమితానురాగ సుమనో౽లసయై చిగురాకుచేతులం
దపసినిఁ గౌఁగిలించె వనితా! యిది రంభ; దలంప రంభ తా
నపరిమితానురాగ సుమనో౽లసయై చిగురాకుచేతులం
దపసినిఁ గౌఁగిలించు టుచితంబెకదా యని నవ్వె రంభయున్.

ఇందును బ్రశ్నోత్తరరూపమునసే శ్లేష వక్రోక్తి నిబద్ధమయ్యెను.

కాకువక్రోక్తి కిం దుదాహరణము లేదు. చూపుదము.

గురుజనపరతంత్రతయా దూరతరం దేశముద్యతో గంతుం
అలికులకోకిలలలితే నైష్యతి సఖి! సురభిసమయే౽సౌ.

గురుజనపరతంత్రుఁడగుటచే దూరదేశమునకుఁజనఁబూనియున్న యీ నా ప్రియుఁ డలికులకోకిలలలితమైన వసంతమున సఖీ! రాఁడు.

నాయకుఁడు ప్రవాసమునకుఁ జనుచుండ నాయికయొక్కయు దాని సఖియొక్కయు వచనప్రతివచనములు. నాయిక యీ పద్యమున "రాఁడు" (నైష్యతి) అను నర్థమును దెలుపఁగా సఖి 'రాఁడు?' అను కాకుస్వరముచే రాఁడా? అనఁగా "వచ్చును" అను నర్థమును యోజించుచున్నది. ఇట 'నైష్యతి' అను నొకే పదము నాయిక యొక యర్థమునఁ బ్రయోగింప సఖి యన్యార్థమున దానినే ప్రయోగించెను. ఈ శ్లోకమే నాయికావచనమును సఖీ ప్రతివచనమును నగును.

ప్రకాశకారుఁ డీ వక్రోక్తిని శబ్దాలంకారముగాఁ బరిగణించెను.

## ౧౭. స్వభావోక్తి

కం. సహృదయహృదయంగమమై
మహినున్నదినున్నయట్లు మాటల తేటల్
బహుళంబులుగాఁ జెప్పిన
మహితోక్తియె జాతియయ్యె మహినెల్లన్నన్. ౧౧౨

కేవల మున్నదున్నట్లుగా వర్ణించినచో స్వభావోక్తిగాదు. అది సహృదయహృదయంగమముగా నుండవలెను. హృదయంగమత్వము ప్రతిభా లభ్యము. కావునసే

దీర్ఘపుచ్ఛ శ్చతుష్పాదః కకుద్మాన్ లంబకంబలః
గోరపత్యం బలీవర్ద స్తృణమత్తి ముఖేన సః

అనునది స్వభావోక్తి గాదని తెలిపితిమి.

బాలకాదులయొక్క క్రియా, రూపముల నున్నవున్నట్లుగా వర్ణించుట స్వభావోక్తి. క్రియ యనఁగాఁ జేష్ట. రూపమనఁగా నీలపీతాది వర్ణమును, ఆకారమును నగును. కావున బాల, యువతి, ముగ్ధ, కాతర, తిర్య, గ్భ్రాంత, హీనపాత్రాదుల యొక్క చేష్టలును. రూపమును, ఆకారమును హృదయంగమముగా నున్నవున్నట్లుగా వర్ణించుట స్వభావోక్తి. మొత్తము మీఁద దేనియొక్కకాని యసాధారణధర్మ వర్ణనము స్వభావోక్తి యని నిష్కృష్టార్థము. దీనిని జాత్యలంకారమని ప్రాచీనులు వ్యవహరించిరి.

సీ. తలచూపి మోసులై త్రాసులై తళుకెక్కి
నిక్కి నక్కులవలె నరసిబెరసి
గెఱకట్టి కళుకులై కెరలి పోఁకంతలై
వింతలై చెంతల విరివిఁజెంది
జిగి దొట్టి మిట్టలై బిగువులై బుగడలై
మొగడలై నిగనిగ న్నిగలనెగడి
కొనలుబ్బి గబ్బులై గుబ్బలై యపరంజి
కుండలై కొండలై దండనించి

గీ. దొరసి యొండొంటినొరసి క్రిక్కిఱిసి మెఱసి
అగణితస్ఫూర్తి మొగమునకెగయు నీదు
వలుఁదవలిగుబ్బచన్నులో వలపులాఁడి!
నేఁడు నరసింహు కౌఁగిట నెఱపఁగలిగె. ౧౧౩

ఇందుఁ గ్రమమైన స్తనముల యెదుగు వర్ణింపఁబడినది. ఇది క్రియ.

భామహుఁ డీ స్వభావోక్తి నలంకారముగా గణింపలేదు. అతఁడు వక్రోక్తి లేకున్న నలంకారత్వమే లేదనెను. స్వభావోక్తియందు వక్రోక్తిలేదు. కాన నలంకారము కాదఁట. కాని దండి దీని నలంకార పరిచ్ఛేదమునఁ బ్రథమముననే గణించెను. మరియు దీనిని జాతి, గుణ, క్రియా, ద్రవ్యభేదములచేఁ జతుర్విధముగా వర్ణించెను. ఎట్లన,

## జాతిస్వభావోక్తి

గీ. హరితకోమలపక్షంబులగుచుఁ దుండ
పంక్తి యాతామ్రకుటిలమై భాసిలంగ
మెడలు ముప్పన్నెచాలిల మెరయుచుండ
శుకము లివి మంజులోక్తులై శోభిలెడిని.

ఇట శుకజాతి వర్ణితము.

## క్రియాస్వభావోక్తి

గీ. కన్నులాఘూర్ణితంబులై క్రాలఁగాఁ, గ
లక్వణిత గర్భమైన గళంబుతోడఁ
బ్రీతిఁ బారావతంబు పరిభ్రమించి
ప్రణయినిఁ ముద్దిడుకొనె రిరంసతోడ.

పారావతముయొక్క చుంబనక్రియ వర్ణితము. మరొక యుదాహరణము.

శా. మోఁకాల్మోడ్చి, పిఱుందులన్ మడమలన్ మోపించి, ముందద్దమా
లోకంబుంబొనరించుచుం, గుచగిరుల్ త్రుళ్ళాడఁ గేలెత్తుచుం
బైకిన్, వ్రాల్చుచు, మోఁగగాజులు గురుల్ నానాగతిం దువ్వుచున్
ఆకన్యామణి కట్టుచుండె ముడియో? అస్మచ్చలచ్చిత్తమో?

నా 'అమృతకణములు'

## గుణస్వభావోక్తి

గీ. అంగములయందు బద్ధరోమాంచమగుచుఁ
జిత్తమునయందు నిర్వృతిఁ జేయుచుండి
నయనయుగమున కామిలనంబుఁ గూర్చి
వర్తిలుచునుండెఁ బ్రేయసీస్పర్శ మహహా!

ఇట స్పర్శరూప గుణస్వభావము వర్ణితము.

## ద్రవ్యస్వభావోక్తి

కం. గరళము గళమునఁ దనరఁగఁ
గరమందుఁ గపాలము పుప్పఁగా శశధరశే
ఖరుఁడగు వృషధ్వజుం డిదె
యరుణస్నిగ్ధజటలఁ జెలువై పొడగట్టెన్.

ఇట వృషభధ్వజ రూప ద్రవ్యస్వభావవర్ణనము చేయఁబడినది.

ఈ నాల్గింటిలోఁ గ్రియాస్వభావోక్తి వర్ణనమే హృదయంగమము. మిగిలినవి తరువాతివి. ఇతరాలంకారికులు క్రియా, రూప, వర్ణనము స్వభావోక్తి యనిరని తెలిపితిమి. దండిభేదములును నీ భేదములును సమానమే. ఇరువురికినిఁ గ్రియావర్ణనము గలదు. రూపమును, నీలపీతాదిరూపము, ఆకారము, అని ప్రాచీనాలంకారికులు విభజించిరికదా! నీలపీతాదిరూప వర్ణనము గుణస్వభావోక్తియే యగును. ఆకారవర్ణనము, జాతి, ద్రవ్యస్వభావోక్తులగును.

ఈ స్వభావోక్తి కుదాహరించిన పద్యములు 'అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి' గారి కావ్యాదర్శములోనివి.

## ౧౮. వ్యాజోక్తి

క౦. తేజరిలు వేడ్కతో న
వ్యాజ సముద్భూతమైన వస్తువు నెలమిన్
వ్యాజంబుసేసి దాఁచిన
వ్యాజోక్తి యనంగఁబొల్చు నది యెట్లన్నన్. ౧౧౪

ఉద్భిన్నమైన (పైకుబికిన లేక ప్రకటితమైన) వస్తువును వ్యాజముచే దాఁచి చెప్పినచో వ్యాజోక్తి యగును. వ్యాజముచే నుక్తి యని సార్థకనామము.

క౦. బాలామణి నరసింహనృ
పాలాగ్రణిఁ జూచి ప్రమదబాష్పావృతయై
లీలాసౌధసముత్థిత
కాలాగరుధూప మెంతఘన?మని పల్కెన్. ౧౧౫

నాయిక నరసభూపాలునిఁ జూచుటవలనఁ దనకుఁగలిగిన యానందబాష్పములను గాలాగరుధూపములవలనఁ గలిగిన బాష్పములుగా నిగూహనముసేసినది.

సామ్యమున్ననే యీ నిగూహనము సేయు వీలగును. కావున సామ్యనిబంధన ముండవలెను.

క౦. హారములు గరఁగ నరస
క్ష్మారమణునిఁబాడి యొక్కసతి పులకలుమై
నీరికశైత్తినఁ దాఁచును
[illegible]

నరసభూపాలునిఁగూర్చి గానముసేయఁగా నొక యువతికి గద్గదుపాటు గలిగెను. అది హిమజలశైత్యముచే గలిగినట్లు దాఁచెను. ఇదియు వ్యాజోక్తియే. కాని 'దాఁచెను' అని వాగ్రూపముగాఁ జెప్పుట యసుందరము.

## ౧౯. మీలనము

కం. అవనిం బ్రబలంబగు వ
స్తువుచే వస్త్వంతరంబు సొరిది నడఁగినన్
గవులమతంబున మీలన
మవునది యన్వర్థమగుచు నది యెట్లన్నన్. ౧౧౬

ప్రబలమగు వస్తువుచే వస్త్వంతరము (అల్పవస్తువు) అడఁగినచో నది మీలనము. మీలనమన వ్యుత్పత్త్యర్థమునుబట్టి యుత్కృష్టవస్తువుచే నికృష్టవస్తునిగూహనము.

శా. నీధాటీ విచలద్బలోద్బల భటానీకోదయద్భీతిచే
బాధాహేతు వనోగ్రజంతుభయముం బాటింపకాత్మన్ రిపు
క్ష్మాధీశాంగనలద్రికందరల వెల్గందున్ భుజంగస్ఫటా
సాధూద్యన్మణిపంక్తిఁ గప్పుదురు దోశ్శక్తిన్ నృసింహాధిపా!

నీ సైన్యమువలనఁ గలిగిన భయముచేఁ గ్రూరజంతుభయమును బాటింపక నీ శత్రుకాంతలు పర్వతగుహలలోఁ బ్రవేశించి యటనున్న సర్పముల పడగలమీఁది మణుల కాంతులచే వెలుఁగుగనఁబడఁగా వా రా మణులను గప్పుచున్నారు.

పరసైన్య భయముచేఁ గ్రూరసర్పభయము కప్పఁబడినది. కాన మీలనమని గ్రంథకర్త యభిప్రాయము. ఇది సరిగాదు. 'భయముం బాటింపక' అని యుంటచే వారు సర్పభయమును లెక్కింపకున్నారనియు సైనికుల హస్తములలోఁ బడుటకన్న సర్పములవలన మరణించుటయే మేలనియుఁ దాత్పర్యము వచ్చును. ఈ పద్యముదాహరణార్హము గాదు.

అపాంగతరళే దృశౌ మధురవక్రవర్ణా గిరో
విలాసభరమంథరా గతి రతీవ కాంతం ముఖం
ఇతి స్ఫురితమంగకే మృగదృశస్స్వతో లీలయా
తదత్ర న మదోదయః కృతపదోఽపి సంలక్ష్యతే.

ఆ యువతి దృక్కులతిచంచలములు ; వాక్కులు మధురములును వక్రములును; గమనము విలాసభరమంథరము; ముఖమును కాంతిమంతము; ఇవన్నియు స్వభా

వముచేతనే సిద్ధించియున్నవి. ఇపుడు మదిరామదము ప్రవేశించినను వివిక్తముగాఁ గనరాకున్నది.

స్వభావసిద్ధములయిన ప్రబలములయిన దృక్చాంచల్యాదులచే నల్పములయిన మదిరాకృతదృక్చాంచల్యాదులు కప్పఁబడినవి.

ఈ మీలనమునకు మీలితమనియు నామాంతరము. ఇది ద్వివిధము. సహజతిరోధానముచేతను, నాగంతుకతిరోధానముచేతను, వస్తునిగూహనము. 'అపాంగ తరళే' అనుచో సహజమగు తిరోధానము. అనఁగా సహజమగు దృక్చాంచల్యాదులచేఁ దిరోధానము జరిగినది.

> యే కందరాసు నివసంతి సదా హిమాద్రే
> స్త్వత్పాతశంకితధియో వివశా ద్విష స్తే
> అప్యంగ ముత్పులక ముద్వహతాం సకంపం
> తేషా మహో! బత! భియాం న బుధోఽప్యభిజ్ఞః.

నీ భయమున హిమశైల గుహాలయందు వసించువారి శరీరములందుఁ గంపమును బులకలను గాంచి విద్వాంసుఁడును నవి భయకార్యములుగాఁ గ్రహింపఁజాలఁడు. అనఁగా వారి కంపమును బులకలను శైత్యకార్యములుగా గ్రహించును గాని భయకార్యములుగా గ్రహింపఁడు.

శైత్యమాగంతుకము. దానివలనఁ గలిగిన కంపపులకలును నాగంతుకములే. వానిచే భయకార్యములగు కంపపులకలకుఁ దిరోధానము గలిగినది. కావున నిట నాగంతుకతిరోధానము. ఆగంతుకములచేఁ దిరోధానము జరిగినది.

## ౨౦. సామాన్యము

> కం. అవిరళ గుణసామ్యంబున
> నవనిన్ వస్త్వంతరంబునం దేకంబై
> ప్రవిమలవస్తువు మెఱసిన
> నవు నది సామాన్యమనఁగ నది యెల్లన్నన్. ౧౧౮

సమానగుణములు గల రెండు వస్తువులు గుణసాదృశ్యమునుబట్టి యేకాకారముగా భాసించినచో నది సామాన్యాలంకారము.

మీలనాలంకారమున నుత్కృష్టవస్తువుచే నికృష్టవస్తువునకుఁ దిరోధానము. సామాన్యాలంకారమున సమాన వస్తువులు గుణసామ్యముచే నేకాకారముగా భాసించుట.

క౦. నీ కీర్తి కాంతిలోపల
శ్రీకంఠుండేకమైన శివుఁగానక యా
నాకనది జలధి కేఁగుం
బాకారిసమాన! యోబపార్థివునరసా! ౧౧౯

కీర్తిశ్రీకంఠులు శ్వేతగుణసామ్యముచే నేకాకారముగా భాసించుచున్నారు. ఇట నాకనది జలధికేగుటకు హేతువుగాని శివునిఁ గానకుంటను హేతువుగా నుత్ప్రేక్షించుటచే గమ్యహేతూత్ప్రేక్షయుఁ గలదు. ఇట నీయుత్ప్రేక్షను సామాన్యాలంకార మనుగ్రహించుచున్నది. మరొక యుదాహరణము.

గీ. మల్లెదండలు గైసేసి, మలయజంబుఁ
బూసి యొడలికిఁ, దొడి పట్టుపుట్టములను,
బండువెన్నెల నడిరేలఁ బరువులిడుచుఁ
గానఁబడదయ్యె నభిసారికాగణంబు.

చంద్రికా, అభిసారికలు శ్వేతకాంతి సామ్యమున నేకమై ప్రత్యేకముగా భాసింపకున్నారు.

## ౭౧. తద్గుణము

క౦. తనగుణము విడిచి యన్యము
ననఘగుణముఁగొనుట తద్గుణాఖ్యము... ౧౭౦

స్వగుణమును విడిచి యితర వస్తువుయొక్క యుత్కృష్టగుణమును స్వీకరించి నచోఁ దద్గుణాలంకారము.

మీలనమున నుత్కృష్టవస్తువుచే నికృష్టవస్తువునకుఁ దిరోధానమే. కాని స్వగుణత్యాగము లేదు. సామాన్యమునను స్వగుణత్యాగము లేదు. కానఁ దద్గుణమేతద్భిన్నము.

ఉ. కానలకేగి నీవిమతకాతరలోచన ప్రాణనాథుడుం
దాను భుజింపఁగా ఫలవితానముఁ గోసెదనంచుఁబోయి నా
నానిరవద్యశోకనదనర్మనఖాంగుళిపాటలాంశు రే
ఖానిబిడంబులైన కసుగాయలె కోయు నృసింహభూవరా! ౧౭౧

నీ శత్రుకాంత పండ్లు గోయఁబోయి తన నఖకాంతులచే నెఱ్ఱఁబాఱిన కసుగాయలు గోయుచున్నది.

ఉత్కృష్టమగు నఖకాంతిచేఁ గసుగాయలు తమ గుణమగు పచ్చఁదనమును విడిచి రొట్టెని పండ్లవలెఁ గనఁబడినవి.

"తస్య అప్రకృతస్య గుణః అత్ర అస్తీతి తద్గుణః" అప్రకృతవస్తువుయొక్క గుణములు (నఖకాంత్యాదులు) ఇందున్నవి కావున దద్గుణము అని వ్యుత్పత్తి.

## ౨౨. అతద్గుణము

కం. ...............

...................ఒరుగుణం

బనయము హేతువుగలిగియు

నెనయుమియు యతద్గుణాఖ్య మివి యెట్లన్నన్.

తగినంత కారణమున్నను నితర వస్తువుయొక్క గుణమును స్వీకరింపకున్నచో నతద్గుణము. 'తస్య గుణః న అత్ర అస్తీతి అతద్గుణః' అని వ్యుత్పత్తి. (దాని గుణ మిందు లేదు. కాన నతద్గుణము.)

చ. బలరిపుభోగ! రామబసరపాలనృసింహ! భవద్యశంబుచేఁ

దెలుపగు నిందు లాంఛనము; తెల్పగుఁ బ్రాక్తనభోగిభోగముల్

తెలుపగు రుద్రుకంధరము; తెల్పగు భారతికొప్పు; కాని త్వ

త్ఫలరిపు దుర్యశోరుచివితానము తెల్పయియుండ దెన్నఁడున్,

నీ కీర్తిచే నెల్ల వస్తువులును దెల్లఁబడుచున్నను నీ శత్రువుల యపకీర్తిమాత్రము దెల్లఁబడకున్నది.

తగిన కారణమున్నను నపకీర్తి నీ కీర్తి గుణమును స్వీకరింపకున్నది. కాన నతద్గుణము.

## ౨౩. విరోధాభాసము

కం. అమర విరోధంబాభా

సముగాఁగ విరోధమయ్యె జగతి నదియునుం

గ్రమమున జాత్యాదివిభే

దముల బహుత్వంబుఁజెంది తగునెట్లన్నన్. ౧౨౩

పైకిమాత్రము విరోధము గనఁబడుచుఁ బరమార్థమున విరోధము లేకున్నచో విరోధాభాసాలంకారము. దీనికి విరోధాలంకారమనియు నామాంతరము. ఇతి జాతి, గుణ, క్రియా, ద్రవ్యభేదములచే బహువిధము.

విరోధమన నుద్ద్యోతకారుఁ డిట్లు తెలిపెను. "విరోధశ్చ ఏకాధికరణ సంబద్ధత్వేన ప్రసిద్ధయో రర్థయోర్బాధ్యబాధకభావేనైకాధికరణాసంబద్ధత్వం । ఏకాధి కరణాసంబద్ధత్వేన ప్రసిద్ధయో రేకాధికరణసంబద్ధత్వేన ప్రతిపాదనం వా"

విరోధమన నొక్కచోట సంబద్ధములుగా స్థిరపడియున్న రెండు ధర్మములు పైకి సంబద్ధములు గానట్లు తెలుపుటకాని యొక్కచోట సంబద్ధములుగాని రెండు ధర్మములు పైకి సంబద్ధములవలెఁ దెలుపుటకానీ యగును. ఈ విషయము లక్ష్యము మీఁదలెస్సగా నవగతమగును.

గీ. జాతి జాత్యాదికముతోడ, జగతిఁ గ్రియ క్రి
యాదికముతోడ, గుణము గుణాదితోడ,
ద్రవ్యమును ద్రవ్యమును విరోధంబుఁ జెందఁ,
బదివిరోధంబులగు; వీనిఁ బదిలపఱతు. ౧౨౪

జాతి జాతిగుణద్రవ్య క్రియలతోను, గుణము గుణక్రియా ద్రవ్యములతోను, క్రియ క్రియాద్రవ్యములతోడను, ద్రవ్యము ద్రవ్యములోడను విరోధమును జెందును. ఈవిధముగా నీ యలంకారము పది భేదములగును.

సీ. ధారాధరంబయ్యుఁ దనరు నీకాత్తేయ
మనతవాహినికజీవనదమయ్యెఁ
గమలాకరంబయ్యు నమరు నీశౌర్యంబు
ఘనరాజహంసభీకరతఁ దాల్చె
నీరంధ్రగతి మహావారణంబయ్యు నీ
సత్కీర్తి వారిఘటాసఖ్యమొందె
నవనిఁ బ్రభానిధియయ్యు నీ నెమ్మేను
జైవాతృకత్వంబు సంఘటించె

గీ. ధర్మధరమయ్యుఁ బ్రతిపక్షధర్మభేది,
నరనుతవిహారమయ్యుఁ గర్ణప్రమోద
శీల, మురుగోత్రభృతియయ్యు జిష్ణువగుచుఁ
జెలఁగు నీ బాహుయుగము నృసింహభూప! ౧౨౫

౧. లోకమున ధారాధరము (మేఘము) జీవనదము; (జలములనిచ్చునది) కాని యిట జీవనదము కాకున్నది ధారాధరత్వము కలిగి జీవనప్రదానభావము

నకును విరోధము. కాన విరోధమును బరిహరింపవలెను. ఎట్లన, నీ కౌక్షేయకము (కత్తి) ధారాధరమును, (వాదరనువహించునది) అనఘులగు శత్రువుల వాహినికిఁ బ్రాణమీయనిదియు, అనఁగా బ్రదుకనీయనిది; వారిని వధించునది. అను నర్థముచే విరోధము పరిహరణీయము.

ఇట జాతి క్రియా విరోధము.

౨. కమలాకరము (సరస్సు) లోకమున రాజహంసలకు నాహ్లాదకరము. కాని యిట భీకరమగుచున్నది. కమలాకరత్వజాతికిని భయ రూపగుణమునకును విరోధము. విరోధమును బరిహరింపవలెను. కమలా + కరము = లక్ష్మినిఁ జేయు నది; రాజహంసలు =రాజశ్రేష్ఠులు; అను నర్థమును స్వీకరించి నీ శౌర్యము లక్ష్మినిఁ జేయును. రాజశ్రేష్ఠు (శత్రురాజులు) లకు భయము గలిగించును. అన్నచో విరోధము తొలఁగును. ఇట జాతిగుణవిరోధము.

3. మహావారణమునకు (గజము) హరిఘటా (సింహబృంద) సఖ్య మెట్లు పొసఁగును ? వారణత్వజాతికిని హరిత్వజాతికిని విరోధము. మహావారణము = పెద్ద పెద్దయావరణములు గలది. ఇట ఆవారణశబ్ద మావరణవాచకము. (స్వార్థణిజంత మగు 'వృ' ధాతువుయొక్క రూపము). మహావారణమన నీరంధ్రమగువిధమునఁ బెద్ద మూఁతలు గలది. అనఁగా దట్టముగా నన్నింటిని తెల్పగాఁ గప్పివేయునది. అని యర్థము. నీ కీర్తి తెల్పగా దట్టముగా నన్నింటినిఁ గప్పునదియు, సింహబృందమును (తెలుపు గలిగియుంటచే) బోలునదియునను నర్థముచే విరోధము పరిహరణీయము.

ఇట జాతిద్వయమునకు విరోధము.

౪. ప్రభానిధి యన సూర్యుఁడు. ప్రభానిధిత్వజాతికిని జైవాతృక (చంద్రుఁడు) రూపద్రవ్యమునకు విరోధము. ప్రభానిధి యనఁ గాంతినిధానము. జైవాతృకుఁడన దీర్ఘాయుష్మంతుఁడు. నీ నెమ్మేను గాంతిమంతమును దీర్ఘకాలము జీవించునదియును నను నర్థముచే విరోధము పరిహరణీయము.

ఇట జాతి ద్రవ్యములకు విరోధము. ప్రభానిధియన సూర్యుఁడు. "ఈశబ్దము ద్రవ్యవాచకమగును. కాని జాతివాచకమె"ట్లని శంకింపవచ్చును. ద్వాదశార్కులు గలరు. కానఁ బ్రభానిధిశబ్దము జాతివాచకమగును. దీనికి మరొక యుదాహరణము.

సృజతి చ జగ దిద మవతి చ సంహరతి చ హేలయైవ యో నియతం

అవస [illegible]

ఎవఁడు తన లీలచే జగములను సృజించునో రక్షించునో సంహరించునో యతఁ డవసరమునుబట్టి చేఁపగా నయ్యెను. ఇది చిత్రము.

ఇట శఫరత్వజాతికిని జనార్దనరూపద్రవ్యమునకును విరోధము. అనఁగా జనార్దనుఁడు శఫర మెట్లగును ? అని విరోధము. భగవంతుఁడు సర్వసమర్థుఁడగుటచే శఫరరూపధారణము సాధ్యమే యను నర్థముచే విరోధము పరిహరణీయము.

౫. ధర్మధరణ రూపక్రియకును ధర్మభేదన రూపక్రియకును విరోధము. ధర్మ మన విల్లు. 'తాను ధర్మమును ధరించువాఁడును బరుల ధర్మమును (విల్లును) భేదించువాఁడును' అను నర్థముచే విరోధము పరిహరణీయము.

ఇటఁ గ్రియాద్వయ విరోధము.

౬. నరసుత విహారము (అర్జునునియొక్క పొగడఁబడిన విహారము) కర్ణ ప్రమోదశీలము (కర్ణునికిఁ బ్రమోదముగలిగించు స్వభావము గలది) ఎట్లగును ? కాన నరనుత విహారము = నరులచేఁ బొగడఁబడిన విహరణక్రియ గలదియుఁ, గర్ణములకుఁ బ్రమోదముగలిగించు స్వభావముగలదియు (నీబాహుయుగము) అను నర్థముచే విరోధ పరిహారము.

ఇది గుణక్రియా విరోధము. (ప్రమోదము గుణము; విహరణము క్రియ.) కాని యీ యుదాహరణ మంత బాగుగాలేదు. ఏలన, విహరణ, ప్రమోదముల విరోధము ప్రసిద్ధముగాదు. కాన మరొకటిచ్చుచున్నాము.

'పేశల మపి ఖలవచనం దహతితరాం మానసం సతత్త్వ విదాం'

ఖలవచనము పేశలమయ్యును మహాత్ముల మానసమును గాల్చును.

ఇటఁ బేశలత్వగుణమునకును దహనరూపక్రియకును విరోధము.

౭. గోత్రభృతి యన గోత్రభరణము గలది. అనఁగా గోత్రములను (పర్వతములను) భరించునది. గోత్రములను భరించువాఁడు జిష్ణువు (ఇంద్రుఁడు) ఎట్లగును ? ఇంద్రుఁడు గోత్రభేదిగదా! కాన నిట క్రియాద్రవ్య విరోధము. కాన గోత్రభరణము = బ్రాహ్మణ క్షత్రియాది వంశములను భరించునది. అనఁగాఁ గాపాడునది యనియు జిష్ణువు = జయశీలము (బాహుయుగము) అనియు నర్థమును గ్రహించినచో విరోధము పరిహృతమగును.

మ. తలిరుంబోఁడి సరాగయయ్యు ధవళత్వంబొందు; నుచ్చైస్తనా
చలభారాసహయయ్యుఁ దా నచలయౌఁ; జర్చింపఁగా నార్యయై
చెలువంబందియు నన్యభావయగు; నీచేతోజ శస్త్రాహతన్
నలినాక్షీమణి వేలువింత నరసింహా! సాంద్రతేజోనిధీ! ౧౨౯

౮. 'సరాగయయ్యు ధవళత్వమును బొందును' అన్నచో నిట రక్తత్వ, ధవళత్వ రూపగుణములకు విరోధము. 'సరాగ = అనురాగవతి' అను నర్థముచే ననురక్తురాలును, (కనుకనే) ధవళత్వమును (పాలిపోవుటను) బొందినదియు నను నర్థముచే విరోధ పరిహారము.

౯. 'స్తనాచల భారాసహాయయ్యు' అనుచో అచల (భూమి) అచలభారాసహ యెట్లగును? భూమి పర్వతములను మోయునుగదా! ఇట 'అచల= కదలనిది' అను నర్థముచే నా యువతి స్తంభరూప సాత్త్వికభావమును బొందిన దనియు, స్తనభారమును సహింపలేకున్నదనియు నర్థముచే విరోధ పరిహారము. ఇట గుణ ద్రవ్య విరోధము ('అచల' ద్రవ్యవాచకము. భారము గుణము.)

౧౦. ఆర్య (పార్వతి) అన్యభావ (అపర సరస్వతి) యెట్లగును? ఇట ద్రవ్యద్రవ్య విరోధము. ఆర్యురాలును, నన్యభావ = పరాయత్తమైన లేక మఱిమాలిన (ప్రలాప రూప మన్మథావస్థచే) మాటలు గలదియు నను నర్థముచే విరోధముపరిహార్యము.

మొత్తముమీఁద నీ విరోధాలంకారము శ్లేషమూలకము. ఉద్ద్యోతకారుఁడు దెలిపిన విరోధలక్షణము నిట ననుసంధించుకొనవలెను.

దీని నాంగ్లమున Paradox అందురు.

## ౨౮. విశేషము

కం. ధారుణి నాధేయమునా
ధారముగా, నొకటి నేకతలకలితముగా
సారెకు, నశక్యకరణం
బారూఢముగా విశేషమగు నెట్లన్నన్. ౧౨౭

ఆధారరహితముగా నాధేయమును నిబంధించుట, ఒకేవస్తు వనేకస్థలముల నున్నట్లుగా నిబంధించుట (ఏకానేక గోచరము) అశక్యవస్తువును జేయుట, అని విశేషాలంకారము ముత్త్రివిధములు.

### ౧. ఆధారరహితాధేయము

చ. దురమున శ్రీనృసింహుఁ డతిదుర్మద వీరవిరోధిపంక్తిపై
సరభసవృత్తిఁ బత్తలముసాఁపఁ బ్రదీప్తములయ్యెఁ దన్మహో
మరకత పుష్యరాగ నవమౌక్తిక విద్రుమ నీలకాంతిచే
సురపదవీథిపై జనులచూడ్కికభిత్తిక చిత్రకర్మముల్. ౧౨౮

పత్తలము = పాదతలము. నరసభూపాలుఁడు దన పాదతలమును శత్రురాజులపైఁ జాఁపఁగా నందలి మరకత పుష్యరాగాదుల కాంతిచే నాకాశమున నభిత్తికమైన చిత్రములు జనుల కగపడినవి.

భిత్తి యాధారము, చిత్రకర్మ యాధేయము. అభిత్తిక చిత్రకర్మ లనుచోట నాధారరహితాధేయము కనఁబడుచున్నది. కాని దీనియందు వైచిత్ర్యము దక్కువగా నున్నది. ఈ క్రింది పద్యము సుందరమైనది.

గీ. మొలిచెఁ గమలంబు నిర్జలస్థలములందుఁ;
గలువలుదయించె దానిపైఁ; గానిపించెఁ
గనకలతపైనివెల్ల; నా కనకలతయు
లేఁతయట; యేమి యీ మహోత్పాతవితతి ?

ఇటఁ బ్రసిద్ధాధారము లేకున్నను గమలము లుదయించెను. దానిపైఁ గలువ లుదయించెను. ఇవెల్లయుఁ గనకలతపై నిలిచెను.

## ౨. ఏకానేకగోచరము

కం. కలఁడు కలఁడన్న చోటం
గలుగు నృసింహుఁడవు కానఁ గానల, గిరులం,
గలలోన, ముందు, బిమ్మట
నలఘుస్థితి నీవయగుదు వరికి నృసింహా ! ౧౨౫

ఒక నరసభూపాలుఁడే శత్రువునకుఁ గానలలో, గిరులలోఁ, గలలలో, ముందు, వెనుకలను గానఁబడుచున్నాఁడు. ఇట్టిదే

సా వసతి తవ హృదయే । సైవాక్షిషు సా చ వచనేషు
అస్మాదృశీనాం సుందర! అవకాశః కుత్ర పాపానాం ?

ఆ యువతియే నీ హృదయమున, నీ నేత్రములముందు, నీ వచనములందును వసించుచున్నది. పాపాత్ములగు మావంటివారి కవకాశమెక్కడ ?

## ౩. అశక్యవస్తుకరణము

సీ. దారుణాఖండ మార్తాండ మండలము సు
ప్పొంగి గుటుక్కున మ్రింగవచ్చు;
గంభీర ఘుమఘుమారంభ సంరంభ దు
గ్ధపయోధిఁ జంగున దాటవచ్చుఁ;

జండికాజానేయ గండప్రకాండముల్
వీశఁ జరాలున వ్రేయవచ్చుఁ;
గుటిలోగ్ర శతకోటి కోటి సంఘాటముల్
కినిసి ఘణిల్లునఁ దునుమవచ్చుఁ;
గీ. గాని పళ్యదళీక భీకరదృగగ్ర
జాగ్రదనలోజ్జ్వలజ్వాలజాలకుటిల
గురుభుజాశౌర్యుఁ నినుఁజెనకఁదరమె యరుల ?
కాబళేంద్రుని నారసింహక్షితీంద్ర ! ౧౩౦

సూర్యుని మ్రింగుట మొదలగు నశక్యకార్యములను జేయుట విశేషాలంకారముగాఁ జెప్పఁబడినది. కాని ప్రకాశకారాదుల లక్షణము భిన్నముగా నున్నది.

"అన్యత్రప్రకుర్వతః కార్యమశక్యస్యాన్యవస్తునః
తథైవకరణంచేతి విశేషస్త్రివిధః స్మృతః"

హడావడిగా నొక కార్యమును జేయఁబూని యదే యత్నములో నశక్యమైన మరొక కార్యమును జేయుట విశేషము. 'హడావడిగా' అనుటచే 'నేకప్రయత్నముతోనే రెండుకార్యములను జేయఁగలను' అను పట్టుదల లేదని తెలియవలెను. ఎట్లన,

స్ఫురద దద్భుతరూపముత్ప్రతాప । జ్వలనం త్వాం సృజతాఽనవద్యవిద్యం
విధినా ససృజే నవో మనోభూ ర్భువి సత్యం సవితా బృహస్పతిశ్చ.

అద్భుతమగు రూపమును, మహాప్రతాపమును, అనవద్యమగు విద్యయును గల నిన్ను సృజింప నారంభించిన యత్నముతోడనే యశక్యవస్తువులగు మన్మథ, సూర్య, బృహస్పతులు సృజింపఁబడిరి. అనఁగా నీయొక్క సృష్టితోనే ముగ్గురు సృష్టింపఁబడినట్లైనది అని భావము. ఇట 'ససృజే' అను క్రియలలోనికి 'మనోభూః, సవితా, బృహస్పతిః' అను శబ్దములు సాక్షాత్తుగా నన్వయించుటచే శాబ్దమగు కార్యాంతరకరణము.

బ్రహ్మ మొదట నిన్నుఁ బైవిధముగాఁ సృష్టింపఁబూనెను. అనుకొనకయే మన్మథాదులు మువ్వురునుగూడ సృష్టింపఁబడినట్లయిరి.

వ్యంగ్యమగు నీ తృతీయభేదమున కుదాహరణము

గృహిణీ, సచివస్సఖీ మిథః ప్రియశిష్యా లలితే కలావిధౌ
కరుణావిముఖేన మృత్యునా హరతా త్వాం బత కిం న మే హృతం?

నీవు నా గృహిణివి; సచివుఁడవు; సఖివి; లలితకళాభ్యాసమునఁ బ్రియశిష్యు రాలవు. అట్టి నిన్ను హరించిన కరుణావిముఖమగు మృత్యువుచే నేమి హరింపఁ బడలేదు ?

ఇట నిందుమతీ హరణరూపమగు నొక కార్యమును జేయఁబూనిన మృత్యు వుచే నా ప్రయత్నముచేతనే గృహిణ్యాది హరణరూప కార్యాంతరముగూడఁ జేయఁ బడినది. ఇటఁ గార్యాంతరకరణము వెనుకటి యుదాహరణమునందువలె శాబ్దము గాక వ్యంగ్యము. ఏలన, వెనుక 'మనోభూః' ఇత్యాదులు 'ససృజే' అను క్రియలలోనికి సాక్షాత్తుగా నన్వయించినవి. ఇట 'కిం న మే హృతం' అను హరణక్రియలోనికి గృహిణ్యాది శబ్దములు వ్యంగ్యముగా నన్వయించుచున్నవి.

## ౭౫. అధికము

కం. ఆధారం బల్పంబై
యాధేయం బధికమైన, నది యల్పంబై
యాధారంబును నధికం
బై ధర రంజిల్ల, నధికమగు నెట్లన్నన్. ౧౩౧

ఆధారము చిన్నదియు, నాధేయము పెద్దదియు నైనయెడలను, ఆధేయ మల్ప మును నాధార మధికమును నైనయెడలను నధికాలంకారము. ఇది యిట్లు ద్వివిధము.

### ౧. అధికాధేయము

కం. ఘన రోమకూప వాతా
యనముల కణుపంక్తులగు నజాండంబులచేఁ
దనరు హరికుక్షి నడఁగక
యనఘాబ్జత వెడలె నీదు యశము నృసింహా! ౧౩౨

తన రోమకూపములను వాతాయనములలో నణువులుగాఁ దేలియాడు బ్రహ్మాండములతోఁ గూడిన శ్రీ మహావిష్ణువుయొక్క యుదరమున నీ కీర్తి యిముడక నాభీకమలరూపమున బయలికి వెడలెను.

ఆధారమగు నుదరముకన్న నాధేయమగు కీర్తి యధికముగా వర్ణింపఁబడినది.

### ౨. అధికాధారము

కం. నీదు నిరవద్యకీర్తిమ
హోదుగ్ధపయోధిలోన నాదమరాజ

ప్రాదుర్భూతయశంబులు
ప్రోదిం బుద్బుదములట్లు పొలుచు నృసింహా! ౧౩౩

నీ కీర్తి యను పాలసంద్రమునఁ బూర్వరాజుల కీర్తి బుద్బుదములవలె నడఁగెను. ఇట నాధేయమగు పూర్వరాజుల కీర్తికన్న నాధారమగు నరసభూపాల కీర్తి సముద్రము పెద్దదిగా వర్ణింపఁబడినది. 'కీర్తి మహాదుగ్ధపయోధి' అనుచో రూపకముగూడఁ గలదు. కాని 'ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి' అను న్యాయానుసారముగా దేనివలన విచ్ఛిత్తివిశేషము గలుగునో యా యలంకారము ప్రధానము.

## ౨౬. విభావన

కం. కారణములేక కార్యము
ప్రారూఢంబైన నది విభావన... ౧౩౪

లోకమునఁ గారణములేక కార్యము పుట్టదు. కవిప్రౌఢోక్తిచే నట్లు పుట్టినట్లు చెప్పినచో విభావనాలంకారము.

సీ. నలినారిలేని వెన్నెలలు, రాత్రులులేని
తారలు, లతలేని కోరకములు,
కొలనులేని సితాబ్జములు, స్వాతి చిన్కులు
లేని ముత్తెము, లేఱులేని నురువు,
లలరువెల్తురులేని వెలిమబ్బులు, హిమాద్రి
లేని మంచులు, వార్ధిలేని సుధలు,
గనిలేని వజ్రముల్, గంధాద్రిలేని గం
ధములు దారములేని తారవితతు

గీ. లౌర! నీ కీర్తిరుచులు మహానుభావ!
భావజాకార! కారుణ్యభాసమాన!
మానవకురురాజ! రాజన్యమకుటనిహిత
చరణరాజీవ! రాయబభూవరు నృసింహా! ౧౩౫

వెన్నెల వచ్చుట, తార లుదయించుట మొదలగు కార్యములకుఁ జంద్రుఁడు, రాత్రులు మొదలగునవి కారణములు. ఆ కారణములు లేకయే యా యా కార్యములు గలిగినట్లు వర్ణింపఁబడుటచే విభావన. "విభావ్యతే విచార్యతే కారణమస్యాం" (ఇందు కారణము [illegible] వ్యుత్పత్తి.)

వినోక్త్యలంకారమున కుదాహరణముగా నీయఁబడిన 'క్రూరతలేని చూపు' అనుదానికిని దీనికిని భేదమేమనవచ్చును. "క్రూరతలేని చూపు" ఇత్యాదులందు "నలినారి లేని వెన్నెలలు" ఇత్యాదులందువలెఁ గారణకార్యభావము లేదుగదా!

## ౫౭. విశేషోక్తి

కం. .................

......................పెక్కుల్
కారణములయ్యుఁ గార్యము
చేరకయుండుట మహిన్ విశేషోక్తియగున్.

పెక్కు కారణములున్నను గార్యము పుట్టకున్నట్లు వర్ణించుట విశేషోక్తి.

కం. అని నీ చాపఘనాఘన
ఘనము శరోత్కరముఁ గురియఁగం ద్వదహితరా
ద్వనితలకు నెట్టి చోద్యమొ ?
యనువొందవు కంకణంబు లౌబళనరసా! ౧౩౬

నీ చాపరూపమగు వర్షాకాల మేఘము శరజాలమును (జలధారలు - బాణ ధారలు) గురియఁగా నీ శత్రుకాంతలకుఁ గంకణంబులు (జలకణములు - గాజులు) అనువుపడకున్నవి.

ఇటఁ గంకణములు (జలకణములు) అనువుపడుటకుఁ దగినంత కారణమైన వర్షాకాల మేఘములయొక్క జలధారలున్నను అనువుపడకున్నవి. అనుటచేఁ గారణమున్నను గార్యము పుట్టలేదు. కాన విశేషోక్తి.

ఇట శ్లేషచేతనే (కంకణశబ్దము) విశేషోక్తి యుత్థితమగుచున్నది. శ్లేష లేకున్నచో విశేషోక్తిలేదు.

అతద్గుణాలంకారమునఁ దగినంత కారణమున్నను నితరవస్తువుయొక్క గుణము స్వీకరింపఁబడుటలేదు. అనఁగాఁ గార్యము పుట్టలేదనియేకదా యర్థము. అట్టిచో దానికిని దీనికిని భేదమేమి ? అనవచ్చును. కారణ గుణములు కార్యమునఁ బ్రవేశింపకున్నచో నతద్గుణము; కారణమున్నను గార్యమే పుట్టకుండుట విశేషోక్తి. అతద్గుణమునఁ గార్యము పుట్టును. కాని కారణగుణములు కార్యమునఁ బ్రవేశింపవు.

## ౫౮. అసంగతి

కం. నేరువుతోఁ గార్యంబును
గారణమును భిన్న దేశగతములుగాని

ద్ధారుణిలోన నసంగతి
యై రాజిలునంద్రు సుకవు లదియెట్లన్నన్. ౧౩౭

కార్యకారణములు రెండును నేకదేశస్థములుగా నుండుట మర్యాద. అట్లు గాక భిన్నదేశస్థములుగాఁ గవిప్రతిభచే వర్ణింపఁబడినచో నసంగతి.

కం. అనిలోన నీభుజాగ్రం
బనుపమతరవారిధార నందిన నేలా
యనయుంబుఁ దామువడఁకుదు
రనతారులు ? శ్రీనృసింహ! యతిబలసింహా! ౧౩౮

నీ భుజము కత్తిఁబట్టఁగానే నీ శత్రువులు వడఁకుదురు. కారణమగు ఖడ్గ మొకచోటను గార్యమగు వడఁకుట మరొకచోటను వర్ణింపఁబడినది.

## ౨౯. విచిత్రము

కం. స్వవిరుద్ధ ఫలంబునకై
యవిరళ యత్నము విచిత్రము...... ౧౩౯

విరుద్ధఫలమును గాంక్షించి ప్రయత్నమొనర్చుట విచిత్రాలంకారము. ఇది విరోధమూలకము.

కం. నతిఁజెందుదు రున్నతికై
ప్రతిపభూపతులు నీదు భవనాగ్రబహిః
స్థితిఁజెందుదురు గృహాంతః
స్థితికై నరసింహ! శౌర్యజిత నరసింహా! ౧౪౦

నీ శత్రురాజులు దమ యున్నతికై నతిఁజెందుదురు. తమ గృహాంతఃస్థితికై నీ సౌధాగ్ర బహిఃస్థితిని వహింతురు.

ఇట విరుద్ధఫలయత్నము నిబద్ధమైనది. విరోధపరిహారము సుగమము.

## ౩౦. అన్యోన్యము

కం. ... ... ...
... ... ... అన్యోన్యము భూ
వ్యవిభూషణ భావంబునఁ
దవులుట యన్యోన్యమయ్యె ధర సెట్లన్నన్.

పరస్పరము రెండు వస్తువులు భూష్యభూషణ భావమును బొందినట్లు వర్ణించి నచో నన్యోన్యాలంకారము.

కం. లలన నృసింహునిఁ జెందెడి
తలఁపున మైఁదొడవులిడఁగఁ, దనులత సెలఁగెన్
గలితవిభూషణములచేఁ,
లలితవిభూషణము లంగలతచేఁ జెలఁగెన్. ౧౪౧

నరసభూపాలుని కూటమికై యువతి ధరించిన భూషణములచే దాని శరీరము విలసిల్లెను. దాని శరీరముచే భూషణములు విలసిల్లెను. ఇట భూష్యభూషణభావము నిబద్ధము.

## ౩౧. విషమము

కం. అవిరళ విరుద్ధకార్యో
ద్భవము, ననర్థాంకురాభిపతన విధానం
బు, విరూపఘటన, మనఁగా
నవనిం ద్రివిధంబు విషమ మది యెట్లన్నన్. ౧౪౨

సమముగానిది విషమము. ఇది విరోధమూలకము. కారణమువలన విరుద్ధ కార్యము పుట్టినచో నొక విషమభేదము; కారణమువలనఁ గార్యముగాక యనర్థము సంభవించినచో నది యొక విషమభేదము; విరుద్ధములగు రెండు వస్తువుల నొకచో సమకూర్చినచో మరొక విషమభేదము.

౧

కం. కాలాహినీలమగు నీ
వాలావహభూమియందు వరలుచు రిపుభూ
పాలానన వైవర్ణ్య వి
భాలాభ మొనర్చు నోబపార్థివునరసా! ౧౪౩

కాలసర్పమువలె నల్లనైన నీ ఖడ్గము శత్రురాజుల మొగమునకు వెల్లఁబాటును గూర్చుచున్నది.

నల్లని కత్తి యను కారణమువలన 'వెల్లఁబాటు' అను విరుద్ధకార్యము కలుగు చున్నట్లు నిబద్ధమైనది. ఇది విరుద్ధకార్యోత్పత్తి.

౨

చ. అమరు భవత్ప్రతాపతపనాతప మంబరవీథిఁ బర్వఁగా
సమదవిరోధిభూరమణచంద్రముఖీవదనారవిందముల్
క్రమమునహర్ష మొందమియు కాఁదనయంబు దృగంబునిర్ఝరీ
హిమజలదూషితంబులగు నెంతయు శ్రీ నరసింహ భూవరా!

లోకమున సూర్యాతపమునకుఁ దామరపూలు వికసించును. కానీ నీ ప్రతాప సూర్యాతపమునకు శాత్రవభార్యల ముఖారవిందములు వికసింపకున్నవి.అంతియే కాదు. శోకబాష్పరూపమగు హిమజలముచే దూషితము లగుచున్నవి.

ఇట ముఖారవిందములు వికసింపకపోఁగా దృగంబుహిమదూషితములై చెడుచున్నవి. ఇట్టిదే

"భక్ష్యాశయాఽహిమంజూషాం దష్ట్వాఽఖుస్తేన భక్షితః" ఎలుక తినుబండార మున్నదని యాశించి పాములబుట్టను బ్రవేశించి దానిచే భక్షింపఁబడినది.

ఈ రెంటను గారణమువలనఁ గార్యము పుట్టక యనర్థము గలిగినది.

3

సీ. హయగజారూఢులై యలరు రాజన్యపుం
గవులేడ ? గవులేడఁ ? గంబుకంఠి !
ఘనభోగభాగ్యసంగతులైన మంత్రికే
సరులేడ ? సరులేడఁ ? జంద్రవదన !
సౌధవీథికలలోఁ జరియించు పుష్పకో
మలులేడ ? మలలేడఁ ? దలిరుఁబోఁడి !
చీనిచీనాంబర శ్రీఁజెందు బాలికా
వలులేడ ? వలులేడ ? వామనయన !
గీ. అనుచు నీ దాడికోడి కాటడవిఁబడిన
వైరిభూపాలకుల దురవస్థఁ జూచి
కాంతతోఁబల్కు వింధ్యపక్కణ కిరాతుఁ
డరిజయాటోప ! తొరగంటి నరసభూప ! ౧౮౫

రాజన్యపుంగవులేడ ? గవులేడ ? ఇత్యాదిరూపమున విరుద్ధవస్తువుల సంఘట నము నిబద్ధమై యున్నది.

## 3౨. సమాలంకారము

కం. అనురూపములగు వస్తువు
లనయము నెనయంగ నది సమాలంకృతియై
ఘనత రసజ్ఞుల మతమునఁ
దనరుం గావ్యంబులందు ధర నెట్లన్నన్. ౧౮౬

పరస్పరానుకూలవస్తువుల సంబంధము వర్ణింపఁబడినచో సమాలంకారము.

చ. అలరు రతిన్ రతీశు, దమయంతి నలున్, నలువొండ ముందుగా
నలువ సృజించి యందుకతనం దనచేయుకుకెల్లఁదీఱి నే
ర్పలవడ నో లతాంగి! నరసాధిపు నిన్ననుగూర్చి ప్రేమసం
కలితముగాఁగ దంపతులఁగా నొనరింపఁగఁబోలు; మెచ్చితిన్.

అనురూప దంపతులగు రతీ మన్మథాదులను సృజించి గడితేఱినవాఁడై బ్రహ్మ నరసాధిపునిని నిన్నును సృజించి దంపతులుగాఁ జేసినాఁడు.

ఇట ననుకూల దంపతులను సృష్టించినట్లు వర్ణించుటచే సమాలంకారము.

## 33. తుల్యయోగిత

కం. ప్రకృతంబులకైనను, న
ప్రకృతంబులకైనఁ దుల్యభావము గలుగం
బ్రకటమగుఁ దుల్యయోగిత
యకలంకౌపమ్య గమ్యమై యెట్లన్నన్. ౧౮౭

కేవలప్రకృతములకును, కేవలాప్రకృతములకును గమ్యమానమగు నౌపమ్యముచేఁ దుల్యభావము చెప్పినచోఁ దుల్యయోగిత.

### ౧. కేవలప్రకృతతుల్యయోగిత

కం. నరసింహా! రాజశేఖర!
నరనుతమగు నీదు వితరణంబును, రణమున్,
నిరత స్వాస్థ్యంబుగఁ గ్ర
మ్మఱ 'దేహి' యనంగ నీక మనుచుంబరులన్. ౧౮౮

స్వాస్థ్యము = సౌఖ్యము; స్వరస్థితి.

ఇది నరసభూపాల వర్ణనమగుటచే నాతని వితరణము, రణము, అను రెండును బ్రకృతములే. నీ వితరణమును, రణమును "నిరతసాహాయ్యంబుగ...మనుచుంబరులకా" అనుటచేఁ బ్రకృతములగు రెంటికిని ధర్మైక్యము చెప్పఁబడినది. కాన 'వితరణము రణముతో సమానము' అను నౌపమ్యము వాచ్యముగాఁగాక గమ్యముగా భాసిల్లు చున్నది.

## ౨. కేవలాప్రకృతతుల్యయోగిత

కం. కొండలు, రంభాదుల చనుఁ
గొండలు, వడి నదరుచుండు ఘోరాజుల నీ
చండజయపటహారవము ల
జాండంబులు నిండ నోబయప్రభునరసా! ౧౫౦

నీ జయపటహారవము బ్రహ్మాండము నిండఁగానే కొండలును రంభాదుల చనుఁగొండలును నదరుచుండును. ఇటఁ 'గొండలు, చనుఁగొండలు' అనునవి యప్రకృతములు. పటహధ్వనిచేఁ గొండ లదరుచున్నవి. శత్రురాజులు మరణించి తమ సమీపమునకు వత్తురను శుభమును సూచింప రంభాదుల చనుఁగొండ లదరు చున్నవి.

'అదరుట' అను ధర్మైక్యముచే రెంటికిని (కొండలకుఁ, జనుగొండలకు) నౌపమ్యము గమ్యము.

## ౩౮. దీపకము

కం. ప్రకృతము లప్రకృతంబులు
ప్రకటంబుగఁ గూడి తుల్యభావముఁ జెందన్
సుకవీంద్రుల మతమున దీ
పకమగు; నిది గమ్యసామ్యపర; మెట్లన్నఁ. ౧౫౧

కేవల ప్రకృతములకును, కేవలా ప్రకృతములకును ధర్మైక్యముచే నౌపమ్యము గమ్యమయ్యెనేనిఁ దుల్యయోగిత యని చెప్పఁబడినది. ఇటఁ బ్రకృతాప్రకృతములకు రెంటికిని సమాన ధర్మసంబంధముచే నౌపమ్యము గమ్యమయ్యెనేని దీపకాలంకారము. దీప ఇవ దీపకం; ప్రాసాదమునఁ బెట్టిన దీపము వీధిలోనికిఁ గనఁబడును. కావున నది ప్రాసాదమునకును వీధికిని నుపకరించు విధమునఁ బ్రకృతాప్రకృతములకుఁ దుల్యముగా నెందు ధర్మ మన్వయించునో యది దీపకాలంకారము. ఈ సమానధర్మము

క్రియారూపముగాఁ గాని గుణరూపముగాఁ గాని యుండును. దీనిచేఁ గ్రియాదీపక మనియు గుణదీపకమనియు సమానధర్మ భేదమునుబట్టి ప్రప్రథమమున దీపకము ద్వివిధము.

కం. ధారిణి సదాళిసన్నుత
సారస్యంబగుచు విమలజలజము, రాకా
నీరేజవైరిబింబము,
నీ రమ్యయశంబుఁ,బోల్చు నెమ్మి నృసింహా! ౧౫౭

తెల్లఁదామరయుఁ, బున్నమచందురుఁడును, నీకీర్తియు సదాళిసన్నుత సారస్యమగుచుఁ బోలుచును. (సదా + అళి సన్నుతము = తామరపువ్వు; సత్ + అళి సన్నుతము = నక్షత్రముల పంక్తిచే సన్నుతను చంద్రబింబము; సత్ + అళి = విద్వత్సమూహముచే సన్నుతము కీర్తి).

ఇటఁ బ్రకృతము కీర్తి; తెల్లఁదామరయుఁ జంద్రబింబమును నప్రకృతములు. ఈ ప్రకృతాప్రకృతములకు సదాళిసన్నుత సారస్యత్వము సమాన ధర్మము. దీనిచే నౌపమ్యము గమ్యమగుచున్నది.

ఇట సమానధర్మము గుణ క్రియారూపమున నుండవలెనని చెప్పి యుంటిమి. ఇట సమానధర్మమగు 'సదాళిసన్నుత సారస్యము' గుణము. కాని యీ క్రింది యుదాహరణములందువలె దీనియందు సొగసు లేదు.

భాగీరథ్యా జలనిధీ <u>రాజతే</u> । జ్యోత్స్నయా పూర్ణిమాచంద్రః
శ్రుత్యా కమలభవః । కీర్త్యా ప్రతాపరుద్రోఽపి.

భాగీరథిచే సముద్రమును, వెన్నెలచేఁ బూర్ణిమాచంద్రుఁడును, వేదముచే బ్రహ్మదేవుఁడును, కీర్తిచేఁ బ్రతాపరుద్రుఁడును రాజిల్లుచున్నారు.

ఇట 'రాజతే' అను క్రియయే ప్రకృతాప్రకృతములకు సమానధర్మముగా స్వీకరింపఁబడినది.

<u>శ్యామలాః</u> ప్రావృషేణ్యాభిర్దిశో జీమూతపంక్తిభిః
భువశ్చ సుకుమారాభిర్నవశాద్వలరాజిభిః.

వర్షాకాల మేఘములచే దిక్కులును, సుకుమారములైన నవశాద్వల పంక్తిచే భూములును శ్యామలములు.

ఇట 'శ్యామలములు' అనునది గుణవాచకము. శ్యామలత్వరూపగుణమే సమానధర్మముగా స్వీకరింపఁబడినది.

ఈ గుణక్రియారూప సమానధర్మము వాక్యముయొక్క యాది, మధ్య, అంత, స్థితులనుబట్టి ముత్రివిధములు. మొందటి 'భాగీరథ్యా' అను నుదాహరణమున 'రాజతే' అను క్రియారూప సమానధర్మము వాక్యమధ్యస్థము గాన మధ్యదీపకము. 'శ్యామలాః' అను నుదాహరణమున నా ధర్మము వాక్యాదియందుంటచే నాదిదీపకము. అంత దీపకము నిట్లే యూహించుకొనవలెను.

మొందటి క్రియారూప సమానధర్మభేదము గల దీపకములోఁ గ్రియతోఁ బెక్కు కారకము లన్వయించుచున్నవి. అనేక క్రియలతో నేకకారక మన్వయించు విభేదము గూడఁ గలదు.

> సాధూనా ముపకర్తుం । లక్ష్మీం ద్రష్టుం విహాయసా గంతుం
> న కుతూహలి కస్య మన । శ్చరితం చ మహాత్మనాం శ్రోతుం ?

సాధువుల కుపకారము సేయుటకును, లక్ష్మినిఁ జూచుటకును (గడించుటకును) ఆకాశగమనము సేయుటకును, మహాత్ముల చరితమును వినుటకును నెవని మనస్సు కుతూహలిగాదు ? (కుతూహలపడదు ?)

ఇటఁ 'గుతూహలి' అను నేకకారకమే ఉపకర్తుం, ద్రష్టుం, గంతుం, శ్రోతుం, అను ననేక క్రియలతో నన్వయించుచున్నది. ఇటఁ గ్రియలన నసమాపకక్రియలు.

## ౩౫. ప్రతివస్తూపమ

కం. వేర్వేర వాక్యయుగమునఁ
బర్విన సాధర్మ్యమమరఁ బ్రఖ్యాతంబై
యుర్విం బ్రతివస్తూపమ
సర్వజనుల మతమునందుఁ జను నెల్లన్నన్. ౧౫౩

ప్రతివస్తు ప్రతివాక్యం ఉపమా సామ్యం యస్యాం సా ప్రతివస్తూపమా. ప్రతి వాక్యమునందును బ్రత్యేకముగా నొకే సమానధర్మమును నిబంధించినచోఁ బ్రతి వస్తూపమాలంకారము. ఇందుపమావాచకము ప్రయోగింపఁబడదు. కాన నౌపమ్యము గమ్యమానమై యుండును.

ఉపమాలంకారమున 'వస్తుప్రతివస్తూపమ' అను భేదము చూపఁబడినది. దానికిని దీనికిని భేదమేమన, అందొక్కవాక్యమే యుండును. ఇందు వాక్యద్వయ ముండును. అందుపమావాచకము ప్రయుక్తమగును. ఇందుఁ బ్రయుక్తము గాదు. ఈ ప్రతివస్తూపమ సాధర్మ్య వైధర్మ్య భేదములచే ద్వివిధము.

కం. రవియొకఁడె ధురంధరుఁడౌ
కవిసి తమోవితతినడఁపఁ; గవిదైన్యతమో
నివహంబునడఁప నీవే
యవనిని ధూర్వహుఁడ వోబయప్రభునరసా! ౧౫౪

చీఁకటి నడంచుటకు సూర్యుఁడొకఁడే ధురంధరుఁడు; కవిదైన్యతమస్సు నడఁప నీవే ధూర్వహుఁడవు; ఈ రెండువాక్యములలోఁ 'దమస్సు నడఁచుట' అను నొక్క ధర్మమే భిన్నభిన్నముగా గ్రహింపఁబడినది. ఇది సాధర్మ్యరూపము.

విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం
నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనాం.

విద్వాంసుఁడే విద్వజ్జనపరిశ్రమ నెఱుఁగును. వంధ్య ప్రసవవేదన నెఱుఁగదు గదా!

ప్రథమవాక్యమున 'ఎఱుఁగును' ద్వితీయవాక్యమున 'ఎఱుఁగదు' అను విరుద్ధ ధర్మములు సమానధర్మముగా స్వీకరింపఁబడినవి.

## ౩౬. దృష్టాంతము

కం. బింబప్రతిబింబత్వము
సంబరగిన వాక్యయుగమునం గల సాధ
ర్మ్యంబు దెలంగిన దృష్టాం
తంబగు నది కృతులయందు ధర నెట్లన్నన్. ౧౫౫

రెండు వాక్యములందు సామాన్యధర్మము బింబప్రతిబింబ రూపమునఁ జెప్పఁబడినచో దృష్టాంతము. బింబప్రతిబింబోపమయం దొక్కటే వాక్యము. ఇట వాక్యద్వయ ముండును.

కం. అసదసురవిసరవిశసన
రసవిస్సృమరసాహసుండు రాముఁడె ధరలో;
నసమసమరతలసమదా
రిసమూహవిభేది వీవె శ్రీ నరసింహా! ౧౫౬

రాక్షస సంహార సాహసుఁడు రాముఁడే; యుద్ధములందు శత్రుసమూహ విభేదివి నీవే.

ఇట నౌపమ్యము గమ్యము. (రామునకును నరసింహునకును) అసదసుర... సాహసత్వము, అసమసమర...విభేదిత్వము, అనుచో సాధర్మ్యములు బింబప్రతిబింబరూపమున నిబద్ధమైయున్నది. ప్రతివస్తూపమయందు సాధర్మ్య మొక్కటియే భిన్నభిన్న పదములతో నిబద్ధమగును. ఇట భిన్నధర్మములు బింబప్రతిబింబరూపమున నిబద్ధములై యున్నవి.

ఈ దృష్టాంతముగూడ సాధర్మ్య వైధర్మ్య భేదములచే ద్వివిధము. పైయుదాహరణము సాధర్మ్య దృష్టాంతము. ఈ క్రింది శ్లోకము వైధర్మ్య దృష్టాంతము.

కృతం చ గర్వాభిముఖం మనస్త్వయా కిమన్యదేవం నిహతాశ్చ నో ద్విషః
తమాంసి తిష్ఠంతి హి తావదంశుమాన్ న యావదాయాత్యుదయాద్రిమౌళితాం.

నీవు నీ మనస్సు గర్వాభిముఖమును జేసితివి. ఇఁకేమున్నది? శత్రువులు నశించిరి. సూర్యుఁ డుదయాద్రిమౌళిమీఁదికి వచ్చువఱకే చీఁకట్లుండును.

ఇట 'శత్రువులు నశించిరి' అనుదానికిఁ 'జీకట్లు నశించినవి' అను వాక్యమున్నచో సాధర్మ్యముండును. కాని యిటఁ 'జీఁకట్లుండును' అని యుంటచే వైధర్మ్యము నిబద్ధము.

## ౩౭. నిదర్శనాలంకారము

కం. ధర నన్వయంబు గూడక
గరిమఁ సామ్యంబు నెచట గమ్యముఁ జేయం
బరగునది నిదర్శన యన
నిరవొందును గృతులయందు నిది యెట్లన్నన్. ౧౫౭

ఉపమానధర్మ ముపమేయగతముగా, నుపమేయధర్మ ముపమానగతముగా వర్ణింపఁబడి సరియైన యన్వయము సంభవింపకపోవుటచే నెచట బింబప్రతిబింబభావ మాక్షేప్యమగునో యది నిదర్శన. లేక

ఉపమేయవాక్యార్థమం దుపమానవాక్యార్థముయొక్క యభేదారోపము కానీ ఉపమానవాక్యార్థమం దుపమేయవాక్యార్థముయొక్క యభేదారోపము కానీ నిదర్శన యనఁబడును.

ఈ నిదర్శనాలంకారము పదార్థవృత్తి నిదర్శనయనియు, వాక్యార్థవృత్తి నిదర్శన యనియును ద్వివిధము.

కం. బలవదరిరాజసేనా
జలధిన్ [illegible]

విలసనముఁదాల్చె నీ యసి
యలఘురణోత్సాహసరస! యాజిళనరసా! ౧౫౮

నీ ఖడ్గము శత్రురాజసేనాజలధియందు జీవనముఁ (ప్రాణములనుజలమును) ద్రావి మేఘశోభావిలాసమును దాల్చెను.

కత్తి యుపమేయము; మేఘ ముపమానము. కత్తి మేఘముయొక్క శోభావిలాస మెట్లు వహించును? కత్తి మేఘశోభను వహించెనన్నచో నుపమానధర్మమును నుపమేయము వహించెనని యర్థమగును. ఒకదాని శోభను మరొక టెట్లు వహించును? కావున నన్వయము సంభవింపదు. అట్లగుట 'మేఘశోభవంటి శోభను వహించె'నని బింబప్రతిబింబభావము నాక్షేపించుకొనవలెను. దానివలన సామ్యము గమ్యమగుచున్నది. 'జలధర శోభావిలాసము' అనునది యేకపదము గానఁ బదార్థవృత్తి నిదర్శన.

## ౨. వాక్యార్థవృత్తి నిదర్శన

అరణ్యరుదితం కృతం, శవశరీరముద్వర్తితం,
స్థలేఽబ్జ మవరోపితం, సుచిరమూషరే వర్షితం,
శ్వపుచ్ఛ మవనామితం, బధికర్ణజాపః కృతో,
ధృతోఽన్ధముఖదర్పణో, యదబుధో జన స్సేవితః.

మూర్ఖజనము సేవింపఁబడినదన నరణ్యరోదన చేయఁబడినదన్నమాట; శవశరీరము నలుగు పెట్టఁబడినదన్నమాట; నేలమీఁదఁ దామర పాతఁబడినదన్నమాట; చవిటినేల వర్షము పడినదన్నమాట; కుక్కతోఁక వంపఁబడినదన్నమాట; చెవిటివాని చెవిలో రహస్యము చెప్పఁబడినదన్నమాట; అనఁగా వ్యర్థము.

ఇట 'మూర్ఖజనము సేవింపఁబడినదన నరణ్యరోదనము చేయఁబడినది' మొదలగు నెడల నుపమేయమునందు నుపమాన మారోపింపఁబడినది.

పదార్థవృత్తి వాక్యార్థవృత్తి నిదర్శనలకు భేదమేమనఁ, గేవల ముపమానోపమేయ ధర్మము లొకదానియందొకటి యారోపింపఁబడినచోఁ బదార్థవృత్తినిదర్శన. ఉదా॥ జలధరశోభావిలాసము. విశిష్టధర్మములనఁగా బింబప్రతిబింబభావాపన్న ధర్మములకు నైక్యారోపము సేసినచో వాక్యార్థవృత్తి నిదర్శన యని భేదమును గ్రహింపవలెను. ఎట్లన, 'మూర్ఖజనము సేవింపఁబడినదన నరణ్యరోదనము చేయఁబడినది' అనుచో విశిష్టధర్మమున కారోపము సేయఁబడినది.

ఈ భేదమును కువలయానంద కర్త యిచ్చినాఁడు. ప్రతాపరుద్రీయ కర్త యీ భేదమును దెలుపలేదు. ఎల్లయెడల బింబప్రతిబింబభావాక్షేపమందునని యాశయమును దెలిపెను.

'కత్తి మేఘశోభను వహించెను' 'మూర్ఖజనము సేవింపఁబడిన దనవరణ్యరోదనము చేయఁబడినది.' అను తావులం దుపమానధర్మ ముపమేయమున నారోపింపఁబడినది.

ఇఁక నుపమేయధర్మ ముపమానమున నారోపింపఁబడుట కీ క్రింది శ్లోక ముదాహరణము.

> వియోగే గాఢనారీణాం యా గండతలపాండిమా ।
> అదృశ్యత స ఖర్జూరీ మంజరీ గర్భ రేణుషు.

వియోగినులగు గాఢ స్త్రీల గండపాండిమము ఖర్జూరమంజరీరేణువులందుఁ గనఁబడుచున్నది.

ఇట నుపమానమగు ఖర్జూరమంజరీరేణువులందు నుపమేయమగు గండముల యొక్క ధర్మమగు పాండిమ మారోపింపఁబడినది.

ఈ యన్నియెడలను నన్యధర్మ మన్యస్థలమున సంభవింపదు. కాన బింబప్రతిబింబభావరూపమునఁ దత్సదృశధర్మాక్షేపము సేయవలెను. ఈ యుదాహృతభేదములం గాక మరొక భేదము గలదు. చూడుఁడు.

> "అపరాం బోధనం ప్రాహుః క్రియాఽసత్సదర్థయోః
> నశ్యేద్రాజవిరోధీతి క్షీణం చంద్రోదయే తమః
> ఉదయన్నేవ సవితా పద్మేష్వర్పయతి శ్రియం
> విభావయన్ సమృద్ధీనాం ఫలం సుహృదనుగ్రహః."

ఒకానొక వస్తువు తన క్రియచేఁ బరుల కసదర్థమును గానీ సదర్థమును గానీ బోధించిన యెడల నది యొక నిదర్శనాభేదము.

'రాజవిరోధి నశించును' అని బోధించుచుఁ జంద్రోదయమునఁ దమస్సు క్షీణించుచున్నది. ఇటఁ దమస్సు తన క్రియ యగు క్షయముచే 'రాజవిరోధి క్షయించును' అని యసదర్థమును బోధించుచున్నది.

"సూర్యుఁడు దా నుదయించుచునే పద్మములయందు శ్రీ (శోభా)సమృద్ధిని నర్పించుచున్నాఁడు." ఇట నర్పణమను క్రియచే సమృద్ధులకు ఫలము (సంపదలున్నందులకు ఫలము) సుహృదనుగ్రహమే (మిత్రుల ననుగ్రహించుటయే) అను సదర్థమును (సూర్యుఁడు) బోధించుచున్నాఁడు.

## ౩౮. వ్యతిరేకము

కం. ధర నుపమానముకన్నను
నరుదగు నుపమేయ మధికమౌనన సామ్యం
బురుభేదకారణంబై
యిరవుగ వ్యతిరేకమయ్యె నది యెట్లన్నన్. ౧౫౯

లోకమున నుపమేయముకన్న నుపమాన మధికముగా నుండును. కానీ యెచ్చట నుపమానముకన్న నుపమేయ మధికమై భేదప్రధానమగు సాధర్మ్యము గమ్యమాన మగునో యది వ్యతిరేకము. 'సామ్యంబురుభేదకారణము' అనరాదు. 'భేదప్రధాన మగు సామ్యము' అని చెప్పవలెను. ఇం దుపమేయాధిక్యమే వ్యతిరేక లక్షణమని చెప్పఁబడినది. ఉపమేయన్యూనత్వము, అనుభయరూపము, అనియును మరి రెండు భేదములు గలవు. అవియు నుదాహరింపఁబడును.

సీ. బహుతరాశాభ్రాంతి బయలుద్రావఁకయున్నఁ
గువలయ ద్వేషంబుఁ గోరకున్న
మీఁటితమ్ముల విరిపోటు సేయకయున్న
దోషాభిభూతుఁడై తొలఁగకున్న
జగతి నందఱకును బగ లొనర్పకయున్న
వారుణీసక్తినిఁ బాఱకున్న
ద్విజరాజ పరిభవోద్వృత్తిఁ జేకొనకున్న
సరసుల నింకింపఁజాలకున్న

గీ. సాటియగు విశ్వవినుత శశ్వత్ప్రతాప
వైభవధ్వస్త దుర్వారవైరివీరుఁ
డైన యోబయనరసింహు నమితభువన
భవనభృత తేజమున కబ్జబాంధవుండు. ౧౬౦

ఈ పద్యము ప్రథమాశ్వాసమున ౧౧౭ గాఁ దేజస్విత కుదాహరింపఁబడినది. అట వివరణము వ్రాయఁబడినది. చూచుకొనునది.

ఇట సూర్యునికన్న నరసభూపాలుని తేజ మధికతరమని చెప్పఁబడుటచే వ్యతిరేకాలంకారము. సామాన్యముగా నీ వ్యతిరేకాలంకారము శ్లేషగర్భముగా నుండును. ఇది యుపమేయాధిక్య పర్యవసాయి.

ఉ. నీవు చిగుళ్ళఁబొంపములనేఁ బ్రియురాలి గుణాలిరక్తుఁడన్
నీవయిపట్లు నావయిపు నిచ్చశిలీముఖపంక్తి వచ్చుఁ గాం
తావరపాదఘాతము ముదంబిడు నీకటునా;కశోకమా!
నీవును నేను దుల్యులము; నేను సశోకుఁడనైతి దుర్విధిన్.

ఓ యశోకమా! నీ వశోకమవు; నేను సశోకుఁడను. ఇట నుపమేయమగు 'నేను' (విరహి) సశోకుఁడగుటచే నుపమానముకన్న న్యూనత్వము చెప్పఁబడినది.

దృఢతర నిబద్ధ ముష్టేః। కోశనిషణ్ణస్య కస్య చిన్మలినస్య
కృపణస్య కృపాణస్య చ। కేవల మాకారతో భేదః.

గట్టి పిడికిలి గలిగినట్టియుఁ, గోశమున (ధనాగారమున – ఒఱయందు) నిద్రించినట్టియు, మలినస్వరూపము గలిగినట్టియుఁ గృపణ కృపాణములకుఁ గేవలము అకారము ('ఆ' యను వర్ణము) చేతనే భేదము. 'కృపణ' శబ్దమున 'ప' కారమున 'అ' కారమును 'కృపాణ' శబ్దమున 'ప' కారముపై 'ఆ' కారమును గలవు. ఇదియే భేదము.

ఇట నుపమేయమగు కృపణునకుఁగానీ, యుపమానమగు కృపాణమునకుఁగానీ యాధిక్యము వర్ణింపఁబడమి "ననుభయరూపము" అను భేదము.

## ౩౯. శ్లేషము

కం. ప్రకృతము,లప్రకృతంబులుఁ,
బ్రకృతాప్రకృతములు, శబ్దపాటవమాత్ర
ప్రకటిత సామ్యముఁ జెందిన
నకలంకత శ్లేషమయ్యె నదియును వరుసన్. ౧౬౧

కం. నిరతము శ్లిష్టవిశేష్యత
నరు దందును బ్రకృతములు; నప్రకృతములున్;
ధర నశ్లిష్టవిశేష్యము
లరయం బ్రకృతాప్రకృతము; లవి యెట్లన్నన్. ౧౬౨

ప్రకృతములుం గానీ యప్రకృతములుం గానీ ప్రకృతాప్రకృతములుం గానీ యెచ్చట శ్లేషించునో యట శ్లేషాలంకారము. 'శబ్దపాటవమాత్ర ప్రకటితసామ్యముఁ జెందిన' అనఁగా అర్థమునకు శబ్దమాత్రసామ్య మున్నచో ననఁగా శబ్దసమత్వ మున్నచో ననఁగా 'నొకశబ్దముచే రెండర్థములు చెప్పఁబడగా' అని యర్థము. ఇంకు రెండర్థములకును నేకశబ్దవాచ్యత్వము...

అందు రెండర్థములును బ్రకృతములయినచోఁ బ్రకృతశ్లేషము; రెండును నప్రకృతములయినచో నప్రకృతశ్లేషము; రెంటిలో నొకటి ప్రకృతమును, వేరొకటి యప్రకృతమును నయ్యేనేిఁ బ్రకృతాప్రకృతశ్లేష.

ప్రకృతశ్లేషయందును, నప్రకృతశ్లేష మందును విశేషణవిశేష్యములు రెండును శ్లేషించును. ప్రకృతాప్రకృతశ్లేషలో విశేష్యము శ్లేషింపరాదు. విశేషణమే శ్లేషించును.

"యమకాదౌ భవేదైక్యం డలయో రలయోర్బవోః
శషయోర్నణయోశ్చాంతే సవిసర్గావిసర్గయోః
సబిందుకాబిందుకయోః స్యా దభేద ప్రకల్పనం"

యమకశ్లేషాదులందు డకార లకారములకును, రేఫ లకారములకును, బకార వకారములకును, శకార షకారములకును, నకార ణకారములకును, సవిసర్గ, అవిసర్గపదములకును, సబిందుకాబిందుకపదములకును నైక్యము సేయవచ్చును. అను నియమము నీశ్లేషలో బాటించుకొనవచ్చును. ఆంధ్రభాషలో నర్ధానుస్వారములుంగల పదములకును లేనివానికిని రేఫ, శకటరేఫములకును నైక్యము జేసికొనవచ్చును.

### ౧. ప్రకృతశ్లేషము

కం. పరిణత గుణభరితములై
నిరుపమతరశాస్త్రకలన నిర్నిద్రములై
యిరవగు నీ ధర్మంబులు
నరనుత! యోబక్షితీంద్రు నరసింహనృపా! ౧౬౩

నరసభూపాలా! నీధర్మములు (విండ్లు) గుణభరితములై (సజ్యములై) శాస్త్ర కలన నిర్నిద్రములై (శస్త్రసమూహసంబంధమువలన నిర్నిద్రములై) యున్నవి.

నరసభూపాలా! నీధర్మములు(రాజధర్మములు) గుణభరితములై (సంధివిగ్రహ యానాది షడ్గుణములతోఁ బూర్ణములై) శాస్త్రకలననిర్నిద్రములై (రాజధర్మశాస్త్ర సంబంధముచే నిర్నిద్రములై) యున్నవి.

రాజవర్ణనము ప్రకృతముగాన నీరెండర్థములును బ్రకృతములే. ఇట విశేషణ విశేష్యములు రెండును శ్లేషించినవి.

### ౨. అప్రకృతశ్లేషము

కం. అసదృశకాష్ఠాశ్లేషో
ల్లసితుల, నుగ్రకరయోగలక్షితుల, విభా

వసులనగు నీదు తేజో
విసరము నరసింహ! యోబవిభునరసింహా! ౧౬౪

ఓనరసభూపా! నీతేజము దిక్కుల నాలింగనము సేసికొనునట్టియుఁ, దీక్ష్ణమగు కిరణములం గలిగినట్టియు సూర్యుని నవ్వును;

ఓనరసభూపాలా! నీతేజము కట్టె నాలింగనము సేసికొనునట్టియు, నుగ్రమైన కిరణములం గలిగినట్టియు నగ్నిని నవ్వును.

ఇటఁ బ్రకృతము తేజము. సూర్యాగ్ను లప్రకృతములు. ఈ యప్రకృతేషు లకు శ్లేష. ఇటఁగూడ విశేషణ విశేష్యములు రెండును శ్లేషించినవి.

ఈ ప్రకృత, అప్రకృత శ్లేషలలో విశేష్యము శ్లేషింపవలెనని పైనిఁ జెప్పఁబడినది. కాని రసగంగాధరకారుఁ డీ విశేష్యశ్లిష్టత కామచారమని చెప్పెను.

కరకలితచక్రఘటనో । నిత్యం పీతాంబర స్తమోఽరాతిః
నిజసేవిజాడ్యహారణో । విష్ణు సూర్యశ్చ వః పాతు.

కరకలితమైన పాంచజన్య చక్రయోగము గలవాఁడును, పీతాంబరుఁడును, (తమః) రాహువునకు శత్రువును, తన సేవకుల జాడ్యమును (అజ్ఞానమును) హరించు వాఁడును నగు విష్ణువు మిమ్ము రక్షించుఁగాక.

తన కిరణములయొక్క ప్రసరణముచేతఁ జక్రవాకపక్షులను గూర్చువాఁడును, ఆకాశమును ద్రాగినవాఁడును (ఆక్రమించినవాఁడును) చీఁకటికి శత్రువును, తన్ను సేవించినవారి జాడ్యమును (మూర్ఖత్వమును) హరించువాఁడును నగు సూర్యుఁడు మిమ్ము రక్షించుగాక.

ఇటఁ బ్రకృతములగు విశేష్యములు (విష్ణు, సూర్యపదములు) శ్లేషింపలేదు.

హరికరసంగా దధికం । రమణీయా ప్యతులరాగసంకలితా
కమలాయాః కమలస్య చ । శోభా గలితా తవాఽననస్యాగ్రే.

స్వభావముచే మిక్కిలి రమణీయురాలును, హరికరసంగమువలన (విష్ణుహస్తసంగము) నసమానమైన రాగము గల కమల (లక్ష్మి) యొక్క శోభ సుందరీ! నీ ముఖముముందు వివర్ణమయ్యెను.

స్వభావముచే మిక్కిలి రమణీయమయ్యును సూర్యకిరణ సంపర్కముచే నసమానమైన రాగము గల కమలముయొక్క శోభ సుందరీ! నీ మొగముముందు వివర్ణమయ్యెను.

ఇట నప్రకృతములగు విశేష్యములు (కమలా, కమల, శబ్దములు) శ్లేషింపలేదు.

## 3. ప్రకృతాప్రకృత శ్లేష

కం. అరిదరకరుఁడై సుమనో
వరభరణధురీణుఁడై యవారిత లక్ష్మీ
స్థిరవాసభాసురుండై
నరసింహుఁడు పొల్చు నాదినరసింహుఁడనన్. ౧౬౫

అరి = శత్రువు - చక్రము; దరము = భయము; శంఖము; సుమనోవరులు = దేవతలు – పండితులు.

నరసభూపాలుఁ డాదినరసింహునివలె "అరిదరకరుఁడై, సుమనోవరభరణ ధురీణుఁడై యవారితలక్ష్మీ స్థిరవాసభాసురుఁడై పాలించును.

ఇట నరసభూపాలుఁడు ప్రకృతము; ఆదినరసింహుఁ డప్రకృతము. ఇట 'అరిదరకరుఁడు, సుమనోవరభరణధురీణుఁడు' ఇత్యాది విశేషణములే శ్లేషించినవిఁ కాని విశేష్యమగు నరసింహ శబ్దము శ్లేషింపలేదు.

ఈ ప్రకృతాప్రకృత శ్లేష యెల్లయెడల నుపమచే సంకీర్ణమైయుండును. ఉపమచే శ్లేష యుత్థాపితమగును. ఇట శ్లేషయే ప్రధానము.

విశేషణములుమాత్రమే యీప్రకృతాప్రకృతశ్లేషలో శ్లేషింపవలెనని చెప్పితిమి. విశేషణములుమాత్రము శ్లేషించినను ప్రకృతాప్రకృతధర్ములు రెండును గ్రహింపబడవలెను. (నరసింహుండాదినరసింహుఁడనన్ అనుచోటియందువలెనే) ప్రకృత ధర్మినిమాత్రమే గ్రహించినచో నది సమాసోక్తియే యగును. సమాసోక్తిలో విశేషణములు మాత్రమే శ్లేషించును.

ఈ ప్రకృతాప్రకృతశ్లేషకును శబ్దశక్తిమూలవ్యంగ్యమునకును గల భేదమేమి? అన్నచో 'ఆదినరసింహుఁడనన్' అను నుపమానము వాచ్యమైనది. దానినిఁ దీసివేసి 'త్రిభువనస్తుతమహిమన్' అని యున్నచో నుపమాలంకారము వ్యంగ్యమగును.

ఇఁక నీశ్లేషలో శబ్దములు విఱుగకున్నచో అభంగశ్లేష; విఱిగినచో సభంగ శ్లేష యనఁబడును.

"స్వయంచపల్లవాతామ్రభాస్వత్కరవిరాజితా
ప్రభాతసంధ్యేవా స్వాపఫలలుబ్ధేహితప్రదా.

ఇది పార్వతీవర్ణనము. పార్వతీదేవి ప్రభాతసంధ్యవలెఁ బల్లవాతామ్రభాస్వత్కర విరాజిత. పార్వతీపక్షమునఁ బల్లవములవలె నాతామ్రములయిన (మిక్కిలి యెఱ్ఱని) ప్రకాశించు హస్తములతో విరాజిల్లునది. ప్రభాతసంధ్యాపక్షమునఁ

బల్లవములవలె నాతామ్రములయిన సూర్యకిరణములచే విరాజిల్లుచున్నది. "పల్లవాతామ్రభాస్వత్కర విరాజితా" అనుచో శబ్దములు విఱుఁగలేదు. కాన 'అభంగశ్లేష'

పార్వతి 'అస్వాపఫలలుబ్ధే' యనఁ బొందరాని ఫలము; అనఁగా మోక్షము; దానియందు లుబ్ధుఁడగువానియందు "హితప్రదా" హితమును నిచ్చునది. అనఁగా దుర్లభమైన మోక్షము నొసఁగునది.

ప్రభాతసంధ్య అస్వాపఫలలుబ్ధ + ఈహితప్రదా. అస్వాపమన నిద్రాఽభావము; దానికి ఫలమైన స్నానసంధ్యావందనాదులు. దానియందాసక్తులకు నీహితము నిచ్చునది.

ఇట హితప్రదా, ఈహితప్రదా, అని పదములు విఱువఁబడినవి. కాన సభంగ శ్లేష.

రాఘవపాండవీయమున సంస్కృతాంధ్రపదముల కీ సభంగాభంగ శ్లేషలు నిర్వహింపఁబడినవి.

మరియు నీ సభంగశ్లేష వర్ణ, పద, లింగ, భాషా, ప్రకృతి, ప్రత్యయ, విభక్తి, వచన, భేదములచే నెనిమిది విధములని ప్రకాశకార దర్పణకారులు తెలిపిరి. వాని లక్షణములకు నాంధ్ర సాహిత్యదర్పణమును జూచునది. గ్రంథవిస్తర భీతిచే వదలితిని. ఈ శ్లేష శబ్దాలంకారమని వారి మతము. కావున వారు శబ్దాలంకారములలోనే చేర్చిరి. దీనిని వారు శబ్దశ్లేష యనిరి. అర్థశ్లేషయుఁ గలదు. శబ్దపరివృత్తిని సహింపనిచో శబ్దశ్లేష; శబ్దపరివృత్తిని సహించినచో నర్థశ్లేష. పై 'పల్లవాతామ్ర' ఇత్యాది సభంగాభంగ శ్లేషలు శబ్దశ్లేషలే.

స్తోకేనోన్నతి మాయాతి। స్తోకేనాయాత్యధోగతిం
అహో నుసదృశీ వృత్తి। స్తులాకోటేః ఖలస్య చ॥

'కొలఁదిమాత్రముననే పైకిఁ బోవును. కొలఁదిమాత్రముననే క్రిందికిఁ బోవును. త్రాసుయొక్కయు, ఖలునియొక్కయు వృత్తము సమానమే.'

ఇట 'స్తోకేన, ఉన్నతి, అధోగతి' శబ్దములు పరివృత్తిచేసినను శ్లేష నిర్వహింపఁబడుచునే యున్నది. కాన నిది యర్థశ్లేష.

శ్లేష నాంగ్లమున Paranomasia అందురు.

## ౭౦. పరికరము

౭౦. సాకూతములై సఫలతఁ
జేకొన్న విశేషణములు చెలఁగఁ బరికరం

బై కృతుల వెలయుచుండు మ
హాకవిసంస్తుత్యమగుచు నది యెల్లన్నన్. ౧౬౬

ఎచ్చట విశేషణములు సాభిప్రాయములుగా నిబద్ధములగునో యది పరికరాలంకారము.

సీ. దర్పితాహిత నృపోత్తములు నిన్నెదిరింపఁ
గలరె? ధీరోత్తమగండ బిరుద!
విమతకీర్తి ప్రతాపములు నీచే సమ
కట్టునే? యుభయరగండ బిరుద!
అరివధూతాటంక గరిమంబు నీచేతఁ
గలుగునే? గండరగండ బిరుద!
పరిపంథిగంధసింధురపంక్తి నీమ్రోల
నుండునే? గండభేరుండ బిరుద!

గీ. అరుణపరిణతధామ! రామాభిరామ!
రామణీయక నిర్జిత ప్రసవబాణ!
బాణసాహిత్య పరిపాక! పాకవైరి
విభవసౌభాగ్య! రోబభూవిభునృసింహ! ౧౬౭

నాలుగు పెద్దపాదములందున్న ధీరోత్తమ, ఉభయరగండ, గండరగండ, గండభేరుండ పదములు దర్పితాహిత నృపోత్తములు, విమతకీర్తి ప్రతాపములు, అరి వధూతాటంకగరిమలు, పరిపంథి గంధసింధురపంక్తి అనువానికిఁ బ్రతిద్వంద్వాలుగా నిలిచి 'నరసభూపాలు నెదిరింపఁజాలరు' అను నభిప్రాయము గలిగియున్నవి. ఇట్లే, 'సర్వమంగళ మంగళజాలమిచ్చు' అనుచోట సర్వమంగళా పద మభిప్రాయగర్భము.

## ౪౧. ఆక్షేపము

కం. ధర నిష్టమపరమార్థ
స్ఫురణంగాదన, ననిష్టము నపరమార్థ
స్ఫురణ విధింపఁగ, రెండై
యరయఁగ నాక్షేపమమరు నది యెల్లన్నా. ౧౬౮

ఇష్టమును నాభాసముగా (అపరమార్థస్ఫురణ) నిషేధించిన నిష్టనిషేధాభాసమనియు, అనిష్టమును నాభాసరూపముగా విధించిన ననిష్టవిధ్యాభాసమనియు నాక్షేపము ద్వివిధము. ఇందలి ఇష్టనిషేధాభాసము మరల ద్వివిధము. ఉక్త నిషేధాభాసము; వక్ష్యమాణ నిషేధాభాసము; ఉక్తనిషేధాభాసము కథనరూపమనియు, వస్తురూపమనియు మరల ద్వివిధము. వక్ష్యమాణ నిషేధాభాసము కథనరూపముగా మాత్రమే యుండును. ప్రతాపరుద్రీయాదులు ఇష్టనిషేధాభాసము, అనిష్ట విధ్యాభాసము అను పదముల నుపయోగింపక ఉక్తనిషేధాభాసము, వక్ష్యమాణనిషేధాభాసము అని తెలిపిరి. ఈ యుక్త, వక్ష్యమాణ నిషేధాభాసములకుఁ బ్రతాపరుద్రీయ లక్షణము లిత్తుము.

విశేషబోధాయోక్తస్య వక్ష్యమాణస్య వా భవేత్
నిషేధాభాసకథన మాక్షేప స్స ఉదాహృతః॥

ప్రాకరణికముగాఁ జెప్పినదానినిఁ (ఉక్తము) జెప్పఁదలఁచినదానినిఁ (వక్ష్యమాణము) గాని విశేషార్థబోధమునకై నిషేధించినట్లు చెప్పిన నాక్షేపాలంకారము.

౧. ఇష్టనిషేధాభాసము

సీ. మదిలోనఁ బాయకుండుదునన్నఁ బునరుక్తి;
నీ సొమ్మునన్న గాణిక్యవృత్తి;
నినుఁబాసి నిలువలేనన నసంభావ్యంబు;
పతివీవనఁగ నభిప్రసవవాంఛ;
యతనుఁడు గారించుననన నసాక్షికసూక్తి;
చలిగాలి వేఁడన్న జనవిరుద్ధ;
మొలమి నిచ్చటికి రావలయునన్న మదోక్తి;
చనుదెంతు నేనన్నఁ జాపలంబు;

గీ. వెలయఁ ద్వదధీన యగు నన్ను వేఁచు నలకలాధరుండన్న భవదుపాలంభసరణి;
గాన నేయుక్తులుఁ నెఱుంగఁ గరుణఁజూడు
సరసగుణహార! యోబయనరస ధీర! ౧౬౫

పునరుక్త్యాదులచే 'మదిలోనఁ బాయకుండుదు' మొదలగు చెప్పినవానినే నిషేధించినట్లాభాసముగాఁ దోఁచుచున్నది. పరమార్థమున నిది నిషేధముగాదు "నన్న వశ్యము కరుణఁజూడుము" అను విశేషార్థమును బోధించుటకై యీ నిషేధ

ముద్దేశింపఁబడినది. అయితే యీ విశేషమగు 'కరుణఁజూడుము' అనునది వ్యంగ్యముగా భాసింపవలెను. కాని వాచ్యమైనది. ఈ యిష్టనిషేధాభాసము ఉక్తనిషేధాభాసరూపము (చెప్పినదాని నాభాసరూపమున నిషేధించుట) అని తెలిపితిమి. ఈ యుక్తనిషేధాభాసము ద్వివిధము వస్తురూపము, కథనరూపము. ఇది కథననిషేధము. వస్తురూపనిషేధమెట్లన,

'నాహం దూతీ తనోస్తాప స్తస్యాః కాలానలోపమః'

"నేను దూతినిఁగాను. దాని తనుతాపము కాలానలోపమము." దూతి 'నేను దూతినిఁగాను' అని చెప్పిన వాక్యమునందలి నిషేధము బాధితమై యాభాసరూపమునుబొంది సంఘటన కాలోచిత కైతవ వచనములులేని యదార్థవాదినిసుమీ' అను వస్తురూపమునఁ బర్యవసించుచు 'నిప్పుడేవచ్చి నాయికను బ్రదికింపుము' అను విశేషార్థమును నాక్షేపించుచున్నది.

## వక్ష్యమాణ నిషేధాభాసము

విజ్ఞాపయామ స్తే కించిత్ కాకతీయకులోద్వహ!
విజ్ఞాప్యతే కి మథవా సర్వజ్ఞే రక్షకే త్వయి॰

ఓ కాకతీయప్రభూ! నీకుఁ గొలఁదిగా విజ్ఞాపనమొనర్తుము. ఎందులకులెమ్ము! సర్వమును దెలిసిన రక్షకుఁడవగు నీకుఁ దెలుపునదేమి ?

ఇటఁ జెప్పఁదలఁచినదానిని నిషేధించుకొన్నట్లు వర్ణింపఁబడినది. ఇటఁ గథననిషేధము.

## ౨. అనిష్టవిధ్యాభాసము

చ. అలుగఁగనేల? మీరు వసుధాధిపులెన్న స్వతంత్రులై మమున్
వలదనవచ్చు; మీ మనసువచ్చినచోటికి నేగుఁ; డేగినన్
నెలకొని నీ ప్రియాంగనకు నీకును మాఱ్మొనలేకయుండ న
ర్మిలి సుకరంబుగాఁగ నొనరించెదఁగాక నృసింహభూవరా! ౧౭౦

ఇట ' మీ మనసువచ్చినచోటికేఁగుఁడు ' అని తన కిష్టములేనిదానిని విధిరూపమున నాయిక వలుకుచున్నది. ఈ విధి విధ్యాభాసము. ఏలన, నాయిక తన నాయకుని నిచ్చవచ్చినచోటికిఁ బొమ్మనదు. ఈ విధ్యాభాసము నీవు పరాంగనల వద్దకుఁ బోవలదను విశేషార్థమును బోధించుచున్నది. ఇట్టిదే యీ క్రింది పద్యమును గూడఁ గనుఁడు.

ఆ. వె. ప్రియుఁడ! నీదు యాత్ర పెద్దకాలం బింక
నను దపింపఁ బోదు నమ్ము! నిజము;
వెడలవలసియున్న వెడలుము తడయక
శంక లెల్ల నొక్కవంకఁ ద్రోసి.

## ౭౨. వ్యాజస్తుతి

కం. సతతంబు నిందచేతను
స్తుతియున్, స్తుతిచేత నింద చొప్పడ వ్యాజ
స్తుతియై చెలువగుఁ గృతులం
దతులిత కవివినుతమగుచు నది యెల్లన్నన్. ౧౭౧

నిందావ్యాజముచే స్తుతియు, స్తోత్రవ్యాజముచే నిందయును జేయుట వ్యాజస్తుతి.

సీ. నెఱిజీవనము లేక నింగిపై భ్రమియించు
మత్స్యంబుఁ దునుము టేపాటి వాసి!
త్రిజగతీమాత వాగ్దేవి భండారంబు
చూఱఁగాఁగొనుట యే సుగుణితనము!
వేఁడినవారికి వెండియు నొకమాఱు
విత్తమీకుంట యే వితరణంబు?
అల యనాదిప్రవాహములైన యేర్ల వం
కలుదిద్దు టేవివేకంబు కలిమి!
గీ. వఱలు నీ కీర్తి ద్విజరాజ వైభవంబు
లపహరింపంగ నీ యాజ్ఞ యలరు టెంత!
పోచిరాజాన్వయాంబోధి పూర్ణచంద్ర!
నరనుతాటోప! తొరగంటి నరసభూప! ౧౭౨

ఇది నిందావ్యాజమునఁ జేయఁబడిన స్తోత్రము. ఇందలి నింద స్తోత్ర పర్యవసాయి.

కం. అసమ రణరంగముల నీ
యసినటి నటియింపఁ గరుల, హరులన్, గిరులన్
వెసనొసఁగు నౌర! యెంతటి
రసికుఁడవో నీవు ... నృసింహా! ౧౭౩

ఇట "ఎంతటి రసికుఁడుని?" అను స్తోత్రవ్యాజముచే శత్రునింద చేయఁబడు చున్నది. ఆంగ్లమున స్తుతిరూపమునఁ జేయఁబడిన నిందను Irony అందురు.

## ౪౩. అప్రస్తుత ప్రశంస

కం. క్షితి నప్రస్తుతమునఁ బ్ర
స్తుతవస్తువు గమ్యమగుచు సొంపొందిన నీ
శ్రుతులఁదలపోయ నప్ర
స్తుత ప్రశంసాఖ్యమయ్యెఁ దుది యెల్లన్నన్. ౧౭౪

ఈ శ్రుతులన్ = ఈ శాస్త్రములందు.

అప్రస్తుతవస్తు వర్ణనముచేఁ బ్రస్తుతవస్తువు గమ్యమానమయినచో నప్రస్తుత ప్రశంసాలంకారము.

ఈ యప్రస్తుతప్రశంస పంచవిధము.

కార్యే నిమిత్తే సామాన్యే విశేషే ప్రస్తుతే సతి
తదన్యస్య వచస్తుల్యే తుల్యస్యేతి చ పంచధా.

కార్యము ప్రస్తుతమైనపుడు దాని కారణమును వర్ణించుట; కారణము ప్రస్తుతమైనపుడు కార్యమును వర్ణించుట; సామాన్యము ప్రస్తుతమైనపుడు విశేషమును వర్ణించుట; విశేషము ప్రస్తుతమైనపుడు సామాన్యమును వర్ణించుట; ప్రస్తుతము వర్ణింపవలసియుండఁగా దానికిఁ దుల్యమైన యనఁగా సారూప్యము గల వస్తువును వర్ణించుట అని యైదువిధములు. ఇట నైదవవిధమగు సారూప్యనిబంధనా-అప్రస్తుత ప్రశంసను మాత్రమే కవి యుదాహరించెను.

కం. ననలు మొనలెత్తెఁ; దేనెలు
చిసికెం; జిగురాకుగందెఁ; జెదరె నలితతుల్;
చనవున నీ పూఁదీఁగకు
ఘనమైన నృసింహుపొందు గలుగఁగఁబోలున్. ౧౭౫

ఇట నప్రస్తుతమగు పూఁదీఁగ వర్ణింపఁబడుటచేఁ దత్సారూప్యయగు సురతోపభుక్త యగు యువతీరూపమగు వస్తువు గోచరించుచున్నది. ఇది సారూప్యనిబంధనా ప్రస్తుత ప్రశంస. (కానీ యొకదోషము గలదు. 'నృసింహు పొందు' అను పద మప్రస్తుతమున నన్వయింపకున్నది. 'వసంతుపొందు' అనియున్నచో సరిపోవును.) మిగిలిన వాని యుదా[illegible]

౧. కార్యము ప్రస్తుతమైనపుడు దాని కారణమును వర్ణించుట

యాతాః కిం న మిళంతి సుందరి! పునశ్చింతా త్వయా మత్కృతే
నోకార్యా; నితరాం కృశాసి; కథయత్యేవం సబాష్పే మయి
లజ్జామంథర తారకేణ నిపతత్పీతా శ్రుణా చక్షుషా
దృష్ట్వా మాం హసితేన భావి మరణోత్సాహ స్తయా సూచితః.

"ఓ సుందరీ! వెళ్ళినవారు మరల రారా? నాకొఱకేల చింతింతువు? చింతింపకుము. చాల కృశించితివి" అని నేను గన్నీటితోఁ బలుకఁగా లజ్జచే నిష్క్రియమైన కనీనికలు గల కన్నులతో వచ్చుచున్న కన్నీటి నాఁపుకొనుచు నన్నుఁజూచి నవ్వుచు భావిమరణోత్సాహమును సూచించినది.

నాయకుఁడు తన ప్రయాణసమయమున జరిగిన నాయికయొక్క ముచ్చటను దన మిత్రునితోఁ దెలుపుచున్నాఁడు. అతఁడు నీవేల ప్రయాణము మానితివి? అని కార్యము నడుగఁగాఁ బైవిధముగాఁ గారణరూపమున సమాధానమిచ్చెను. కావునఁ గార్యము ప్రస్తుతముగాఁగాఁ గారణము వర్ణింపఁబడినది. దీనినిఁ గారణనిబంధనా ప్రస్తుతప్రశంస యందురు.

౨. కారణము ప్రస్తుతముకాఁగాఁ గార్యము వర్ణింపఁబడుట

ఉ. అంచల గర్వభంగమగు నాసతి యానవిలాసముం గనన్
గాంచును మానవృత్తినిఁ బికంబులు ముచ్చటలాలపించినన్
గాంచిన మేనిమార్దవముఁ గన్నడు జాజియు రాతియట్లు; వీ
క్షించిన నంగశోభ సిరి సిగ్గిలి కొల్పడ కావిపుట్టమున్?

ఇట నాయికయొక్క నడకలు, ముచ్చటలు, మార్దవము, అంగశోభ మొదలగునవి వర్ణనీయములగుటచేఁ బ్రస్తుతములు; కాని వాని వర్ణనమేమియు లేదు; హంసలకు గర్వభంగమగును; పికములు మానము వహించును; జాజి రాతియట్లగును; సిరి కావిపుట్టమును ధరించును; అని యప్రస్తుత కార్యములు వర్ణింపఁబడినవి. నాయిక యొక్క నడకలు మొదలయినవి కారణములు. ఇది కార్యనిబంధనాప్రస్తుత ప్రశంస.

3. విశేషము ప్రస్తుతముకాఁగా సామాన్యము వర్ణింపఁబడుట

పాదాహతం యదుత్థాయ మూర్ధాన మధిరోహతి
స్వస్థా దేవాపమానేఽపి దేహిన స్తద్వరం రజః.

ఏది పాదాహతమై లేచి తలపైకెక్కునో యా ధూళి యవమానమొందియును స్వస్థుఁడుగా నున్నవానికంటె మేలు.

'శిశుపాలునివలన నవమానమునుబొందియు స్వస్థులముగా నున్న మనకంటె దుమ్ము మేలు' అని బలరాముఁడు శ్రీకృష్ణాదులతోఁ దెలుపుచున్నాఁడు. ఇట "మన కన్న దుమ్ము మేలు" అనునది ప్రస్తుతము. అది విశేషరూపము. దానినిఁ దెలుపక యప్రస్తుతమగు 'పాదాహతం' ఇత్యాది రూాపమున సామాన్యము వర్ణింపఁబడినది. ఇది సామాన్యనిబంధనాప్రస్తుత ప్రశంస.

## ౪. సామాన్యము ప్రస్తుతముకాఁగా విశేషమును వర్ణించుట

అంకాధిరోపిత మృగశ్చంద్రమా మృగలాంఛనః
కేసరీ నిష్ఠురక్షిప్త మృగయూథో మృగాధిపః.

తన యొడిలో మృగము నారోపించుకొన్న చంద్రుఁడు మృగలాంఛనుఁ డయ్యెను. క్రూరముగా మృగయూథమును హింసించెడు సింహము మృగరాజయ్యెను.

'మెత్తనివారినిఁజూచి మొత్తు క్రూరుఁడే కీర్తిమంతుఁడగును. మెత్తనివాఁడు కీర్తిమంతుఁడుగాఁడు" అను సామాన్యము ప్రస్తుతముకాఁగా నప్రస్తుతమగు విశేషము వర్ణింపఁబడినది. దీనిని విశేషనిబంధనాప్రస్తుత ప్రశంసయందురు.

సారూప్య నిబంధనాప్రస్తుత ప్రశంసను నరసభూపాలీయ గ్రంథకర్తయే యిచ్చెను.

### అప్రస్తుతప్రశంసాదోషము

ఆహూతేషు విహంగమేషు మశకో నాయాన్ పురోవార్యతే
మధ్యేవారిధి వావసంస్తృణమణి ర్ధత్తే మణీనాం రుచం
ఖద్యోతోఽపి నకంపతే ప్రచలితుం మధ్యేఽపి తేజస్వినాం
ధిక్సామాన్యమచేతసం ప్రభుమివానామృష్ట తత్త్వాంతరం.

పక్షులను బిలువఁగా దోమ దానుగూడఁ బక్షినమకొని వచ్చుచున్నది. కాని యెవ్వరును దాని నాటంకపఱపకున్నారు. సముద్రమధ్యమున రత్నములతోపాటు వసించుచు దృణమణి(గాజు)యు మణిగావ్యవహరింపఁబడుచున్నది. మిణుఁగురుపురుగును దేజస్వులనడుమఁ దిరుగుటకు వెనుదీయదు. ఛీ! స్వరూపతారతమ్యజ్ఞానము లేని బుద్ధిహీనుఁడగు ప్రభువువంటి యవివేకినిఁగూర్చి యేమిచెప్పవలెను?

ఇట మొదటి మూఁడుపాదములందలి సామాన్యరూపమైన యప్రస్తుత వృత్తాంతవర్ణనములచే నాల్గవపాదముయొక్క యర్థము విశేషరూపముగాఁ బ్రస్తుతముగా స్ఫురించుచునేయున్నది. కావున దానిని మరలఁ జెప్పుట పునరుక్తి లేక యపుష్టమను దోషము.

## ౭౭. పర్యాయోక్తము లేక పర్యాయోక్తి

క. ప్రస్తుతకార్యస్తుతిచేఁ
ప్రస్తుతకారణముదోఁపఁ బర్యాయోక్తం
బస్తోక సుకవికావ్య
ప్రస్తుతమై చెలఁగుచుండు రహినెట్లన్నన్. ౧౭౬

ప్రస్తుతమగు కార్యవర్ణనముచేఁ బ్రస్తుతమేయైన కారణము తోఁచెనేనిఁ బర్యాయోక్తాలంకారము.

అప్రస్తుత ప్రశంసలో నప్రస్తుతముచేఁ బ్రస్తుతము దోఁచును. ఇటఁ బ్రస్తుత కార్యముచేఁ బ్రస్తుత కారణము తోఁచును.

ఉ. "చక్కఁ బెట్టవే వికచసారసలోచన! మాటనేర్పవే
చొక్కపుగుబ్బలాఁడి! ననుఁజొప్పడఁ బాణితలంబుఁజేర్పవే!
చెక్కులనిగ్గులాఁడి!" యని చిల్కలువల్కఁ; నృసింహ! పూర్వపున్
మక్కువ నీవిరోధినృపమందిర చిత్రవధూపరంపరన్. ౧౭౭

చక్కఁ బెట్టవే! ఇత్యాదికమగు శుకప్రార్థనారూపకార్యముచే "నీశత్రు రాజులును వారిలో వారి భార్యలును రాజధానులను విడిచి పాఱిపోయిరి" అను కారణము గమ్యమగుచున్నది. రాజభార్యలు రాజధానులు విడిచి పాఱిపోవుటచేఁ జిలుకలు పోయి యంతఃపుర చిత్రములలోనున్న యా రాజకాంతలను రాణులనగానే భ్రమించి పైవిధమునఁ బ్రార్థించుచున్నవి. కాన శుక ప్రార్థనారూప కార్యమునకు రాణులు రాజధానులు విడిచి పారిపోవుట కారణము. ఇది గమ్యము. ప్రకాశకారు, దర్పణకారాదులు దీని లక్షణమును వివిధముగా నిచ్చియున్నారు. కనుఁడు.

"పర్యాయోక్తం తు గమ్యస్య వచోభంగ్యంతరాశ్రయం" చంద్రాలోకము. గమ్యమును భంగ్యంతరమునఁ జెప్పుట పర్యాయోక్తము.

" పర్యాయోక్తం వినా వాచ్యవాచకత్వేన యద్వచః " కావ్యప్రకాశము. వాచ్యవాచక స్వరూపములోఁగాక వేఱువిధమునఁ జెప్పుట.

"పర్యాయోక్తం యదా భంగ్యా గమ్యమేవాభిధీయతే" సాహిత్యదర్పణము. గమ్యమే భంగ్యంతరమునఁ జెప్పఁబడినచోఁ బర్యాయోక్తము.

" వివక్షితస్యార్థస్య భంగ్యంతరేణ ప్రతిపాదనం పర్యాయోక్తం" రసగంగాధరము. వివక్షితమగు నర్థమును ననఁగాఁ జెప్పఁదలఁచిన యర్థమును భంగ్యంతరముచేఁ జెప్పుట పర్యాయోక్తము.

ఈ లక్షణములయం దెల్లయెడలను గమ్యమగు లేక వ్యంగ్యమగు నర్థమునే వైచిత్ర్యార్థము భంగ్యంతరమునఁ దెలిపినచోఁ బర్యాయోక్తము అని తేలును. పర్యాయేణ భంగ్యంతరేణ ఉక్తమేవ ఉక్తిః పర్యాయోక్తః అని వ్యుత్పత్త్యర్థము.

యం ప్రేక్ష్య చిరరూఢాపి నివాసప్రీతి రుజ్ఝితా
మదేనైరావణముఖే మానేన హృదయే హరేః.

రావణునిఁగాంచి మదము (కర్త) ఐరావతముఖమునందును, మానము (కర్త) ఇంద్రుని హృదయమందును దమ చిరరూఢమైన నివాసప్రీతిని వదలినవి.

ఇట "నైరావత శక్రులు మదమానముక్తులయిరి" అనునది వ్యంగ్యార్థము. ఈ వ్యంగ్యార్థము వైచిత్ర్యార్థము వ్యంగ్యార్థ మేవిధముగాఁ బ్రతిపాదింపఁబడవల యునో యావిధముగాఁ బ్రతిపాదింపఁబడక భగ్యంతరమునఁ (మద మైరావతముఖము నందును, మాన మింద్రుని హృదయమునందును దమ చిరరూఢమైన నివాసప్రీతిని వదలినవి. అను విధమున) బ్రతిపాదింపఁబడినవి. ఎట్లన, 'జనోగచ్ఛతి' అను నెడ "జనేన గమ్యతే" అనియు, 'ఆగమ్యతాం' అనునెడ 'ఆగమనేన అలంక్రియతాం' అనియుఁ బ్రకారాంతరమున నొకే యర్థము వైచిత్ర్యార్థము చెప్పఁబడును. అవిధము గనే వ్యంగ్యమగు నర్థమే యిట భగ్యంతరముచేఁ బ్రతిపాదింపఁబడును. ఇట్లే

"చక్రాభిఘాతప్రసభాజ్ఞయైవ చకార యో రాహువధూజనస్య
ఆలింగనోద్దామవిలాస వంధ్యం రతోత్సవం చుంబనమాత్రశేషం"

ఏ విష్ణువు చక్రాభిఘాతరూపమగు నాజ్ఞచేతనే రాహుభార్యాజనముయొక్క రతోత్సవమును నాలింగనాదిరూపమగు విలాసహీనమునుగాఁ, జుంబనమాత్రశేషము నుగాఁ జేసెనో.

'శ్రీ విష్ణువు తన చక్రాయుధముచే రాహు శిరశ్ఛేదమును జేసెను' అను వ్యంగ్యార్థమే పైవిధమున భంగ్యంతరమునఁ జెప్పఁబడినది.

పై నరసభూపాలీయ లక్షణమునఁ 'బ్రస్తుతమగు కార్యముచేఁ బ్రస్తుతమగు కారణము గమ్యమగుచోఁ బర్యాయోక్తము' అని యున్నది. ఈ లక్షణములకును దానికిని నేకవాక్యత యెట్లు? అన్నచో వినుఁడు. ఎల్లయెడలను గమ్యమగు కారణ రూపార్థమే భంగ్యంతరమునఁ (గార్యరూపమున) జెప్పఁబడుచున్నది. కావున నరస భూపాలీయలక్షణము నిర్దుష్టమే.

ఇందలి వ్యంగ్యము వాచ్యసిద్ధ్యంగము. కావున జగన్నాథ మతమున నుత్తమ కావ్యమును నితర మతమున గుణీభూతవ్యంగ్యమును నగును.

## ౭౯. ప్రతీపము

కం. ఉపమేయమె చాలును ధర
నుపమానం బేల? యనఁగ నొనరుఁ బ్రతీపం
బపరిమిత సుకవికృతులం
దపారవిస్ఫూర్తిఁ జెంది యదియెట్లన్నన్. ౧౭౮

ఉపమానముయొక్క పని యుపమేయమే చేయుచుంటచే నుపమాన మేల? అని వర్ణింపఁబడినచోఁ బ్రతీపము.

సీ. సత్పథక్రమకళా చాతురి నెఱపదో?
కమలాకరామోదకరముగాదా?
వివిధచరాచరానంద విభవంబొనర్పదో?
సతతంబు నుదయసంగతముగాదా?
ఇల మహాగ్రహరాజ జృంభణంబలమదో?
యమితదోషోన్మేష హరముగాదా?
మహితగాంగేయధామస్ఫూర్తిఁ జెలఁగదో?
యచ్యుతోగ్రాకారహారి గాదా?

గీ. నీప్రతాపంబు దనవలె నిఖిలతమము
నడఁపఁగాలేదా? తానేల యరుగుదెంచుఁ
గుంటిసారథితో నల్లకుముదవైరి!
నరనుతాటోప! రామబయనరసభూప! ౧౭౯

ఉపమానమగు సూర్యుఁడు చేయు కార్యమును నుపమేయమగు ప్రతాపమే చేయుచుండఁగా నతఁడేల? (ఉపమానమేల?) అని చెప్పుటచేఁ బ్రతీపము.

ఉపమేయమున కుపమానత్వముఁ గల్పించినను బ్రతీపమే యగును. ప్రతీపమన విపరీతము. ఉపమాలంకారమునకు విపరీతాలంకారము ప్రతీపము.

"త్వల్లోచన సమం పద్మం త్వద్వక్త్రసదృశో విధుః"

పద్మము నీకన్నులతో సమానము. చంద్రుఁడు నీ ముఖముతో సమానము. ఇట నుపమేయములగు నేత్ర ముఖము లుపమానము లయినవి.

తక్క[illegible]

## ౪౬. అనుమానము

కం. భువి సాధనసంపదచే
నవిరళవిస్ఫూర్తిసాధ్య మనుమేయముగా
వివిధశ్లేషవిశేషా
ద్యవియుత మనుమానమయ్యె నదియెట్లన్నన్. ౧౮౦

సాధ్యసాధన నిర్దేశ నిబంధనము గలది యనుమానాలంకారము. సాధనసంపదచే సాధ్య మనుమానింపఁబడవలెను. తర్కశాస్త్రమున ననుమానప్రమాణ మనునొక ప్రమాణముగలదు. పర్వతమునఁ బొగను జూచి నిప్పున్నదని యొకఁ డూహించును. ఇది యనుమానప్రమాణముయొక్క నిరూపణము. "పర్వతమున నిప్పున్నది. ఏలనీ పొగ యుంటవలన. ఎటనెటఁ బొగయుండునో యటనటఁ దప్పక నిప్పుండును. వంటయింట పొగ యున్నది; నిప్పున్నది. కావునఁ బొగ యున్నచోటఁ దప్పక నిప్పుండును. నిప్పులేనిచోఁ బొగ లేదు. మడుగున నిప్పులేదు. కానఁ బొగ లేదు." కాఁబట్టి పొగ యను సాధనముచే సాధ్యమగు నిప్పు పర్వతమున ననుమానింపఁబడుచున్నది. ఆదేవిధమునఁ జమత్కారవిశేషము చే సాధనముచే నియత సాహచర్యము గల సాధ్యమును ననుమానించుట యనుమానాలంకారము.

వివిధశ్లేషవిశేషాద్యవియుత మన శ్లేషవిశేషాదులచేఁ దప్పక కూడినది. (యుతము =కూడినది; అయుతము=కూడనిది; అవియుతము=తప్పకకూడినది) అఁగా నీయనుమానాలంకారము శ్లేష, రూపక,ఉత్ప్రేక్షాదిగర్భమైసుందరముగాశోభిల్లును.

సీ. కమలాక్షుఁడీ వేటికాఁబోలుఁ గాకున్నఁ
గరముల శంఖచక్రములు గలవె ?
కమలారి యీరాజు గాఁబోలుఁ గాకున్న
సకలకళావిలాసములు గలవె ?
కమల పుట్టుఁడీ ప్రోడ గాఁబోలుఁ గాకున్న
నధిగతమండలవ్యాప్తి గలదె ?
కమలజుండీ స్వామి కాఁబోలుఁ గాకున్నఁ
జతురాననవచశ్ప్రశస్తి గలదె ?

గీ. అనుచుఁ గొనియాడుదురు నిన్ను నంగవంగ
మాళవాబంతి గౌళనేపాళచోళ

కుకురు కురుపాండ్య శకముఖక్షోణిపతులు
నరనుతాటోప! ఓబయనరసభూప! ౧౮౧

శంఖచక్రములు=శంఖచక్రాయుధములు, శంఖచక్రరూపరేఖలు ; కలావిలాసము=షోడశకళలవిలాసము: విద్యలవిలాసము; మండలము=బింబము: రాష్ట్రము; చతురాననన=బ్రహ్మ; చతురమైన ముఖము.

ఇట శంఖచక్రాది సాధనములచేఁ గమలాక్షాదులగు సాధ్యములు సాధింపఁబడినట్లు వర్ణింపఁబడినది. శంఖచక్రాదులకును గమలాక్షాదులకును నియత సాహచర్యము గలదుగదా! ఇట శ్లేషగర్భమగు ననుమానము.

జానీమహేఽస్యా హృది సారసాక్ష్యా
విరాజతేఽంతః ప్రియవక్త్రచంద్రః
ఉత్కాంతిజాలైః ప్రసృతైస్తదంగే
ష్వాపాండుతా కుట్మలతాక్షిపద్మే

ఈయువతి హృదయమునఁ బ్రియముఖచంద్రుఁడు శోభిల్లుచున్నాఁడు. (సాధ్యము) ఏలన దానిమేనిపైనుబికిన ముఖచంద్రకాంతిజాలముచేఁ దెల్లఁదనము గనవచ్చుచున్నది. మరియు దాని కనుదామరలు మూసికొన్నవి. (సాధనము)

ఇట వక్త్రచంద్రుఁడనుచో రూపకము. కాన నిది రూపకగర్భమగు ననుమానము.

యత్ర పతత్యబలానాం దృష్టిర్నిశితాః పతంతి తత్రశరాః
తచ్చాపరోపితశరో ధావత్యాసాంపురః స్మరో మన్యే

ఎచట యువతులచూపు పడుచున్నదో యచట వాఁడిములుకులు పడుచున్నవి. (సాధ్యము) దీనినిఁబట్టి యధిజ్యశరాసనుఁడై (వింటెక్కుపెట్టినవాఁడై) మదనుఁడు నారిముందు పరుగువాఱుచున్నాఁడని యూహింతును. (సాధనము)

ఇటఁ నుత్ప్రేక్షాగర్భమగు ననుమానము.

## ౪౭. కావ్యలింగము

కం. హేతువు వాక్యార్థంబై
యాతతవిస్ఫూర్తితోఁ బదార్థంబునునై
ఖ్యాతిగనఁ గావ్యలింగం
బై తగు సత్కృతులయందు నదియెట్లన్నన్. ౧౮౨

వాక్యార్థమైన [illegible] కావ్యలింగము.

### ౧. వాక్యార్థహేతుకము

మ. అరుదై పొల్పగు 'పోచిరాజు నరసింహా!' యన్న యష్టాక్షరీ
వరమంత్రం బది యెల్లకాలము నరుల్ వాక్రువ్వసిద్ధించుఁబో!
కరుఃలాందోళిక,లశ్వముల్,విభవముల్,గ్రామంబు,లత్యుజ్జ్వలాం
బరముల్ సొమ్ములుఁ బల్లకీల్, పరిణయప్రారంభసంరంభముల్,

గజాదులు లభించుటకు హేతువుగా "పోచిరాజు నరసింహా!' యన్న యష్టాక్షరీవరమంత్రం బది యెల్లకాలము నరుల్ వాక్రువ్వ" అను వాక్యము కూర్పఁబడినది.

### ౨. పదార్థహేతుకము

కం. గురునఖదళితప్రతిమా
కరిచిత్రితభిత్తిగళితఘనమణివీథీ
పరితోషయుతములై నీ
యరిపురములఁ గినుకమాను హరులు నృసింహా! ౧౮౪

సింహములు గినుక మానుటకు హేతువుగా 'మణివీథి' అను పదార్థము కూర్పఁబడినది.

దీనినిఁ గొందఱు హేత్వలంకారమనిరి. రసగంగాధరకారుఁడు "కావ్యలింగం నాలంకారః। వైచిత్ర్యాత్మనో విశేషస్య అభావాత్" కావ్యలింగ మలంకారము గాదు. అలంకారమునకుఁ గావలసిన వైచిత్ర్యవిశేష మిందు లేదు అని యలంకారత్వము నిషేధించెను

### ౪౮. అర్థాంతరన్యాసము

గీ. మహి విశేషంబుచేత సామాన్యమును, బ్ర
సక్తసామాన్యమున విశేషము, సమర్థి
తముగ నర్థాంతరన్యాస మమరుచుండు
నెలమి రెండువిధంబులై యెల్లటన్న ౧౮౫

విశేషముచేత సామాన్యమును, సామాన్యముచేత విశేషమును సమర్థింపఁబడినచో నర్థాంతరన్యాసము గను.

అనుపపద్యమానముగా (పొసఁగనివిధమున) భావింపఁబడుచున్న యర్థమును నుపపద్యమానముగాఁ జేయుటకై యనఁగా సమర్థించుటకై యర్థాంతరమును దెచ్చి యుంచుట యర్థాంతరన్యాసము.

౧. విశేషముచే సామాన్యము సమర్థింపఁబడుట

కం, విమలాత్ముఁ డెచటనుండిన
విమలుండగు; నెట్లటన్న వినుము సురాగా
రమునఁజరించియు నీయశ
మమలస్థితిగాదె? యోబయప్రభుసరసా! ౧౮౬

విమలుఁ డెచ్చటఁ జరించినను విమలుఁడే! నీ కీర్తి నీలాకాశమునఁ జరించినను విమలమే. 'విమలుఁడు విమలుఁడే' అనునది సామాన్యము. నీ కీర్తి యిత్యాదికము విశేషము. ఈ విశేషముచే సామాన్యము సమర్థింపఁబడుచున్నది. 'విమలుఁడు విమలుఁడే' అనఁగానే యేల విమలుఁడు మలసహితుఁడుగాఁడో యది యనుభవపూర్వకముగాఁ దెలియదు. నీ కీర్తి మలినమైన యాకాశమునఁ జరియించియు విమలము" అనుటచే నది యుపపద్యమానముగా నిస్సందిగ్ధముగా రూఢిపడును.

౨. సామాన్యముచే విశేషము సమర్థింపఁబడుట

చ. జలనిధి రాజకన్యకనుసన్న మెలంగుచునుండు; వాణియున్
మెలఁగునుమాటలోన నెలమిం జెయిసన్న జరించుఁగీర్తి; నీ
లలితభుజోపగూహనవిలాసముమానదుధాత్రి సద్గుణో
జ్జ్వల! నరసింహ! మంత్రబలవంతుల కింతులు చిక్కుటబ్రమే?

లక్ష్మి, సరస్వతీ, కీర్తి, భూదేవులు నీ వశంపదలై యున్నారు. అనునది విశేషార్థము. ఇది యనుపపద్యమానముగాఁ దోఁచుచున్నది. మంత్రబలవంతుల కింతులు చిక్కుటబ్రమే? అను సామాన్యార్థముచే నుపపద్యమాన మగుచున్నది.

అర్థాంతరన్యాసదోషము

దివాకరాద్రక్షతి యో గుహాసు లీనం దివా భీత మివాంధకారం
క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే మమత్వ ముచ్చైశ్శిరసామతీవ.

ఇది హిమపర్వతవర్ణనము. హిమవంతము తన గుహాలయందు దివాభీతమట్లు (పగటికి జడిసినదివలె; గ్రుడ్లగూబయో యన అని రెండర్థములు.) డాఁగిన యంధకారమును సూర్యునినుండి కాపాడుచున్నది. తన్ను శరణుఁజొచ్చిన క్షుద్రుని యందును మహోన్నతులకు మమత్వ ముండునుగదా!

ఇట నచేతనమగు చీఁకటి సూర్యునివలన భయపడిన ట్లుత్ప్రేక్షింపఁబడినది. అచేతన పదార్థమునకు భయముండదుగదా! కవిప్రౌఢోక్తిచే నట్లుత్ప్రేక్షింపవచ్చును.

దాని కనుపపత్తిలేదు. అనుపపత్తి యున్నచో నర్థాంతరన్యాస మవసరము. ఇట ననుపపత్తిలేమిఁ దత్సమర్థనార్థ మర్థాంతరన్యాస మనవసరము.

## ౮౯. యథాసంఖ్యము

కం. సమముగ నేవరుసఁ బదా
  ర్థము లుద్దిష్టంబులయ్యెఁ దగనా పర్యా
  యమున ననూద్దిష్టములై
  యమర యథాసంఖ్యమయ్యె నది యెట్లన్నన్. ౧౮౮

ఏ క్రమమునఁ బదార్థము లుద్దేశింపఁబడినవో పర్యాయమునఁగూడ నా క్రమమునే యనుసరించి వచింపఁబడినచో యథాసంఖ్యాలంకారము. దీనికి సంఖ్యానమనియుఁ గ్రమాలంకారమనియు నామాంతరములు.

చ. వరకరుణా, ధరాభరణ, వైభవ సద్గుణ, బుద్ధిచాతురీ,
  పరమవిభుత్వ, పావనవిభా, బల, ధైర్యవిజృంభణంబులన్
  వరుస హరిన్, గిరిన్, గలశవార్నిధి, గీర్నిధి, శూలిఁ, గీలి నా
  కరిఁగిరి గెల్తువౌర! త్రిజగన్నుత! శ్రీ నరసింహ భూవరా! ౧౮౯

క్రమముగాఁ గరుణయందు హరిని, ధరాభరణమున గిరిని; వైభవసద్గుణమునఁ గలశవార్నిధిని, బుద్ధిచాతురిని గీర్నిధిని, పరమవిభుత్వమున శూలిని, పావనవిభయందుఁ గీలిని, బలమునఁ గరిని, ధైర్యమున గిరినిఁ గెల్తువు.

ఉద్దిష్టములకు యథాక్రమముననే యనూదిష్టములును వచింపఁబడినవి. విచ్ఛిత్తి విశేషము లేమి దీనినిఁగూడ నలంకారము గాదని రసగంగాధరుఁడు వచించెను.

## ౯౦. అర్థాపత్తి

కం. వరుస నొకానొక వస్తువు
  గిరికొన వస్త్వంతరంబు కిముతన్యాయ
  స్ఫురితంబై చనఁ దేరఁగ
  ధర నర్థాపత్తియయ్యెఁ దగ నెట్లన్నన్. ౧౯౦

ఒక యర్థముయొక్క నిష్పత్తిచేతనే వేరొకయర్థము కైముతికన్యాయముచే సిద్ధించుచున్నట్లు వర్ణించిన నది యర్థాపత్తి. దండాపూపన్యాయమని యొక న్యాయము గలదు. 'ఎలుకం [illegible] భక్షించినది' [illegible] భక్షణము చేతనే

దండమునందున్న యపూపభక్షణ మర్థాత్తుగాఁ జెప్పఁబడినట్లే యగును. అట్లే యిటను గ్రహింపవలెను.

సీ. అమరశైలము చిన్నమంతగాఁ దలపోసి
యీశాచలము దారమెత్తుఁ జేసి
వెలయు మంథానాద్రి వేళ్ళతోఁ బెకలించి
మైనాక మబ్ధిలో మ్రగ్గఁజేసి
యనుపమావంధ్య వింధ్యస్ఫూర్తి నిలఁ బ్రామి
మలయాగ ముర్వికి వెలి యొనర్చి
యల క్రౌంచగిరికి రంధ్రాన్వేష మొనరించి
వలిగుబ్బలికి వింతవడఁకుఁ గూర్చి

గీ. అడరు నీధైర్య; మనినచో నపరగిరులు
సాటిరావని మఱి వేఱె చాటనేల ?
పోచిరాజాన్వయాంబోధి పూర్ణచంద్ర !
వైరిగజసింహ ! యోబయనారసింహ ! ౧౬౧

ఇట నీ ధైర్య మమరశైలాదుల నల్పములుగాఁ జేసెనను నర్థోపన్యాసముచేతనే వస్త్వంతరములయొక్క స్వల్పత్వము వేఱె యడుగనేల ? అను నర్థము కైముత్య న్యాయముచే వర్ణింపఁబడినది.

ఇట 'అపరగిరులమాట చాటనేల?' అనినఁ జాలును. 'అపరగిరులు సాటిరావని' అనునది యసుందరము.

కం. తన హృదయంబును జీలిచి
కొనివచ్చిన కలికి కటికగుబ్బలకవకుం
గనికరమనునది లేశం
బును గలదే లాఁతిహృదయమును జీల్పంగన్ ?

పై పద్యమున శాబ్దమగు కైముత్యము (చాటనేల ?) ఇట నార్థము. (తన హృదయమునే చీల్చుకొని వచ్చెను. ఇఁక లాఁతిహృదయమును గూర్చి చెప్పనేల ? యని భావము.)

## ౫౧. పరిసంఖ్య

కం. తలఁపఁగ నొకటి యనేక
స్థలముల సంబంధసంగతంబగునెడలన్

బలిమి నొకమెడను నిలుపుట
వెలయం బరిసంఖ్యయగుచు వినుమెట్లన్నన్. ౬౯౨

పరి = వర్జనేన కస్యచిద్వర్జనేన క్వచిత్ సంఖ్యానం వర్ణనీయత్వేన గణనం పరిసంఖ్యా అని వ్యుత్పత్తి. ఒకవస్తు వనేకస్థలములం దేకకాలమున సంభవించు చుండఁగా నేకస్థలమునందే నియమించుట పరిసంఖ్య.

సీ. అందమై త్రిభువనానందమై జితకుంద
బృందమై నభమున బెరయునెద్ది?
పొంకమై భృతరక్తపంకమై సమరని
శ్శంకమై వినుతింపఁజాలునెద్ది?
తోరమై దానైకధీరమై సజ్జనా
ధారమై ధారుణిఁ దనరునెద్ది?
తండమై చండిమాఖండమై సంభృతా
జాండమై దండిమై నలరునెద్ది?

గీ. వినుము నీకీర్తి; నీభుజాన్వితకృపాణి;
నీకరము; నీరుచియు కాని నెఱయఁగాదు
విధుపొడుపు; గాదుపవి; గాదు వేల్పుగ్రామాను;
గాదు రవిబింబమో బయుకాంతునరస! ౬౯౩

అందమై నభమున బెరయునెద్ది? అనునెడ నా వస్తువు విధుపొడుపు, కీర్తి యను రెండును గావచ్చును. అట్టిచో విధుపొడుపును గంఠోక్తిచే విసర్జించి కీర్తిగానే నిబంధింపఁబడినది. మిగిలిన పాదములందును నిదేవిధముగ గ్రహింపవలెను.

ఈ లక్షణలక్ష్యములు ప్రతాపరుద్రీయానుసారముగా నున్నవి. కావ్యప్రకాశ సాహిత్యదర్పణములందు దీని లక్షణ మిట్లున్నది.

కించిత్పృష్టమపృష్టం వా కథితం యత్ప్రకల్ప్యతే
తాదృగన్యవ్యపోహాయ పరిసంఖ్యా తు సా స్మృతా.

ప్రశ్నపూర్వకముగాఁ గానీ యప్రశ్నపూర్వకముగాఁ గానీ ప్రతిపాదితమైనది యన్యవ్యపోహార్థము గల్పింపఁబడినచో నది పరిసంఖ్య.

కిం భూషణం సుదృఢ మత్ర యశో; న రత్నం
కిం కార్యమార్య చరితం సుకృతం; న దోషః

కిం చక్షురప్రతిహతం ధిషణా; న నేత్రం
జానాతి కస్త్వ దపరస్సదసద్వివేకం.

ఈ లోకమున సుదృఢమగు భూషణమేమి ? యశస్సు; అంతేకాని రత్నము గాదు; చేయఁదగినదేమి ? ఆర్యచరితమగు సుకృతము; దోషముగాదు; అప్రతిహత మగు చక్షువేమి ? బుద్ధి; నేత్రము గాదు; నీకంటె నెవఁడు సదసద్వివేకమును దెలిసినవాఁడు గలఁడు ?

ఇట 'కిం భూషణం సుదృఢ మత్ర ?' అనునది ప్రశ్న. సమాధానముగాఁ బ్రతిపాదితమైనది "యశః న రత్నం" అనునది. ఇది యన్యవ్యపోహార్థము అనఁగా స్వసదృశవస్తువ్యావృత్తియందుఁ బర్యవసించును. (కీర్తియే భూషణముగాని రత్నము గాదు అను నర్థమునఁ బర్యవసించును.) ఇది ప్రశ్నపూర్వకము.

పై నరసభూపాలీయ లక్షణమునకును దీనికిని నేకవాక్యత యెట్లని ప్రశ్న వచ్చుచున్నది. నరసభూపాలీయ లక్షణమగు "ఒక వస్తు వనేకస్థలములం దేకకాల మున సంభవించుచుండఁగా నేకస్థలమునందే నియమించుట" అను లక్షణ మిటఁ గూడఁ బట్టును. ఎట్లన "కిం భూషణం" ఇత్యాది స్థలమున భూషణత్వము కీర్తి, రత్నములందుఁ బ్రసక్తించుచుండఁగా రత్నముభూషణము గాదని కంఠోక్తిచే వర్జించి కీర్తియే భూషణమని నియమింపఁబడినది. ఇదేవిధమున మిగిలినయెడలను గ్రహింప వలెను. లక్షణములందుఁ గథనభేద మున్నను సమానార్థకములే. లక్షణద్వయము నందును నన్యవ్యపోహము ప్రధానము.

ఈ పరిసంఖ్యాలంకారము చతుర్విధము. ఇది ప్రశ్నపూర్వకము. ఇందుఁ బ్రశ్నమును, శాబ్దమగు పరివర్జనమును గలదు.

కి మాసేవ్యం పుంసాం? సవిధమనవద్యం ద్యుసరితః
కి మేకాంతే ధ్యేయం? చరణయుగళం కౌస్తుభ భృతః
కి మారాధ్యం పుణ్యం ? కి మభిలషణీయం ? చ కరుణా
యదాసక్త్యా చేతో నిరవధి విముక్త్యై ప్రభవతి.

పురుషులకు సేవింపఁదగిన (వసింపఁదగిన) స్థల మేది ? పవిత్రమగు గంగా తీరము. ఏకాంతమున ధ్యానము చేయఁదగినదేది ? శ్రీహరియొక్క చరణయుగళము. ఆరాధింపఁదగినది (గడింపఁదగినది) ఏది ? పుణ్యము. అభిలషింపఁదగినదేది ? కరుణ. తదాసక్తిచే హృదయము పునరావృత్తిరహితమైన ముక్తినిఁ బొందఁజాలును. ఇందుఁ బ్రశ్నమే కాని "యశో న రత్నం" అన్నట్లు శాబ్దమగు వర్జనము లేదు. అర్థమగు వర్జనము కలదు.

భక్తిర్భవే న విభవే । వ్యసనం శాస్త్రే న యువతికామాస్త్రే
చింతా యశసి న వపుషి । ప్రాయః పరిదృశ్యతే మహతాం.

భవునియందే భక్తి; విభవమునఁ గాదు; శాస్త్రమునందే వ్యసనము. యువతీ రూపమగు కామాస్త్రమునఁగాదు (కామాస్త్రరూపమగు యువతి యనియు నర్థమును జెప్పుకొనవచ్చును.) యశస్సంపాదనమునందే చింత; శరీర పోషణమునఁ గాదు. మహాత్ములకుఁ దఱచుగా నివ్విధమునఁ గనఁబడును.

ఇటఁ బ్రశ్నములేని శాబ్దమగు వర్జనము గలదు.

కాటిల్యం కచ నిచయే, కరచరణాధరదళేషు రాగస్తే
కాఠిన్యం కుచయుగళే, తరళత్వం నయనయో ర్వసతి.

నీ కచబృందమునఁ గౌటిల్యమును, గర, చరణాధరములందు రాగమును, కుచయుగమునఁ గాఠిన్యమును, నయనములందుఁ దరళత్వమును వసించుచున్నవి.

ఇటఁ బ్రశ్నములేని యర్థపరివర్జనము గలదు.

## ౫౨. ఉత్తరము

కం. ఎత్తటిను స్నేయంబే
నుత్తరమునఁబ్రశ్న, మదియు, నుత్తరము వెసన్
మొత్తమయిపొల్చునె త్తటి
నత్తటి నుత్తరము నెగడు; నదియెట్లన్నన్. ౧౫౪౮

ప్రతివచనమాత్రముచే నెచ్చటఁ బ్రశ్నరూప మూహింపఁబడునో యది యొక యుత్తరాలంకారభేదము. ఈ ప్రశ్నోత్తరములు మొత్తమైయున్నచో ననఁగా మాలారూపముగా నున్నచో నిది మరొక యుత్తరాలంకారభేదము.

ఈ రెండవభేదమునకుఁ బ్రకాశకారుఁడీ క్రిందివిధమున లక్షణముఁ జెప్పెను.

"అసకృ ద్యదసంభావ్య ముత్తరం స్యాత్తదుత్తరం,,

పెక్కుసారులు ప్రశ్నలును లోకోత్తరముగా ననఁగా సామాన్యు లూహింపరానివిధమునఁ బ్రతివచనములును వర్ణింపఁబడినచో నదియు నుత్తరాలంకార భేదము. ఈ ప్రశ్నోత్తరము లొక్కమారు వర్ణించినచో విచ్ఛిత్తివిశేషములేమి మాలారూపముననే యుండవలెను.

౧

సీ. అలరారు పూఁదీవయని తలంచితిఁగాని
యబల! నీతనువల్లియగుట యెఱుఁగ

నాలోలపల్లవంబని భ్రమించితిఁగాని
చెలువ! నీచేసన్న సేయు టెఱుఁగ
అలిబాలికాజాలమనుచుఁ జూచితిఁగాని
సుదతి! నీచికురముల్ సెదరు టెఱుఁగ
నలకోకిలాలాపమనుచు నుండితిఁగాని
పడఁతి! నీవెలుఁగెత్తి పలుకు టెఱుఁగ

గీ. అలుకఁ జాలింపుమనుచు నీయహితనృపతి
తావకోద్భటధాటికిఁ దల్లడిల్లి
యడవులకు నేఁగి కులకాంత నాదరించు
నరసుతాటోప! యోబయనరసభూప! ౧౯౫

పతియొక్క యీ ప్రతివచనములచేత భార్యసేసిన "అగపడుచున్నను నన్నుఁ జూడవేమి? చేసన్నఁజేయుచున్నను రావేమి? ఎలుఁగెత్తి పిలిచినను బలుకవేమి? అను ప్రశ్న లూహింపఁబడుచున్నవి. అట్టిప్రశ్నలే లేకున్నచో నిట్టి సమాధానములే ప్రాసఁగవుఁ అసంగతములే యగును. ఇందలి మూఁడవపాదముననున్న "అలిబాలికా" ఇత్యాదికము బ్రతివచనరూపముగా లేదు. కావున నిటఁ బ్రశ్నమూన్నేయముగాదు. లేక యతి కష్టముగాఁ బ్రశ్న నూహింపవచ్చును. ఎట్లన, "నా చికురములు సెదరు టెఱుఁగవా?" అని. తత్సమాధానము 'అలిబాలికా' ఇత్యాదికము అని.

౨

ఉ. ఎవ్వఁడు దేవతాగురుఁ? డహీనశయానుఁ; డవక్రవిక్రముం
డెవ్వఁడు? రామభద్రుఁడు; మహీవలయైకధురాధురంధరుం
డెవ్వఁడు! భోగిభర; జగదేకవిజృంభిత దానదీక్షితుం
డెవ్వఁడు? పోచిరాజనరసేంద్రుఁడె వార్ధిపరీత మేదినిన్. ౧౯౬

ఇచటఁ బ్రశ్నములును సమాధానములు మాలారూపమునఁ గలవు. సమాధానములు లోకాతిక్రాంత గోచరమగు నసంభావ్యరూపమున నిబంధింపఁబడినవి. ప్రథమభేదమునఁ బ్రశ్నము వ్యంగ్యరూపము. సమాధానము వాచ్యము. ఈ ప్రభేదమునఁ బ్రశ్నోత్తరములు రెండును వాచ్యరూపముననే యున్నవి. ప్రథమభేదమున వ్యంగ్యము వాచ్యసిద్ధి కంగము [illegible] వ్యంగ్య[illegible] మగును.

## ౫౩. వికల్పము

కం. సమబలయుతవస్తువులకు
నమితవికల్పంబొనర్ప ననఘాలంకా
రమతజ్ఞుల మతమున నది
యమరు వికల్పంబనంగ నదియెట్లన్నన్. ౧౯౩

తుల్యబలము గల రెండు వస్తువులకు వికల్పము వర్ణింపఁబడినచో వికల్పాలంకారము. అలంకారమన విచ్ఛిత్తివిశేష ముండవలెనుగదా! ఇట విచ్ఛిత్తియేమి? అన్నచో నా రెండు వస్తువులకును నౌపమ్యమూలకమగు విచ్ఛిత్తి యుండవలయును.

సీ. అలఘు కాంచనమయస్థలనివాసము మేలో?
కాంచనస్థలవాసకలన మేలో?
పుండరీకంబుల దండనుండుట మేలో?
పుండరీకంబుల దండ మేలో?
మహనీయవాహినీ మధ్యసంస్థితి మేలో?
వాహినీశ్వరమధ్య వసతి మేలో?
మహిషీసహావాస విహరణంబులు మేలో?
మహిషీసహావాస మహిమ మేలో?

గీ. శైలకటకాశ్రయంబులు మేలో? యతని
యంఘ్రికటకాశ్రయము మేలో? యధిపులార!
అనుచు నీశాత్రవుల మంత్రులనునయింతు
రరిజయాటోప! తొరగంటినరసభూప! ౧౯౪

కాంచనము = బంగారము; సంపెంగచెట్టు. పుండరీకము = తామర; పులి. వాహిని = సేన; నది. మహిషి = రాణి; గేదె.

ఇట వికల్పము స్పష్టముగా గోచరించుచున్నది. శబ్దసాధర్మ్యమూలకమగు నౌపమ్యముచేఁ జారుత్వము భాసించుచున్నది.

## ౫౪. సముచ్చయము

కం. మిగులగుణక్రియ లెయ్యెడ
యుగపత్ప్రాప్తంబులుగ సముచ్చయము కృతిం

బొగడఁదగుం ద్వివిధంబై
యగణితెతకవివినుతమగుచు నదియెట్లన్నన్. ౧౯౯

గుణములును, క్రియలును యౌగపద్యప్రాప్తములుగ నెచ్చట వర్ణింపఁబడునో యది సముచ్చయము.

కం. నరసింహ శౌర్యశోభా
స్ఫురణంబున జగములెల్ల శోణములయ్యెన్
బరరాజవదనవితతులు
హరినీలనిభంబులయ్యె నదియెట్లన్నన్. ౨౦౦

ఇట గుణములగు శోణత్వ, నీలత్వములకు యౌగపద్యము చెప్పఁబడినది.

చ. అలకలుముట్టిముట్టి, జఘనాంబరపంక్తి కిఁగిట్టి కిట్టి, గు
బ్బలు రతిఁబట్టిపట్టి, కరపల్లవముల్ నులివెట్టి పెట్టియుం
జెలువగుతారహారములు చిక్కులువెట్టు నృసింహ! నీద్విష
ల్లలన వనాలికేఁగ విటలక్షణలక్ష్యములై మహీజముల్. ౨౦౧

ఇట ముట్టుట, కిట్టుట, పట్టుట, నులివెట్టుట, చిక్కులువెట్టుట, మొదలగు క్రియలకు యౌగపద్యము చెప్పఁబడినది.

గుణ క్రియలు రెంటికినిఁగూడ యౌగపద్యమున్నను సముచ్చయమే. ఎట్లన,

కలుషం చ తవాహితేష్వకస్మా త్సితపంకేరుహసోదరశ్రి చక్షుః
పతితం చ మహీపతీంద్ర! తేషాం వపుషి ప్రస్ఫుట మాపదాం కటాక్షైః.

ఓ రాజా! తెల్లతామరవలెనున్న నీ నేత్రము శత్రువులయం దాకస్మికముగాఁ గలుషమైనది. వారి శరీరములపై నాపద్రూపలగు నాయికల కటాక్షములు పడినవి.

ఇటఁ గాలుష్యరూపగుణము, పతనరూపక్రియ, అను రెంటియొక్క సముచ్చయము.

కం. పాయక "ఖలేకపోత
న్యాయము"న ననేకకారణము లొకకార్యం
బేయెడ సాధింపఁగ నుత
మై యపరసముచ్చయాఖ్యమగు నెట్లన్నన్. ౨౦౨

ఖలేకపోత న్యాయానుసారముగా సహమహమికతో నొక కార్యమును సాధింపఁ [illegible] సముచ్చయము నొక భేదము.

కం. శూరతయును, ధీరతయు, ను
దారతయు, గభీరతయును, ధార్మికతయు, నీ
కారణజన్మస్ఫురదవ
తారము సూచించె నోబధరణిపునరసా ! ౨౦౩

కారణజన్మ స్ఫురదవతారము కార్యము. దీనికి ఖలే కపోత న్యాయమున (కళ్లమునుండి కపోతములన్నియు నేకకాలమున నెగిరినవిధమున – పంచతంత్రములోని కథ ననుసంధించుకొనునది.) శూరతా, ధీరతా, ఉదారతా, గభీరతలు, అను పెక్కు పెక్కు కారణములు వర్ణింపఁబడినవి.

## ౫౫. సమాధి

కం. కారణ మొక్కటి కార్యము
ధారుణి సాధింపఁ గాకతాళనయమునన్
గారణము వేఱొకటిరా
నారూఢి సమాధియయ్యె నదియెట్లన్నన్. ౨౦౪

ఒక కార్యమును సాధించుట కొక కారణము ప్రవృత్తమయియుండఁగా గాకతాళీయ న్యాయానుసారముగా మరొక కారణము వచ్చి యా కార్యమును సుకరముగాఁ జేసినట్లు వర్ణించినచో సమాధి.

చ. అనిమొన శ్రీనృసింహవసుధాధిపు తీవ్రచమూసమూహముం
గనుఁగొని యద్భుతంబొదవ ఖానువజీరులు వ్రేళ్ళు నోళ్ళకుం
జొనుపఁగఁగాకతాళనయశోభఁ దదీయముఖాంగుళీనివే
శనములు ప్రాణరక్షణ విచారధురీణములయ్యె వారికిన్. ౨౦౫

నరసభూపాలుని సైన్యములను జూచి ఖానువజీరు లక్కజపడి తమ వ్రేళ్ళు నోటిలోఁ బెట్టుకొనఁగాఁ గాకతాళీయముగా నా వ్రేళ్ళు ప్రాణరక్షణమునకై యాచించు వ్యాపారమున ధురీణములు (వ్యాపృతములు అయ్యెను.)

ఆశ్చర్యముతో నోటిలోఁ బెట్టుకొన్న వ్రేళ్లు రక్షణకార్యోపయుక్తములయినవి. ఈ లక్ష్యమున లక్షణము పట్టదు. ఏలన, నేకార్యమును సాధించుటకుఁ గారణము ప్రకృతమైనది ? ఆశ్చర్య మను కారణముచే 'నోటిలో వ్రేళ్ళుపెట్టుకొనుట' అను కార్యము సిద్ధించినది. అసలు కార్యము సిద్ధింపఁగూడదు. కార్యము సిద్ధించినచోఁ గారణాంతరముచే నది యెట్లు సుకరమగును ? ఏ కారణాంతరముచే నీ కార్యము

సుకరమైనది ? ఏమియు లేదుగదా! కాన నీ లక్ష్యము సరియైనది కాదు. ఈ క్రింది యుదాహరణమును గనుఁడు.

కం. పొలయలుకను దొలఁగింపఁగఁ
జెలియడుగులయందు వ్రాలఁ జేరెదు నాకుం
గలిగింపఁగ నుపకారము
బలముగఁ గ్రొమ్మొగి లదృష్టవశమున నుఱిమెన్.

ప్రణయకోపశాంతి కార్యము. 'చెలియడుగులయందు వ్రాలుట' అను కారణముచే నది సాధ్యము. కాకతాళీయముగాఁ గ్రొమ్మొగి లుఱుముట యను కారణాంతరముచే నా కార్యము సుకరమైనది. అనఁగా నా కార్యములోఁ బనిలేకయే పోయినది. ప్రణయకోపము చరణపాత మక్కఱలేకయే శాంతిల్లినది.

## ౫౬. భావికము

కం. క్షితిలోన నతీత, మనా
గతమును, బ్రత్యక్షమువలెఁ గనుపట్టుట న
ద్భుత నిరుపమార్థకథనం
బతిశయముగ భావికాఖ్యమగు నెట్లన్నన్. ౨౦౬

అద్భుతమగు వర్ణనా చాతుర్యముచే నతీతానాగత వృత్తాంతములు ప్రత్యక్షాయమాణములుగా వర్ణింపఁబడినచో భావికాలంకారము. భూతభవిష్యద్వృత్తాంతములను బ్రత్యక్షముగా భాసించుచున్నట్లు వర్ణించుట దోషముగాదా ? అన్నచోఁ గాదు. అత్యద్భుత వర్ణనముచే సహృదయుల హృదయమున భావన యుదయించును. ఆ భావనచే సహృదయ హృదయమునం దా విషయము నిలిచి ప్రత్యక్షమువలె భాసిల్లును. ఎట్లనఁ, బాంథుఁడు తన ప్రియురాలినిఁ బదింబదిగా ధ్యానించుచు నది ప్రత్యక్షమునం దున్నట్లుగా భావించుచున్నాఁడుగదా! అట్లే యిచ్చటఁగూడ గ్రహింపవలెను.

మ. వరవల్గావిభవంబు దుష్టభుజగవ్రాతంబుగా, సింగిణుల్
గురుపక్షద్వితయంబుగాఁగ నరసత్క్షోణీశ్వరారూఢమా
తురగోత్తంసము, నిందిరాహృదయనాథుం దాల్చు ప్రత్యక్ష బం
ధుర పక్షీంద్రునిలీలఁజూచు నహితస్తోమంబు భీమంబుగన్. ౨౦౭

కళ్లెమును, ధనుస్సులను ధరించిన, నరసభూపాలుఁ డధిష్ఠించిన, గుఱ్ఱమును నోట సర్పములను, నిఱుపంకలను రెక్కలనుదాల్చిన, శ్రీ మహావిష్ణువును వహించిన, గరుత్మంతుని గాఁ బ్రత్యక్షముగా శత్రువులు చూచిరి.

ఇట శ్రీ మహావిష్ణువును ధరించిన గరుత్మంతుఁడు ప్రత్యక్షముగాఁ జూడఁబడు చున్నట్లు వర్ణింపఁబడుటచే భావికము. ఇది భూతభావికము.

పద్యమునఁ 'బ్రత్యక్షబంధుర పక్షీంద్రుని' అనుచోఁ బ్రత్యక్షపదము సమాస గ్రస్తమై గుణీభూతమై 'చూచు' అను క్రియాపదములో నన్వయింపకున్నది. అది క్రియలోని కన్వయించినఁ గాని ప్రత్యక్షముగా దర్శించుచున్నట్లు వర్ణింపఁబడదు.

మ. తొలి వజ్రాయుధముం ధరించి, పురుహూతుం డద్రులంబట్టి ఱె
క్కలఁ ఖేదించిన ఘట్టముల్, గిరుల సంఘంబుల్ ఘరట్టాభమై
జలధిం దర్మిన మందరాద్రి కథలుం సాక్షాత్తుగాఁజూచె ను
జ్జ్వలతేజోనిధి పెక్కురంగముల నా సంగ్రామమధ్యంబునన్.

ఇట 'సాక్షాత్తుగఁ జూచె' అని సాక్షాత్పదము క్రియాపదములోడనే యన్వ యించుచున్నది. పై పద్యమున నివ్విధముగా లేదు.

"భావిభూషణసంభారాం సాక్షాత్కుర్వే తవాకృతిం"

ముందు (భావి) భూషణసంభారమును దాల్చు నీ యాకారమును సాక్షాత్క రించుకొనుచున్నాను. ఇది భావిభావికము.

## ౫౭. ప్రత్యనీకము

కం. పగవాఁడు సమర్థుఁడుగా
మగఁటిమి పెస నతనిమీఁద మార్కొన కిల నా
పగవానిహితుల నొంచుట
యగుఁ గృతులం బ్రత్యనీక మది యెట్లన్నన్. ౨౦౮

బలవంతుఁడగు శత్రువును మార్కొనలేక యా శత్రువుయొక్క మిత్రుని బాధించునట్లు వర్ణించినచోఁ బ్రత్యనీకాలంకారము.

కం. నీ దురవగాహ శౌర్యము
భేదింపఁగలేక విమతపృథివీశుఁడనిన్
భేదించు నృసింహ! భవ
న్మేదురభయదప్రతాపమిత్రునిమిత్రున్. ౨౦౯

శత్రురాజు నీ శౌర్యమును భేదింపలేక నీ శౌర్యమునకు మిత్రుఁడగు మిత్రుని (సూర్యుని) భేదించుచున్నాఁడు. (యుద్ధమున మృతులయినవారు సూర్యమండలమును భేదించుకొని పోవుదురని ప్రతీతి)

### ౫౮. వ్యాఘాతము

కం. ఒకఁడొకటిచేత నొకపని
నకలంకతఁ జేయ దాని నాహేతువుచే
నొకఁడు మఱివేఱె చేయఁగఁ
బ్రకటవ్యాఘాత మెన్నఁబడు నెట్లన్నన్. ౨౧౦

ఒకఁ డొక సాధనముచే నొక కార్యమును సాధింపఁగా మరొకఁ డా సాధనముచేతనే దానికి విరుద్ధమగు కార్యమును సాధించినట్లు వర్ణించినచో వ్యాఘాతము.

కం. రాజీవబాంధవుఁడు నిజ
తేజమున నొనర్చుఁ ద్రిజగతీతాపము; న
వ్యాజవిరాజితతేజో
రాజిన్ హరియింతు వోబరాజునృసింహా! ౨౧౧

సూర్యుఁడు దన తేజముచే ముల్లోకములకును దాపమును గూర్చుచున్నాఁడు. నీ వా తేజముచేతనే ముల్లోకములతాపమును హరించుచున్నావు.

సూర్యుఁ డేసాధనముచే నొక కార్యమును సాధించుచున్నాఁడో వరస భూపాలుఁ డా సాధనముతోడనే తద్విరుద్ధకార్యమును జేయుచున్నట్లు వర్ణింపఁబడినది. ఈ క్రింది పద్యముగూడ నుదాహరణీయము.

ఆ. వె. కంటఁ గ్రాఁగినట్టి తుంటవిల్కానిని
గంట బ్రదుకఁజేయఁగలుగుదంట
లా త్రినేత్రుగెలుచు నాటోపము వహించు
వామనేత్రలకు నివాళులిత్తు.

ఏ నేత్రములతో మన్మథుఁడు గాల్పఁబడెనో యా నేత్రములతోడనే యువతులు వానిని బ్రదికింతురు.

### ౫౯. పర్యాయము

కం. ఏకాధేయంబరయ న
నేకాధారంబులందు నిరవై క్రమముం
జేకొనఁ బర్యాయంబు మ
హీకవిసంస్తుత్యమయ్యె నది యెట్లన్నన్. ౨౧౨

ఏకవస్తు వనేకాధారములందుఁ గ్రమముగా లేక కాలభేదమున నున్నట్లు వర్ణింపఁబడినచోఁ బర్యాయాలంకారము.

సీ. కందర్పహరునందుఁ గనువిప్పఁగా నేర్చి
శరవణోద్భవునందు శక్తి యెఱిఁగి
రామునం దచలాంబరముగట్టఁగా నేర్చి
జలధిలంఘనునందుఁ జంగ యెఱిఁగి
ఘటజునం దుభయపక్షములఁ బొర్లఁగ నేర్చి
వెస ద్రోణుయెడఁ బాలువేఁడ నెఱిఁగి
మొగి వృకోదరునందు ముష్టిపూనఁగ నేర్చి
విజయునియెడఁ గర్ణవేధ యెఱిఁగి
గీ. యనుదినంబును నభివృద్ధిఁ దనరు శౌర్య
శిశువు భవదీయ దోఃస్తంభజృంభమాణ
ఖురళిఁ గౌక్షేయచాలన స్ఫురణమెఱిఁగె
వైరిగజసింహ! యోబయనారసింహ! ౨౧౩

ఒకే శౌర్యశిశువు అను వస్తువు (ఆధేయము) క్రమముగా ననేకములగు నాధారములందున్నట్లు వర్ణింపఁబడినది. ఈ క్రింది పద్యమును నుదాహరణీయమే.

కం. కనఁబడుచువచ్చె రాగము
మును నీ కెమ్మోవియందె ముఖ్యంబుగఁ గ్రొ
న్ననఁబోఁడి! యిప్పు డయ్యది
కనఁబడు నీ హృదయమునను గాఢతరంబై.

రాగ మను వస్తువు మొదటఁ గెమ్మోవియందును పిమ్మట హృదయమునను గాలభేదమునఁ గనఁబడినట్లు వర్ణింపఁబడినది. ఇట రాగశబ్దము శ్లిష్టము.

ఈ రెండు లక్ష్యములలో నొకే వస్తువు పెక్కాధారములలో నున్నట్లు వర్ణింపఁబడినది. దీనికి విపరీతముగా ననేక వస్తువులు కాలభేదమున నొకే యాధారమున నున్నట్లు వర్ణింపఁబడినను బర్యాయమే. ఎట్లన,

మధురిమరుచిరం వచః ఖలానా మమృతమహో! ప్రథమం పృథు వ్యనక్తి
అథ కథయతి మోహహేతు మంతర్గత మివ హాలహలం తదేవ.

ఖలవచనము మొదట నమృతముగా నుండును. అదియే మోహహేతువై హాలాహల వి[illegible]

ఇట నొక ఖలవచనమునందే యమృత విషము లున్నట్లు (కాలభేదమున) వర్ణింపఁబడినది. అనఁగా నొకే యాధారమున ననేక వస్తువులు వర్ణింపఁబడినవి.

౬౦. సూక్ష్మము

కం. ఈక్షితిఁ దలపోయ నసం
లక్షితసూక్ష్మార్థకాశలప్రకటన వై.
చక్షణ్యము సూక్ష్మంబగు
నక్షీణకవిప్రశస్త మది యెట్లన్నన్. ౨౧౪

సామాన్యులకుఁ దెలియఁబడనిదియు, విదగ్ధులకు మాత్రము దెలియఁదగినదియు నగు సూక్ష్మార్థమును, ఆకారముచేఁ గానీ యింగితముచేఁ గానీ ప్రకాశింపఁజేయు చున్నట్లు వర్ణించుట సూక్ష్మాలంకారము.

ఉ. ప్రాణమువంటి నాకు నిజభావముఁ దాఁపఁగఁజెల్లునమ్మ! నీ
ప్రాణవిభుం బ్రభూతగుణబంధురుఁ దెల్పగదమ్మ! యంచు వి
న్నాణముగా సఖీజనులు నల్గడలం గదియంగ సైకత
శ్రోణి యురంబుమీఁద నఖసూచిక సేర్చె నృసింహభూవరా!

'ఉరంబుమీఁద నఖసూచికను జేర్చను' అను వ్యాపారముచే 'నృసింహుఁడు' అను నర్థము వ్యక్తము సేయఁబడుచున్నది. తన యురమునఁ గుచకుంభము లున్నవి. అవి కుంభికుంభములవలె నున్నవి. కుంభికుంభములను గోళ్ళతోఁ జీల్చునది సింహముగదా!

ఈ క్రిందిదియు నుదాహార్యము.

కం. ఒక జాణకత్తె సంకే
తకాల మెఱుఁగందలంచు తన మిండనికిన్
సకులకడఁ గనులనవ్వులఁ
బ్రకటించెను; గరవిలాస పద్మము మూసెన్.

నవ్వులచే వెన్నెలయుఁ బద్మనిమీలనముచే సంధ్యాకాలమనియు వ్యక్తము 'సేయఁబడినవి.

గీ. ఉష్ణ శీతాన్న కబళంబు లొకఁడు నూపఁ
బవలా? రాత్రియొ? కెడఁగూడ నవసరమని
దాని కుత్తర మొక లతాతన్వి యిచ్చె
[illegible]

నైషధము నందలి బువ్వపుబంతి వడ్డించు ఘట్టమునందలి దీ పద్యము. ఇదియు నుదాహరణీయమే.

## ౭౧. ఉదాత్తము

కం. విశ్వోన్నతమై చెలఁగెడు
నైశ్వర్యము గలుగు వస్తు వభినుతిసేయన్
శాశ్వతమగుచు నుదాత్తము
విశ్వంభరలోనఁ బొల్చు విను మెట్లన్నన్. ౨౧౬

అత్యంత సమృద్ధమగు వస్తువర్ణన ముదాత్తము.

మ. నృపులర్పించినఁ, జేడెలూడ్చి వెలికిఁ నేర్పొప్పఁగాఁ గుప్పగా
నెపుడుం జల్లిన ముగ్గుముత్తెములు, ధాత్రీశాంగదస్వర్ణచూ
ర్ణపుఁబ్రోవుల్, దగు నీ గృహాంగణములం,దారాద్రి ధాత్రీవరా
ధిపముల్ స్వవ్యయభీతి నిన్గొలుచురీతిఁ శ్రీ నృసింహాధిపా!

సామంతరాజు లర్పింపఁగా, దాసీజనము లూడ్చి బయటఁ గుప్పవేసిన ముత్తెముల రాసులును, సామంతరాజు లహమహమికతో రాచుకొనుచు నిన్ను సేవింప వచ్చినపుడు రాలిన బంగారు చూర్ణముయొక్క ప్రోవులును, నీ గృహాంగణమునఁ గైలాస మేరుపర్వతములు దమ్ము వ్యయముసేయుదువో యను భీతితో నిన్నుఁ గొలువవచ్చినవిధమున నలరారుచున్నవి.

ఇట నుత్ప్రేక్షయుఁ గలదు. కానీ యుదాత్తమే ప్రధానము.

## ౭౨. పరివృత్తి

కం. సమమిచ్చి సమముఁగొన న
ల్పమునిచ్చి యనల్పముఁగొన, భావింప నన
ల్పమునిచ్చి యల్పముంగొన
నమరుం బరివృత్తి త్రివిధమై యెట్లన్నన్. ౨౧౭

న్యూనాభ్యధికములకుఁ బరస్పర వినిమయము పరివృత్తి. ఇది త్రివిధము. ౧. సమపరివృత్తి (సమమునిచ్చి సమమును గొనుట.) ౨. న్యూనపరివృత్తి (అధికము నిచ్చి యల్పమును గొనుట.) 3. అధికపరివృత్తి (అల్పము నిచ్చి యధికమును గొనుట.)

కం. శ్రుతి హృదయ రత్నభూషా
కృతులు కృతుల్ నీకు నొసఁగి కృతులు నృసింహ
క్షితివర ! నీచేఁ గాంతురు
శ్రుతిహృదయాభరణములుం విశోభితలీలన్. ౨౧౯

నిపుణులగు కవులు శ్రుతులకును, హృదయములకును రత్నభూషణములవంటి తమ కావ్యముల నీకిచ్చి నీనుండి శ్రుతి హృదయాభరణములను గొందురు.

ఇట శ్రుతి హృదయ రత్నభూషాకృతులగు కృతులిచ్చి శ్రుతిహృదయ రత్న భూషలు వారు గ్రహించుచున్నారు. కాన సమపరివృత్తి.

కం. నరసింహ ! నీదు వైరులు
కరిసింహాలుఁలాయభల్లగవయాహిపరం
పరకుఁ దమ గృహము లొసఁగుచు
వరుసఁ భజింతురు తదీయవనమందిరముల్. ౨౨౦

ఇట 'శత్రువులు దమ గృహములను గజసింహాదులకిచ్చి వాని గుహలను దాము గొనుచున్నారు' అనుటచే నధికము నిచ్చి యల్పముఁ గొనుచున్నట్లు వర్ణింపఁ బడినది. కాన న్యూనపరివృత్తి.

కం. నరతనువు నీ కరాసికి
నరి యొసఁగి నృసింహభూప ! యనుపమరంభా
పరిరంభగుంభసంభ్రమ
భరితామరతా శుభప్రభావముఁ జెందున్. ౨౨౧

శత్రువు నీకత్తికి మనుష్యశరీరమిచ్చి యసదృశమగు రంభాపరిరంభయుక్త మగు దేవశరీరమును బొందుచున్నాఁడు.

ఇట నల్పమిచ్చి యధికముఁ గొనుచున్నట్లు వర్ణింపఁబడినది. ఇది యధిక పరివృత్తి.

౬౩. కారణమాల

కం. ఇల నుత్తరోత్తరములకుఁ
బొలుపొందఁగఁ బూర్వపూర్వములు హేతువులై
యలరఁగఁ గారణమాలిక
యలంకరణరాజమయ్యె నది యెట్లన్నన్. ౨౨౨

పూర్వపూర్వము లుత్తరోత్తరములకుఁ గారణములయ్యేనేనిఁ గారణమాల.

మ. హరిపాదాంబుజపూజనాభిరతిచే నైశ్వర్య, మైశ్వర్య చా
తురిచే సజ్జనరక్షణంబు, సుజనస్తోమావనస్ఫూర్తిచేఁ
జిరపుణ్యంబులుఁ, బుణ్యవాసనలచేఁ జెన్నొందు సత్కీర్తియున్
నరసింహాధిప! నీకె పొల్చు బుధసంతానైకచింతామణీ! ౨౭౩

హరిపాదాంబుజ...రతి రైశ్వర్యమునకుఁ గారణము; ఐశ్వర్యము సజ్జన రక్షణమునకుఁ గారణము. సజ్జన రక్షణము పుణ్యమునకుఁ గారణము. పుణ్యము కీర్తికిఁ గారణము.

కారణవాచకములగు పూర్వపూర్వపదములే యుత్తరోత్తరమున నుండవలెను. అట్లుగాక తదర్థబోధకమగు పదాంతరమును బ్రయోగించినచోఁ దత్ప్రతిభానము లేక వివక్షితార్థసిద్ధి గలుగదు. ఇట 'సజ్జనరక్షణంబు, సుజనస్తోమావనస్ఫూర్తిచే' అనునెడ సజ్జనరక్షణ పదము విడువఁబడి 'సుజనస్తోమావన పదము' ప్రయుక్తమైనది. ఇది యుక్తముగాదు.

పూర్వపూర్వము లుత్తరోత్తరములకుఁ గారణమగుటయేకాక యుత్తరోత్తరములు పూర్వపూర్వములకుఁ గూడఁ గారణములగును. ఎట్లన,

భవంతి నరకాః పాపాత్ । పాపం దారిద్ర్య సంభవం
దారిద్ర్య మప్రదానేన । తస్మాద్దానపరో భవ!

నరకములు పాపమువలన వచ్చును. పాపము దారిద్ర్యమువలనఁ గలుగును. దారిద్ర్య మప్రదానముచేతఁ (దానము చేసియుండని కారణమున) గలుగును. కావున దానపరుఁడవు గమ్ము!

ఇటఁ బూర్వపూర్వములగు నరకాదులకు నుత్తరోత్తరములగు పాపాదులు కారణములుగా నిరూపింపఁబడినవి.

అయితే యీ యలంకారమున విచ్ఛిత్తి యేమున్నది? అని యడుగవచ్చును. ఉత్తరోత్తరవస్తువులు కారణములగుటచే నివ్వన్నియు నుపాదేయములే యను జ్ఞానము చమత్కారకారణమగును.

## ౭౪. ఏకావళి

కం. ధరఁ బూర్వపూర్వమున కు
త్తరోత్తరము క్రమసముగత విశేషణమై

పరగిన నేకావళి యన
నరుదగు సత్కృతులయందు నది యెట్లన్నన్. ౨౨౪

పూర్వపూర్వమున కుత్తరోత్తరము విధిరూపమున విశేషణముగా నిబంధించి నచో నేకావళి.

కం. అవనిధవాస్థానంబులు
కవియుతములు; కవులు రచితకావ్యలు; కావ్య
వ్యవహారము లమితభవ
న్నవనవగుణభూషితములు నరసింహ! నృపా! ౨౨౫

విధిరూపమున నేకాక నిషేధరూపమున నిబంధించినను నేకావళియే. ఎట్లన,
న తజ్జలం యన్న సుచారుపంకజం । న పంకజం తత్ యదలీన షట్పదం
న షట్పదోఽసౌ కలగుంజితో న యో । న గుంజితం తన్న జహార యన్మనః.

ఏది చక్కని తామరలు లేనిదో యది జలముగాదు. ఏది తుమ్మెదలులేనిదో యది తామరగాదు. ఏది కలరుతముసేయదో యది తుమ్మెదగాదు. ఏది మనస్సును హరింపదో యది కలరుతముగాదు.

సంస్కృత శ్లోకమునఁ బూర్వపూర్వములగు జలాదుల కుత్తరోత్తరములగు సుచారు పంకజాదులు నిషేధరూపమున నిబంధింపఁబడినవి.

## ౬౫. మాలాదీపకము

కం. మహిఁ బూర్వపూర్వములచే
రహిమీఱఁగనుత్తరోత్తరము రమ్యగుణా
వహముగ మాలాదీపక
మహీనవిఖ్యాతిఁ జెందు నదియెట్లన్నన్. ౨౨౬

పూర్వపూర్వములచే నుత్తరోత్తర ముత్కర్షమును వహించినట్లుగా నిబంధింపఁ బడినచో మాలాదీపకము.

కం. గురుచాపముచే శరతతి,
శరతతిచే శత్రుశిరము, శత్రుశిరముచే
ధర, ధరచే నీబాహువు
పరిలబ్ధంబయ్యె నోబసారిపునరసా! ౨౨౭

చాపముచే శరతతి యుత్కర్షమును (సంధానమువలన) వహించెను. శరతతిచే శత్రుశిరస్సు (యుద్ధమున మరణించుటచే) ఉత్కృష్టత వహించెను. శత్రుశిరముచే ధర (శత్రునాశముచే) యుత్కర్షము వహించెను. ధరచే నీ బాహువు (ధరాభారమును వహించుటచే) ఉత్కర్షమును వహించెను.

## ౬౬. సారము

కం. నిరవధికముత్తరోత్తర
నిరతోత్కర్షంబుఁ దెలుప నిఖలకృతులయం
దరుదై తగుసారాలం
కరణము కవివినుతమగుచుఁ గడునెట్లన్నన్. ౧౭

ఉత్తరోత్తర వస్తూత్కర్షము వర్ణింపఁబడినచో సారము.

సీ. స్థావరజంగమాధారముల్ త్రిజగంబు
లలజగంబులజాండములఁ జెలంగు
నాయజాండములందు హరిరోమకూపమం
దా శౌరియును భోగిపై శయించు
నాభోగి జలధికోణావాస మొందు నా
కడలి కుంభజుఁ జుళుకంబుఁ జెందు
నాకుంభజుఁడు నింగికేక ఖద్యోతాభుఁ
డానింగి కబరియై యతిశయిల్లు

గీ. నీయశోలక్ష్మి కక్షీణనీతిచతుర !
చతురదధిమేఖలావృతక్షితిధురీణ !
చటులభుజదండదండితోత్కటమదారి !
వీరపరివార! రాబభూవిభునృసింహ! ౧౮

ఇట నుత్తరోత్తరోత్కర్షము గానరాదు. కాన నిది యుదాహరణార్హము గాదు. ఈ క్రింది శ్లోక ముదాహార్యము.

"రాజ్యే సారం వసుధా; వసుధాయాం పురం; పురే సౌధం;
సౌధే తల్పం; తల్పే వరాంగనానంగ సర్వస్వం."

రాజ్యమునందు వసుధ సారభూతము. వసుధయందుఁ బురము సారము; పురమున సౌధము సారము. సౌధమున శయ్య సారము; శయ్యయందు ననంగసర్వస్వమగు చక్కని జవరాలు సారము.

ఇట నుత్తరోత్తరమగు నుత్కర్షము నిబద్ధమైయున్నది. ఇది శ్లాఘ్యగుణోత్కర్షము గలది.

తృణా ల్లఘుతర స్తూల స్తూలా దపి చ యాచకః
వాయునా కిం న నీతోఽసౌ మామయం ప్రార్థయే దితి.

గడ్డిపఱకకన్న దూది తేలికరైనది. దూదికన్న యాచకుఁడు తేలిక. అయితే వీనిని వాయు వేల చెదరఁగొట్టదు? అన్నచో వీఁడు నన్నేమి యాచించునో యని వాయుదేవుఁడు వానిచెంతకురాఁడు.

ఇది యశ్లాఘ్య గుణోత్కర్షము గలది.

దీని నాంగ్లమున Climax అందురు.

కం. రసవ, త్ప్రేయము, లూర్జ
స్వి, సమాహితములు నిచట వివరింపఁగలే
దసమరసప్రకరణమున
రసభావాద్యుపనిబద్ధరసములుగానన్. ౨౩౦

రసవదలంకారము, ప్రేయోఽలంకారము, ఊర్జస్వి, సమాహితాలంకారము లనునవి రసప్రకరణమునఁ జెప్పఁబడిన రసభావాదులచే నుపనిబద్ధములగు రసములే కాన నిట వివరింపఁదలంపలేదు. మా వ్యాఖ్యలో వీనినిఁగూర్చి లెస్సగా వివరించితిమి. ఈ విధమునఁ బైనఱువదా అలంకారములును రసవదాదులు నాలుఁగును వెరసి డెబ్బది యలంకారములు నిర్వచింపఁబడినవి.

ఉ. సొమ్ములు సొమ్ములుంగలియ సొంపులువుట్టెడురీతిఁ గావ్యజా
తమ్ములయం దలంకృతు లలంకృతులుంగలియంగ శోభమై
నిమ్మహిఁబొల్చుఁ; దద్ఘటనమెన్నికతోఁ దిలతండులా ప్తి రూ
పమ్మునఁ బాలునీరెనయుభాతిఁదగున్ ద్వివిధత్వమొందుచున్.

కం. తిలతండుల రూపమ్మున
నలరున్సంసృష్టి; సంకరాఖ్యము పాల్నీ
రిల నేకమైన కైవడిఁ;
దెలుపుదుఁ దత్సంకరంబు త్రివిధముకృతులన్. ౨౩౧

లోకమున భిన్న భిన్నములయిన భూషణముల సంయోగమున నూతన సౌంద ర్యము ప్రభవించువిధమునఁ గావ్యములందుఁ బృథక్సౌందర్య హేతువులగు రూపకా ద్యలంకారములు పరస్పరమును సంయుక్తములై సౌందర్యాతిశయమును గలిగించును. ఈ యలంకారములయొక్క పరస్పర సంబంధము రెండువిధములుగా నుండును. ఒకటి సంయోగరూపము. ఇది తిలతండుల రూపము. తిలతండులములు పరస్పరము గలిసియున్నను వివిక్తముగా నఁగాఁ బరస్పర నిరపేక్షములుగా గోచరించువిధమున నెచ్చట నలంకారములు పరస్పర సంయుక్తములయియున్నను వివిక్తముగా (పరస్పర నిరపేక్షముగా) గోచరించునో యా సంయోగము సంసృష్టి యనఁబడును. రెండవది సమవాయ రూపము. ఇది నీరక్షీర రూపము. నీరక్షీరములు గలిసినపుడు ప్రత్యేకింప రానివిధమునఁ బరస్పర సాపేక్షములుగా నెచ్చట నలంకారములు భాసిల్లునో యది సమవాయ సంకరము లేక నీరక్షీర సంకరము. ఈ సంకరము త్రివిధము. ఎట్లన,

గీ. ఎనయు నంగాంగిభావంబు, నేకవాచ
కానుబంధంబు, సందేహ, మనఁగ; నట్లు
పొలుచుసంసృష్టి సంకరంబులకు వరుస
లక్ష్యములనేర్పఱిం చెద లలితఫణితి. ౨౩౩

అంగాంగిభావ సంకరము; ఏకవాచకానుప్రవేశ సంకరము; సందేహ సంకరము అని సంకరము త్రివిధము. ఈ విధములయిన సంసృష్టి సంకరములకు లక్ష్యముల నిత్తును.

సంకరమువలెనే సంసృష్టియుఁ గేవల శబ్దాలంకార సంసృష్టి, కేవలార్థాలంకార సంసృష్టి, ఉభయాలంకార సంసృష్టి యని త్రివిధములు.

## ౧. అర్థాలంకారసంసృష్టి

కం. హరిదబలా కులగిరికుచ
వరచందనరజములగు భవత్కీర్తిరుచుల్
నిరవద్యసుధాంభోధి
స్ఫురణంబువహించె నోబభూవరునరసా! ౨౩౪

కం. హరిదబలాచందనమయి
యరుదగు ననురూపకంబు, నమృతాంభోధి
స్ఫురణంబుఁ దాల్చెనని యెడు
సరసవివర్ణనముఁబోల్చు సంసృష్టియునన్. ౨౩౫

'హరిత్తులు అను అబలలు' అనుచో రూపకాలంకారము. 'సుధాంభోధి స్ఫురణము' అనుచో సుధాంభోధి స్ఫురణమువంటి స్ఫురణము అని నిదర్శన. ఇవి రెండును బరస్పర నిరపేక్షములు. కాన సంసృష్టి.

## ౨. శబ్దాలంకారసంసృష్టి

వదనసౌరభలోభపరిభ్రమద్భ్రమరసంభ్రమసంభృతశోభయా
చలితయా విదధే కలమేఖలాకలకలోఽలకలోలదృశాఽన్యయా.

తన వదనసౌరభమునందలి లోభముచే బరిభ్రమించుచున్న భ్రమరముయొక్క తిరుగుళ్ళచేత నొక శోభను వహించుచున్న, యలకలు పైని బడుచుంటచే లోలమైన దృక్కులు గల, యొక యువతి చలించుచు మేఖలాకలకలమును జేసెను.

పూర్వార్థమున 'భ' కారవృత్త్యనుప్రాసమును, తృతీయచరణమున 'ల' కార వృత్త్యనుప్రాసమును, జతుర్థచరణమున 'లకలో, లకలో' అనునెడ యమకమును గలవు. ఈ యనుప్రాస యమకములు పరస్పర నిరపేక్షములై యున్నవి. కాన సంసృష్టి.

## 3. ఉభయాలంకారసంసృష్టి

ప్రతాపరుద్ర దోర్దండో మండలాగ్రేణ మండితః
దృశ్యతే సమరే వీరై రుత్ఫణః ఫణవా నివ.

మండలాగ్రముచే (ఖడ్గము) మండితమైన ప్రతాపరుద్రుని దోర్దండము యుద్ధమున బడగెత్తిన పామువలె గనబడెను.

ఇందు బూర్వార్థమున వృత్త్యనుప్రాసమును, నుత్తరార్థమున నుపమాలంకారమును గలవు. ఇవి పరస్పర నిరపేక్షములు. కాన సంసృష్టి.

## ౧. సంకరము - అంగాంగిభావము

కం. అసిజిహ్వాభయదంబై
యసమమహాబలవిశేషహారియునై యి
వ్వసుధ భవద్భుజదండము
పొసగున్ ఫణిమాడ్కి నోబభూవరునరసా! ౨3౬

కం. అసిజిహ్వాకయను రూపక
మసమమహాబలవిశేషహారి శ్లేషం

బెసగు ఫణిమాడ్కి భుజమను
దెస నంగాంగిత్వమొందెఁ దెలియ నుపమతోన్. ౨౩౭

ఓ నరసభూపాలా! నీ భుజదండము పామువలె నసిజిహ్వాచే భయదమై శత్రువుల మహాబలవిశేషములను హరించునదై (మహాబలుఁడు = గాలి; దానిని హరించునది. అనఁగా నాహారించునది) యొసఁగును. ఇట 'ఫణిమాడ్కి' అనుచో నుపమాలంకారము. 'అసిజిహ్వ' అనుచో రూపకము. 'మహాబల' అనుచో శ్లేషయును గలవు. ఇది యంగాంగిభావ సంకరము. అంగాంగిభావమన అనుగ్రాహ్య, అనుగ్రాహకభావము. ఇందలి యుపమాలంకారము రూపకశ్లేషల ననుగ్రహించుచున్నది. ఇటనున్న యలంకారము లన్నియుఁ బ్రత్యేకముగాఁ గాక పరస్పర సాపేక్షములై సౌందర్యాతిశయమును బెంచుచున్నవి.

## ౨. ఏకవాచకానుప్రవేశసంకరము

క౦. విశ్వామిత్రమదాసహ
శాశ్వత సౌభాగ్యమగుచు సతతోన్నతమై
విశ్వనుత! శ్రీనృసింహమ
హేశ్వర! నీయసి వసిష్ఠునీడునఁబొల్చున్. ౨౩౮

నీ ఖడ్గము వశిష్ఠునివలె విశ్వామిత్ర (విశ్వ + అమిత్ర) మదమును సహింపని శాశ్వత సౌభాగ్యము గలదై యెల్లపుడును నెత్తఁబడినదై పాలించును. (వసిష్ఠుఁడు విశ్వామిత్రమహర్షి యొక్క మదమును సహింపనివాఁడు.)

క౦. నీవాలు వసిష్ఠునివలె
నేవేళఁ జెలంగుచున్న నేకపదవిశే
షావిర్భూతములగుచున్
శ్రీవెలయన్ శ్లేష, ముపమ, చెలఁగును నిచటన్. ౨౩౯

'వసిష్ఠునివలె' (వసిష్ఠునీడు) అనుచో నేకవాచకమునందు శ్లేషోపమలు ప్రవేశించినవి. అనఁగా 'ఈడు' అను వాచక (పదము) మంపమాశ్లేషల ననుగ్రహించుచున్నది.

ఇది యేకవాచకానుప్రవేశ సంకరమని యలంకార సర్వస్వకార మతానుసారముగా విద్యానాథుడు వచించినవిధమున నీ గ్రంథకర్తయును దెలిపెను. అప్పయ దీక్షితులవారు కువలయానందమున నేకవాచకానుప్రవేశ సంకరాలంకారమును నిట్లు తెలిపిరి.

సత్పుష్కరద్యోతితరంగశోభి న్యమందమారబ్ధమృదంగవాద్యే
ఉద్యానవాపీపయసీవ యస్యా మేణీదృశో నాట్యగృహే రమంతే.

ఏ పట్టణమున (ఆ పట్టణమున) యువతులు సత్పుష్కరద్యోతితరంగశోభియు, (చక్కని తామరపూలతో విలసిల్లు తరంగములతో శోభిల్లుచున్న - చక్కని పుష్కరములనువాద్యవిశేషములతో విలసిల్లు రంగస్థలముతో శోభిల్లుచున్న) అమందముగా నారబ్ధమృదంగవాద్యయు, (నారంభింపఁబడిన మృదంగవాద్యములవంటి వాద్యములు అనఁగాఁ దరంగధ్వనులుగల - ఆరంభింపఁబడిన మృదంగవాద్యములు గల) నగు నుద్యానసరోజలమునందువలెనే నాట్యగృహమునఁ గ్రీడించుచున్నారు.

ఇట 'ఇవ' శబ్ద ముపమాశ్లేషల ననుగ్రహించుచుంటచే నేకవాచకానుప్రవేశ సంకరమనరాదు. శబ్దసామ్యమున్నమాత్రమున శ్లేష యనరాదు. 'సత్పుష్కర' అను విశేషణమున్నను శ్లేషభిత్తికాఽభేదాధ్యవసాయరూపమగు నతిశయోక్తిచే లభ్యమైన ధర్మసామ్యమే 'ఇవ' శబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. అంతేకాని 'ఇవ' శబ్దముచే శబ్దసామ్యము చెప్పఁబడుటలేదు. ఒకవేళ ధర్మసామ్యముగాదు; శబ్దసామ్యమే యున్నదన్నను గవిసమ్మతమైన శబ్దసామ్యమున్నను, అర్థసామ్యమున్నను నుపమాలంకారమే. ఎట్లన,

"యథా ప్రహ్లాదనాచ్చంద్రః ప్రతాపాత్తపనో యథా ।
తథైవ సోఽభూ దన్వర్థో రాజా ప్రకృతిరంజనాత్"

ప్రహ్లాదమును గూర్చువాఁడుచంద్రుఁడు. ప్రతాపమును గూర్చువాఁడు తపనుఁడు. అట్లే ప్రకృతి రంజనముచే రాజు అన్వర్థుఁడయ్యెను.

ఇట నన్వర్థ నామ రూప శబ్దసామ్యము దప్ప నర్థసామ్యము చెప్పఁబడలేదు. కాన శబ్దసామ్యమున్నను నుపమాలంకారమే యగును. కావున నీ లక్ష్యమున నేకవాచకానుప్రవేశ సంకరము లేదు. ఇం దుపమాలంకారమే కలదు.

ఇదేవిధమున "విశ్వామిత్ర" పద్యమునను "వసిష్ఠునీడు" అనుచో 'నీడు' శబ్దము 'విశ్వామిత్ర' అనుచోట శ్లేషభిత్తికా (విశ్వ + అమిత్ర ఏవ విశ్వామిత్ర) ఽభేదాధ్యవసాయరూపమగు నతిశయోక్తిచే లభ్యమైన ధర్మసామ్యమునే (విశ్వామిత్రమదాసహాశాశ్వతసౌభాగ్యత్వము, సతతోన్నతత్వము) చెప్పుచున్నది. శబ్దసామ్యమే యున్నదన్నను "సకలకలంపు మేతజ్జాతం సుధాంశబింబ మివ" అనుచోటఁ దల నుపమాలంకారమే. స్వీకృతమైన [illegible] గూడ నుపమాలంకారమే.

ఇఁక నేకవాచకానుప్రవేశ సంకరోదాహరణ మేమని ప్రశ్న మిగిలినది. అప్పయ్యదీక్షితులవా రిట్లు దెలిపిరి. "ఎచ్చట నొకే యర్థమున నలంకారద్వయము సంభవించునో యది యేకవాచకానుప్రవేశ సంకరము. ఎట్లన,

విధుకరపరిరంభాదాత్త నిష్యందపూర్ణై
శ్శశి దృష దుపక్లప్తై రాలవాలై స్తరూణాం
విఫలిత జలసేక ప్రక్రియా గారవేణ
వ్యరచి స హృతచిత్త స్తత్ర భైమీవనేన

దమయంతీదేవి వనమునఁ జంద్రకిరణస్పర్శచేఁ జంద్రకాంతశిలారచితము లయిన యాలవాలములందుఁ గరఁగి నిండిన జలపూరములచే వృక్ష సేచనము విఫలమగు చున్నది. దానిఁజూచి నలుఁడు హృష్టుఁడయ్యెను.

ఇట సమృద్ధమగు వస్తువర్ణనమంటచే నుదాత్తాలంకారమును. సంబంధము లేకున్నను సంబంధమున్నట్లు చెప్పుటచే నతిశయోక్త్యలంకారమును నీరెండును నొకే యర్థమునఁ బ్రవిష్టములైయున్నవి. అయితే యెల్లయెడలను నుదాత్తాలంకారమున నసంబంధ సంబంధ రూపాతిశయోక్తి మిశ్రితమైయున్నట్లెంచరాదు. దివ్యలోకగత సమృద్ధివర్ణనమున నతిశయోక్తిస్పర్శలేని యుదాత్తాలంకారమును, శౌర్యము, ఔదార్యము, దారిద్ర్యము, మొదలగువానిని వర్ణించునెడల నుదాత్తస్పర్శలేని యతిశయోక్తియును బరస్పరవివిక్తముగా నుండవచ్చును. పైశ్లోకమున నర్థవశమున రెంటికిని సమావేశము సంభవించును. ఇట నొకటి యంగముగాని మరొకటి యంగిగాని కానేరదు. ఏలన నొకదానిచే నొకటి యుత్థాపితముకావుటలేదు. ఒకటి స్వతంత్ర మును మరొకటి పరతంత్రమునుగాదు. రెండును స్వతంత్రములే.

ఏకవాచకానుప్రవేశసంకరము శబ్దార్థాలంకారోభయమునకు మాత్రమే యుండునని యు నర్థాలంకారముల నుండదనియుఁ బ్రకాశకారుఁడు చెప్పెను. కాని యప్పయదీక్షితులవా రర్థాలంకారములకును నుండునని పైవిధమునఁదెలిపెను.

### 3. సందేహ సంకరము

కం. పాకారితురగ, రాకా
కోకారి, కళానుకారి కోమలరుచియై
యేకాలము రంజిల్లును
నీ కీర్తిమరాళి యోబనృపు నరసింహా! ౨౪౦

కీర్తిమరాళి పాకారితురగమును (ఉచ్చైశ్శ్రవము) రాకాళోకారి (చంద్రుండు) కళలను ననుకరించు కోమలకాంతి గలదై రంజిల్లును.

కం. ఇలఁ గీర్తిహంసి యనుచో
సలలితగతి హంసివంటి సత్కీర్తియొ? కా
కిలఁ గీర్తి యనెడు హంసియొ?
తెలియ దుపమ, రూపకంబు తేటగ నిచటన్. ౨౮౧

పై పద్యమునఁ 'గీర్తిమరాళి' అని కలదు. కీర్తి యను మరాళి' అని రూపకమా? 'మరాళివంటి కీర్తి' అను నుపమిత సమాసముచే నుపమాలంకారమా?

ఇట దేనిని సాధించుటకును దగిన ప్రమాణములు లేమి సందేహము. కాన సందేహసంకరము.

ఈవిధముముగా సందేహము గలిగినపుడొక యలంకారమును సాధించుటకుఁ గానీ బాధించుటకుఁ గానీ ప్రమాణములు లభించినచో సందేహసంకరము గాదు. ఎట్లన,

'వక్త్రేందౌ తవ సత్యయం యదపరశ్శీతాంశు రుజ్జృంభతే'

"నీ వక్త్రేందువుండఁగా నీ యపరచంద్రుఁ డుదయించుచున్నాఁడనుట యేది గలదో"

ఇట "వక్త్రేందుః" అనుచో 'వక్త్ర మేవ ఇందుః' అని రూపకమా? 'వక్త్ర మిందు రివ' అని యుపమయా? అని సందేహము కలుగఁగా 'అపర' పదము రూపకమే యని సాధించుచున్నది. ఎట్లన, రూపకమున నుత్తరపదార్థమగు 'నిందు' శబ్దమునకుఁ బ్రాధాన్యము వచ్చును. ఉపమానమునఁ బూర్వపదార్థమగు వక్త్రమునకుఁ బ్రాధాన్యము వచ్చును. 'వక్త్రేందు' అనుచో రూపకమును జెప్పుకొన్న యెడలనే 'అపరశ్శీతాంశుః' అనుచో నున్న 'అపర' శబ్దము సరిపోవును. వక్త్రేందు వుండఁగా నపరేందు వేల? (వక్త్రచంద్రుఁడుండఁగా నపరచంద్రుఁడేల?) అని యర్థము వచ్చును. కావున 'అపర' శబ్దము రూపకసాధకము.

'రాజనారాయణం లక్ష్మీ స్త్వామాలింగతి నిర్భరం'

రాజనారాయణుఁడవగు నిన్ను లక్ష్మి లెస్సగాఁ గౌఁగిలించుచున్నది.

ఇట 'రాజనారాయణ' అనుచో వెనుకవలె 'రాజా ఏవ నారాయణః' అని రూపకమును 'రాజా నారాయణ ఇవ' అని యుపమయును జెప్పుకొనవచ్చును. కాని యిట నుపమాలంకారమును జెప్పుకొనుటకు బాధ యున్నది. ఏమన, 'రాజా నారాయణ ఇవ' అను నుపమాలంకారమునఁ బూర్వపదమగు రాజశబ్దమునకుఁ

ప్రాధాన్యము వచ్చును. వచ్చునేని 'లక్ష్మి నారాయణునివంటి రాజు నాలింగనముఁ జేసికొనుచున్నది' అను నర్థము వచ్చును. లక్ష్మి నారాయణుని నాలింగనముఁ జేసికొనును గాని నారాయణునివంటి రాజును నాలింగనము సేసికొనదు. కావ రూపకమే చెప్పఁగొనవలెను. కావున లక్ష్మ్యాలింగన ముపమకు బాధకము. ఉపమా బాధకమగుచో రూపకసాధక మవఁగూడదా? అని ప్రశ్నింపవచ్చును. లక్ష్మ్యాలింగనముపమా బాధక మయినట్లు రూపకసాధకము గాదు. ఉపమాబాధకము గానే విచ్ఛిత్తి విశేషముండును. కావ సాధకబాధకప్రమాణములలో దేనిచే విచ్ఛిత్తి కలుగునో దానినే యటఁ బ్రధానముగా గ్రహింపవలెను.

కం. ఈరీతిం గొన్ని యలం
కారము లేర్పఱచినాఁడఁ గడమఁదడవ; నే
నేరక వర్జించుటగా;
దారయ విస్తారభీతి నాపాదింపన్. ౨౮౨

విస్తారభీతి = గ్రంథవిస్తరభీతిచే; ఆపాదింపను = దెలుపను.

'విస్తరభీతి' అని యుండవలెను. ఈ విషయమును వెనుక నొకచోఁ దెలిపితిమి. ఈ మూఁడువిధములగు సంకరములనే కాక యప్పయ్యదీక్షితులవారు గువలయానందమున 'సమప్రాధాన్యసంకరము, సంకరసంకరము' అని మరి రెండు సంకరములను దెలిపిరి. వానినిఁగూడ నిట నుదాహరింతుము.

## సమప్రాధాన్య సంకరము

గీ. అంగుళులచేతఁ గచసమూహంబు నట్లు
కిరణములచేతఁ దిమిరంబుఁ గెలనఁ ద్రోచి
మొడుగఁ దామరకన్నులు మోహకలనఁ
జందురుఁడు ముద్దులాడు నిశాముఖంబు.

'అంగుళులచేఁ గచసమూహంబు నట్లు' అను వాక్యోక్తమగు నుపమయు, 'మోహకలన' అను సాధకప్రమాణముచే లభించిన 'తామరకన్నులు' అనుచోటి యుపమయును, 'జందురుఁడు నిశాముఖంబును ముద్దులాఁడు, (ముద్దులాడుచున్నట్లున్నాఁడు) అను గమ్యోత్ప్రేక్షను లేవఁదీయుచున్నవి. ఇట సంభావనాప్రతిపాదక పదము లేమి గమ్యోత్ప్రేక్ష. ఉపమలు రెండును నంగభూతములు; ఉత్ప్రేక్ష యంగి, చంద్రకర్తృక నిశాముఖ చుంబనోత్ప్రేక్షయు నిశాచంద్రులకు దాంపత్య వ్యవహార సమారోపరూపమగు సమాసోక్తిగర్భము గానే యుత్థితమగుచున్నది. ఇట రెండుపమాలంకారములను, నుత్ప్రేక్షా సమాసోక్తులను సమకాలముననే లేవఁదీయు

చున్నవి. కాని పౌర్వాపర్యమును జూపుటలేదు. కావున నిట నుత్ప్రేక్షా సమాసోక్తులకు సమప్రాధాన్యసంకరము.

## సంకరసంకరము

> ముక్తాః కేళివిసూత్రహారగళితాః సమ్మార్జనీభిర్హృతాః
> ప్రాతః ప్రాంగణసీమ్ని మంథరచలద్బాలాంఘ్రిలాక్షారుణాః
> దూరాద్దాడిమబీజశంకితధియః కర్షంతి కేళీశుకాః
> యద్విద్వద్భవనేషు భోజనృపతేస్తత్త్యాగలీలాయితం.

భోజమహారాజుయొక్క త్యాగలీల పండితభవనములం దిట్లున్నది. "రతిక్రీడలందుఁ దెగిన హారములనుండి జారిపడిన ముత్యాలను (దాసీజనము) ప్రాతఃకాలమున శృంగారపుకట్టలచే వెలుపలకుఁ జిమ్మఁగా నవి బాలికలు త్రొక్కుటచే వారి పారాణిచే నెఱ్ఱఁబారినవి. కేళీశుకములు వానిని దూరముగాంచి దానిమ్మపండ్ల విత్తులని భ్రమపడి ముక్కులతోఁ బొడుచుచున్నవి.

ఇటఁ విద్వాంసులయొక్క సమృద్ధివర్ణనము గాన నుదాత్తాలంకారము. ముత్యములు 'బాలాంఘ్రిలాక్షారుణములయినవి' అనుచో ముత్యములు స్వగుణత్యాగము సేయుటచేఁ దద్గుణాలంకారము. ఇందే దాడిమబీజభ్రాంతినిఁ గలిగించు కావ్యలింగాలంకారమును గలదు. మొదటి యుదాత్తాలంకారయే యీ తద్గుణకావ్యలింగములకు మూలము.

'ముత్యములు బాలాంఘ్రిలాక్షారుణములు' అను నొకే యర్థమునఁ దద్గుణకావ్యలింగము లుంటచే నీ రెంటికిని నేకవాచకానుప్రవేశసంకరము.

పిమ్మటఁ గేళీశుకములు దానిమ్మపండ్ల విత్తులని భ్రమయుటచే నట భ్రాంతిమదలంకారము. దీనికిఁ బైనున్న యేకవాచకానుప్రవేశ సంకరమే కారణము. ఈ యేకవాచకానుప్రవేశ, భ్రాంతిమదలంకారములచే నుదాత్తాలంకారము సౌందర్యాతిశయమును వహించుచున్నది.

కావ నేకవాచకానుప్రవేశసంకర భ్రాంతిమదలంకారములకు రెంటికిని నుదాత్తాలంకార మంగము (అనుగ్రాహకము) గాన వీని కంగాంగిభావసంకరము.

మరియు హేతుమంతమగు విద్వద్గృహవైభవమును హేతుభూతమగు రాజవితరణమును నభిన్నముగాఁ జెప్పుటచే ( హేతుహేతుమతోరైక్యం హేతుంకేచిత్ప్రచక్షతే) హేత్వలంకారము. ఆ హేత్వలంకారము రాజవితరణముయొక్క నిరతిశయోత్కర్షమను  (ఉద్దేశము)

ఇంతమాత్రమే యగుచోఁ బూర్వోక్తమైన యుదాత్తాలంకార భూషితమైన హేత్వలంకారమని సిద్ధించును. అట్లుగాక "భోజరాజపండితుల సంపద యెట్టిది?" అను ప్రశ్నకీ పద్య ముత్తరమునుగా గ్రహించినచో నిరతిశయైశ్వర్యరూపమగు నప్రస్తుత కార్యముఖమున వారి సంపదను బ్రశంసించినట్లు కవి యుద్దేశించినయెడలఁ గార్య నిబంధనా ప్రస్తుత ప్రశంసాలంకార మగును. కార్యము గూడ వర్ణనీయముగానే యనఁగాఁ బ్రస్తుతముగానే తలఁచినచోఁ బ్రస్తుతాంకురాలంకారమగును. ఈ యప్రస్తుత ప్రశంసా, ప్రస్తుతాంకురములలో విశేషించి యొకదాని నిట నిరూపించుటకు సాధకబాధకములు లేమి సందేహసంకరము.

మరియు విద్వద్గృహ వైభవ వర్ణన మసంబంధసంబంధరూప మగుటచే నతిశయోక్తియగును. ఇది యుదాత్తముతోఁగూడి యేకవాచకానుప్రవేశసంకరమగును.

ఇంతేకాక నిరతిశయవితరణోత్కర్ష మునఁ బర్యవసించు హేత్వలంకారమును, అత్యద్భుతమగు నతథ్యమైన యౌదార్యమును వర్ణించుటయే లక్షణముగాఁ గల అత్యుక్త్యలంకారమును, (అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యౌదార్యాది వర్ణనం) ఒకే యర్థమున సమావిష్టములగుటచే నీ రెంటికిని నేకవాచకానుప్రవేశసంకరము.

ఈ సంకరము గారణముగాఁగల యప్రస్తుతప్రశంసకుఁ గానీ ప్రస్తుతాంకురమునకుఁ గానీ రాజసంపత్సమృద్ధి వర్ణనాత్మకమగు నుదాత్తాలంకారముతో నేకవాచకానుప్రవేశసంకరము.

ఇట విద్వద్గేహసంపదచే రాజవితరణమును, దానిచే రాజసంపత్సమృద్ధియు వ్యంగ్యమగుచున్నది. కాన నిట నుదాత్తాలంకారము వ్యంగ్యాలంకారము గాని వాచ్యాలంకారము గాదుగదా! అట్లేని వాచ్యాలంకారములగు నప్రస్తుతప్రశంసతోఁ గానీ ప్రస్తుతాంకురముతోఁ గానీ వాచ్యాలంకారముగాని యుదాత్తాలంకారమున కేకవాచకానుప్రవేశసంకర మెట్లని ప్రశ్న వచ్చుచున్నది. అపుడు 'ఏకవాచకానుప్రవేశసంకర' పదములోని వాచకమనఁ బ్రతిపాదకము (తెలుపునది) అని యర్థముఁ జెప్పుకొనవలెను. అపుడు వాచకమన వ్యంజకమనియు నర్థము వచ్చును. కావున నొకటి వాచ్యాలంకారమైనను, మరొకటి వ్యంగ్యాలంకారమైనను వానికి సంకరము సంభవించును.

ఈ మూఁడు 'ఏకవాచకానుప్రవేశ సంకరములును' సమములే యగుటచే సమప్రాధాన్యసంకరము. ఇది సంకరాలంకారముల సంకరము.

సంసృష్టి, అంగాంగిభావ సంకర, ఏకవాచకానుప్రవేశ సంకర, సందేహ సంకర, సమప్రాధాన్య సంకరములకు నరసింహసంకరమని నామము. నర + సింహ

మూర్తి విగ్రహమున నరత్వ సింహత్వములకు సమావేశమున్నవిధమున భిన్నాలంకారములకేకత్ర సమావేశముంటచే 'నరసింహ సంకరము' అని పేరుపెట్టెను. సంకరసంకరము నరసింహసంకరము గాదు.

## అలంకార విమర్శ

భరతుఁడు నాట్యశాస్త్రమున యమకమను నొకశబ్దాలంకారమును, ఉపమా, దీపక, రూపకములను మూఁడర్థాలంకారములనే పేర్కొనెను. దండి ముప్పది నాలుగును, మమ్మటుఁ డేబదిలొమ్మిదియు, విద్యానాథుఁ డఱువదినాలుగు, చంద్రాలోకకర్త నూటొకటియు, అప్పయదీక్షితులవారు కువలయానందమున నూటిరువది నాలుగును దెలిపిరి. భట్టుమూర్తి విద్యానాథు ననుసరించి యఱువదినాలింటినే యుదాహరించెను.

ఆంగ్లమున Simile (ఉపమ) Metaphor (రూపకము) Hyperbole (అతిశయోక్తి) Vision (భావికము) Irony (వ్యాజస్తుతి) Allegory (అప్రస్తుతప్రశంస) Peronipication, Epithet, Synecdoche, Metanamy, Euphemisum, Paradox, (విరోధాలంకారము) Paramanisia (శ్లేష) Climax (సారము) అను నలంకారములుమాత్రము గలవు. ఇందలి కొన్నింటిని మనవా రలంకారములుగా గ్రహింపరు. లక్షణగా గ్రహింతురు.

ఈశబ్ద, అర్థ, అలంకారములలో నర్థాలంకారములకే ప్రాముఖ్య మిచ్చిరి. అగ్నిపురాణము

> అలంకరణమర్థానా మర్థాలంకార ఇష్యతే ।
> తం వినా శబ్దసౌందర్య మపి నాస్తి మనోహరం ।
> అర్థాలంకార రహితా విధవేవ సరస్వతీ

అర్థాలంకారములేని శబ్దసౌందర్యము మనోహరముగాదు. అర్థాలంకారములు లేని సరస్వతి (కావ్యము) విధవవంటిది. అని యర్థాలంకార విశిష్టతను దెలిపెను.

అలంకారమన నేమి ? వామనుఁడు "సౌందర్య మలంకారః" అలంకారమన సౌందర్యము : అని నిర్వచించి వేనివలన నాసౌందర్యము కావ్యమునఁ గలుగునో యవియు నలంకారములే యని నుడివెను. దండి

> కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే

కావ్యశోభాకరములగు ధర్మములను నలంకారములని చెప్పుదురు. అనివచించెను

భామహుఁ డలంకారము లన్నింటిని వక్రోక్తులనెను. వక్రముగా నవఁగా వికటముగా స్వభావవిరుద్ధముగాఁ జెప్పిన యుక్తి. కావున స్వభావోక్తి నాతఁ డంగీకరింపలేదు.

ఈ యలంకారములలో నుపమాలంకారము సర్వాలంకార బీజభూతమని వామన మతము. కావుననే యాతఁడుపమాగర్భములగు నలంకారములనే యుదాహరించెను. "ఉపమా కాళిదాసస్య" అని మహాకవి కాళిదాసే యుపమాలంకరమును బరాకాష్ఠ నొందించెను. మమ్మటుఁ డతిశయోక్తియే సర్వాలంకారబీజమని యీ క్రిందివిధమున వచించెను.

ఏషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా

ఇట వక్రోక్తియన సుందరమైనయుక్తి. ఆసౌందర్య మతిశయముచే లభించును. కాన వక్రోక్తియన నతిశయోక్తి. దీనిచే నర్థము విశేషముగా భావింపఁబడును. ఆస్వాద్యమగును. కావునఁ గవి దీనివిషయమున యత్నము సేయవలెను. ఇదిలేని యలంకారమే మున్నది?

కాని వామనుని పిమ్మట వచ్చిన సర్వాలంకారికులును వామనమతమునే స్వీకరించి తమ గ్రంథములలో నలంకారప్రకరణమునఁ బ్రథమమున నుపమాలంకారమునే వివరించిరి. మరియు దండి చూపినన్ని యుపమాభేదముల నెవరును చూపలేదు. అప్పయ్యదీక్షితులవారు

"ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్
రంజ యతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః"

అని తెలిపిరి. (దీని వివరణము వెనుక నుపమాలంకార ప్రకరణమునఁ జేయఁబడినది) ఎల్ల యలంకారములును శ్లేషస్పర్శచే సౌందర్యాతిశయమును వహించుననియును గొందఱు పలికిరి. "శ్లేషః పుష్ణాతి సౌభాగ్యం ప్రాయో వక్రోక్తిషు స్థితం."

ఈ యలంకారములన్నియుఁ గావ్యజీవితమగు త్రివిధమగు ధ్వన్యుపస్కారకములుగానే నిబద్ధము గావలయును. అట్లు గానిచో నవి కేవలముగా నర్థచిత్రములే యగును. అలంకారశబ్ద మయ్యెడ సార్థకముగాదు. ఎట్లన,

సచ్ఛిన్నమూలః క్షతజేన రేణు స్తస్యోపరిష్టా త్పవనావధూతః
అంగారశేషస్య హుతాశనస్య పూర్వోత్థితో ధూమ ఇవావభాసే.

రక్తపాతముచే ఛిన్నమూలముగలదై, వాయుధూతమై యాకాశమున నిగిడిన రేణువు ఇంగలముమాత్రమే మిగిలిన యగ్నియొక్క (అర్పుటకు) ముందు లేచిన ధూమమువలె భాసిల్లెను. కాలుచున్న కట్టెపై నీరువడఁగా నింగలము మిగులును. పొగ పైకెఁబోవుచు. అట్లే రక్తపాతముచే నేల తడియఁగా రేణువు పైకెగసిపోయెను. ఇచ్చటి యుపమాలంకారము ధ్వన్యుపస్కారకము గాక కేవలాపమ్యమాత్రపరముగా

నున్నది. ఇందర్థవైచిత్రియే కాని యాస్వాద్యత లేదు. కాన నలంకారము లిట్లుగాక త్రివిధమగుధ్వని పర్యవసాయములుగా నుండవలెను. ఎట్లన, "ఓ సుందరీ! నీ ముఖము చంద్రునివలె నున్నది" అనుచోట నున్న యుపమాలంకారము వక్తయొక్క రతిని (శృంగారరసమును) బోషించుచున్నది. అర్థశక్తిమూలవ్యంగ్యములలో నుపమాద్యలంకారములచే వస్తువ్యంగ్యములను, అలంకారవ్యంగ్యములను మున్నుదాహరించియుంటిమి. ఈవిధముగా నీ యలంకారములు కేవలార్థవైచిత్ర్యమాత్రపరములు గాక త్రివిధములగు ధ్వనులకును నుపస్కారకములై యుండవలెను.

సాధారణముగా నర్థాలంకారము లన్నియును త్రివిధధ్వని పర్యవసాయులుగానే యుండును. సమాసోక్తి, అప్రస్తుతప్రశంస, దీపకము, పర్యాయోక్తము, ఉత్తరాలంకారము, పరికరము, అర్థాంతరన్యాసము మొదలగునవి ధ్వని పర్యవసాయులే. ఇందు సమాసోక్త్యాదులు గుణీభూతవ్యంగ్యములుగా నుదాహరింపఁబడినవి. ఏవో కొన్నిమాత్రము 'సచ్ఛిన్నమూలః' అను శ్లోకమునందువలె ధ్వన్యుపస్కారకములు కావు. కావునఁ గవులు వానిని ధ్వనిపర్యవసాయులుగానే చేయుటకు యత్నింపవలెను.

ఈ యలంకారములలో నుపమాదులగు కొన్ని యలంకారము లప్రత్యక్షముగాన ననుభూతముగాకున్న వస్తువును బ్రత్యక్షము నేసి యనుభవమునకుఁ దెచ్చును. ఎట్లన, 'ముఖము చంద్రునివలె నున్నది' అను నుపమ ముఖమునందు మనకుఁ బ్రత్యక్షముగాని సౌందర్యమును బ్రత్యక్షము సేయుచున్నది. ఈ యభియుక్తినిఁ గనుఁడు.

అతథార్థానపి తథా సంస్థితానివ హృదయే యా సూచయతి
అర్థవిశేషే సా జయతి వికటకవిగోచరా వాణీ.

(అట్లు కానివానిని నట్టివానివలె హృదయమునకు సూచించునట్టి కవివాణి జయించును.) కవి యా యలంకారములచేతనే కదా యీ విధముగా సూచించును.

భాషతోఁగూడ నలంకారములు పుట్టినవి. మనుష్యులా బాలవృద్ధముగా నలంకార యుక్తముగా భాషింతురు. "ఆ దంపతులు చిలుకా గోరింకలలాగా ఉన్నారు" "భాగ్యం ఉంటే బంగారం తింటారా?" (ఆ యిల్లు సీతలేని పర్ణశాల) (పిల్లవాఁడు దూసినట్లయినాఁడు, అని యీ విధముగాఁ బ్రతిమాటలోను నలంకారములే. అందును నావేశమువచ్చినచో విశేషించియు నవి వెలువడును. అలంకారమన నేమో తెలియకయే యాబాలగోపాలమును నలంకారయుక్తముగా సంభాషింతురు. అలంకారయుక్తమగు భాష జీవద్భాష. శౌర్యాదులవలె గుణము లాత్మభూత రసధర్మములు. అలంకారములు హారాదులవంటివగుటచే గుణములవలె సాక్షాద్రసోపస్కారకములు గాక పరంపరా రసోపస్కారకము లగును.

వామనుఁడు కావ్యశోభాయాః కర్తారో గుణాః। తదతిశయ హేతవ స్త్వలంకారాః। పూర్వే నిత్యాః। (కావ్యశోభనుగూర్చునవి గుణములు. తదతిశయహేతువు లలంకారములు: ఇందు మొదటివి (గుణములు) నిత్యములు) అని చెప్పెను. గుణములు నిత్యమనుటచే నలంకారము లనిత్యములు. అని చెప్పినట్లయినది. మరియు "యువతే రివ రూప మంగ కావ్యం" "యది భవతి వచశ్చ్యుతం గుణేభ్యః" (చూ॥ గుణప్రకరణారంభము.) అనువానిచే గుణములు ప్రధానములనియు ననఁగా సాక్షాదసోపస్కారకములనియు నలంకారము లప్రధానములనియు ననఁగాఁ బరంపరారసోపస్కారకములనియును దెలిపెను.

శా. మక్ఖామండువపండువాభయద దోర్మాహాత్మ్య! ధాటీమహా
తుక్ఖారప్రతిరుద్ధ భూభువన హిందూరాజ్యసంస్థాపనా
ప్రాక్ఖద్యోతకులోత్థిత ధ్వజపటప్రాయప్రసర్పద్యశ
స్స్రక్ఖర్వీకృత శర్వశంకర నమస్యాజాఁకోలాహలా! ౭౪౩

కం. సాహిత్యభోజ! భూజన
సౌహిత్యనిదాన! దాన సంతాన మహా
బాహావదానవాహా
రోహణ రేవంత! లలితరూప జయంతా! ౭౪౪

సర్వపంచకరహితసుగంధివృత్తము

హారహీరసారసారిహార శైలవాసవో
ర్వీరుహాహి హార శేష వేషహాసలాలస
శ్రీరసోరుయాశసాంశుశీల! వైరి వీరసం
హార! సారశౌర్యసూర్య! హార్యవార్యసాహసా! ౭౪౫

గద్యము

ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధ ...... కావ్యాలంకారసంగ్రహం బను
ప్రబంధంబునం దర్థాలంకారవిభాగంబును సంకరసంసృష్టి
నిర్ణయంబు నన్నది సర్వంబును బంచమాశ్వాసము
సంపూర్ణము

# పరిశిష్టము

(౨౭౫ పుటలో 'దండకము' పిమ్మటఁ జేర్పవలెను)

## మణిప్రవాళము

సంస్కృతాంధ్రములను మేళవించిన పద్యము మణిప్రవాళము. అసలిది మళయాళమునఁ గలదు. ఆంధ్రమునను గొందఱు వ్రాసిరి.

తండులాని గృహమందు న సంతి
తిండికైతె పదిమంది వసంతి
... ... ... ... ...

ఉ. ఆర్తుల నీవ కేర్తువరయంగఁ ద్రిమూర్తివిలాసవర్తి; పెన్
గర్తవు భర్తవుందలఁపఁగాఁ బరిహర్తవు నీవ; నీవ చి
న్మూర్తివి; నీవ పోషణచణుండవు; కర్తుమకర్తుమన్యథా
కర్తుముదారశక్తియు జగంబుల నీవకదా! గదాధరా!

(రామాభ్యుదయము)

మ. జయ! శీతాంశుకులావతంస! నిషధస్వామీ!

౨౯౯ పుటలో 'ఖండము' పిమ్మట ౧౫ 'ఆహ్నికము' అని చేర్పవలెను.

(౩౦౧ పుటలో 'సూత్రము' పైనిఁ జేర్పవలెను.)

## 'ఆహ్నికము'

'అహ్నా నిర్వృత్తం ఆహ్నికం' ఒక దినములో నిర్వర్తింపఁబడినది లేక రచింపఁబడినది లేక చదువఁదగినది. ఇది వ్యాకరణ మహాభాష్యముయొక్క పాదముల (అష్టాధ్యాయి) భాగమునకు నామము.

(౩౦౩ పుటలో 'భాష్యము'నకు లక్షణ నిర్వచనము.)

శ్లో॥ సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యై స్సూత్రానుసారిభిః
స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః.

సూత్రానుసారులగు వాక్యములచే సూత్రార్థమును వర్ణించుచు నడుమ నడుమ గ్రంథకర్త తన స్వకీయ పదములనుగూడ జతపఱచుచు వ్రాయు వ్యాఖ్య భాష్యము.

(౩౦౪ పుటలో 'వ్యాఖ్య' పిమ్మటఁ జేర్పవలెను.)

## ఉపోద్ఘాతము - ప్రస్తవము

శాస్త్రప్రారంభకో గ్రంథ ఉపోద్ఘాత ఇతీరితః
స ఏవ గ్రంథసందర్భః ప్రస్తవః కథితో బుధైః.

శాస్త్రమును ప్రారంభించుటకు ముందు వాని విషయమును నలతిగా సంగ్రహించు గ్రంథముపోద్ఘాతము, పస్పశము అనఁబడును.

## పీఠిక – భూమిక

పీఠ ఇవ పీఠికా, భూమి రివ భూమికా; పీఠికయు, భూమికయు (అంతస్తు) ఉన్నత ప్రదేశములు గదా! వాని నధిష్ఠించినవారికిఁ క్రింది వస్తువులు విస్పష్టముగా గోచరించువిధమున నీ పీఠికా, భూమికలు చదివినచో గ్రంథస్థ విషయము గోచరించును. ఇవి వ్యాఖ్యారంభక గ్రంథములు. (పైవి శాస్త్రారంభక గ్రంథములు.)

## తొలిపలుకు

ఇది foreword అను నాంగ్లపదమునకుఁ దెలుఁగు. దీనిని 'మున్నుడి'యనియు నందురు. గ్రంథకర్తను గుఱించియు, గ్రంథమును గుఱించియు నలతిగా వ్రాయు పరిచయవాక్యము.

## అవతారిక – అవతరణిక – ఉపక్రమణిక

గ్రంథమునకుఁ గాని శ్లోకాదులకుఁ గాని పూర్వాపర ప్రకరణ సందర్భమును దెలుపు లఘుపీఠిక.

మొత్తముమీఁద ఉపోద్ఘాతము, పస్పశము, పీఠిక, భూమిక, తొలిపలుకు, మున్నుడి, అవతారిక, అవతరణిక, ఉపక్రమణిక, అను పదములన్నియు నీషద్భేదముతోఁ బర్యాయపదములుగానే వ్యవహరింపఁబడును.

(౭౭౭ పుటలో 'మీమాంస' అనుదాని పిమ్మటఁ జేర్పవలెను.)

## ప్రాతిశాఖ్యము

వేదశాఖల ధర్మము (ప్రతిశాఖం భవః) ఉపచారముచే నందలి స్వరసంధి వర్ణోచ్చారణాదికమగు వివిధ విషయమును దెలుపు గ్రంథము (Phonotics) ఇందు వైదిక వ్యాకరణాంశములుగూడఁ గలవు. ఇది శిక్షావ్యాకరణములయొక్క వివరణమే.

## అనుక్రమణిక

వేదాదులందున్న మండల, అష్టక, కాండ, అధ్యాయ, ప్రశ్న, సూక్త, వర్ణములు, శ్లోకములు, పద్యములు, మొదలగువాని సంఖ్యలను, పైవాని మొదళ్లను, తత్తద్దేవతా, ఋషి, చ్ఛందస్సులు మొదలగువానిని 'అ'కారాది క్రమమునఁ దెలుపు గ్రంథము. (Index.)

## పరిశిష్టము

పూర్వగ్రంథమున వదలిన విషయమును సమగ్రముగాఁ దెలుపు ననుబంధ గ్రంథము. (Appendix.)

(౨౯౦ పుటలో 'అనంగమే కలుగును' అనుదానిపిమ్మటఁ జేర్పవలెను.)

నటుఁడుగూడ నొకానొకప్పుడు రసాస్వాదము సేయును. "పణ్యస్త్రియో హి ధనలోభేన పరం త్యక్త్వా రతాది విడంబయంత్యః కదాచిత్ స్వయ మపి పరాం రతి మనుభవంతి। గాయనాశ్చ పరం రంజయంతః కదాచిత్ స్వయ మపి రజ్యంతే। ఏవ మేవ నటా అపి రస మను భవంతి."

(౫౭౮ పుటలో "ఇట్టియెడల......దోషము గాదు" అనుదాని పిమ్మటఁ జేర్పవలెను.)

పైని శృంగారము శాంతరసాంగముగాఁ గూర్పఁబడినది. ఒకానొకచో శాంతమే శృంగారాంగముగాఁ గూర్పఁబడినది. ఎట్లన,

మ. ఎలదోఁటల్ వనముల్; పయోధరము లద్రీంద్రంబు; లాకంటికి
ఫలముల్ వాతెఱ; లంగజాగమ కళాబంధంబు లిచ్ఛాసనం
బులు; కోపంబునఁ బాయుటల్; తపము కైవల్యంబు, సంభోగమం
దుల యిచ్ఛారతి నుండు మానవుల కెందుం గాన మీ చిత్రముల్.

(౬౪౪ పుటలో అనుమానాలంకారము తుదఁ జేర్పవలెను.)

అలంకారాంతరరహితమగు నుదాహరణములుగూడఁ గలవు. ఎట్లన,

యత్రైతా లహరీచలాచలదృశో వ్యాపారయంతి భ్రువః
యత్తత్రైవ పతంతి సంతత మమీ మర్మస్పృశో మార్గణాః
తచ్చక్రీకృతచాపమంచిత శరప్రేంఖత్కరః క్రోధనో
ధావత్యగ్రత ఏవ శాసనధరస్సత్యం తదాసాం స్మరః.

ఎచ్చటఁ దరంగములవలెఁ జంచలములగు చూడ్కులను యువతులు తమ కనుబొమ్మనుండి ప్రసరింపఁజేయుచున్నారో యచ్చటనే మర్మభేదులగు బాణము లెడతెగకుండఁ బడుచున్నవి. (సాధ్యము) దీనిచే మదనుఁడు దన విల్లెక్కువెట్టి వారి శాసనమును బాలింప నుంకించి వారి పురోభాగమునఁ బరుగువాఱుచున్నాఁడు. (సాధనము) ఇది సత్యము.

ఇందితరాలంకార మేమియు లేదు.

---

# శుద్ధపత్రము

| పుట | అసాధువు. | సాధువు. |
|---|---|---|
| ౨౨ | శ్రీరంగవిభునామ | శ్రీరంగవిభురామ |
| ౩౯ | సౌహార్ధము | సౌహార్దము |
| ౪౪ | కేక్షేయ | కాక్షేయ |
| ౪౫ | ధీరై | ధీరైః |
| ౫౩ | "కానీ అలు...గాదు" వఱకుఁ గల వాక్యము దొలఁగింపవలెను. | |
| ౫౯ | మధ్యే | మధ్యా |
| ౬౦ | సవ్యోథ | సన్యోథ |
| ౬౨ | కళాగ్రగల్భ | కళాప్రగల్భ |
| ౮౮ | నియమితే | నియమితేన |
| ౮౯ | నిజాతియశంబు | నిజాతిశయంబు |
| ౧౦౯ | ఓయపాంథ! | ఓయిపాంథ! |
| ౧౩౩ | ప్రపృత్తిః | ప్రవృత్తిః |
| ౧౬౩ | వర్ణము | వర్గము |
| ౧౮౫ | వేసికొని | చేసికొని |
| ౧౮౯ | నిన్నదియు నది నిన్నను | నిన్నదియు దానిని నీవును |
| ౨౧౯ | క్షితప | క్షితిప |
| ౨౨౭ | వితానార్థిత | వితానార్జిత |
| ౨౪౯ | కాని | వాని |
| ౨౮౩ | సంజికా | పంజికా |
| ౨౭౬ | వ్యక్తములయిన | వ్యక్తమయిన |
| ౨౯౭ | బ్రహ్మో | బ్రహ్మ |
| ౩౦౬ | స్థాయిభావములం నవిభావానుభావ | స్థాయిభావములను విభావానుభావ |
| ౩౪౦ | చతుసముద్ర | చతుస్సముద్ర |
| ౩౫౩ | కారిత్యే | కారిత్వే |
| ౩౮౧ | వరపుల | వలపుల |
| ౩౮౫ | మోట్టాయిదము | మోట్టాయితము |
| ౩౯౮ | నిన్నదియు నది నిన్నను | నిన్నదియు దానిని నీవును |

| | | |
|---|---|---|
| ౪౦౧ | లలితంబైన | బలితంబైన |
| ౪౧౩ | యాగంధరామాయణుఁడు | యౌగంధరాయణుఁడు |
| ౪౧౫ | విలేకము | వివేకము |
| ,, | గతా | గతే |
| ౪౨౭ | శోకము | శ్లోకము |
| ౪౨౮ | శత్రుశ్ఛిదా | శత్రుచ్ఛిదా |
| ౪౬౮ | పద్యము నున్నట్టి | పద్యమున నున్నట్టి |
| ౪౬౯ | ద్రవ్యమొసఁగగా బహుళము | బహుళముగా ద్రవ్యమొసఁగగా |
| ౪౭౭ | నీకుపాయనిమిత్తుఁడ | నీకుపాయనిమిత్తుఁడ |
| ౪౯౧ | కృష్టపక్షము | కృష్ణపక్షము |
| ౫౦౪ | గూర్చి | మార్చి |
| ౫౪౧ | ఔజ్జ్వల | ఔజ్జ్వల్య |
| ౫౬౦ | దాక్షిణ్యా... | దాక్షిణ్యవదనాదరైభర |
| ౫౬౫ | పర్యాయో క్తి | పర్యాయోక్తి |
| ౫౬౬ | సాధర్మ్యంబు | సాధర్మ్యంబు |
| ౫౬౮ | లక్ష్యలక్ష్యములు | లక్ష్మలక్ష్యములు |
| ౫౭౫ | ఓయన | ఓయంన |
| ౬౦౭ | జాత్యస్వభావ | జాత్యభావ |
| ౬౧౭ | హింపలేమి | వహింపలేమి |
| ౬౧౩ | గంధపుఁగొండ | గందపుఁగొండ |
| ౬౩౦ | యూర్చుకొంచు | యూర్చుకొంచు |
| ౬౩౧ | విక్ష | వివక్ష |
| ౬౩౯ | త్వత్ఫలరిపు | త్వద్ఫలరిపు |
| ౬౭౭ | సాధ్యము | సాధనము } 'యత్ర పతత్యబాలా |
| ,, | సాధనము | సాధ్యము } నాం' శ్లోకముక్రింద. |
| ౬౮౭ | వెలయం | వెలయుం |

ఈవివరణ రచనకు నాకుపయోగించుకొన్న గ్రంథము లివి ; ఈగ్రంథకర్తల కెంతేనియుఁ గృతజ్ఞుఁడను.

## సంస్కృత గ్రంథములు


౧. నాట్యశాస్త్రము (భరతుఁడు)

౨. భామహాలంకారము (భామహుఁడు)

౩. కావ్యాదర్శము (దండి)

౪. కావ్యాలంకారసూత్రవృత్తి (వామనుఁడు; కామధేనువ్యాఖ్య)

౫. ధ్వన్యాలోకము (ఆనందవర్ధనుఁడు)

౬. ధ్వన్యాలోకలోచనము (అభినవగుప్తుఁడు)

౭. వ్యక్తివివేకము (మహిమభట్టు)

౮. ఔచిత్యవిచారచర్చ (క్షేమేంద్రుఁడు)

౯. వక్రోక్తిజీవితము (కుంతకుఁడు)

౧౦. శృంగారప్రకాశము (భోజుఁడు)

౧౧. కావ్యమీమాంస (రాజశేఖరుఁడు)

౧౨. భావప్రకాశము (శారదాతనయుఁడు)

౧౩. రసగంగాధరము (జగన్నాథుఁడు)

౧౪. కావ్యప్రకాశము (మమ్మటుఁడు; వామనాచార్యవ్యాఖ్య)

౧౫. సాహిత్యదర్పణము (విశ్వనాథుఁడు; రుచిరవ్యాఖ్య-శివదత్తపండితుఁడు)

౧౬. ప్రతాపరుద్రీయము (విద్యానాథుఁడు)

౧౭. కావ్యానుశాసనము (హేమచంద్రుఁడు)

౧౮. ,, (వాగ్భటుఁడు)

౧౯. అలంకారశేఖరము (కేశవమిశ్రుఁడు)

౨౦. రసమంజరి (భానుమిశ్రుఁడు)

౨౧. దశరూపకము (ధనంజయుఁడు)

౨౨. కువలయానందము (అప్పయ్యదీక్షితులు)

౨౩. అగ్నిపురాణము

౨౪. అలంకారసర్వస్వము (రాజానకరుయ్యకుఁడు)

౨౫. రుద్రటాలంకారము (రుద్రభట్టు)





౨౬. కావ్యాలంకారసారసంగ్రహము (ఉద్భటుఁడు)

౨౭. సువృత్తతిలకము (క్షేమేంద్రుఁడు)
౨౮. సరస్వతీకంఠాభరణము (భోజుఁడు)
౨౯. శృంగారామృతలహరి (సామ్యరాజదీక్షితుఁడు)
30. అమరుకము (అమరుకకవి)
3౧. తైత్తిరీయోపనిషత్తు
3౨. అలంకారకౌస్తుభము (విశ్వేశ్వరపండితుఁడు)
33. రసతరంగిణి (భానుదత్తుఁడు)

## ఆంధ్ర గ్రంథములు

౧. అప్పకవీయము (అప్పకవి)
౨. రసాభరణము (అనంతామాత్యుఁడు)
3. కావ్యాలంకారచూడామణి (విన్నకోట పెద్దన)
౪. ఆంధ్రకావ్యాలంకారసూత్రవృత్తి (వేదాల తిరువేంగళాచార్యులవారు)
౫. ఆంధ్రకావ్యాదర్శము (అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు)
౬. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము-అలంకారవ్యాసము (కోమర్రాజు లక్ష్మణరావుగారు)
౭. ఆంధ్రకావ్యమీమాంస (పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు)
౮. సుగ్రీవవిజయము (పీఠిక - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు)
౯. నేటికాలపు కవిత్వము (అక్కిరాజు ఉమాకాంతంగారు)
౧౦. త్రిపురాంతకోదాహరణము (పీఠిక - నిడదవోలు వేంకటరావుగారు)
౧౧. లక్షణదీపిక

## ఆంగ్ల గ్రంథములు

1 Sanskrit Poetics (Two Volumes) by Dr. S. K. De
2 The theory of Rasa and Dwani by Dr. Sankaran
3 History of Sanskrit Poetics by Kane
4 Studies in Dhwanyaloka by Pandit Subbarama Bhattar
5 Some Concepts of Alankara Sastra by Dr. Raghavan
6 Number of Rasas ,,
7 What is the definition of Poetry ? by Pandit D.T.Tatachar M.O.L.
8 Ascharyachudamani (Preface by S. Kuppuswamy Sastry I. E. S.)
9 Bhandarker Cammemoration Volume
10 History of Sanskrit literature by Dr. Keith



ఓరియంట్ ప్రెస్, 65-3 మార్కెట్ వీధి, సికింద్రాబాదు

# తత్సమచంద్రిక

గ్రంథకర్త: శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి.

ఇది వైయాకరణ సిద్ధాంత కౌముదీస్థితములగు సంధి, సమాస, సమాసాశ్రయవిధి, స్త్రీప్రత్యయ, కృత్తద్ధిత భాగములనుండి యాంధ్ర భాషకుఁ గావలసినంతవట్టు విషయముద్ధరింపఁబడి వ్రాయఁబడిన వ్యాకరణము. కాశికా, మాధవీయ ధాతువృత్తి, గణరత్నమహోదధి, మహాభాష్యము, మొదలగు సంస్కృత వ్యాకరణ గ్రంథములను కాళే, భండార్కరు, త్రివేది మొదలగువారాంగ్లమున వ్రాసిన సంస్కృత వ్యాకరణ గ్రంథములనుగూడ శోధించి తత్త్వవిషయము లిందుఁ జేర్పఁబడియున్నవి. మరియుఁ బెక్కు పాణినీయ ప్రయోగములను నిందుఁ జూపఁబడియున్నవి. ఇట్టి గ్రంథ మాంధ్రమున లేదు. ఇట్టిది వ్రాయ సాధ్యపడుననియు నెవ్వరును దలంపలేదు. పెక్కండ్రు పండితులు మెచ్చుకొనిరి. అభినవవాగనుశాసనులైన బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి పీఠికతో నలంకృతము. ఇది మదరాసు విశ్వవిద్యాలయ విద్వత్పరీక్షకుఁ బాఠ్యము. కొలఁది ప్రతులు మాత్రమే కలవు.

రమారమి ౫౦౦ పుటలు. వెల ౪-౦-౦ మాత్రమే.

## శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి కృత
## ముద్రిత గ్రంథములు

౧. తత్వమచంద్రిక — రు. ౪- ౦-౦

౨. కావ్యాలంకారసంగ్రహము (సవివరణము) — ,, ౮- ౦-౦

౩. జాతకకథాగుచ్ఛము (ప్రథమభాగము) — ౧- ౮-౦

(ఆంధ్ర, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయములచే బాఠ్యముగా నిర్ణీతమైనది.)

౪. జాతకకథాగుచ్ఛము (ద్వితీయభాగము) — ,, ౧- ౮-౦

(మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే 'విద్వాన్' (బి) కి, అణ్ణామలై విశ్వవిద్యాలయముచే ఇంటరునకు బాఠ్యముగా నిర్ణీతమైనది.)

౫. కీరసందేశము — ద్వంద్వయుద్ధము — ,, ౧- ౪-౦

(ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిచే ఎంట్రెన్సు పరీక్షకు బాఠ్యముగా నిర్ణీతమైనది.

౬. గోవర్ధనాచార్యసప్తశతీసారము — ,, ౧- ౦-౦

(ఆర్యాసప్తశతి కనువాదము)

౭. పువ్వులతోట (ఖండకావ్యములు) — ,, ౦- ౮-౦

౮. కావ్యమంజరి — ,, ౦- ౮-౦

౯. నడుమంత్రపుసిరి (అధిక్షేపకావ్యము) — ,, ౦- ౮-౦

౧౦. ఖడ్గతిక్కన — ,, ౦-౧౨-౦

(మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే ఇంటరుపరీక్షకు బాఠ్యముగా నిర్ణీతము)

౧౧. అమృతకణములు — ,, ౦- ౮-౦

(సంస్కృతాలంకారగ్రంథములం దుదాహృతములయిన శృంగారశ్లోకముల కనువాదము)

౧౨. వాసవదత్త — ,, ౧- ౦-౦

(భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకమునకు ప్రబంధరూపమగు ననువాదము.)

౧౩. రేణుకవిజయము (కన్నడగ్రంథమున కనువాదము), ౧- ౦-౦

### ముద్రణమున నున్నవి.

౧. తడిబిత్తోపాఖ్యానము (అధిక్షేపకావ్యము) — ,, ౦- ౮-౦

౨. వ్యాసకోశము — ,, ౧- ౦-౦

(ఇందు గావ్యానందము, తృణకంకణవిమర్శ, నవ్యసాహిత్య సిద్ధాంతములు, ఆముక్తమాల్యద మొదలయిన వ్యాసములు గలవు)

ప్రాప్తిస్థానము ;—

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి



౪౪ జీరా, శికింద్రాబాదు (దక్కన్)